కూచిమంచి తిమ్మకవి

# అచ్చ తెలుఁగు రామాయణము

(టీక - తాత్పర్యము)



భాషాప్రవీణ

డా. బులుసు వేంకట సత్యనారాయణమూర్తి

M.A; M.Phil; Ph.D



కళాగౌతమి

రాజమండ్రి

# ATCHA TELUGU RAMAYANAMU

**Kavi Sarvabhouma KUCHIMANCHI TIMMAKAVI**

**(Teeka - Tatparyamu)**

**First Edition 2021**



**Copies : 500**

**Price : ₹ 500/-**

***Printed at :***
**PADMAJA PRINTERS**
**Rajahmundri**

***For Copies :***
**KALAGOWTAMI**
**102, Moon Lights, Model Colony**
**Rajamahendravaram - 533 103**
**Cell 9866290025**







# కళాగౌతమి


**102, మూన్ లైట్స్, జె.యన్.రోడ్, రాజమండ్రి – 533103**

వ్యవస్థాపకులు : డా. **బులుసు వేంకటసత్యనారాయణమూర్తి**


*కళాగౌతమి (తెలుగు భాషాభివృద్ధి సమితి) తెలుగు భాషకు పూర్వ వైభవం కావాలనే దృష్టితో 1992లో ప్రారంభించబడింది. తదాదిగా పలు కార్యక్రమాలతో అభిమానులను పెంచుకుంటూ వస్తోంది. వారి ప్రోత్సాహంతోనే 'రచయితల సమితి' ప్రారంభించి పద్య, గేయ, వచన కవితలు వ్రాయుటకు ప్రోత్సాహమివ్వడం జరుగుతోంది. అంతేగాక తెలుగు సాహిత్య వైభవాన్ని, సంప్రదాయ విలువల్ని, సంస్కృతి ప్రాభవాన్ని తెలియజేయాలని 'శ్రీకళాగౌతమి' మాసపత్రికను కూడా నడుపుతున్నాం.*

*ఇవన్నీ ఒక్క వ్యక్తివల్ల సాధ్యమయ్యేవి కావు. దీనికి అభిమాన వ్యక్తుల ఆసరా కావాలి. అలాంటి సమయంలో నేనున్నానని ముందుకు వచ్చిన వ్యక్తి శ్రీ కలపటపు శ్రీలక్ష్మీప్రసాద్‌గారు. కళాగౌతమి అధ్యక్షులుగా ఆయన నిరంతరం ఏదో ఒక కార్యక్రమంతో విరామం లేకుండా పని చేస్తున్నారు. ఒక్కొక్కసారి ఆయనను అందుకోవడం కార్యకర్తలకే కష్టమనిపించేది. వారి వివిధ కార్యక్రమాల నిర్వహణ వెనుక అట్టను చూస్తే వివరంగా అర్థమవుతుంది. అంత ఉదార హృదయులు, సరసులు, సౌజన్యశీలి, సాహిత్యాభిలాషి మా కళాగౌతమికి వరంగా లభించడం మా అదృష్టంగా భావిస్తూంటాం.*

*కరోన సమయంలో కార్యక్రమాలు లేకపోవడంతో ఏం చేయాలనుకుంటుంటే కవిసార్వభౌమ కూచిమంచి తిమ్మకవి అచ్చతెలుగు రామాయణము అందరికీ సులభంగా అర్థమయ్యేరీతిలో టీక–తాత్పర్యము వ్రాద్దామని ప్రారంభించడం జరిగింది. యథాలాపంగా ఈ విషయం శ్రీలక్ష్మీప్రసాద్ గారి దృష్టికి తీసుకురాగనే పూర్తవగానే చెప్పండి మనమే దాని ముద్రణ చేసేద్దామని ముందుకు వచ్చారు. అదీ ఆయన సహృదయత. ఇంకేముంది, పూర్తి చేయడం నా బాధ్యత అయి కూర్చుంది.*

*ఇలా ఈ గ్రంథం మీ చేతిలోకి రావడానికి ఆర్థికంగా, హార్దికంగా తోడు నిలిచిన మా కళాగౌతమి అధ్యక్షులు శ్రీ కలపటపు శ్రీలక్ష్మీప్రసాద్‌గారికి వినయపూర్వకంగా అభివాదములు తెలియజేస్తూ, మేము నమ్మిన ఆ శ్రీనివాసుడు వారికి ఆయురారోగ్య సౌభాగ్యములనిచ్చి రక్షించు గాక అని ఆశీర్వదిస్తూ ...*

మీ

**బులుసు వి.యస్. మూర్తి**

**కవితా ప్రసాద్**
D.G.M (Retd), ONGC
కవి, కథకుడు, జ్యోతిషి
రాజమహేంద్రవరము

# కవితా హృదయం

*శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే*
*సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే॥*

బ్రహ్మశ్రీ డా. బులుసు వేంకటసత్యనారాయణమూర్తిగారు, "కళాగౌతమి" తెలుగు భాషాభివృద్ధి సమితి నిర్వాహకులు, గౌతమీ సంస్కృత కళాశాల పూర్వాచార్యులు. రాజమండ్రిలో సాహితీ జగమెటిగిన బ్రాహ్మణులు. వారికి పరిచయ జంధ్యం అవసరం లేదు. వారికేలనో ఈ కూచిమంచి తిమ్మ(య) కవి విరచిత అచ్చతెలుగు రామాయణానికి టీక, తాత్పర్యము రచించి నేటి తరానికి పరిచయం చేద్దామనే తలంపు కలిగింది. శ్రీరామ కార్యం. మంచిదే. ఐతే దానిని సరిచూసి, సరిచేసి పెట్టమని పామరులలో పామరుణ్ణి నన్ను ఆదేశించటం వింతే మటి. అచ్చతెలుగుకు పామరుడే తగుననుకొనినారేమో! మామూలు మర్కటం సంజీవన్యౌషధ పర్వతాన్ని మోయగలదా? శిరసావహించక తప్పలేదు.

కూచిమంచి తిమ్మకవి 18వ శతాబ్దిలో పిఠాపురం ప్రాంతంలో నివసించిన కవిసార్వభౌమ బిరుదాంకితుడు. సర్వ లక్షణ సార సంగ్రహ గ్రంథకర్త. అనేక కావ్యకర్త. కుక్కుటేశ్వర స్వామి పరమ భక్తుడు. శివారాధకుడు. 'నీలాసుందరీ పరిణయము' అనే అచ్చ తెలుగు కావ్యాన్ని వ్రాసిన కొంత కాలం పిమ్మట ఈ అచ్చ తెలుగు రామాయణాన్ని రచించాడు. అచ్చ తెలుగులో ఒక కృతి వ్రాసియుండి మరల ఇంకొకటి ఏల? నారదమహాముని సంక్షిప్తంగా చెప్పిన రామాయణాన్ని ఆదికవి విస్తరించి రామాయణ మహాకావ్యాన్ని అందించారు. బహుశః అచ్చతెలుగులో రామాయణాన్ని తానే ముందుగా వ్రాసాననే తృప్తికోసం మొదటి అచ్చతెనుగు కావ్యం 'యయాతి చరిత్ర'లో పొన్నకంటి తెలగనార్య కవీంద్రుడు, కొంచెం అసందర్భంగా అసంగతంగా అనిపించినా, మధ్యలో రామకథను చొప్పించాడు. అసంగతం ఎందుకంటే యయాతి తర్వాత ఎప్పుడో పుట్టిన రాముని కథను జాబాలి మహర్షి యయాతికి వినిపించటం. సరే. ప్రతికల్పంలోనూ రామాయణం జరుగుతూంటుందన్న సమర్థనను ఇక్కడా అడ్డం వేసికొనవచ్చును. అది వదిలేద్దాం. రామాయణ సంక్షిప్త కథ ప్రేరణగా కావచ్చును 'కట్టె కొట్టె తెచ్చె' పద్ధతిలో తెలగన్న చెప్పిన దానిని మన తిమ్మన్న కవిసార్వభౌముడు కేవలం అచ్చతెనుగులో ప్రబంధం వ్రాయవచ్చును అని నిరూపించటానికి మరో ఉదాహృతిగా

విస్తరించి రచించినట్లుగా మనం భావించాలి. ఎందుకంటే ఈ కృతిలో కూడా అసలు కథ సంక్షిప్తంగానే ఉంటుంది. 'పుట్టె, పట్టె, కట్టె, కొట్టె, తెచ్చె'.

అవాల్మీకమైన కొన్ని మార్పులు చేర్పులు కూడా కన్పిస్తాయి. ఉదాహరణకు ఒకచోట సముద్రంలో రెండు పెద్ద చేపలు రావణునికి మేలు చేసేవి ఉన్నాయని, అవి వారధి కట్టటానికి కపిసేన వేసిన రాళ్ళను మింగేస్తున్నాయని సముద్రుడు రామునితో చెప్పినట్లు ఒక కల్పన. ఐతే రాముడు వాటిని చంపే ప్రయత్నం ఏమీ చేయడు. బహుశః లంక చుట్టూ ఉన్న సముద్రాన్ని రావణుని కోట చుట్టూ ఉండే అగడ్తగా కవి పోలిక కోసం కల్పించి ఉండవచ్చును. అగడ్తలలో మొసళ్ళను తిమింగలాలను పెంచుతారుగదా రక్షణకు. అలాగే లం(కిణి)క అనే కావలి రాక్షసిని హనుమ చంపకుండా కనుమరుగున లంకలో ప్రవేశించటం. లంకిణిని చంపితే రావణునకు తెలియకుండా ఉండటం అనౌచిత్యంగా కవి సంభావించి యుండనోపును. పుష్పకాన్ని ఒక రథంలా చేసి రావణ వధానంతరం నేలమార్గంలోనే రాముడు సపరివారంగా అయోధ్యకు వెళ్ళినట్లు చెప్పాడు. ఇత్యాదులు మరికొన్ని కలవు. కొన్ని మార్పుల విషయంలో కవిహృదయం అంతుపట్టదు. సరే. వాల్మీకిది ప్రామాణి కేతిహాసం. మిగతా కవులవన్నీ కవిత్వాలు, కావ్యాలు.

టీక, తాత్పర్యము వ్రాసేముందు కావ్యశుద్ధప్రతి దొరికించుకొనడం ఒక ప్రయాస. ఈ కావ్యం ఎక్కువ ముద్రణలు పొందినట్లు కనపడదు. అందరికీ తెలిసి 1920 లో వావిళ్ళ వారి ముద్రణ ఒకటి జరిగింది. దానినే కవులు అభ్యసిస్తూ ఉంటారు. ఐతే దానిలో కొన్ని దోషాలు కనిపిస్తాయి. కొన్ని పద్యాలలో తత్సమ పదాలు దర్శనమిస్తాయి. కొన్ని అచ్చు తప్పులు, యతి గణభంగాలు కనిపిస్తాయి. కేవలం రెండు మూడు శతాబ్దాల క్రితం మాత్రమే వ్రాయబడిన కావ్యానికి శుద్ధ ప్రతి లేదంటే ఆశ్చర్యం కలుగుతుంది. ఎలా పరిష్కరించుకోవాలి? అదృష్టవశాత్తు శబ్దరత్నాకరం వంటి నిఘంటువులలో అచ్చతెనుగు పదాలకు చాల సందర్భాలలో ఈ గ్రంథం లోని పద్యాలను ఉదాహరించటం జరిగింది. అది ఉపయోగపడింది. అలాగే కావ్యంలోనే కవి పదే పదే తాను ఉపయోగించిన పదాలను బట్టి కొన్ని పదాలను సరిచేయటం జరిగింది. ఉదాహరణకు "వలినాలి" అనే పదాల కూర్పును ఐదారు చోట్ల కవి వాడాడు. ఒకచోట అది నలినాలి (బా.కాం 95) గాను మరోచోట లలినాలి (అయో.కాం. 40) గానూ వావిళ్ళ ముద్రణలో ఉన్నది. ఈ మధ్యలో అదృష్టవశాత్తూ 1869లో ముద్రించబడిన, లేఖక ప్రమాదాది జనిత దోషంబులు లేకుండా పరిష్కృతమని ఉటంకించబడిన ఒక ప్రతి లభించినది. 1869 అంటే ఈ గ్రంథం పుట్టి సుమారు 150 సంవత్సరాలనుకోవచ్చు. ఇది మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ప్రథమ ఆంధ్ర పండితునిగా అప్పుడు పనిచేయుచున్న శ్రీ రేకము రామానుజ సూరి అనే ఆయనచే పరిష్కరింపబడి శ్రీ పత్తి రామానుజులునాయుడుచే శ్రీనికేతనము అనే సొంత ముద్రాక్షరశాలయందు ముద్రించబడినది. అప్పుడు ఈ అచ్చ

తెలుగు రామాయణమును బి.ఎ. పరీక్షకు పాఠ్యగ్రంథముగా నున్నదట. ఆ ముద్రితప్రతి ఇప్పుడు కావ్యమును సరిచూచి సరిచేయుటలో చాలవరకు ఉపయోగపడినది. ఐతే అందు లోను కొన్ని కప్పదాట్లు లేకపోలేదు. ఉదాహరణమునకు బాలకాండలోని "తొవలా కన్నులు ..అనే పద్యం చివరి పాదాన్ని "బొలుప/ నవలా నిఁక పోలంతి".. అని 'ని' తర్వాత అరసున్నను చేర్చి వ్రాసారు. Foot note లో అవలన్– ఇది అవలాన్ అని ప్రయోగింపబడియె అని వ్రాసారు. 'అవలన్' ను 'అవలాన్' అని ప్రయోగించటం ఏ గ్రంథాలలోను కనుపించదు. 'నిఁక' లో అరసున్న పెట్టుకొని దానిని 'ఇఁక' గా భ్రమించటం వలన అలా అనుకుని అర్థం కోసం సరిపెట్టుకోవటం జరిగినట్లుగా తోస్తోంది. అది నిజానికి 'అవల+ఆనిక = అవలానిక' అని. 'ఆనిక' (దేశ్యం) పదానికి దార్ఢ్యము, ఊత, సరియైన అంచనా అనే అర్థాలున్నాయి.

సాధురేఫలు శకటరేఫల ప్రయోగాలగుఱించి తిమ్మన తన లక్షణ సార సంగ్రహం లో విపులంగా ప్రస్తావించాడు. కాని ఈ కావ్యంలో కొన్నిచోట్ల వాటి ప్రయోగాలు తారుమారైనట్లు అనిపిస్తుంది. అయోధ్య కాండలో 16 వ పద్యంలో 'కమ్మఱి' అనే పదం రెండు ప్రతులలోనూ శకటరేఫతోనే ఉన్నది. (1869 ప్రతిలో 'క్రమ్మఱి' అని ఉంది కాని క్రారవడి ముద్రారాక్షసం) కాని కమ్మరి, కుమ్మరి పదాలలో నిఘంటువులలో సాధురేఫయే కన్పడుతుంది. తెలగన్న కూడ 'కమ్మరి' అనియే ప్రయోగించాడు. శబ్దరత్నాకరంలో 'కమ్మరి' అనే పదానికి బాణకారుడు అనే అర్థాన్ని ఇచ్చి ప్రయోగ దృష్టాంతంగా ఈ పద్యాన్నే ఇవ్వటం జరిగింది. అందులో 'కమ్మరి' అని సాధురేఫయే ఉంది. అసలు ఈ పద్యంలో రెండవపాదం అన్వయం కొంచెం క్లిష్టంగానే ఉంది. అక్కడ "కమ్మరి కడ యనంగఁ" బదులు "కమ్మరి కడఁకనంగ" అంటే అన్వయం (కడఁక+అనంగ) సులభమౌతుంది. 'క' బదులు 'య' పడి ఉండవచ్చు. ఎవరైనా తాళపత్ర ప్రతులను కనుగొని శోధిస్తేగాని తేలని విషయమిది. అరణ్యకాండ 40 వ పద్యంలో "రేపె దొసంగుఁ జెందగలవటంచు.." అనే పాదంలో దొసఁగు అనేపదానికి అర్థాన్ని అన్వయించటానికి మామూలుగా కొంత ఇబ్బందే. ఐతే 'దొసఁగు' అనే పదానికి కోరు, కోరిక అనే అర్థాలున్నాయి. దీనిని రవ్వా శ్రీహరిగారు తమ నిఘంటువులో పేర్కొన్నారు. దానికి వారు తెలగన్న రచించిన యయాతి చరిత్ర నుంచి ప్రయోగ దృష్టాంతం ఇచ్చారు. "కసరెడు మున్నీటి దొసఁగనేల." తమాషా ఐన విషయం ఏమిటంటే వావిళ్ళవారి 1930 & 1950 మఱియు పొ.శ్రీ.వి.విద్యాలయం వారి 2001 యయాతి చరిత్ర ముద్రిత ప్రతులలో దీనిని 'పొసఁగ నేల'గా ముద్రించారు. కాని రాజమండ్రి వి.వ. ముద్రాక్షరశాల వారి పురాతన 1895 యయాతి చరిత్ర ప్రతిలో 'దొసఁగ నేల' అనియే ఉన్నది. కొన్ని పదాలకు అర్థాలిలాగే మరుగు పడిపోతూంటాయి. "చేటు" అనే పదం ఒకటి అలాంటిదే. దీనికి కీడు, ఆపద అనే అర్థాలు మాత్రమే నిఘంటువులలో కనిపిస్తాయి. ఐతే దీనికి హేతువు (మూలకారణము) అనే అర్థమూ ఉన్నది. సిగ్గుచేటు పని. దురాశ దుఃఖానికి చేటు. ఇలాంటివి వాడుకలో ఉన్నాయి. ఈ మధ్యనే ఆచార్య అద్దంకి

శ్రీనివాస్ గారు ఎఱ్ఱన హరివంశం (1-1-180) నుంచి ఈ అర్థానికి కావ్య ప్రయోగాన్ని వెలికితీసి చూపించారు. శమంతకమణి కథలో "..ఎవ్విధంబున నైనం బ్రసేను చావు 'చేట'రసెదనని చుట్టంబులు వినం బల్కి...". కవులు శబ్దాలను వాడటం వదిలేస్తే అవి మఱుగుపడి ఉనికిని కోల్పోవటం, కొన్ని అర్థాలను కోల్పోవటం జరుగుతుందిలాగే. భాషను బ్రతికించాలి అంటే నిఘంటువులలో ఉన్న అన్ని శబ్దాలనూ మరల గ్రంథాలలో ప్రయోగంలోకి తీసుకొనిరావాలి. కవులు ప్రయోగిస్తూ ప్రాచుర్యం కల్పించాలి. ఇట్లాంటిదే "మఱాక" (కి.కాం. 54 మఱాక రమ్ము) అనే పదాన్ని తిమ్మన ఉపయోగించాడు. ఇది ఏ నిఘంటువులోను దొరకదు. మొత్తం మీద ఈ గ్రంథ శబ్ద పరిష్కృతి కోసం యయాతి చరిత్ర, నీలాసుందరీ పరిణయం కావ్యాలను కూడా పరిశీలించవలసి వచ్చింది. యుద్ధకాండలో 594 వ పద్యం బహుళ ప్రచారంలో ఉన్నది. ఇందులో రెండవపాదంలో "వని 'మరా' యంచు నుడివిన చెనటి బోయ" అని వావిళ్ళ ప్రతిలో ఉంది. 'వని' అనేది తత్సమ పదం. అచ్చ తెలుగు కావ్యంలో ఎలా కవి ప్రయోగిస్తాడు? 'వని' బదులు 'ముసు' అనేది సరియైన పాఠం.

సుందరకాండలో 28 వ పద్యంలో ఒక ప్రతిలో 'తపము' అని తత్సమ పదం, మరొక ప్రతిలో 'తపసు' అనే పదం ఉన్నాయి. 'తపసు' అనే రూపం అసలు లేనిది. అది 'తబుసు' లేదా 'తబము' అయి ఉండాలి. సుందరకాండలోనే 164 వ పద్యంలో "వీదీవీదులను" అనే ప్రయోగం ఉంది. ఇది బహుశః 'వీథ్యాం వీథ్యాం' అనే రీతిలో కవి వాడి ఉండవచ్చు. యుద్ధకాండలో 255 వ పద్యంలో "కొని కరంబును దిక్కు మిక్కుటపు సూదు" అనే పాదంలో 'దిక్కు' అనేది తత్సమం. 'దిక్కు' కు అన్వయం కూడా కుదరదు. రెండు పాఠాలలోనూ అలాగే ఉంది. అది 'చిక్కు' అయి ఉంటుంది. అప్పుడు అన్వయం కుదురుతుంది. 'చి' అనేది వ్రాతలో 'ది' కావటం సహజం. యుద్ధకాండలోనే 150వ తోటక వృత్త పద్యంలో 'కొంచక నాల్కలు కోయుచు..' అనే పాదంలో 'కోయుచు' అనేది అన్ని పాఠాలలోనూ ఉన్నది. కాని దానికి ఉన్న అర్థంతో అన్వయం కుదరదు. నిజానికి అది 'కోఁదుచు' అని ఉండాలి. 'కోఁదు' అంటే పాము నాలుకను అటూ యిటూ ఆడించటం. యుద్ధకాండ 133 వ పద్యంలో ఆయుధ పరంగా "దినరసంబుల" అనే పద ప్రయోగం వావిళ్ళ ప్రతిలో ఉంది. దానికి అర్థం ఎక్కడా దొరకలేదు. చివరకు 1869 ప్రతిలో వెతికితే "నారసంబుల" అని ఉంది. యుద్ధకాండలో 169వ లయగ్రాహి పద్యంలో వావిళ్ళ ప్రతిలో గణాలు తగ్గడం శబ్ద భేదాలు ఉన్నాయి. వాటిని 1869 ప్రతి సహాయంతో సరిచేయటం జరిగింది. కి.కాం.34లో "...ఆమడ నర వాని యొడలు దన్నివైవ.." అని దుందుభి కళేబరాన్ని వాలి తన్నటం గుఱించి వర్ణింపబడినది. ఆమడ తరువాత 'నర' అనే శబ్దం అన్ని ప్రతులలోనూ అలాగే ఉంది. 'నర' శబ్దానికి తెలుగు అర్థము పలితకేశము. ఇక్కడ ఆ అర్థము పొసగదు. అది 'నరి' అని ఉంటే సరిపోతుంది. 'నరి' అంటే హద్దు, మేర. అలాగే బా.కాం.91లో కప్రపు'టరటి'

అంటే గణభంగం. 'టంటి' అంటే అర్థము గణము రెండూ సరిపోతాయి. ఇవి కొన్ని సందర్భోదాహరణములు మాత్రమే.

లక్షణ కర్త, అభినవ వాగనుశాసనుడని పేర్వడ్డ తిమ్మన కవి రెండు మూడుచోట్ల క్వార్థమైన ఇత్తునకు సంధి చేసాడు. ఉదా: సుం.కాం 140 పద్యంలో "..దాటిద్దీవికి..", యు.కాం.415లో 'క్రోలిటు'. అన్ని ప్రతులలోనూ అలాగే ఉంది. ప్రమాదో ధీమతామపి. "చేతు" అనే రూపం లాక్షణికం కాకపోయినప్పటికీ ఈ కవి ఉపయోగించాడు (కి.కాం.25).

ఇది ఒక అందమైన కావ్యం అనుటలో సందేహమే లేదు. లభించిన అన్ని విధముల పాఠాలూ పరిశీలించి ఈ కావ్యాన్ని ప్రమాణబద్ధంగా సంస్కరించడమైనది. స్వకీయ సవరణలను చొప్పించలేదు. అసంబద్ధంగా ఉన్నప్పటికీ అన్ని ప్రతులలోనూ ఒకేరకంగా ఉన్నప్పుడు ఆ పదప్రయోగాలను ఆలాగే ఉంచివేయడమైనది. "మఱాక" లాగ ఒకటో రెండో ఉన్నాయి అలాంటివి. భవిష్యత్తులో వాటికీ ప్రయోగాలుంటే దొరకవచ్చునేమో.

డా. బులుసు వారు టీక, తాత్పర్యము సమకూర్పు గుఱించి ప్రత్యేకంగా చెప్పవలసిన దేముంది. వారు తెలుగు పండితులు. సమర్థవంతంగా ప్రమాణ బద్ధంగా కవి యొక్క భావానికి అత్యంతానుగుణంగా నిర్వహించారు. అంతే కాక శాబ్దిక దోష రహితమైన తిమ్మకవి యొక్క మాతృక కావ్య రూపాన్ని ప్రస్ఫుట పరిచారు. భావితరాలు నిస్సందేహంగా ఈ గ్రంథంలో టీక, తాత్పర్యము కూర్పబడిన పద్యాలను తిమ్మకవి కృతములుగా ప్రామాణికంగా పరిగ్రహించవచ్చును.

కవిసార్వభౌమ తిమ్మకవీంద్రునకు భక్త్యంజలిస్తూ, ఈ మహదవకాశాన్ని నాకు కల్పించిన "కళాగౌతమి" శ్రీ బులుసు మూర్తి గురుతుల్యులకు వందన శతాలర్పిస్తున్నాను.

శ్రీరామ

రాజమహేంద్రవరము. ***కవితా ప్రసాద్***

17.06.2021



చల్లని వెన్నెలల్ చిలుకు శారద చందము హాయిగొల్పుచున్
మల్లెల తావియై పరగి మత్తును మాధురి నుల్ల మందగా
తెల్లములై రుచుల్ గొలుపు తేనియ తీరున తీపి నిచ్చుచున్
సల్లలితంపు తోషము నొసంగెడు నచ్చ తెనుంగు చూడుడీ!

# ముందు మాట

*తులువలు కొందఱు నిన్నది*
*దలఁపరు నెఱదంటలెల్లఁ దమి నీయదుగుం*
*గలమునఁ బుట్టువు మున్నీ*
*రలరఁగ దరి ముట్టఁ గడతు రన్నిటి తేఁడా!*

నన్నెచోడుడు, పాల్కురికి సోమన తమ కావ్యములలో వాడిన భాషను 'జాను తెనుగు', 'దేశి' అని పేర్కొన్నారు. కాని నన్నెచోడుడు కుమార సంభవంలో వాడిన భాష నన్నయ, తిక్కనాదులవలె సంస్కృత మిశ్రమైన తెలుగే. పాల్కురికి సోమన తన 'బసవ పురాణం'లో 'సంస్కృత భూయిష్ఠ రచన' కంటే 'సరసమై బరగు జాను తెనుగు' కావ్యరచనకు శ్రేష్ఠమన్నాడు. కాని పై యిరువురు వాడిన భాషనుబట్టి చూస్తే అది అచ్చతెనుగు కాదని అర్థమౌతుంది. దీనినిబట్టి పాల్కురికి సోమన నాటికి 'అచ్చతెనుగు' అనే మాట వాడుకలో లేదనవచ్చు. తత్సమేతర పదాత్మకమైన తెలుగుకు మూలఘుటిక కేతన తన ఆంధ్ర భాషా భూషణంలో 'అచ్చ తెనుగు' అని సోదాహరణంగ పేర్కొన్నాడు. కేతన తెలుగు పదాలను అయిదు రకాలుగ పేర్కొన్నాడు. 'తత్సమము, తద్భవము, అచ్చతెనుగు, దేశ్యము, గ్రామ్యము' అని చెప్పి 'తత్సమము తక్క మిగిలిన నాలుగు అచ్చతెనుగు లందు రఖిల జనులు' అని చెప్పాడు. అల్లసాని పెద్దన కృష్ణరాయల సభలో చెప్పిన 29 పాదాల ఉత్పలమాలికలో 16 పాదాలలో అచ్చతెనుగు కవితా ధర్మాలను వివరించాడు. అడిదము సూరకవి కూడా తన 'కవిజన రంజనము'లో పెద్దన చెప్పిన ధర్మాలనే చెప్పాడు. సూరకవి తాత బాలభాస్కరకవి 'శుద్ధాంధ్ర రామాయణ ఘటనా వైదుషీ దురంధరుడ'ని చెప్పుకున్నాడు. కాని ఆ గ్రంథము నేడు లభ్యము కాదు. విన్నకోట పెద్దన తన 'కావ్యాలంకార చూడామణి'లో కేతన మార్గాన్నే అనుసరించి అయిదు భేదాలు చెప్పాడు. కేతన 'అచ్చతెనుగు' అనిన దానినే పెద్దన 'సహజాంధ్ర దేశ భవము' అని చెప్పాడు. ఆ తరువాత లాక్షణికుడు అప్పకవి 'ఆంధ్ర శబ్ద చింతామణి' ననుసరించి పదాలను నాలుగు విధాలుగానే విభజించి, 'అచ్చతెనుగు'ను గూర్చి పేర్కొనలేదు. పొన్నికంటి తెలగన 'యయాతి చరిత్ర' పూర్వపుదైనా అప్పకవి అచ్చతెనుగు గూర్చి పేర్కొనకపోవడం విశేషం.

కవిసార్వభౌముడు కూచిమంచి తిమ్మకవి తన 'లక్షణసార సంగ్రహము'లో 'లోక వ్యవహారమైన భాషే దేశ్యమని పండితులంటారు. దీనినే కొందరు అచ్చతెనుగంటారు' అని

అప్పకవినే అనుసరించి చెప్పాడు. దీనినిబట్టి 'ఆంధ్ర శబ్ద చింతామణి' ననుసరించిన తెలుగు వ్యాకరణములన్నీ దేశ్యమునకు అచ్చతెనుగునకు భేదము లేదని భావించాయి. చిన్నయసూరి బాలవ్యాకరణములో 'తెలుగునకు వర్ణములు ముప్పదియారు' అని చెప్పి 'సంస్కృత సమేతరంబైన భాష యచ్చ యనంబడు' అని తత్సమములు, గ్రామ్యములు తప్ప మిగిలిన తెలుగు పదాలు అచ్చతెలుగు అని నిర్ధారించాడు. ఆదిభట్ల నారాయణదాసు 'అచ్చ తెనుగు'ను 'నాటు తెనుగు' అని వ్యవహరించారు. దేశీయమైన ఇతివృత్తాన్ని గ్రహించి రచన చేస్తే దానికి తెలుగు మాటలే చాలునని నారాయణదాసు అభిప్రాయపడ్డారు. లేని మాటను కల్పించుకోవలసి వచ్చినప్పుడు అన్యభాషా పదాలను తద్భవాలుగ మార్చుకోవడం కన్నా తెలుగు పదాలనే సృష్టించుకుని భాషను పరిపుష్టం చేసుకోవాలని ఆయన చెప్పారు. అయితే బిరుదులు, పేర్లు మార్చితే అవి అసలు అర్థాన్ని కోల్పోయి వికృతరూపాన్ని ధరించే అవకాశముండడంతో వాటిని అలాగే వాడాలని అందరూ అంగీకరించడం జరిగింది. మొట్టమొదటి అచ్చతెనుగు కావ్యము 'యయాతి చరిత్ర' అని కవుల జీవిత చరిత్రకారులు అంగీకరించారు. మరింగంటి అప్పన అచ్చతెనుగు కావ్యము వ్రాయమని తెలగన్నను ప్రోత్సహిస్తూ 'కం. మున్నెవ్వరు నుడువని యీ – తెన్నిడి కడుమీఱి యచ్చ తెనుగుం గబ్బం – బెన్నిక మీఱగ చెప్పిన – నిన్నుం బొగడంగ గలడె నెలతాల్పయినన్' అని అన్నాడు. అంటే అచ్చతెనుగు ప్రక్రియలో పొన్నికంటి తెలగన్నదే తొలి కావ్యమని స్పష్టమవుతోంది.

కూచిమంచి తిమ్మకవి క్రీ.శ. 1690 నుండి 1760 వరకు జీవించి వివిధ ప్రక్రియలలో తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన కవిసార్వభౌముడు. 'నీలాసుందరి పరిణయము, అచ్చతెనుగు రామాయణము' అను రెండు అచ్చతెనుగు గ్రంథములను రచించాడు. తల్లిదండ్రులు లచ్చమ్మ, గంగన్నలు. పినతండ్రులు జగ్గన, సింగన, నరసన్నలు. తమ్ములు సింగన, జగ్గన, సూరనలు. భార్య బుచ్చమ్మ. తిమ్మసచివుడు పితామహుడు. కౌండిన్య గోత్రుడు. ఈయన తమ్ముడు జగ్గన కొడుకులు తిమ్మన, సింగన ఈయనకు లేఖకులు. పిఠాపురము చేరువనున్న 'కందరాడ' జన్మస్థానము. ఇష్టదైవము పిఠాపురములోని కుక్కుటేశ్వరస్వామివారు. గురువు దెందులూరి లింగనారాధ్యుడు. పిఠాపురం మహారాజు రావు నీలాద్రి మాధవరాయ నృపతి ఈయనకు కవిసార్వభౌమ బిరుదు నిచ్చాడు. రుక్మిణీ పరిణయము, చిర విభవ శతకము, రసికజన మనోభిరామము, సింహాచల మాహాత్మ్యము, లక్షణసార సంగ్రహము మొదలైనవి ఈయన ఇతర కృతులు.

తిమ్మకవి ఆశ్వాసాంత గద్యలో 'తిమ్మయ నామధేయ ప్రణీతంబైన యచ్చ తెనుగు రామాయణమను మహాకావ్యమందు' అంటూ తన కావ్యాన్ని మహాకావ్యంగా ప్రకటించుకున్నాడు. ఈ కావ్యంలో అష్టాదశ వర్ణనలున్నాయి. కావ్యేతిహాస లక్షణాలు సంపూర్ణంగా ఉన్నాయి. అచ్చ తెనుగు పదజాలం సంగ్రహమవడంవల్ల ఇతిహాసం పెద్దదవడంవల్ల అనవసరమైన సన్నివేశాలు కొన్నిటిని వదిలేసి, కొన్ని సూక్ష్మీకరించి ప్రధాన

కథను మాత్రమే చెబుతూ రామాయణాన్ని సంగ్రహించాడు తిమ్మకవి. అయినా మహాకావ్యానికి కావలసిన వాటిని వేటినీ వదలలేదు. పుత్రోత్పత్తి, పుర, నాయక వర్ణనలు, వివాహం, సూర్యోదయ, సంధ్య, నిశ వర్ణనలు, యుద్ధాలు, రాయబార వర్ణనలు ఉన్నాయి. గ్రంథంలో మొదటి అయిదు కాండల కంటే ఆరవ యుద్ధకాండను విపులంగా వర్ణించాడు తిమ్మకవి. పద్యాలన్నీ దేశ్యపదాలయినా యమకపు సొగసుతో సంస్కృత భూయిష్ఠమైన ప్రబంధ రచనకు దీటుగా నడిచింది. వాల్మీకి రామాయణం చదివితే ఎలాంటి పుణ్యం కలుగుతుందో ఈ అచ్చతెనుగు రామాయణం చదివినా అంతే ఫలితం లభిస్తుందంటాడు ఫలశ్రుతిలో తిమ్మకవి. 'తెలుగు రామాయణం చదివితే పుణ్యం రాదా? శ్రీరామ అనటమే చేతకాని బోయవాడు చివరకు మహర్షి అయ్యాడే? అంతకంటే ఇంకేం పెద్ద సాక్ష్యం కావాలి మీకు?' అని అడుగుతాడు తిమ్మకవి. ఈ ప్రక్రియలో పలు రచనలున్నా ఈ కావ్యం పటుత్వము, సరళత, తేటతనము, భాషాప్రయోగము మున్నగువాటిలో ముందున్నదని ప్రకటింపవచ్చును.

తిమ్మకవి తన గ్రంథాలను నరాంకితం చేయలేదు. అంతేగాక ధూర్జటిలా రాజులను తీవ్రంగా దూషించాడు. కుక్కుటేశ్వర శతకంలో 'రాజులకు కావ్యం అంకితమిస్తే వారు మోక్షాన్ని ఇవ్వగలరా? ఏనుగులు, గుఱ్ఱాలు, భూషణ, అంబరాలతో తృప్తిపరపగలరా? రాజులను తుచ్ఛ భోగములకై స్తుతించడం ఇహపరములను దూరం చేసుకోవడమే' అంటాడు. అలాగే రసికజన మనోభిరామములో 'రాజులిచ్చే కరి, తురగ, ఆందోళికాది విభవములు స్థిరములు కావు' అన్నాడు. 'చంద్రరేఖా విలాపము రచించిన కూచిమంచి జగ్గకవి తిమ్మకవి సోదరుడు. 'వాసవదత్త పరిణయము' వ్రాసిన వక్కలంక వీరభద్రకవి, 'ధర్మ ఖండము' కర్త భవానీ శంకరకవి, 'భర్తృహరి సుభాషితములు' ఏనుగు లక్ష్మణకవి తిమ్మకవి సమకాలికులు. తిమ్మకవి 'లక్షణసార సంగ్రహం'లో తనను సకల సంస్కృతాంధ్ర లక్షణ కళా కౌశలాభిరాముడ'నసీ, 'అభినవ వాగనుశాసనుడ'నసీ చెప్పుకున్నాడు. కవిసార్వభౌముడనే బిరుదు వహించినందుకు తిమ్మకవి కూడా శ్రీనాధుని వలెనే చివరి రోజులలో భార్య గతించడంతో అన్నపానాలకు చాలా అవస్థలు పడ్డాడు.

కరోనా కాలంలో సాహిత్యకలాపాలు, సభలు, సమావేశాలు లేకపోవడంతో ఏదైనా ఒక మంచి పని చేద్దామనే ఉద్దేశ్యంతో అచ్చ తెలుఁగు రామాయణమునకు టీక – తాత్పర్యము వ్రాసి ప్రజలకు అందుబాటులోకి తీసుకువద్దామనే ఆలోచన కలిగింది. ఆ ప్రయత్నంలో మా కళాగౌతమి సంస్థలో క్రియాశీలక సభ్యులు, మంచి పద్యకవి అయిన శ్రీ కవితా ప్రసాద్‌గారి సహకారం తీసుకోవడం జరిగింది. ఒక కావ్యం గురించి పరిశీలించేటప్పుడు సొంత అభిప్రాయాలను కాకుండా పరిశుద్ధ భావాల్ని అందివ్వాలనే తలంపు దీనికి కారణం. ఆయన కూడా ఏమాత్రం విసుగు, అశ్రద్ధ లేకుండా శుద్ధ ప్రతిని తయారుచేయడంలో, టీక–తాత్పర్యముల వివరణలో పూర్తిగా సహకరించారు. ఈ పుస్తకం వెలుగుచూడటంలో వారి సహకారానికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

# వందనం

మాతృదేవత శేషమ్మ మహిత సుగుణ
ఘన పతివ్రత, ఆచార కలిత, మమ్ము
పేర్మి పెంచిన సౌజన్య, కూర్మి నామె
పాదపద్మముల్ స్మరియింతు పరమ భక్తి

'కౌశిక' స్నాన మొనరించి, కడు శుచియయి
దేవ పితృ ఋషి ఋణములు దీర్చి, లేదు -
నాక తన పంక్తి నతిథుల నాదరించి
మహిని ఖ్యాతిని గొన్నట్టి మాదు తండ్రి
బులుసు వేంకటరమణయ్య బుధుని కొలుతు

జననీ జనకుల ఋణ మీ
యనువున లవమాత్రమైన నది తీర్పంగన్
మది కోర్కె జనింపగ, నే
నొనరించితి నీ రచనము నొప్పుగ తెలియన్

చదివితి నితిహాసమ్ముల
చదివితి శ్రద్ధను ప్రబంధ సంపద నెల్లన్
చదివిన చదువుకు సార్థక
మొదవగ రచియించినాడ నొప్ప రసజ్ఞుల్

నాదనున దేది యున్నను
నాదా యది? పూర్వకవి ధనమ్మే కాదా!
ఏదో కూర్చితి నంతే
నాదని నే చెప్పబోను నమ్ముడు సుజనుల్

# అచ్చతెలుఁగు రామాయణము
# బాల కాండము

**1 చ.** **సిరులకు మన్కియై హొయలు చెన్నలరారెడు వెండికొండపై**
**నరుదుగ వేల్పుఱేడు మరునయ్యయు నల్వయుఁ గొల్వఁ జల్వడా**
**ల్దొర రతనంపు టుప్పరిగలో వలిగుబ్బలి రాచకూఁతుఁ దా**
**నిరవుగఁ గూడి ముజ్జగము లేలెడు లేనెలదాల్పుఁ గొల్చెదన్**

సిరులకు మన్కియై = సంపదలకు స్థానమై, హొయలు చెన్ను అలరారెడు = అందముగా సొగసులొలికే, వెండికొండపైన్ = కైలాసపర్వతముపై, అరుదుగ = తరచుగ, వేల్పుఱేడు = ఇంద్రుడు, మరుని అయ్యయు = విష్ణువును, నల్వయున్ = బ్రహ్మయు, కొల్వ = సేవించుచుండగా, చల్వడాల్ దొర రతనంపు = చంద్రకాంతశిలా నిర్మితమైన, ఉప్పరిగలో = భవనంలో, వలిగుబ్బలి రాచకూతున్ = హిమవత్పుత్రి పార్వతిని, తాను = తాను, ఇరవుగ = చక్కగా, కూడి = కలసి, ముజ్జగములు = మూడు లోకములను, ఏలెడు = పరిపాలించే, లేనెల తాల్పున్ = చంద్రవంకను ధరించిన శివుని, కొల్చెదన్ = సేవించెదను.

**తా :** సకల సంపదలకు స్థానమై, మిక్కిలి అందమైన కైలాస పర్వతముపై నిరతము ఇంద్రుడు, విష్ణువు, బ్రహ్మ సేవించుచుండగా చంద్రకాంతశిలానిర్మితమైన మేడలో హిమవత్పుత్రికయైన పార్వతీదేవిని కూడి మూడులోకములను పాలించే చంద్రకళాధరుడైన పరమశివుని సేవించెదను.

**2 తే.** **కొండవీడేలు వేలుపుఁ గూడి పాల**
**కడలి నడుచక్కి బలుమానికముల దీవిఁ**
**బుడుకుమ్రాఁకులు మారేళ్ళు పొదలి పొదలు**
**కడిమి పూఁదోఁటలో నాడు గరితఁ దలఁతు**

కొండవీడు = కైలాస పర్వతమును, ఏలు = పాలించెడి, వేలుపు = శివుని, కూడి=జత కలిసి, పాలకడలి నడుచక్కి = పాలసముద్రము మధ్యలో, బలు మానికముల దీవిన్ = గొప్పదైన మణి ద్వీపంలో, పుడుకు మ్రాకులు = కల్పవృక్షములు, మారేళ్ళు = మారేడు వృక్షములు, పొదలి =

వ్యాపించి, పొదలు = చక్కగా పెరిగిన, కడిమి పూదోటలో = కడిమిపూల వనంలో, ఆడు = విహరించునట్టి, గరితన్ = స్త్రీని (పార్వతిని), కొలుతున్ = సేవింతును.

**తా :** కైలాసపర్వతపతియైన శివునితో కలిసి, పాలసముద్రము మధ్యలో గొప్పదైన మణి ద్వీపంలో కల్పవృక్షములను, మారేడువృక్షములను వ్యాపించి చక్కగా పెరిగిన కడిమిపూల వనములో విహరించునట్టి పార్వతీదేవిని సేవిస్తాను.

**3 సీ.** **గ్రుడ్డుకానుపుతేఁడు గ్రుడ్డుకానుపుతేఁడు**
**గుఱ్ఱంబు పాన్పునై కొమరు మిగుల**
**జింకతాలుపరియు జింకతాలుపరియు**
**మఱఁదియు ననుఁగునై మెఱపుఁజూప**
**నీరుపుట్టువయును నీరుపుట్టువయును**
**బూరయుఁ దొడవునై పొలుపు నెఱపఁ**
**బచ్చవార్పపుజోదు పచ్చవార్పపుజోదు**
**వలకన్ను కొడుకునై వలపు గులుకఁ**

**తే.** **జుట్టువాలును నెవ్వ పోఁగొట్టు నాలు**
**బిట్టు గ్రాలు పసిండి క్రొంబట్టు నేలు**
**మెట్టజాలు మొగిల్పస మెట్టఁ జాలు**
**నట్టి డాలును గల జగజెట్టిఁ దలఁతు**

గ్రుడ్డుకానుపు తేడు = గ్రుడ్డునుండి పుట్టిన, గుఱ్ఱంబు = వాహనమును (గరుత్మంతుడు), గ్రుడ్డుకానుపు తేడు = గ్రుడ్డునుండిపుట్టిన ఆదిశేషుడు, పాన్పునై = శయ్యయై, కొమరుమిగుల = శోభలు నింపగా, జింక తాలుపరియు = జింక కలిగియున్న చంద్రుడు, మఱదియు = మరదియును (లక్ష్మితోపాటు పుట్టుక), జింక తాలుపు అరియు = జింకను ధరించిన శివుడు (జింకరూపంలోని రాక్షసుని చంకలో ఇరికించుకున్నవాడు), అనుగునై = మిత్రుడునయి, మెఱపు చూప = ప్రకాశింపగా, నీరు పుట్టువయును = నీటిలో పుట్టుక కలిగినది, బూరయు = శంఖమును (పాంచజన్యము), నీరు పుట్టువయును = నీటిలో పుట్టుక కలిగినది, తొడవునై = అలంకారమునయి (కౌస్తుభమణి), పొలుపు నెఱప = అందమునీయగా, పచ్చ వార్పపు జోదు = పచ్చనిగుఱ్ఱములుకల వీరుడు (సూర్యుడు), వలకన్ను = ఎడమకన్నుగాను, పచ్చవార్పపుజోదు = చిలుక వాహనముగాగల వీరుడు (మన్మథుడు), కొడుకునై = కుమారుడునయి, వలపు గులుక = ప్రీతిని నింపగా, చుట్టు వాలును = సుదర్శనచక్రమును, నెవ్వ = దరిద్రమును, పోగొట్టు, ఆలు = భార్యయు (లక్ష్మీదేవి), బిట్టుగ్రాలు = మిక్కిలి కాంతులీనే, పసిండి క్రొంబట్టు = బంగారు పట్టు, చేలు = పీతాంబరమును, మెట్టన్ = పాదమునుండి, చాలు = ప్రవహించు గంగయును, మొగిల్పస = మేఘము యొక్క కాంతిని, మెట్టజాలునట్టి = అతిక్రమించునట్టి, డాలును = కాంతియు, కల = కలిగినట్టి, జగజెట్టి = లోకవీరుడైన విష్ణుని, తలతు = స్మరించెదను.

**తా :** గ్రుడ్డునుండి పుట్టిన గరుత్మంతుడు వాహనముగాను, గ్రుడ్డునుండి పుట్టిన శేషుడు శయ్యగాను కలవాడును, జింక మచ్చగాకల చంద్రుడు మరదిగాను, జింకను చంకలో ఇరికించుకున్న శివుడు మిత్రుడుగాను కలవాడును, పాంచజన్యము (సముద్రమున ఉన్న పంచజనుడను రాక్షసుని దేహమందలి శంఖము) శంఖముగాను, కౌస్తుభమణి భూషణముగాను కలవాడును, పచ్చని గుఱ్ఱములుకల సూర్యుడు కుడికన్నుగాను, పచ్చని చిలుక వాహనముగాకల మన్మథుడు కొడుకుగాను కలవాడును, సుదర్శన చక్రమును, దారిద్ర్యమును పోగొట్టు లక్ష్మీదేవి భార్యయును, పట్టు పీతాంబరమును, పాదమునుండి ప్రవహించు గంగయును, మేఘకాంతిని తిరస్కరించు కాంతియును కలిగిన జగజెట్టి విష్ణుని స్మరించెదను.

**4 చ.** **పులుఁగుహుమాయిజోదు నెదఁ బూనిన నిద్దపుఁ దమ్మికెంపు సొం**
**పలరెడు దొండపండనుచు నక్కఱ ముక్కున నొక్కఁ బోవు కై**
**చిలుక నదల్ప వైళ మది చేరి తమిం దన మోవిఁ జీఱ రాఁ**
**బొలుపుగ నవ్వు నయ్యసలుఁబుట్టువ నట్టువెలందిఁ గొల్చెదన్**

పులుగు హుమాయి జోదుని = పక్షి వాహనంగగల శౌర్యశాలి విష్ణుని, ఎదన్ = గుండెలపై, పూనిన = ఆవహించిన, నిద్దపు = స్వచ్ఛమైన, తమ్మి కెంపు = పద్మరాగమణి (కౌస్తుభం), సొంపలరెడు = అందముగానున్న, దొండపండనుచు = దొండపండని, అక్కఱన్ = కోరి, ముక్కున = ముక్కుతో, నొక్కబోవు = నొక్కబోయే, కైచిలుకను = చేతిలోని చిలుకను, అదల్ప = బెదిరించగ, వైళమ = వెంటనే, అది = ఆ చిలుక, చేరి = సమీపించి, తమిన్ = ప్రీతితో, తన = తనయొక్క, మోవిన్ = పెదవిని, చీఱ రాన్ = పొందుటకు రాగా, పొలుపుగ = అందముగా, నవ్వున్ = నవ్వునట్టి, ఆ = ఆ, అసలుపుట్టువ నట్టు వెలందిన్ = తామర వాసస్థానముగ కల స్త్రీని (లక్ష్మీదేవిని), కొల్చెదన్ = సేవించెదను.

**తా :** గరుత్మంతుడు వాహనముగాకల శ్రీమహావిష్ణుని ఎదపైనున్న కౌస్తుభమణిని దొండపండనుకొని చేతిలోని చిలుక ముక్కుతో నొక్కబోగా లక్ష్మీదేవి వారించగా వెంటనే ఆ చిలుక ఆమె పెదవిని పొందుటకు రాగా అందముగా నవ్వునట్టి లక్ష్మిని సేవించెదను.

**5 క.** **తెల్లని తామరగద్దియ**
**తెల్లని యిల్లాలు మిగులఁ దెల్లని కొడుకున్**
**దెల్లని తోఁబుట్టువయును**
**దెల్లని తత్తడియుఁ గలుగు దేవర నెంతున్**

తెల్లని తామర = తెల్లని పద్మము, గద్దియ = పీఠము, తెల్లని యిల్లాలు = తెల్లని దేహచ్ఛాయకల స్త్రీ భార్యయు (సరస్వతి), మిగుల = మిక్కిలి, తెల్లని = తెల్లని, కొడుకున్ = కుమారుడును (నారదుడు), తెల్లని = తెల్లనిదైన (గంగ), తో బుట్టువయును = తోడ పుట్టినదియును, తెల్లని = తెల్లనిదైన (హంస), తత్తడియు = వాహనమును, కలుగు = కలిగినట్టి, దేవరన్ = దేవుని (బ్రహ్మదేవుని), ఎంతున్ = తలంతును.

**తా :** తెల్లని తామర పీఠము, తెల్లని భార్య (సరస్వతి), మిక్కిలి తెల్లని కొడుకు (నారదుడు), తెల్లని సోదరి (గంగ), తెల్లని వాహనము (హంస) ను కలిగిన దేవుని తలంతును.

**6 సీ.** **వెలిదమ్మి క్రొంబువ్వు కొలువు సింగపుపీఁట**
**చెలువారు రాచిల్క చెలిమిబోటి**
**విన్ను ద్రిమ్మరి రాచకన్నియ ల్వరవుళ్ళు**
**పులుఁగుల మేల్బంతి వలఁతి మావు**
**తెఱగంటి దొరలెల్ల దినుసు మీఱిన లెంక**
**లలరు విల్దాల్పు ముద్దుల మఱంది**
**పోరోగిరపు నిరాబారి కూరిమిపట్టి**
**మామ మామ యనుంగు మామగారు**

**తే.** **తమ్మిపూఁజూలి నాలుగు నెమ్మొగమ్ము**
**లాటగీములు గాఁగఁ జెన్నలరునట్టి**
**పల్కు నవఁబోడి జానగు పల్కులిడుచుఁ**
**గనికరం బెచ్చ మము నిచ్చుఁ గాచుఁగాత**

వెలిదమ్మి క్రొంబువ్వు = తెల్లని అప్పుడే విరిసిన పద్మం, కొలువు సింగపు పీట = సింహాసనము, చెలువారు = సొగసైన, రాచిల్క = రామచిలుక, చెలిమి బోటి = చెలికత్తె, విన్ను ద్రిమ్మరి రాచ కన్నియలు = యక్ష కాంతలు, వరవుళ్ళు = దాసీలు, పులుగుల మేల్బంతి = పక్షులలో శ్రేష్ఠమైన, వలతి = నేర్పరియైన (హంస), మావు = వాహనము, తెరగంటి దొరలు = దేవతా శ్రేష్ఠులు, ఎల్ల = అందరూ, దినుసు మీఱిన = లెక్కకు మీఱిన, లెంకలు = సేవకులు, అలరువిలు దాల్పు = పూల విల్లు ధరించిన మన్మథుడు, ముద్దుల మఱంది = ముద్దుల మఱిది, పోరు = కలహమే, ఓగిరపు = ఆహారముగా కల, నిరాబారి = నిరంతర సంచారి (నారదుడు), కూరిమి పట్టి = ప్రియ పుత్రుడు, మామ మామ = విష్ణువు (లక్ష్మి ద్వారా సముద్రుడు మామ, గంగ ద్వారా సముద్రుడికి మామ), అనుంగు = ఇష్టమైన, మామగారు = మామగారు, తమ్మిపూ చూలి = పద్మమునుండి పుట్టిన బ్రహ్మ, నాలుగు నెమ్మొగములు = అందమైన నాలుగు ముఖములును, ఆట గీములు = క్రీడా గృహములు, కాగ = అవగా, చెన్నలరునట్టి = సొంపగునట్టి, పల్కు ననబోడి = పలుకుల చేడియ (సరస్వతి), జానగు పల్కులిడుచు = చక్కని పల్కుల నిచ్చుచు, కనికరంబు ఎచ్చ = అధికమైన కరుణతో, నిచ్చన్ = నిత్యమూ, మము = మమ్ములను, కాచుగాత = రక్షించు గావుత.

**తా :** పద్మము సింహాసనముగాను, చిలుక చెలికత్తెగాను, యక్షకాంతలు దాసీలుగాను, హంస వాహనముగాను, దేవతలు సేవకులుగాను, మన్మథుడు మరదిగాను, కలహమే ఆహారమైన నారదుడు ప్రియ పుత్రుడుగాను, విష్ణుమూర్తి మామగారుగాను, బ్రహ్మ నాల్గుముఖములు క్రీడాస్థలములుగాను కలిగిన సరస్వతీదేవి చక్కని పల్కుల నిచ్చి దయతో రక్షించుగాత.

**7 సీ.** **నేలతాలుపు రాచచూలి గాదిలి కందు**
**దొసఁగు చీఁకటి చాల్పు తొగలవిందు**
**దుగ తిగ మొగముల జగజెట్టి తోఁబుట్టు**
**పొగడువారల నట్టు పుడుకుఁజెట్టు**
**పెనుబొజ్జ నిడ్డెన ల్దినెడు నేరుపువాఁడు**
**మేలి కడాని డాల్మేనివాడు**
**గోడ దొల్చెడు ఱాఁగ గుల్లింపు నెఱజోదు**
**గాటంపు టక్కటికముల పాదు**

**తే.** **నగుచు జిగిచెక్కుగవ జాఱు నామునీరుఁ**
**గ్రోలుటకుఁ జేరు జమిలిముక్కాలి బారు**
**గొనబు పాటల కెదఁ గేరుకొనుచు సొరు**
**నెరపు నెఱవేల్పు నామది నిలచుఁగాత**

నేలతాలుపు రాచ చూలి = భూమిని మోసేవి పర్వతాలు, పర్వతరాజు హిమవంతుని పుత్రి పార్వతి, గాదిలి = ప్రియమైన, కందు = బిడ్డడు, దొసగు = విఘ్నములనెడు, చీకటి చాల్పు = దట్టమైన చీకటికి, తొగలవిందు = కలువలకు ఆప్తుడైన చంద్రుడు, దుగ తిగ మొగముల జగజెట్టి = ఆరు ముఖముల వీరాధివీరుడు (కుమారస్వామి), తోబుట్టు = సోదరుడైనవాడు, పొగడువారల = తనను స్తుతించువారల, నట్టు = ఆశ్రయమైన, పుడుకు చెట్టు = కల్పవృక్షము, పెను బొజ్జన్ = పెద్ద పొట్టతో, ఇడ్డెనల్ = కుడుములను, తినెడు నేరుపువాడు = తినుటయందు నేర్పుకలవాడు, మేలి = శ్రేష్ఠమైన, కడాని డాలు = బంగారు ఛాయకల, మేనివాడు = శరీరము కలవాడు, గోడ దొల్చెడు = గోడకు కన్నము పెట్టు, ఱాఁగ = ఉద్ధతుడైన, గుల్లింపు = వాహనముగాకల (ఎలుక), నెఱజోదు = గొప్ప వీరుడు, గాటపు = గొప్పవైన, అక్కటికముల = ఉపాయములకు, పాదున్ = స్థానమయినవాడు, అగుచు, జిగి = బిరుసైన, చెక్కుగవ = రెండు చెక్కిళ్ళనుండి, జారు = జారుచున్న, నామునీరు = మదజలము, గ్రోలుటకు = త్రాగుటకు, చేరు = సమీపించు, జమిలి ముక్కాలి బారు = 2×3=6 కాళ్లుగల తుమ్మెదల సమూహముయొక్క, గొనబు పాటలకు = శ్రావ్యమైన సంగీతమునకు, ఎదన్ = మనసులో, కేరుకొనుచు = ఉప్పొంగిపోయే, సొరు = అందముగా, నెరపు = కోర్కెలను తీర్చే, నెఱవేల్పు = గొప్ప దైవము (వినాయకుడు), నామది, నిలుచుగాత = ఉండుగాత.

**తా :** హిమవత్పుత్రి పార్వతి ముద్దు బిడ్డడు, విఘ్నములనే చీకటికి చంద్రుడు, కుమారస్వామి సోదరుడు, తనను స్తుతించినవారిని రక్షించువాడు, పెద్దపొట్టతో కుడుములను తినుటలో నేర్పుకలవాడు, బంగారు ఛాయ దేహముకలవాడు, ఎలుక వాహనముగా కలవాడు, ఉపాయములకు స్థానమైనవాడు, చెక్కిళ్ళనుండి కారు మదజలమును త్రాగుటకు వచ్చు తుమ్మెదల శ్రావ్యమైన సంగీతమునకు ఉప్పొంగిపోయేవాడు, కోర్కెలను తీర్చే దైవము వినాయకుడు నామది నిలచుగాత.

**8 సీ.** **లాఁగ డాఁగుడు ఊఁగ ప్రోఁగులిడెడు ప్రోద**
**కొలలు దొసంగులు దొలఁచు మేటి**
**జక్కుల రా యిక్కఁ జొక్కు నెక్కటి యుద్ది**
**కడిఁది ముక్కొటిక సోఁకుడుల దిగులు**
**వలపు మోపరి జియ్య వలమూల దయ్యంబు**
**గుండుల తలకట్టు పండు దండి**
**తొలుకడ రాఊపసలు గెబ్బు నర్తితేఁ**
**దెద్దడి గుబురు కాటిర్ల ప్రొద్దు**

**తే.** **బార్కై నీటికానుపు పాప యప్ప**
**పుదుకుఁ గల్లల జెట్టికై పొడమినట్టి**
**మెట్ట వాల్పిట్ట రా మేని దిట్టవేల్పు**
**క్రచ్చు లొడగూర్చి మము నిచ్చుఁ గాచుఁగాత**

లాగ డాగుడు ఊఁగ = కన్నంలో దాగే ఉద్ధతుడు (సర్పము), ప్రోగులు = చెవిపోగులుగా, ఇడెడు ప్రోద= ఉంచుకొనునట్టి శ్రేష్ఠుడు, కొలలు = పాపములు, దొసంగులు = దోషములు, తొలచు మేటి = తొలగ చేయు గొప్పవాడు, జక్కుల రా = కుబేరునియొక్క, ఇక్కన్ = ఇంట, చొక్కు = పరవశమగు, ఎక్కటి ఉద్ది = గొప్ప చెలిమికాడు, కడిది = అశక్యమైన, మూడు కొటిక = మూడు పురముల, సోకుడుల దిగులు = రాక్షసులకు భయమైనవాడు, వలపుమోపరి జియ్య = వాయుదేవునికి, వలమూల = ప్రక్కమూల నున్నట్టి, దయ్యంబు = దేవుడు(ఈశానుడు), గుండుల తలకట్టు = పర్వతములకు శ్రేష్ఠమైన వెండికొండపై , పండు = శయనించు, దండి = సమర్థుడు, తొలు కడ రా ఊ పసలు = = ఇంద్ర నీలమణుల కాంతులను, గెబ్బున్ = అతిక్రమించిన, అర్తి ఉేడు = కంఠముగల రాజు, ఎద్దడి గుబురు = ఆపదల సమూహము లనెడు, కాఱు ఇర్ల = దట్టమైన చీకట్లకు, ప్రొద్దు = సూర్యుడు, బార్కై = పన్నెండు చేతులుకల, నీటి కానుపు = నీటియందు పుట్టిన, పాప = కుమారుడైన షణ్ముఖునికి, అప్ప = తండ్రి (శివుడు), పుదుకు కల్లు కల= చింతామణి కల్గిన, జెట్టికై = శూరునికొఱకు (ఇంద్రునికై), పొడమినట్టి = పుట్టినట్టి, మెట్టవాలు పిట్ట రా = కోడి పుంజు(కుక్కుటేశ్వరుడు), మేని = శరీరమును ధరించిన, దిట్టవేల్పు = శ్రేష్ఠమైన దైవము, క్రచ్చులు = కోరికలు, ఒడగూర్చి = ప్రసాదించి, మము నిచ్చలు గాచుగాత.

**తా :** పాము చెవిపోగులుగా కలవాడు, పాపములను, దోషములను తొలగజేయువాడు, కుబేరుని చెలికాడు, త్రిపురాసురులను సంహరించినవాడు, వాయుదేవుని ప్రక్కమూల నున్నవాడు (ఈశానుడు), వెండికొండపై శయనించువాడు, ఇంద్రనీలమణుల కాంతులను గ్రహించిన కుత్తుకగల నటరాజు, దరిద్రముల సమూహములనెడు కారుచీకట్లకు సూర్యుడైనవాడు, కుమారస్వామికి తండ్రి, ఇంద్రుని కొఱకు కుక్కుటేశ్వరునిగ జన్మించిన ఆ పరమశివుడు కోరికలు తీర్చి మమ్ము కాపాడుగాత.

**9 క.** **ఎదఁ గుదురగు వేడుకఁ బొగ,**
**డుదుఁ బది యరదముల దొరకొడుకు కత కదు నిం**
**పొదవఁ గదియించి యసమునఁ**
**బొదలిన బల్లిదునిఁ బుట్టఁ బుట్టువు తపసిన్**

పదియరదముల దొర = దశరథుడు, కొడుకు కత = శ్రీరాముని కథను, కదున్ = మిక్కిలి, ఇంపొదవ = ఇష్టమగురీతిలో, కదియించి = కూర్చి, యసమున పొదలిన = కీర్తిమంతుడైన, బల్లిదుని = సమర్థుడైన, పుట్ట పుట్టు తపసిన్ = పుట్టలోపుట్టిన మునిని (వాల్మీకి), ఎద కుదురగు వేడుకన్ = నిశ్చలమైన మానసిక ఆనందముతో, పొగడుదు = స్తుతిస్తాను.

**తా :** దశరథుని కొడుకగు రాముని కథను ఇంపుగా కూర్చి కీర్తివంతుడైన సమర్థుడగు వాల్మీకిని నిశ్చలమైన మనసుతో స్తుతిస్తాను.

**10 తే.** **రంగుమీఱంగ మున్ను దెలుంగుబాసఁ**
**గబ్బములు గూర్చి పొగడికఁ గన్నవారి**
**భీము నన్నయఁ దిక్కయ సోము నెఱ్ఱ**
**ప్రగ్గడను బాచయను గూర్మి నుగ్గడింతు**

రంగుమీఱగ = సొంపు అతిశయించగా, తెలుంగు బాసన్ = తెలుగు భాషలో, మున్ను = పూర్వము, కబ్బములు కూర్చి = కావ్యములు రచించి, పొగడిక కన్నవారి = కీర్తిని గడించిన వారిని, భీము = వేములవాడ భీమకవిని, నన్నయన్ = నన్నయభట్టారకుని, తిక్కయ = తిక్కన సోమయాజిని, సోమున్ = నాచన సోమనాధుని, ఎఱ్ఱప్రగ్గడన్ = ఎఱ్ఱాప్రెగడను, బాచయను = భాస్కరుని, కూర్మిన్ = ప్రీతితో, ఉగ్గడింతు = పేర్కొంటాను.

**తా :** చక్కగా తెలుగు భాషలో పూర్వము కావ్యములు రచించి కీర్తిని గడించిన వేములవాడ భీమకవిని, నన్నయభట్టారకుని, తిక్కనసోమయాజిని, నాచన సోమనాధుని, ఎఱ్ఱాప్రగ్గడను, భాస్కరుని ప్రీతితో పేర్కొంటాను.

**11 సీ.** **ఏమేటి యడగుఁ గెందామర బల్గాఁపు**
**రపు టేల్లుతేని కఱ్ఱంపుఁ దెప్ప**
**యే బల్లిదుఁడు చెవినిడు నక్కరములు చె**
**ల్వపు ముత్తిమేడకు వరుసమెట్లు**
**లే పున్నెములగని యెఱిఁగించు మేల్తెల్వి**
**కల్ల జగంబు చీఁకటికి దివ్వె**
**యేదంట యొసఁగు నున్బాది దోసపుఁ దుల్వ**
**గాద్పుదిండులకు వాకట్టుమందు**

**తే.** **తనర నే పెద్దపుట్టువులను కడింది**
**తెవులునకు వెజ్జుతేఁ డట్టి దెందులూరి**

**కొలఁపు పాలేటి నిండు జాబిలి యనంగఁ**
**దనరు లింగన గురుని డెందమునఁ దలఁతు**

ఏ మేటి యడుగు కెందామర = ఏ శ్రేష్ఠుని ఎఱ్ఱ తామర వంటి పాదము, బల్ కాపురపు = గొప్ప సంసారమనే, ఏఱ్ఱ జేనికి = సముద్రానికి, అబ్రంపు = ఆశ్చర్యకరమైన, తెప్ప = నావయో, ఏ బల్లిదుడు = ఏ సమర్థుడు, చెవిని+ఇడు=చెవికి ఎక్కించు, అక్కరములు = అక్షరములు, ముత్తి మేడకు = ముక్తి సౌధానికి, చెల్వపు = సొగసైన, వరుస మెట్టులు = వరుసగా పేర్చబడిన మెట్లో, ఏ పున్నెముల గని = ఏ పుణ్యముల నిధి, మేల్తెల్వి = గొప్ప జ్ఞానము, ఎఱిగించు = తెలియచేయు, కల్ల జగంబు = మాయా లోకమనే, చీకటికి = అజ్ఞానాంధకారానికి, దివ్వె = దీపమో, ఏ దంట = ఏ సమర్థుడు, ఒసగు = ఇచ్చేట టువంటి, నున్నాది = మెత్తటి విభూతి, దోసపు = దోషములనే, తుల్వ = నీచమైన, గాడ్పు దిండులకు = గాలి దెయ్యాలకు, వాకట్టు మందు = వాగ్బంధనంచేసే మందో, తనరన్ = ఒప్పుగా, ఏ పెద్ద = ఏ గొప్పవాడు, పుట్టువులను = మాటిమాటికీ పుట్టడమనే, కడింది = కఠినమయిన, తెవులునకు = రోగమునకు, వెజ్జు ఱేడు = వైద్య శిఖామణియో, అట్టి = అటువంటి, దెందులూరి కొలపు = దెందులూరి వంశానికి, పాలేటి = పాలసముద్రములోని, నిండు జాబిలి యనగ = పూర్ణచంద్రుడను రీతిగా, తనరు = ఒప్పునట్టి, లింగన గురుని = లింగన గురుదేవుని, డెందమున = మనసులో, తలతు = స్మరిస్తాను.

**తా :** ఏ మహనీయుని పాదపద్మము సంసారమనెడి సముద్రమును దాటుటకు తెప్పయో, ఏ సమర్ధుని నామాక్షరములు ముక్తి సౌధానికి సొగసైన సోపానములో, ఏ పుణ్యనిధి తెలియజేయు గొప్ప జ్ఞానము మాయాలోకమైన ఈ అజ్ఞానాంధకారానికి దీపమో, ఏ తపస్వి ఇచ్చు విభూతి దుష్ట గాలి దెయ్యాలను అరికట్టుటకు మందో, ఏ యశస్వి తిరిగి తిరిగి పుట్టడమనే రోగానికి వైద్యశిఖామణియో, పాల సముద్రమునకు చంద్రుని వంటి దెందులూరి లింగన గురుదేవుని మనసులో స్మరించెదను.

**12 క.** **అని యెల్ల వేల్పులం బే**
**ర్కొని కబ్బము కూరుపరుల గురునిఁ గడంకన్**
**గొనియాడి యచ్చతెలుఁగునఁ**
**బనివడి కబ్బంబుఁ గూరుపం గడఁగునెడన్**

అని = ఈ రీతిగ, ఎల్లవేల్పులన్ = సమస్త దేవతలను, పేర్కొని = చెప్పి, కబ్బము కూరు పరులన్ = కావ్యములను కూర్చినవారిని (కవులను), గురునిన్ = గురుదేవుని, కడంకన్ = పూనికతో, కొనియాడి = స్తుతించి, అచ్చతెలుగున = అచ్చతెలుగులో, పనివడి = కోరి, కబ్బంబున్ = కావ్యమును, కూరుపన్ = రచించుటకు, గడగు నెడన్ = సిద్ధపడు సమయములో.

**తా :** ఈ రీతిగ సమస్త దేవతలను, కావ్యములను కూర్చినవారిని, గురుదేవుని స్తుతించి అచ్చతెలుగులో కావ్యమును రచించుటకు సిద్ధపడు సమయమున.

**13 సీ. కప్పుకుత్తుకవాఁడు గాలి మేఁతరి యందె**
**జోటివాఁ డరమేయి జోటివాఁడు**
**విన్ను క్రొమ్ముడివాఁడు వెండిగుబ్బలి గూడె**
**మేలువాఁ డుడివోని మేలువాఁడు**
**గిత్త తత్తడివాఁడు బుత్తి ముత్తు లిడంగఁ**
**జాలువాఁ డౌదల జాలువాఁడు**
**మొనల కైదువవాఁడు మినుకు కైవారము**
**ల్మెచ్చువాఁ డని బీర మెచ్చువాఁడు**
**తే. సంకు జిగివాఁడు వలకేల జింకవాఁడు**
**ప్రాఁత మగవాఁడు వెలిబూది పూఁతవాఁడు**
**మిక్కుటంబగు మక్కువ నొక్కనాఁడు**
**దనరఁ గలలోన మ్రోలఁ గన్గొనఁగ నయ్యె**

కప్పుకుత్తుకవాడు = నల్లనికంఠమువాడు, గాలి మేతరి = గాలిని తిను పాము, అందెజోటి వాడు = అందెలజతగాకల వీరుడు, అరమేయి జోటివాడు = అర్థనారీశ్వరుడు, విన్ను = ఆకాశము, క్రొమ్ముడివాడు = కొప్పుగా కలవాడు, వెండిగుబ్బలి గూడెము = కైలాసపర్వతము, ఏలువాడు = ఏలేవాడు, ఉడివోని = తక్కువకాని, మేలువాడు = మేలు చేయువాడు, గిత్త తత్తడివాడు = నంది వాహనమువాడు, బుత్తి ముత్తులు = భుక్తి, ముక్తులను, ఇడంగ జాలువాడు = ఇవ్వగలిగినవాడు, ఔదల జాలువాడు = తలపై నది (గంగ)ను ధరించినవాడు, మొనల కైదువవాడు = త్రిశూలము ఆయుధమైనవాడు, మినుకు కైవారము ల్మెచ్చువాడు = వేద స్తుతులను మెచ్చువాడు, అని = పోరాటమునందు, బీర మెచ్చువాడు = గొప్ప శౌర్యము కలవాడు, సంకు = శంఖమువంటి, జిగివాడు = తెల్లని కాంతివాడు, వల కేల = ఎడమచేత, జింకవాడు = జింకను ధరించినవాడు, ప్రాత మగవాడు = ప్రాచీనుడు, వెలిబూది పూతవాడు = భస్మమును పూసుకున్నవాడు, మిక్కుటంబగు = అధికమైన, మక్కువను = అనురాగముతో, ఒక్కనాడు = ఒక్క రోజున, తనర = ఒప్పునట్లుగా, కలలోన = కలలో, మ్రోల = ఎదుట, కన్గొనగనయ్యె = చూడగలిగినవాడయ్యాడు.

**తా :** నల్లని కంఠమువాడు, పాము లందెలుగ కలవాడు, ఆకాశమే కొప్పుగా కలవాడు, కైలాస పర్వతమునకు ఏలికైనవాడు, అధికమైన మేలుచేయువాడు, నంది వాహనమైన వాడు, భుక్తి, ముక్తులను ఇవ్వగలవాడు, శిం˘సున గంగను ధరించినవాడు, త్రిశూలము ఆయుధమైనవాడు, వేదస్తుతులను మెచ్చువాడు, శౌర్యము కలవాడు, శంఖము వలె తెల్లని దేహకాంతి కలవాడు, ఎడమచేత జింకను ధరించినవాడు, ప్రాచీనుడు, భస్మమును పూసుకున్నవాడు అయిన పరమశివుడు ఒకరోజున అనురాగముతో చక్కగా కలలో ఎదుట చూడగలిగినవాడయ్యేడు.

**14 క. కనఁబడి యబ్బలు జేజే**
**కనికరపుం గొనబుఁ జూపు గనుఁగవకొన నె**

**క్కొనఁ గన్గొని నాతో ని**
**ట్లనియె న్ననుదియ్య పల్కు లలరఁగఁ జాలన్**

కనబడి = ప్రత్యక్షమై, ఆ + బలు జేజే = ఆ గొప్ప దైవము, కనికరపున్ = కరుణతో కూడిన, గొనబు చూపు = అందమైన దృష్టిని, కనుగవ కొన = క్రీగంటియందు, నెక్కొన = కూర్చి, కన్గొని = చూచి, నును తియ్య పల్కులు = మెత్తని తియ్యని మాటలు, అలరగ జాలన్ = ఒప్పునట్లుగా, నాతో = నాతో, యిట్లనియె = ఇట్లు పలికెను

**తా :** ఆ మహనీయుడు కనబడి కరుణాదృష్టితో చూచి తియ్యని పలుకులు నాతో పలికెను.

**15 సీ.** **నీ తండ్రి గంగన్న నిచ్చనిచ్చలు మమ్ముఁ**
**బూజించు నపరంజి పూలచేత**
**నీ తల్లి లచ్చుమ్మ నే సంతసిల నోరె**
**ములు వెట్టుఁ బుడమి వేల్పులకు నెల్ల**
**నీ పిన్నతండ్రు లెన్నికలు గాంచిరి జగ్గ**
**నయు సింగరాజును నరసనయును**
**నీ తమ్ము లెలమి నొందించిరి మమ్ము సిం**
**గనయు జగ్గనయు సూరనయుఁ జెలఁగి**

**తే.** **నీ యనుగురాణి బుచ్చమ నెలఁత లెల్ల**
**మేలనఁ దనర్చె గట్టురాచూలిఁ గొలిచి**
**మానికంబవుగద కూచిమంచి కొలము**
**నందరయఁ దిమ్మకవిరాయ యలర నీవు**

నీ తండ్రి గంగన్న, నిచ్చనిచ్చలు = ప్రతి నిత్యము, అపరంజి పూలచేత = బంగారు పూలతో, మమ్ము పూజించు = మమ్మల్ని పూజిస్తాడు, నీ తల్లి లచ్చుమ్మ, నే సంతసిలన్ = నేను సంబర పడేలా, పుడమివేల్పులకు నెల్ల = బ్రాహ్మణులందరికీ, ఓరెములు పెట్టు = విందులు చేస్తుంది నీ పినతండ్రులు, జగ్గనయు,సింగనయు,నరసనయును, ఎన్నికలు గాంచిరి = ప్రసిద్ధులయిరి, నీ తమ్ములు సింగనయు, జగ్గనయు, సూరనయు, చెలగి = ఒప్పి, మమ్ము, ఎలమినొందించిరి = సంతుష్టపరచిరి, అనుగు రాణి = నీ ప్రియమైన ఇల్లాలు, బుచ్చమ, గట్టురాచూలి = పార్వతీదేవిని, కొలచి, నెలత లెల్ల = స్త్రీలందరూ, మేలన = సెభాషనగా, తనర్చె = ఒప్పినది, కూచిమంచి కొలమునందు, అరయ = పరిశీలింపగా, తిమ్మకవిరాయా! = తిమ్మకవిశ్రేష్ఠా!, నీవు, అలర = ఒప్పినట్టి, మానికంబవుగదా! = మాణిక్యానివే సుమా!

**తా :** నీ తండ్రి గంగన నిత్యము బంగారు పూలతో మమ్ము పూజిస్తాడు, నీ తల్లి లచ్చుమ్మ బ్రాహ్మణులందరికీ విందులు చేస్తుంది, నీ పినతండ్రులైన జగ్గన, సింగన, నరసన ప్రసిద్ధులయ్యారు, నీ తమ్ముళ్ళు సింగన, జగ్గన, సూరనలు మమ్ము సంతుష్టి పరిచారు, నీ ఇల్లాలు బుచ్చమ్మ పార్వతీదేవిని కొలిచి సాటి స్త్రీలు సెబాషనగా ఒప్పినది, తిమ్మకవీ! నీవు కూచిమంచి వంశమునకు మాణిక్యానివేసుమా!

**16 తే. మునుపు మాకీవె భల్లాణుఁడనెడి ఱేని**
**కతయు రుక్మిణి పెండిలికతయు బొబ్బ**
**మెకపు గుబ్బలి కతయు మేల్మిఱ నీల**
**పెండ్లికతయును గబ్బము ల్పేర్మిఁ గూర్చి**

మునుపు = ఇంతకు పూర్వము, భల్లాణుడనెడి ఱేని కతయు = భల్లాణరాజు కథను, రుక్మిణి పెండిలి కతయు = రుక్మిణీదేవి కల్యాణ కథను, బొబ్బమెకపు గుబ్బలి కతయు= సింహాచల మాహాత్మ్యం కథను, మేల్మిర = మెచ్చునట్లుగా, నీల పెండిలి కతయు = నీల పెండ్లి కథను, కబ్బములన్ = కావ్యములుగ, పేర్మిన్ = ప్రీతితో, కూర్చి = రచించి, మాకు, ఈవె = ఇచ్చినావుకదా!

**తా :** ఇంతకు పూర్వము భల్లాణరాజు కథను, రుక్మిణీ కల్యాణ కథను, సింహాచల మాహాత్మ్యం కథను, చక్కగా నీలపెండిలి కతను కావ్యములుగ రచించి మాకిచ్చావు.

**17 క. కావున మా కప్పనముగఁ**
**గావింపుము చాల్పు కుత్తుకల తొలి జేజేఁ**
**జేవ దలిర్ప నడంచిన**
**యా వెరవరికతయుఁ బూని యచ్చతెనుఁగునన్**

కావున, చాల్పు కుత్తుకల తొలిజేజేన్ = వరుస కంఠములుకల రాక్షసుని (రావణుడు), చేవ దలిర్ప = పరాక్రమము ప్రకాశమగునట్లుగా, అడంచిన = చంపిన, ఆ వెరవరి కతలు = ఆ నేర్పరి కథలను, అచ్చ తెనుగునన్ = అచ్చ తెలుగులో, మాకు అప్పనముగ = మాకు కృతిగ, పూని = పూనుకొని, కావింపుము = రచింపుము.

**తా :** కావున దశకంఠుని తన పరాక్రమముతో సంహరించిన ఆ నేర్పరి కథను అచ్చ తెలుగులో మాకు కృతిగ రచింపుము.

**18 తే. ఒనరఁ బేరులు బిరుదులు తెలుఁగు సేయఁ**
**బోలదని మున్ను పెద్దలు పూని త్రోవ**
**యిడిరి గావునఁ గూరుపు మిదియు నట్లు**
**తెనుఁగు తెఱఁగెల్ల నేర్పడఁ దిమ్మప్రగడ**

ఒనర = ఉన్నటువంటి, పేరులు, బిరుదులు, తెలుగు సేయ బోలదని = అచ్చతెనుగు చేయరాదని, మున్ను = ఇంతకు పూర్వమే, పెద్దలు = పూర్వులు, పూని = పూనుకొని, త్రోవ యిడిరి = మార్గము చూపిరి, కావున, తెనుగు తెఱగు = తెలుగుభాషా విధానము, ఎల్ల ఏర్పడ = అంతయు ఏర్పడునట్లుగ, తిమ్మ ప్రగ్గడ = తిమ్మ కవీ!, అట్లు = ఆ రీతిగానే, ఇదియు = ఈ కావ్యమును, కూరుపు = కూర్చుము.

**తా :** ఉన్న పేర్లను, బిరుదులను తెనుగు చేయరాదని ఇంతకు పూర్వము పెద్దలు మార్గము చూపిరి. కావున తెలుగుభాషా విధానము ఏర్పడునట్లుగ తిమ్మకవీ! ఆ రీతిగానే ఈ కావ్యమును కూర్చుము.

**19 క.** **నన్నయ మొదలుగఁ గల్గిన**
**మున్నటి బల్లిదులు గబ్బములు గూర్చిన జా**
**డ న్నుడువుల తెఱఁ గెల్లను**
**బన్నుగ గుఱియెఱిఁగి కూర్పు పద్దెంబులలోన్**

నన్నయ మొదలుగ కల్గిన, మున్నటి బల్లిదులు = పూర్వ కవిశ్రేష్ఠులు, కబ్బములు = కావ్యములను, కూర్చిన జాడన్ = రచించిన విధముగా, నుడువుల తెఱగు = పదముల రీతిని, ఎల్లన్ = సమస్తమును, పన్నుగ = చక్కగా, గుఱియెఱిగి = లక్ష్యమెరిగి, పద్దెంబులలోన్ = పద్యములలో, కూర్పు = రచింపుము .

**తా :** నన్నయ మొదలగు పూర్వ కవిశ్రేష్ఠులు వారి కావ్యములను రచించిన రీతిగా పదముల రీతి లక్ష్యమెరిగి చక్కగా పద్యములలో రచింపుము.

**20 తే.** **అనుచు నానతి యొసఁగి యగ్గొనముల గని**
**కను మొఱంగిన నపుడ మేల్కాంచి యబ్బు**
**రమును వేడ్కయు మిగుల డెందమునఁ బెనఁగొ**
**నంగ నవ్వేలుపునకు దండము లొసంగి**

అనుచు, ఆనతి యొసంగి = ఆజ్ఞాపించి, ఆ గొనముల గని = ఆ గుణములకు నిధి, కనుమొఱంగిన = అంతర్ధానము కాగా, అపుడు, మేల్కాంచి, అబ్బురమును = ఆశ్చర్యమును, వేడ్కయు = సంతోషమును, మిగుల = హెచ్చుగా, డెందమున = మనసున, పెనగొనంగా = చుట్టముట్టగా, ఆ వేలుపునకు = ఆ శివునకు, దండము లొసంగి = నమస్కరించి.

**తా :** అని ఆదేశించి ఆ సుగుణనిధి శివుడు అంతర్ధానము కాగా మేల్కొని ఆశ్చర్యము, సంతోషము మనసున చుట్టుముట్టగా ఆ పరమశివునకు నమస్కరించి.

## షష్ఠ్యంతములు

**21 క.** **జక్కులదొర చెలికానికిఁ**
**గొక్కుహుమాజోదు నయ్యకుం జొక్కపు లేఁ**
**జుక్కల తేనిని వేలుపు**
**జక్కర నౌదలను దాల్చు జగవేల్పునకున్**

జక్కుల దొర = కుబేరుని, చెలికానికి = మిత్రునికి, కొక్కు హుమాజోదు = ఎలుక వాహనమైన వీరుడు, అయ్యకు = వినాయకుని తండ్రికి (శివునికి), చొక్కపు = అందమైన, లేచుక్కల తేనిని = శుక్లపక్ష చంద్రకళను, వేలుపు జక్కరను = ఆకాశ గంగను, ఔదలను దాల్చు = శిరసున ధరించు, జగ వేల్పునకున్ = లోకనాథునకు.

**తా :** కుబేరుని మిత్రునికి, వినాయకుని తండ్రికి, శుక్లపక్ష చంద్రకళను, గంగను శిరసున ధరించిన లోకనాథునకు –

**22 క. మల విల్లుఁ జిలువ నారియు**
**బులుగు సిడముజోదు ముల్కి పుడమి యరదముం**
**దొలుపలుకు వారువంబులు**
**జెలఁగఁగఁ దిగప్రోళ్ళుఁ గూలిచిన బలియునకున్**

మల విల్లు = మేరుపర్వతము ధనుస్సు, చిలువ నారియు = పాము వింటినారియు, పులుగు సిడము జోదు = పక్షి ధ్వజమైనవాడు(విష్ణువు), ముల్కి = బాణముగాను, పుడమి = భూమి, అరదము = రథముగాను, తొలుపలుకు = వేదములు, వారువంబులు = గుఱ్ఱములు గాను, చెలగగ = ఒప్పుగా, తిగప్రోళ్ళు = త్రిపురములను, కూలిచిన = పడగొట్టిన, బలియునకున్ = బలవంతునికి.

**తా :** మేరు పర్వతము ధనుస్సుగా, వాసుకి వింటినారిగా, విష్ణువు బాణముగా, భూమి రథముగా, వేదములు గుఱ్ఱములుగా త్రిపురములను కూల్చిన బలవంతునికి –

**23 క. వెండిమలం బండి మొలం**
**దండి సెలఁగ వెలుఁగు తోలుదాల్పు వలఁతికిన్**
**మెండుగఁ బెనుపండుగుగను**
**గొండ యనుఁగుఁ గూతుఁ గలిసి కులికెడు దొరకున్**

వెండిమలన్ = కైలాసపర్వతముపై, పండి = శయనించి, మొలన్ = నడుమునకు, దండి సెలగ = శౌర్యము ప్రకటమగునట్లుగా, వెలుగు = కాంతివంతమైన, తోలుదాల్పు = ఏనుగు చర్మమును ధరించిన, వలతికిన్ = నేర్పరికి, మెండుగ = అధికముగ, పెను పండుగగన్ = గొప్ప సంబరముగా, కొండయనుగు కూతు = హిమవంతుని ప్రియతనయను, కలిసి = కూడి, కులికెడు = ఆనందించే, దొరకున్ = ప్రభువునకు.

**తా :** కైలాసపర్వతము నివాసముగా ఏనుగు చర్మము ధరించిన నేర్పరికి, పెద్ద పండుగగా పార్వతీదేవితో కూడి ఆనందించు ప్రభువునకు –

**24 క. త్రొక్కటఁ జని యక్కట! యని**
**మ్రొక్కుటఁ గని తపసినిసుఁగుఁ బ్రోచు తలఁపునన్**
**మిక్కుటమై యక్కటికము**
**పిక్కటిల న్వెఱపు మానిపిన యెక్కటికిన్**

త్రొక్కట జని = బాధతో వెళ్ళి, అక్కట యని = అయ్యో అని, మ్రొక్కుటన్ = నమస్కరించుటను, కని = చూచి, తపసి నిసుగు = బాల తపసి (మార్కండేయుడు), ప్రోచు తలపునన్ = రక్షించే ఉద్దేశ్యముతో, అక్కటికము = దయ, మిక్కుటమై = అధికమయి, పిక్కటిల = బయల్పడగా, వెఱపు మానిపిన = భయమును పోగొట్టిన, ఎక్కటికిన్ = వీరునికి.

**తా :** బాధతో వెళ్ళి కుఱ్ఱ తపసి నమస్కరించగా అయ్యో అని వానిని రక్షించదలచి, మిక్కిలి దయతో వాని భయమును పోగొట్టిన వీరుడైన శివునికి–

**25 క.** **మలఁ బ్రోలు నొ్మలఁ దోలుం**
**దల జాలు నొ్మనల వాలుఁ దరలని మేలుం**
**దెలి డాలు నె్మకమెలసిన**
**వల కేలుం గలిగి చెలఁగు వన్నెలగనికిన్**

మలన్ = పర్వతము, ప్రోలు = పట్టణము, మొలన్ = నడుమునందు, తోలు = గజ చర్మమును, తల = తలయందు, జాలు = నదియును, మొనల వాలు = త్రిశూలము ఆయుధమును, తరలని = తరగని, మేలున్ = ఉపకారమును, తెలిడాలున్ = తెల్లని దేహమును, మెకము ఎలసిన = లేడిపిల్లను కలిగిన, వలకేలన్ = ఎడమచేయియు, కలిగి= ఉండి, చెలగు = ఒప్పునట్టి, వన్నెల గనికిన్ = పలు చిన్నెలుగల నిధికి.

**తా :** కొండ నివాసము, వస్త్రము గజచర్మము, తలపై ప్రవాహము, త్రిశూలము ఆయుధము, తరగని మంచి, తెల్లని దేహము, ఎడమచేతిలో లేడి కలిగి పలువన్నెల నొప్పు నిధి శివునికి–

**26 క.** **జేజేరా ఱా బాజు జ**
**గాజిగి నొగిఁ దెగడి నెగడఁగాఁ జాలెడు మే**
**ల్తే జూనెడు కుత్తుక గల**
**జేజేకు నొ్మగిలుదారి సిగ జేజేకున్**

జేజే రా ఱా = ఇంద్రనీలమణి, బాజు = కాంతి, జగాజిగిన్ = వర్చస్సును, ఒగి తెగడి = క్రమముగా తిరస్కరించి, నెగడగా జాలెడు = అతిశయింపగా చాలినట్టి, మేల్ = మిక్కిలి అధికమైన, తేజూనెడు = కాంతిని వహించిన, కుత్తుక కల = కంఠముకల, జేజేకున్ = దేవునకు (శివునకు), మొగులు దారి = ఆకాశము, సిగ = శిఖగాకల, జేజేకున్ = దేవునకు.

**తా :** ఇంద్రనీలమణి కాంతిని తిరస్కరించ జాలినట్టి కాంతికల కంఠమున్న దేవునికి, ఆకాశము సిగగాకల దేవునికి శివునికి–

# బాల కాండము

**తే.గీ.** **అప్పనంబుగ నా నేర్చు నట్లొనర్పఁ**
**గడఁగు నిప్పున్నియపు బలు కబ్బమునకుఁ**
**గత తెఱంగెట్టులన్న ము న్గలను దిండి**
**తపసిఁ గని కల్గు కానుపు తపసి పలికె** **1**

అప్పనంబుగన్ = సమర్పణముగా, నా నేర్చునట్లు = నాకు తెలిసిన విధముగా, ఒనర్పన్ = కూర్చుటకు, కడగున్ = ప్రయత్నించుచున్న, ఈ పున్నియపు = ఈ పుణ్యకరమైన, బలు కబ్బమునకు = గొప్ప కావ్యానికి, కత తెఱంగు = కథా విధానము, ఎట్టులన్నన్ = ఏ ప్రకారముగా అనగా,

మును = పూర్వము, కలను తిండి = కలహ భోజనుడగు, తపసిన్ = మునిని (నారదుడు), కని = చూచి, కలుగు కానుపు తపసి = పుట్టలో పుట్టిన ముని (వాల్మీకి), పలికె = పలికెను.

**తా :** శివునికి సమర్పణముగా నాకు తెలిసిన విధముగా కూర్చుటకు ప్రయత్నించుచున్న ఈ మహనీయ కావ్యమునకు కథా విధానము ఎట్టులనగా – పూర్వము కలహ భోజనుడగు నారదుని చూచి పుట్టలో పుట్టిన వాల్మీకి పలికెను.

**సీ.** **జడదారిరాయ! యిజ్జగమున నాడెంపు**
**గొనమును వాఁడియుఁ గనికరమును**
**నిక్కువపుం బల్కుఁ జక్కఁదనంబును**
**దెలివియుఁ జాగంబుఁ దేజుఁ బెంపు**
**గలిమియు బలిమియుఁ గడిఁది నిచ్చలమును**
**గొలమును దిటమును వలఁతితనము**
**మేలిమియును నెల్ల మెయిదాల్పు పిండుల**
**యెడ నెయ్యమును జాల నేడ్తెఱయును**

**తే.గీ.** **గలుగు మానిసి యెవ్వఁడు గలఁడు వాని**
**కత వెడం దగ నా కెఱుఁగంగఁ బల్క**
**వలయునని వేఁడుకొనిన నన్నలువ పట్టి**
**చిలువ పట్టునఁ బుట్టిన బలియుఁ గాంచి** **2**

జడదారి రాయ = మునిశ్రేష్ఠుడా నారదా!, ఈ జగమున = ఈ లోకంలో, నాడెంపు గొనమును = శ్రేష్ఠమైన గుణమును, వాడియున్ = శౌర్యమును, కనికరమును = దయయును, నిక్కువపుం పల్కున్ = నిజము పలుకుటయును, తెలివియు = జ్ఞానమును, చాగంబు = త్యాగమును, తేజున్ పెంపున్ = కీర్తి ఆధిక్యమును, కలిమియున్ = సంపదయును, బలిమియున్ = బలమును, కడిది = గొప్ప, నిచ్చలమున్ = నిశ్చయత్వమును, కొలమును = వంశమును, దిటమును = ధైర్యమును, వలతితనమున్ = సాహసమును, మేలిమియున్ = శ్రేష్ఠత్వమును, ఎల్ల మెయి తాల్పు పిండుల ఎడ = సమస్త ప్రాణుల సమూహమునందు, నెయ్యమును = స్నేహమును, చాలన్ ఏడ్తెఱయును = గొప్ప పరాక్రమమును, కలుగు = కలిగినటువంటి, మానిసి, ఎవ్వడు కలడు = ఎవరున్నారో?, వాని కత = వాని కథను, వెడందగ = విపులముగా, నాకు ఎఱుగంగన్ = నేను తెలుసుకొనేలా, పల్కవలయున్ = చెప్పవలెను, అని వేడుకొనినన్ = అని వేడుకొనగా, ఆ నలువ పట్టి = ఆ నారదుడు, చిలువ పట్టునన్ పుట్టిన = పామునకు స్థానమైన పుట్టలో పుట్టిన, బలియున్ = సమర్థుని, కాంచి = చూచి.

**తా :** మునిశ్రేష్ఠా! ఈ లోకంలో శ్రేష్ఠమైన గుణములు, శౌర్యము, కరుణ, సత్యము, జ్ఞానము, త్యాగము, గొప్పకీర్తి, సంపద, బలము, నిశ్చయత్వము, వంశము, ధైర్యము, సాహసము, శ్రేష్ఠత్వము, స్నేహము, పరాక్రమము కలిగినటువంటి మనుజుడెవ్వరైనా ఉన్నారా? ఉంటే వాని కథను నాకు తెలిసేలా వివరంగా చెప్పు అని వేడుకొనగా ఆ నారదుడు వాల్మీకిని చూచి –

**తే.గీ.** **పెను తపసితేఁడ! నీ వడిగిన తెఱఁగునఁ**
**దనరు మానిసితేని చందంబు నీకు**
**దెలియ నెఱిఁగింతు నిఁకఁ బెఱతలఁపు మాని**
**వినుము మేల్బంతినని యిట్టులనుచుఁ బలికె** **3**

పెను తపసి తేడ = గొప్పతపసి శ్రేష్ఠా!, నీవు అడిగిన తెఱగునన్ = నీవు అడిగిన విధముగా, తనరు = ఒప్పునట్టి, మానిసి తేని = మనుజ శ్రేష్ఠుని, చందంబు = విషయము, నీకు = నీకు, తెలియన్ ఎఱిగింతు = తెలిసేలా చెబుతాను, ఇక = ఇంక, పెఱ తలపు మాని = ఇతర ఆలోచనలు మానివేసి, మేలు బంతిన్ = శ్రేష్ఠమగుదానిని, వినుము అని = వినుమని, ఇట్టులు అనుచు = ఇలాగ అని, పలికె = పలికెను.

**తా :** ఓ మునిశ్రేష్ఠా! నీవు అడిగిన విధముగా ఒప్పునట్టి మనుజశ్రేష్ఠుని విషయము నీకు తెలిసేలా చెబుతాను, ఇతర ఆలోచనలు మాని శ్రేష్ఠమైనదానిని విను అని పలికెను.

**కం.** **ఉడివోని సిరుల కిరవై**
**యడరుచు నిరునాల్గు కడల నరుదుగ నెల్ల**
**ప్పుడుఁ గడుఁ బొగడంగాఁ దగి**
**పుడమిపయి నయోధ్య యనఁగ బ్రోల్వెలుఁగొందున్** **4**

పుడమి పయిన్ = భూమి మీద, ఉడిగి+పోని = నశించని, సిరులకు = సంపదలకు, ఇరవై = స్థానమై, అడరుచు = ఒప్పుచు, ఇరు నాల్గు కడలన్ = ఎనిమిది దిక్కుల యందును, అరుదుగన్ = అబ్బురముగా, ఎల్లప్పుడున్ = ఎల్లకాలమును, కడు పొగడంగా తగి = మిక్కిలి పొగడబడుటకు తగినదై, అయోధ్య అనగన్ = అయోధ్య అని పిలువబడే, ప్రోలు = నగరము, వెలుగు ఒందున్ = ప్రకాశించును.

**తా :** ఈ భూమిపై సకల సంపదలకు స్థానమై, అష్టదిక్కులలో పొగడబడుటకు తగినదై అయోధ్య అనే నగరము ప్రకాశిస్తోంది.

**తే.గీ.** **లలి నిరాబారులే యుండు నలువ ప్రోలు**
**బలిసి విసదారులుండు పెంజిలువ ప్రోలు**
**కూడు నిదురయు నెపుడుఁ జేకూఱకుండు**
**వేలుపుల ప్రోలు నమ్మేటి వీటి కెనయె?** **5**

లలిన్ = క్రమముగా, నిరాబారులే = తపస్వులే, ఉండు = ఉండునట్టి, నలువ ప్రోలు = సత్యలోకమును, బలిసి = వ్యాపించి, విసదారులు = పాములు, ఉండు = నివసించు, పెను చిలువ ప్రోలు = ఆదిశేషుని పాతాళమును, కూడు నిదురయు = భోజనము, నిద్రయును, ఎపుడున్ చేకూఱకుండు = ఎప్పుడును లభింపనట్టి (ఆహార,నిద్రాదులు అవసరంలేని), వేలుపుల ప్రోలు = దేవతల అమరావతియును, ఆ మేటి వీటికి = ఆ మేలయిన అయోధ్యా నగరమునకు, ఎనయె = సాటియగునా? (గృహస్థులకు, సజ్జనులకు, భోగములకు అయోధ్య వాసస్థానమనుట)

**తా :** తపస్వుల నిలయమైన బ్రహ్మ పట్టణము, పాముల నిలయమైన పాతాళము, దేవతల నిలయమైన స్వర్గము ఆ అయోధ్యా నగరానికి సాటిరావు.

**తే.గీ. పుడమి నెన్నికగా ముత్తి నిడఁగ జాలి**
**పొదలు సతప్రోళ్ళయందును మొదలి దగుచు**
**నొరుల కేరికి గెలువ రాకుండినట్టి**
**కడిఁది పేర్మోచి యా ప్రోలు కరము మెఱయు 6**

పుడమిన్ = భూమియందు, ఎన్నికగా = ఎంచబడినదై, ముత్తిన్ ఇడగన్ చాలి = ముక్తిని ఇచ్చుటకు సమర్థమైనదై, పొదలు = ఒప్పునట్టి, సత ప్రోళ్ళ యందును = ఏడు పుణ్యక్షేత్రముల యందును, మొదలిది అగుచున్ = ముందున్నదగుచు, ఒరులకు = ఇతరులకు, ఏరికిన్ = ఎవరికిని, గెలువన్ రాక ఉండును అట్టి = గెలుచుటకు వీలుకానట్టి, కడిది = గొప్ప, పేరు మోచి = కీర్తిని గడించి, ఆ ప్రోలు = ఆ పట్టణము, కరము మెఱయు = మిక్కిలి ప్రకాశించును.

తా : భూమిపై ఎంచబడినదై, ముక్తి నిచ్చుటకు సమర్థమైనదై, ఒప్పునట్టి ఏడు నగరములలోను ముందున్నదై, ఎవరికిని జయించుటకు శక్యముకానిదై కీర్తివంతమై ఆ పట్టణము ప్రకాశించును.

**సీ. పెనురాచ ముంగిళ్ళఁ బెంపుడు తోఁటల**
**మావులు మావులు ప్రోవు మీఱ**
**నాడెంపుఁ గోటల నాగవాసమ్ముల**
**గొమ్మలుఁ గొమ్మలు గొనబుఁ జూప**
**గరితల ఓొమ్ముల గడితంపు గోడలఁ**
**బట్లును బట్లును బసఁ బొసంగ**
**దొడ్డి పట్టుల దొడ్డ దొరసానుల యొడళ్ళ**
**సొమ్ములు సొమ్ములు సొంపు నెఱప**

**తే.గీ. నంగడులఁ జేలఁ దద్దయు రంగెసంగి**
**ముత్తెసరులును బరువంపు ముత్తెసరులు**
**వరలఁ దరలని సిరులఁ బల్మఱును మొఱసి**
**వీఁడలరు వేల్పురానెల వీడు గాఁగ 7**

పెను రాచ ముంగిళ్ళన్ = పెద్ద రాజగృహముల ముందు భాగములందును, పెంపుడు తోటలన్ = పోషింపబడుచున్న తోటలయందును, మావులు = గుఱ్ఱములు, మావులు = మామిడి చెట్లు, ప్రోవు మీఱన్ = గుంపులుగా అతిశయింపగా, నాడెంపున్ = నాణ్యమైన, కోటలన్ = కోటలయందును, నాగవాసమ్ములన్ = వేశ్యా నివాసములందును, కొమ్మలు = బురుజులు, కొమ్మలు = స్త్రీలు, గొనబు చూపన్ = సౌందర్యమును చూపగా, గరితల ఓొమ్ముల = స్త్రీల ఓొమ్ములయందును, గడితంపు గోడలన్ = బలమైన గోడలయందును, పట్లు = పరిమళ పూతలును, పట్లు = దృఢత్వమును, పసన్ పొసంగన్ = సారమును చూపగా, దొడ్డిపట్టులన్ = పెరటి

ప్రదేశములందు, దొడ్డ దొరసానుల ఒడళ్ళన్ = రాణివాసపు స్త్రీల దేహములందును, సొమ్ములు = గోధనమును, సొమ్ములు = ఆభరణములును, సొంపు నెఱపన్ = అందగింపగా, అంగడులన్ = దుకాణములందును, చేలన్ = పంటచేలయందును, తద్దయున్ = ఎక్కువగా, రంగు ఎసంగి = కాంతి కలిగి, ముత్తెసరులును = ముత్యాల హార ములును, పరువంపు ముత్తెసరులు = పండిన ధాన్యవిశేషములును, వరలన్ = ఒప్పుచుండగా, తరలని సిరులన్ = తొలగని సంపదలతో, పల్మఱును మొఱసి = ఎల్లప్పుడు ప్రకాశించి, వేల్పు రానెలవీడు కాగ = దేవతల రాజధానిగా (అమరావతిగా), అలరున్ = ఒప్పును.

**తా :** ఆ నగరపు రాజగృహముల ముందు గుఱ్ఱములు, చక్కగా పెంచబడుచున్న తోటలలో మామిడి చెట్లు గుంపులుగా ఉంటాయి. కోటలయందలి బురుజులు, వేశ్యా నివాసములందలి స్త్రీలు సుందరములు, స్త్రీల వక్షస్థలములు లేపనములచేతను, గోడలు దృఢత్వముచేతను సారభూతములు, పెరళ్ళు గోసంపదచేతను, రాణుల దేహములు ఆభరణముల చేతను అందగించును, దుకాణములు ముత్యాలహారముల చేతను, పంటచేలు పండిన ధాన్య విశేషములచేతను ఒప్పుచుండును. తరగని సంపదలతో ఆ అయోధ్య అమరావతిని తలపించును..

**సీ.** **మేడలా రతనంపు గోడలా యపరంజి**
**బేడలా యే వాడఁ బెంపెసంగు**
**మావులా బలితంపు టావులా చెంగల్వ**
**బావులా యే క్రేవఁ బసఁ దనర్చుఁ**
**గోటలా తుదిలేని పేటలా నెఱి యాట**
**పాటలా యెచ్చోట నీటుఁ జూపు**
**నట్టులా మగఱాల గట్టులా పచ్చ ఱా**
**కట్టులా యే పట్ల బిట్టు మెఱయుఁ**

**తే.గీ.** **దేరులా కొమ్ముటేనుఁగు బారులా ప**
**సారులా చొక్కటపు రాచదారులా కొ**
**టారులా పైరులా గొనబారు నౌర!**
**ప్రోలి యొయ్యార మేరికిఁ బొగడ నరిది** **8**

ఔర = ఆహా!, మేడలా = మేడలందుమా!, రతనంపు గోడలా = రత్నాల గోడలందుమా!, అపరంచి బేడలా = బంగారు నాణెములందుమా!, ఏ వాడన్ = ఏ వీథిలోనైనను, పెంపు ఎసగు = గొప్పగా ఉంటాయి, మావులా = గుఱ్ఱములందుమా!, బలితంపు ఆవులా = బలిసిన ఆవులందుమా!, చెంగల్వ బావులా = ఎఱ్ఱకలువల చెఱువులందుమా!, ఏ క్రేవన్ = ఏ వైపు చూచినను, పస తనర్చు = అందము నతిశయించును, కోటలా = కోటలందుమా!, తుదిలేని పేటలా = సుదీర్ఘములైన పేటలందుమా!, నెఱి అటపాటలా = చక్కనైన ఆటపాటలందుమా!, ఎచ్చోట = ప్రతిచోట, నీటున్ చూపు = అందమును ప్రదర్శించును, నట్టులా =

వాసస్థానములందుమా!, మగఱాల గట్టులా = వజ్రాల సోపానము లందుమా!, పచ్చ ఱాకట్టులా = గరుడపచ్చ కట్టడములందుమా!, ఏ పట్ల = ఏ ప్రదేశము నందైనను, బిట్టు మెఱయున్ = బాగుగా ప్రకాశించుచుండును, తేరులా = రథములందుమా!, కొమ్ము ఏనుగు బారులా = మగ ఏనుగుల వరుసలందుమా!, పసారులా = అంగడులందుమా!, చొక్కటపు రాచదారులా = సుందరమైన రాజమార్గములందుమా!, కొటారులా = ధాన్యాగారములందుమా!, పైరులా = పంటచేలందుమా!, గొనబారును = మనోజ్ఞముగా నుండును, ప్రోలి ఒయ్యారము = ఆ పట్టణ సౌందర్యము, పొగడన్ = స్తుతించుటకు, ఏరికిన్ = ఎవరికయినను, అరిది = అశక్యము.

**తా :** ఏ వీథిలోనైనా మేడలు రత్నాల గోడలతో, బంగారు నాణెములతో గొప్పగా ఉంటాయి. ఏవైపు చూచినా గుఱ్ఱాలతో, గోవులతో, దిగుడుబావులతో అతిశయిస్తూంటాయి. కోటలతో, పేటలతో, ఆటపాటలతో అందగిస్తూంటాయి. వాసస్థానములన్నచో ఏ ప్రక్క చూసినను వజ్రాల సోపానములతో, గరుడపచ్చ కట్టడములతో ప్రకాశిస్తూంటాయి. రథములు, ఏనుగులు, అంగడులు, సుందర రాజమార్గములు, ధాన్యాగారములు చక్కని అమరికలతో మనోజ్ఞముగా ఉంటాయి. ఆ  నగర సౌందర్యమును వర్ణించుటకు ఎవరికిని శక్యముకాదు.

**మ.** **అలరుం బున్నమ రేలు మేల్హొయలుచే నవ్వీటి గాటంపు క్రొ**
**న్నెల ఱా మేడల నాడు చేడియలు పూన్కిం జెంతఁ గన్పట్టు వే**
**ల్పుల బువ్వం దెలి నిల్వుటద్దమని కేలుందమ్ములం బట్ట ని**
**మ్ములఁ గందందెనుగాక యందుఁ గలదే మున్నిఱ్ఱియు న్మఱ్ఱియున్ 9**

అలరున్ = ప్రకాశించు, పున్నమ రేలు = పున్నమి రాత్రులు, మేల్ హొయలుచేన్ = గొప్ప విలాసముతో, ఆ వీటి = ఆ పట్టణమునందలి, గాటంపు = గట్టివియైన, క్రొన్నెల ఱా మేడలన్ = చంద్రకాంత శిలానిర్మితమైన మేడలపై, ఆడు = ఆడుకొంటున్న, చేడియలు = స్త్రీలు, పూన్కిం = పూనుకొని, చెంతన్ = సమీపముననే, కన్పట్టు = కనబడుచున్న, వేల్పుల బువ్వన్ = అమృత కిరణుడు కనుక దేవతలకు ఆహారము (చంద్రుని), తెలి నిల్వు అద్దము అని = నిర్మలమైన నిలువుటద్దమని, కేలుం తమ్ములం పట్టన్ = పద్మముల వంటి చేతులతో పట్టుకొనగా, ఇమ్ములన్ = స్పష్టముగా, కందు అందెను కాక = మచ్చ పడిందే కాని, మున్ను = ఈ స్త్రీలు తాకక ముందు, అందున్ = ఆ చంద్రునిలో, ఇఱ్ఱియున్ = లేడియును, మఱ్ఱియున్ = మఱ్ఱిచెట్టును, కలదే = ఉన్నదా?

**తా :** పున్నమి రాత్రులందు ఆ నగరమున చంద్రకాంతశిలానిర్మితమైన మేడలపై ఆడు కొంటున్న స్త్రీలు తమ సమీపముననే కనబడుచున్న చంద్రుని నిర్మలమైన నిలువుటద్దమని భావించి పద్మములవంటి తమ చేతులతో పట్టుకొనగా మచ్చ పడిందే కాని అంతకు ముందు ఆ చంద్రునిలో జింక లేదు, మఱ్ఱి లేదు (ఆ మేడలు అంత ఎత్తుగా ఉన్నాయి).

**తే.గీ.** **పూని యా ప్రోలి మేలి కడాని కోట**
**వాసియు నగడ్త లోతును వలను మీఱఁ**

**జూడఁ జెప్పఁగ నరిదియౌఁ జుమ్ము వేయు**
**కన్నులును నోళ్ళుగల నేర్పుకాంద్రకైన 10**

ఆ ప్రోలి = ఆ అయోధ్యా నగరముయొక్క, మేలి = శ్రేష్ఠమైన, కడాని కోట = బంగారు కోటయొక్క, వాసియు = ఆధిక్యమును, అగడ్త = కందకము యొక్క, లోతును, వలను మీఱన్ = మిక్కిలి నైపుణ్యముతో, చూడన్ = చూచుటకును, చెప్పగన్ = చెప్పుటకును, వేయు కన్నులును = వేయి కన్నులును (ఇంద్రుడు), నోళ్ళు = వేయి నోళ్ళును (ఆదిశేషుడు), కల, నేర్పుకాంద్రకు ఐన = నేర్పరులకైనను, అరిది ఔను చుమ్ము = అశక్యమే సుమా!

**తా :** ఆ అయోధ్య నగర బంగారు కోట ఆధిక్యమును చూచుటకు వేయి కనులున్న ఇంద్రునకును శక్యము కాదు. కందకము లోతును చెప్పుటకు వేయి నోళ్ళున్న శేషునకును సాధ్యముకాదు.

**ఉ. అందలి కత్తలాని గమి నందఁగ గాడుపు తట్టువాలు వే**
**పందెము వైచి పర్వులిడు పట్టున నోడియ కాదె లేళ్ళు బ**
**ల్గొందలమంది పూరిఁ దినుకొంచును రిత్తయ జంకి చూచుచుం**
**బందతనంబు మీఱఁ గడుఁ బాఱఁ దొడంగెను నాఁటనుండియున్ 11**

అందలి = ఆ అయోధ్యాపురమందలి, కత్తలాని గమి = (గిట్టలు,తోక తెలుపుకల) నల్లని గుఱ్ఱముల సమూహమును, అందగన్ = వేగమును అందుకొనుటకు, గాడుపు తట్టువాలు = వాయుదేవుని వాహనమైన లేడి, వే = వేగమున, పందెము వైచి = పందెం కాసి, పర్వులు ఇడు = పరుగెత్తే, పట్టునన్ = సమయమున, ఓడియ కాదె = ఓడిపోయి కదా!, లేళ్ళు, బల్ కొందలము అంది = బాగా కలతచెంది, నాట నుండియున్ = ఆనాటినుండియును, పూరిన్ = గడ్డిని, తినుకొంచును = తినుచూ, రిత్తయ = ఊరకనే, జంకి చూచుచున్ = భయపడి చూస్తూ, పందతనంబు మీఱన్ = మిక్కిలి పిరికితనంతో, కడున్ = మిక్కిలి, పాఱన్ తొడంగెను = పరుగెత్తసాగెను.

**తా :** ఆ నగరమందలి గుఱ్ఱముల వేగాన్ని అందుకోవడానికి వాయువు వాహనమగు లేడి పందెమువేసి పరుగెత్తే సమయంలో ఓడిపోయింది. దానితో కలతచెంది ఆనాటి నుండి గడ్డిని తింటూ, ఊరకనే భయంగా చూస్తూ, పిఱికితనంతో పరుగెడుతోంది.

**కం. కడలేని వ్రేగు మోచుచుఁ**
**గడగండ్లం బడియెఁగాక కడ యేనుఁగు లి**
**ట్లొడయల బ్రతికించునె యె**
**య్యెడలనునని కేరుఁ బ్రోలి యేనుఁగు గున్నల్ 12**

కడలేని = హద్దులేని, వ్రేగు మోచుచున్ = బరువును మోయుచు (భూ భారాన్ని మోస్తూ), కడగండ్లన్ పడియెకాక = కష్టములు పడ్డాయికనుక కాని, కడ ఏనుగులు = దిక్కుల యందలి ఏనుగులు, ఇట్లు = ఇక్కడి ఏనుగులవలె, ఏ ఎడలను = ఏ సమయమునందైనను, ఒడయలన్ = యజమానులను, బ్రతికించునె = రక్షించునా?, అని = ఈ ప్రకారముగా, ప్రోలి = పట్టణమునందలి, ఏనుగు గున్నల్ = గున్న ఏనుగులు, కేరున్ = చెలరేగును.

**తా :** 'మోయలేని బరువును మోస్తూ కష్టపడటమేకాని దిగ్గజములు అయోధ్యలోని ఏనుగుల వలె ఏ సమయంలోనూ యజమానులను రక్షింపలేవు' అని గున్న ఏనుగులు చెలరేగును.

**చం.** **పలుకు వెలందికిన్ మనికిపట్టగు చాలుపు మోము దామర**
**ల్గలిగియుఁ బ్రాఁత పల్కులు చొకాటముగా నుడువంగ నేరకే**
**తల దెగ వ్రేటులం బడియెఁ దానొక నేరుపుకాడె యంచు న**
**న్నలువను మాటిమాటికిని నవ్వుదు రచ్చటి నేలవేలుపుల్** **13**

పలుకు వెలందికిన్ = సరస్వతీదేవికి, మనికిపట్టగు = నివాసస్థానమైన, చాలుపు = వరుసగా నున్న, మోము తామరల్ కలిగియున్ = పద్మములవంటి ముఖములు కలిగియును, ప్రాత పల్కులు = వేదములను, చొకాటముగాన్ = స్పష్టముగా, నుడువంగ నేరకే = చెప్పలేకే, తల తెగ వ్రేటులన్ పడియెన్ = తల తెగేలా దెబ్బలు పడ్డాడు, తాను ఒక నేరుపుకాడె అంచున్ = తాను ఒక నైపుణ్యము కలవాడా? అని, ఆ నలువన్ = ఆ బ్రహ్మదేవుని, అచ్చటి = అక్కడ ఉండే, నేలవేలుపుల్ = బ్రాహ్మణులు, మాటిమాటికిని, నవ్వుదురు = హేళన చేయుదురు.

**తా :** 'సరస్వతికి నిలయమై పలు ముఖములు కలిగియున్నను వేదములను స్పష్టముగా పలుకలేక తల పోగొట్టుకున్నాడు' అని బ్రహ్మను అక్కడి బ్రాహ్మణులు హేళనచేస్తారు.

**తే.గీ.** **కఱకుఁ జూపక వ్రంతలు గనక నెత్త**
**ములఁ బొరలు పెనుబాముల మొగి నలుగక**
**వేల్పుదొరకైన వెఱవక వెలయు నచటి**
**పుడమి దాలుపు గమి హెచ్చు పొగడ నరిది** **14**

అచటి = అక్కడి, పుడమి తాలుపు గమి = క్షత్రియ సమూహము, (పర్వతమువలె) కఱకున్ చూపక = కాఠిన్యమును ప్రదర్శింపక, వ్రంతలు కనక = లోయల నెంచక, నెత్తములన్ = సమత్వముతో, పొరలు = ఒప్పుచు, పెను బాముల మొగి = పెద్ద ఆపదలు సంభవించిన, నలుగక = మనసులో నలిగిపోక, వేల్పుదొరకైన వెఱవక = ఇంద్రునికైనను భయపడక, వెలయున్ = ఒప్పునట్టి, హెచ్చు = వారి ఆధిక్యమును, పొగడన్ = పొగడుటకు, అరిది = అశక్యము.(పుడమి తాలుపు = రెండర్థములు 1. భూమిని ధరించేది పర్వతము, 2. భూభారం మోసేవాడు రాజు).

**తా :** అక్కడి క్షత్రియులు కొండలవలె కాఠిన్యమును చూపక, లోపముల నెంచక, సమత్వముతో ఒప్పుచు, పెను కష్టములు సంభవించినా నలిగిపోక, ఇంద్రునికైనా భయపడక ఒప్పుచుందురు. వారి ఆధిక్యమును పొగడుట అశక్యము.

కొండలు కఠినముగా నుండును, ఎత్తు పల్లముల లోపములు కలిగియుండును, క్రూర జంతువులు, పాములవంటివాటితో భీకరముగా నుండును, తుఫానులు, దావాగ్నులు కష్టములు సంభవించును, ఇంద్రుడన్న భయము – రాజులకు ఈ లక్షణము లేదనుట.

**తే.గీ.** **ముత్తియంబులు బగడముల్ మొదలు గలుగు**
**మానికములకు సిరికిని మనికి యగుచుఁ**

**గొలుచు రొక్కంబుఁ గలుములుఁ జెలఁగ నుండుఁ**
**గడిఁది కోమటి రతనంపు గనులు వీట** **15**

వీటన్ = ఆ పట్టణమునందు, ముత్తియంబులు = ముత్యాలు, పగడముల్ = పగడాలు, మొదలు కలుగు = మొదలుగా కల, మానికములకు = మాణిక్యములకు, సిరికిని = సంపదలకును, మనికి అగుచు = స్థానమగుచు, కొలుచు = ధాన్యము, రొక్కంబున్ = ధనమును, కలుములన్ = భాగ్యములతో, రతనంపు గనులు = రత్నాల గనులవంటి, కోమటి = వైశ్యులు, కడిది = మిక్కిలి, చెలగన్ ఉండు = సుఖముగానుందురు.

**తా :** ఆ పట్టణమున వైశ్యులు రత్నాల గనులు. ముత్యాలు, పగడాలు మొదలైన మాణిక్యముల సంపదలకు స్థాన మగుచు ధన, ధాన్య భాగ్యములతో మిక్కిలి సుఖవంతులు

**కం.** **నిలుతురు నిక్కము తోడుగఁ**
**గొలుతురు తగ జన్నిగట్లఁ గొంకక పగఱం**
**గెలుతురు బలితపుఁ గలుములఁ**
**బొలుతురు నెఱి నచటి యడుగుపుట్టువు పెద్దల్** **16**

అచటి = ఆ అయోధ్యపురమునందలి, అడుగుపుట్టువు పెద్దల్ = శ్రేష్ఠులైన శూద్రులు, నిక్కము తోడుగన్ = సత్యమునే నమ్ముకుని, తగన్ జన్నిగట్లన్ = తగినరీతిగా బ్రాహ్మణులను, కొలుతురు = సేవిస్తారు, కొంకక = వెనుదీయక, పగఱన్ = శత్రువులను, గెలుతురు = గెలుస్తారు, బలితపున్ కలుములన్ = అధికమైన సంపదలతో, నెఱిన్ = రమ్యముగా, పొలుతురు = ప్రకాశిస్తారు.

**తా :** ఆ అయోధ్యలోని శూద్రులు సత్యమునే నమ్ముకొని తగిన రీతిగా యజమానులను సేవిస్తూంటారు. వెనుదీయక శత్రువులను గెలుస్తారు. అధికమైన సంపదల ననుభవిస్తారు.

**తే.గీ.** **తేజు గలవారి నెందును దినుసు లేని**
**ఠీవి గలవారిఁ గూడియుండియు నొకింత**
**వంకయును మచ్చయును గలవారిఁ దెగడి**
**యాటవెలఁదుల గమి పొల్చు వీట నెపుడు** **17**

వీటన్ = ఆ పట్టణమున, ఎపుడు = ఎల్లప్పుడును, తేజు కలవారిన్ = కీర్తిశాలురను, ఎందును దినుసులేని = ఏ మాత్రమును సంపదలేని, ఠీవి కలవారిన్ = వైభవము కలవారిని, కూడియుండియున్ = కలిసియుండియు, ఒకింత = కొంచెము, వంకయును = ప్రవర్తానా లోపమును, మచ్చయును = దోషమును, కలవారిన్ = ఉన్నవారిని, తెగడి = తిరస్కరించి, ఆటవెలదుల గమి = వేశ్యాసమూహములు, పొల్చు = ఒప్పును.

**తా :** ఆ నగరమునందలి వేశ్యలు సంపన్నులను, లేనివారైనను వైభవము కలవారిని కూడి ఉంటారు. అలాగే ప్రవర్తనా లోపము, దోషము కలవారిని తిరస్కరిస్తూంటారు.

**తే.గీ.** **అట్టి ప్రోలికి నేలికయగుచు నెల్ల**
**నేలఱేఁడులు తను మేలు మేలటంచుఁ**

**బొగడ మగుడని కలుముల నెగడి ప్రజలఁ**
**దద్దయును సాఁకుకొనుచుండు దశరథుండు** **18**

అట్టి ప్రోలికిన్ = అటువంటి పట్టణానికి, ఏలిక అగుచున్ = పాలకుడగుచు, ఎల్ల నేల ఱేడులు = అందరు భూపాలురు, తను = తనను, మేలు మేలు అటంచున్ = బాగు బాగు అనుచు, పొగడ = స్తుతింపగా, మగుడని కలుముల = తరుగని సంపదలతో, నెగడి = అతిశయించి, ప్రజలన్ = ప్రజలను, తద్దయును = మిక్కిలి ప్రేమతో, దశరథుండు = దశరథుడు, సాఁకుకొనుచుండు = పరిపాలించుచుండును,

**తా :** అట్టి పట్టణానికి పాలకుడగుచు, రాజులందరు తనను పొగడుచుండగా, సకల సంపదలతో అతిశయించి దశరథుడు ప్రజలను ప్రేమతో పరిపాలించుచుండెను.

**సీ.** **పిఱికితనంబును గుఱిదప్పి చనుటయు**
**వెఱపును మఱుపును గొఱకొఱయును**
**గఱకును బేదల నఱముటయును బెఱ**
**తెఱవలపయిఁ జూడ్కి వఱపుటయును**
**ముఱిచెడి దురమున విఱుగుటయును వీఁగి**
**పిఱుఁదఁ జేరినవారిఁ జెఱచుటయును**
**దెఱపి చూపక మ్రోల గిఱికొని విద్దెలఁ**
**గొఱలు వారల రిత్త మొఱఁగుటయును**

**తే.గీ.** **తఱిపనుల్ నెఱిఁ జేయక యిఱుకుటయును**
**మఱియుఁ గొఱమాలి పెద్దల తెఱఁగరయక**
**యఱమఱల్ చేసి యామున వఱలుటయును**
**గొఱఁత వడుటయు నెయ్యెడ నెఱుఁగ డతఁడు** **19**

అతడు = ఆ దశరథుడు, పిఱికితనంబును, గుఱితప్పి చనుటయు = లక్ష్యం గురితప్పిపోవడం, వెఱపును = భయమును, మఱుపును = మాటయిచ్చి మరచిపోవుటయును, కొఱకొఱయును = కోపమును, కఱకును = కఠినత్వమును, పేదలన్ అఱముటయును = పేదలను అణగద్రొక్కుటయును, పెఱ తెఱవలపయిన్ = పరాయి స్త్రీలపై, చూడ్కి వఱపుటయును = చూపులు సారించుటయును, ముఱిచెడి = ధైర్యమును కోల్పోయి, దురమున = యుద్ధమున, విఱుగుటయును = వెనుతిరుగుటయును, వీగి = చలించి, పిఱుదన్ = తన వెనుక, చేరినవారిన్, చెఱచుటయును = పాడుచేయుటయును, తెఱపి చూపక = అవకాశమీయకుండ, మ్రోలన్ = తన సమీపమునందు, గిఱికొని = వ్యాపించి, విద్దెలన్ = తమతమ విద్యలను, కొఱలు వారలన్ = ప్రదర్శించువారలను, రిత్త మొఱగుటయును = వ్యర్థముగా వంచించుటయును, తఱి పనుల్ = సమయమునకు చేయవలసిన పనులు, నెఱిన్ = చక్కగా, చేయక = చేయకుండా, ఇఱుకుటయును = ఇరకాటములో పడుటయును, మఱియున్ = ఇంకను, కొఱమాలి =

పనికిమాలి, పెద్దల తెఱగు అరయక = పెద్దల మార్గము తెలియక, అఱమఱల్ చేసి = వ్యతిరేకముగా ప్రవర్తించి, ఆమునన్ = పొగరుతో, వఱలుటయును = ప్రవర్తించుటయును, కొఱతపడుటయున్ = తక్కువతనము పొందుటయును, ఏ ఎడన్ = ఏ సమయమునందును, ఎఱుగడు = తెలియడు.
**తా :** ఆ దశరథునకు పిఱికితనము, లక్ష్యము తప్పిపోవుట, మఱచిపోవుట, కోపము, కఠినత్వము, పేదల నణగద్రొక్కుట, పరస్త్రీ వ్యామోహము, యుద్ధమున వెనుతిరుగుట, తన వెనుక చేరినవారిని పాడుచేయుట, అవకాశమీయక తమ తమ విద్యలను ప్రదర్శించు వారలను నిందించుట, సమయమునకు చేయవలసిన పనులు చేయక ఇరకాటములో పడుట, పనికిమాలి పెద్దలమార్గము తెలియక వ్యతిరేకముగా ప్రవర్తించి పొగరుతో ప్రవర్తించుట – తక్కువతనము పొందుట అనున వేసమయమునందును తెలియదు.

**సీ.** **తలఁజూప లేక చిప్పలు పూని వ్రంతల**
**మెలఁగెడు తామేటి మేటి నవ్వి**
**కుండలు దాల్చి కన్గొనల నీరొలుకఁ జే**
**తులఁ జాపు కడ యేనుఁగులను రోసి**
**నిలువెల్ల వెంట్రుకల్ బలసి నేలయుఁ ద్రవ్వు**
**కొని మను తొల్బంది గున్న నెన్ని**
**కాళ్ళుఁ జేతులు వోయి గాలిద్రావుచు మంటఁ**
**బొరలు చిల్వల సామిఁ బోవనాడి**

**తే.గీ.** **తిండి యెన్నండు నెఱుఁగక యుండి యడుగు**
**దరలఁగా లేని గుబ్బలి దొరలఁ దెగడి**
**పుడమి చెలి సేరె సిరులఁ బెంపడరి యరిది**
**తేజుఁ గాంచిన యా చాల్పు తేర్ల దొరను** **20**

(భూదేవి) తలచూపలేక = తలను పైకెత్త లేక (తాబేలు తల దించుకొనే ఉంటుంది), చిప్పలు పూని = శరీరమంతటా పొలుసులు ఉండి, వ్రంతల మెలగెడు = పల్లపు ప్రాంతములలో, మెలగెడు = సంచరించెడు, తామేటి మేటి = శ్రేష్ఠమైన తాబేలు (ఆదికూర్మము)ను, నవ్వి = పరిహసించి, కుండలు తాల్చి = కుంభస్థలములు వహించి, కన్గొనల నీరొలుకన్ = కంటి చివరల నీరు కారుచుండగా, చేతులన్ చాపు = హస్తము (తొండము)లను చాపెడి, కడ ఏనుగులను = దిగ్గజములను, రోసి = అసహ్యించుకొని, నిలువెల్ల = శరీరమంతటను, వెంట్రుకల్ బలసి = వెంట్రుకలు వ్యాపించి, నేలయు త్రవ్వుకొని = నేలను ముట్టెతో త్రవ్వుకొనుచు, మను = బ్రతుకు, తొలి పంది గున్నను = ఆది వరాహమును, ఎన్ని = ఆక్షేపించి, కాళ్ళు చేతులు పోయి = కాళ్ళు చేతులు లేక, గాలి త్రావుచు = గాలిమాత్రమే తినుచు, మంటన్ పొరలు = మట్టియందు పొరలాడు, చిల్వలసామిన్ = ఆదిశేషుని, పోవన్ ఆడి = త్యజించి, ఎన్నండున్ = ఎన్నడును, తిండి ఎఱుగక ఉండి = భోజనము తెలియక, అడుగు తరలగా లేని = ఒక్క అడుగు దూరముకూడా జరుగుటకు

లేని, గుబ్బలి దొరలన్ = కులపర్వతములను, తెగడి = తిరస్కరించి, సిరులన్ = సంపదలతో, పెంపదరి = ఆధిక్యమును పొంది, అరిది తేజు కాంచిన = అద్భుతమైన పరాక్రమమును పొందిన, ఆ చాల్పు తేర్ల దొరను = ఆ దశరథుని, పుడమి చెలి = భూదేవి, చేరెన్ = చేరెను.

**తా :** భూదేవి తల పైకెత్తలేక చిప్పలను పూని నీటిలో తిరుగు ఆది కూర్మమును పరిహసించి, కుంభస్థలములు వహించి, కంటి చివర నీరు కారుచుండగా హస్తములను చాపెడి దిగ్గజములను అసహ్యించుకొని, దేహమంతటా వెంట్రుకలు వ్యాపించి ముట్టెతో నేలను త్రవ్వుకొనుచు బ్రతుకు ఆదివరాహమును ఆక్షేపించి, కాళ్ళు చేతులు లేక, గాలి మాత్రమే తింటూ మట్టిలో పొరలాడు ఆదిశేషుని త్యజించి, ఎన్నడును తిండినెరుగక ఒక్క అడుగు దూరముకూడ జరుగలేని కులపర్వతములను తిరస్కరించి, సంపదలతో ఆధిక్యమును పొంది, అద్భుత పరాక్రమమును పొందిన ఆ దశరథుని చేరినది.

**సీ.** **కఱవు గేస్తుల యిండ్లఁ గప్పు నేఁతలయంద**
**సుడివడి కలఁగుట ల్మడుగులంద**
**కొట్లు బేహారుల గొనబు టంగడులంద**
**తఱచుగాఁ గొండెము ల్తలుపులంద**
**పలు గాకి చెయువు లబ్రంపుఁ గోనలయంద**
**పొసఁగు జివ్వలు కాఱుపోతులంద**
**బలిమిమై నరివెట్టుటలు సింగిణులయంద**
**వాలాయపుం గాఁక పాలయంద**

**తే.గీ.** **కాని మఱియెందు నేనియుఁ గల్గనీక**
**నేల యేలెను దద్దయు నేర్పుమీఱ**
**వెలుఁగురా వంగడపు పాలవెల్లి నిండు**
**చలివెలుంగైన ఆ రాచ జడలమేకము** **21**

గేస్తుల ఇండ్లన్ = గృహస్థుల ఇండ్లయందు, కప్పు = పై కప్పు , నేతలయంద = నేయుటయందే, కఱవు = పరిమితి, సుడివడి = సుడిగుండములు పడి, కలగుటల్ = కల్లోలమగుట, మడుగులంద = కొలనులందే, కొట్లు = గిడ్డంగులు, బేహారుల = వైశ్యుల, గొనబు = సుందరమైన, అంగడులంద = దుకాణములందే, తఱచుగా = అధికముగా, కొండెముల్ = గొళ్ళెములు, తలుపులంద, పలు కాకి చెయువులు = దుర్మార్గుల చేష్టలు, అబ్రంపున్ = ఆశ్చర్యము కొలిపే, కోనలయందు = అడవులందే, పొసగు = ఒప్పునట్టి, చివ్వలు = కలహములు, కాఱుపోతులంద = అడవిదున్నలందే, బలిమిమై = బలవంతముగా, నరివెట్టుటలు = నారి సంధించుటలు, సింగిణులయంద = ధనుస్సులందే, వాలాయపున్ = సహజమైన, కాక = కోపముతో పైకి లేచిపోవుటలు, పాలయంద = పాలయందే, కాని = అంతేకాని, మఱి ఎందున్ ఏనియు = మరి ఎక్కడను, కల్గనీక = కలుగకుండగా, వెలుగురా వంగడపు = సూర్యుని వంశమను, పాలవెల్లి = పాల సముద్రమునకు,

నిండు చలివెలుంగైన = పున్నమి చంద్రుడైన, ఆ రాచ జడలమెకము = ఆ రాజసింహము (దశరథుడు), తద్దయు = మిక్కిలి, నేర్పుమీర = చాకచక్యముతో, నేల ఏలెను = భూమిని పాలించెను.
**తా :** గృహస్థుల ఇండ్ల పైకప్పు పరిమితి నేతలయందే, సుడిపడి కల్లోలమగుట కొలనులందే, గిడ్డంగులు దుకాణములందే, గొళ్ళెములు తలుపులందే, దుర్మార్గపు చేష్టలు అడవులందే, కలహములు అడవిదున్నలందే, నారి సంధించుటలు ధనుస్సులందే, కోపముతో పైకి లేచుటలు పాలయందే కాని మరెక్కడను కలుగకుండా సూర్యవంశమను పాల సంద్రమునకు నిండుజాబిల్లియైన ఆ రాజసింహము దశరథుడు చక్కగా పాలనచేయుచుండెను.

**కం.** **ఆ కడిఁది మేలి గొనముల**
**రా కొమరుం డాంద్రుగాఁగ రహిఁ గౌసల్యం**
**గైకను సుమిత్రనుం దగఁ**
**జేకొని యెనలేని నెమ్మిఁ జెలఁగుచు నుండెన్ 22**

కడిది = మిక్కిలి, మేలి గొనములు = ఉత్తమమైన గుణములతో, ఆ రాకొమరుండు = ఆ అజ మహారాజు కుమారుడైన దశరథుడు, కౌసల్యన్, కైకను, సుమిత్రనున్, తగన్ = తనకు తగిన వారినిగా, ఆంద్రుగాగ = భార్యలుగా, చేకొని = స్వీకరించి, ఎనలేని = అంతులేని, రహిన్ = ఆనందముతో, నెమ్మిన్ = సంతోషముగా, చెలగుచునుండెన్ = అతిశయించుచుండెను.
**తా :** ఉత్తమమైన గుణములతో ఆ అజమహారాజు కుమారుడైన దశరథుడు కౌసల్యను, కైకను, సుమిత్రను తనకు తగినవారినిగా స్వీకరించి అంతులేని ఆనందముతో సంతోషముగా చెలగుచుండెను.

**కం.** **అటులుండి యొక్కట న్మి**
**క్కుటముగ నమ్ముగ్వురకును గొమరులు లేకుం**
**డుటకున్ డెందము లోపలఁ**
**గటకటపడి ప్రెగ్గడలను గన్గొని పలికెన్ 23**

అటులు ఉండి = ఆ విధముగా ఉండగా, ఆ మువ్వురకున్ = ఆ ముగ్గురు భార్యలకును, కొమరులు లేకుండుటకున్ = పుత్రులు లేకపోవుటకు, డెందము లోపలన్ = మనసులో, మిక్కుటముగన్ = ఎక్కువగా, కటకటపడి = బాధపడి, ఒక్కటన్ = ఒకనాడు, ప్రెగ్గడలను = మంత్రులను, కన్గొని = చూచి, పలికెన్ = మాట్లాడెను.
**తా :** ఆ విధముగా ఉండగా ఆ మువ్వురు భార్యలకు పుత్రులు లేకపోవుటకు మనసులో మిక్కిలి బాధపడి దశరథుడు ఒకనాడు మంత్రులను చూచి పలికెను.

**కం.** **కొడుకులు పుట్టని మానిసి**
**తొడుకులు బల్మియును నిండ్లుఁ దొడవులు మావుల్**
**పుడమియు నెక్కుడు మెకములు**
**విడిముడియుం జుట్టములును వితగద తలఁపన్ 24**

కొడుకులు పుట్టని = పుత్రులు కలుగని, మానిసి = మనుష్యుని, తొడుకులు = గోధనము, బల్మియును = బలమును (దేహ, విద్యా బలములు), ఇండ్లున్ = భవనములును, తొడవులు = భూషణములు, మావుల్ = అశ్వములును, పుడమియు = రాజ్యమును, ఎక్కుడు మెకములు = ఏనుగులును, విడిముడియున్ = ధనమును, చుట్టములును = బంధువులును, తలపన్ = ఆలోచింపగా, వితకద = వృధాయేకదా!.

**తా :** పుత్రులు లేని మనుజుని గోధనము, దేహ, విద్యా బలములు, భవనములు, భూషణ ములు, అశ్వములు, రాజ్యము, ఏనుగులు, సంపదలు, బంధువులును వృధాయేకదా!

**తే.గీ.** **ఎన్నఁ గొమరులు కల్గక యున్నవారి**
**నిందు నందును నెమ్మది వొంద దనుచుఁ**
**బుడమి వేలుపుఁ బెద్దలు నుడువుచుందు**
**రట్లగుటఁ గుఱ్ఱలిఁక నాకు నబ్బవలయు** **25**

ఎన్నన్ = చూడగా, కొమరులు = పుత్రులు, కల్గక ఉన్న వారిన్ = లేకుండా ఉన్నవారిని, ఇందున్ అందును = ఇహ లోకంలోను, పర లోకంలోను, నెమ్మది పొందదు అనుచు = ఆత్మశాంతి పొందదని, పుడమి వేలుపు పెద్దలు = పండితులైన బ్రాహ్మణులు, నుడువుచుందురు = చెబుతూంటారు, అట్లగుటన్ = ఆ కారణమున, ఇకన్ నాకున్ = ఇంక నాకు, కుఱ్ఱలు = పుత్రులు, అబ్బవలయు = కలుగవలయును.

**తా :** చూడగా 'పుత్రులు లేనివారికి ఈ లోకంలోను, పరలోకంలోను కూడా ఆత్మశాంతి లభించదు' అని పండితులు చెబుతారు. ఆ కారణమున నాకు పుత్రులు కలుగవలయును.

**ఆ.వె.** **అనుచుఁ బల్కి యొజ్జయైన వశిష్టుని**
**బిలువఁ బనిచి యెలమిఁ దలఁపు నందు**
**గలుగు తెఱఁగుఁ జెప్పి కర్జ మెయ్యది దీని**
**కనిన నాతఁ డిట్టు లానతిచ్చె** **26**

అనుచు పల్కి, ఒజ్జ ఐన = గురువుగారైన, వశిష్టుని, పిలువన్ పనిచి = పిలుచుటకు పంపి, ఎలమిన్ = ప్రీతితో, తలపునందు = మనసునందు, కలుగు = ఉన్నటువంటి, తెఱగు = విషయమును, చెప్పి = తెలిపి, కర్జము = చేయదగిన కార్యము, దీనికి ఎయ్యది అనిన = దీనికి ఏది అనిన, ఆతడు = ఆ వశిష్ఠుడు, ఇట్టులు = ఈ రీతిగా, ఆనతి ఇచ్చె = ఆజ్ఞాపించెను.

**తా :** అని పలికి గురువైన వశిష్ఠుని ఆహ్వానించి ప్రీతితో మనసులోని రహస్యము కాని విషయమును తెలిపి, చేయదగిన కార్యము ఏది అనిన, ఆ వశిష్టుడు ఈ రీతిగా ఆదేశించెను.

**కం.** **విను ఱేఁడ! నీకు బొట్టియ**
**లొనగూడు తెఱంగు నిక్క మొదవఁ దెలిపెదన్**
**మును రోమపాదుఁ డనగాఁ**
**దనరు నొడయఁ డొకఁడు పుడమిఁ దగనేలు తఱిన్** **27**

తేడ = ప్రభూ!, నీకు బొట్టియలు = నీకు సంతానము, ఒనగూడు తెఱంగు = సమకూరే పద్ధతిని, నిక్కము ఒదవన్ = సత్యముగా, తెలిపెదన్ = చెబుతాను, విను = వినుము, మును = పూర్వము, రోమపాదుడు అనగా = రోమపాదుడు అని, తనరు = ఒప్పునట్టి, ఒడయడు = రాజు, ఒకడు = ఒకతను, పుడమిన్ = రాజ్యమును, తగన్ ఏలు తఱిన్ = చక్కగ పరిపాలిస్తున్న సమయములో.

**తా :** ప్రభూ! నీకు సంతానము కలిగే పద్ధతిని సత్యముగా చెబుతాను విను, పూర్వము రోమపాదుడను రాజు రాజ్యమును పాలిస్తున్న సమయములో.

**సీ.** **వానలు లేక నెవ్వడిఁ బైరు లన్నియు**
**వాడఁదొడంగిన నోడి పజలు**
**మిడుక నవ్వెంద్రుక యడుగుల దొర యెల్ల**
**నాడెంపుఁ బాఱులఁ గూడబెట్టి**
**నాల్గుకన్నుల వేల్పునకు వ్రేల్మ లెన్నేనిఁ**
**జేసి మేలేమియుఁ జెందకున్న**
**వేసరు నెడఁ బాఱు లాసామిఁ గన్గొని**
**యొడయఁడ! విను మొక యడవిలోన**

**తే.గీ.** **దగులు కొని ఋష్యశృంగుఁడన్ ముగుద తపసి**
**యుండు నిచ్చటి కాతని నోర్మిఁ దోడి**
**తెచ్చి నప్పుడు వానలు దివిరి కురియు**
**మేయిదాలుపు గమికెల్ల మేల్దనర్చు** **28**

వానలు లేక, నెఱ వడిన్ = శీఘ్రముగా, పైరులు అన్నియు = పంటలన్నియును, వాడన్ తొడంగిన = ఎండిపోతుండగా, ఓడి = భయపడి, పజలు = ప్రజలు, మిడుకన్ = బాధపడుచుండగా, ఆ వెంద్రుక అడుగుల దొర = ఆ రోమపాదుడు, ఎల్ల నాడెంపున్ పాఱులన్ = పండితులైన బ్రాహ్మణు లందరిని, కూడ పెట్టి = సమావేశపరచి, నాల్గుకన్నుల వేల్పునకు = అగ్నిహోత్రునకు, ఎన్నేని = ఎన్నియో, వ్రేల్మలు = హోమములు, చేసి = చేసినప్పటికిని, మేలు ఏమియున్ చెందక ఉన్న = మంచి ఏమియు కనబడకపోవడంతో, వేసరున్ ఎడన్ = విసిగి ఉన్న సమయమున, పాఱులు = బ్రాహ్మణులు, ఆ సామి కన్గొని = ఆ ప్రభువును చూచి, ఒడయడ = ప్రభూ!, విను = మా మాట వినుము, ఒక అడవిలోన = ఒక అరణ్యంలో, తగులుకొని = పూనుకొని, ఋష్యశృంగుడన్ = ఋష్యశృంగుడనే, ముగుద తపసి = అమాయక తపస్వి, ఉండున్ = ఉన్నాడు, ఓర్మి = సహనంతో, ఆతనిన్ = ఆ ఋష్యశృంగుని, ఇచ్చటికి = ఇక్కడికి, తోడితెచ్చిన = తేగలిగిన, అప్పుడు = అప్పుడుమాత్రమే, వానలు తివిరి కురియున్ = వానలు త్వరగా కురుస్తాయి, మేయి తాలుపు గమికి ఎల్ల = శరీరధారులన్నిటికిని, మేలు తనర్చు = శుభము కలుగుతుంది.

**తా :** వానలు లేక పంటలు ఎండిపోతుండగా ప్రజలు బాధపడుచుండగా, ఆ రోమపాదుడు పండితులను సమావేశపరచి అగ్నిహోత్రునకు ఎన్నో హోమములు చేసినప్పటికిని మంచి కనబడకపోవడంతో విసిగివున్న సమయంలో బ్రాహ్మణులు ఆ ప్రభువుతో 'ప్రభూ! మా మాట విను. ఒక అడవిలో ఋష్యశృంగుడనే అమాయక తపస్వి ఉన్నాడు. సహనంతో ఆ ఋష్యశృంగుని ఇక్కడికి తీసుకొనివస్తే అప్పుడుమాత్రమే వానలు త్వరగా కురుస్తాయి. ప్రాణులన్నిటికి శుభం కలుగుతుంది.

**కం.** **అని తెల్పిన నతఁ డప్పుడ**
**పనివడి వెలయాంద్ర నేర్చి పనిచి సరగ న**
**మ్మనుఁబోతు కొమ్ము తపసిం**
**గొనితెచ్చి కడంకఁ దనదు కూఁతు నొసంగెన్** **29**

అని తెల్పిన = అని చెప్పగా, అతడు = ఆ రోమపాదుడు, అప్పుడ = వెంటనే, పనివడి = సిద్ధపడి, వెలయాంద్రన్ = వేశ్యలను, ఏర్చి = ఎంచి, పనిచి = పంపి, సరగ = శీఘ్రముగా, ఆ మనుబోతు కొమ్ము తపసిన్ = ఆ ఋష్యశృంగుని, కొనితెచ్చి = తీసుకొనివచ్చి, కడంకన్ = పూనికతో, తనదు కూతున్ = తన కుమార్తె (శాంత)ను, ఒసంగెన్ = ఇచ్చి పెండ్లి చేసెను.

తా : అని చెప్పగా, ఆ రోమపాదుడు వెంటనే సిద్ధపడి వేశ్యలను ఎంచి, పంపి శీఘ్రముగా ఆ ఋష్యశృంగుని తీసుకొనివచ్చి పూనికతో తన కుమార్తెనిచ్చి పెండ్లి చేసెను.

**తే.గీ.** **అంత వానలు పుడమిఁ బెల్లదరఁ గురిసె**
**వంత లెడఁబాసెఁ బజయెల్ల సంతసిల్లె**
**దొరయుఁ బలువురు కొడుకులు బిరుదు మగలఁ**
**గాంచి సరిలేని బల్వేడుకలఁ జెలంగె** **30**

అంతన్ = అంతట, పుడమిన్ = రాజ్యమున, వానలు = వర్షములు, పెల్లు అదర కురిసెన్ = దట్టముగా కురిసెను, వంతలు = బాధలు, ఎడబాసెన్ = దూరమయ్యెను, పజ ఎల్ల = ప్రజలందరూ, సంతసిల్లె = సంతోషించిరి, దొరయున్ = రాజును, పలువురు కొడుకులు = చాలమంది కొడుకులను, బిరుదు మగలన్ = వీరులైనవారిని, కాంచి = పొంది, సరిలేని = సాటిలేని, బల్వేడుకన్ = గొప్ప సంతోషముతో, చెలంగెన్ = ఒప్పెను.

**తా :** అంతట రాజ్యమున వానలు దట్టముగా కురిసేయి. బాధలు దూరమయ్యాయి, ప్రజలందరూ సంతోషించారు. రాజు కూడా చాలామంది కొడుకులను వీరులైనవారిని పొంది అంతులేని సంతోషముతో ఒప్పెను.

**కం.** **కావున నీవిపు డద్దొర**
**క్రేవకుఁ జని యతనిఁ జేరి కెంజడదారిన్**
**దేవలయు నిచటి కాయన**
**వే వచ్చినఁ గోర్కు లెల్ల వెస నొనగూడున్** **31**

కావునన్ = కాబట్టి, నీవు, ఇపుడు, ఆ దొర క్రేవకు చని = ఆ ప్రభువు చెంతకు వెళ్ళి, అతనిన్ చేరి = అతనిని కలసి, కెంపు జడదారిన్ = ఎఱ్ఱని జడలు కలవానిని (ఋష్యశృంగుని), ఇచటికి = ఇక్కడికి, తేవలయును = తీసుకురావలెను, ఆయన, వే వచ్చినన్ = శీఘ్రముగా వచ్చిన, కోర్కులు ఎల్లన్ = నీ కోరికలన్నియు, వెసన్ = తొందరలో, ఒనగూడున్ = తీరును.

**తా :** కాబట్టి నీవు ఇపుడు ఆ ప్రభువు చెంతకు వెళ్ళి, అతనిని కలిసి, ఋష్యశృంగుని ఇక్కడకు తీసుకొనిరావలెను. ఆయన వచ్చిన వెంటనే నీ కోరికలన్నియు తొందరగా తీరిపోతాయి.

**తే.గీ.** **అనుచు నిటు లొజ్జ చెప్పిన యట్ల యతనిఁ**
**దోడుకొని వచ్చి వేల్పుల దొరను దనియ**
**బారులుగఁ బాఱులను గూర్చి వారువంపు**
**జన్న మొనరించి యా రాచమిన్న మఱియు** **32**

అనుచున్ = అని, ఇటులు, ఒజ్జ చెప్పిన = గురువు తెల్పగా, అట్ల = ఆ ప్రకారముగా, అతని తోడుకొని వచ్చి = అతనిని తీసుకొని వచ్చి, వేల్పుల దొరను = ఇంద్రుని, తనియ = తృప్తిపరచుటకు, బారులుగన్ = అనేకులుగా, పాఱులను = బ్రాహ్మణులను, కూర్చి = చేర్చి, వారువంపు జన్నము = అశ్వమేధయాగము, ఒనరించి = చేసి, ఆ రాచమిన్న = ఆ రాజశ్రేష్ఠుడు, మఱియు = ఇంకను.

**తా :** అని ఈ విధముగా గురువు వశిష్ఠుడు తెల్పగా, ఆ ప్రకారం తీసుకొచ్చి ఇంద్రుని తృప్తిపరచుటకు రాజు పలువురు బ్రాహ్మణులతో అశ్వమేధయాగము చేశాడు. ఇంకా –

**కం.** **కొమరులు గలిగెడు వ్రేలిమి**
**దమి మీఱ నొనర్చుచున్న తఱి జేజే ల్మొ**
**త్తములై తామరచూలిం**
**దమ ముందఱ నిల్పికొని పెనంగొను వేడ్కన్** **33**

కొమరులు కలిగెడు వ్రేలిమి = కుమారులు కలిగే యజ్ఞమును (పుత్రకామేష్టి), తమి మీఱన్ = మిక్కిలి కోరికతో, ఒనర్చుచున్న తఱిన్ = చేయుచున్న సమయమున, జేజేలు = దేవతలు, మొత్తములై = సమూహములుగా, తామరచూలిం = బ్రహ్మను, తమ ముందఱ నిల్పికొని = తమ ముందుంచుకొని, పెనంగొను వేడ్కన్ = ఉక్కిరి పెడుతున్న సంతోషముతో,

తా : కోరికతో పుత్రకామేష్టియాగం చేస్తున్న సమయంలో – దేవతలు బ్రహ్మను ముందుంచుకొని మిక్కిలి సంతోషముతో.

**తే.గీ.** **లచ్చి పొడమిన చోటికిఁ బచ్చవిల్తు**
**నయ్య నెయ్యంపు వీటి కింపారు నేల**
**జోటి మగమానికపు మొలత్రాటి కెన్న**
**మేటియై మించు పాలమున్నీటి కరిగి** **34**

లచ్చి పొడమిన చోటికిన్ = లక్ష్మీదేవి ఉద్భవించిన చోటికి (క్షీరసముద్రం), పచ్చవిల్తుని అయ్య

= మన్మథుని తండ్రి విష్ణువు యొక్క, నెయ్యంపు వీడు = ప్రియమైన పట్టణమునకు, ఇంపారు = సుందరమైన, నేల జోటి = భూదేవియొక్క, మగమానికపు = వజ్రములతో చేయబడిన, మొల త్రాటికి = మొలనూలుగా, ఎన్న = ఎంచగా, మేటియై మించు = శ్రేష్ఠమైనదై ప్రకాశించు, పాల మున్నీటికి = పాలసంద్రమునకు, అరిగి = వెళ్ళి,

**తా :** లక్ష్మీదేవి పుట్టిన చోటికి, మన్మథుని తండ్రి విష్ణువు పట్టణమునకు, భూదేవికి వజ్రములతో చేయబడిన మొలనూలుకు పాలసంద్రమునకు వెళ్ళి –

**కం.** **అవ్వేల్పు లెల్ల మెల్లన**
**నెవ్వగలన్నియును ద్రోచి నెమ్మది యెదల**
**న్నివ్వటిలం గేలుగవ**
**ల్దవ్వులనె మొగుడ్చుకొనుచుఁ దారసిలి మొగిన్** **35**

ఆ వేల్పులు = ఆ దేవతలు, ఎల్ల = అందరును, మెల్లన = మెల్లగా, నెఱ వగలు అన్నియున్ = అధికమైన బాధల నన్నిటిని, త్రోచి = పక్కకు తోసి, నెమ్మది = స్వస్థత, ఎదలన్ = మనసులందు, నివ్వటిలన్ = కలుగగా, దవ్వులనె = దూరమునుండియే, కేలుగవ = రెండు చేతులను, మొగుడ్చుకొనుచున్ = జోడించుకొనుచు, తారసిలి = చేరి, మొగిన్ = క్రమముగా.

**తా :** ఆ దేవతలందరూ మెల్లగా అధికమైన బాధలను పక్కకు తోసి స్వస్థత కలవారై దూరమునుండియే చేతులు జోడించుకొని క్రమముగా చేరి –

**సీ.** **చెలువంపుఁ జిలువ రా సెజ్జఁ బండినవాని**
**నక్కున సిరినిడి చొక్కువాని**
**సుడివాలు, చిందంబు నదరఁ బూనినవాని**
**జిలుఁగు పసిండి దువ్వలువవానిఁ**
**దొలుమబ్బు చెలువంబు దొరయు నెమ్మెయివాని**
**జగమెల్ల వలచు సోయగమువాని**
**మొసలి వాపోఁగు లింపెసఁగఁ దాల్చినవానిఁ**
**దొగవిందు నగు ముద్దు మొగమువాని**

**తే.గీ.** **మేలి వెలిదమ్మి రేకుల నేలఁజాలు**
**కన్నుగవవాని వలతేని గన్నవాని**
**వన్నియల కెల్ల మిన్నయై యున్నవానిఁ**
**గాంచి యిట్లని యగ్గింపఁ గడఁగిరపుడు** **36**

చెలువంపున్ = అందమైన, చిలువ రా సెజ్జన్ = శేష శయ్యమీద, పండినవానిన్ = శయనించినవానిని, అక్కున = ఎదను, సిరిని ఇడి = లక్ష్మీదేవిని ఉంచుకొని, చొక్కువాని = పరవశించువానిని, సుడివాలు = సుదర్శన చక్రమును, చిందంబు = శార్ఙ్గమను శంఖమును, అదరన్ = అతిశయించునట్లు, పూనినవానిన్ = ధరించినవానిని, జిలుగు = మెరిసే, పసిండి =

బంగారు, దువ్వలువ వానిన్ = పీతాంబరమువానిని, తొలుమబ్బు = తొలకరి మేఘముయొక్క చెలువంబు దొరయు = కాంతికి జోడగు, నెమ్మెయి వాని = దేహకాంతి కలవానిని (నీలమేఘ శ్యాముని), జగము ఎల్ల = లోకమంతయు, వలచు = ఇష్టపడు, సోయగము వాని = సౌందర్యము కలవానిని, మొసలి వాయి పోగులు = మకర కుండలములు, ఇంపు ఎసగన్ = చక్కగా, దాల్చిన వానిన్ = ధరించినవానిని, తొగ విందు = కలువలకు ఇష్టుడు (చంద్రుని), నగు = అపహసించు, ముద్దు మొగము వాని = సుందరమైన ముఖము కలవానిని, మేలి = శ్రేష్ఠమైన, వెలి తమ్మి రేకులన్ = తెల్లని పద్మదళములను, ఏలన్ చాలు = సరిపోలు, కన్నుగవ వాని = నేత్రద్వయము కలవానిని, వలఱేని = మన్మథుని, కన్నవానిన్ = కన్నతండ్రిని, వన్నియలకు ఎల్లన్ = సమస్తమైన సొగసులకు, మిన్నయై = అధికుడై, ఉన్నవానిన్ = ఉన్నట్టివానిని, కాంచి = చూచి, అపుడు = అప్పుడు, ఇట్లని = ఈ ప్రకారముగా, అగ్గింపన్ = స్తుతించుటకు, కడగిరి = సిద్ధపడిరి.

**తా :** అందమైన శేషశయ్యపై శయనించినవానిని, ఎదపై లక్ష్మీదేవినుంచుకొని పరవశించు వానిని, సుదర్శన చక్రమును, శారఙ్గమను శంఖమును ధరించినవానిని, పీతాంబరము ధరించినవానిని, నీలమేఘశ్యాముని, లోకము ఇష్టపడు సుందరుని, మకరకుండలములు ధరించినవానిని, చంద్రుని అపహసించు సుందరముఖమువానిని, తెల్లని పద్మదళములను సరిపోలు నేత్రద్వయము కలవానిని, మన్మథుని కన్నతండ్రిని, అన్ని సొగసులకు అధికుడై ఉన్నవానిని చూచి ఈ రీతిగా స్తుతించసాగిరి.

**సీ.** **జడదారి తలమిన్న చాలుపు నెమ్మోము**
**విరి దామరల పూప వేఁడి వెలుఁగ!**
**కూళ తొల్వేలుపు కూటువ గాటంపు**
**టడవుల మేటి పయ్యర యనుంగ!**
**కలుముల నవలా చొకాటంపు తళ్కు పి**
**సాళి కన్గలువల చందమామ!**
**బలితంపుఁ జేట్పాటు తొలకరి యదను క్రొ**
**క్కార్నీరు దాలుపుగముల యూఁద!**

**తే.గీ.** **సదలువదని కడింది దొసఁగు గయాళి**
**బోర ప్రాఁకుడు కొలముల పులుఁగు ఱేఁడ!**
**వెక్కసపుఁ బుట్టువు తెవుళ్ళ వెజ్జురాయ!**
**తిరముగా నిన్నుఁ గొండాడఁ దరమె మాకు?** **37**

జడదారి తలమిన్న చాలుపు = శ్రేష్ఠులైన మునీశ్వరుల సమూహముయొక్క, నెఱి మోము = అందమైన ముఖము, విరి తామరల పూప = తామర పూవు మొగ్గలకు, వేడి వెలుగ = సూర్యుడా!, కూళ = దుష్టులైన, తొలి వేలుపు కూటువ = రాక్షస సమూహములనెడు, గాటంపు = దట్టమైన, అడవుల = అరణ్యములకు, మేటి = శ్రేష్ఠమైన, పయ్యర అనుంగ = గాలికి తోడా!

(అగ్నిహోత్రుడా!), కలుముల నవలా = సంపదలనిచ్చే స్త్రీ (లక్ష్మీదేవియొక్క), చొకాటంపు = మిక్కిలి స్వచ్ఛమైన, తళ్కు = కాంతులతో, పిసాళి = ప్రకాశించు, కన్ = కన్నులనెడి, కలువల = కలువలకు, చందమామ = చంద్రుడవైనవాడా!, బలితంపు = బలమైన, చేట్పాటు = కష్టములనెడి, తొలకరి అదను = తొలకరి సమయమందలి, క్రొక్కారు నీరు తాలుపు గముల = క్రొత్త నల్లని మేఘ సమూహములకు, ఈద = వాయువైనవాడా!, కడింది = అధికమైన, దొసగు = తప్పులతో, గయాళి = స్వేచ్ఛగా సంచరించు, బోర ప్రాకుడు = పొట్టతో ప్రాకే, కొలముల = పాముల కులమునకు, సడలువడని = కదలనివ్వని, పులుగు ఱేడ = పక్షిరాజా! (గరుత్మంతుడా!), వెక్కసపున్ = దుస్సహమైన, పుట్టువు తెవుళ్ళ = పుట్టుకలనే రోగాలకు, వెజ్జురాయ = వైద్య శిఖామణీ!, తిరముగా = నిశ్చయముగా, నిన్నున్ కొండాడన్ = నిన్ను స్తుతించుటకు, మాకు తరమె = మాకు శక్యమౌనా?

**తా :** మునీశ్వరుల ముఖములనెడు తామరమొగ్గలకు సూర్యుడా!, దుష్ట రాక్షసులనెడు వనములకు అగ్నిహోత్రుడా!, లక్ష్మీదేవి కన్నులనెడి కలువలకు చంద్రుడా!, కష్టములనెడు మేఘ సమూహములకు వాయువా!, పాముల కులమునకు జారుపాటునివ్వని పక్షిరాజా!, దుస్సహమగు పుట్టుకలనే రోగాలకు వైద్యశిఖామణీ!, నిశ్చయముగా నిన్ను స్తుతించుటకు మాకు శక్యమా?

**కం.** **జగముల యెకిమీడ! నినున్**
**బొగడఁగ బదినూఱ్ఱ నోళ్ళప్రోడయుఁ బలుకుం**
**దొగకంటియుఁ జాలనిచోఁ**
**దగునే పెఱవార లెన్నఁదగు వారనఁగన్?** **38**

జగముల ఎకిమీడ = లోకములకు ప్రభువైనవాడా!, నినున్ పొగడగ = నిన్ను స్తుతించుటకు, పది నూఱ్ఱ నోళ్ల ప్రోడయున్ = వేయి నోళ్ళున్న సమర్థుడును (ఆదిశేషుడు), పలుకుం తొగకంటియున్ = వాణియును, చాలనిచోన్ = సరిపడకున్నచో, పెఱవారలు = ఇతరులు, ఎన్నదగు వారు అనగన్ = సరిపడువారు అనుట, తగునే = తగునా?

**తా :** లోకప్రభూ! నిన్ను స్తుతించుటకు వేయినోళ్ళున్న ఆదిశేషుడు, పలుకుల రాణి సరస్వతి సరిపడకున్నచో ఇతరులు సరిపడువారనుట తగునా?

**కం.** **పెను మినుకు కొనలు తెలివిం**
**గనుగొను బల్లిదునకైనఁ గనరాని నినున్**
**గనుగొంటిమి మే మిప్పుడు**
**పెను రొక్కపుఁ గుప్పఁ గన్న పేదలపగిదిన్** **39**

పెను మినుకు కొనలు = వేదముల చివరలు (ఉపనిషత్తుల), తెలివిన్ = జ్ఞానముతో, కనుగొను = దర్శించు, బల్లిదునకైనన్ = సమర్థుని కైనను, కనరాని = కనబడని, నినున్ = నిన్ను, మేము = మేము, పెను రొక్కపు కుప్ప కన్న = గొప్ప ధనరాసిని చూసిన, పేదల పగిదిన్ = దరిద్రుల వలెనే, ఇప్పుడు = ఈ సమయమున, కనుగొంటిమి = చూడగలిగితిమి.

**తా :** ఉపనిషత్తుల జ్ఞానముతో దర్శించు పండితునికైనను కనబడని నిన్ను మేము గొప్ప సంపదను పొందిన దరిద్రులవలెనే ఇప్పుడు చూడగలిగితిమి.

**కం.** **విను దేవర! మున్నెన్నడుఁ**
**గన వినని వి యబ్బురంపుఁ గడగం డ్లొదవెన్**
**మునుకొని నీ యడుగుంగవఁ**
**గనుగొన వచ్చితిమి వేడ్క గడలు కొనంగన్** **40**

దేవర = ప్రభూ!, విను, మున్ను ఎన్నడున్ = ఇంతకు పూర్వమెన్నడును, కన వినని వి = చూడనివి, విననివియైన, అబ్బురంపున్ కడగండ్లు = వింతైన కష్టములు, మునుకొని = వరుసపెట్టి, ఒదవెన్ = వచ్చినవి, మునుకొని = పూనుకొని, నీ అడుగుం గవన్ = నీ పాద ద్వయమును, కనుగొన, వేడ్క గడలు కొనంగన్ = మిక్కిలి సంతోషముతో, వచ్చితిమి.

**తా :** ప్రభూ! విను. ఇంతకు పూర్వమెన్నడును కని విని ఎరుగని కష్టములు వరుసపెట్టి వచ్చినవి. నీ పాదద్వయమును దర్శించుటకు సంబరపడుతూ వచ్చితిమి.

**కం.** **చదువుల ముదుకఁడు మొదలం**
**బొదలించిన బలిమివలనఁ బోటరి యగుచున్**
**బది తలల రక్కసుల ఱేఁ**
**డొదుగక యిమ్ముజ్జగంబు నొక్కట గెలిచెన్** **41**

చదువుల = వేదముల, ముదుకడు = వృద్ధుడు (బ్రహ్మ), మొదలన్ పొదలించిన = పూర్వము కలిగించిన, బలిమివలన = వర ప్రభావమువలన, పోటరి యగుచున్ = పోటుగాడగుచు, పది తలల, రక్కసుల ఱేఁడు = రాక్షస రాజు, ఒదుగక = తగ్గక, ఈ ముజ్జగంబు = ఈ మూడు లోకములను, ఒక్కట = ఏకమొత్తముగా, గెలిచెన్ = జయించెను.

**తా :** బ్రహ్మ పూర్వమిచ్చిన వర ప్రభావమున పోటుగాడగుచు దశకంఠుడు తగ్గక ఈ మూడు లోకములను ఏకమొత్తముగా జయించెను.

**సీ.** **కొఱయయ్యె నిదురయుఁ గూడు వేల్పులతేని**
**కగ్గి యాఁకట నెద్దియైన మెసవు**
**గుదియఁ జేకొని తద్దఁ గుంటి పాఱు జముండు**
**గుదిరె రక్కసుఁడు సోఁకుడుతనమున**
**వలగొని నీళ్ళ క్రేవల నుండు నీళ్ళ ఱేఁ**
**డరయ బయల్వట్టి తిరుగు గాడ్పు**
**జక్కుల కొలములోఁ జిక్కె రొక్కపు దొర**
**బికిరముల్గొను మినుసిక వలంతి**

**తే.గీ.** **మఱియుఁ దక్కిన వేల్పు లందఱును తమకు**
**నెందు దెసలేక చనిరి కడింది చేవ**

**నెసఁగు నబ్బంతి తలల రక్కసుని కతన**
**నేమి తెల్పుదుమయ్య! నీ యెదుర నింక? 42**

వేల్పుల ఱేనికి = ఇంద్రునికి, నిదురయున్, కూడు, కొఱయయ్యె = లేనివయ్యెను, అగ్గి = అగ్ని, ఆకటన్ = ఆకలితో, ఎద్దియైన = దేనినైనను, మెసవు = తినును, జముండు = యముడు, గుదియన్ చేకొని = యమదండమును పట్టుకొని, తద్దన్ = వేగముగా, కుంటి = కుంటుకొనుచు, పాఱు = పరుగెత్తును, రక్కసుడు = నైరృతి, సోకుడుతనమున = పిశాచము పట్టినట్లుగా, కుదిరెన్ = కదలడు, నీళ్ళ ఱేడు = వరుణుడు, వలగొని = ప్రదక్షిణములు చేస్తూ, నీళ్ళ క్రేవలన్ ఉండు = జలాశయముల చెంతనే ఉండును, గాడ్పు = వాయువు, అరయన్ = వెదుకగా, బయల్వట్టి తిరుగు = బయటనే సంచరించుచుండును, రొక్కపు దొర = కుబేరుడు, జక్కుల కొలములో చిక్కె = యక్షుల జాతిలో చిక్కుపడెను, మిను సిక వలంతి = ఆకాశ కేశములందు స్త్రీకలవాడు (ఈశానుడు), బికిరముల్ కొను = బిచ్చమెత్తు కొనును, మఱియున్ = ఇంకను, తక్కిన వేల్పులు అందఱును = మిగిలిన దేవతలందరూ కూడా, తమకు, ఎందును = ఎక్కడను, దెసలేక = దిక్కులేక, కడింది = మిక్కిలి, చేవన్ ఎసగు = శౌర్యముతో ఒప్పుచున్న, ఆ బంతి తలల రక్కసుని కతన = ఆ పది తలల రాక్షసుని కారణముగా, చనిరి = పారిపోయిరి. నీ ఎదురన్ = నీ ఎదుట, ఇంక = ఇంకను మా బాధలు, ఏమి తెల్పుదుమయ్య = ఏం చెప్పుకుంటాము స్వామీ!

**తా :** ఇంద్రునికి కూడు, నిద్ర కరువైంది. అగ్ని ఆకలితో దేనినైనా తినేస్తున్నాడు, యముడు యమదండం పట్టుకొని కుంటుకుంటూ పరుగెత్తుతున్నాడు, నైరృతి పిశాచం పట్టినట్లు కదలడు. వరుణుడు ప్రదక్షిణములు చేస్తూ జలాశయములచెంతనే ఉండిపోతున్నాడు. వాయువు వెదుకగా దారి తెలియక బయటనే సంచరిస్తున్నాడు. కుబేరుడు యక్షుల జాతిలో చిక్కుపడ్డాడు. ఈశానుడు బిచ్చమెత్తుకుంటున్నాడు. ఇంక, మిగిలిన దేవతలందరూ కూడా తమకు దిక్కులేక శౌర్యవంతుడైన రాక్షసుని కారణముగా పారిపోయిరి. ఇంకా నీ దగ్గర మా బాధలు ఏమని చెప్పుకుంటాము స్వామీ!

**తే.గీ. వేలుపుల వేల్ప! మా మొఱ లాలకించి**
**కనికరపుఁ జూడ్కిఁ గనుఁగొని గాటమగుచు**
**నెదలఁ బొదలెడు యఱుకెల్లఁ బ్రిదిల పఱిచి**
**సాఁకవే! కోర్కు లిఁకఁ గొనసాఁగఁ జేసి 43**

వేలుపుల వేల్ప = దేవదేవా!, మా మొఱలు ఆలకించి = మా దీనగాథలు విని, కనికరపు చూడ్కిన్ = కరుణా దృష్టితో, కనుగొని = చూచి, ఎదలన్ = మనసులలో, గాటము అగుచు = మిక్కిలిగా, పొదలెడు = కలుగుచున్న, అఱుకు ఎల్లన్ = భయమునంతను, ప్రిదిల పఱిచి = పోగొట్టి, కోర్కులు = మా కోరికలు, ఇకన్ = ఇంక, కొనసాగన్ చేసి = కొనసాగునట్లుగా చేసి, సాకవే = రక్షింపవే!

**తా :** దేవదేవా! మా దీనగాథలు విని కరుణా దృష్టితో మా మనసుల్లో మిక్కిలిగా కలుగుచున్న భయమునంతను పోగొట్టి మా కోరికలు ఇంక కొనసాగునట్లుగా రక్షించు.

**కం. అని మొఱలిడు జేజేలం**
**గనుఁగొని యగ్గడుసు గుడుసు కైదువ జో ది**
**ట్లనియె నీ్మకిఁక వగవం**
**జన దేమియు వేల్పులార! చను డిక్కలకున్ 44**

అని = ఈ ప్రకారముగా, మొఱలిడు = విన్నవించుకొనుచున్న, జేజేలం కనుగొని = దేవతలను చూచి, ఆ గడుసు గుడుసు కైదువ జోదు = ఆ గడుసువాడైన చక్రాయుధుడు, ఇట్లు అనియెన్ = ఈ రీతిగా పలికెను, మీకు ఇక = ఇంక మీకు, ఏమియున్ = ఏకొంచెమును, వగవన్ = బాధపడుట, చనదు = తగదు, వేల్పులార = దేవతలారా!, ఇక్కలకున్ చనుడు = మీ నివాసములకు వెళ్ళండి.

తా : ఈ ప్రకారముగా విన్నవించుకొనుచున్న దేవతలను చూచి ఆ చక్రాయుధుడు ఈ రీతిగా పలికెను. ఓ దేవతలారా! ఇంక మీరు బాధపడవలసిన అవసరము లేదు. మీ మీ నివాసములకు వెళ్ళండి.

**కం. అక్కూళ రక్కసుల దొరఁ**
**జక్కాడెద నెదిరి పెక్కు చందమ్ముల న**
**మ్ముక్కంటి వచ్చి కాచినఁ**
**జిక్కంగా నీక మానిసితనం బెసఁగన్ 45**

ఆ ముక్కంటి = ఆ పరమశివుడు, ఆ కూళ = ఆ నీచుడైన, రక్కసుల దొరన్ = రావణుని, పెక్కు చందములన్ = పలు విధములుగా, కాచినన్ = రక్షించినను, చిక్కంగాన్ ఈక = ఆ శివునకు వానిని దొరకనీకుండా, మానిసితనంబు = మనుష్యత్వము, ఎసగన్ = కలుగగ, ఎదిరి = ప్రతిఘటించి, చక్కాడెదన్ = సంహరించెదను.

**తా :** ఆ నీచుడైన రాక్షసుని పరమశివుడే పలువిధముల రక్షించినను, దొరకనీక మనుష్యత్వమున వానిని ప్రతిఘటించి తప్పక సంహరించెదను.

**కం. ఇమ్ముగఁ బది తేరుల దొర**
**కొమ్మల కే నల్తెఱఁగులఁ గూర్మిఁ బొడమెదం**
**గ్రమ్ముకొని మీరు చెట్టుం**
**ద్రిమ్మరులై పుట్టుఁ డరిది తేజు లెలర్పన్ 46**

ఇమ్ముగన్ = తగినరీతిగా, పది తేరుల దొర కొమ్మలకు = దశరథుని స్త్రీలకు, కూర్మిన్ = ప్రీతితో, ఏన్ = నేను, నల్ తెఱగులన్ = నాలుగు రూపములుగా, పొడమెదన్ = జన్మించెదను, క్రమ్ముకొని = వ్యాపించి, అరిది తేజులు = పరాక్రమవంతులు, మీరు, చెట్టుం ద్రిమ్మరులై = వానరులై, ఎలర్పన్ = సంతోషముగా, పుట్టుడు = పుట్టండి.

**తా :** ప్రీతిగా దశరథుని భార్యలకు నాలుగు రూపములుగా జన్మించెదను. మీరు వానరులై, అద్భుత పరాక్రమవంతులై పుట్టండి.

**తే.గీ.** **అనుచు ననిచిన ప్రేముడినాడ నచటు**
**గదలి వదలని వేడ్కలఁ బొదలి వార**
**లరిగి రిమ్ముల కిమ్ముల నంత బంతి**
**తేర్ల దొర వ్రేల్మి నెఱిఁ గడ తేర్చియున్న** **47**

అనుచున్ అనిచిన = అని ఆదేశించుచూ, ప్రేముడిన్ ఆడన్ = ప్రేమతో పలుకగా, అచటు కదలి = అక్కడినుండి బయలుదేరి, వదలని వేడ్కలన్ = వీడని సంతోషముతో, పొదలి = ఒప్పి, వారలు = వాళ్ళు, ఇమ్ములకు = తమ నివాసములకు, ఇమ్ములన్ = ఆనందముగా, అరిగిరి = వెళ్ళిరి, అంతన్ = అంతలో, బంతి తేర్ల దొర = దశరథుడు, వ్రేల్మిన్ = హెూమమును, నెఱిన్ = సుఖముగా, కడతేర్చి ఉన్న = పూర్తిచేసి ఉండగా.

**తా :** అని ఆదేశిస్తూ ప్రేమతో పలుకగా సంతోషంగా అక్కడినుండి బయలుదేరి దేవతలు తమ నివాసములకు వెళ్ళిరి – అంతలో దశరథుడు హెూమమును సుఖముగా పూర్తిచేసి ఉండగా –

**కం.** **సతనాల్కల జేజే యపు**
**డతనికిఁ బొడకట్టి పసిఁడి హరివాణముతో**
**డుతఁ దెచ్చి పాల యోరెం**
**బతివలు ముప్వురకుఁ బెట్టుమని యిడి చనుడున్** **48**

అపుడు = ఆ సమయమున, సతనాల్కల జేజే = సప్త జిహ్వుడైన అగ్ని, అతనికిన్ = ఆ దశరథునకు, పొడకట్టి = కనబడి, పసిడి హరివాణముతోడుతన్ = బంగారు పాత్రతో, పాల ఓరెంబు = క్షీరాన్నమును, తెచ్చి = తీసుకొనివచ్చి, అతివలు ముప్వురకున్ = ముగ్గురు భార్యలకును, పెట్టుము అని = పెట్టమని, ఇడి = ఇచ్చి, చనుడున్ = వెళ్ళగా,

**తా :** ఆ సమయమున సప్త జిహ్వుడైన అగ్ని ఆ దశరథునకు కనబడి బంగారు పాత్రతో క్షీరాన్నము తెచ్చి ముగ్గురు భార్యలకు పెట్టుమని ఇచ్చి వెళ్ళగా –

**కం.** **తడయక ఱేఁ డది గొని తన**
**పడఁతుకలకుఁ బంచి యిడిన బాగొప్పఁ బసా**
**పడి యమ్మెఱుఁగుంబోడులు**
**కడుపులతో నుండి రెలమి గడలు కొనంగన్** **49**

ఱేడు = రాజు, అది గొని = ఆ పాత్రను తీసుకొని, తడయక = ఆలసింపక, తన పడతుకలకు = తన భార్యలకు, పంచి ఇడిన = పంచి ఇవ్వగా, బాగు ఒప్పన్ = చక్కగా, పసాపడి = తిని, ఆ మెఱుగుంబోడులు = ఆ మెఱుపుతీగలైన స్త్రీలు, ఎలమి కడలు కొనంగన్ = మిక్కిలి సంతోషముతో, కడుపులతోన్ ఉండిరి = గర్భములను దాల్చిరి.

**తా :** రాజు ఆ పాత్రను తీసుకొని ఆలసింపక తన భార్యలకు పంచి ఇవ్వగా చక్కగా తిని ఆ పడతులు మిక్కిలి సంతోషముతో గర్భములను దాల్చిరి.

**కం. చిట్టుములు నోకిలింతలు**
**దట్టంబై బొడమెఁ జవులు దప్పెం గోర్కుల్**
**బిట్టొదవెఁ బిఱుఁదులుం జను**
**కట్టులుఁ గడు బలిసె నపుడు క్రాల్గంటులకున్ 50**

క్రాలు కంటులకున్ = అందమైన కన్నులుకల ఆ రాణులకు, అపుడు = అప్పుడు, చిట్టుములున్ = వేవిళ్ళును, ఓకిలింతలు = వాంతులు, దట్టంబై పొడమెన్ = ఎక్కువయ్యెను, చవులు దప్పెన్ = రుచులు పోయెను, కోర్కుల్ బిట్టు ఒదవెన్ = కోరికలు అధికమయ్యెను, పిఱుదులున్, చనుకట్టులున్, కడు బలిసెన్ = మిక్కిలి పెరిగెను.

**తా :** సుందరులైన ఆ రాణులకు అప్పుడు వేవిళ్లును, వాంతులును ఎక్కువయ్యెను. రుచులు పోయెను. కోరికలు అధికమయ్యెను. పిఱుదులు, చనుకట్టులు బలిసెను.

**తే.గీ. వేలుపుల లేవడులు కడు వేగఁ దొలఁగఁ**
**బడఁతుకల నెన్నడుముల లేవడులు దొలఁగె**
**నెఱి నిరాబార్ల స్రుక్కులన్నియును దీఱఁ**
**గలికిమిన్నల తఱుల స్రుక్కులును దీఱె 51**

వేలుపుల = దేవతల, లేవడులు = దారిద్ర్యములు, కడు వేగన్ = మిక్కిలి వేగముగా, తొలగన్ = తొలగునట్లుగా, పడతుకల = ఆ స్త్రీలయొక్క, నెన్నడుముల = రమ్యమైన నడుముల, లేవడులు తొలగెన్ = దారిద్ర్యములు తొలగెను (నెలలు పెరిగే కొలదీ అంతకు ముందు లేని నడుము పెరగసాగెను), నెఱి = చక్కగా, నిరాబార్ల = మునీశ్వరుల, స్రుక్కులు అన్నియును = బాధలన్నియును, తీరన్ = తీరునట్లుగా, కలికిమిన్నల = ఆ స్త్రీ శ్రేష్ఠుల, తఱుల = వళులయొక్క, స్రుక్కులును తీరె = ముడుతలును పోయెను.

**తా :** దేవతల దారిద్ర్యములు తొందరలో తొలగునట్లుగా ఆ రాణుల నడుముల దారిద్ర్యము తొలగిపోయినది. మునీశ్వరుల బాధలు తీరునట్లుగా ఆ స్త్రీల వళుల ముడుతలు పోయినవి.

**కం. తొలివేల్పుల మొగములు తెల**
**తెలవాఱఁగఁ దెల్లఁబాఱె దెఱవల మోముల్**
**తులువల నడకలు దడఁబడ**
**దలిరాకుంబోండ్ల నడలు దడబడఁ దొడఁగెన్ 52**

తొలివేల్పుల = రాక్షసులయొక్క, మొగములు = ముఖాలు, తెలతెలవాఱగన్ = పాలిపోగా, తెఱవల = ఆ స్త్రీలయొక్క, మోముల్ = ముఖాలు, తెల్లబాఱె = తెల్లబడెను, తులువల నడకలు = దుష్టులైన ఆ రాక్షసుల నడకలు, తడబడన్ = తడబడగా, తలిరాకుబోండ్ల = ఆ చిగురాకువంటి దేహముకల రాణుల, నడలు = నడకలు, తడబడన్ తొడగెన్ = తడబడసాగెను.

**తా :** రాక్షసుల ముఖములు పాలిపోగా ఆ రాణుల ముఖములు తెల్లబడెను. దుష్టులైన రాక్షసుల నడకలు తడబడగా ఆ స్త్రీల నడకలు తడబడసాగెను.

**కం. పుడమి ననబోఁడి వారల**
**కడుపులలో వెన్నునకుఁ దగం దనలాగే**
**ర్పడఁ దెల్ప నేఁగెనో యనఁ**
**బడఁతుకలకు మట్టి చౌరవ బలితంబయ్యెన్ 53**

పుడమి ననబోడి = భూమి అనే పూబోడి, వారల కడుపులలో = ఆ రాణుల కడుపులలోని, వెన్నునకున్ = విష్ణువునకు, తగన్ = తగినరీతిగా, తన లాగు = తన ఇష్టమును, ఏర్పడన్ = చక్కగా, తెల్పన్ = తెలియజేయుటకు, ఏగెనో అనన్ = వెళ్ళినదో అనునట్లుగా, పడతుకలకున్ = ఆ రాణులకు, మట్టిచౌరవ = మట్టితినాలనే ఆసక్తి, బలితంబు ఆయ్యెన్ = ఎక్కువయ్యెను.

**తా :** ఆ రాణుల కడుపులలోని విష్ణువునకు భూదేవి తన యిష్టమును తెలియజేయుటకు వెళ్ళినదా అనునట్లుగా ఆ స్త్రీలకు మట్టి తినుటయందు ఆసక్తి ఎక్కువయ్యెను.

**తే.గీ. బొజ్జలో ముజ్జగంబులు పూను మేటి**
**పేర్మితోఁ దమ బొజ్జలోఁ బెరుగుచున్న**
**కతనఁ దద్దయు వ్రేఁగులై కనఁగనయ్యె**
**మేను దీవియ లా రాచ మెలఁతుకలకు 54**

ముజ్జగంబులు = మూడు లోకములను, పూను = వహించెడు, మేటి = శ్రేష్ఠుడు, పేర్మితోన్ = ప్రీతితో, తమ బొజ్జలోన్ = తమ కడుపులో, పెరుగుచున్న, కతనన్ = కారణమున, ఆ రాచ మెలతుకలకు = ఆ రాణులకు, మేను తీవియలు = తీగలవంటి నాజూకైన శరీరములు, తద్దయు = మిక్కిలి, వ్రేగులై = బరువులై, కనగన్ అయ్యెన్ = కనబడసాగెను.

**తా :** మూడు లోకములను తనలో ఉంచుకొనిన శ్రేష్ఠుడు తమ బొజ్జలో పెరుగుచున్న కారణమున ఆ రాణుల తీగలవంటి శరీరములు బరువులై కనబడసాగెను.

**తే.గీ. కుందనపు బొంగరములపైఁ గందుమీఱి**
**వెలుఁగు నిద్దంపు వేల్పు ఱా ములుకులనఁగఁ**
**దమ్మి మొగ్గలపైఁ బొల్చు తుమ్మెదలన**
**నలరెఁ జెలువల చనుమొనల్ నలుపు మీఱి 55**

కుందనపు బొంగరములపైన్ = బంగారు బొంగరాలమీద, కందు మీఱి వెలుగు= మిక్కిలి నల్లదనముతో ప్రకాశించు, నిద్దంపు = స్వచ్ఛమైన, వేల్పు ఱా ములుకులు అనగ = ఇంద్ర నీలమణుల ముల్లులనునట్లుగా, తమ్మి మొగ్గలపైన్ = తామర మొగ్గల మీద, పొల్చు = భాసించు, తుమ్మెదలు అనన్, చెలువల = ఆ రాణుల, చనుమొనల్ = స్తనముల మొదళ్ళు, నలుపు మీఱి = మిక్కిలి నల్లదనముతో, అలరెన్ = ఒప్పెను. (స్తనములకు బొంగరములతోను, తామరమొగ్గలతోను పోలిక)

**తా :** బంగారు బొంగరములమీద ఇంద్రనీలమణుల ముల్లులనునట్లుగా, తామర మొగ్గల మీద తుమ్మెదలనునట్లుగా ఆ రాణుల చనుమొనలు నల్లబారెను.

**కం. తెఱవల కడుపులలో నే**
**డ్తెఱఁ బెరిగెడు ప్రోడ రేయి ద్రిమ్మరిదొరపైఁ**
**గొఱకొఱ నూర్పులు నిగుడుచు**
**తెఱఁగున గాటంపుటూర్పు తెమ్మెర లడరెన్ 56**

తెఱవల కడుపులలో = ఆ స్త్రీల కడుపులయందు, ఏడ్తెఱన్ = చక్కగా, పెరిగెడు = పెరుగుచున్న, ప్రోడ = సమర్థుడు, రేయి త్రిమ్మరి దొర పైన్ = రావణునిపై, కొఱకొఱన్ = కోపముతో, ఊర్పులు నిగుడుచు తెఱగున = దీర్ఘ నిశ్వాసలు విడుచు విధముగా, (ఆ రాణులకు) గాటంపు = గాఢమైన, ఊర్పు తెమ్మెరలు = నిశ్వాసపు గాలులు, అడరెన్ = ఒప్పెను.

**తా :** ఆ స్త్రీల కడుపులయందు పెరుగుచున్న సమర్థుడు రావణునిపై కోపముతో దీర్ఘ నిశ్వాసలు విడుచు విధముగా ఆ రాణులకు గాఢమైన నిశ్వాసము లొప్పెను.

**కం. లలిఁ జూలింతతనంబులఁ**
**దలరెడు నమ్ముద్దు నేలదాలుపు నవలా**
**తలమానికముల కటులన్**
**నెల లేర్పడఁ దొమ్మిదియును నిండారుటయున్ 57**

లలిన్ = చక్కగా, చూలింత తనంబులన్ = గర్భము దాల్చినవారలై, తలరెడు = ఒప్పుచున్న, ఆ ముద్దు = ఆ ముచ్చటైన, నేల తాలుపు నవలా తలమానికములకు = శ్రేష్ఠులైన రాచస్త్రీలకు, అటులన్ = ఆ రీతిగా, నెలలు = నెలలు, ఏర్పడన్ = గోచరమగుచు, తొమ్మిదియును = తొమ్మిది యును, నిండారుటయున్ = నిండగనే,

**తా :** చక్కగా గర్భము దాల్చినవారలై ఒప్పుచున్న ఆ రాచస్త్రీలకు క్రమముగా నెలలు తొమ్మిదియును నిండగనే –

**సీ. తొలినెల తెలిఱెక్క తొమ్మిదియవనాట**
**నాఱు నొండవ రిక్క నలరు నాలు**
**గవ లగనంబున నన్ని గాములును మే**
**ల్బాడ్ములఁ దనరార వేడ్కఁ బొదలి**
**మొదలి వెలంది రామునిఁ గాంచె రెండవ**
**పడఁతుక రతనంబు భరతుఁ గాంచె**
**మూఁడవ చిగురాకుబోఁడి లక్ష్మణుని శ**
**త్రుఘ్నునిఁ గాంచెఁ గోర్కులు దలిర్ప**

**తే.గీ నప్పు డెకిమీఁడు తఱి చెయ్వు లమరఁదీర్చి**
**పేదలకు నేలవేలుపుఁ బెద్దలకును**
**బొసఁగ రొక్కంబుఁ దొడవులుఁ బుట్టములును**
**దొడుకులు నొసంగి పదిరేలు గడిపి యంత 58**

తొలి నెల = చైత్రమాసము, తెలి ఱెక్క = శుక్లపక్షము, తొమ్మిదియవనాట = నవమినాడు, ఆఱున్ ఒండు అవ రిక్కన్ = ఏడవ నక్షత్రము (పునర్వసు) నందు, అలరు = ప్రకాశించు, నాలుగవ లగనంబునన్ = నాల్గవ (కర్కాటక) లగ్నమందు, అన్ని గాములును = గ్రహము లన్నియును, మేలు చూడ్కుల తనరార = శుభ దృష్టులు కలిగియుండగా, వేడ్కన్ పొదలి = మిక్కిలి సంతోషముతో, మొదలి వెలంది = పెద్ద భార్య (కౌసల్య), రామునిన్ కాంచె = రాముని కనెను, రెండవ పడతుక రతనంబు = రెండవ భార్యా రత్నము (కైక), భరతున్ కాంచె = భరతుని కనెను, మూడవ చిగురాకుబోడి = మూడవ భార్య (సుమిత్ర), లక్ష్మణుని, శత్రుఘ్నుని, కాంచెన్ = కనెను, అప్పుడు = ఆ సమయమున, ఎకిమీడు = రాజు (దశరథుడు), కోర్కులు తలిర్పన్ = వాంఛలు చిగురింపగా, తఱి చెయ్వులన్ = ప్రసవ సమయమున చేయవలసిన కార్యములను, అమరన్ తీర్చి = చక్కగా నెరవేర్చి, పేదలకు = బీదవారికి, నేలవేలుపున్ పెద్దలకును = బ్రాహ్మణ శ్రేష్ఠులకును, పొసగన్ = తగినరీతిగా, రొక్కంబున్ = ధనమును, తొడవులు = నగలను, పుట్టములును = వస్త్రములును, తొడుకులు = ఆవులను, ఒసగి = ఇచ్చి, పది రేలు = పది రాత్రులను, గడిపి అంత = పూర్తయిన తరువాత,

**తా :** చైత్రమాసము శుక్లపక్షము నవమినాడు పునర్వసు నక్షత్రమునందు కర్కాటక లగ్నమున గ్రహములన్నియును శుభదృష్టులు కలిగియుండగా పెద్దభార్య కౌసల్య రాముని కనెను. రెండవ భార్య కైక భరతుని కనెను, మూడవ భార్య సుమిత్ర లక్ష్మణుని, శత్రుఘ్నుని కనెను. అపుడు రాజు మనోవాంఛలు చిగురింపగా ప్రసవ సమయమున చేయవలసిన కార్యములను చక్కగా నెరవేర్చి పేదలకు, బ్రాహ్మణులకు ధనమును, ఆభరణములను, వస్త్రములను, గోవులను ఇచ్చి, పది రాత్రులు పూర్తయిన తరువాత –

**తే.గీ.** **పదునొకండవ ప్రొద్దునఁ బట్లు నల్వు**
**రకును బేరులు వెట్టి యా రాచ పెద్ద**
**విందులకుఁ బేదలకుఁ నేలవేలుపులకు**
**నామెతలు వెట్టి దీవనలంది మఱియు** **59**

పదునొకండవ ప్రొద్దునన్ = పదకొండవ రోజున, పట్లు నల్వురకును = కుమారులు నలుగుర కును, పేరులు పెట్టి = నామకరణములు చేసి, ఆ రాచ పెద్ద = ఆ దశరథుడు, విందులకున్ = బంధుమిత్రులకు, పేదలకున్ = బీదవారలకును, నేలవేలుపులకున్ = బ్రాహ్మణులకు, ఆమెతలు పెట్టి = విందులు ఏర్పాటుచేసి, దీవనలు అంది = ఆశీస్సులను పొంది, మఱియు = ఇంకను,

**తా :** పదకొండవ రోజున నలుగురు కుమారులకు నామకరణములు చేసి ఆ దశరథుడు బంధువులకు, పేదలకు, బ్రాహ్మణులకు విందులు ఏర్పాటుచేసి ఆశీస్సులు పొందెను.

**ఆ.వె.** **ముద్దు కొమరు లెలమిఁ బ్రొద్దు ప్రొద్దున కొక్క**
**వన్నె యలరఁ బెరుగుచున్న వడుగు**
**లదను మెఱయఁజేసి చదువు సాములు మొదల్**
**గలుగు విద్దె లెల్లఁ గఱపి యంత** **60**

ముద్దు కొమరులు = ముద్దులొలికే కొడుకులు, ఎలమిన్ = సంతోషముతో, ప్రొద్దు ప్రొద్దునకు = రోజు రోజునకు, ఒక్క వన్నె అలరన్ = ఒక కాంతి ఒప్పునట్లుగా, పెరుగుచున్న, అదను మెఱయన్ = సరియగు సమయమునకు, వడుగులు చేసి = ఉపనయనములు చేసి, చదువు సాములు మొదల్ కలుగు = శాస్త్ర సాహిత్యాది విద్యలు, ధనురాది విద్యలు మొదలైన, విద్దెలు ఎల్లన్ = విద్యలన్నిటిని, గఱపి అంత = నేర్పిన తరువాత.

**తా :** సంతోషముతో తన ముద్దుకుమారులు రోజురోజునకు ఒక కాంతి ఒప్పునట్లుగా పెరుగుచుండగా, సరియగు సమయమునకు ఉపనయనములు చేసి చదువుసాములు మొదలగు విద్యలన్నిటిని నేర్పిన తరువాత –

**సీ.** **చిన్ని క్రొన్నెల నెన్ను నెన్నొసళ్ళ నొయారి**
**యలఁతి కస్తురి రేక లనువు మీఱఁ**
**గేలు దామరల మేల్జాళువా మురుగులు**
**కెంపు లుంగరములు సొంపు నెఱప**
**మొలల హొంబట్టు క్రొందలుకు దట్టీలపై**
**రతనంపు మొలత్రాళ్ళు రంగులీన**
**నెదల నున్పులిగోళ్ళు పొదివిన పతకముల్**
**తెలి ముత్తియంపుఁ బేరులు సెలంగఁ**

**తే.గీ.** **జెవులఁ గఱి మానికపుఁ బోఁగు గవలు మెఱయ**
**మొలక నగవులు మురిపంపు జిలుఁగు నడలు**
**ముద్దుఁ బలుకులుఁ గులుకంగ మ్రోల నాడు**
**కొమరులను జూచి మది నుబ్బుకొనుచునుండె** **61**

చిన్ని క్రొన్నెలన్ = బాలచంద్రుని, ఎన్ను = పోలియుండు, నెఱి నొసళ్ళన్ = అందమైన ఫాలభాగములందు, ఒయారి = అందమైన, అలతి కస్తూరి రేకలు = సన్నని కస్తూరి రేఖలు, అనువు మీఱన్ = మిక్కిలి ఒప్పియుండగా, కేలు తామరలన్ = పద్మములవంటి చేతులయందు, మేలు జాళువా మురుగులు = మంచి బంగారు మురుగులు, కెంపుల = పద్మరాగ మణుల, ఉంగరములు, సొంపు నెఱపన్ = శోభనీయగా, మొలల = నడుములకు, హొన్ను పట్టు = బంగారు జరీకల, క్రొత్త తలుకు = క్రొత్త కాంతులీను, దట్టీలపై = కాసెకట్టులపై, రతనంపు మొలత్రాళ్ళు = రత్నాల మొలత్రాళ్ళు, రంగులు ఈనన్ = కాంతులను వెదజల్లగా, ఎదలన్ = గుండెలపై, నును పులిగోళ్ళు = అందమైన పులిగోళ్ళు, పొదివిన = పొదిగిన, పతకముల్ = పతకములు, తెలి ముత్తియంపున్ = తెల్లని ముత్యాల, పేరులు = హారములు, చెలంగన్ = ప్రకాశింపగా, చెవులన్ = చెవులయందు, కఱి మానికపు పోగు గవలు = ఇంద్రనీలమణుల జంటపోగులు, మెఱయ = ప్రకాశింపగా, మొలక నగవులు = చిరునవ్వులు, మురిపంపు జిలుగు నడలు = ముద్దులొలికే అందమైన నడకలు, ముద్దు పలుకులు = ముద్దు ముద్దు మాటలు,

కులుకంగ = ఆనందమునీయగా, మ్రోల = చెంతను, ఆడు కొమరులను చూచి = ఆడుకొనే తన కుమారులను చూచి, మదిన్ = మనసునందు, ఉబ్బుకొనుచుండె = (దశరథుడు) సంబరపడు చుండెను.

**తా :** బాలచంద్రుని బోలు ఫాలభాగములందు అందమైన కస్తూరి రేఖలు ఒప్పగా, పద్మములవంటి చేతులయందు బంగారు మురుగులు, పద్మరాగమణుల ఉంగరములు శోభనీయగా, నడుములకు బంగారు జరీ కాసెకట్టులపై, రత్నాల మొలత్రాళ్ళు కాంతులీనగా, ఎదలపై పులిగోళ్ళు పొదిగిన పతకములు, తెల్లని ముత్యాల హారములు ప్రకాశింపగా, చెవులకు ఇంద్రనీలమణుల పోగులు కాంతులీయగా, చిరునవ్వులు, ముద్దులొలికే నడకలు, ముద్దుముద్దు మాటలు ఆనందము నీయగా చేరువను ఆడుకొనే కుమారులను చూచి దశరథుడు తన మనసున సంబరపడుచుండెను.

**కం.** **ఈ చందంబునఁ దద్దయు**
**నేచిన వేడుకల నుండు నెడ నొకనాడా**
**రాచూలి కడకు వచ్చెం**
**బూచులదొరఁ బోలు తపసిపులి యొకఁ డెలమిన్** **62**

ఈ చందంబునన్ = ఈ ప్రకారముగా, తద్దయున్ = మిక్కిలి, ఏచిన = అతిశయించిన, వేడుకలన్ = సంతోషములతో, ఉండున్ ఎడన్ = ఉన్న సమయములో, ఒకనాడు = ఒక రోజున, ఆ రాచూలి కడకు = ఆ అజమహారాజు పుత్రుడైన దశరథుని దగ్గరకు, బూచులదొరన్ పోలు = పిశాచముల ప్రభువగు రుద్రుని పోలిన, తపసి పులి = మునిశార్దూలము, ఒకడు ఎలమిన్ = ఒకడు సంతోషముతో, వచ్చెన్ = వచ్చెను.

**తా :** ఈ రీతిగా మిక్కిలి సంతోషముతో ఉన్న సమయములో ఒకనాడు ఆ అజ మహారాజు కుమారుడైన దశరథుని చెంతకు రుద్రుని పోలిన ఒక ముని శార్దూలము వచ్చెను.

**కం.** **వచ్చిన యక్కౌశికునకు**
**మెచ్చుగఁ బూజలిడి బత్తి మీఱఁగ మగఱాల్**
**గ్రుచ్చిన సింగపు పీఁటన్**
**నిచ్చలముగ నిల్పి పల్కె నేర్పు దలిర్పన్** **63**

వచ్చిన = రాగా, ఆ కౌశికునకు = ఆ విశ్వామిత్రునికి, మెచ్చుగన్ = ఆనందించేలా, పూజలు ఇడి = సత్కారములు చేసి, బత్తి మీఱగన్ = మిక్కిలి భక్తితో, మగఱాల్ గ్రుచ్చిన = వజ్రాలు పొదిగిన, సింగపు పీటన్ = సింహాసనముపై, నిచ్చలముగ = సుఖంగా, నిల్పి = కూర్చుండ పెట్టి, నేర్పు తలిర్పన్ = నైపుణ్యము ప్రకటమగునట్లుగా, పల్కె = పలికెను.

**తా :** వచ్చిన ఆ కౌశికునికి పూజలు చేసి, మిక్కిలి భక్తితో వజ్రాలు పొదిగిన సింహాసనముపై సుఖంగా కూర్చుండబెట్టి నేర్పుగా పలికెను.

**ఆ.వె.** **రాచజోగి రిక్కరాయడ! నీవు మా**
**నగరు సేరుటెల్ల మిగుల మేలు**

**సేకుఱుటకుఁ గాదె చెప్పెడి దేమిఁక?**
**నహహా! దొంటి పున్నియంపుఁ బెంపు** **64**

రాచజోగి రిక్కరాయడ = రాజయోగి చంద్రమా!, నీవు, మా నగరు, చేరుట, ఎల్ల, మిగుల = మిక్కిలి, మేలు చేకుఱుటకున్ కాదె = మంచి జరుగుటకే కదా!, చెప్పెడిది ఏమి ఇక = ఇంక చెప్పడానికి ఏముంది?, అహహా = నిజముగా, తొంటి = పూర్వజన్మలో చేసుకున్న, పున్నియంపున్ = పుణ్యములయొక్క, పెంపు = ఆధిక్యమే!

**తా :** రాజయోగిచంద్రమా! నీవు మా నగరు చేరుట మాకు మేలు చేకూర్చుటకేకదా! ఇంక చెప్పడానికేముంది? ఇది నిజంగా మా పూర్వపుణ్య ఆధిక్యమే!

**తే.గీ.** **ఇంచుకేనియు మిముఁ బరికించి కొలువ**
**నేర నేమియు నాయెడ నేర మిడక**
**చెలిమి మెఱయంగ మెల్లనఁ దెలుపు మిటులు**
**దారి రా యని యో జడదారిరాయ!** **65**

ఓ జడదారిరాయ = ఓ మునిశ్రేష్ఠా!, మిమున్ = మిమ్ములను, పరికించి = విచారించి, కొలువ నేరన్ = సేవింపగలవాడను కాను, (మీరు చెప్పకుండా తెలుసుకునే శక్తి లేనివాడను) నాయెడన్ = నాయందు, ఏమియు నేరము ఇడక = ఏమాత్రమును దోషమునెంచక, చెలిమి మెఱయంగ = స్నేహభావముతో, ఇటులు దారి రా = అనుసరించదగుమార్గము, మెల్లన = నిదానముగా, తెలుపుము

**తా :** ఓ మునిశ్రేష్ఠా! మిమ్ము విచారించి సేవింపగలవాడను కాను. నా యందు దోషము నెంచక స్నేహభావముతో ఇక్కడకు వచ్చుటకు కారణము తెలుపుడు.

**కం.** **వారువము లందలంబులు**
**దేరులు పల్లియలు పసిఁడి తెలె లేనుఁగులున్**
**జీరలు తొడవులు మాకున్**
**మీ రొసఁగిన యవియకావె నిక్కంబరయన్** **66**

నిక్కంబు అరయన్ = సత్యమును పరిశీలింపగా, వారువములు = ఈ గుఱ్ఱములు, అందలంబులు = పల్లకీలు, తేరులు = రథములు, పల్లియలు = గ్రామములు, పపిడి తెలెలు = బంగారు పాత్రలు, ఏనుగులున్ = ఏనుగులును, చీరలు = వస్త్రములు, తొడవులు = నగలు, మాకున్ = మాకు, మీరు ఒసగినయవియకావె = మీరు ప్రసాదించినవే కదా!,

**తా :** నిజానికి ఈ గుఱ్ఱములు, పల్లకీలు, రథములు, గ్రామములు, బంగారు పాత్రలు, ఏనుగులు, వస్త్రములు, నగలు మాకు మీరు ప్రసాదించినవే కదా!

**కం.** **కావున మా యెడ మీకుం**
**గావలసిన కర్జమెద్ది గల దది మాతో**
**వేవేగఁ దెల్పు డిమ్ముగఁ**
**గావించెదఁ గొంకు లేక కనికరపుగనీ!** **67**

కనికరపు గనీ = దయకు గనియైనవాడా!, కావునన్ = కాబట్టి, మా ఎడన్ = మానుండి, మీకున్ = మీకు, కావలసిన = చేయబడవలసిన, కర్జము = పని, ఎద్ది కలదు = ఏది కలదో?, అది = దానిని, మాతో = మాకు, వేవేగన్ = శీఘ్రముగా, తెల్పుడు = తెలియజేయండి, ఇమ్ముగన్ = సంతోషముగా, గొంకు లేక = సందేహించక, గావించెదన్ = చేసెదను,

**తా :** దయానిధీ! మానుండి మీకు చేయవలసిన పని ఏది కలదో దానిని మాకు వెంటనే తెలియజేయండి. సందేహించక సంతోషంగా చేస్తాను.

**తే.గీ.** **అనినఁ దద్దయుఁ బొంగి యయ్యడవి మన్కి**
**పట్టు బల్దిట్ట యమ్మేటి పచ్చవారు**
**వపు వజీరు కొలంపు కల్వల యనుంగుఁ**
**గాంచి నును దియ్యఁ బల్కులు గదురఁ బల్కె** **68**

అనినన్ = అనగా, తద్దయున్ = మిక్కిలి, పొంగి = ఆనందించి, ఆ అడవి మన్కిపట్టు = ఆ అరణ్యములో నివాసస్థానముగాకల, బలు దిట్ట = మిక్కిలి సమర్థుడైన, ఆ మేటి = ఆ శ్రేష్ఠుడు (విశ్వామిత్రుడు), పచ్చవారువపు వజీరు కొలంపు = సూర్యవంశమునకు, కల్వల అనుంగున్ = చంద్రుడైనవానిని (ఆహ్లాదానిచ్చేవానిని), కాంచి = చూచి, నును తియ్యన్ పల్కులు = మిక్కిలి మధురమైన మాటలను, కదురన్ పల్కె = ఒప్పునట్లుగా పలికెను,

**తా :** అనిన, మిక్కిలి ఆనందించి, ఆ విశ్వామిత్రుడు సూర్యవంశ చంద్రుడగు దశరథుని చూచి తియ్యని మాటలను ఒప్పునట్లుగా పలికెను.

**కం.** **ఒడయఁడ! యే నొక జన్నముఁ**
**గడు వేడుకతో నొనర్పఁ గడఁగిన నెపుడున్**
**గడుసరి రక్కసు లిరువురు**
**దొడరి వడిం జెఱుపుచుండుదురు చలమొదవన్** **69**

ఒడయడ = రాజా!. ఏను = నేను, ఒక జన్నమున్ = ఒక యజ్ఞమును, కదు వేడుకతోన్ = మిక్కిలి ఉత్సాహముతో, ఒనర్పన్ గడగిన = చేయుటకు పూనుకొనగా, ఎపుడున్, గడుసరి రక్కసులు ఇరువురు, తొడరి = ప్రయత్నించి, చలము ఒదవన్ = మాత్సర్యముతో, వడి = శీఘ్రముగా, చెరుపుచుండుదురు.

**తా :** రాజా! నేను ఒక యజ్ఞమును చేయుటకు పూనుకొనగా సతతము ఇద్దరు దిట్టలైన రాక్షసులు కావాలని అసూయతో వెంటనే పాడుచేస్తూ ఉంటారు.

**కం.** **అబ్బెరసు పొలసు దిండుల**
**నుబ్బణఁపగఁ జాలఁ డెన్న నొక్కించుకయున్**
**గుబ్బలి విల్లల జోదును**
**గొబ్బున నింక నీదు పెద్దకొమరుని నిమ్మా !** **70**

ఆ బెరసు = ఆ దుర్మార్గులైన, పొలసు తిండులన్ = రాక్షసులయొక్క, ఉబ్బు = గర్వమును, అణపగన్ = అణచుటకు, ఎన్నన్ = ఎంచగా, గుబ్బలి విల్ కల జోదును = మేరుపర్వతము

విల్లుగా కల శివుడును, ఒక్కించుకయున్ = ఒక కొంచెముకూడా, చాలదు, ఇకన్ = అందువలన, గొబ్బునన్ = వెంటనే, నీదు పెద్ద కొమరుని, ఇమ్మా = ఇమ్ము.

**తా :** ఆ దుర్మార్గులైన రాక్షసుల గర్వమును అణచుటకు మేరుపర్వతము విల్లుగాకల శివుడును ఒక కొంచెముకూడా చాలదు. అందువలన నీ పెద్ద కుమారుని ఇమ్ము.

**కం.** **కడ కడ యొడయని ముంగై**
**కడియపు నున్మెత్తఁ బండు గామిడి మన్నుం**
**బడఁతుకకై యిమ్మానిసి**
**యొడలూనిన వాఁడుసువ్వె యుక్కు దలిర్పన్** **71**

కడ కడ = చివరి దిక్కు (ఈశాన్యం), ఒడయని = ప్రభువు ఈశానుడు (శివుని), ముందు కై = ముంజేతికి, కడియపు = కంకణమైన శేషుని, నును మెత్తన్ = మెత్తనైన శయ్యమీద, పండు = పవళించు, గామిడి = శ్రేష్ఠుడైనవాడైన విష్ణువు, మన్ను పడతుకకై = భూదేవికోసమై, ఉక్కు తలిర్పన్ = మిక్కిలి శౌర్యముతో, ఈ మానిసి ఒడలు = ఈ మనుష్య దేహమును, ఊనినవాడు సువ్వె = పొందినవాడు సుమా!

**తా :** ఈశాన్య దిశకు ప్రభువైన పరమేశ్వరుని ముంజేతి కంకణమగు శేషుని మెత్తని శయ్యపై పవళించు మహావిష్ణువు భూదేవికోసమై ఈ మనుష్య దేహమును పొందినాడు.

**కం.** **ఈతని బాసటగాఁ గొని**
**యా తులువల నడఁచి జన్న మలర నొనర్తున్**
**నీ తలఁపున నిపు డేమియు**
**బీ తునుపక యనుపు మనిన బెగ్గిలి యతఁడున్** **72**

ఈతనిన్ = ఇతనిని (రాముని), బాసటగాన్ = తోడుగా, కొని = తీసుకొనివెళ్ళి, ఆ తులువలన్ = ఆ దుష్టులైన రాక్షసులను, అడచి = అణచి, అలరన్ = సంతోషముగా, జన్నము ఒనర్తున్ = యజ్ఞమును పూర్తిచేస్తాను, నీ తలపునన్ = నీ మనసులో, ఇపుడు = ఇప్పుడు, ఏమియు = ఏమాత్రమును, బీతు = భయమును, ఉనుపక = ఉంచక, అనుపుము = పంపుము, అనిన = అనగా, అతడున్ = ఆ దశరథుడును, బెగ్గిలి = భీతినంది,

**తా :** 'ఈతని తోడుగా తీసుకొనివెళ్ళి ఆ దుష్ట రాక్షసులను అణచి జన్న మొనర్తును. నీ మనసులో ఏమాత్రమును భయమునుంచక పంపుము' అనగా దశరథుడు భీతినంది

**తే.గీ.** **అయ్యయో! గుండియ ల్జల్లురనుడునట్టి**
**బెట్టిదపు మాట మీ నోటఁ బుట్టదగునె?**
**యెట్టి పనియైన నొనరింతు నేనె సెలవు**
**పెట్టుదురు గాక మీకేల పెఱ తెఱంగు?** **73**

అయ్యయో, గుండియల్, జల్లురనుడున్ అట్టి = ఝల్లుమనేటటువంటి, బెట్టిదపు మాట = కఠినమైన మాట, మీ నోటన్ = మీ నోటినుండి, పుట్టన్ తగునె = పుట్టుట న్యాయమా?, ఎట్టి పనియైన =

ఎంత కష్టమైన పనినైనను, నేనె = నేనుగావచ్చి, ఒనరింతు = చేసెదను, సెలవు పెట్టుదురు గాక = ఆజ్ఞాపింతురు గాక, పెఱ తెఱంగు = వేరు మార్గము, మీకు ఏల = మీకు ఎందులకు?

**తా :** అయ్యయ్యో! గుండెలు ఝల్లుమనే కఠినమైన మాట మీ నోటినుండి పుట్టుట తగునా? ఎంత కష్టమైన పనినైనను నేనే ఒనరింతును. ఆజ్ఞాపింతురు గాక! వేరు మార్గము మీకెందులకు?

**కం.** **ఏ పని సెప్పిన నొనరుప**
**నోపని దేమైనఁ గలదె? యో పెనుదపసీ!**
**పూప నిగారపు ముద్దుల**
**పాపని నెడఁబాప నీకుఁ బాడియె చెపుమా? 74**

ఏపని చెప్పినన్ = ఎంతటి కష్టమైన పని చెప్పినను, ఒనరుపన్ = చేయుటకు, ఓపనిది = శక్యము కానిది, ఏమైన కలదె = ఏమైనా ఉందా?, ఓ పెను తపసీ = ఓ గొప్ప తపస్వీ!, పూప నిగారపు = పూతపిందె వంటి కాంతిగల, ముద్దుల పాపని = ముద్దుల కుఱ్ఱవానిని, ఎడన్ పాపన్ = ఎడబాటు చేయుట, నీకు పాడియె = నీకు న్యాయమా?, చెపుమా = చెప్పుము.

**తా :** ఎంత కష్టమైన పని చెప్పినను నాకు చేయుటకు శక్యముకానిది ఏదైనా ఉందా? ఓ తపస్వీ! పూతపిందెలాంటి ముద్దుపాపల్ని దూరము చేయుట నీకు న్యాయమా చెప్పు?

**కం.** **అకటా! పసి నిసుఁగుల గొం**
**కక కాఱడవులకుఁ బనుపఁగావలెనని కో**
**రికతోఁ బలికెద వెద నిం**
**చుకయుం గనికరము నీకుఁ జొప్పడదుకదా! 75**

అకటా = అయ్యో!, గొంకక = సందేహించక, పసి నిసుగులన్ = చిన్న పిల్లలను, కాఱడవులకు = కీకారణ్యములకు, పనుపగా వలెనని = పంపించవలయునని, కోరికతోన్ = ఇష్టముగా, పలికెదవు = పలుకుచున్నావు, ఎదన్ = మనస్సులో, ఇంచుకయున్ = కొంచెమును, కనికరము = కరుణ, నీకున్ = నీకు, చొప్పడదు కదా = కలుగదు కదా!

**తా :** అయ్యో! సందేహించక చిన్న పిల్లలను కాఱడవులకు పంపించమని ఇష్టంగా పలుకుతున్నావు. మనసులో కొంచెంకూడా నీకు దయ కలుగదు కదా!

**కం.** **మానక పూని కడంకన్**
**వే నోములు నోచి గీము వేల్పుల కెన్నో**
**కానుకలు నించి కాంచిన**
**కూనలఁ గానలకుఁ బనుపుకొన నేరుతునే? 76**

మానక = విడువక, పూని కడంకన్ = పట్టుదలతో ప్రయత్నించి, వే నోములు నోచి = వేయి నోములు ఆచరించి, గీము వేల్పులకు = ఇలవేల్పులకు, ఎన్నో కానుకలు నించి = ఎన్నో మొక్కుబడులు చెల్లించి, కాంచిన = పొందిన, కూనలన్ = బిడ్డలను, కానలకున్ = అడవులకు, పనుపుకొన = పంపుకొనుటకు, నేరుతునే = అంగీకరింతునా?

**తా :** విడిచిపెట్టకుండా పట్టుదలతో ప్రయత్నించి వేయినోములు నోచి, ఇలవేల్పులకు ఎన్నో మొక్కుబడులు చెల్లించి పొందిన కూనలను కానలకు పంపగలనా?

**కం. కటకట! ముని జడదార్లె**
**ప్పటికిఁ గనికరపు నునికి పట్టందురు నేఁ**
**డిటువలె మీ రోడక పలు**
**కుట లరయఁగ మిగుల వెఱఁగు గొలిపెన్మదికిన్ 77**

కటకట = అయ్యో!, ముని, జడదార్లు = మునీశ్వరులు, ఎప్పటికిన్, కనికరపున్ = కరుణకు, ఉనికిపట్టు అందురు = ఆశ్రయులు అంటారు, నేడు = ఈ రోజున, ఇటువలె = ఈ ప్రకారముగా, మీరు = మీరు, ఓడక = వెనుదీయక, పలుకుటలు = మాటాడుటలు, అరయగ = చూడగా, మదికిన్ = మనస్సునకు, మిగుల = మిక్కిలి, వెఱగు కొలిపెన్ = ఆశ్చర్యమును కలిగించినది.
తా : అయ్యో! పూర్వము మునీశ్వరులు సతతము దయకు ఆశ్రయులు అంటారు. ఈ రోజున ఈ ప్రకారముగా మీరు వెనుదీయక మాటాడుట చూడగా ఆశ్చర్యం కలుగుతోంది.

**ఉ. బల్లిదులై జగంబు మనుపం జెఱుపం గలయట్టి మీర లి**
**ట్లుల్లమునందు సోఁకుడుల నొండుక కొండగఁజూచి చెల్లఁబో**
**యిల్లొక పట్టునం గడచి యేఁగఁగ నేరని చుంచు కుఱ్ఱలన్**
**మొల్లపుఁ గాఱు కోనలకు మున్నరకం గొనిపోవఁ జూతురే? 78**

బల్లిదులై = శక్తివంతులై, జగంబు = లోకమును, మనుపన్ = రక్షించుటకు, చెఱుపన్ = నాశనము చేయుటకు, కలయట్టి = సమర్థులైనట్టి, మీరలు = మీరు, ఇట్లు = ఈ రీతిగా, ఉల్లమునందు = మనస్సునందు, సోకుడులన్ = రాక్షసులను, ఒండుక = ఒకానొక, కొండగన్ చూచి = కొండగా భావించి, చెల్లన్‌పో = ఒప్పుకున్నారుకదా!, ఇల్లు = ఇంటిని, ఒక పట్టునన్ = ఒకసారియైనను, కడచి = దాటి, ఏగగన్ = వెళ్ళుటకు, నేరని = ఎఱుగని, చుంచు కుఱ్ఱలన్ = పసి బిడ్డలను, మొల్లపున్ = దట్టమైన, కాఱు కోనలకు = కీకారణ్యములకు, మున్ను అరకన్ = ధైర్యముతో, కొనిపోవన్ = తీసుకొని వెళ్ళుటకు, చూతురే ?

**తా :** శక్తివంతులై లోకాన్ని రక్షించడానికి, శిక్షించడానికి సమర్థులైన మీరు ఇలా మనసులో రాక్షసులను ఒక కొండగా భావించి ఒప్పుకున్నారుకదా! మరి ఇంటిని ఒక్కసారైన దాటివెళ్ళుట ఎరుగని పసిబిడ్డలను ముందుచూపులేకుండా కీకారణ్యములకు తీసుకువెళ్ళడానికి చూస్తున్నారే?

**చం. అన నెద నుల్కి యబ్బలియుఁ డాతని కిట్లను మున్ను మీరు గో**
**రిన పని యెద్దియైన నొనరించెద నంచుఁ గడంక నాడి చ**
**య్యన నిపు డూరకే కడపి యంపఁ దలంచెదు మేలు మేల్బళా!**
**కనుగొన నయ్యె నీ చెడుగు గారడపుం బనులెల్ల నియ్యెడన్ 79**

అనన్ = అనగా, ఎదన్ ఉల్కి = మనసులో ఉలిక్కిపడినవాడై, ఆ బలియుడు = ఆ సమర్థుడైన విశ్వామిత్రుడు, ఆతనికి = ఆ దశరథునకు, ఇట్లు అను = ఈ విధముగా అనెను, మున్ను =

ఇంతకు ముందు, మీరు కోరిన పని, ఎద్దియైనన్ = ఏదియైనను, ఒనరించెదన్ అంచున్ = చేసెదనని, కడంకన్ ఆడి = నిశ్చయముగా పలికి, చయ్యన = వెంటనే, ఇపుడు = ఇప్పుడు, ఊరకే కడపి = ఈయక పొమ్మని, అంపన్ = పంపడానికి, తలంచెదు = ఆలోచిస్తున్నావు, మేలు = మంచిది, మేలు బళా = మెచ్చుకోదగినది, నీ చెడుగు గారడపుం పనులు = నీ పొగరు, మాయ పనులు, ఎల్లన్ = అన్నియును, ఇయ్యెడన్ = ఇదిగో ఇప్పుడు, కనుగొనన్ అయ్యెన్ = చూడనయ్యెను.

**తా :** అనగా మనసులో ఉలిక్కిపడినవాడై విశ్వామిత్రుడు ఆ దశరథునితో అన్నాడు 'ఇంతకుముందు మీరు కోరిన పని ఏదైనా చేస్తానని నిశ్చయంగా పలికి వెంటనే ఇప్పుడు ఊరికే కబుర్లు చెప్పి పంపడానికి చూస్తున్నావు. మంచిది. మెచ్చుకోదగినది. నీ నీచమైన మాయ పనులు ఇదుగో ఇప్పుడు చూడనయ్యాయి'.

**సీ.** **పలుమఱుఁ జలువతావులఁ జేరి పొరలుచు**
**వంకర నడలచే వఱలి యరిది**
**తేజునఁ బడగలెత్తియు నిరుఁ బుట్టువు**
**దొరలఁ గన్గొని మూలఁ దూఱుకొనుచుఁ**
**బొరయూని మే తాలుపులఁ జిఱ్ఱుమని వెఱ**
**కొలుపుచు రెండు నాల్కలు దనర్పఁ**
**బుడమిపై నెయ్యెడ నడుగిడ నేరక**
**బిట్టూరకయ బుసకొట్టుకొనుచు**

**తే.గీ.** **సన్నగాంద్రను బోఁద్రోలి సరగ వారి**
**నెలవు లెల్లను గైకొని చెలఁగుచుండుఁ**
**దులువ విసదారి రా కూటువలకు నెందుఁ**
**దలఁప నొక్కించుకయు మంచితనము కలదె?** **80**

పలుమఱున్ = పలుమార్లు, చలువతావులన్ = చల్లని ప్రదేశములను (రాజులు శయన గృహములను, పాములు కన్నములను), చేరి, పొరలుచు, వంకర నడలచే = కుటిల ప్రవర్తనలతో, వఱలి = బ్రతికి, అరిది = అపురూపమైన, తేజునన్ = వైభవముచే, పడగలు ఎత్తియున్ = పడగలెత్తి (కోట్లకు పడగలెత్తి), ఇరు పుట్టువు దొరలన్ = రెండు జన్మలుకల (పక్షి,బ్రాహ్మణ) శ్రేష్టులను (పరశురాముని, గరుత్మంతుని) కనుగొని, మూలన్ తూఱుకొనుచు = రహస్యముగా దాగుకొనుచు, పొర ఊని = కపటము వహించి (కూసము ధరించి), మే తాలుపులన్ = జీవులను, చిఱ్ఱుమని = చిరాకుపడి, వెఱ కొలుపుచు = భయపెట్టుచు, రెండు నాల్కలు, తనర్పన్ = ఒప్పు చుండగా, పుడమిపైన్, ఎయ్యెడన్ = ఎచ్చటను, అడుగు ఇడన్ ఏరక = పాదము పెట్టబోక (రాజులు రథంపైనో, గుఱ్ఱాలపైనో తిరుగుతూంటారు, పాముకి పాదములే ఉండవు), బిట్టు ఊరకయ = మిక్కిలి నిష్కారణముగా, బుసకొట్టుకొనుచు = కోపముతో బుసలు కొడుతూ, సన్నగాంద్రను =

తక్కువ బలము కలవారిని, పోన్ ద్రోలి = తొలగగొట్టి, సరగ = వెంటనే, వారి నెలవులు = వారి స్థానములు, ఎల్లను, గైకొని = ఆక్రమించి, చెలగుచుండు = చెలరేగుచుండు (చీమలు పెట్టిన పుట్టలే పాములకు ఆశ్రయము), తులువ = నీచులైన, విసదారి రా కూటువలకున్ = విషయుక్తులైన రాజ సమూహములకు (సర్పరాజ కూటములకు), తలపన్ = పరిశీలింపగా, ఎందున్ = ఎక్కడనైనను, ఒక్కించుకయు = కొంచెమైనను, మంచితనము, కలదె = ఉన్నదా? (పాములతో రాజులకు పోలిక)

**తా :** తరచుగా చలువ ప్రదేశములలో దొర్లుచు, కుటిల ప్రవర్తనతో బ్రతికి, అఖండ వైభ వమునకు పడగలెత్తి, ద్విజన్ముడైన పరశురాముని చూచి భయపడి మూల దాగుచు, కపటము వహించి జీవులను చిరాకుపడి భయపెట్టుచు, రెండు నాలుకలు ఒప్పుచుండగా భూమిమీద అడుగుపెట్టక గుఱ్ఱాలమీదో, రథాలమీదో తిరుగుతూ, కోపంతో బుసలు కొడుతూ, బలహీనులైన వారలను తొలగకొట్టి వారి నెలవులన్నిటిని ఆక్రమించి చెలరేగు చుండు నీచులైన విసదారి రాజులకు ఎక్కడైనా కొంచెమైనా మంచితనం ఉంటుందా? (ఎక్కువగా కన్నాల్లో చలువ ప్రదేశాలలో ఉండడం, వంకరగా పాకడం, పడగ లెత్తడం, గరుత్మంతునికి భయపడడం, జీవులను భయపెట్టడం, రెండు నాలుకలుండడం, కాళ్ళు నేలమీద పెట్టకపోవడం (కాళ్ళు లేవు కనుక), నిష్కారణంగా బుసకొట్టడం, బలహీనమైన చీమలను తొలగకొట్టి ఆక్రమించడం పాములకు సహజ లక్షణములు.)

**కం.** **కల్లల కెల్లను బుట్టిన**
**యిల్లనఁ బెల్లున జెలంగు నెకిమీఁదులకే**
**బల్లిదులుం గొఱ యగుదురె?**
**తెల్లంబుగ నొకటి నీకుఁ దెల్పెద వినుమా! 81**

కల్లలకు ఎల్లను = అన్ని అసత్యములకు, పుట్టిన ఇల్లు అనన్ = జన్మస్థానమనునట్లుగా, పెల్లునన్ చెలంగు = మిక్కిలి విజృంభించు, ఎకిమీడులకు = రాజులకు, ఏ బల్లిదులున్ = ఎంత తపశ్శక్తి కలవారైనను, కొఱ అగుదురె = సరితూగుదురా?, తెల్లంబుగ = స్పష్టముగా, నీకు ఒకటి తెల్పెద వినుమా = నీకు ఒకమాట చెబుతాను వినుము.

**తా :** అన్ని అసత్యములకు పుట్టినిల్లు అనునట్లుగా విజృంభించు రాజులకు ఎంత తపశ్శక్తి సంపన్నులైనా సరితూగుతారా? స్పష్టంగా నీకు ఒకమాట చెబుతాను విను –

**తే.గీ.** **రక్కసు లదెంత పలుమఱు స్రుక్కి కన్న**
**పున్నియం బెల్ల జెడునని యెన్నిగాక**
**కినిసి తిట్టినఁ బటియలై చనకయున్నె!**
**పసిఁడి పెన్బొజ్జ రా గ్రుడ్డు పనఁటిగములు 82**

పలుమఱు = చాలకాలము, స్రుక్కి = బాధపడి, కన్న = పొందిన, పున్నియంబు ఎల్ల = పుణ్యమంతయును, చెడును అని = పోతుందని, ఎన్ని కాక = అనుకొని కాని, కినిసి తిట్టినన్ = కోపించి శపించినచో, పసిడి పెను బొజ్జ రా = హిరణ్యగర్భుని (బ్రహ్మ)యొక్క, గ్రుడ్డు పనటి

గములు = బ్రహ్మాండ భాండ సమూహములు, పఱియలై చనక ఉన్నె = ముక్కలు ముక్కలు కాకపోవునా?, రక్కసులు = రాక్షసులు, అది ఎంత = వారి పరాక్రమము ఎంత?

**తా :** చాలాకాలం బాధపడి పొందిన పుణ్యమంతా పోతుందని అనుకొని కాని కోపించి శపించిన బ్రహ్మాండ భాండములు ముక్కలై పోవా? రాక్షసులెంత? వారి పరాక్రమమెంత?

**ఆ.వె.** **అనిన వెఱచి యొడయఁ డయ్య! మీ యెద నింత**
**కినుక యేల? తోడుకొని చనుండు**
**కూర్మి మీఱఁ బెద్దకొడుకును గడపటి**
**ల్లాలి పెద్దకొడుకు నప్పగించె** **83**

అనిన, ఒడయడు = రాజు, వెఱచి = భయపడి, అయ్య, మీ ఎదన్, ఇంత కినుక ఏల?, కూర్మి మీఱన్ = మిక్కిలి ప్రీతితో, తోడుకొని చనుండు = తీసుకొని వెళ్ళండని, పెద్ద కొడుకును = రాముని, కడపటి ఇల్లాలి పెద్దకొడుకును = లక్ష్మణుని, అప్పగించె = అప్పగించెను.

**తా :** అనగా, రాజు భయపడి 'స్వామీ! మీ మనసులో ఇంత కోపం ఎందులకు? ప్రీతితో తీసుకొని వెళ్ళండి' అని రాముని, లక్ష్మణుని అప్పగించెను.

**కం.** **తివిరి యిటు దపసి జన్నపు**
**నెవమున నమ్ముద్దు రాచ నిసువుల నెకిమీఁ**
**డు వనుపఁ దోడ్కొని యటు వెడ**
**లి వడిం బఱతెంచె నెద లలిం జను కడఁకన్** **84**

తివిరి = ప్రయత్నించి, తపసి = విశ్వామిత్రుడు, ఇటు = ఈ విధముగా, జన్నపు నెవమున = యజ్ఞము వంకతో, ఆ ముద్దు రాచ నిసువులన్ = ఆ చిన్నవారైన రాజకుమారులను (రామలక్ష్మణులను), ఎకిమీడు = దశరథుడు, పనుపన్ = పంపగా, తోడ్కొని = వెంటపెట్టుకొని, అటు వెడలి = అలా బయలుదేరి, వడిన్ = శీఘ్రముగా, ఎద లలిం = మనసున ఆనందముతో, చను కడకన్ = ప్రయాణమునకు పూనుకొని, పఱతెంచెన్ = ముందుకు సాగెను.

**తా :** ప్రయత్నించి విశ్వామిత్రుడు ఈ విధముగా యజ్ఞము వంకతో ఆ రాజకుమారులను దశరథుడు పంపగా వెంటపెట్టుకొని బయలుదేరి శీఘ్రముగా ఆనందముతో పయనించి ముందునకు సాగెను.

**తే.గీ.** **అత్తెఱంగున వేవేగ నరుగుచుండఁ**
**ద్రోవ నొక చెంత నబ్రంబు దోఁప బెద్ద**
**కొండవలె వచ్చు తొలివేల్పుఁ గొమ్మఁ జూపి**
**బాస వాల్మిన్న యా రాచపట్టి కనియె** **85**

ఆ తెఱంగున = ఆ ప్రకారముగా, వేవేగన్ = మిక్కిలి వేగముగ, అరుగుచుండన్ = వెళ్ళు చుండగా, త్రోవన్ = దారిలో, ఒక చెంతన్ = ఒక చోట, అబ్రంబు తోప = అద్భుత మని పించునట్లుగా, పెద్ద కొండవలె, వచ్చు = మీదకు వచ్చుచున్న, తొలివేల్పు కొమ్మన్ చూపి = రాక్షస స్త్రీని చూపించి

(తాటకి), బాస వాలు మిన్న = మాటయే (శాపమే) ఆయుధముగాకల శ్రేష్ఠుడు (విశ్వామిత్రుడు), ఆ రాచపట్టికి అనియె = ఆ రామునితో అనెను.

**తా :** ఆ ప్రకారముగా వేగముగా వెళుతూండగా దారిలో ఒకచోట అద్భుతమనిపించేట్లుగా పెద్ద కొండలా మీదికి వస్తూన్న తాటకిని చూపించి విశ్వామిత్రుడు రామునితో అనెను.

**కం.** **అల్లదె తాటక యనియెడు**
**కల్లరి రాకాసి పొగరు గదురఁగ వచ్చెన్**
**విల్లెక్కిడి యొక చిల్కునఁ**
**ద్రెళ్ళింపుము పొలఁతి యనుచుఁ దెగడక దానిన్** **86**

అల్లదె = అదిగో!, తాటక అనియెడు = తాటక అని పిలువబడే, కల్లరి రాకాసి = దుష్ట రాక్షసి, పొగరు గదురగ = పొగరు విజృంభించగా, వచ్చెన్ = వచ్చినది, విల్లు ఎక్కిడి = విల్లు ఎక్కుపెట్టి, ఒక చిల్కునన్ = ఒక్క బాణముతో, పొలతి అనుచున్ = స్త్రీయని, తెగడక = ఉపేక్షింపక, దానిన్ = ఆ తాటకను, త్రెళ్ళింపుము = పడగొట్టుము.

**తా :** అదుగో! తాటకి అనబడే దుష్ట రాక్షసి. మిక్కిలి గర్వంతో వస్తోంది. విల్లు ఎక్కుపెట్టి ఒక్క బాణంతో స్త్రీ అని ఉపేక్షించక ఆ రాక్షసిని పడగొట్టుము.

**కం.** **చలమే లగ్గలముగ న**
**చ్చలమే పెంచుకొని తులువజాడ నడరు న**
**ప్పొలమేఁతరి చెలి ద్రిమ్మరు**
**పొల మేతటినైన వేలుపులు సొరరు సుమీ!** **87**

చలము ఏలు అగ్గలముగ = ద్వేషమును ఎక్కువగా గ్రహించుము, ఆ చలమే పెంచుకొని = ఆ ద్వేషమునే పెంచుకొని, తులువజాడన్ అడరు = దుష్టమార్గమున ప్రవర్తించు, ఆ పొలమేతరి చెలి = ఆ మాంసమే ఆహారముగాకల తాటక, త్రిమ్మరు = తిరుగు, పొలము = ప్రదేశమును, ఏ తరినైనను = ఏ సమయములోనుకూడా, వేలుపులు = దేవతలు, చొరరు సుమీ = ప్రవేశించరుసుమా!

**తా :** సందేహ మెందుకు? మిక్కిలి ద్వేషాన్ని పెంచుకో. ఆ ద్వేషమునే పెంచుకొని దుష్ట మార్గంలో ప్రవర్తించే ఆ తాటకి తిరుగు ప్రదేశంలో ఏ సమయంలోనూ దేవతలు ప్రవేశించరుసుమా.

**కం.** **అని పెక్కు దొడ్డ తూపులు**
**నెనరొదవఁగ నిడిన వేడ్క నివ్వటిలం గై**
**కొని రాచపట్టి సింగిణి**
**గొనయం బెక్కించి ముల్కిఁ గూరిచి కడిమిన్** **88**

అని = అని చెప్పి, పెక్కు దొడ్డ తూపులు = పెక్కు శ్రేష్ఠములైన బాణములు, నెనరు = ప్రేమగా, ఒదవగన్ ఇడిన = ప్రయోగించుటకు ఇవ్వగా, వేడ్క నివ్వటిలన్ = సంతోషము అతిశయింపగా, గైకొని = తీసుకొని, రాచపట్టి = రాముడు, సింగిణి = ధనుస్సునకు, గొనయంబు ఎక్కించి = నారిని తొడిగి, ముల్కిన్ = బాణమును, కూరిచి = సంధించి, కడిమిన్ = ధైర్యముతో.

**తా :** అని చెప్పి శ్రేష్ఠములైన పెక్కు బాణము లిచ్చిన సంతోషముతో తీసుకొని రాముడు ధనుస్సునకు నారి తొడిగి బాణమును ఎక్కించి ధైర్యముతో –

**కం.** **తెగ నిండఁదీసి రక్కసి**
**చిగురాకుంబోఁడి మీఁదఁ జిమ్మిన బెడిదం**
**బుగ మింట మంట లెగయఁగ**
**నొగిఁ జని యమ్ములికి దాని యుసురులు గొనియెన్** **89**

తెగనిండన్ తీసి = నారిని పూర్తిగా లాగి, రక్కసి చిగురాకుంబోడి మీద = రాక్షస స్త్రీ మీద, చిమ్మిన = వేయగా, బెడిదంబుగ = అధికముగ, మింట = ఆకాశమున, మంటలు ఎగయగన్ = మంటలు వ్యాపింపగా, ఒగిన్ = నేరుగా, చని = వెళ్ళి, ఆ ములికి = ఆ బాణము, దాని = ఆ తాటకయొక్క ఉసురులు గొనియెన్ = ప్రాణములు తీసెను.

**తా :** నారిని పూర్తిగా లాగి ఆ రాక్షసి మీద వేయగా ఆకాశమున మంటలు వ్యాపించి నేరుగా వెళ్ళి ఆ బాణము ఆ తాటకి ప్రాణములు తీసెను.

**కం.** **అపుడు జడదారి ఱేఁ డు**
**ల్లపుఁ దామర నలరి వారలం దోడ్కొని వై**
**ళపు నడకలతోఁ దన జ**
**న్నపు టిల్లుగల యలరుఁ దోపునకుఁ బఱతెంచెన్** **90**

అపుడు, జడదారి ఱేడు = ముని శ్రేష్ఠుడు, ఉల్లపు తామరన్ = పద్మమువంటి హృదయమునందు, అలరి = సంతోషించి, వారలన్ తోడ్కొని = ఆ రామలక్ష్మణులను తీసుకొని, వైళపు నడకలతోన్ = శీఘ్ర గమనముతో, తన జన్నపు ఇల్లు కల = తన యాగశాల ఉన్నటువంటి, అలరు తోపునకు = సుందరమైన ప్రదేశమునకు, పఱతెంచెన్ = వచ్చెను.

**తా :** అపుడు మునిశ్రేష్ఠుడు సంతోషించి వారిని తీసుకొని శీఘ్రగమనముతో తన యాగశాల ఉన్న ప్రదేశమునకు వచ్చెను.

**సీ.** **గుజ్జు లేమావి మ్రాఁకుల నంటఁ బ్రాఁకిన**
**పరువంపుఁ దలిరాకు పందిరులును**
**వలపుఁ జెంగల్వ బావుల క్రేవ జాల్గొన్న**
**చలువ గొజ్జఁగి నీటి జక్కరలును**
**బ్రోది కప్రపుటంటి బోదియ చాఁల్మోల**
**జడగొన్న నునుగున్న సంపఁగులును**
**బలితంపు నెత్తమ్మి కొలఁకుల కెలఁకులఁ**
**బొదలు మొల్లపు మొల్ల పూఁబొదలును**

**తే.గీ.** **గలిగి మఱియును బండ్లు గాయలు చిగుళ్ళు**
**విందియలు పూలు ముత్తఱులం దనర్చు**

**నెల్ల చెట్టులు నలర నబ్బల్లిదంపు**
**రా నిరాబారి నెల మన్కి గోన మెఱయు** **91**

ఆ బల్లిదంపు రా నిరాబారి = ఆ శ్రేష్ఠమైన రాజర్షి, నెల = స్థానమై, మన్కి = జీవించు, కోన = ప్రదేశము, గుజ్జు లేమావి ప్రాకులన్ = గున్న లేతమామిడి చెట్లను, అంటన్ = అల్లుకొని, ప్రాకిన, పరువంపు = చక్కనైన, తలిరు ఆకు పందిరులును = చిగురుటాకు పందిళ్ళును, వలపున్ = పరిమళముకల, చెంగల్వ బావుల క్రేవన్ = ఎఱ్ఱ కలువల దిగుడుబావుల చెంత, జాలు కొన్న = ప్రవహించుచున్న, చలువ = చల్లని, గొజ్జగి నీటి జక్కరలును = గొజ్జగిపూల పరిమళముకల నీటి ప్రవాహములును, ప్రోది = పెంచబడిన, కప్రపు అంటి బోదియ చాలు = కర్పూర అరటి మొక్కలు వరుస, ప్రోల = చేరువన, జడగొన్న = పెనవేసుకొనిన, నును = అందమైన, గున్న = చిన్న, సంపగులును = సంపంగి గుబురులును, బలితంపు = గట్టి గట్లుకల, నెత్తమ్మి కొలకులు కెలకుల = అందమైన తామర చెఱువుల ప్రక్కలందు, పొదలు = పెరిగిన, మొల్లపు = దట్టమైన, మొల్ల పూ పొదలును, కలిగి, మఱియును, పండ్లు, కాయలు, చిగుళ్ళు, పిందియలు = పిందెలును, పూలు, మూడు తఱులన్ = మూడు కాలములందును, తనర్చు = అతిశయించు, ఎల్ల చెట్టులు = అన్ని వృక్షములును, అలరన్ = ఒప్పుచుండగా, మెఱయున్ = ప్రకాశించును.

**తా :** విశ్వామిత్రుని ఆశ్రమ ప్రదేశము లేత మామిడిచెట్లను అల్లుకొని పైకెదిగిన చిగురుటాకు పందిళ్ళతో, పరిమళించు ఎఱ్ఱకలువల దిగుడుబావులచెంత ప్రవహించు చల్లని గొజ్జంగి నీటి ప్రవాహములతో, పెంచబడిన కర్పూర అరటిమొక్కల చేరువన చక్కగా పెనవేసుకొన్న సంపంగి గుబురులతో, గట్టి గట్లుకల తామర కొలకుల ప్రక్కలందు పెరిగిన మొల్ల పూగుబురులతో మఱియు పండ్లు, కాయలు, చిగుళ్ళు, పిందెలు, పూలు మూడు కాలములందును ఒప్పెడి అన్ని చెట్లతో అతిశయించుచు ప్రకాశించుచుండును.

**కం.** **అనయంబు నచటి వెలి ది**
**య్యని పండులు మెక్కి చొక్కి యక్కజపు జిగిన్**
**బెను మినుకులు నక్కొనలుం**
**గొనగొని యెలుఁగించు మరుని గుఱ్ఱపుఁ దుటుముల్** **92**

మరుని = మన్మథుని యొక్క, గుఱ్ఱపు తుటుముల్ = గుఱ్ఱములైన చిలుకల సమూహములు, అనయంబు = ఎల్లవేళలా, అచటి = అక్కడి, వెలి = ఆశ్రమం బయట, తియ్యని పండులు = తియ్యనైన పండ్లను, మెక్కి = తిని, చొక్కి = పరవశించి, అక్కజపు జిగిన్ = పెద్ద స్వరముతో, పెను మినుకులు = వేదములను, ఆ కొనలున్ = ఆ వేదముల చివరలగు ఉపనిషత్తులను, కొనకొని = పూనుకొని, ఎలుగించు = కూయుచుండును.

**తా :** మన్మథుని గుఱ్ఱములైన చిలుకలు అక్కడి తియ్యని పండ్లను తిని పరవశించి పెద్ద స్వరముతో వేదములను, ఉపనిషత్తులను పూనుకొని కూయుచుండును.

**తే.గీ. తగిలి నెగడెడు వ్రేలిమి పొగలు మొగుల**
**తెగలనియు మిన్కు టులివులు తివిరి మొఱయు**
**నుఱుము లనియును బురివిచ్చి యుబ్బి యాడుఁ**
**గప్పు మెడ పుల్గుగము లాము గవిసి యందు 93**

కప్పుమెడ = నల్లని కంఠముకల, పుల్గు గములు = పక్షి సమూహములు (నెమళ్ళు), ఆము కవిసి = మదించి, అందు = అక్కడ, తగిలి = చెలరేగి, నెగడెడు = అధికమగుచున్న, వ్రేలిమి పొగలు = హెూమాగ్నుల పొగలు, మొగుల తెగలు అనియు = మేఘముల సమూహము లనియును, మిన్కు ఉలివులు = వేద స్వరములు, తివిరి = ప్రయత్నముతో, మొఱయు = మ్రోగుచున్న, ఉఱుములు, అనియును, పురి విచ్చి, ఉబ్బి = సంతోషముగా, ఆడున్.

**తా :** నెమళ్ళు మదించి చెలరేగి హెూమాగ్ని పొగలు మేఘ సమూహములని, వేదస్వరములు మ్రోగుచున్న మేఘ గర్జనములని పురివిప్పి సంతోషముగా ఆడుచున్నవి.

**ఉ. వెన్నెల రాచఱాచలువ విప్పు టరంగులఁ జేరి జాళువా**
**కిన్నర లూని జాను దిలకింపఁగఁ బాటలు వాడు బాసవా**
**ల్కన్నియ మిన్న గాణలకు గాటముగా సుతు లిచ్చు నచ్చటన్**
**గ్రొన్ననఁ గమ్మతేనియలు గ్రోలుచుఁ దుమ్మెదబోఁటి కూటువల్ 94**

వెన్నెల రాచ ఱా = చంద్రకాంతపు శిలల, చలువ విప్పు అరంగుల = చల్లని విశాలమైన అరుగులమీద, చేరి, జాళువా కిన్నరలు = బంగారు వీణలను, ఊని = పట్టుకొని, జాను తిలకింపగన్ = సౌందర్యము ప్రదర్శితమగునట్లుగా, పాటలు పాడు = పాటలు పాడుచున్న, బాసవాలు కన్నియ మిన్న గాణలకు = శ్రేష్ఠులైన మునికన్యకా గాయనులకు, అచ్చటన్ = అక్కడ, గాటముగా = ఎక్కువగా, క్రొన్నన కమ్మ తేనియలు = విరిసిన పూలలోని మధురమైన తేనెలను, గ్రోలుచు = త్రాగుచు, తుమ్మెదబోటి కూటువల్ = ఆడు తుమ్మెదల సమూహములు, సుతులు ఇచ్చును = శ్రుతి కలుపును.

**తా :** చంద్రకాంత శిలల చల్లని విశాలమైన అరుగులమీద చేరి బంగారు వీణలను పట్టుకొని సుందరముగా పాడుచున్న దేవతా గాయనిలకు అక్కడ విరిసిన పూల మధురమైన తేనెలను త్రాగుచు ఆడు తుమ్మెదల సమూహములు శ్రుతి కలుపును.

**తే.గీ. తమ్మి కొలఁకుల నోలాడి కమ్మపూవుఁ**
**గొమ్మలు గదల్చి కపురంపు దిమ్మ లెక్కి**
**నెమ్మిఁ గ్రొమ్మావి నీడల నిలిచి పొలిచి**
**మెలఁగు వలినాలి చిఱుగాడ్పు లెలమినందు 95**

చిఱుగాడ్పులు = పిల్లవాయువులు, ఎలిమిన్ = ఆనందముతో, అందు = ఆ ఆశ్రమమున, తమ్మి కొలకులన్ = తామరకొలనులందు, ఓలాడి = ఓలలాడి, కమ్మపూవున్ కొమ్మలు = పరిమళించు పూవుల శాఖలను, కదల్చి = ఊపి, కపురంపు దిమ్మలు ఎక్కి = కర్పూర కుప్పలపైకి ఎక్కి,

నెమ్మిన్ = నెమ్మదిగా, క్రొమ్మావి నీడల నిలిచి = గున్న మామిడి చెట్ల నీడలయందు నిలబడి, పొలిచి = స్థిరమై, వలి = చల్లని, నాలి = మందముగా, మెలగు = సంచరించును.

**తా :** పిల్లవాయువులు ఆనందముతో ఆ ఆశ్రమమునందలి తామరకొలనులందు ఓలలాడి, పరిమళించు పూవుల శాఖలను కదల్చి, కర్పూర కుప్పలపైకి ఎక్కి, గున్న మామిడి చెట్ల నీడలయందు కూతలు కూయుచు చల్లని మందమై సంచరించుచుండును.

**సీ.** **పసిదిండి మెకపు లే బాలెంత లాకొన్న**
**జింక కూనలకుఁ బాల్సేపి యొసఁగ**
**బడగ లడ్డుగఁ బట్టి పాఁప చేడియ పిండు**
**లెలుక బోదల కెండఁ దొలఁగఁ జేయ**
**సింగపుఁ జెలులు మచ్చిక మీఱ నెక్కుడు**
**మెకము పిల్లల దువ్వి మేఁత లిడఁగ**
**బిత్తరంపు జవాది పిల్లి వెలందుక**
**ల్చిలుక ముద్దియలతోఁ జెలిమి నెఱపఁ**

**తే.గీ.** **గొదమ తోఁడేటి జోటి చాల్గొండ గొఱియ**
**కన్నియలఁ జేరి తద్దయు గారవింప**
**నబ్రముల కెల్ల నాటపట్టనఁగఁ జాలి**
**వెలుఁగు నమ్మేటి తపసి రేవెలుఁగు నెలవు** **96**

పసితిండి మెకపు లే బాలెంతలు = లేత బాలెంతలైన పెద్దపులులు, ఆకొన్న = ఆకలితోనున్న, జింక కూనలకు, పాలు చేపి = పాలను చేపి, ఒసగన్ = ఈయగా, పాప చేడియ పిండులు = ఆడ పాముల సమూహములు, పడగలు అడ్డుగన్ పట్టి = తమ పడగలను అడ్డముగానుంచి, ఎలుక బోదలకు = ఎలుక పిల్లలకు, ఎండ తొలగన్ చేయ = ఎండ తగులకుండ చేయగా, సింగపు చెలులు = ఆడు సింహములు, మచ్చిక మీఱన్ = మిక్కిలి మచ్చికతో, ఎక్కుడు మెకము పిల్లలన్ = ఏనుగు గున్నలను, దువ్వి = బుజ్జగించి, మేతలు ఇడగ = మేతలు అందివ్వగా, బిత్తరంపు = బెదరు చూపులు చూచు, జవాది పిల్లి వెలందుకలు = ఆడు జవాది పిల్లులు, చిలుక ముద్దియలతోన్ = ఆడు చిలుకలతో, చెలిమి నెఱపన్ = స్నేహము చేయగా, కొదమ = వయసులోనున్న, తోడేటి జోటి చాలు = ఆడు తోడేళ్ళ గుంపులు, కొండ గొఱియ కన్నియలన్ చేరి = కొండ గొఱ్ఱె కన్యలను చేరి, తద్దయు = మిక్కిలి, గారవింపన్ = గౌరవింపగా, అబ్రములకు ఎల్ల = అద్భుతాలన్నిటికిని, ఆటపట్టు అనగన్ = వాసస్థానము అనగా, చాలి = సరిపడి, ఆ మేటి = ఆ శ్రేష్ఠుడైన, తపసి రే వెలుగు = తాపసి చంద్రుడు, నెలవు = స్థానము (ఆశ్రమము), వెలుగు = ప్రకాశించును.

**తా :** బాలెంతలైన పెద్దపులులు ఆకలితోనున్న జింకపిల్లలకు పాలను చేపి ఈయగా, ఆడ పాములు తమ పడగలను అడ్డముపెట్టి ఎలుక పిల్లలకు ఎండ తగులకుండా చేయగా, ఆడు

సింహములు మచ్చికతో ఏనుగు గున్నలను బుజ్జగించి మేతలు అందివ్వగా, బెదురు చూపులు చూచు ఆడు జవాది పిల్లులు ఆడు చిలుకలతో స్నేహము చేయగా, వయసులోని తోడేళ్ళు కొండ గొఱ్ఱె కన్యలను మిక్కిలి గౌరవింపగా అద్భుతములన్నిటికిని ఆటపట్టై శ్రేష్ఠుడైన ఆ విశ్వామిత్రుని ఆశ్రమము ప్రకాశించును.

**తే.గీ.** **అట్టి తనయుని్కి పట్టున కత్తెఱఁగున**
**బుజము పుట్టువు కుఱ్ఱ బెబ్బులులఁ దెచ్చి**
**తనియఁ బూజ లొసంగి యత్తపసి రాయ**
**డంతఁ దా జన్న మొనరించు నదను నందు** **97**

అట్టి = అటువంటి, తన ఉని్కి పట్టునకు = తన నివాస స్థానమునకు, ఆ తెఱగున = ఆ విధముగా, బుజము పుట్టువు = క్షత్రియవంశజులైన (క్షత్రియులు భుజములనుండి పుట్టారు), కుఱ్ఱ బెబ్బులులన్ = పులిపిల్లలవంటి రామలక్ష్మణులను, తెచ్చి = తీసుకొనివచ్చి, ఆ తపసిరాయడు = ఆ మునిశ్రేష్ఠుడు, తనియన్ = తృప్తిగా, పూజలు ఒసగి = గౌరవించి, అంతన్ = అంతట, తాన్ = తాను, జన్నము ఒనరించున్ = యజ్ఞము చేయుచున్న, అదను నందు = సమయమునందు,
**తా :** ఆ మునిశ్రేష్ఠుడు తన నివాస స్థానమునకు క్షత్రియవంశజులైన పులి పిల్లలవంటి రామలక్ష్మణులను తెచ్చి, తృప్తిగా పూజలు చేసి యజ్ఞము చేయుచున్న అదనునందు,

**కం.** **తులువ తొలివేల్పు లిరువురు**
**బలితఁపు టామెసఁగఁ జదల బలుమూఁకలతో**
**నిలిచి చలమార నల్లయు**
**బొలసును గురియించుచున్నఁ బొడఁగాంచి వెసన్** **98**

తులువ తొలివేల్పులు = నీచులైన రాక్షసులు, ఇరువురు, బలితంపు = అధికమైన, ఆము ఎసగన్ = మదము అతిశయింపగా, చదలన్ = ఆకాశమునందు, పలు మూకలతోన్ = పెక్కు గుంపులతో, నిలిచి, చలము ఆరన్ = మాత్సర్యముతో, నల్లయు = రక్తమును, పొలసును = మాంసమును, కురియించుచు ఉన్న, పొడగాంచి = చూచి, వెసన్ = శీఘ్రముగా,
**తా :** నీచులైన రాక్షసులు అధికమైన మదముతో ఆకాశమునందు పెక్కుమంది అనుచరులతో నిలిచి మాత్సర్యముతో రక్తమును, మాంసమును కురిపించుచున్న చూచి వెంటనే –

**కం.** **రాకొమరుఁ డపుడు వింటన్**
**జోకగ రెండమ్ము లూని జుఱుకలరఁగ న**
**య్యాకసమునఁ ద్రిమ్మరు బ**
**ల్రాకాసుల నేల నిర్వురం బడ నేసెన్** **99**

అపుడు, రాకొమరుడు = రాముడు, వింటన్ = ధనుస్సున, జోకగన్ = జంటగా, రెండు అమ్ములు = రెండు బాణములను, ఊని = సంధించి, చుఱుకు అలరగన్ = గురి తప్పకుండా, ఆ ఆకసమునన్ = అలా ఆకాశమున, త్రిమ్మరు = తిరుగుచున్న, బల్ రాకాసులన్ = బలిష్ఠులైన రాక్షసులను, ఇర్వురన్, నేలన్ పడన్ ఏసెన్ = నేలమీద పడునట్లుగా వేసెను.

**తా :** అపుడు రాముడు ధనుస్సున జంటగా రెండు బాణములను సంధించి గుఱి చూసి ఆకాశమున సంచరించుచున్న బలిష్ఠులైన ఇద్దరు రాక్షసులను నేలపడునట్లుగా వేసెను.

**ఉ. అత్తఱి జోగివేల్పు టొడయం డెద నాతని మెచ్చి కూర్మితో**
**నెత్తి కవుంగలించుకొని హెచ్చుగ వేలుపు లెల్ల సొంపు ద**
**ళ్కొత్తఁగ చేరి వ్రేలుముల నోరెపు పాళ్ళు గొనంగ గిత్త రా**
**తత్తడి ఱేఁ డెదం దనియఁ దప్పక జన్న మొనర్చి యంతటన్ 100**

ఆ తఱిన్ = ఆ సమయమున, జోగి వేల్పు ఒడయడు = మునీంద్రుడు, ఎదన్ = మనసున, ఆతనిన్ = ఆ రాముని, మెచ్చి = మెచ్చుకొని, కూర్మితోన్ = ప్రీతితో, ఎత్తి కవుంగలించుకొని = గట్టిగా కవుగలించుకొని, హెచ్చుగ = ఆనందముగా, వేలుపులు ఎల్లన్ = దేవతలందరును, సొంపు తళ్కొత్తగన్ = సొగసు మిక్కిలి ప్రకాశింపగా, చేరి = సమీపించి, వ్రేలుములన్ = హెూమములందు, ఓరెపు పాళ్ళు = హవిర్భాగములను, కొనంగ = స్వీకరించగా, గిత్త రా తత్తడి ఱేడు = నంది వాహనముగాకల శివుడు, ఎదన్ = మనసున, తనియన్ = తృప్తిచెందగా, తప్పక = యథావిధిగా, జన్నము ఒనర్చి = యాగము సల్పి, అంతటన్ = అప్పుడు,

తా : ఆ సమయమున మునీంద్రుడు మనసున రాముని మెచ్చుకొని ప్రేమతో కౌగలించుకొని, దేవతలు సొగసు తళ్కొత్త చేరి హెూమములందు హవిర్భాగములను స్వీకరించగా, శివుడు తృప్తిచెందగా యథావిధిగ యజ్ఞము సల్పి అప్పుడు,

**కం. ఇరుచక్క మేనులూన్ బలు**
**దొరకొలపుం బాలవాఁగు తొగల యనుంగై**
**పరఁగెడు నప్పది తేరుల**
**దొరపట్టికిఁ బొలము మన్కి దొర యిట్లనియెన్ 101**

ఇరు చక్క = రెట్టింపైన అందముతో, మేనులు ఊన్ = కాంతులు వహించి, బలుదొర కొలపున్ = గొప్ప రాజవంశమనెడు, పాలవాగు = పాలసముద్రమున, తొగల అనుంగై = కలువల ప్రియుడైన చంద్రుడై, పరగెడు = ఒప్పునట్టి, ఆ పది తేరుల దొరపట్టికిన్ = దశరథుని పుత్రుడైన రామునికి, పొలముమన్కి దొర = ముని శ్రేష్ఠుడు (విశ్వామిత్రుడు), ఇట్లు అనియెన్ = ఈరీతిగా పల్కెను.

**తా :** రెట్టింపైన అందముతో కాంతులు వహించి సూర్యవంశమనెడు పాలసంద్రమున కలువలప్రియుడు చంద్రుడై ఒప్పు దశరథ పుత్రుడైన రామునికి విశ్వామిత్రుడనెను.

**కం. విను రాచపట్టి! జనకుం**
**దను నొడయఁ డొకండు మిథిల యనియెడు వీటన్**
**బని మీఱ సీత యనియెడు**
**తన బిడ్డకుఁ బెండ్లిసేయఁ దలఁచి కడంకన్ 102**

రాచపట్టి = రాజకుమారా!, విను = వినుము, జనకుండు అను = జనకుడనే, ఒడయడు = రాజు, ఒకండు = ఒకడు, మిథిల అనియెడు = మిథిల అనబడే, వీటన్ = నగరమున, పని

మీఱ = పూనుకొని, సీత అనియెడు = సీత అనబడే, తన బిడ్డకున్ = తన కుమార్తెకు, పెండ్లి చేయన్ = వివాహము చేయుటకు, తలచి, కడంకన్ = ప్రయత్నమున,

**తా :** రాజకుమారా! విను, జనకుడనే రాజు ఒకడు మిథిలా నగరమున సీత అనే తన కుమార్తెకు వివాహం చేయాలనే ప్రయత్నంలో –

**తే.గీ.** **నలువు మెఱయంగఁ బెద్దల నాటనుండి**
**మున్ను దమయింట డాకొనియున్న విన్ను**
**మూల దేవర విల్లెత్తఁ జాలు మేటి**
**కిత్తుఁ దన కన్నెనంచు నొట్టిడుక యతఁడు** **103**

అతడు = ఆ జనక మహారాజు, పెద్దల నాటనుండి = తాతల కాలమునుండియు, మున్ను = ఇంతకు ముందు, తమ ఇంట = తమ ఇంటిలో, డాకొని ఉన్న = చేరియున్న, విన్ను మూల దేవర విల్లు = ఆకాశమే కొప్పుగా కల దేవుడు (శివుడు) విల్లు, నలువు మెఱయంగ = సామర్థ్యము ప్రకాశింపగా, ఎత్తన్ చాలు మేటికి = ఎత్తగల వీరునకు, తన కన్నెన్ = తన కూతును, ఇత్తున్ = ఇచ్చెదను, అంచున్ = అనుచు, ఒట్టు ఇడుక = పంతము పట్టుకొని,

**తా :** అతడు తాతల కాలంనాటినుండియు తమ ఇంటవున్న శివధనుస్సును ఎత్తగల వీరునికి తన కూతురును ఇస్తానని పంతం పట్టుకొని –

**ఆ.వె.** **పుడమిలోనఁ గల్గు పుడమితేఁడుల కెల్లఁ**
**దేటపడఁగఁ గడలఁ జాటఁ బనిచె**
**నయ్య! ముజ్జగముల నల రాచకన్నియ**
**యుద్దిఁ బోల రెట్టి ముద్దియలును** **104**

అయ్య = ఓ రామా!, పుడమిలోనన్ = భూమండలముపై, కల్గు = ఉన్నటువంటి, పుడమితేడులకు ఎల్లన్ = రాజులందరికిని, తేటపడగన్ = ఎఱుకపడేలా, కడలన్ = దిక్కు లన్నిటను, చాటన్ పనిచెన్ = చాటుటకు పంపించెను. ముజ్జగములన్ = మూడులోకము లందును, అల రాచకన్నియ = ఆ రాచపట్టికి, ఎట్టి ముద్దియలును = ఎలాంటి కన్యలును, ఉద్దిన్ పోలరు = జతపడరు.

**తా :** ఓ రామా! భూమండలముపై కల రాజులందరికీ తేటపడేలా దిక్కులన్నిట చాటింపు వేయించేడు. మూడులోకాల్లోను ఆ రాచపట్టికి జతపడు కన్యలు లేరు.

**కం.** **మీలుం దామర పూలున్**
**మేలగు నమ్ముద్దరాలి మినుకుఁ గనుఁగవన్**
**బోలక నీట మునింగెన్**
**మూలకు దొరగాక యిర్లు మూలకుఁ జేరెన్** **105**

మేలగున్ = శ్రేష్ఠరాలైన, ఆ ముద్దరాలి = ఆ సీతాదేవియొక్క, మినుకున్ = కాంతివంతములైన, కనుగవన్ = నేత్రద్వయమును, పోలక = సరిరాలేక, మీలున్ = చేపలును, తామర పూలున్, నీట మునిగెన్ = నీటిలో మునిగి ఉండిపోయెను, మూలకు = ఆమె కొప్పునకు, దొర కాక = సరికాక, ఇర్లు = చీకట్లు, మూలకున్ చేరెన్ = మూలలకు చేరిపోయెను.

**తా :** ఆ సీతాదేవి యొక్క కన్నులకు సరిరాలేక చేపలు, తామరపూలు నీటిలో ఉండి పోయాయి. ఆమె కొప్పునకు సరిరాక చీకట్లు మూలలకు చేరిపోయాయి.

**కం.** **ఒడలున్ దొడలు న్నడలున్**
**మెడయుం జడయుం దనర్చు మెలఁతకు మేల్పు**
**త్తడి నంట్ల నంచబోదల**
**నడరెడు చిందములఁ దేంట్ల నల్లన నగుచున్** **106**

మెలతకు = ఆ సీతాదేవికి, ఒడలున్ = దేహమును, తొడలున్ = తొడలును, నడలున్ = నడకలును, మెడయున్ = కంఠమును, జడయుం = జడయును, మేలు పుత్తడిన్ = స్వచ్ఛమైన బంగారమును, అంట్లన్ = అరటి కాండములను, అంచ బోదల = పిల్ల హంసలను, అడరెడు = ఒప్పునట్టి, చిందములన్ = శంఖములను, తేంట్లన్ = తుమ్మెదలను, అల్లన = మెల్లిగా, నగుచున్ = పరిహసించుచు, తనర్చు = ఒప్పును. (క్రమానుసంధానము).

**తా :** ఆ సీతాదేవి దేహము బంగారమును, తొడలు అరటి కాండములను, నడకలు హంసలను, కంఠము శంఖమును, జడ తుమ్మెదలను పరిహసించును.

**కం.** **తొవలా కన్నులు, వలిజ**
**క్కవలా పాలిండ్లు, తేఁటి గములా కురు, లా**
**నవలాతో నెనఁ బోలుప**
**నవలా నిక నొక పొలంతి యబ్బదు సుమ్మీ!** **107**

ఆ కన్నులు = ఆమె కన్నులు, తొవలు = కలువలు, ఆ పాలిండ్లు, వలి జక్కవలు = గుండ్రని చక్రవాక పక్షులు, ఆ కురులు = ఆమె కేశములు, తేటి గములు = తుమ్మెద గుంపులు, ఆ నవలాతోన్ = ఆ స్త్రీతో (సీత), ఎనన్ పోలుపన్ = సాటి చెప్పుటకు, అవల = అవతల, ఆనికన్ = దార్ఢ్యముకల, ఒక పొలంతి = ఒక్క స్త్రీయును, అబ్బదు సుమ్మీ = దొరకదు సుమా!

**తా :** ఆమె కన్నులు కలువలు, స్తనములు చక్రవాక పక్షులు, కేశములు తేటిగములు, సీతతో సాటిచెప్పుటకు దార్ఢ్యముకల స్త్రీ దొరకదుసుమా!

**సీ.** **తుమ్మెద ల్సెలవిండ్లు తొగలు సంపఁగి మొగ్గ**
**మగరాలు తేనియ ల్మంకెన విరి**
**యద్దము ల్తొమ్మిదు లలఁతి వెన్నెల సంకు**
**తూండ్లు కెందామర ల్చెండ్లు చిలువ**
**తరఁగలు సుడి మొగిల్దారి యరుంగులు**
**మల యనంటులు దొనల్ మట్టిపండ్లు**
**తలిరులు రిక్కలు తాఁబేళ్ళు రాయంచ**
**కొదమలు గపురంబు కుందనంబు**

**తే.గీ.** **ననలు చిలుకయు నొనఁగూర్చి నలుమొగముల**
**ప్రోడ తన ప్రోడతనమెల్లఁ బుడమియందు**

**నెఱఁపగాఁ గోరి యమ్ముద్దు నెలఁత నట్లు**
**పొలుపు మెఱయంగ నొనరింపఁబోలుఁ జుమ్మి! 108**

తుమ్మెదలు, సెలవిండ్లు = ధనుస్సులను, తొగలు = కలువలు, సంపగి మొగ్గ, మగరాలు = వజ్రములు, తేనియలు, మంకెన విరి = మంకెన పుష్పము, అద్దములు, తొమ్మిదుల్ = తొమ్మిది సంఖ్యలను (9), అలతి వెన్నెల = కొంచెము వెన్నెలను, సంకు = శంఖము, తూండ్లు = తామర తూళ్ళు, కెంపు తామరలు = ఎఱ్ఱ తామరలు, చెండ్లు = పూలచెండ్లు, చిలువ = పాము, తరగలు = కెరటములు, సుడి = సుడిగుండము, మొగిలు దారి = ఆకాశము, అరుంగులు = అరుగులు, మల = కొండలు, అనంటులు = అరటులు, దొనల్ = అమ్ముల పొదులు, మట్టి పండ్లు, తలిరులు = చిగురులు, రిక్కలు = నక్షత్రములు, తాబేళ్ళు, రాయంచ కొదమలు = పిల్ల రాజహంసలు, కపురంబు = కర్పూరము, కుందనంబు = బంగారము, ననలు = పుష్పములు, చిలుకయును, ఒనన్ కూర్చి = అన్నిటిని చేర్చి, నలుమొగంబుల ప్రోడ = బ్రహ్మ, తన ప్రోడతనము ఎల్లన్ = తన నేర్పనితనమునంతను, పుడమియందు = ఈ భూమియందు, నెఱపగాన్ కోరి = చూపించ దలచి, ఆ ముద్దు నెలతను = ఆ సుకుమారియైన స్త్రీని (సీతను), అట్లు = ఆ రీతిగా, పొలుపు మెఱయంగన్ = మిక్కిలి అందముగా, ఒనరిపంబోలున్ చుమ్మి = తయారుచేసి ఉండనోపును.

**తా :** తుమ్మెదలు, ధనుస్సులు, కలువలు, సంపంగిమొగ్గ, వజ్రములు, తేనియలు, మంకెనపుష్పము, అద్దములు, తొమ్మిది సంఖ్యలు, కొంచెము వెన్నెల, శంఖము, తామర తూళ్ళు, ఎఱ్ఱ తామరలు, పూలచెండ్లు, పాము, కెరటములు, సుడిగుండము, ఆకాశము, అరుగులు, కొండలు, అరటులు, అమ్ముల పొదులు, మట్టిపండ్లు, చిగురులు, నక్షత్రములు, తాబేళ్ళు, రాజహంసలు, కర్పూరము, బంగారము, పుష్పములు, చిలుక వీటన్నిటిని చేర్చి బ్రహ్మ తన నేర్పరితనమును ఈ భూమండలమున చూపించదలచి ఆ సీతను ఆ రీతిగా మిక్కిలి అందముగా తయారుచేసియుండవచ్చును.

**కం. రే దొర మొగమున కెన చివు**
**రే దొర పల్వరుసతోడ నిఱి గుబ్బలయా**
**రే! దొరయుం జక్కవ కవఁ**
**బైదలి నలువెన్న నలువ పడఁతికిఁ దరమే! 109**

మొగమునకు = ఆ సీతాదేవి ముఖమునకు, రే దొర = చంద్రుడు, ఎన = సాటి, పలు వరుసతోడ = దంతముల వరుసకు, చివురే దొర = చిగురే సమానము, ఇఱి గుబ్బలు = ఇఱుకైన స్తనములు, జక్కవ కవన్ = చక్రవాక పక్షుల జంటను, దొరయున్ = పోలును, అయారే = ఆహా!, పైదలి నలువు = స్త్రీ (సీత) అందము, ఎన్న = ఎంచుటకు, నలువ పడతికి = సరస్వతీదేవికైనను, తరమే = శక్యమగునా?

**తా :** ఆ సీత ముఖమునకు చంద్రుడు సాటి, దంతములకు మొగ్గలే సమానము, స్తనములకు చక్రవాక పక్షులు అంటకట్టవచ్చును, ఆహా! ఆ స్త్రీ అందము ఎంచుటకు శారదకును శక్యమగునా?

**సీ. తలిరు లేమావి క్రొత్త జవాది బలుక్రోవి**
**వలపుల దీవి చెంగలువ బావి**

**ముగుదల మేల్బంతి సొగసుల దొంతి క్రొం**
**బొగడ పూబంతి యబ్బురపు టింతి**
**మానికమ్ముల మూట మరుని గెల్పుల కోట**
**పండు వెన్నెల తేట పసిఁడి వేఁట**
**కపురంపు దిమ్మ చొక్కపుఁ దళ్కు కీల్బొమ్మ**
**మొల్లంపు దానిమ్మ ముద్దుగుమ్మ**

**తే.గీ.** **తేజుల కొటారు వలుద ముత్తియపుఁ బేరు**
**కడిఁది జగరంగు తొలకరి కాఱ్మెఱుంగు**
**నును పికిలి చెండు పరువంపు పనసపండు**
**నాఁగఁ దగు నెన్న నన్న! యన్నాతి మిన్న** **110**

అన్న = నాయనా!, ఎన్నన్ = అలోచింపగా, ఆ నాతి మిన్న = ఆ స్త్రీ శ్రేష్ఠురాలు, తలిరు = చిగురుతోకూడిన, లే మావి = గున్న మామిడి, క్రొత్త జవాది, బలు క్రోవి = పెద్ద బరిణె, వలపుల దీవి = చక్కనైన దీవి, చెంగలువ = ఎఱ్ఱకలువల, బావి, ముగుదల = స్త్రీలలో, మేల్బంతి = శ్రేష్ఠురాలు, సొగసుల దొంతి = సౌందర్య రాసి, క్రొత్త పొగడ పూబంతి = విరిసిన పొగడపూల చెండు, అబ్బురపు ఇంతి = అద్భుతమైన స్త్రీ, మానికమ్ముల మూట = మాణిక్యముల మూట, మరుని = మన్మథుని, గెల్పుల కోట = విజయ స్థావరము, పండు వెన్నెల తేట = స్వచ్ఛమైన పండు వెన్నెల, పసిడి వేట = బంగారానికి నెలవు, కపురంపు దిమ్మ = కర్పూరపు పోత, చొక్కపున్ = అందమైన, తళ్కు కీల్బొమ్మ = మెరిసే కదిలే బొమ్మ, మొల్లంపు దానిమ్మ = తఱచైన దానిమ్మ, ముద్దుగుమ్మ = సుకుమారి, తేజుల కొటారు = తేజస్సులకు స్థానము, వలుద ముత్తియపు పేరు = పెద్ద ముత్యాల హారము, కడిది జగ రంగు = మిక్కిలి ప్రశస్తమైన రంగు, తొలకరి కాఱు మెఱుంగు = తొలకరి సమయమందలి దట్టమైన మెఱుపు, నును పికిలి చెండు = మెత్తని పికిలిపక్షుల ఈకల చెండు, పరువంపు పనసపండు = చక్కగా పండిన పనసపండు, నాగ = అనగా, తగును.

**తా :** నాయనా! ఆలోచింపగా ఆ సీత చిగురుతోకూడిన గున్నమావి, క్రొత్త జవాది పెద్ద బరిణె, చక్కని దీవి, ఎఱ్ఱకలువల బావి, స్త్రీలలో శ్రేష్ఠురాలు, సౌందర్యరాశి, విరిసిన పొగడపూల చెండు, అద్భుతమైన స్త్రీ, మాణిక్యముల మూట, మన్మథుని విజయ స్థావరము, స్వచ్ఛమైన పండు వెన్నెల, పసిడి నెలవు, కర్పూరపు పోత, అందమైన మెరిసే బొమ్మ, తఱచైన దానిమ్మ, సుకుమారి, తేజస్సులకు స్థానము, పెద్ద ముత్యాల హారము, మిక్కిలి ప్రశస్తమైన రంగు, తొలకరి మెఱుపు, పికిలిపిట్టల ఈకల చెండు, పండిన పనసపండు అనగా సరిపడును.

**కం.** **తలతలమను నపరంజిం**
**దలదలమనుఁ జెలువ బల్లిదపు డాల్బలు విం**

**తలఁ దలరారెడు నమ్మెలఁ**
**తల తలమానికము నెన్నఁ దరమే మాకున్?** **111**

తలతలమనున్ = కాంతులీనే, అపరంజిన్ = బంగారమును, చెలువ = ఆ సీతయొక్క, బల్లిదపు డాలు = గొప్ప కాంతి, దలదలమను = నీవేం ఎక్కువ అనును, పలు వింతలన్ = అనేక వింతలతో, తలరారెడు = ఒప్పునట్టి, ఆ మెలతల తలమానికమును = ఆ స్త్రీ రత్నమును, ఎన్నన్ = ఎంచుటకు, మాకున్ తరమే = మాకు శక్యమా?

**తా :** బంగారపు కాంతులను ఆ సీత దేహకాంతి నీవేం ఎక్కువ అనును. అనేక వింతలతో ఒప్పు ఆ స్త్రీరత్నమును ఎంచుటకు మాకు శక్యమా?

**కం.** **నగు నగు వెన్నెల నిగనిగ**
**జిగి మిగిలిన కెంపు సొంపుఁ జెఱచుఁ బెదవి యె**
**న్నఁగనగు నమ్ముగుద సొగసు**
**దుగ తిగ తీపారు తూపుదొర దీవి సుమా!** **112**

నగు = ఆమె నవ్వు, వెన్నెల నిగనిగన్ = వెన్నెల కాంతులను, నగు = నవ్వును, జిగి మిగిలిన = మిక్కిలి కాంతిగల, కెంపు సొంపున్ = కెంపుల సొగసును, పెదవి = ఆమె పెదవి ఎఱుపు, చెఱచున్ = చెడగొట్టును, ఎన్నగన్ అగు = చెప్పుకోదగిన, ఆ ముగుద సొగసు = ఆ సీత సౌందర్యము, దుగ తిగ = = రెండు+మూడు = ఐదు (2+3=5), తీపారు = మనోజ్ఞమైన, తూపు దొర = బాణములుకల దొర (మన్మథుని), దీవి సుమా = కొలువు సుమా!

**తా :** ఆమె నవ్వు వెన్నెల కాంతులను నవ్వును. పెదవి కెంపుల సొగసును చెడగొట్టును, చెప్పుకోదగిన ఆ సీత సౌందర్యము పంచబాణుని కొలువుసుమా!

**మ.** **తఱచు ల్వేయు నిఁకేల? యా తెఱవ యా దానిమ్మ పూరెమ్మ యా**
**నెఱి గప్రంపు టనంటి క్రొమ్మొలక యా నిద్దంపు లేమావి యా**
**మెఱుఁగుం బంగరు తీవ యా నన జిరా మేల్జోదు వాలారునున్**
**గఱకుం గైదువ యా కడింది నవలా కన్నాకు నీకే తగున్** **113**

తఱచుల్ వేయును = వేయి పరిశీలించుటలు, ఇక ఏల = ఇంక ఎందులకు?, ఆ తెఱవ = ఆ వనిత, ఆ దానిమ్మ పూరెమ్మ = ఆ దానిమ్మ పూలకొమ్మ, ఆ నెఱి = ఆ మనోహరమైన, కప్రంపు అనంటి క్రొమ్మొలక = కర్పూరపు అరటి క్రొత్త పిలక, ఆ నిద్దంపు లేమావి = ఆ స్వచ్ఛమైన గున్నమావి, ఆ మెఱుగున్ బంగరు తీవ = ఆ మెఱిసే బంగారు తీగ, ఆ, నన = పూవులు, జిరా = బాణముగా కల, మేలు = గొప్ప, జోదు = యోధుడు (మన్మథుని), వాలారునున్ = వాడియైన, కఱకుం = కఠినమైన, కైదువ = ఆయుధము, ఆ కడింది = ఆ అధికురాలైన, నవలా కన్నాకు = స్త్రీ శ్రేష్ఠురాలు, నీకే తగున్ = నీకే తగినది.

**తా :** వేయి పరిశీలన లెందులకు? ఆ వనిత, ఆ దానిమ్మ పూలకొమ్మ, ఆ కర్పూరపు అరటి మొలక, ఆ గున్నమావి, ఆ బంగారు తీగ, ఆ మన్మథుని ఆయుధము, ఆ స్త్రీ శ్రేష్ఠురాలు నీకే తగినది.

**తే.గీ. మోవి చిగురును వలిగుబ్బ పూవుగుత్తు**
**లక్కజపుఁ బల్కు తేనియ లరిది కీలు**
**గంటు తుమ్మెద దిమ్మును గలిగి యొప్పు**
**పుడమి కానుపు లేఁగొమ్మఁ బొగడఁ దరమె 114**

మోవి = పెదవి యను, చిగురును = చిగురుటాకును, వలిగుబ్బ = గుండ్రటి స్తనములను, పూవుగుత్తులును, అక్కజపు = ఆశ్చర్యకరమైన, పల్కు = మాటలు, తేనియలు = తేనెలను, అరిది = అపురూపమైన, కీలుగంటు = జాఱు ముడి, తుమ్మెద దిమ్ము = తుమ్మెదల గుంపును, కలిగి = కలిగి ఉండి, ఒప్పు = ఒప్పునట్టి, పుడమి కానుపు లే కొమ్మన్ = భూసుతయైన సీతను, పొగడన్ దరమె = నుతించుటకు శక్యమా?

**తా :** పెదవి చిగురుటాకును, స్తనములు పూలగుత్తులను, పలుకులు తేనెలను, కొప్పు తుమ్మెదల గుంపును కలిగి ఒప్పు సీతను నుతించుటకు శక్యమా?

**కం. అని తెల్పుచు వారలఁ దో**
**డ్కొని యప్పుడె కదలి తపసి గొలఁకులు నేఱు**
**ల్పెను గోనలు బల్లియలుం**
**బొనరారఁగ గడచి వైళమునఁ జను నెడలన్ 115**

అని తెల్పుచు = అని చెప్పుచు, వారలన్ = ఆ రామలక్ష్మణులను, తోడ్కొని = వెంటపెట్టుకొని, తపసి = ఆ విశ్వామిత్రుడు, అప్పుడె కదలి = వెంటనే బయలుదేరి, కొలకులున్ = సరోవరములు, ఏఱులు = నదులు, పెను కోనలు = పెద్ద అడవులు, పల్లియలున్ = గ్రామములను, పొనరారగ కడచి = చక్కగా దాటి, వైళమునన్ = వేగముగా, చను ఎడలన్ = వెళ్ళు సమయమున,

తా : అని తెల్పుచు ఆ రామలక్ష్మణులను తోడ్కొని విశ్వామిత్రుడు బయలుదేరి కొలకులు, ఏఱులు, కోనలు, పల్లెలు దాటి వేగముగా చనుచున్న సమయమున –

**కం. కడు నరుదుగఁ దెరువున నొక**
**పడు కా నాడెంపు రాచపాపని యడుగుం**
**గడ యొక్కించుక సోఁకిన**
**నడరెడు తలిరాకుబోఁడియై తగ నిలిచెన్ 116**

కడున్ = మిక్కిలి, అరుదుగన్ = అపురూపముగా, తెరువునన్ = మార్గమధ్యమున, ఒక పడుకు = ఒక రాయి, ఆ నాడెంపు రాచపాపని = ఆ శ్రేష్ఠమైన రాచబిడ్డయొక్క, అడుగుం కడ = పాదము కొస, ఒక్కించుక = కొంచెము, సోకినన్ = తగులగానే, అడరెడు = ఆశ్చర్యముగా, తలిరాకుబోడియై = ఒక స్త్రీమూర్తియై, తగ నిలిచెన్ = చక్కగా ఎదుట నిలబడెను.

**తా :** మిక్కిలి ఆశ్చర్యముగా మార్గమధ్యమున ఒక రాయి రాముని పాదము తగులగానే ఒక స్త్రీమూర్తియై ఎదుట నిలిచెను.

**తే.గీ. నిలుచుటయు నబ్బురం బెద నివ్వటిలఁగ**
**ఱెప్ప వ్రేయక యన్నెల ఱేఁడు దాని**
**సోయగం బెల్లఁ గాంచి పెన్ ఱాయి ముద్దు**
**తెఱవయై నిల్చు టిదియేమి తెఱఁగు నేఁడు? 117**

నిలుచుటయున్ = నిలబడగా, అబ్బురంబు = ఆశ్చర్యము, ఎదన్ = మనసున, నివ్వటిలగ = అతిశయింపగా, ఆ నెలఱేడు = ఆ రామచంద్రుడు, ఱెప్ప వ్రేయక = కన్ను మూయక, దాని = ఆ స్త్రీయొక్క, సోయగంబు = సౌందర్యమును, ఎల్లన్ = అంతను, కాంచి = చూచి, పెన్ ఱాయి = బండరాయి, ముద్దు తెఱవయై = అందమైన స్త్రీయై, నిల్చుట = నిలబడుట, నేడు = ఇప్పుడు, ఇది ఏమి తెఱగు = ఇది ఏమి సంగతి?

**తా :** నిలబడగా ఆశ్చర్యపడి ఆ రామచంద్రుడు కన్నుమూయక ఆ స్త్రీ సౌందర్యమును చూచి, బండరాయి స్త్రీగ నిలబడుటకు ఏమి సంగతి?

**ఉ. వీనులకంటి తొయ్యలియొ? వేల్పు వెలందియొ? జక్కి మోర లేఁ**
**జానయొ? పక్కి రా చెలియొ? జక్కుల వంగడపుం బడంతియో?**
**కాని జగమ్మునం దరయఁగా పెఱ కొమ్మల కీ మిటారపుం**
**జానొక యింతయుం గలుగఁ జాలునె? యంచుఁ తలంచుచుండగన్ 118**

వీనులకంటి తొయ్యలియొ = చెవులు కన్నులుగా కలది పాము (నాగ) కన్యయొ, వేల్పు వెలందియొ = దేవకన్యయొ, జక్కి మోర లేజానయొ = గుఱ్ఱపు మూతులుకల (కిన్నెర) కన్యయొ, పక్కిరా చెలియొ = పక్షిరాజైన గరుడ కన్యయొ, జక్కుల వంగడపుం పడంతియో = యక్ష వంశానికి చెందిన కన్యయో, కాని = కాకున్నచో, అరయగా = పరిశీలింపగా, జగమ్మున అందు = ఈ భూలోకమునందు, పెఱ కొమ్మలకు = ఇతర స్త్రీలకు, ఈ మిటారపుం జాను = ఇంత గొప్ప అందము, ఒక ఇంతయున్ = ఒక కొంచెమును, కలుగ చాలునె = కలుగుట సాధ్యమా?, అంచు = అనుచు, తలంచుచుండగన్ = ఆలోచించుచుండగా,

**తా :** నాగ కన్యయా? దేవ కన్యయా? కిన్నెర కాంతయా? గరుడ నెలతయా? యక్ష పడతియా? కాకున్నచో ఈ భూమండలమున ఇతర స్త్రీలకు ఇంత గొప్ప అందము ఒక కొంచెమైనను కలుగుట సాధ్యమా? అని ఆలోచించుచుండగా –

**కం. రాకొమరుఁ జూచి యచ్చిగు**
**రాకుంబోడిఁయు వలంతియై యిట్లను నో**
**సోఁకుడుల సూడ! వినుమా!**
**నీకుం దన మొదలి తెఱఁగు నెటి నెఱిఁగింతున్ 119**

ఆ చిగురాకుంబోడియు = ఆ స్త్రీయును, రాకొమరున్ చూచి = రాముని చూచి, వలంతియై = నేర్పుకలదై, ఇట్లు అను = ఈ రీతిగా పలికెను, ఓ సోకుడుల సూడ = ఓ రాక్షసులకు శత్రువగు రామా!, నీకున్, తన మొదలి తెఱగు = నా ముందటి విషయమును, నెఱిన్ = చక్కగా, ఎఱిగింతున్ = తెలిపెదను, వినుమా = వినుము.

తా : ఆ స్త్రీ రాముని చూచి 'ఓ రాక్షసులకు శత్రువగు రామా! నీకు నా విషయాన్ని చెబుతాను విను –

**సీ.** **మును గౌతముఁడు నాఁగ నొనరు పంటవలంతి**
**జేజే నిరాబారి సింగమునకు**
**గారాబు టిల్లాలఁ బే రహల్య యటందు**
**రొకనాడు వేలుపు టొడయఁ డెమ్మె**
**ననుఁ గోరి పుంజురూపునఁ జేరి నడురేయి**
**తఱి నింటి దరిఁ బొంచి యఱచుటయును**
**దెల్లవాఱె నటంచుఁ దివిరి యజ్జన్నిగ**
**ట్టేటి పొంతకుఁ గ్రుంకులిడఁగ జన్న**

**తే.గీ.** **నపుడె జన్నపు దిండి రాయండు సెలఁగి**
**పెక్కు దెఱఁగుల రాచిల్క జక్కిఁ జోదు**
**పనులకై వేడుకొన నియ్యకొని యతండు**
**నేను నెనలేని నెమ్మది నెనయు నెడల** **120**

మును = పూర్వము, గౌతముడు నాగ = గౌతముడని పిలువబడే, ఒనరు పంటవలంతి జేజే = ఒప్పునట్టి బ్రాహ్మణ, నిరాబారి సింగమునకున్ = మునిశ్రేష్ఠునకు, గారాబు ఇల్లాలన్ = ప్రియమైన భార్యను, పేరు అహల్య అటందురు = పేరు అహల్య అని అందురు, ఒకనాడు, వేలుపు ఒడయడు = ఇంద్రుడు, ఎమ్మె = ఇష్టముగా, ననున్ కోరి = నన్ను కావాలని, పుంజు రూపునన్ = కోడి రూపంలో, చేరి = వచ్చి, నడురేయి = అర్ధరాత్రి, తఱి = సమయమున, ఇంటి తరి = ఆశ్రమ సమీపమున, బొంచి = దాగి, అఱచుటయును = కూయుటయును, తెల్లవాఱెను అటంచు = తెల్లవారినదని, తివిరి = పూని, ఆ జన్నిగట్టు = ఆ బ్రాహ్మణుడు (గౌతముడు), ఏటి పొంతకు = నది చెంతకు, క్రుంకులిడగ = స్నానము చేయుటకు, చన్నన్ = వెళ్ళగా, ఆపుడె = వెంటనే, జన్నపు తిండి రాయండు = ఇంద్రుడు, చెలగి = సంతోషించి, పెక్కు తెఱగుల = పలు విధములుగా, రాచిల్క జక్కి జోదు పనులకై = రామచిలుక వాహన ముగా కల వీరుడు (మన్మథుడు) శృంగార చేష్టలకై, వేడుకొని = బ్రతిమిలాడగా, ఇయ్యకొని = అంగీకరించి, అతండు = ఆ ఇంద్రుడు, నేను = నేనును, ఎనలేని = సాటిలేని, నెఱి మదిన్ = సంతోష మనస్కులమై, ఎనయు ఎడల = ఉన్న సమయమున,

**తా :** పూర్వము గౌతముడనే ముని శ్రేష్ఠునకు ఇల్లాలిని. పేరు అహల్య అంటారు. ఒకనాడు ఇంద్రుడు నన్ను కోరి కోడి రూపంలో వచ్చి అర్ధరాత్రి ఆశ్రమసమీపంలో దాగి కూయగానే తెల్లవారినదని గౌతముడు లేచి నదిచెంతకు స్నానము చేయుటకు వెళ్లగా వెంటనే ఇంద్రుడు శృంగార చేష్టలకు బ్రతిమిలాడగా అంగీకరించి, ఆ ఇంద్రుడు, నేను సంతోష మనస్కులమై ఉన్న సమయమున –

**కం. వేగుట గని రాకుండిన**
**వేగ మరలి వచ్చి తపసి వెన్నెల ఱేఁ డ**
**ట్లాగడమున మెలఁగెడు మము**
**బాగుగఁ బొడఁగాంచి యెదను బాయని కినుకన్ 121**

వేగుట = తెల్లవారుట, కని రాకుండిన = కనబడకపోయిన, తపసి వెన్నెల ఱేడు = తాపసి చంద్రుడు (గౌతముడు), వేగ మరలి వచ్చి = వేగముగా తిరిగి వచ్చి, అట్లు = ఆ విధముగా, ఆగడమున = అకార్యమున, మెలగెడు = ప్రవర్తించు, మము = మమ్ము, బాగుగన్ = స్పష్టముగా, పొడగాంచి = చూసి, ఎదను = మనసున, పాయని కినుకన్ = తగ్గని కోపముతో,

**తా :** తెల్లవారుట కనబడకపోవడంతో గౌతముడు వేగముగా తిరిగి వచ్చి అకార్యమున ప్రవర్తించుచున్న మమ్ము చూచి కోపముతో –

**కం. వేంద్రముగఁ దిట్టుటయు జవ**
**రాంద్రెవ్వరు మున్నెఱుఁగని యంగద యొదవన్**
**గుంద్రాతి రూపు గైకొని**
**తండ్రీ! పెక్కేడు లిందుఁ దరలక యుంటిన్ 122**

తండ్రీ, వేంద్రముగ = కఠినముగా, తిట్టుటయు = శపించుటయును, జవరాండ్రు = యువతులు, ఎవ్వరున్ = ఎవరునూ, మున్ను = ఇంతకు పూర్వము, ఎఱుగని = పొందనట్టి, అంగద యొదవన్ = కష్టము సంభవించగా, గుంద్రాతి రూపు కైకొని = గుండ్రాయి రూపమును పొంది, ఇందున్ = ఇచ్చట, పెక్కేడులు = అనేక సంవత్సరములు, తరలక ఉంటిన్ = చలనములేక ఉంటిని.

**తా :** రామా! కఠినముగ శపించుటతో కాంతలెవ్వరు పొందని కష్టము సంభవించగా గుండ్రాయినై ఇక్కడ అనేక సంవత్సరములు పడి ఉన్నాను.

**కం. కడు నరుదుగ నీయెడ నీ**
**యడుఁగుం గొన యింత సోఁకినంతనె చెడుగుం**
**గొడిమెలు విడి చని క్రమ్మఱ**
**మడఁతితనం బొదవె నన్ను మానిసిమిన్నా! 123**

మానిసి మిన్నా = మనుషులలో శ్రేష్ఠుడా!, కడున్ అరుదుగన్ = మిక్కిలి ఆశ్చర్యముగా, ఈ ఎడన్ = ఈ ప్రదేశమున, నీ అడుగుం కొన = నీ కాలి చివరిభాగము, ఇంత = కొంచెము, సోకినంతనె = తగులగానే, చెడుగుం గొడిమెలు = చెడ్డవైన పాపములు, విడి చని = విడిపోయి, క్రమ్మఱ = తిరిగి, మడతితనంబు = స్త్రీరూపము, నన్ను పొదవె = నన్ను పొందినది.

**తా :** మానవశ్రేష్ఠా! ఆశ్చర్యముగా ఈ చోట నీ పాదము తగులగానే నా పాపములు విడిపోయి తిరిగి స్త్రీరూపము నన్ను పొందినది.

**కం. ఓ వలఁతి! యిజ్జగంబు**
**ల్లావిరి నేదుకొనఁ గావలసి నీ వెపుడుం**

**గావింపుచుండు కర్జము**
**లేవారితరం బెఱింగి యెన్నికసేయన్** **124**

ఓ వలతి = ఓ సమర్థుడా!, ఈ జగంబులు, వావిరిన్ = క్రమముగా, ఏదుకొనన్ = వృద్ధిపొందుట, కావలసి = కోరుకొని, నీవు ఎపుడున్, కావింపుచుండు = చేయుచుండు, కర్జములు = కార్యములు, ఎఱింగి = తెలుసుకొని, ఎన్నిక సేయన్ = లెక్కించుటకు, ఏవారి తరంబు = ఎవరికి శక్యము?

**తా :** ఓ సమర్థుడా! ఈ లోకములు వృద్ధిపొందుట కోరుకొని నీవు ఎల్లప్పుడు చేయుచుండు కార్యములు తెలుసుకొని వానిని లెక్కించుట ఎవరికి సాధ్యము?

**కం.** **అదనొదవ మీను మేనం**
**బొదలుచు మున్నీరు సొచ్చి పూనికతోడన్**
**జదువుల తెక్కలికానిం**
**జిదిమి నలువ కలఁక దీఱిచితి వీవె కదా!** **125**

అదను ఒదవన్ = సమయానికి తగినట్లుగా, మీను మేనన్ = చేప దేహముతో, పొదలుచు = ఒప్పుచు, మున్నీరు చొచ్చి = సముద్రమున ప్రవేశించి, పూనికతోడన్ = పట్టుదలతో, చదువుల తెక్కలికానిం = వేదములను దొంగిలించినవానిని, చిదిమి = చంపి, నలువ కలక = బ్రహ్మదేవుని కలతను, ఈవె = నీవే, తీఱిచితి కదా = తీర్చినావు కదా!

**తా :** సమయానుకూలముగా చేపగా సముద్రమున ప్రవేశించి వేదములను దొంగిలించిన సోమకుడను రాక్షసుని చంపి బ్రహ్మ కలతను నీవే తీర్చితివికదా!

**తే.గీ.** **తివిరి జేజేలు మానిసి దిండికాండ్ర**
**దండులును గూడి ప్రాలేఱు ద్రచ్చు తఱిని**
**మేటి తామేటి మేనెత్తి మెట్టుక్రింద**
**నిలిచి యుండిన ప్రోడవు నీవెకానె?** **126**

తివిరి = పూనుకొని, జేజేలు = దేవతలును, మానిసి దిండికాండ్ర దండులును = రాక్షస సమూహములును, కూడి = ఏకమై, ప్రాలేఱు = పాల సముద్రమును, త్రచ్చు తఱిని = చిలుకు సమయమున, మేటి = పెద్ద, తామేటి మేను ఎత్తి = తాబేలు రూపము ధరించి, మెట్టు క్రిందన్ = మేరు పర్వతము క్రింద, నిలిచి ఉండిన = కదలక ఉన్న, ప్రోడవు = సమర్థుడవు, నీవె కానె = నీవేకదా!

**తా :** దేవతలు, రాక్షసులు ఏకమై పాలసంద్రమును చిలుకు సమయమున తాబేలు రూపము ధరించి మేరుపర్వతము క్రింద కదలక ఉన్న సమర్థుడవు నీవేకదా!

**తే.గీ.** **జాళువా కంటి తొలివేల్పు నేలయెల్ల**
**గొంచు విసదారి టెంకి కేతెంచుచున్న**
**బూని తొల్పంది గున్నవై వానిఁ జీరి**
**కోఱకొన మన్ను దాల్పవే కోరి నీవు?** **127**

జాళువా కంటి = బంగారు కన్ను కల, తొలివేల్పు = రాక్షసుడు (హిరణ్యాక్షుడు), నేలన్ ఎల్లన్ కొంచు = భూమినంతను తీసుకొని, విసదారి టెంకికి = నాగలోకమునకు, ఏతెంచుచున్నన్ = తీసుకొని పోవుచుండగా, పూని = ప్రయత్నించి, తొలి పంది గున్నవై = ఆది వరాహ రూపమునంది, వానిన్ చీరి = వానిని చంపి, కోరి = కోరికతో, నీవు = నీవు, కోఱకొనన్ = కోఱ కొనయందు, మన్నున్ = భూమిని, తాల్పవే = ధరించితివే.

**తా :** హిరణ్యాక్షుడు భూమిని పాతాళలోకమునకు తీసుకొనిపోవుచుండగా ఆదివరాహమువై వానిని చంపి నీవు కోఱ కొనయందు భూమిని ధరించితివే!.

**ఉ.** **వెన్నునిఁ జూపుమంచు బదివేల వితంబులఁ గన్నబిడ్డని**
**మ్మిన్నక స్రుక్కఁజేయు మిడిమేలపు నంజుడు దిండి రాచ బ**
**ల్మన్నియఁ జెండవే? బిరుసు మానిసి సింగపు మేనుపూని యో**
**యన్న! పసిండి బొజ్జదొరకైన నినుం గొనియాడఁ బోలునే? 128**

ఓ అన్న = ఓ నాయనా!, వెన్నునిన్ = విష్ణువును, చూపుము అంచు = చూపెట్టమని, పదివేల వితంబులన్ = పదివేల విధములుగా, కన్నబిడ్డనిన్ = కన్న కొడుకును (ప్రహ్లాదుని), మిన్నక = ఉపేక్ష చేయక, స్రుక్కన్ చేయు = బాధలను పెట్టు, మిడిమేలపు = అహంకార పూరితుడైన, నంజుడు తిండి రాచ బలు మన్నియన్ = రాక్షస రాజులలో శ్రేష్ఠుడైన ప్రభువును, బిరుసు = కఠినమైన, మానిసి సింగపు మేను పూని = నరసింహ దేహమును ధరించి, చెండవే = సంహరించితివే, నినున్ = నిన్ను, కొనియాడన్ = పొగడుటకు, పసిండి బొజ్జ దొరకైన = హిరణ్యగర్భునికైనను (బ్రహ్మకు), పోలునే = శక్యమగునా?

**తా :** నాయనా! విష్ణువును చూపెట్టమని కన్నకొడుకును ఉపేక్ష చేయక బాధలను పెట్టు అహంకార పూరితుడైన హిరణ్యకశిపుని నరసింహ రూపున సంహరించితివే! నిన్ను కొనియాడుటకు బ్రహ్మకైనా శక్యమగునా?

**కం.** **గుజ్జు వడుగవయి మును దన**
**యొజ్జ పలుకు వినక చాగ మొసఁగెడుచో మూఁ**
**డజ్జల ముజ్జగములు గొని**
**య జ్జేజేగొంగఁ గ్రింది కనిచితివి గదా! 129**

గుజ్జు వడుగవయి = వామనుడవై, మును = పూర్వము, తన ఒజ్జ పలుకు వినక = తన గురువు (శుక్రుడు) మాట వినక, చాగము ఒసగెడుచో = దానమిచ్చు సమయమున, మూడు అజ్జల = మూడు అడుగులతో, మూడు జగములు = ముల్లోకములను, కొని = గ్రహించి, ఆ జేజే గొంగన్ = ఆ దేవతలశత్రువగు బలి చక్రవర్తిని, క్రిందికి = పాతాళమునకు, అనిచితివి కదా = పంపావు కదా!

**తా :** వామనుడవై పూర్వము తన గురువు శుక్రుడు చెప్పినా వినక దానమిచ్చు సమయమున మూడు అడుగులతో మూడు లోకములను గ్రహించి బలిచక్రవర్తిని పాతాళమునకు పంపావుకదా!

**కం.** **ముయ్యేడుమాఱు లెక్కటి**
**కయ్యంబుల నేలదాల్పు కన్నాకుల బ**
**ల్వ్రయ్యలుగ గండ్ర గొడ్డట**
**నొయ్యనఁ జక్కాడి కడల నునుపవె యసముల్** **130**

ముయ్యేడు మాఱులు = ఇరువదియొక్క మార్లు, ఎక్కటి = ఒంటరిగా, కయ్యంబులన్ = యుద్ధములందు, నేలతాల్పు = రాజులలో, కన్నాకులన్ = శ్రేష్ఠులైనవారిని, పలు వ్రయ్యలుగన్ = ఖండ ఖండములుగా, గండ్ర గొడ్డటన్ = గండ్రగొడ్డలితో, ఒయ్యనన్ = వరుసగా, జక్కాడి = చంపి, యసముల్ = కీర్తులను, కడలన్ = దిక్కులన్నిటియందును, ఉనుపవె = ఉంచావుకదా!

**తా :** పూర్వము ఇరువదియొక్కమార్లు ఒంటరిగా కయ్యములలో రాజశ్రేష్ఠులైనవారిని ఖండ ఖండములుగా గండ్రగొడ్డలితో వరుసగా చంపి దిక్కులన్నిట కీర్తినుంచావుకదా!

**కం.** **ఈరైదు కుత్తుకల పొల**
**యోరెపు మన్నీని దాడి కోర్వక జేజే**
**బారులు మొఱవెట్టినఁ బది**
**తేరుల దొర కిపుడు గల్గితివిగద జియ్యా!** **131**

జియ్యా = స్వామీ!, ఈరైదు కుత్తుకల = పది తలలుకల, పొలయోరెపు మన్నీని = మాంసమే ఆహారముగాకల రాక్షసులకు రాజైన రావణుని, దాడికి ఓర్వక = దాడికి తట్టుకోలేక, జేజే బారులు = దేవతల సమూహములు, మొఱ పెట్టినన్ = మొఱ పెట్టగా, ఇపుడు = ఈ జన్మమున, పది తేరుల దొరకు = దశరథునకు, కల్గితివి కద = పుట్టినావు కదా!

**తా :** స్వామీ! దశకంఠుడైన రావణుని దాడికి తట్టుకోలేక దేవతలు మొఱపెట్టగా ఈ జన్మమున దశరథునకు పుట్టినావుకదా!

**కం.** **కొనరిక్క పేరి పొలఁతుక**
**పెనిమిటివై నాఁగలియును బెనుదాటి సిడం**
**బును బూని రవళి కాండ్రం**
**దునిమి పుడమి పడఁతి వ్రేఁగు ద్రోయుదువు గదా!** **132**

కొన రిక్క పేరి పొలతుక = ఆఖరి నక్షత్రము పేరుతోనున్న స్త్రీ (రేవతి), పెనిమిటివై = భర్తవై, నాగలియును, పెను తాటి సిడంబును = పెద్ద తాడిచెట్టు ధ్వజమును, పూని = వహించి, రవళికాండ్రన్ = మోసగాండ్రను, తునిమి = సంహరించి, పుడమి పడతి = భూదేవియొక్క వ్రేగు = భారమును, త్రోయుదువు కదా = తగ్గించెదవు కదా!

**తా :** రేవతి భర్తవై నాగలి, తాడిచెట్టు ధ్వజమును కలిగి మోసగాండ్రను సంహరించి భూదేవి భారమును తగ్గించెదవుకదా!

**తే.గీ.** **పొలసు మేఁతరి క్రొన్ననబోఁడి తెగల**
**యాలువులు మొక్కవలచియు మేలి కత్త**

**లానిపై నెక్కి మొనసి పొలసుల నెల్లఁ**
**జిదుమఁగల బల్లిదుఁడ వీవెగదవె తండ్రి!** **133**

తండ్రి = నాయనా!, పొలసు మేతరి = రాక్షసుల, క్రొన్ననబోడి తెగల = స్త్రీ సమూహముల యొక్క, ఈలువులు = పాతివ్రత్యములు, మొక్కపఱచియు = పోగొట్టి, మేలి = శ్రేష్ఠమైన, కత్తలానిపైన్ = తెల్లని గిట్టలు, తోక, వెండ్రుకలు కల నల్లని గుఱ్ఱముపైన, ఎక్కి = అధిరోహించి, మొనసి = పూనుకొని, పొలసులను ఎల్లన్ = దుర్మార్గులందరిని, చిదుమగల = చంపగల, బల్లిదుడవు = బలవంతుడవు, ఈవె గదవె = నీవే కదా!

**తా :** నాయనా! రాక్షస స్త్రీల పాతివ్రత్యమును పోగొట్టి కత్తలానిపై ఎక్కి దుర్మార్గులను చంపగల బలవంతుడవు (కల్కి) నీవేకదా!

**సీ.** **చదలు కానుపు దిండి చలువ పాన్పునఁ బండి**
**జోగంపు నిదురలఁ జొక్కు ఱేఁడ!**
**మాటల తొగకంటి మగని గ్రుడ్డు పసంటి**
**ప్రోవులు బొజ్జలోఁ బూను మేటి!**
**జగడంపు టోరెంపు జడదారి నాడెంపుఁ**
**బాటల కెద నుబ్బు బల్లిదుండ!**
**తళుకులీను కడాని వలిపె దుప్పటి మేని**
**కనువు మీఱఁగఁ గప్పుకొను నొయారి!**

**తే.గీ.** **కడిఁది విలుకాడ! పలువ రక్కసుల సూడ!**
**నుడువఁదగు బంట! తపసుల నోముపంట!**
**అందముల గీమ! నెఱ రాచ చందమామ!**
**తెలిసి యగ్గింప మా బోంట్ల తలమె నిన్ను?** **134**

చదలు కానుపు = ఆకాశమున జనించునది వాయువు, తిండి = వాయువు ఆహారముగా కలది పాము (శేషుడు), చలువ పాన్పునన్ = చల్లని పాన్పునందు, పండి = శయనించి, చోగంపు నిదురలన్ = యోగసంబంధమైన నిద్రలలో, చొక్కు = పరవశించు, ఱేడ = ప్రభూ!, మాటల తొగకంటి = సరస్వతీదేవి, మగని గ్రుడ్డు పసంటి ప్రోవులు = భర్త (బ్రహ్మ) బ్రహ్మాండ భాండముల సమూహములు, బొజ్జలోన్ = కడుపులో, పూను మేటి = ధరించిన శ్రేష్ఠుడా!, జగడంపు ఓరెంపు జడదారి = కలహమే ఆహారముగాకల ముని (నారదుడు), నాడెంపున్ = నాణ్యమైన, పాటలకు, ఎదన్ ఉబ్బు = మనసులో సంతోషించు, బల్లిదుండ = సమర్థుడా!, తళుకులు ఈను = కాంతులు వెదజల్లు, కడాని = బంగారు, వలిపె = సన్నని, దుప్పటి = వస్త్రము, మేనికి = దేహమునకు, అనువు మీఱగన్ = మిక్కిలి తగినట్లుగా, కప్పుకొను = ధరించు, ఒయారి = సుందరుడా!, కడిది విలుకాడ = గొప్ప వింటి నేర్పరీ!, పలువ = నీచులైన, రక్కసుల సూడ = రాక్షసుల శత్రువా!, నుడువదగు = చెప్పుకోదగిన, బంట = వీరుడా!, తపసుల నోముల పంట = మునీశ్వరుల

నోముల ఫలమా!, అందముల గీమ = సొగసులకు స్థానమైనవాడా!, నెఱ రాచ చందమామ = అందాల రాజచంద్రమా!, నిన్ను = నిన్ను, తెలిసి = తెలుసునని, అగ్గింప = స్తుతించుటకు, మా బోంట్ల తలమె = మా వంటివారికి శక్యమా?

**తా :** శేషుని పాన్పునందు శయనించి యోగనిద్రలో పరవశించు ప్రభూ! బ్రహ్మాండ భాండములు బొజ్జలో పూనినవాడా! నారదుని పాటలకు సంతసించు సమర్థుడా! పీతాంబరము ధరించు సుందరుడా! గొప్ప వింటి నేర్పరీ! రాక్షసుల శత్రువా! ఎన్నదగిన వీరుడా! ఋషుల నోము ఫలమా! సొగసుల స్థానమా! అందాల రాజచంద్రమా! నిన్ను తెలిసి స్తుతించుటకు మా బోంట్లకు శక్యమా?

**కం.** **అని యిటు లెద నెత్తిన బ**
**త్తిని వేమఱుఁ బొగడి పొలము తెంకి ముగుద క్రొ**
**న్ననబోఁడి సనిన వారుం**
**జని రొయ్యన మిథిల కపుడు సంతస మెసగన్** **135**

పొలము తెంకి = అరణ్యమే నివాసముగాకల, క్రొన్ననబోడి = తీగవంటి దేహముకల, ముగుద = స్త్రీ (అహల్య), అని ఇటులు = అని ఈ ప్రకారముగా, ఎదను = మనసున, ఎత్తిన = కలిగిన, బత్తిని = భక్తితో, వేమఱు = పలుమార్లు, పొగడి, చనిన = వెళ్ళగా, వారున్ = వారును, అపుడు = అప్పుడు, సంతసము ఎసగన్ = మిక్కిలి సంతోషముతో, ఒయ్యన = మెల్లగా, మిథిలకు చనిరి.

**తా :** అరణ్యవాసినియగు అహల్య ఈ ప్రకారముగా భక్తితో స్తుతించి వెళ్ళగా అప్పుడు వారును సంతోషముతో మెల్లగా మిథిలకు వెళ్ళిరి.

**కం.** **అత్తఱి నబ్బలు వీటికి**
**మొత్తములై నేలఱేండ్రు మురిపము లొదవ**
**న్బిత్తరిఁ గైకొనియెదమను**
**తత్తరమునఁ జేరి రెలమి దలుకొత్తంగన్** **136**

ఆ తఱిన్ = ఆ సమయమున, ఆ బలు వీటికి = ఆ గొప్ప నగరమునకు (మిథిలకు), నేలఱేండ్లు = రాజులు, మొత్తములై = అందరూ, మురిపములు ఒదవన్ = సంతోషముతో, బిత్తరిన్ = శృంగార స్థానమైన సీతను, కైకొనియెదము = స్వీకరించెదము, అను తత్తరమునన్ = అనెడు తొందర పాటుతో, ఎలమి = ప్రీతి, తలుకొత్తంగన్ = ప్రకటమగుచుండగా, చేరిరి = చేరుకొనిరి.

**తా :** ఆ సమయమున మిథిలకు రాజులందరూ సంతోషముతో ప్రీతి తలుకొత్తగా సీతను స్వీకరించెదమను తత్తరముతో చేరిరి.

**కం.** **ఎక్కుడు మెకములుఁ దేరులు**
**జక్కి పదువు లందలములుఁ జాలుపు లగుచున్**
**గ్రిక్కిఱిసి లెక్కలకుఁ గడు**
**మిక్కుటమై యెల్ల కడల మెఱసెం బ్రోలన్** **137**

ఎక్కుడు మెకములున్ = ఏనుగులును, తేరులు = రథములు, జక్కి = గుఱ్ఱములు, పదువులు = సమూహములు, అందలములున్ = పల్లకీలును, చాలుపులు అగుచున్ = వరుసలుగా వచ్చుచుండగా, క్రిక్కిఱిసి = ఇరుక్కుపోయి, లెక్కలకు కడు మిక్కుటములై = లెక్కపెట్టుటకు శక్యము కానివై, ప్రోలన్ = నగరమున, ఎల్ల కడలన్ = అన్ని దిక్కులయందును, మెఱసెన్ = ప్రకాశించెను.

**తా :** ఏనుగులు, రథములు, గుఱ్ఱముల సమూహములు, పల్లకీలు వరుసలుగా వచ్చుచుండగా ఇరుక్కుపోయి లెక్కపెట్టుటకు శక్యము కానివై నగరమున అన్నివైపుల ప్రకాశించెను.

**సీ. కొమ్ముటేనుఁగు మబ్బుకూటువ ల్చిల్కు మ**
**వ్వపు టాము నీర్బొట్లు వాన గాఁగఁ**
**బలు దెఱంగుల బోరు కలుగు వాయిదములు**
**గడితంపు టుఱుము చప్పుడులు గాఁగ**
**రవళిఁ బాతర లాడు పువుబోండ్ల మేను దీ**
**వియలు మెఱుంగు దీవియలు గాఁగ**
**ముత్తైదువలు దట్టముగఁ జల్లు బలు సోయ**
**గపు ముత్తెములు వడగండ్లు గాఁగ**

**తే.గీ. మేలు టెక్కపు రతనంపు మిన్కుగములు**
**వేల్పు పాలెంపు టెకిమీని విండ్లు గాఁగఁ**
**దెలి గొడుగు లెల్ల నురువుల తెరలు గాఁగ**
**వఱలె వీడప్డు తొలకరి తటిని బోలి** **138**

కొమ్ముటేనుగు = మదపుటేనుగు, ఆము నీరు = మదజలము, మబ్బుకూటువలు = మేఘ సమూహములు, చిల్కు = చిలకరించు, మవ్వపు = మృదువైన, నీర్బొట్లు వాన = తుంపర, కాగన్ = కాగా, పలు తెఱంగుల = పలు విధములైన, బోరు కలుగు = బోరను ధ్వని చేయుచున్న, వాయిదములు = వాయిద్యములు, కడితంపు = గొప్ప, ఉఱుము చప్పుడులు కాగ = ఉఱుము ఉరిమిన ధ్వనులు కాగా, రవళిన్ = తాళముతో, పాతరలాడు = నర్తించు, పువుబోండ్ల = స్త్రీలయొక్క, మేను తీవియలు = తీగలవంటి దేహములు, మెఱుంగు తీవియలు కాగ = మెఱుపు తీగలు కాగా, ముత్తైదువలు = పుణ్య స్త్రీలు, దట్టముగన్ = చిక్కగా, చల్లు = చల్లుచున్న, పలు = రకరకములైన , సోయగపు = అందమైన, ముత్తెములు = ముత్యములు, వడగండ్లు కాగ, మేలు = మంచి, టెక్కెపు = ధ్వజములందలి, రతనంపు = మణులయొక్క, మిన్కు గములు = కాంతి పుంజములు, వేల్పు పాలెంపు = దేవతల పట్టణమైన అమరావతికి, ఎకిమీని = ప్రభువైన ఇంద్రుని, విండ్లు కాగ = ఇంద్రధనుస్సులు కాగా, తెలి గొడుగులు ఎల్ల = తెల్లని ఛత్రములన్నియు, నురువుల తెరలు కాగ = నురుగుల సమూహములు కాగా, వీడు = మిథిల, అపుడు = అప్పుడు, తొలకరి తటిని పోలి = తొలకరి సమయాన్ని పోలి, వఱలెన్ = ఒప్పెను.

**తా :** మదపుటేనుగుల మదజలము మేఘసమూహములు చిలుకరించు తుంపరకాగా, బోరని ధ్వనిచేయుచున్న వాయిద్యములు ఉఱుముల ధ్వనులుకాగా, తాళముతో నర్తించు స్త్రీల దేహములు మెఱుపు తీగలుకాగా, పుణ్యస్త్రీలు చల్లుచున్న ముత్యాలు వడగండ్లుకాగా, ధ్వజములందలి మణుల కాంతులు ఇంద్రధనుస్సులుకాగా, తెల్లని ఛత్రములన్నియు నురుగుల సమూహములు కాగా మిథిల అప్పుడు తొలకరి సమయాన్ని పోలి ఒప్పినది.

**తే.గీ.** **పుడమి యీనిన వడువున నెడ యొకింత**
**లేక మూఁకల చేతఁ బ్రోల్వెలుఁగుచుండె**
**నిట్లు గూడిన యెకిమీంద్ర కెల్లఁ జెలిమి**
**మెఱయ విడిపట్టు లొసఁగె నమ్మిథిల ఱేఁడు** **139**

పుడమి = భూమి, ఈనిన, వడువున = రీతిగా, ఎడ ఒకింత లేక = కాళీ కొంచెముకూడా లేక, మూకలచేతన్ = సైన్యముచేత, ప్రోలు = మిథిల, వెలుగుచుండెన్, ఇట్లు = ఈ విధముగా, కూడిన = సమావేశమైన, ఎకిమీంద్రకు = రాజులకు, ఎల్లన్ = అందరికిని, చెలిమి మెఱయన్ = స్నేహభావ ముతో, ఆ మిథిల ఱేడు = జనకుడు, విడిపట్టులు = విడుదులను, ఒసగెన్ = ఏర్పాటుచేసెను.

**తా :** నేల ఈనిన రీతిగా కొంచెముకూడా ఖాళీలేక సైన్యముతో మిథిల ప్రకాశించుచుండెను. ఈ విధముగా సమావేశమైన రాజులకు జనకుడు స్నేహభావముతో విడుదుల నేర్పాటుచేసెను.

**సీ.** **పగడంపుఁ గంబము ల్పన్ని పన్నుగనిడ్డ**
**తెలిముత్తియంపుఁ బందిరుల వలనఁ**
**దళుకు పసిండి గోడలఁ గీలుకొల్పిన**
**పలు వన్నియల వ్రాత పనులవలన**
**దలిరులు దొగలు చెంగలువలు గూర్చి యం**
**దముగ నించిన తోరనములవలన**
**వెలలేని తగటు దువ్వలువలు చుట్టి య**
**గ్గలికఁ గట్టిన మేలుకట్లవలన**

**తే.గీ.** **దట్టముగ మ్రోయు నెఱ వాయిదములవలన**
**బుగులు కొనియెడు కపురంపుఁ బొగలవలన**
**మేలు తెఱఁగెల్లఁ గనఁబడి మెఱయుచున్న**
**తన నగరిలోని కెలమి నందఱను దెచ్చి** **140**

పగడంపు కంబముల్ = పగడాల స్తంభములు, పన్ని = నిలిపి, పన్నుగన్ = చక్కగా, ఇడ్డ = అలంకరింపబడిన, తెలి ముత్తియంపు పందిరులవలన = తెల్లని ముత్యాల పందిరులతోను, తళుకు పసిండి గోడలన్ = మెఱిసే బంగారు గోడలయందు, కీలుకొల్పిన = కల్పించిన, పలు వన్నియల = వివిధ రంగులుకల, వ్రాత పనులవలన = చేతితో గీయబడిన బొమ్మలతోను,

తలిరులు = చిగురుటాకులు, తొగలు = తెల్ల కలువలు, చెంగలువలు = ఎఱ్ఱ కలువలు, కూర్చి = గుచ్చి, అందముగ, నించిన = కట్టిన, తోరనములవలన = తోరణములతోను, వెలలేని = అమూల్యమైన, తగటు = జలతారు, దుగ వలువలు = జంట వస్త్రములను, చుట్టి = చుట్టి, అగ్గలికన్ = గట్టిగా, కట్టిన, మేలుకట్ల వలన = చాందినీలతోను, దట్టముగ మ్రోయు = ఎక్కువగా ధ్వనించు, నెఱ వాయిదములవలన = అన్ని వాయిద్యములతోను, బుగులు కొనియెడు = పరిమళించుచున్న, కపురంపు పొగలవలన = కర్పూరపు ధూమములతోను, మేల్ తెఱగు = మంచి పద్ధతిలో, ఎల్లన్ = అంతయును, కనబడి = కన్పించుచు, మెఱయుచున్న = ప్రకాశించుచున్న, తన నగరిలోనికి = తన సభాస్థలికి, ఎలమిన్ = సంతోషముతో, అందఱను తెచ్చి = అందరను ఆహ్వానించి.

**తా :** పగడాల స్తంభములు నిలిపి చక్కగా అలంకరింపబడిన ముత్యాల పందిళ్ళతోను, మెఱిసే బంగారు గోడలయందు కల్పించిన పలు రంగుల బొమ్మలతోను, చిగురుటాకులు, తెల్ల కలువలు, చెంగలువలు గుచ్చిన తోరణములతోను, అమూల్యమైన జలతారు వస్త్రములను చుట్టి గట్టిగా కట్టిన మెట్లతోను, అన్ని వాయిద్యములతోను, పరిమళించుచున్న కర్పూరపు ధూమములతోను మేలైన రీతిలో అంతటా ప్రకాశించుచుండగా తన సభాస్థలకి అందరను ఆహ్వానించి –

**తే.గీ.** **ఓలిఁ దగుచోట్ల వారిఁ గూర్చుండఁబెట్టి**
**తమ్ములమ్ములు మంచి గందములు జింక**
**పొక్కిలియుఁ గప్పురము గందవొడి మొదలగు**
**మంచి సరకులచే నామతించి యంత** **141**

ఓలిన్ = వరుసగా, తగుచోట్ల = తగిన స్థానములందు, వారిన్ = ఆ రాజులందరను, కూర్చుండన్ పెట్టి = కూర్చోపెట్టి, తమ్ములములు = తాంబూలములు, మంచి గందములు = మంచి గంధములు, జింక పొక్కిలియున్ = కస్తూరియును, కప్పురము గంద పొడి = కర్పూర పరిమళ గంధపు పొడిని, మొదలగు = మొదలైన, మంచి సరకులచేన్ = మంచి వస్తువులచే, ఆమతించి = స్వాగతము పలికి, అంత = అంతట.

**తా :** వరుసగా తగిన స్థానములందు ఆ రాజులందరను కూర్చోబెట్టి తాంబూలములు, మంచి గంధములు, కస్తూరియును, కర్పూర పరిమళ గంధపు పొడిని మొదలైన వస్తువులచే స్వాగతము పలికి, అంతట –

**కం.** **వలనుగ నతఁ డెంతేనియు**
**బలియురఁ బెక్కండ్ర నేర్చి పనిఁబూనిచి గు**
**బ్బలియుంబలెఁ దన యింటన్**
**దలరెడు సింగాణిఁ గ్రన్ననం దెప్పించెన్** **142**

అతడు = ఆ జనక మహారాజు, ఎంతేనియున్ = మిక్కిలి, వలనుగ = తగినట్లుగా, బలియురన్ పెక్కండ్రన్ ఏర్చి = బలిష్ఠులైన పెక్కుమందిని ఎంచి, పని పూనిచి = పనిని అప్పగించి,

గుబ్బలియున్ వలెన్ = పర్వతములా, తన ఇంటన్ = తన ఇంటిలో, తలరెడు = ఉన్నటువంటి, సింగాణిన్ = ధనుస్సును, క్రన్ననన్ = శీఘ్రముగా, తెప్పించెన్ = తెప్పించెను.

**తా :** ఆ జనకమహారాజు తగినరీతిగా బలిష్ఠులైన పెక్కుమందిని ఎంచి పనిని అప్పగించి పర్వతములా తన ఇంట ఉన్న ధనుస్సును వెంటనే తెప్పించెను.

**కం. తెప్పించి వారి ముందఱ**
**నొప్పారఁగ నునిచి మిగుల నుల్లపుఁ దమ్మిన్**
**ముప్పిరి గొనియెడు వేడ్కల**
**నప్పంట వలంతిరాయఁ డర్మిలి ననియెన్ 143**

తెప్పించి = శివ ధనుస్సును తెప్పించి, ఒప్పారగన్ = చక్కగా, వారి ముందఱన్ = ఆ రాజుల ముందర, ఉనిచి = ఉంచి, మిగుల = ఎక్కువగా, ఉల్లపున్ తమ్మిన్ = హృదయ పద్మమున, ముప్పిరి కొనియెడు = ముసురుకొంటున్న, వేడ్కలన్ = ఆనందముతో, ఆ పంట వలంతి రాయడు = ఆ భూమి పాలకుడగు జనకుడు, అర్మిలిన్ = ప్రీతితో, అనియెన్ = అనెను.

**తా :** శివధనుస్సును తెప్పించి చక్కగా ఆ రాజుల ముందర ఉంచి ఎక్కువగా హృదయ పద్మమున ముసురుకొంటున్న వేడ్కలతో ఆ జనకుడు ప్రీతితో అనెను.

**కం. రాకొమరులార! గుబ్బలి**
**రాకన్నియ మగని యబ్బురపు విల్లిది ముం**
**దా కటి మెడ దొర దీనిం**
**డాకొని బలు టక్కరుల నడంచెం గడిమిన్ 144**

రా కొమరులార = రాజకుమారులారా!, గుబ్బలి రా కన్నియ మగని = హిమవంతుని కుమార్తెయగు పార్వతి భర్త (శివుని), అబ్బురపు = అద్భుతమైన, విల్లు ఇది = ధనుస్సు ఇది, ముందు = ఇంతకు పూర్వము, ఆ కటి మెడ దొర = ఆ నీలకంఠుడు, దీనిన్ డాకొని = దీనిని తీసుకొని, పలు టక్కరులన్ = చాలమంది దుర్మార్గులను, కడిమిన్ = శౌర్యముతో, అడంచెన్ = అణచివేసెను.

**తా :** రాజకుమారులారా! శివుని అద్భుతమైన ధనుస్సు ఇది. ఇంతకు పూర్వము ఆ నీలకంఠుడు దీనితో చాలమంది దుర్మార్గులను శౌర్యముతో అణచివేసెను.

**కం పెద్దల తరమున నుండియుఁ**
**దద్దయు నిది యలరుచుండుఁ దమ నెలవున వే**
**సుద్దు లిఁకేటికి వినుడా!**
**సద్దేమియుఁ జల్పబోక జతనం బొదవన్ 145**

ఇది = ఈ ధనుస్సు, పెద్దల తరమున నుండియున్ = తాత తండ్రుల తరమునుండియును, తమ నెలవునన్ = తమ నివాసమున, తద్దయున్ = అత్యంతము, అలరుచుండున్ = ఒప్పుచుండును, వే సుద్దులు = వేయి మాటలు, ఇక ఏటికి = ఇంక ఎందులకు?, సద్దు ఏమియున్ సల్ప పోక = మాటలు కట్టిపెట్టి, జతనంబు ఒదవన్ = ప్రయత్నించుటకు పూనుకొనగా, వినుడా = వినండి,

**తా :** ఈ ధనుస్సు తాత తండ్రుల తరమునుండియు తమ నివాసమున అత్యంతము ఒప్పుచుండును. వేయి మాటలు ఎందులకు? మాటలు కట్టిపెట్టి ప్రయత్నించండి.

**ఉ.** **మూఁగిన రాచసింగముల మూఁక గనుంగొని మేలు మేలన**
**వీఁగక నిల్చి యిక్కడిఁది విల్లరివోసిన ప్రోడ కేను మే**
**ల్గాఁగ నొసంగుదు న్వలపుఁ గప్రపుఁగుప్ప యనం దనర్చు ని**
**న్నాఁగటి చాలు పేరి యెలనాగల మిన్న నటంచుఁ బల్కినన్** **146**

మూగిన = చేరిన, రాచ సింగముల మూకన్ = శ్రేష్ఠులైన రాజుల సమూహమును, కనుంగొని = చూచి, మేలు మేలు అనన్ = సెహభాష్ అని మెచ్చుకొనుచుండగా, వీగక నిల్చి = వెనుకడుగేయక నిలబడి, ఈ కడిది = ఈ కఠినమైన, విల్లు = ధనుస్సును, అరి పోసి = నారి సంధించిన, ప్రోడకు = సమర్థునికి, ఏను = నేను, మేలు కాగన్ = శుభమగునట్లుగా, వలపు కప్రపు కుప్ప యనన్ తనర్చు = పరిమళించు కర్పూరపు కుప్పయన ఒప్పుచున్న, ఈ నాగటి చాలు పేరి = ఈ నాగటి చాలు పేరుకల, ఎలనాగల మిన్నన్ = స్త్రీలలో శ్రేష్ఠురాలైన సీతను, ఒసంగుదున్ = ఇచ్చెదను, అటంచున్ పల్కినన్ = అని పలుకగా, (సీత = నాగటిచాలు)

**తా :** చేరిన రాజుల సమూహమును చూచి సెహభాష్ అని మెచ్చుకొనగా, వెనకడుగేయక ఈ విల్లును నారి సంధించిన సమర్థునికి నేను చక్కని చుక్క, నాగటి చాలు పేరుకల, స్త్రీలలో శ్రేష్ఠురాలైన సీతను ఇచ్చెదను అనిపలుకగా –

**తే.గీ.** **విని పుడమిఱేఁడు లెంతయు వెఱఁగు పడుచు**
**నద్దిఱా! కొండ కుద్దియై కొద్దిగాక**
**యున్న విలు దెచ్చి యందఱ బన్నమొంద**
**జేసెఁబో! వీఁడు దబ్బఱ చేసి నేడు** **147**

విని = జనకుని మాటలు విని, పుడమి ఱేడులు = రాజులు, ఎంతయు వెఱగు పడుచు = ఎంతో ఆశ్చర్యాన్ని పొందుచు, అద్దిఱా = అదిరా!, వీడు = ఈ జనకుడు, నేడు = ఈనాడు, దబ్బఱ చేసి = మాయమాటలు చెప్పి, కొద్ది కాక = అల్పమైనది కాక, కొండకు ఉద్దియై యున్న = కొండతో సమానమై ఉన్న, విలు తెచ్చి = ధనుస్సును తెచ్చి, అందఱన్ = అందరిని, బన్నము ఒంద చేసెన్ పో = భంగపాటుకు గురిచేసేడుకదా!

**తా :** విని, రాజులు ఎంతో ఆశ్చర్యాన్ని పొంది, అదిరా! ఈ జనకుడు ఈనాడు మాయ మాటలు చెప్పి అల్పమైనది కాక కొండతో సమానమైన ధనుస్సును తెచ్చి అందరినీ భంగపాటుకు గురిచేసేడుకదా!

**తే.గీ.** **అనుచు నెమ్మొగముల విన్నఁదనము దోఁప**
**జరిగి రూరక సన్నక సన్నఁగొంద**
**ఱొక్క కొందఱు దొరలు విల్లెక్కిడంగఁ**
**బూని కదలింప నోడియు మ్రానువడిరి** **148**

అనుచు = అనుకొనుచు, నెఱి మొగములన్ = అందమైన ముఖములందు, విన్నదనము తోఁపన్ = చిన్నతనము కనబడగా, ఊరక = మౌనముగా, సన్నక = సిద్ధపడక, సన్నన్ = మెల్లగా, కొందరు, జరిగిరి = పక్కకు తప్పుకొనిరి, ఒక్క కొందరు = ఒక కొంతమంది, దొరలు = రాజులు, విల్లు ఎక్కిడింగన్ = విల్లు ఎక్కుపెట్టుటకు, పూని = ప్రయత్నించి, కదలింపన్ ఓడియు = కదలించుటకు ఓడిపోయి, మ్రాను పడిరి = నిర్ఘాంతపోయిరి.

**తా :** అనుకొనుచు అందమైన ముఖములందు విన్నదనము కనబడగా మౌనముగా సిద్ధపడక మెల్లగా కొందరు పక్కకు తప్పుకొనిరి. కొంతమంది రాజులు విల్లు ఎక్కుపెట్టుటకు ప్రయత్నించి కదలించుటకు ఓడిపోయి నిర్ఘాంతపోయిరి.

**తే.గీ.** **మున్నరకతోడఁ గొందఱు మన్నుఱేండ్లు**
**గోరి సింగాణి గొనయంబు గూర్పఁబూని**
**పొదవి చేతులఁ బొరలించి పుడమి పైని**
**నెగయ నెత్తఁగ నింతయు నేరరైరి** **149**

మున్నరకతోడన్ = ధైర్యముతో, కొందఱు = కొంతమంది, మన్ను ఱేండ్లు = రాజులు, కోరి = ఉత్సహించి, సింగాణి గొనయంబు = వింటి నారిని, కూర్పన్ పూని = సంధించాలనుకొని, పొదవి = ప్రయత్నించి, చేతులన్ పొరలించి = చేతులతో అటునిటు కదలించి, పుడమి పైనిన్ = భూమి మీదనుంచి, ఎగయన్ = పైకి లేచునట్లుగా, ఎత్తంగన్ = ప్రయత్నించగా, ఇంతయున్ = కొంచెమైనను, నేరరు ఐరి = సమర్థులు కాకపోయిరి.

**తా :** ధైర్యముతో కొంతమంది రాజులు ఉత్సహించి వింటినారిని సంధించాలనుకొని ప్రయత్నించి చేతులతో అటునిటు కదలించి భూమిమీదనుంచి పైకిలేపుటకు ప్రయత్నించగా కొంచెమైనను కదుపుటకు సమర్థులు కాకపోయిరి.

**చం.** **అటువలె రాచవేల్పు దొరలందఱు నుక్కఱి స్రుక్కి వీఁగి యే**
**గుటఁ గని ప్రొద్దు వంగడపుఁ గ్రొన్నెల రా జడదారి పంపునం**
**దటుకున విల్లు పుచ్చుకొని తప్పక యెక్కిడి నారి లాగుచోఁ**
**బెటబెట లాడుచున్ విఱిఁగె బెల్లుగఁ జప్పుడు వింట నంటగన్** **150**

అటువలె = ఆ రీతిగా, రాచవేల్పు దొరలు = శ్రేష్ఠులైన రాజులు, అందఱున్, ఉక్కు అఱి = బల హీనులై, స్రుక్కి = బెదరి, వీగి = ఓడిపోయి, ఏగుటన్ = వెళ్ళుటను, కని, జడదారి పంపున్ = విశ్వామిత్రుడు పంపగా, ప్రొద్దు వంగడపున్ క్రొత్త నెల రా = సూర్యవంశపు బాల చంద్రుడు, తటుకునన్ = వెంటనే, విల్లు పుచ్చుకొని, తప్పక = తగ్గక, ఎక్కిడి = ఎక్కుపెట్టి, నారి లాగుచో = నారి లాగగానే, బెటబెటలు ఆడుచున్ = బెటబెటమని శబ్దము చేయుచు, పెల్లుగన్ = అధికముగ, చప్పుడు = ధ్వని, వింటన్ అంటగన్ = ఆకాశమునంటగా, విఱిగె = విరిగెను.

**తా :** ఆ రీతిగా శ్రేష్ఠులైన రాజులు అందరూ బలహీనులై బెదరి ఓడిపోయి వెళ్ళుటను చూచి విశ్వామిత్రుడు పంపగా రాముడు వెంటనే వింటిని చేతపట్టి తగ్గక ఎక్కుపెట్టి నారి లాగగానే బెటబెటమని శబ్దం చేస్తూ, ఆ ధ్వని ఆకాశమునంటగా విరిగెను.

**ఆ.వె.** **ఏపుతోడ నాము టేనుఁగు గున్న లేఁ**
**జెఱకుకోల విఱుచు తెఱఁగు దోఁప**
**దోలు దాల్పు విల్లు దునిమిన యజ్జాణఁ**
**జూచి యబ్బ పేరి రాచగిబ్బ** **151**

ఆము ఏనుగు గున్న = మదించిన ఏనుగు గున్న, లేత చెఱకు కోల = లేత చెఱకు గడను, విఱుచు తెఱగు తోప = విరుచునట్టి విధము తలపింపగా, తోలు తాల్పు విల్లు = శివుని వింటిని, తునిమిన = విరిచిన, ఆ జాణ = ఆ నేర్పరిని, చూచి = చూచి, అబ్బ పేరి = జనకుడు అను పేరుకల, రాచగిబ్బ = రాజవృషభుడు.

**తా :** మదించిన ఏనుగు గున్న లేత చెఱకు గడను విరుచునట్టి విధము తలపింపగా శివుని వింటిని విరిచిన ఆ నేర్పరిని చూచి జనకుడు –

**కం.** **నానయు వెఱఁగును వేడ్కయు**
**లో నెరయఁగ నతని మెచ్చి లొజ్జించుకయుం**
**బూనని నెయ్యంబున న**
**క్కాన బిడారంపు సామిఁ గన్గొని పలికెన్** **152**

(జనకుడు) నానయు = సిగ్గును, వెఱగును = ఆశ్చర్యము, వేడ్కయు = ఆనందమును, లోనెరయగన్ = మనసున అతిశయింపగా, అతనిన్ మెచ్చి = ఆ రాముని మెచ్చుకొని, లొజ్జు ఇంచుకయున్ = తక్కువతనము కొంచెమును, పూనని = పొందని, నెయ్యంబునన్ = స్నేహ భావముతో, ఆ కాన బిడారంపు సామిన్ = ఆ అరణ్యమే నివాసముగా కల స్వామిని (విశ్వామిత్రుని), కన్గొని = చూచి, పలికెన్ = పలికెను.

**తా :** జనకుడు సిగ్గు, ఆశ్చర్యము, ఆనందము మనసున అతిశయింపగా ఆ రాముని మెచ్చుకొని లొజ్జు తనము లేని స్నేహభావముతో విశ్వామిత్రుని చూచి పలికెను.

**ఆ.వె.** **జోగిబొబ్బమెకమ! యీ గడుసరి కుఱ్ఱ**
**లెవ్వ? రెందునుండి యేఁగుదెంచి?**
**రిట్టి బలిమికాండ్రు రెవ్వరి కొమరులు?**
**తేటపడఁగ మాకుఁ దెలుపవయ్య!** **153**

జోగి బొబ్బమెకమ = ముని శార్దూలా!, ఈ గడుసరి కుఱ్ఱలు = ఈ సమర్థులైన పిల్లలు, ఎవ్వరు = ఎవరు?, ఎందునుండి = ఎక్కడినుండి, ఏగుతెంచిరి = వచ్చిరి?, ఇట్టి = ఇటువంటి, బలిమికాండ్రురు = బలశాలులు, ఎవ్వరి కొమరులు = ఎవరి కుమారులు?, తేటపడగ = స్పష్టమగు రీతిగా, మాకున్ = మాకు, తెలుపవయ్య = ఎఱిగించుము.

**తా :** ముని శార్దూలా! ఈ సమర్థులైన పిల్లలు ఎవరు? ఎక్కడినుండి వచ్చిరి? ఇటువంటి బలశాలులు ఎవరి కుమారులు? తేటపడగ మాకు ఎఱిగించుము.

**కం.** **మిముఁ బోని బల్లిదులు మే**
**ల్సమకూర్చుట కొఱకుఁగాదె చనుదెంతురు ని**
**క్కముగ నిపు డెల్ల కోర్కులు**
**నమరెంగద మిమ్ముఁ జూచినంతనె మాకున్** **154**

మిమున్ పోని = మీవంటి, బల్లిదులు = గొప్పవారు, మేలు సమకూర్చుట కొఱకు కాదె = శుభమును చేకూర్చుటకు మాత్రమే, చనుదెంతురు = వచ్చెదరు, నిక్కముగన్ = నిజముగా, ఇపుడు = ఇప్పుడు, మిమ్మున్ = మిమ్ములను, చూచినంతనె = చూడగానే, మాకున్ = మాకు, ఎల్ల కోర్కులు = అన్ని కోరికలు, అమరెన్ కద = తీరెనుకదా!

**తా :** మీవంటి గొప్పవారు మేలును సమకూర్చుట కొఱకు కాదె వచ్చెదరు. నిజముగా ఇప్పుడు మిమ్ములను చూడగానే మాకు కోరికలన్నియును తీరెనుకదా!

**చం.** **అనవుడు నాతఁడిట్టులను నయ్యేకిమీని మొగంబుఁ జూచి యో**
**గొనముల యిక్క! యిక్కొమఱుఁ గుఱ్ఱలు పొద్దు కొలంపుఁ బెద్దయై**
**తనరుచునుండు చాల్పు టరదంబుల తేని యనుంగు బోద లే**
**పున నిట వచ్చి రీ విడిన బూచుల రాయని విల్లు గన్గొనన్** **155**

అనవుడున్ = అనగానే, ఆతడు = ఆ విశ్వామిత్రుడు, ఆ ఎకిమీని మొగంబు చూచి = ఆ రాజు ముఖము కాంచి, ఇట్టులు అనున్ = ఇట్లు పలికెను, ఓ గొనముల ఇక్క = ఓ సద్గుణముల స్థానమా!, ఈ కొమఱున్ కుఱ్ఱలు = ఈ సుందరులైన కుమారులు, పొద్దు కొలంపున్ పెద్దయై = సూర్య వంశమున శ్రేష్ఠుడై, తనరుచుండు = ఒప్పుచున్న, చాల్పు అరదంబుల తేని = దశరథుని, బోదలు = పుత్రులు, ఏపున = సాహసముతో, ఈవు ఇడిన = నీవు ఉంచిన, బూచుల రాయని విల్లు = శివ ధనుస్సును, కన్గొనన్ = చూచుటకు, ఇట = ఇక్కడకు, వచ్చిరి = వచ్చియున్నారు.

**తా :** అనగానే ఆ విశ్వామిత్రుడు ఆ రాజు ముఖము కాంచి ఇట్లు పలికెను. ఓ సద్గుణముల స్థానమా! ఈ సుందరులైన కుమారులు సూర్యవంశ శ్రేష్ఠుడై ఒప్పుచున్న దశరథుని పుత్రులు. సాహసంతో నీవు ఉంచిన శివ ధనుస్సును చూచుటకు ఇక్కడకు వచ్చియున్నారు.

**సీ.** **మన్ను క్రొన్ననబోఁడి మున్న టక్కరి రక్క**
**సుల మోవ నోపక తలఁకుచున్నఁ**
**జదువుల దేవర మొదలగు వేల్పులు**
**జిడ్డు నీర్వామికిఁ జేరి యందుఁ**
**బెనుబాఁప నును బానుపున దమ్మి యింటి తొ**
**య్యలి యజ్జ లొత్తంగ నత్తమిలిన**

**వెన్నున కప్పని విన్నవించిన నతం**
**డఱిముఱి వారి యక్కఱలు దీర్పఁ**

**తే.గీ.** **గోరి ముప్వేలుపుల యిక్క కొలమునందు**
**జమిలి చౌవంచ తేర్ల రా చలివెలుఁగున**
**కేపుతోఁ బుట్టె నెదరులు వాపి పజలఁ**
**బ్రోవ నరుదుగ నిరు దుగ రూపులూని** **156**

మున్న = ఇంతకు ముందు, మన్ను క్రొన్ననబోడి = భూదేవి, టక్కరి రక్కసుల = దుర్మార్గులైన రాక్షసులను, మోవన్ ఓపక = భరింప జాలక, తలకుచు ఉన్న = బాధపడుచుండగా, చదువుల దేవర మొదలగు = బ్రహ్మ మొదలైన, వేల్పులు = దేవతలు, జిడ్డు నీర్వామికిన్ = పాల సముద్రమునకు, చేరి = వెళ్ళి, అందున్ = ఆ పాల సంద్రమున, పెను పాప = ఆదిశేషుని, నును = మెత్తనైన, పానుపున = శయ్యమీద, తమ్మి ఇంటి తొయ్యలి = పద్మ నివాసినియగు స్త్రీ (లక్ష్మీదేవి), అజ్జలు ఒత్తంగ = పాదములు ఒత్తుచుండగా, అత్తమిలిన = శయనించిన, వెన్నునకు = విష్ణునకు, ఆ పని, విన్నవించినన్ = విన్నవించగా, అతండు = ఆ విష్ణువు, అఱిముఱి = వెంటనే, వారి అక్కఱలు = వారి బాధలు, తీర్పన్ = తీర్చుటకు, కోరి = ఇష్టపడి, ముప్వేలుపుల ఇక్క = త్రిమూర్తులకు స్థానమైన సూర్యుని, కొలమునందు = వంశమునందు, జమిలి చౌవంచ తేర్ల = 2×5 దశరథుడను, రా చలివెలుగునకు = రాజ చంద్రునకు, ఏపుతోన్ = అతిశయముతో, ఎదరులు = ఆపదలు, పాపి = పోగొట్టి, పజలన్ = ప్రజలను, ప్రోవన్ = కాపాడుటకు, అరుదుగన్ = అపురూపముగా, ఇరు దుగ రూపులు = 2×2 నాలుగు రూపములు, ఊని = పూని, పుట్టెన్ = పుట్టెను.

**తా :** ఇంతకుముందు భూదేవి దుర్మార్గులైన రాక్షసులను భరింపజాలక బాధపడుచుండగా బ్రహ్మ మొదలైన దేవతలు పాలసంద్రమునకు వెళ్ళి ఆదిశేషుని మెత్తనైన పానుపుపైన లక్ష్మీదేవి పాదములు ఒత్తుచుండగా శయనించిన విష్ణునకు ఆ పని విన్నవించగా, ఆ విష్ణువు వెంటనే వారి బాధలు తీర్చుటకు ఇష్టపడి సూర్య వంశమందు దశరథుడను రాజచంద్రునకు ఏపుతో ఆపదలు పోగొట్టి ప్రజలను కాపాడుటకు అపురూపముగా నాలుగు రూపములు పూని పుట్టెను.

**ఉ.** **అమ్మగ మానికంబు దిటమారఁగ నొక్క లకోరిఁ జెడ్డ రే**
**ద్రిమ్మరి కొమ్మ నుక్కడఁచి తేటగ జన్నము గాచి చట్టు చం**
**దమ్మున నున్న పెందపసి తామరకంటిని బ్రోచి యిందు వ**
**చ్చెమ్మొగి నీదు జన్న మఱసేయక చూచు కడంక మీఱఁగన్** **157**

ఆ మగ మానికంబు = ఆ వజ్రమువంటి రాముడు, దిటము ఆరగన్ = మిక్కిలి ధైర్యముతో, ఒక్క లకోరిన్ = ఒకే ఒక్క బాణముతో, చెడ్డ = దుష్టురాలైన, రే త్రిమ్మరి కొమ్మన్ = రాక్షస స్త్రీని (తాటకి), ఉక్కు అడచి = గర్వమునణచి (చంపి), తేటగ = చక్కగా, జన్నము కాచి = యజ్ఞమును రక్షించి, చట్టు చందమునన్ ఉన్న = రాతి రూపమున ఉన్నటువంటి, పెందపసి తామరకంటిని

= గౌతముని భార్యను (అహల్య), ప్రోచి = కాపాడి, మొగిన్ = పూనికతో, నీదు జన్నము = నీవు చేయు యజ్ఞమును, చూచు, కడంక మీఱగన్ = మిక్కిలి కోరికతో, ఇందు = ఇక్కడకు, వచ్చెన్ = వచ్చెను.

**తా :** ఆ వజ్రమువంటి రాముడు మిక్కిలి ధైర్యముతో ఒకే ఒక్క బాణముతో దుష్టురాలైన తాటకిని చంపి చక్కగా యజ్ఞమును రక్షించి, రాతి రూపమున ఉన్న గౌతముని భార్యను అహల్యను కాపాడి నీ యజ్ఞము చూడాలనే కోరికతో ఇక్కడకు వచ్చెను.

**తే.గీ.** **అరయఁ దీవంచ వార్వంపు టగ్గిపట్ల**
**నడుమ నడరొందు నాడెంపుఁ బుడమిఱేఁడు**
**లెల్లఁ గదలింప లేని యవ్విల్లు దునిమె**
**నిప్పుఁ డీతని మగతనం బెన్నఁదరమె? 158**

అరయన్ = చూడగా, తీవంచ = నాలుగు, వార్వంపు అగ్గి పట్ల = బడబాగ్ని ఉండు ప్రదేశముల (సముద్రములు), నడుమన్ = మధ్యలో, అడరొందు = చక్కగానున్న, నాడెంపు = శ్రేష్ఠమైన, పుడమి ఱేడులు ఎల్లన్ = రాజులందరును, కదలింప లేని = కదల్చ జాలని, ఆ విల్లు = ఆ శివ ధనుస్సును, ఇప్పుడు = ఇప్పుడే, తునిమెన్ = ఖండించెను, ఈతని = ఈ రామునియొక్క, మగతనంబు = పరాక్రమము, ఎన్న తరమె = స్తుతింప శక్యమా?

**తా :** చూడగా నాలుగు సముద్రముల మధ్యలో శ్రేష్ఠమైన రాజులందరూ కదల్చజాలని ఆ శివ ధనుస్సును ఇప్పుడే ఖండించెను. ఈ రాముని పరాక్రమము స్తుతింప శక్యమా?

**కం.** **చుక్కల రాయఁడు మరుడుం**
**జక్కుల యెకిమీని కొడుకు జతవోలని యీ**
**చక్కని పాపఁడు నీకున్**
**దక్కెంబో! అల్లుడై దిటం బలరారన్ 159**

చుక్కల రాయడు = చంద్రుడును, మరుడున్ = మన్మథుడును, జక్కుల ఎకిమీని కొడుకు = కుబేరుని కొడుకు (నలకూబరుడు), జత పోలని = సమానము కాని, ఈ చక్కని పాపడు = ఈ సుందరుడైన పిల్లగాడు, నీకున్ = నీకు, దిటంబు అలరారన్ = సమర్థత ప్రకాశింపగా, అల్లుడై = సీతకు భర్తయై, తక్కెన్ పో = దక్కినాడు కదా!

**తా :** చంద్రుడు, మన్మథుడు, నలకూబరుడు జతపోలని ఈ చక్కని పిల్లగాడు నీకు సమర్థత ప్రకాశింపగా అల్లుడై దక్కినాడుకదా!

**తే.గీ.** **అనిన నుప్పొంగి రా చూచి యయ్య! యింక**
**జాగుఁ గావింపనేల? యిచ్చటి కయోధ్య**
**యేలు యొడయనిఁ బెండిలి కిపుడు పిలువఁ**
**బనుప వలెనని నెయ్య మేర్పడఁగఁ బలికె 160**

అనినన్ = అని పలుకగా, ఉప్పొంగి = సంబరపడి, రా = రాజైన జనకుడు, చూచి = విశ్వామిత్రుని చూచి, అయ్యా = స్వామీ!, ఇంక = ఇకపైన, జాగున్ కావింపన్ ఏల = ఆలసించుట ఎందులకు?,

ఇచ్చటికి = ఇక్కడికి, అయోధ్య ఏలు ఒడయనిన్ = అయోధ్యను పాలించు రాజును (దశరథుని), ఇపుడు = ఇప్పుడే, పెండిలికి = సీతారాముల వివాహమునకు, పిలువన్ పనుపవలెనని = ఆహ్వానము పంపవలెనని, నెయ్యము ఏర్పడగన్ = బంధుత్వము కలుపుకొనుటకు, పలికె = పలికెను.

**తా :** అని పలుకగా సంబరపడి జనకుడు విశ్వామిత్రుని చూచి స్వామీ! ఇకపైన ఆలసించుట ఎందులకు? దశరథుని ఇప్పుడే పెండిలికి ఆహ్వానము పంపవలెనని బంధుత్వము కలుపుకొనుటకు పలికెను.

**తే.గీ.** **వలఁతి బంటుల నిరువురఁ బిలిచి మేలి**
**కమ్మ యొసఁగిన వారొక యుమ్మడిఁ జని**
**యోలగంబున నెమ్మదిఁ గ్రాలుచున్న**
**బంతి తేరుల రాచ మేల్బంతిఁ గాంచి** **161**

ఇరువురన్ = ఇద్దరిని, వలతి బంటులన్ = సమర్థులైన సేవకులను, పిలిచి, మేలి కమ్మ = శుభలేఖను, ఒసగిన = ఇవ్వగా, వారు = ఆ సేవకులు, ఒక ఉమ్మడిన్ చని = ఎక్కడా ఆగకుండా వెళ్ళి, ఓలగంబున = సభలో, నెమ్మది = సంతోషముగా, క్రాలుచున్న = ప్రకాశించుచున్న, బంతి తేరుల రాచ మేల్బంతిన్ = రాజశ్రేష్ఠుడైన దశరథుని, కాంచి.

**తా :** సమర్థులైన ఇద్దరు సేవకులను పిలిచి శుభలేఖను ఇవ్వగా వారు ఎక్కడా ఆగకుండా వెళ్ళి సభలో సంతోషముగానున్న దశరథుని కాంచి –

**కం.** **కేలెత్తి మ్రొక్కి వెసఁ దము**
**నేలినవాఁ డిడిన కమ్మ యిడుటయు నాతం**
**డోలి నది చదువుకొని కడు**
**నా లెంకల నీగివలన నలరించి తగన్** **162**

కేలెత్తి మ్రొక్కి = చేతులెత్తి నమస్కరించి, వెసన్ = వెంటనే, తమున్ = తమను, ఏలినవాడు = పాలించువాడు (ప్రభువు), ఇడిన = ఇచ్చిన, కమ్మ = లేఖను, ఇడుటయు, ఆతండు = ఆ దశరథుడు, ఓలి = క్రమముగా, అది = ఆ లేఖను, చదువుకొని, ఆ లెంకలన్ = ఆ బంటులను, కడున్ = అధికమైన, ఈగివలన = బహుమతులవలన, తగన్ = తగురీతిగా, అలరించి = సంతోషపెట్టి.

**తా :** నమస్కరించి తమ ప్రభువు ఇచ్చిన లేఖను ఇచ్చుటయును, ఆ దశరథుడు ఆ లేఖను చదువుకొని, ఆ బంటులను గొప్ప బహుమతులతో తగురీతిగా సంతోషపెట్టి –

**కం.** **వేడుకయు వెఱఁగుఁ గడఁకయు**
**నై డెందము చిగురు లెత్త నపుడె ప్రగడలన్**
**నాడెపుఁ బాఱుల విందులఁ**
**దోడి దొరలఁ గూర్చి సొంపుతోఁ బయనంబై** **163**

వేడుకయు = సంతోషమును, వెఱగున్ = ఆశ్చర్యమును, కడకయున్ ఐ = ప్రయత్నము కలవాడున్నై, డెందము చిగురులు ఎత్తన్ = మనసు ఆనందము పొందగా, అపుడె = వెంటనే, ప్రగడలన్ = మంత్రులను, నాడెపున్ పాఱులన్ = శ్రేష్ఠులైన బ్రాహ్మణులను, విందులన్ = బంధువులను, తోడి దొరలన్ = సహ రాజులను, కూర్చి = ఒకచో చేర్చి, సొంపుతోన్ = సొగసుగా, పయనంబై.

**తా :** సంతోషమును, ఆశ్చర్యమును, ప్రయత్నమును కలవాడై మనసున ఆనందము ఉప్పొంగగా వెంటనే మంత్రులను, బ్రాహ్మణులను, బంధువులను, తోడి రాజులను ఒకచో చేర్చి సొగసుగా ప్రయాణమయి –

**సీ.** **ఎడలేక నడచు తత్తడులు నేనుంగులు**
**తేరులు తరగల తెరలు గాఁగఁ**
**జద లెల్ల నద్రువ విచ్చలవిడి మొఱయు వా**
**యిదములు బెడిదంపు రొదలు గాఁగఁ**
**పెంపారు తెలి ముత్తియంపు జంపపు టెల్లి**
**తెగలు నిద్దంపు నురుగులు గాఁగఁ**
**బలితంపు హొయలు చెన్నలరు రాకొమరులు**
**కొమరొందు నెఱ మానికములు గాఁగ**

**తే.గీ.** **హరువు మెఱయంగఁ బాతర లాడు గడణ**
**వెలఁదుకలు పవడంపుఁ దీవియలు గాఁగ**
**నుబ్బి పొదలెడు మున్నీటి యుద్ది వోలెఁ**
**దద్ద వేడ్కల మిథిలకుఁ దలరి చనియె** **164**

ఎడ లేక = ఆలస్యము చేయకుండా, నడచు = నడచునట్టి, తత్తడులును = గుఱ్ఱములును, ఏనుంగులు = ఏనుగులు, తేరులు = రథములు, తరగల తెరలు కాగన్ = కెరటములయొక్క వరుసలు కాగా, చదలు ఎల్లన్ = ఆకాశమంతయు, అద్రువ = అదరునట్లుగా, విచ్చలవిడి = స్వేచ్ఛగా, మొఱయు = ధ్వనించు, వాయిదములు = వాయిద్యములు చేయు ధ్వనులు, బెడితంపు = అధికమైన, రొదలు కాగన్ = కెరటముల ధ్వనులు కాగా, పెంపారు = మిక్కిలి అందమైన, తెలి ముత్తియంపు = తెల్లని ముత్యాలతో, జంపపు = కూర్చబడిన, ఎల్లి తెగలు = ఛత్రముల సమూహములు, నిద్దంపు = స్వచ్ఛమైన, నురుగులు కాగన్, బలితంపు = అధికమైన, హొయలు = విలాసముతో, చెన్ను అలరు = సొగసుగానున్న, రా కొమరులు = రాజ కుమారులు (భరత, శత్రుఘ్నులు), కొమరొందు = అందమైన, నెఱ మానికములు కాగ = మంచి మాణిక్యములు కాగా, హరువు మెఱయంగన్ = మిక్కిలి మనోహరముగా, పాతరలు ఆడు = నాట్యముచేయు, గడణ వెలదుకలు = వేశ్యా స్త్రీలు, పవడంపు తీవియలు కాగ = పగడాల తీగెలు కాగా, ఉబ్బి పొదలెడు = ఆనందముతో పొంగిపోతున్న, మున్నీటి ఉద్ది పోలె = సముద్రముతో సమానత్వమును పొంది, (దశరథుడు) తద్ద వేడ్కల = మిక్కిలి సంతోషముతో, తలరి = ఒప్పి, మిథిలకు చనియె = మిథిలానగరమునకు వెళ్ళెను.

**తా :** ఆలస్యం లేకుండా నడిచే గుఱ్ఱములును, ఏనుగులు, రథములు కెరటముల వరుసలు కాగా, ఆకాశమంత అదరునట్లుగా ధ్వనించు వాయిద్యముల ధ్వనులు కెరటముల ధ్వనులు కాగా, అందముగా ముత్యాలతో కూర్చబడిన ఛత్రములు స్వచ్ఛమైన నురుగులు కాగా, మిక్కిలి విలాసముతో ఉన్న రాజకుమారులు మంచి మాణిక్యములు కాగా, మనోహరముగా నాట్యముచేయు వేశ్యాస్త్రీలు పగడాల తీగెలు కాగా ఉప్పొంగు సముద్రముతో సమానత్వమును పొంది దశరథుడు మిక్కిలి సంతోషముతో ఒప్పి మిథిలకు వెళ్ళెను.

**కం.** **చనుటయు నబ్బలియు నెదు**
**ర్కొని తన నగరునకుఁ దోడుకొని చని పూజల్**
**పొనరించి మిథిల తేఁడా**
**తని నొక విడిపట్టు నందుఁ దనరఁగ నునిచెన్** **165**

చనుటయున్ = వెళ్ళగా, ఆ బలియున్ = ఆ జనకుడును, ఎదుర్కొని = స్వాగతించి, తన నగరునకున్ = తన అంతఃపురమునకు, తోడుకొని చని = తీసుకొని వెళ్ళి, పూజల్ పొనరించి = అతిథి పూజలనుచేసి, మిథిలతేడు = జనకుడు, ఆతనిన్ = ఆ దశరథుని, ఒక విడిపట్టు నందున్ = ఒక విడిది ప్రదేశమునందు, తనరగన్ = తగినరీతిగా, ఉనిచెన్ = ఉంచెను.

**తా :** చనుటయును, ఆ జనకుడు స్వాగతించి తన నగరునకు తీసుకొని వెళ్ళి అతిథి పూజలు చేసి ఆ దశరథుని తగినరీతిగా ఒక విడిది ప్రదేశమున ఉంచెను.

**ఆ.వె.** **అంతఁ బెద్ద బాపనయ్యల యానతి**
**వడసి యొక్క మంచి గడియ దోయి**
**యందు రాగవునకుఁ బొందుఁగా దన పట్టిఁ**
**బెండ్లి సేసె మఱియుఁ బేర్మితోడ** **166**

అంతన్ = అంతట, పెద్ద బాపనయ్యల = పండితులైన బ్రాహ్మణుల, ఆనతి వడసి = అనుజ్ఞ పొంది, ఒక్క మంచి గడియ దోయి అందు = ఒక మంచి ముహూర్తమునందు, రాగవునకున్ = రామునకును, పొందుగా = పొందికగా, తన పట్టిన్ = తన కుమార్తెను (సీతను), పెండ్లి చేసె = పెండ్లి చేసెను, మఱియు = ఇంకను, పేర్మితోడ = ప్రీతితో.

**తా :** అంతట బ్రాహ్మణుల అనుజ్ఞను పొంది ఒక మంచి ముహూర్తమున రామునకు పొందికగా తన కుమార్తెనిచ్చి పెండ్లిచేసెను. మఱియు ప్రీతితో –

**కం.** **తన తమ్ముని బిడ్డల నా**
**తని తమ్ములు మువ్వురకును దద్దయు వేడ్కన్**
**బెను మినుకు త్రోవఁ బెండ్లిం**
**డొనరించి కరంబుఁ గూర్మియుప్పతిలంగన్** **167**

ఆతని = ఆ రాఘవుని, తమ్ములు మువ్వరకును = తమ్ములు ముగ్గురకును, తన = జనకునియొక్క, తమ్ముని బిడ్డలన్ = తమ్ముని కుమార్తెలను, తద్దయు వేడ్కన్ = మిక్కిలి

సంతోషముతో, పెను మినుకు త్రోవన్ = వైదిక మార్గమున, పెండ్లిండ్లు ఒనరించి = వివాహములు జరిపి, కరంబు = మిక్కిలి, కూర్మి ఉప్పతిలంగన్ = ప్రేమ అతిశయింపగా –

**తా :** ఆ రాముని తమ్ములు ముప్పురకును తన తమ్ముని బిడ్డలను వైదికమార్గమున పెండ్లిండ్లు జరిపి మిక్కిలి ప్రేమతో –

**తే.గీ.** **తగటు చీరలు రతనంపుఁ దళుకుఁ దొడవు**
**లందలంబులుఁ జందువా ల్గుందనంపు**
**టెల్లిగములును దూఁగుటుయ్యేలలు మంద**
**సలును నయ్యల్లువారి కొసంగి మఱియు** **168**

తగటు చీరలు = జలతారు వస్త్రములు, రతనంపున్ తళుకున్ తొడవులు = రత్నాల మెఱిసే నగలు, చందువాలు = వస్త్రములు, కుందనంపు ఎల్లిగములును = బంగారు ఛత్రములును, తూగు ఉయ్యేలలు, మందసలును = పెట్టెలును, ఆ అల్లువారికి = ఆ అల్లుళ్ళకు, ఒసంగి = ఇచ్చి, మఱియు = ఇంకను.

**తా :** జలతారు వస్త్రములు, రత్నాల ఆభరణములు, చాందినీలు, బంగారు ఛత్రములు, తూగుటుయ్యాలలు, పెట్టెలు ఆ అల్లుళ్ళకు ఇచ్చి, ఇంకను –

**కం.** **చెయ్యిగల మెకపు బారులఁ**
**బయ్యర వడిగల్గు జక్కి పదువుల నిడి తా**
**నెయ్యంబున వియ్యంబుల**
**కయ్యెడఁ గడలేని సొమ్ము లప్పన సేసెన్** **169**

చెయ్యిగల మెకము బారులన్ = తొండము కల జంతువుల (ఏనుగుల) సమూహములను, పయ్యర = గాలితో సమానముగా, వడి కల్గు = వేగము కల, చక్కి పదువులన్ = గుఱ్ఱముల సమూహములను, ఇడి = ఇచ్చి, తాన్ = తాను, నెయ్యంబున = ప్రీతితో, వియ్యంబులకు = సంబంధీకులకు, అయ్యెడన్ = ఆ సమయమున, కడలేని = లెక్కలేని, సొమ్ములు = కానుకలు, అప్పన చేసెన్ = అర్పణ చేసెను.

**తా :** ఏనుగుల సమూహములను, గాలి వేగముకల గుఱ్ఱములను ఇచ్చి తాను ప్రీతితో వియ్యాలవారికి ఆ సమయమున లెక్కలేని కానుకలు అర్పణ చేసెను.

**ఉ.** **ఆరని తేజు గల్గి యలరారెడు నయ్యెకిమీఁడు వేయి నూ**
**ఱారుల ఱొక్కముల్ దొడవు లందలము ల్వలిపంపుఁ జీరలుం**
**జూఱలు గాఁగ నింటఁగల సొమ్ములు నెమ్మి నొసంగి యత్తఱిన్**
**బాఱుల బీద సాదులను బందుగులం దనియించె నెంతయున్** **170**

ఆరని = తగ్గని, తేజు కల్గి = తేజస్సు కలిగి, అలరారెడు = ఒప్పునట్టి, ఆ ఎకిమీడు = ఆ రాజు (జనకుడు), వేయి నూఱారుల = అసంఖ్యాకములైన, ఱొక్కముల్ = రొక్కమును, తొడవులు = నగలు, అందలములు = పల్లకీలు, వలిపంపున్ చీరలున్ = సన్నని వస్త్రములును, చూఱలు

కాగన్ = కొల్లలుగా, ఇంటన్ కల = ఇళ్ళలో ఉండేటటువంటి, సొమ్ములు = వస్తువులను, నెమ్మిన్ ఒసంగి = ప్రేమతో ఇచ్చి, ఆ తఱిన్ = ఆ సమయమున, పాఱుల = బ్రాహ్మణులను, బీద, సాదులను, బందుగులన్ = బంధువులను, ఎంతయున్ = మిక్కిలి, తనియించెన్ = తృప్తిపఱచెను.
**తా :** ఆరని తేజస్సు కలిగి ఒప్పునట్టి జనకుడు అసంఖ్యాకములైన రొక్కమును, నగలు, పల్లకీలు, సన్నని వస్త్రములు, కొల్లలుగా గృహవస్తువులను ప్రేమతో ఇచ్చి, అప్పుడే బ్రాహ్మణులను, బీద సాదులను, బంధువులను మిక్కిలి తృప్తిపరచెను.

**ఆ.వె.** **అటు లొసంగి యనుప నందఱుఁ దమతమ**
**నెలవుపట్ల కరిగి రెలమితోడఁ**
**బుడమి కాన్పు మగనిఁ బొగడుచు నపు డాకు**
**టింటి ప్రోడ యెందునేనిఁ జనియె** **171**

అటులు = ఆ రీతిగా, ఒసంగి = ఇచ్చి, అనుప = పంపగా, అందఱున్ = అందరును, పుడమి కాన్పు మగనిన్ = సీతాపతిని, పొగడుచున్, ఎలమితోడన్ = సంతోషముతో, తమతమ నెలవుపట్ల = తమతమ నివాస ప్రదేశములకు, అరిగిరి = వెళ్ళిరి, అపుడు, ఆకు ఇంటి ప్రోడ = పర్ణశాలలో నివసించు విశ్వామిత్రుడు, ఎందునేనిన్ = ఎచ్చటికో, చనియె = వెళ్ళిపోయెను.
**తా :** ఆ రీతిగా ఇచ్చి పంపగా, అందరును రాముని పొగడుతూ సంతోషముతో తమతమ నివాస ప్రదేశములకు వెళ్ళిరి. అపుడు విశ్వామిత్రుడు ఎచటికో వెళ్ళిపోయెను.

**తే.గీ.** **అంతఁ గొడుకులఁ గోడండ్ర నందలముల**
**నునిచికొని వీరకాని వీడ్కొని చెలఁగుచు**
**బంతి తేరుల దొర త్రోవపట్టి యరుగు**
**చున్నచో నబ్బురం బొప్ప నొక్క యెడను** **172**

అంతన్ = అంతట, బంతి తేరుల దొర = దశరథుడు, కొడుకులన్ = కొడుకులను, కోడండ్రన్ = కోడళ్ళను, అందలములన్ ఉనిచికొని = పల్లకీలలో ఉంచుకొని, వీరకాని = వియ్యంకుని (జనకుని), వీడ్కొని = వీడుకోలు పలికి, చెలగుచు = సంతోషముగా, త్రోవపట్టి అరుగుచున్న చోన్ = మార్గమును పట్టుకొని వెళ్ళుచుండగా, అబ్బురంబు ఒప్పన్ = ఆశ్చర్యకరముగా, ఒక్క ఎడను = ఒక ప్రదేశమున –
**తా :** అంతట దశరథుడు కొడుకులను, కోడండ్రను పల్లకీలలో ఉంచుకొని వియ్యంకుని వీడుకోలు పలికి సంతోషముగా వెళ్ళుచుండగా ఆశ్చర్యకరముగా ఒక్కచోట –

**కం.** **వెఱఁగుగఁ దన పేరిటి దొర**
**మఱియొక్కఁడు గలిగె నిపుడు మంచిది మేల్మేల్**
**తఱిమి నెఱిఁ జెఱుతునని మది**
**నఱమఱతోఁ బరశురాముఁ డడ్డము దాఁకెన్** **173**

పరశురాముడు, మదిన్, అఱమఱతోన్ = శంకతో, తన పేరిటి దొర = తన పేరుతోనున్న రాజు, వెఱగుగన్ = విచిత్రముగా, మఱియొక్కడు = ఇంకొకడు, ఇపుడు కలిగె = ఇపుడు ఉన్నాడట, మంచిది = శుభము, మేలు మేల్ = ఇంకా మంచిది, తఱిమి = (వాని) తరిమికొట్టి, నెఱిన్ = చక్కగా, చెఱతును అని = అంతముచేస్తానని, అడ్డము తాకెన్ = మార్గమునకు అడ్డముగా వచ్చెను.

**తా :** పరశురాముడు మదిలో సందేహముతో తన పేరిటి రాజు ఇంకొకడు ఉన్నాడట. వాని తరిమికొట్టి అంతము చేస్తాను అని దారికడ్డముగా వచ్చెను.

**తే.గీ. తాఁకి యగ్గంద్రగొడ్డలి దాల్పు రేయి**
**ద్రిమ్మరుల దాయ నలుకతోఁ దేఱి చూచి**
**యోరి ముడికాఁడ! ప్రాఁత విల్లొకటిఁ ద్రుంచి**
**యుబ్బె దింకను నా దాడి కోర్వఁగలవె? 174**

తాకి = సమీపించి, ఆ గంద్రగొడ్డలి తాల్పు = ఆ పరశురాముడు, రేయి ద్రిమ్మరుల దాయన్ = రాక్షసుల శత్రువగు రాముని, అలుకతోన్ = కోపముతో, తేఱి చూచి = నిదానముగా చూచి, ఓరి ముడికాడ = ఓరీ వంచకుడా!, ప్రాత విల్లు ఒకటిన్ త్రుంచి = ఒక పాత విల్లును విరిచి, ఉబ్బెదు = పొంగిపోతున్నావు, ఇంకను = ఇక, నా దాడికి = నా ధాటికి, ఓర్వగలవె = తట్టుకోగలవా?

**తా :** ఆ పరశురాముడు సమీపించి రాముని కోపముతో చూసి 'ఓరీ తస్కరుడా! ఒక పాత విల్లును విరిచి పొంగిపోతున్నావు. ఇంక నా ధాటికి తట్టుకొనగలవా?'

**సీ. కొఱఁత గానీక చిచ్చుఱ కంటి చెంగట**
**గుఱుతుగా విలువిద్దె గఱచినాఁడ**
**దూరి పేరిమి నైదు నూఱు కేల్గవలను**
**గల బల్లిదుని యాము మలపినాఁడ**
**జెలఁగి ముయ్యేడుమాఱులు గంద్రగొడ్డంటఁ**
**దులువ రా పౌజులఁ జెలవినాడఁ**
**దెఱగంటి ప్రోలి కేడ్తెఱ నేఁగు తెరవుగా**
**గడితంపు మెట్టులు గట్టినాఁడ**

**తే.గీ. వెలయ నిరుదచ్చి రాచ జాబిలులలోన**
**మిక్కుటంబగు తేజున మెఱసినాడ**
**నట్టి నాతోడ నీ తరమా? పెనంగ**
**నహహ! పనిదప్పె నింకేమి యనఁగఁ గలదు? 175**

కొఱత కానీక = ఏ లోపము లేకుండగా, చిచ్చుఱకంటి = అగ్నినేత్రుడగు శివుని, చెంగట = దగ్గర, గుఱుతుగా = లక్ష్యసిద్ధిగా, విలువిద్దె = విలువిద్యను, గఱచినాడ = నేర్చినాను, పేరిమి = నేర్పుగా, దూరి = ప్రవేశించి, ఐదు నూఱు కేల్గవలను కల = ఐదువందల జంట చేతులు కల,

బల్లిదుని = సమర్థుని (సహస్రబాహుడగు కార్తవీర్యుని), ఆము = అహంకారమును, మలపినాడ = అణచినాను, చెలగి = విజృంభించి, ముయ్యేడు మాఱులు = 21 సార్లు, గండ్రగొట్టటన్ = గండ్ర గొడ్డలితో, తులువ = దుష్టులైన, రా పౌజులన్ = రాజుల సమూహములను, చెలవినాడన్ = నరకితిని, తెఱగంటి ప్రోలికి = దేవతల పట్టణమైన స్వర్గమునకు, ఏడ్తెఱన్ = అతిశయముగా, ఏగు = వెళ్ళునట్టి, తెరవుగా = మార్గముగా, గడితంపు = గట్టివైన, మెట్టులు = మెట్టులను, కట్టినాడ = కట్టితిని, వెలయన్ = ప్రసిద్ధిగా, ఇరు దచ్చి రాచ జాబిలులలోన = 2×8=16 షోడశ చక్రవర్తులలో, మిక్కుటంబగు = అధికమైన, తేజున = పరాక్రమముతో, మెఱసినాడన్ = ప్రకాశించితిని, అట్టి నాతోడ = అటువంటి నాతో, పెనంగ = యుద్ధము చేయుట, నీ తరమా = నీ శక్యమా?, అహహ = ఆహా!, పని తప్పెన్ = యుద్ధము చేయవలసిన పని తప్పినది, ఇంక ఏమి అనగ కలదు = ఇంక అనుటకు ఏమి మిగిలినది? (రాముడు తనకు సరిపడిన వీరుడు కాదని అనుకున్నాడు)

**తా :** ఏ లోపము లేకుండా శివుని దగ్గర లక్ష్యసిద్ధిగ విలువిద్యను నేర్చినాను. నేర్పుగా సహస్రబాహుడగు కార్తవీర్యుని అహంకారమును అణచినాను. విజృంభించి 21 మార్లు గండ్ర గొడ్డలితో దుష్టులైన రాజులను నరకితిని. స్వర్గమునకు మెట్టులను కట్టితిని. షోడశ రాజచంద్రులలో పరాక్రమముతో ప్రకాశించితిని. అటువంటి నాతో యుద్ధము చేయుట నీ తరమా? ఆహా! యుద్ధము చేయవలసిన పని తప్పినది. ఇంక అనుటకు ఏం మిగిలింది?

**కం.** **ఎట్టి మొనగాండ్రు రేనియు**
**గట్టిగ నా యెదుట దిటము గలఁగఁగ బఱతు**
**ర్నెట్టుకొని నేఁడు మిగులన్**
**బొట్టెఁడ వీ వెట్లు నిలిచి పోరెదు చెపుమా? 176**

ఎట్టి మొనగాండ్రురు ఏనియు = ఎంతటి మొనగాళ్ళైనను, గట్టిగ = తప్పక, నా ఎదుట, దిటము కలగగన్ = ధైర్యము చెదిరిపోగా, నెట్టుకొని = ఆగక, పఱతురు = పాఱిపోవుదురు, నేడు = ఈనాడు, మిగులన్ = మిక్కిలి, బొట్టెడవు = పసివాడివి, ఈవు = నీవు, నిలిచి = ఎదురు నిలబడి, ఎట్లు = ఏ రీతిగా, పోరెదు చెపుమా = పోరాడగలవు చెప్పు.

**తా :** ఎంతటి మొనగాళ్ళైనా తప్పక నా ఎదుట ధైర్యము కోల్పోయి ఆగక పాఱిపోతారు. ఈనాడు మిక్కిలి పసివాడవు నీవు ఎదరుపడి ఎలా పోరాడగలవు చెప్పు.

**తరల** **అనుడు నబ్బలుజోదుఁ గన్గొని యాతఁ డిట్లని పల్కె నౌఁ**
**దన మగంటిమిఁ దానె యుబ్బుచుఁ దద్దయుం గొనియాడు తు**
**ల్వను మదిం గొర సేయఁబోరు వలంతు లెల్లను నీ కిటు**
**ల్చనునె? యెన్నుకొనంగ వీఱిఁడి జాడ నీవ నినుం గడున్ 177**

అనుడు = అనగా, ఆ బలుజోదున్ = ఆ మహాయోధుని (పరశురాముని), కన్గొని = చూచి, ఆతడు = రాముడు, ఇట్లని పల్కెన్ = ఈ విధముగా పలికెను, ఔన్ = ఔను, తన మగంటిమిన్ = తన శౌర్యాన్ని, తానె = తనకు తానే, ఉబ్బుచున్ = పొంగిపోతూ, తద్దయున్ = మిక్కిలి, కొనియాడు

= పొగడుకొను, తుల్వను = నీచుని, వలంతులు ఎల్లను = శౌర్యవంతులైన వారందరును, మదిన్ = మనసున, కొర చేయన్ పోరు = లెక్క చేయరు, ఇటులు = ఈ ప్రకారముగా, వీటిడి జాడన్ = వెట్టివానివలె, నీకు నీవ = నీయంతటట నీవే, నినున్ = నిన్ను, కడున్ = మిక్కిలి, ఎన్నుకొనంగ = పొగడుకొనుట, చనునె = తగునా?

**తా :** అనగా, ఆ పరశురాముని చూచి రాముడు పలికెను 'ఔను, తన శౌర్యాన్ని తానే పొంగిపోతూ పొగడుకొను నీచుని శౌర్యవంతులు మనసులో కూడా లెక్కచేయరు. ఈ ప్రకారముగా, వెట్టివానివలె నీయంతటట నీవే నిన్ను పొగడుకొనుట తగునా?

**కం.** **బవరమున కీవు రమ్మని**
**తవిలిన మీవంటి పుడమి దయ్యంబులతోఁ**
**దివిరి యెదుర్కొనగాఁ దగ**
**వవునే? నెఱ రాచ మన్నియల కెందైనన్** **178**

బవరమునకు = యుద్ధమునకు, ఈవు = నీవు, రమ్ము అని = రమ్మని, తవిలిన = తగులు కొనిన, మీవంటి పుడమి దయ్యంబులతోన్ = మీవంటి భూదేవత (బ్రాహ్మణు) లతో, తివిరి = పూనుకొని, నెఱ రాచ మన్నియలకు = స్వచ్ఛమైన రాజ శ్రేష్ఠులకు, ఎందైనన్ = ఎట్టి సమయము నందైనను, ఎదుర్కొనగాన్ = ఎదురు నిల్చి పోరాడుట, తగవు అగునే = ధర్మము అగునా?

**తా :** యుద్ధమునకు రమ్మని నీవు తగులుకొనిన, మీవంటి బ్రాహ్మణులతో రాజ శ్రేష్ఠులకు ఎట్టి సమయమునందును ఎదురు నిల్చి పోరాడుట ధర్మమగునా?

**చం.** **పలుకులు వేయు నేమిటికి? బల్లిదులై తనరారు మీర లె**
**ట్లలిగినఁ జెల్లుఁగాని తగునా మముబోంట్లకు మిమ్ము మార్కొనన్?**
**వలనుగ మిన్ను మానికపు వంగడపుం దొర లెన్నడేనిఁ బా**
**ఱుల యెడ నల్గఁ బోదురె? యెఱుంగమినైన బెడంగు డాల్గనీ!** **179**

బెడంగు డాల్ గనీ = అధికమైన తేజస్సుకు స్థానమైనవాడా!, పలుకులు వేయున్ ఏమిటికి = వేయి మాటలు ఎందులకు?, బల్లిదులై = శ్రేష్ఠులై, తనరారు = ఒప్పునట్టి, మీరలు = మీవంటివారు, ఎట్లు అలిగినన్ = ఏవిధంగా కోపించినను, చెల్లుగాని = సరిపోతుంది కాని, మము బోంట్లకు = మావంటి వారికి, మిమ్ము = మీవంటి శ్రేష్ఠులను, మార్కొనన్ = ఎదిరించుట, తగునా = ధర్మమగునా?, మిన్ను మానికపు వంగడపుం దొరలు = సూర్య వంశపు రాజులు, ఎన్నడేని = ఎప్పుడైనను, ఎఱుంగమినైన = అజ్ఞానముచేతనైనను, పాఱుల ఎడన్ = బ్రాహ్మణుల విషయమున, అల్గన్ పోదురె = కోపము వహిస్తారా?.

**తా :** తేజశ్శాలీ ! వేయి మాటలెందుకు? శ్రేష్ఠులైన మీవంటివారు ఎంతగా కోపించినా సరిపోతుంది కాని మావంటివారికి మీవంటి శ్రేష్ఠులను ఎదిరించుట ధర్మమగునా? సూర్యవంశపు రాజులు ఎప్పుడైనా ఎఱుగకైనా బ్రాహ్మణుల విషయంలో కోపం వహించరు.

**ఆ.వె.** **అనిన సంతసిల్లి యచ్చివ్వ పోటరి**
**బాపనయ్య రాజపట్టిఁ జూచి**

**మేలు మేలు నిన్ను మెచ్చితి నిఁక బెక్కు**
**మాటలేల? వినుము తేట మీఱ** **180**

అనినన్ = అని రాముడు పలుకగా, సంతసిల్లి = సంతసించి, ఆ చివ్వ పోటరి బాపనయ్య = ఆ యుద్ధ వీరుడైన బ్రాహ్మణుడు, రాజపట్టిన్ = రాజకుమారుని (రాముని), చూచి, మేలు మేలు = చాల బాగున్నది. నిన్ను మెచ్చితిన్ = నిన్ను మెచ్చుకున్నాను, ఇక పెక్కు మాటలు ఏల = ఇంకా ఎక్కువగా మాట్లాడుట ఎందులకు? తేట మీఱ = మిక్కిలి స్పష్టముగా, వినుము = విను,

**తా :** అని రాముడు పలుకగా సంతసించి పరశురాముడు రాముని చూచి 'మేలు మేలు. నిన్ను మెచ్చితిని. ఇంక పెక్కు మాటలెందుకు? స్పష్టంగా విను.

**తే.గీ.** **తొలిపలుకు వారువంబుల వలఁతి చివుకు**
**విల్లు దురిమితినని చాల విఱ్ఱ వీఁగు**
**చున్నవాఁడవు నాచేతి యుదుటు విల్లు**
**గొనయ మెక్కింపుమని యొసంగిన నతండు** **181**

తొలిపలుకు = వేదములు, వారువంబుల = గుఱ్ఱములుగా కల, వలతి = శ్రేష్ఠుడు (శివుని), చివుకు విల్లు = చివికిపోయిన వింటిని, దురిమితిని అని = విరిచితినని, చాల విఱ్ఱ వీగుచు = చాల గర్వము పొందుచు, ఉన్నవాడవు = ఉన్నావు, నాచేతి = నాచేతిలోని, ఉదుటు విల్లు = దృఢమైన వింటిని, గొనయము ఎక్కింపుము అని = నారి సంధించుమని, అతండు = ఆ పరశు రాముడు, ఒసంగిన = ఇవ్వగా –

**తా :** వేదములు గుఱ్ఱములుగాకల శివుని చివికిపోయిన వింటిని విరిచితినని విఱ్ఱవీగుచున్నావు. నా చేతిలోని ఈ దృఢమైన వింటిని నారి సంధించుమని ఇవ్వగా –

**కం.** **ఆ వింటితోన యాతని**
**లావును నెఱతనము తేజు లాగుకొని కడున్**
**జేవ దలిర్పగ నెక్కిడి**
**వేవేగ లకోరిఁ బూని వ్రేయఁ దొడఁగినన్** **182**

ఆ వింటితోనన్ = ఆ ధనుస్సుతో పాటు, అతని = ఆ పరశురాముని, లావును = శక్తిని, నెఱతనము = సమర్థతను, తేజు = తేజస్సును, లాగుకొని = ఆకర్షించి, కడున్ = మిక్కిలి, చేవ తలిర్పగన్ = పరాక్రమముతో, ఎక్కిడి = ఎక్కుపెట్టి, వేవేగ = మిక్కిలి వేగముగా, లకోరిన్ పూని = బాణమును సంధించి, వ్రేయన్ = వేయుటకు, తొడగినన్ = సిద్ధముకాగా –

**తా :** ఆ ధనుస్సుతోపాటు ఆ పరశురాముని శక్తిని, సమర్థతను, తేజస్సును ఆకర్షించి మిక్కిలి పరాక్రమముతో ఎక్కుపెట్టి వేగముగా బాణముసంధించి వేయుటకు సిద్ధపడగా –

**తే.గీ.** **తలఁకి యో యన్న! యిప్పు డిమ్ములికి యేను**
**వేల్పు ప్రోలికిఁ గట్టిన చాల్పు మెట్టు**
**లేయుమని వేడుకొన నట్లేసి యతని**
**వీడుకొని యెల్ల మూఁకలఁ గూడి మరలి** **183**

తలకి = భయపడి, ఓ అన్న = ఓ అన్నా!, ఇప్పుడు = నీవు సంధించిన, ఈ ములికి = ఈ బాణము, ఏను = నేను, వేల్పు ప్రోలికి కట్టిన = స్వర్గమునకు కట్టిన, చాల్పు మెట్టుల = వరుస మెట్లకు, ఏయుము అని = వేయుమని, వేడుకొనన్ = ప్రార్థింపగా, అట్లు ఏసి = అలాగే వేసి, అతని వీడుకొని = అతనిని విడిచిపెట్టి, ఎల్ల మూకలన్ కూడి = సమస్తమైన సమూహములతో కలసి, మరలి = తిరిగి బయలుదేరి,

**తా :** పరశురాముడు ఓ అన్నా! నీవు సంధించిన ఈ బాణమును స్వర్గమునకు నేను కట్టిన మెట్లకు వేయుమని వేడుకొనగా, అట్లు వేసి అతనిని విడిచిపెట్టి తిరిగి బయల్దేరెను.

**తే.గీ.** **ఎలమిఁ దలప్రోలు సొత్తెంచి యెల్ల పజలు**
**కోరికలు నివ్వటిల నెదుర్కొని కరంబు**
**బత్తి నెఱపంగ వారలఁ బల్తెఱఁగుల**
**గారవించుచు నేడ్తెఱ గడలు కొనఁగ** **184**

ఎలమి = వికాసముతో, తల ప్రోలు = ముఖ్య పట్టణము (అయోధ్య), చొత్తెంచి = ప్రవేశించి, ఎల్ల పజలు = ప్రజలందరును, కోరికలు నివ్వటిలన్ = చూడాలనే మిక్కిలి కోరికలతో, ఎదుర్కొని = ఎదురుగా వచ్చి, కరంబు = మిక్కిలి, బత్తి నెఱపంగ = భక్తిని చూపగా, వారలన్ = ఆ ప్రజలను, పలు తెఱంగుల = పలు విధములుగా, గారవించుచున్ = గౌరవించుచు, ఏడ్తెఱ = మిక్కిలి సంతోషము, కడలు కొనగ = ఉప్పొంగగా –

**తా :** వికాసముతో అయోధ్య ప్రవేశించి ప్రజలు చూడాలనే కోరికతో ఎదురు వచ్చి భక్తిని చూపగా, ఆ ప్రజలను గౌరవించుచు మిక్కిలి సంతోషము ఉప్పొంగగా –

**చం.** **పలుమఱు నాట చేడియలు పాతర లాడఁగ నేల వేలుపుం**
**జెలువలు గ్రొత్త ముత్తియపు సేసలు చల్లుచు మేల్నివాళు ల**
**గ్గలముగ నీగఁ బాఱు లొగిఁ గ్రమ్ముచు దీవన లీయ బట్లు వే**
**డ్కలఁ బొగడంగ లోనగరుఁ గ్రన్ననఁ జొచ్చి కడంక మీఱఁగన్** **185**

పలుమఱున్ = పలువిధములుగా, ఆట చేడియలు = నాట్యకత్తెలు, పాతరలు ఆడగ = నాట్యమొనరించు చుండగా, నేల వేలుపున్ చెలువలు = బ్రాహ్మణ స్త్రీలు, క్రొత్త ముత్తియంపు సేసలు = క్రొత్త ముత్యాల అక్షతలను, చల్లుచు, మేలు నివాళులు = శ్రేష్ఠమైన హారతులు, అగ్గలముగన్ = విశేషముగా, ఈగన్ = ఇవ్వగా, పాఱులు = బ్రాహ్మణులు, ఒగిన్ = క్రమముగా, క్రమ్ముచు = మూగుచు, దీవనలు, ఈయన్ = ఇవ్వగా, బట్లు = స్తుతికారులు, వేడ్కలన్ = సంతోషముగా, పొగడంగ = స్తుతులు పాడగా, లోనగరున్ = అంతఃపురమును, క్రన్ననన్ = శీఘ్రముగా, చొచ్చి = ప్రవేశించి, కడంక మీఱగన్ = మిక్కిలి ఉత్సాహముగా –

**తా :** పలువిధములుగా నాట్యకత్తెలు నాట్యమాడగా, పుణ్యస్త్రీలు ముత్యాల అక్షతలు చల్లుచు హారతుల ఇవ్వగా, బ్రాహ్మణులు దీవన లీయగా, స్తుతికారులు స్తుతులు పాడగా అంతఃపురమును ప్రవేశించి మిక్కిలి ఉత్సాహముగా –

**తే.గీ. తల్లులకు మ్రొక్కి వారలెంతయు నొసంగు**
**దీవనలు గాంచి యెనలేని దీవి మెఱయ**
**నంత జన్నంపుఁ గాపరి సంతసమునఁ**
**బుడమి కానుపుఁ జెలిఁగూడి పొదలుచుండె 186**

తల్లులకు = తల్లులు ముగ్గురకును, మ్రొక్కి = నమస్కరించి, వారలు = ఆ రాణులు, ఎంతయున్ = మిక్కిలిగా, ఒసంగు = ఇచ్చునట్టి, దీవనలు = ఆశీస్సులు, కాంచి = పొంది, ఎనలేని = సాటిలేని, దీవి మెఱయన్ = వైభవము ప్రకాశింపగా, అంత = అంతట, జన్నంపున్ కాపరి = విశ్వామిత్ర యజ్ఞ రక్షకుడు, సంతసమున = సంతోషముతో, పుడమి కానుపున్ చెలిన్ కూడి = భూపుత్రియైన సీతను కూడి, పొదలుచుండె = వర్తించుచుండెను.

**తా :** తల్లులు ముగ్గురకును మ్రొక్కి వారి దీవనలు పొంది సాటిలేని వైభవముతో అంతట యజ్ఞరక్షకుడగు రాముడు సంతోషముతో సీతను కూడి వర్తించుచుండెను.

**కం. అని పుట్టఁబుట్టువునకుం**
**గొనకొని వేలుపుల పెద్ద కొమరుఁ డెఱింగిం**
**చిన నాలకించి యతఁడా**
**యన నవ్వలి కతయుఁ దెల్పుమని వేడుటయున్ 187**

అని = ఈ ప్రకారముగా, పుట్ట బుట్టువునకున్ = వాల్మీకికి, కొనకొని = పూనుకొని, వేలుపుల పెద్ద కొమరుడు = బ్రహ్మ కుమారుడైన నారదుడు, ఎఱింగించినన్ = తెలుపగా, ఆలకించి = విని, అతడు = ఆ వాల్మీకి, ఆయనన్ = ఆ నారదుని, అవ్వలి కతయున్ = తరువాతి కథనుకూడా, తెల్పుము అని = చెప్పుమని, వేడుటయున్ = ప్రార్థించుటయును.

**తా :** అని వాల్మీకికి బ్రహ్మకుమారుడైన నారదుడు తెలుపగా, ఆలకించి వాల్మీకి ఆ నారదుని తరువాతి కథనుకూడా తెల్పుమని ప్రార్థించుటయును.

**ఉ. వేలుపుటేఱు గప్పురము వెన్నెల లంచలు ముత్తియంబులుం**
**బాలును మంచు నద్దములుఁ బయ్యరమేపుడుతేఁడు గల్వరా**
**ఱాలును రేవెలుంగు మగఱాలును రిక్కలుఁ దమ్మిచూలియి**
**ల్లాలును జోడుగాఁగ దనరారు నసంబునఁ గేరు దయ్యమా! 188**

వేలుపు ఏఱు = ఆకాశగంగ, కప్పురము = కర్పూరము, వెన్నెలలు, అంచలు = హంసలు, ముత్తియంబులున్ = ముత్యాలును, పాలును, మంచును, అద్దములును, పయ్యర మేపుడు ఱేడు = గాలి ఆహారముగా కల పాముల రాజు (ఆదిశేషుడు), కల్వ రా ఱాలును = చంద్రకాంతపు శిలలును, రే వెలుంగు = చంద్రుడు, మగఱాలును = వజ్రములును, రిక్కలు = నక్షత్రములు, తమ్మిచూలి ఇల్లాలును = సర్వస్వతియును, జోడు కాగ = పోలిక కాగా, తనరారు = ఒప్పునట్టి, అసంబునన్ = యశస్సుతో, కేరు = ఉప్పొంగు, దయ్యమా = దైవమా! (శివా!)

**తా :** ఆకాశగంగ, కర్పూరము, వెన్నెలలు, హంసలు, ముత్యాలు, పాలు, మంచు, అద్దములు, ఆదిశేషుడు, చంద్రకాంత శిలలు, చంద్రుడు, వజ్రములు, నక్షత్రములు, సరస్వతి పోలిక కాగా ఒప్పునట్టి యశస్సుతో ఉప్పొంగు దైవమా! శివా!

**కం.** **కలువలదాయయు నగ్గియు**
**నెలయును గేస్తుండుఁ జదలు నేలయు నీరున్**
**జలినట్టును రూపులుగాఁ**
**బొలుపొందెడు వన్నెకాఁడ! బూచుల ఱేఁడా!** **189**

కలువల దాయయున్ = కలువలకు శత్రువగు సూర్యుడును, అగ్గియున్ = అగ్నియును, నెలయును = చంద్రుడును, గేస్తుండున్ = యజమానుడును, చదలు = ఆకాశము, నేలయు = భూమి, నీరున్ = నీరును, చలినట్టును = చల్లదనమునిచ్చు వాయువును, రూపులుగాన్ = రూపములుగా, పొలుపొందెడు = ఒప్పుచున్న, వన్నెకాడ = అందగాడా!, బూచుల ఱేడా = భూతరాజా!

**తా :** సూర్యుడు, అగ్ని, చంద్రుడు, యజమానుడు, ఆకాశము, నేల, భూమి, నీరు, వాయువు రూపములుగా ఒప్పుచున్న వన్నెకాడా! భూతరాజా!

**లయ విభాతి**

**మొలను బులితోలు వెలిమలను బలుప్రోలు వలిఁ**
**జిలుకు తలజాలు మెయిఁ గులుకు జవరాలున్**
**జిలువ మెడ నూలు పని మలపు తొలిచూలు మొల**
**నలరు నునువాలు మెక మెలయు వలకేలున్**
**గెలుపు గొనఁజాలు పసికొలపు దొర డాలు చలి**
**వెలుఁగు నెనవోలు వగఁ బొలుచు నెఱడాలున్**
**గలిగి కడు మేలు పజ కెలమి నిడి మేలు గని**
**చెలఁగి జగమేలుచును వెలుఁగు నెఱవేల్పా!** **190**

మొలను = మొలయందు, పులితోలు = పులి చర్మమును, వెలిమలను = వెండి కొండమీద, బలు = గొప్పదైన, ప్రోలు = పట్టణమును (కైలాసము), వలిన్ చిలుకు = చల్లదనము వెదజల్లు, తల జాలున్ = తలమీద గంగానదియును, మెయిన్ = దేహమునందు, కులుకు = ఆనందించు, జవరాలున్ = ప్రియురాలును (పార్వతి), జిలువ = పాము, మెడ = కంఠమునందు, నూలు = హారమును, పని మలపు = పనులను మలుపుతిప్పే, తొలిచూలు = తొలి సంతానమును (వినాయకుడు), మొలన్ అలరు = మొలను ఉండునట్టి, నును వాలు = వాడి కత్తియును, మెకము ఎలయు = జింకచే ఒప్పుచున్న, వలకేలున్ = కుడిచేయియును, గెలుపు కొనజాలు = జయమును సాధించగల, పసికొలపు దొర = గోజాతి ప్రభువు (నంది), డాలు = కేతనమును, చలి వెలుగున్ = చంద్రుని, ఎనవోలు = పోల్చదగిన, వగన్ పొలుచు = విలాసముతో నొప్పు, నెఱ డాలున్ = స్వచ్ఛమైన దేహకాంతియును, కలిగి, కడు మేలు = చాల శుభములు, పజకు = ప్రజలకు, ఎలమిన్ =

సంతోషముతో, ఇడి = ఇచ్చి, మేలు కని = మంచిని ఆలోచించి, చెలగి = సంతోషముగా, జగము = లోకమును, ఏలుచును = రక్షించుచు, వెలుగు = ప్రకాశించు, నెఱవేల్పా = సుందరేశ్వరా!

**తా :** మొలను పులిచర్మము, వెండి కొండ పట్టణము, చల్లదనము వెదజల్లు తలమీద గంగ, దేహమున ప్రియురాలు పార్వతి, పాము కంఠమునందు హారము, పనులను మలుపు తిప్పే తొలి సంతానము వినాయకుడు, మొలను వాడి కత్తి, జింకతో ఒప్పుతున్న కుడిచేయి, జయమును సాధించగల నంది టెక్కెము, చంద్రుని పోలి విలాసముతో నొప్పు దేహకాంతి కలిగి శుభములు ప్రజలకు సంతోషముతో నిచ్చి మేలు కని చెలగి లోకమును ఏలుచు వెలుగు సుందరేశ్వరా!

**గద్యము :**

**ఇది శ్రీమదుమారమణ కరుణా కటాక్ష నిరీక్షణ సంలబ్ధ<br>సరస కవితా సామ్రాజ్య ధురంధర ఘన యశోబంధుర కౌండిన్య సగోత్ర పవిత్ర<br>కూచిమంచి గంగనామాత్య పుత్ర బుధజన విధేయ తిమ్మయ నామధేయ ప్రణీతంబయిన<br>యచ్చ తెలుఁగు రామాయణమను మహాకావ్య మందు<br>బాలకాండము సర్వమేకాశ్వాసము.**

**వ్యాఖ్యాతృ గద్యము :**

**ఇది బుధజన విధేయుండును, బులుసు వంశ సంభూతుండును,<br>కీ.శే. శేషమ్మ వేంకటరమణయ్య పుణ్యదంపతీ తనూజుండును,<br>గౌతమ గోత్రజుండునగు వేంకటసత్యనారాయణమూర్తి<br>ప్రణీతంబైన అచ్చ తెలుఁగు రామాయణమను మహాకావ్యమందు<br>బాలకాండమునకు టీక, తాత్పర్యములు.**



# అచ్చతెలుఁగు రామాయణము
# అయోధ్య కాండము

**కం. సిరి పెనిమిటియుం బలుకుల**
**విరిఁబోడి మగండుఁ గడల వేలుపు దొరలున్**
**దిరముగ డాకొని కొలువన్**
**సరిమీఁటినవేల్ప! పూప జాబిలి తాల్పా! 1**

సిరి పెనిమిటియున్ = లక్ష్మీదేవి భర్తయును, పలుకుల విరిబోడి మగండు = సరస్వతీదేవి భర్తయును, కడల వేలుపు దొరలున్ = దిక్పాలకులును, డాకొని = చేరి, తిరముగ = స్థిరముగ, కొలువన్ = సేవింపగా, సరిమీఁటిన వేల్ప = సాటిలేని దైవమా!, పూప జాబిలి తాల్పా = బాల చంద్రరేఖను ధరించినవాడా! (ఈ కావ్యం శివునకు అంకితము)

**తా :** లక్ష్మీదేవి భర్త విష్ణువును, సరస్వతీదేవి భర్త బ్రహ్మయును, దిక్పాలకులును చేరి సేవింపగా సాటిలేని దైవమా! చంద్రరేఖను ధరించినవాడా!

**తే.గీ. వినుము కరువలి మేపరి మనికిపట్టు**
**కాన్పు జడదారి కత్తెఱగంటి తపసి**
**యవలి కత తెల్పఁబూని నెయ్యంబుతోడ**
**నింపు తళుకొత్త మెల్లన నిట్టులనియె 2**

వినుము, కరువలి మేపరి = గాలి ఆహారముగా కలది (పాము), మనికిపట్టు = నివాసమునందు (పుట్ట), కాన్పు = పుట్టిన, జడదారికి = మునికి (వాల్మీకి), ఆ తెఱగంటి తపసి = ఆ దేవముని (నారదుడు), అవలి కతన్ = తరువాతి కథను, తెల్పన్ పూని = చెప్పుటకు సిద్ధపడి, నెయ్యంబుతోడ = ప్రేమతో, ఇంపు తళుకొత్త = ఇష్టమగు రీతిగా, మెల్లన = మెల్లగా, ఇట్టులు అనియె = ఇట్లనెను.

**తా :** విను, పుట్టనుండి పుట్టిన వాల్మీకికి దేవముని నారదుడు తరువాతి కథను తెల్పను సిద్ధపడి ప్రేమతో మెల్లగా ఇట్లనెను.

**కం. గొనముల సంద్రమ! యిత్తెఱఁ**
**గునఁ జాలుపు తేర్ల ఱేఁడు గొద యొదవని పెం**
**పున నడరొందుచు నొకనాఁ**
**డెన మీఱిన వేడ్క నుల్ల మిగురొత్తంగన్** **3**

గొనముల సంద్రమ = గుణ సముద్రుడా!, ఈ తెఱగున = ఈ ప్రకారంగా, చాలుపు తేర్ల ఱేడు = దశరథుడు, కొద ఒదవని = లోటు లేని, పెంపున = ఆధిక్యముతో, అడరొందుచు = అతిశయించుచు, ఎన మీఱిన = సాటిలేని, వేడ్కన్ = ఉత్సాహముతో, ఉల్లము ఇగురొత్తంగన్ = మనస్సు ఉప్పొంగగా, ఒకనాడు = ఒక రోజున –

**తా :** గుణసముద్రుడా! ఈ ప్రకారంగా దశరథుడు ఆధిక్యముతో అతిశయించుచు ఉత్సాహముతో ఉప్పొంగుచుండగా ఒక రోజున –

**సీ. తెఱగంటి రాచ ఱా తెగల నుంజిగి వెల్గు**
**కొమరారు మగమానికముల మెట్లు**
**పిల్లికన్ రతనంపు బిగి యోడు బిళ్ళలు**
**పులుఁగు ఱాపచ్చ మేల్బోదియలును**
**గొఱమించు పగడంపు గుండ్ర గంబంబులు**
**వలుద తామర కెంపు తలుపు గములు**
**కలువ యనుంగుఁ గల్బలితంపు గోడలు**
**జా నొప్పు ముత్యాల చందువాలు**

**తే.గీ. గలిగి మఱియును మెఱుఁగు బంగరపు హరువు**
**పనుల నలరొందు గొనబు టుప్పరిగ యందుఁ**
**బురుడు గనరాని తీవులఁ బొదలి తద్ద**
**వేల్పు టెకిమీని చాడ్పునఁ బొల్పు మీఱి** **4**

నుం జిగి = నున్నని తళుకులతో కూడిన, వెల్గు = కాంతికల, తెఱగంటి రాచ = దేవతల ప్రభువగు ఇంద్రుని పేరున కల, ఱా తెగల = రాళ్ళ సమూహములతోను (ఇంద్రనీలములు), కొమరారు = అందమైన, మగమానికముల = వజ్రములతోను (నిర్మింపబడిన), మెట్లు = మెట్లును, పిల్లికన్ రతనంపు = వైడూర్యముల యొక్క, బిగి = దృఢమైన, ఓడు బిళ్ళలు = ఇంటి పైకప్పు పెంకులును, పులుగు ఱా పచ్చ = గరుడ పచ్చలతో కూడిన, మేలు = గొప్ప, బోదియలును = స్తంభములును, కొఱమించు = అతిశయించు, పగడంపు గుండ్ర కంబములు = పగడాల గుండ్రని స్తంభములు, తామర కెంపు = పద్మరాగ మణులతో కూడిన, వలుద = గట్టి, తలుపు గములు = తలుపుల వరుసలు, కలువ యనుంగు కల్= కలువలకు ఇష్టుడగు చంద్రుని పేర కల రాయి (చంద్రకాంత మణులతో), బలితంపు = పటిష్ఠమైన, గోడలు = గోడలును, జానొప్పు = అందముగానున్న, ముత్యాల చందువాలు = ముత్యాల చాందినీలును, కలిగి = ఉండి,

మఱియును = ఇంకను, మెఱుగు = మెరిసే, బంగరపు = బంగారముతో, హరువు పనులన్ = మనోహరమైన పనితనములతో, అలరొందు = ఒప్పుచున్న, గొనబు ఉప్పరిగయందున్ = మనోజ్ఞమైన భవనమందు, పురుడు కనరాని = సాటిలేని, లీవులన్ = వైభవముతో, తద్ద = మిక్కిలి, పొదలి = ప్రకాశించి, వేల్పు టెకిమీని చాడ్పున = దేవతల ప్రభువగు ఇంద్రునివలె, పొల్పు మీఱి = శోభలతో నతిశయించి.

**తా :** నున్నని తళుకు కాంతికల ఇంద్రనీలములు, వజ్రముల మెట్లు, వైడూర్యముల ఇంటి పైకప్పు పెంకులు, గరుడపచ్చల స్తంభములు, శిల్పవిశేషముతో నొప్పు పగడాల గుండ్రని స్తంభములు, పద్మరాగముల తలుపులు, చంద్రకాంతమణుల గోడలు, ముత్యాల చాందినీలు కలిగి మెరిసే బంగారముతో మనోహరమైన పనితనముతో ఒప్పుచున్న మనోజ్ఞ భవనమునందు సాటిలేని వైభవముతో ప్రకాశించి దేవతల ప్రభువగు ఇంద్రునివలె శోభల నతిశయించి.

**తే.గీ.** **దొరలు ప్రెగడలు మన్నీలు బిరుదు లొజ్జ**
**లూడిగీలును బోగము చేడియలును**
**బట్లు జెట్లును నెఱిజన్నిగట్లు బలసి**
**కొలువఁ గొలువుండి పెద్దల గూర్చి పలికె** 5

దొరలు = సేనానాయకులు, ప్రెగడలు = మంత్రులు, మన్నీలు = సామంతులు, బిరుదులు = వీరులు, ఒజ్జలు = గురువులు, ఊడిగీలును = సేవకులును, బోగము చేడియలును = వేశ్యా స్త్రీలును, బట్లు = భటులు, జెట్లును = మల్లయుద్ధ వీరులును, నెఱి = ప్రజ్ఞగల, జన్నిగట్లు = వేద పండితులు, బలసి = కూడి, కొలువన్ = సేవించుచుండగా, కొలువు ఉండి = సభ తీర్చి, పెద్దలన్ కూర్చి = పెద్దల నుద్దేశించి, పలికె = పలికెను.

**తా :** సేనానాయకులు,మంత్రులు,సామంతులు,వీరులు,గురువులు,సేవకులు,వేశ్యాస్త్రీలు, భటులు, మల్లులు, వేదపండితులు సేవించుచుండగా సభతీర్చి పెద్దల నుద్దేశించి పలికెను.

**ఆ.వె.** **మంచివారి నెల్ల మనిచి చెనంటుల**
**నడఁచి మేటి పున్నియంబు గాంచి**
**నేల యెల్లఁ బేర్మి నేలితిఁ బెక్కేఁడు**
**లింక రాచ నెమ్మి యిచ్చ యుడిగె** 6

మంచివారి నెల్లన్ = మంచివారి నందరిని, మనిచి = రక్షించి, చెనంటులన్ = దుర్మార్గులను, అడచి = శిక్షించి, మేటి = శ్రేష్ఠమైన, పున్నియంబున్ = పుణ్యమును, కాంచి = పొంది, పేర్మిన్ = ప్రేమతో, నేల ఎల్ల, పెక్కు ఏడులు = చాల కాలము, ఏలితి = పరిపాలించితిని, ఇంక = ఇకమీదట, రాచ నెమ్మి = రాజ్యపాలనపై, ఇచ్చ = కోరిక, ఉడిగె = తగ్గెను.

**తా :** మంచివారిని రక్షించి, దుర్మార్గులను శిక్షించి, ధర్మమును కాపాడి ప్రీతితో చాల కాలము ఈ భూమండలమునంతను పరిపాలించితిని. ఇక రాజ్యపాలనపై కోరిక తగ్గినది.

**తే.గీ.** **పుడమిచెలి యల్లువానిని బుడమి కిప్పు**
**డొడయనిగఁ జేసి కొలువున నునిచి యెలమిఁ**

**గనుఁగొనెడు గోర్కి తలఁపున గాటమగుచుఁ**
**బొడమెనని వారి యానతి వడసి యంత** **7**

పుడమి చెలి = భూదేవి, అల్లువానిని = అల్లుడైన రాముని, ఇప్పుడు = ఇక, పుడమికి = రాజ్యానికి, ఒడయనిగన్ = రాజునుగ, చేసి = చేసి, కొలువునన్ = పాలనలో, ఉనిచి = ఉంచి, ఎలమిన్ = ఆనందముతో, కనుగొనెడు కోర్కి = చూడాలనే కోరిక, తలపున = మనసునందు, గాటమగుచు = అధికమగుచు, పొడమెనని = కలిగెనని (చెప్పి), వారి = ఆ సభలోనున్న వారి, ఆనతి = అంగీకారము, పడసి = పొంది, అంత = అంతట.

**తా :** భూదేవి అల్లుడైన రాముని రాజ్యానికి రాజును చేసి చూడాలని కోరిక మనసున కలిగెనని చెప్పి ఆ సభలోనివారి అంగీకారము పొంది, అంతట –

**కం.** **తగువారిఁ బిలిచి యిదిగో**
**లగనము దాకొనియె నెల్లి లలిఁ బుడమికి తే**
**నిఁగఁ జేయవలయు రక్కసి**
**మగువం బొరిగొన్న వాఁడి మగనిఁ గడంకన్** **8**

తగువారిన్ పిలిచి = సమర్థులను పిలిచి, ఇదిగో = ఇది వినండి, లగనము దాకొనియెన్ = ముహూర్తము సమీపించినది, ఎల్లి = రేపే, లలిన్ = సంతోషముతో, రక్కసి మగువన్ బొరిగొన్న = రాక్షసస్త్రీని చంపిన (తాటక), వాడి మగనిన్ = శూరుని, కడంకన్ = సిద్ధపడి, పుడమికి = ఈ రాజ్యానికి, తేనిగన్ = రాజుగ, చేయవలయు = చేయాలి.

**తా :** తగువారిని పిలిచి 'ఇది వినండి. ముహూర్తము సమీపించినది. రేపే తాటకను చంపిన శూరుని రాజ్యమునకు రాజుగ చేయవలయును.

**కం.** **వీడెల్ల నలరఁ జేయుఁడు**
**వేడుకతో మీర లనుచు వీడుకొలిపినం**
**జేడియలును మగవాండ్రును**
**నీడొదవని గోర్కు లెడల నివురొత్తంగన్** **9**

మీరలు = మీరు, వేడుకతో = సంతోషముతో, వీడు ఎల్ల = నగరమునంతను, అలర చేయుదు = అలంకరించుడు, అనుచు = అని, వీడుకొలిపినన్ = పంపగా, చేడియలును = స్త్రీలును, మగవాండ్రునున్ = మగవారును, ఈడు ఒదవని = అంతులేని, కోర్కులు = కోరికలు, ఎడలన్ = మనసులందు, ఇవురొత్తంగన్ = రేకెత్తగా –

**తా :** మీరు నగరమంతటా అలంకరించుడు' అని పంపగా స్త్రీలు, పురుషులు అంతులేని కోరికలు మనసులందు రేకెత్తగా –

**సీ.** **తిన్నియ లలికి ముత్తియపు మ్రుగ్గులు వెట్టి**
**పసిఁడి గోడల రంగు పనులు సేసి**
**పగడంపు మెఱుఁగుఁ గంబములఁ బందిరులిడి**
**నలువారఁ దొగ తోరనములు గట్టి**

**తల దువారంపుఁ బొంతల నంటి బోదియ**
**లును నిండుఁ గుండలు నొనర నిలిపి**
**యంగళ్ళ మేల్కట్టు లమరించి లోపలి**
**నగరులఁ గపురంపుఁ బొగలు వైచి**
**తే.గీ. మేలి గొజ్జంగి పూనీట మెకపు టాము**
**గలిపి బలు రాచ తెఱువులఁ గ్రంతలందుఁ**
**జిలికి మచ్చుల మేడల నెలవు లెల్లఁ**
**గ్రొత్త సింగారములఁ దళుకొత్తఁ జేసి** **10**

తిన్నియలు = అరుగులు, అలికి = చక్కగా అలికి, ముత్తియపు ముగ్గులు పెట్టి = ముత్యాల ముగ్గులు పెట్టి, పసిడి గోడలన్ = బంగారు గోడలకు, రంగు పనులు చేసి = రంగులు వేసే పనిని చేసి, పగడంపు మెఱుగున్ = పగడాల కాంతికల, కంబములన్ = స్తంభములతో, పందిరులు ఇడి = పందిళ్ళు వేసి, నలు వార = నాలుగు ప్రక్కల, తొగ తోరనములు కట్టి = కలువపూల తోరణములు కట్టి, తల దువారంపున్ పొంతలన్ = సింహద్వారముల దగ్గర, అంటి బోదియలును = అరటి స్తంభములను, నిండు కుండలున్ = పూర్ణ కలశములను, ఒనరన్ = చక్కగా, నిలిపి = ఉంచి, అంగళ్ళన్ = కార్యాలయములందు, మేలు కట్టులు = చాందినీలు, అమరించి = ఏర్పరచి, లోపలి నగరుల = అంతిపురములలో, కపురంపు పొగలు వైచి = కర్పూర ధూమములు వేసి, మేలి = చక్కని, గొజ్జంగి పూనీటన్ = గొజ్జంగిపూల నీటిలో, మెకపుటాము కలిపి = కస్తూరి పొడిని కలిపి, పలు = అనేకములైన, రాచ తెరువులన్ = రాజమార్గములందును, క్రంతలందున్ = బాట లందును, చిలికి = చల్లి, మచ్చుల,మేడల నెలవులు ఎల్లన్ = మిద్దెలు మేడలు ప్రదేశము లన్నింటా, క్రొత్త సింగారములన్ = సరికొత్త అలంకారములతో, తళుకొత్తన్ చేసి = కాంతి వంతముగా చేసి–

**తా :** అరుగులు చక్కగా అలికి, ముత్యాల ముగ్గులు పెట్టి, బంగారు గోడలకు రంగులు వేసి, పగడాల స్తంభములతో పందిళ్ళు వేసి, నలువైపుల కలవపూల తోరణములు కట్టి, సింహద్వారముల దగ్గర అరటి స్తంభములను, పూర్ణ కలశములను నిలిపి, రాజవీధులయందు చాందినీలు ఏర్పరచి, అంతిపురములో కర్పూర ధూమము వేసి, గొజ్జంగి నీటిలో కస్తూరి పొడిని కలిపి రాజమార్గములందు, సందులందు చల్లి, మిద్దెలు, మేడలు సరిక్రొత్త అలంకారములతో కాంతివంతముగా చేసి –

**కం. తారును రతనపుఁ దొడవులఁ**
**జీరలఁ క్రొవ్విరి సరముల సిరిగందమునన్**
**నేరుపు లలరారఁగ సిం**
**గారం బొనరించుకొని తగన్ జెలఁగు నెడన్** **11**

తారును = వారును, రతనపున్ తొడవులన్ = రత్నాల ఆభరణములను, చీరలన్ = చీరలను, క్రొత్త విరి సరములన్ = సరిక్రొత్త పుష్ప మాలికలను, సిరిగందమునన్ = మంచి గంధముతోను,

నేరుపులు అలరారగ = నైపుణ్యము అతిశయింపగా, తగన్ = తగినట్లుగా, సింగారంబు ఒనరించుకొని = అలంకరించుకొని, చెలగు నెడన్ = ఒప్పుచున్న సమయమున –

**తా :** వారును సరిక్రొత్త పుష్పమాలికలను, మంచి గంధముతోను నేర్పుగా అలంకరించుకొని ఒప్పుచున్న సమయమున –

**తే.గీ.** **రిక్కరాయఁడు దమిమీఱ రేవెలందిఁ**
**బెండ్లి యగునని కడయను పేరఁటాలు**
**మొనసి యైరేని నీటికై ముంచు పసిఁడి**
**కుండయనఁ బ్రొద్దు మున్నీటఁ గ్రుంకె నంత** **12**

రిక్కరాయడు = నక్షత్రాధిపతి (చంద్రుడు), తమి మీఱన్ = కోర్కె అతిశయింపగా, రేయి వెలందిన్ = రాత్రి అనే స్త్రీని, పెండ్లి అగును అని = పెండ్లాడతాడని, కడయను పేరటాలు = దిక్కు అనెడి పేరంటాలు, మొనసి = పూనుకొని, ఐరేని నీటికై = అయిరేనిలో నింపే నీటికొఱకు, ముంచు = ముంచుచున్న, పసిడి కుండ అన = బంగారు కుండ యనగా, ప్రొద్దు = సూర్యుడు, మున్నీటన్ = సముద్రములో, క్రుంకెన్ = మునిగెను, అంత = అంతట –

**తా :** చంద్రుడు రాత్రి స్త్రీని పెండ్లాడతాడని దిక్కు అనే పేరంటాలు అయిరేని నీటికొరకు ముంచుతున్న బంగారు కుండ యనగా సూర్యుడు సముద్రమున క్రుంకెను. అంతట –

**సీ.** **పగలింటి కడ నాడు తిగకంటి యెకిమీని**
**గడితంపు నిడువాలు జడలనంగ**
**విను ద్రిమ్మరులు కఱివేల్పు హజ్జను పూజ**
**సలిపిన క్రొత్త చెంగలువ లనఁగఁ**
**జెడిపె చానల నేఁచ వెడలుచు మరుఁడిమ్ము**
**కొలిపిన హొంబట్టు గొల్లె ననఁగ**
**గ్రుంకు గుబ్బలిఁ బుట్టి కొఱలుచుఁ గడల వెం**
**బడిఁ బ్రాకు నెరగలి మంట లనఁగఁ**

**తే.గీ.** **ద్రాడు దాలుపు చెలి పైఁడి మేడ మీద**
**గొండ్లి సలుపుచు ననుఁగులఁ గూడి చల్లు**
**లాడు బగ్గుండి పొడులన నలరి యపుడు**
**చదలఁ గొదలేక సంజ కెంజాయ లమరె** **13**

అపుడు, పగలింటి = పగటి పూట, కడన్ = చివరిభాగమునందు (సంజవేళ), ఆడు = నాట్యము చేయు, తిగకంటి ఎకిమీని = మూడు కన్నుల దొర (శివుడు), గడితంపు = దట్టమైన, నిడువాలు = మిక్కిలి పొడవైన, జడలు అనంగ = జటలు అనగా, విను త్రిమ్మరులు = ఆకాశ మందు సంచరించు వారు (దేవతలు), కఱివేల్పు హజ్జను = నల్లనివాడైన విష్ణువుయొక్క పాదములకు, పూజ సలిపిన = పూజ చేసిన, క్రొత్త = అప్పుడే వికసించిన, చెంగలువ లనగ = ఎఱ్ఱ కలువలనగా,

చెడిపె చానలన్ = వేశ్యాస్త్రీలను, ఏచన్ = బాధించగా, వెడలుచు = బయలుదేరుచు, మరుడు = మన్మథుడు, ఇమ్ము కొలిపిన = స్థానముగా చేసికొన్న, హొన్ను పట్టు = బంగారు పట్టుతో చేసిన, గొల్లెన = డేరా, అనగ = అనగా, క్రుంకు గుబ్బలిన్ = అస్తమయ పర్వతమున, పుట్టి = జనించి, కొఱలుచున్ = ప్రకాశించుచు, కడల వెంబడి = దిక్కుల వెంట, ప్రాకున్ = వ్యాపించు, ఎరగలి మంటలు = కార్చిచ్చు మంటలు, అనగ = అనగా, త్రాడు తాలుపు = పాశధారియగు వరుణుని యొక్క, చెలి = ప్రియురాలు, పైడి మేడమీద = బంగారు మేడమీద, గొండ్లి సలుపుచున్ = వలయాకార నృత్యము చేయుచు, అనుగుల కూడి = చెలికత్తెలతో కలసి, చల్లులాడు = చల్లు కొనుచున్న, బగ్గుండి పొదుల అన = ఎఱ్ఱని బుక్కా పొదులనగా, అలరి = ఒప్పి, చదలన్ = దిక్కులయందు, కొదలేక = అంతటా, సంజ కెంపు చాయలు = సంధ్యారుణ కాంతులు, అమరె = ఒప్పెను.

**తా :** అప్పుడు సంధ్యవేళ నాట్యముచేయు శివుని పొడవైన జటలనగా, దేవతలు విష్ణు పాదములు పూజ చేసిన ఎఱ్ఱతామరలనగా, వేశ్యాస్త్రీలను బాధించగా బయలుదేరుచు మన్మథుడు స్థానముగా చేసికొన్న బంగారు పట్టు డేరా అనగా, అస్తాద్రిని పుట్టి ప్రకాశముతో దిక్కుల వెంట వ్యాపించు కార్చిచ్చు మంటలనగా, వరుణుని చెలి పైడి మేడమీద నృత్యము చేయుచు చెలికత్తెలతో చల్లుకొనుచున్న బుక్కా పొదులనగా ఒప్పి దిక్కులయందంతటా సంధ్యారుణకాంతులు ఒప్పెను.

**తే.గీ.** **పగలు సేయుచు వేఁడిమి మిగుల జగముఁ**
**గ్రాఁచు జమునబ్బ మున్నీటఁ గలిసె ననియొ**
**తొగ వెలందుక నగియె నమ్మగువ పెంపుఁ**
**గని సయింపక తమ్మి మొగంబు మొగిచె** **14**

పగలు చేయుచు = పగటిని చేయుచు (కలువలకు తామరలకు విరోధము కల్పించుచు), వేడిమి మిగులన్ = ఉష్ణము అతిశయింపగా, జగమున్ క్రాచు = లోకమును తపింపచేయుచున్న, జముని అబ్బ = యముని తండ్రి (సూర్యుడు), మున్నీటన్ = సముద్రమున, కలిసెను అనియొ = కలిసేడనో, తొగ వెలందుక = కలువ కన్య, నగియెన్ = నవ్వెను, ఆ మగువ = అ కలువ కన్యయొక్క, పెంపున్ = ఆధిక్యమును, కని = చూచి, సయింపక = సహింపలేక, తమ్మి = పద్మము, మొగంబు = ముఖమును, మొగిచె = ముడిచెను.

**తా :** పగటిని చేయుచు ఉష్ణము అతిశయింపగా లోకమును తపింపచేయుచున్న సూర్యుడు సముద్రమున కలిసెననియేమో కలువకన్య నవ్వెను. ఆమె ఆధిక్యమును చూసి సహింపలేక తామర ముఖమును ముడిచెను.

**తే.గీ.** **చలివెలుఁగు రాకఁ గని తమ సామియైన**
**వేఁడి వేలుపు నీట బల్విడినిఁ ద్రోచెఁ**
**గడయను గయాళి యనియొ జక్కవలు వెన్ను**
**నడుగు పట్టుక మొఱసేయఁ దొడఁగె నపుడు** **15**

అపుడు = అప్పుడు, చలివెలుగు రాక కని = చంద్రుని రాకను చూచి, తమ సామియైన = తమ ప్రభువైన, వేడి వేలుపున్ = సూర్యుని, నీటన్ = నీటియందు, బల్విడినిన్ = ప్రయత్నపూర్వకముగా, కడయను = పశ్చిమ దిక్కు అనెడి, గయాళి = గయ్యాళి, త్రోచెన్ అనియొ = త్రోసివేసెనని కాబోలు, జక్కవలు = చక్రవాకపక్షులు, వెన్నున్ = వెన్నుపూసను, అడుగు పట్టుక = పాదముల చెంతకు తెచ్చి, మొఱసేయన్ తొడగెన్ = అఱచుటకు ఆరంభించెను.

**తా :** అప్పుడు చంద్రుని రాకను చూచి తమ ప్రభువైన సూర్యుని నీటియందు పశ్చిమ దిక్కు అనెడి గయ్యాళి త్రోసివేసెనని కాబోలు చక్రవాకపక్షులు వెన్నుపూసను పాదముల చెంతకు తెచ్చి మొఱపెట్టుటకు ఆరంభించెను.

**తే.గీ.** **నెలయు రే జవరాలి బెండిలికి నెదురు**
**నెడలఁ దటియను కమ్మరి కడ యనంగఁ**
**గ్రాలు బిరుసులు నెఱపినఁ బూలుఁ బొగయు**
**నెగసెనన మింట రిక్కలు నిరులుఁ బర్వె** **16**

నెలయు = చంద్రుడును, రే జవరాలిన్ = రాత్రి అనే ప్రియురాలిని, పెండిలికి = పెండ్లాడ డానికి, ఎదురున్ ఎడలన్ = ఎదుర్కోలు సమయమున, తటి అను కమ్మరి = కాలము అనే బాణ కారుడు, కడ అనంగన్ = దిక్కు అంతమనునట్లుగా, క్రాలు = ప్రకాశించు, బిరుసులు = చిచ్చుబుడ్లు, జువ్వలు మొదలగు బాణసంచాను, నెఱపిన = వెలిగించగా, పూలు పొగయును = పూవులును, పొగయును, ఎగసెను అన = వ్యాపించెననునట్లుగ, మింటన్ = ఆకాశమున, రిక్కలున్ = నక్షత్రములును, ఇరులున్ = చీకట్లును, పర్వెన్ = వ్యాపించెను.

**తా :** చంద్రుడు రాత్రి అనే ప్రియురాలిని పెండ్లాడడానికి ఎదుర్కోలు సమయమున కాలమనే కర్మకారుడు దిక్కు అనే బాణసంచాను వెలిగించగా పూలు, పొగ వ్యాపించెనా అన్నట్లు ఆకాశమున నక్షత్రములును, చీకట్లును వ్యాపించెను.

**కం.** **పుడుఁకుల కొఱ కప్పుడు గడు**
**విడిముడి యుడుకొని కడింది వేడబములతో**
**వడివడి వెలవెలఁదుల వెం**
**బడి నడతెంచిరి పొరిఁబొరిఁ బ్రాయపు బొజుఁగుల్** **17**

ప్రాయపు బొజుగుల్ = యువకులైన విటులు, అప్పుడు = ఆ సమయమునందు, పుడుకుల కొఱకు = భక్ష్యముల కొఱకని, విడిముడి ఉడుకొని = ధనము తీసుకొని, కడింది = మిక్కిలి, వేడబములతో = ప్రచ్ఛన్న వేషములతో, వడివడి = శీఘ్రముగా, వెలవెలదుల వెంటన్ = వేశ్యా స్త్రీల వెంట, పొరి పొరిన్ = వేగముగా, నడతెంచిరి = వెళ్ళిరి.

**తా :** యువకులైన విటులు ఆ సమయమున భక్ష్యముల కొఱకని ధనము తీసుకొని వంచనలతో తొందరగా వేశ్యాస్త్రీల వెంట వెళ్ళిరి.

**తే.గీ.** **పొసఁగ రే యింతి వెన్నెల పులుఁగు గములఁ**
**బెనుపుటకు మేఁత నించి యుంచిన వెడంద**

**కుందనపుఁ బళ్ళెరంబన గొఱలి యపుడు**
**కలువల యనుంగు దూర్పు గుబ్బలిని బొడమె** **18**

అపుడు = ఆ సమయమున, పొసగన్ = చక్కగా, రే ఇంతి = రాత్రియను స్త్రీ, వెన్నెల పులుగు గములన్ = చాతక పక్షుల సమూహములను, పెనుపుటకు = పెంచుటకు, మేత నించి ఉంచిన = మేత నింపి ఉంచిన, వెడంద = పెద్దదైన, కుందనపు పళ్ళెరంబన = బంగరు పళ్ళెరమనునట్లుగా, కొఱలి = ప్రకాశించి, కలువల అనుంగు = కలువల ప్రియుడు (చంద్రుడు), తూర్పు గుబ్బలినిన్ = తూర్పు పర్వతమునందు, పొడమెన్ = ఉదయించెను.

**తా :** ఆ సమయమున చక్కగా రాత్రియను స్త్రీ చాతక పక్షులను పెంచుటకు మేత నింపిన పెద్ద బంగరు పళ్ళెరమనునట్లుగా ప్రకాశించి చంద్రుడు తూర్పుపర్వతమున ఉదయించెను.

**తే.గీ.** **కన్ను దలమానికము బండికల్లు జగిలు**
**గాఁడునై యొప్పి మిక్కిలి కంటివేల్పు**
**నలరఁజేయు వలంతి యగ్గలఁపుఁ జల్లఁ**
**దనము నెఱపుచు నంతకంతకు వెలింగె** **19**

కన్ను = నేత్రముగాను, తలమానికము = శిరోరత్నముగాను, బండికల్లు = రథచక్రముగాను, జగిలుగాడునై = తోడల్లుడుగాను, ఒప్పి = ప్రకాశించి, మిక్కిలికంటి వేల్పున్ = త్రినేత్రుడైన శివుని, అలరచేయు వలంతి = ఆనందపరచు సమర్థుడు (చంద్రుడు), అగ్గలపున్ = అధికమైన, చల్లన్ తనము = శీతలత్వమును, నెఱపుచు = వ్యాపింపచేయుచు, అంతకు అంతకు = క్రమక్రమముగా, వెలింగె = కాంతివంతుడయ్యెను.

**తా :** నేత్రముగాను, శిరోరత్నముగాను, బండిచక్రముగాను, తోడల్లుడుగాను ఒప్పి శివుని ఆనందపరచు చంద్రుడు చల్లదనమును వ్యాపింపచేయుచు క్రమముగా కాంతినింపెను. (శివుని నేత్రములు సూర్య,చంద్రులు, శివుని శిరోరత్నము, త్రిపుర సంహారమున సూర్య చంద్రులు రథ చక్రములు, ఇరువురు దక్షుని జామాతలు)

**సీ.** **వేల్పుటేనికలయ్యెఁ బోల్ప నేనుఁగు లెల్లఁ**
**గొండలన్నియు వెండికొండ లయ్యెఁ**
**బలుకు చేడియ లైరి పొలఁతుక లందఱుఁ**
**జెట్టు లన్నియుఁ బెట్టు చెట్టు లయ్యెఁ**
**బాల సంద్రము లయ్యె నోలి నేళ్లన్నియు**
**నలువ బాబాలయ్యెఁ బులుఁగు లెల్లఁ**
**బుడమి దాలుపు లయ్యెఁ బడగ దార్లన్నియు**
**మేటి సింగము లయ్యెఁ మెకము లెల్లఁ**

**తే.గీ.** **బండు రేయెండ కన్నుల పండు వగుచుఁ**
**బిండి చల్లిన తెఱఁగున మెండు మీటి**

**యొండు కడనైన నెడలేక యుండి యప్పు**
**డండ గొనక జగంబెల్ల నిండుటయును** **20**

పండురేయి ఎండ = పున్నమి వెన్నెల, కన్నుల పండువగుచున్ = కనుల పండువగుచు, పిండి చల్లిన తెఱగున = పిండి ఆరబోసిన రీతిగా, మెండు మీఱి = మిక్కిలి అతిశయించి, ఒండు కడను ఐనన్ = ఏ ఒక్క ప్రదేశమునందును, ఎడలేక ఉండి = సందులేకుండా వ్యాపించి, అండ గొనక = శీఘ్రముగా, జగంబు ఎల్ల = భూమండలమంతయు, నిండుటయును = నిండిపోవుటచే, అప్పుడు = అప్పుడు, ఏనుగులు ఎల్ల = ఏనుగులన్నియు, పోల్పన్ = పోల్చగా, వేల్పు ఏనికలు అయ్యె = ఐరావతములయ్యెను, కొండలు అన్నియున్ = పర్వతములన్నియును, వెండికొండలు అయ్యెన్ = హిమవత్పర్వతములయ్యెను, పొలతుకలు అందఱున్ = స్త్రీలందరును, పలుకు చేడియలు ఐరి = సరస్వతీ రూపులైరి, చెట్టులు అన్నియున్ = వృక్షములన్నియును, పెట్టుచెట్టులు అయ్యెన్ = కల్పవృక్షములయ్యెను, ఏఱులు అన్నియున్ = ప్రవాహములన్నియును, పాల సంద్రములు అయ్యెన్ = పాల సముద్రములయ్యెను, పులుగులు ఎల్లన్ = పక్షులన్నియు, నలువ బాబాలు అయ్యెన్ = బ్రహ్మ వాహనములయ్యెను (హంసలు), పడగదార్లు అన్నియున్ = పాములన్నియును, పుడమి తాలుపులు అయ్యెన్ = ఆదిశేషులయ్యెను, మెకములు ఎల్లన్ = జంతువులన్నియును, మేటి సింగములు అయ్యెన్ = గొప్ప సింహములయ్యెను.

**తా :** పున్నమి వెన్నెల కన్నుల పండువగుచు పిండి ఆరబోసిన రీతిగా ఏ ఒక్క ప్రదేశము నందును ఎడలేక వ్యాపించి భూమండలమంతట నిండిపోగా అప్పుడు ఏనుగులన్నియు ఐరావతము లయ్యెను. కొండలన్నియు హిమవత్పర్వతము లయ్యెను. స్త్రీలందరూ సరస్వతీ స్వరూపులైరి, వృక్షములన్నియు కల్పవృక్షము లయ్యెను. ఏఱులన్నియు పాలసంద్రము లయ్యెను. పక్షులన్నియు హంస లయ్యెను. పాము లన్నియు ఆదిశేషు లయ్యెను. జంతువు లన్నియు సింహము లయ్యెను.

**సీ.** **అత్తఱిఁ గైక కచ్చుఱ నీరుతిట్ట బ**
**త్తళిక వజీరు బల్విలు దునిమిన**
**వెరువరి నొసల బంగరు రేకు గట్టు తె**
**ఱంగు మంథర యను ఱాఁగ పొలఁతి**
**వలన నెఱింగి పేరలుకతో నొడయనిఁ**
**బిలిపించి మాకు ముందెలమి తోడ**
**నీ వొసంగెదనన్న నెఱ మెప్పు లిప్పుడు**
**మఱచినాఁడవొ? లోన నెఱుకమాలి**

**తే.గీ.** **యకట! యిఁకనైన సరగ నా యనుఁగుఁ గొడుకు**
**నొడయనిగఁ జేసి నీ పెద్ద కొడుకు నడవి**
**కనుపు మనుటయు గుండియ లవిసి యాతఁ**
**డ మ్మెలంతుకఁ జూచి యిట్లనుచుఁ బలికె** **21**

ఆ తఱిన్ = ఆ సమయమున, కైక కచ్చుఱన్ = కైక వెంటనే, నీరుతిట్ట = సముద్రుడు, బత్తళిక = అమ్ములపొదిగా కల, వజీరు = శూరుని (శివుని), బలు విలున్ = గొప్ప ధనుస్సును, దునిమిన = విఱిచిన, వెరువరి = కుశలుడైన రాముని, నొసలన్ = నుదుటియందు, బంగరు రేకు కట్టు = సింహతలాటము కట్టబోవు, తెఱంగు = విధమును, మంధర యను = మంధర అను పేరుగల, ఊగ పొలతి వలనన్ = దుష్టురాలు వలన, ఎఱింగి = తెలుసుకొని, పేరలుకతోన్ = అధికమైన కోపముతో, ఒడయనిన్ = రాజును, పిలిపించి = రప్పించి, మాకు = నాకు, ముందు = ఇంతకు పూర్వం, ఎలమితోడ = ప్రీతితో, నీవు ఒసంగెదను అన్న = నీవు ఇస్తానన్న, నెఱ మెప్పులు = మెప్పుకోలుగ ఇచ్చిన వరములు, ఇప్పుడు = ఇప్పుడు, లోనన్ = మనసులో, ఎఱుకమాలి = తెలివిలేక, మఱచినాడవొ = మఱచిపోయావేమో? అకట = అయ్యో, ఇకను ఐన = ఇప్పుడైనా, సరగ = శీఘ్రముగా, నా అనుగు కొడుకున్ = నా ప్రియపుత్రుని (భరతుని), ఒడయనిగన్ చేసి = రాజుగా చేసి, నీ పెద్ద కొడుకున్ = నీ పెద్దకొడుకైన రాముని, అడవికి = అరణ్యమునకు, అనుపుము అనుటయు = పంపుము అనగానే, గుండియలు అవిసి = గుండె పగిలి, ఆతడు = ఆ దశరథుడు, ఆ మెలంతుకన్ = ఆ స్త్రీని (కైకను) చూచి = చూచి, ఇట్లనుచు పలికె = ఇలా అని మాట్లాడెను.

**తా :** ఆ సమయమున కైక వెంటనే రాముని నుదుట సింహతలాటము కట్టబోవు విధమును మంథర వలన తెలుసుకొని కోపముతో రాజును రప్పించి 'నాకు పూర్వం ఇస్తానన్న వరములు మఱచిపోయావేమో? ఇప్పుడైనా నా ప్రియపుత్రుని రాజును చేసి, నీ పెద్దకొడుకుని అరణ్యమునకు పంపుము' అనగానే గుండె పగిలి దశరథుడు కైకను చూచి ఇట్లు పలికెను.

**కం.** **పిఱు తివియక నా ముందఱ**
**దెఱవా! యిప్పగిది నాడఁదెఱవా? మేల్ మేల్**
**కొఱమాలిన యివ్వీఱిఁడి**
**కఱదలు నీ కెవ్వరిపుడు గఱపిరి చెపుమా?** **22**

తెఱవా = ఓ కామినీ! (కైకా), పిఱు తివియక = వెనుకాడక, నా ముందఱ = నా యెదుటనే (భర్త అనికాని, రాజు అనికాని సందేహించకుండా), ఈ పగిది = ఈ విధముగా, ఆడన్ తెఱవా = పలుకడం బాగుందా?, మేల్ మేల్ = మంచిది మంచిది, కొఱమాలిన = పనికిరాని, ఈ వీఱిడి కఱదలు = ఈ మూర్ఖపు బుద్ధులు, ఇపుడు = ఇప్పుడు, నీకు = నీకు, ఎవ్వరు = ఎవరు, కరపిరి = నేర్పారు, చెపుమా = చెప్పుము.

**తా :** ఓ కైకా! వెనుకాడక నా ముందే ఈ విధముగా పలుకుట బాగుందా? పనికిరాని ఈ మూర్ఖపు బుద్ధులు నీకు ఎవరు నేర్పారు చెప్పు –

**కం.** **పలు చెట్టల గాసిలి ముని**
**గల వేల్పుల నెల్లఁగొలిచి కాంచిన కొడుకున్**
**బలు కానలఁ జేఱుపుమని**
**పలికెదు నీ డెందమెంత పదుకాయె నొకో!** **23**

పలు చెట్టలన్ = అనేకములైన వేదనలతో, గాసిలి = బాధపడి, మును = పూర్వము, కల వేల్పులను ఎల్లన్ = ఉన్న దేవతలందరిని, కొలిచి = పూజించి, కాంచిన = కన్న, కొడుకున్ = కొడుకును, బలు కానలన్ = దట్టమైన అడవులను, చేఱుపుమని = చేర్చుమని, పలికెదు = పలుకుతున్నావు, నీ డెందము = నీ మనస్సు, ఎంత పడుకాయెను ఒకో = ఎంతగా రాయి అయిపోయిందో కదా!

**తా :** ఎన్నో వేదనలతో బాధపడి పూర్వం దేవతలందరిని పూజించి కన్న కొడుకును అడవులకు చేర్చుమని పలుకుతున్నావు. నీ మనస్సు ఎంత కఠినమైనదో కదా!

**తే.గీ.** **పేరుగల యింటి నెఱ రాచబిడ్డవనుచుఁ**
**దలఁచుచుండుదు నెదఁ జాల వలపు మీఱ**
**వాలుగంటిరో! యిపు డింత బేలవగుట**
**కయ్యయో! యింక నిన్నేమి యనఁగఁ గలదు! 24**

వాలుగంటిరో = అందమైన కన్నులుకలదానా!, పేరుగల ఇంటి నెఱ రాచబిడ్డవు అనుచు = పేరున్న ఇంటిలోని చక్కని రాచబిడ్డవని, ఎదన్ = మనసునందు, చాల వలపు మీరన్ = ఎక్కువ ప్రేమను ఒలకపోసి, తలచుచుండుదు = ఆలోచిస్తూంటాను, ఇపుడు = అలాంటిదానివి ఇప్పుడు, ఇంత బేలవు అగుటకు = ఇంత బలహీనురాలవగుటకు, అయ్యయో = అయ్యయ్యో, ఇంకన్ = ఇంకా, నిన్ను = నిన్ను, ఏమి అనగ కలదు = ఏమనడానికుంది?

**తా :** వాలుగంటీ ! పేరున్న ఇంటి రాచబిడ్డవని మనసులో చాలా ప్రేమ ఒలకబోసి ఆలోచిస్తూంటాను. అలాంటిదానివి ఇంత బలహీనురాలవగుటకు అయ్యయ్యో! ఇంక నిన్ను ఏమనడానికుంది?

**కం.** **ఆఱడిఁ బెట్టెదనని మది**
**నాఱని చలమూని కఱకు లాడెద వకటా!**
**నూఱిడుములు వొదవిన నిఁక**
**గాఱడవుల కనుపఁజాలగద యిక్కొడుకున్ 25**

అకటా = అయ్యో, ఆఱడిన్ పెట్టెదను అని = నిందపెడతాను అని, మదిన్ = మనసునందు, ఆఱని చలము ఊని = తగ్గని మాత్సర్యమును వహించి, కఱకులు ఆడెదవు = కఠినముగా పలుకుచున్నావు, నూఱిడుములు ఒదవినన్ = వంద కష్టములు వచ్చినా సరే, ఇకన్ = ఇకపైన, ఈ కొడుకున్ = ఈ ప్రియమైన పుత్రుని, కాఱడవులకు = కీకారణ్యములకు, అనుపన్ చాలన్ = పంపలేను.

**తా :** అయ్యో! నిందపెడతానని మనసులో ఈర్ష్య వహించి కఠినముగా పలుకుతున్నావు. వంద కష్టములు వచ్చినా సరే ఈ ప్రియపుత్రుని కీకారణ్యములకు పంపలేను.

**తే.గీ.** **చాన! నీ పట్టిఁ బుడమికి ఱేనిఁ జేయఁ**
**గోరె దా రాగవుఁడును నీ కొడుకు గాఁడె?**

**నేర్పెఱుంగక కటకటా! నేతి కొఱకు**
**వెన్నపై నగ్గి సందెడు వ్రేయఁ జనునె? 26**

చాన = ఓ కాంతా (కైకా), నీ పట్టిన్ = నీ కొడుకును, పుడమికి ఱేనిన్ చేయన్= ఈ రాజ్యానికి రాజుగా చేయుమని, కోరెదు = కోరుతున్నావు. ఆ రాగవుడును = ఆ రాముడును, నీ కొడుకు కాదె?, కటకటా = అయ్యయ్యో, నేర్పు ఎఱుగక = తెలివిలేక, నేతి కొఱకు = నేతికోసం, వెన్నపైన్ = వెన్నపైన, సందెడు అగ్గి = దోసెడు నిప్పును, వ్రేయన్ చనునె = వేయడం తగునా?
**తా :** ఓ కైకా! నీ కొడుకును రాజును చేయమని కోరుతున్నావు. ఆ రాముడు నీ కొడుకు కాదా! అయ్యయ్యో! ఆలోచించక నేతికోసం వెన్నపైన దోసెడు నిప్పును వేయడం తగునా?

**కం. కోరుకొను మింక నీకుం**
**గోరిన మెప్పులకు నిడుదుఁ గోరగ మేల్బం**
**గారును రతనపుఁ దొడవులు**
**వారువములు మొదలుగాఁగ వలసిన వెల్లన్ 27**

ఇంక కోరుకొనుము = ఇంక కోరుకో, నీకున్ = నీకు, కోరిన మెప్పులకున్ = కోరుకున్న వరములకుగాను, కోరగ = నీవు కోరుకొనగా, మేలు బంగారును = మంచి బంగారమును, రతనంపు తొడవులు = రత్నాల హారములు, వారువములు = గుఱ్ఱములు, మొదలుగాగ = మొదలైన, వలసినవి ఎల్లన్ = కోరినవన్నియును, ఇడుదు = ఇచ్చెదను.
**తా :** ఇంక కోరుకో! నీకు ఇస్తానన్న వరములకుగాను నీవు కోరుకొనగా బంగారం, రత్నాల హారాలు, గుఱ్ఱములు మొదలైన కోరినవన్నీ ఇచ్చెదను.

**చం. పొసఁగని మాట పల్కి మదిఁబూనిన కర్జము కాకయున్నచోఁ**
**గసరుచుఁ దొంటి కూరుములు గైకొన నొల్లక సారెసారెకున్**
**దొసఁగులఁ బెట్టుచున్ జలముతో మగలం దెగనాడి యద్దిఱా!**
**యుసురులు గొందు రాగడపు టోజ గయాళులుగా వెలందుకల్ 28**

పొసగని మాట పల్కి = కుదరని మాట మాట్లాడి, మదిన్ పూనిన = మనసులో అనుకొన్న, కర్జము = పని, కాక ఉన్నచో = కాకపోయినచో, కసరుచున్ = కోపగించుచు, తొంటి కూరుములు = తొలి ప్రేమలను, కైకొనన్ = పొందుటకు, ఒల్లక = అంగీకరింపక, సారెసారెకున్ = మాటిమాటికి, దొసగుల పెట్టుచున్ = దోషముల నెంచుచు, చలముతో = పంతముతో, మగలన్ = భర్తలను, తెగనాడి = నిందించి, అద్దిఱా = ఔరా!, ఆగడపు ఓజన్ = కూడని పద్ధతులలో, వెలందుకల్ = స్త్రీలు, గయాళులుగా = గయ్యాళులుగా, ఉసురులు కొందురు = ప్రాణాలు తీస్తారు.
**తా :** స్త్రీలు పొసగని మాటలు మాట్లాడి మనసులో అనుకున్న పని కాకపోతే కోపగిస్తూ, తొలి ప్రేమలను పొందడానికి అంగీకరించక మాటిమాటికి దోషముల నెంచుచు ఈర్ష్యతో భర్తలను నిందించి తగనిరీతిని గయ్యాళులుగా ప్రాణాలు తీస్తారు.

**ఆ.వె. అనిన నులికి కలికి యహహా! లోఁ గన రింత**
**చిలుక నలుకఁ జులుకఁ బలుకఁ దగునె**
**నేలతేఁడ! తప్ప నేల యాడిన మాట**
**నిలుపుకొనుము మదిని నిక్కమూని 29**

అనినన్, కలికి = స్త్రీ (కైక), ఉలికి = అదరిపడి, అహహ = ఎంత ఆశ్చర్యము, నేలతేడ = రాజా, లోన్ కనరు = లోపలవున్న ద్వేషాన్ని, ఇంత చిలుకన్ = సుంత చిమ్ముతూ, అలుకన్ = కోపముతో, చులుకన్ = తేలికగా, పలుకన్ = పలుకుట, తగునె = తగునా?, ఆడినమాట = ఇచ్చిన మాట, తప్పన్ ఏల = తప్పుట ఎందులకు?, మదిని = మనస్సునందు, నిక్కము ఊని = సత్యము నవలంబించి, నిలుపుకొనుము = ఆడిన మాటను నిలబెట్టుకొనుము.

**తా :** అనగానే కైక ఉలికిపడి 'అహహ! ఓ రాజా! లోపలవున్న ద్వేషాన్ని చిమ్ముతూ కోపంతో తేలికగా పల్కుట తగునా? మనస్సులో సత్యాన్ని నమ్మి, ఆడినమాటను నిలబెట్టుకో!

**ఆ.వె. ఇవము సూడు కొలపు టేలిక ల్మున్నెందుఁ**
**గాఱు లాడిరనిన కత యెఱుంగ**
**మకట! నీ కతమున నరుదుగా నిపుడేమొ**
**వినని కనని దొడ్డ వింత పుట్టె 30**

అకట = అయ్యో, ఇవము సూడు కొలపు ఏలికలు = మంచుకు విరోధి కులపు రాజులు (సూర్యవంశపు రాజులు), మున్ను ఎందు = పూర్వము ఎన్నడును, కారులు ఆడిరి = అసత్యము పలికిరి, అనిన కత = అన్న విషయము, ఎఱుంగము = తెలియదు, నీ కతమునన్= నీ మూలముగా, అరుదుగాన్ = ఆశ్చర్యకరముగా, ఇపుడు ఏమొ = ఇప్పుడేమో, వినని = (ఇంతకు ముందు) విననట్టి, కనని = కననట్టి, దొడ్డ వింత = గొప్ప వింత, పుట్టె = పుట్టినది.

**తా :** అయ్యో! సూర్యవంశపురాజులు పూర్వమెన్నడును అసత్యం పలికేరు అన్న విషయం ఎరుగము. నీ వలన అరుదుగా ఇప్పుడేమో వినని, కనని గొప్ప వింత పుట్టినది.

**తే.గీ. ఆడి తప్పక కొమరుని నాలి నమ్మి**
**మాలనికి లెంకయై కొల్చి మాట నిల్పు**
**కొన్న మీ వంగడపుఁ బెద్ద యున్నవాఁడె!**
**యతని పేరెన్నఁటికిఁ బోవదయ్యెఁ గాక 31**

ఆడి తప్పక = ఇచ్చినమాట తప్పక, కొమరునిన్ = కుమారుని, ఆలిని = భార్యను, అమ్మి = అమ్ముకొని, మాలనికి లెంకయై = మాలవానికి దాసుడై, కొల్చి = సేవించి, మాట నిలుపు కొన్న = ఇచ్చిన మాట నిలబెట్టుకొన్న, మీ వంగడపు పెద్ద = మీ వంశంలోని గొప్పవాడు (హరిశ్చంద్రుడు), ఉన్నవాడె = ఉన్నాడుకదా! అతని పేరు = ఆయన పేరు, ఎన్నటికిన్ = ఎప్పటికిని, పోవదయ్యె కాక = పోకుండా నిలిచి ఉందికదా!

**తా :** ఇచ్చిన మాట తప్పక కొడుకుని, భార్యని అమ్మి మాలవానికి దాసుడై సేవించి, ఇచ్చిన

మాట నిలబెట్టుకొన్న మీ వంశములోని గొప్పవాడగు హరిశ్చంద్రుడు ఉన్నాడుకదా! ఆయన పేరు ఎప్పటికిని పోకుండా నిలిచి ఉందికదా!

**కం. కొఱఁతవడుఁ దొంటి నోములు**
**దఱుగు న్మఱి బ్రతుకు నేండ్లు తలఁగును సిరి ద**
**బ్బరకాండ్ర కట్లగుట నె**
**త్తఱినైన హుళక్కి పలుకఁ దలఁపరు ప్రోడల్ 32**

దబ్బరకాండ్రకున్ = అసత్యము పల్కువారలకు, తొంటి నోములు = పూర్వపు పుణ్యములు, కొఱతవడున్ = నశించును, మఱిన్ = మరియు, బ్రతుకున్ ఏండ్లు= జీవనకాలము, తఱుగున్, సిరి తలగును = సంపద తొలిగిపోవును, అట్లగుటన్ = ఆ కారణమున, ప్రోడల్ = పెద్దలు, ఏ తఱినైనన్ = ఏసమయమునందైనను, హుళక్కి పలుకన్ = అసత్యము పలుకుటకు, తలపరు = తలంచరు.

**తా :** అసత్యము పలుకువారలకు పూర్వ పుణ్యములు నశించును. జీవనకాలము తగ్గిపోవును. సంపద తొలగిపోవును. అందుకని పెద్దలు అసత్యము పలుకుటకు తలంచరు.

**కం. పొలఁతుకలు ఱాఁగ లనుచుం**
**బలికెదు దబ్బఱల కెల్లఁ బట్టగు నెకిమీ**
**డుల నెద నమ్మఁగ వచ్చునె?**
**కలలోపలనైన నెఱుకగల వలఁతులకున్ 33**

పొలతుకలు = స్త్రీలు, ఱాగలు అనుచున్ = ధూర్తురాండ్రనుచు, పలికెదు = పలుకు చుంటివి, దబ్బఱలకు ఎల్లన్ = అబద్ధాలన్నింటికి, పట్టగు = నిలయమైన, ఎకిమీడులను = రాజులను, ఎఱుక కల = బుద్ధి ఉన్న, వలతులకున్ = స్త్రీలకు, కలలోపలను ఐనన్ = కలలో నైనను, ఎదన్ = మనసునందు, నమ్మగ వచ్చునె = నమ్మవచ్చునా?

**తా :** స్త్రీలు ధూర్తురాండ్రని పలుకుచుంటివి. అబద్ధాలన్నిటికి నిలయమైన రాజులను బుద్ధివున్న స్త్రీలు కలలోనైనా మనసునందు నమ్మవచ్చునా?

**ఉ. చల్లని బెల్లి మాటల పస న్మస కొల్పుచు నెల్లవారలన్**
**మెల్లనఁ జేరఁదీసి తుదిమేర యొకింతయు లేక యూరకే**
**కొల్లగ రొక్క మెల్లఁ గయికొందురు నిక్కము డించి చెల్లఁబో!**
**కల్లల కెల్ల నిల్కడలు గారె కనుంగొన నేల ప్రోపరుల్ 34**

చల్లని బెల్లి మాటల పసన్ = మెత్తని బెలిపించే మాటల గొప్పతనముతో, మస కొల్పుచు = విలాసములను చూపుచు, ఎల్లవారలన్ = అందఱిని, మెల్లన = మెల్లగా, చేరన్ తీసి = దగ్గఱకు చేర్చుకొని, తుది = చివరకు, మేర ఒకింతయు లేక = కొంచెముకూడా మర్యాద లేకుండా, ఊరకే = ఏ నేరము చేయకున్నను, నిక్కము డించి = సత్యమును వదలి, కొల్లగన్ = దోచుకొనుటకు, రొక్కము ఎల్లన్ కయికొందురు = సంపద నంతను తీసుకొందురు, చెల్లన్ పో

= ఇది తగినపనేనా? కనుంగొన = చూడగా, నేల ప్రోపరుల్ = రాజ్యాన్ని రక్షించే పాలకులు, కల్లలకు ఎల్ల = అన్ని అసత్యములకు, నిల్కడలు కారె = నిలయులు కారా?

**తా :** మెత్తని బెలిపించే మాటలతో విలాసములను చూపుచు మెల్లగా చేర్చుకొని చివరకు కొంచెముకూడా మర్యాద లేకుండా, ఊరకే సత్యమునెంచక దోచుకొనుటకు సంపదనంతను తీసుకొందురు. ఇది తగినపనేనా? చూడగా రాజులు అన్ని అసత్యములకు నిలయులుకదా!

**తే.గీ.** **వినుము రాయఁడ! పలుకులు వేయునేల?**
**జాగు సేయక కోరికల్ సాఁగఁజేయు**
**మట్లు గాదేనిఁ గ్రన్నన నరుగు మవలఁ**
**జేయు పని యింక నీవె చూచెదవు గాక** **35**

రాయడ = రాజా!, వినుము = నా మాట విను, పలుకులు వేయును ఏల = వేయి మాటలు ఎందులకు, జాగు చేయక = ఆలస్యము చేయక, కోరికల్ సాగన్ చేయుము = నా కోరికలు జరుగునట్లు చేయుము, అట్లు కాదు ఏనిన్ = అలా కాకపోయినచో, క్రన్ననన్ = వెంటనే, అవలన్ = బయటకు, అరుగుము = పొమ్ము, ఇంకన్ = ఆ పైన, చేయు పని = నేను చేసే పనిని, నీవె = నీవే, చూచెదవు కాక = చూస్తావుకదా!

**తా :** రాజా! విను, వేయి మాటలెందుకు? జాగు చేయక నా కోరికలు జరిగేలా చెయ్యి. అలా కాకపోతే వెంటనే బయటకు వెళ్ళు. ఆపైన నేను చేసే పనిని నీవే చూస్తావుకదా!

**ఆ.వె.** **అనుచు నప్పొలంతి యాగడంబున నాడ**
**నాలకించి యొడయఁ డలుకఁ బూని**
**యిట్టు లట్టు లనుచు నేమియు మాఱాడ**
**నోడి వంత నూఱకుండె నంత** **36**

అనుచు = ఈ ప్రకారంగా, ఆ పొలంతి = ఆ స్త్రీ, ఆగడంబునన్ ఆడన్ = దుర్మార్గముగా పలుకగా, ఆలకించి = విని, ఒడయడు = రాజు, అలుకన్ పూని = కోపగించి, ఇట్టులు అట్టులు అనుచు = ఇలా అలా అని, ఏమియు = ఏమియును, మాఱు ఆడన్ ఓడి = మారు పలుక భయపడి, వంతన్ = బాధతో, ఊఱకుండెన్ = మౌనముగా నుండెను, అంత = అంతట–

**తా :** అంటూ ఆ కైక దుర్మార్గముగా పలుకగా విని దశరథుడు కోపగించి ఇలా అని ఏమీ మారు పలుక జాలక బాధతో మౌనంగా ఉండెను. అంతట –

**కం.** **చలి వెలుఁగు గలియుచో రే**
**వెలఁదుక నెఱి గొప్పువలన వెస జాఱిన చెం**
**గలువ విరినాఁగఁ దగి చు**
**క్కల తెఱువున వేగుచుక్క కనుగొన నయ్యెన్** **37**

చలివెలుగున్ = చంద్రుని, కలియుచోన్ = కూడుటవలన, రే వెలదుక = రాత్రి కాంత యొక్క నెఱి కొప్పువలన = అందమైన సిగనుండి, వెసన్ జాఱిన = తొందరలో జారిపడిన, చెంగలువ

విరినాగన్ = ఎఱ్ఱకలువ పుష్పమా యనునట్లుగా, తగి = ఒప్పి, చుక్కల తెఱవున = ఆకాశ మార్గమున, వేగుచుక్క = శుక్ర నక్షత్రము, కనుగొన నయ్యెన్ = కనబడెను.

**తా :** చంద్రునితో కూడిన రాత్రికాంత కొప్పునుండి జాఱిన ఎఱ్ఱకలువ యనునట్లుగా ఒప్పి ఆకాశమార్గమున వేగుచుక్క కనబడెను.

**ఉ.** **మాటి మాటికిం జలము మానక జక్కవ పెంట్లఁదమ్మిలే**
**జోటుల నేఁప దా జగము చుట్టము డాయఁగ వచ్చె నింక నీ**
**యాటలు డించి వే జరుగుమంచును వెన్నెల తేని కేర్పడం**
**జాటె ననంగఁ గూఁత లిడఁ జాఁగెఁ దుటారపు టజ్జవాల్గముల్** **38**

మాటిమాటికిన్ = ప్రతినిత్యము, చలము మానక = కోపము వీడక, జక్కవ పెంట్లన్ = ఆడు చక్రవాకపక్షులను, తమ్మి లే జోటులన్ = పద్మము లనెడు యువతులను, ఏపన్ = (నీవు)బాధపెట్టగా, తాన్ = తాను, జగము చుట్టము = లోకబాంధవుడైన సూర్యుడు, డాయగ వచ్చెను = చేరవచ్చెను, ఇంక, నీ ఆటలు = నీ చేష్టలు, డించి = విడిచి, వే జరుగుము అంచును = తొందరగా వెళ్ళుమనుచు, వెన్నెల తేనికి = చంద్రునికి, ఏర్పడన్ = తెలియునట్లుగా, చాటెను అనంగ = చాటుతున్నాయి అనునట్లుగా, తుటారపు = దృఢమైన, అజ్జ = పాదములే, వాలు = ఆయుధముగా కల (కోళ్ళు), గముల్ = సమూహములు, కూతలు ఇడన్ చాగెన్ = కూతలు కూయసాగెను.

**తా :** ప్రతి నిత్యము కోపము వీడక జక్కవ పెంట్లను, పద్మములను బాధపెట్టగా సూర్యుడు చేరవచ్చెను. ఇంక నీ ఆటలు విడిచిపెట్టి తొందరగా వెళ్ళుమని చంద్రునికి తెలిసేలా చాటుతున్నాయా అన్నట్లు కోళ్ళు కూయసాగెను.

**తే.గీ.** **ప్రొద్దు నరదంబు గడపు బల్పులుఁగు ఱేఁడు**
**దమ్మి పూబోఁడి కేలిక దరలి వచ్చు**
**తెఱఁ గెఱింగింపఁ దనవారిఁ దివిరి పనిచె**
**ననఁగ బులుఁగులు గడలఁ గూయంగఁ దొడఁగె** **39**

ప్రొద్దు నరదంబు = సూర్యుని రథమును, కడపు = నడపు, బల్ పులుగు ఱేడు = గొప్ప పక్షిరాజు (అనూరుడు), తమ్మి పూబోడికి = పద్మమనే వనితకు, ఏలిక = ప్రభువగు సూర్యుడు, తరలివచ్చు తెఱగు = బయలుదేరి వస్తున్న విధమును, ఎఱింగింప = తెలుపుటకొరకై, తనవారిన్ = తనజాతివారైన పక్షులను, తివిరి పనిచెన్ అనగ = పూనుకొని పంపించేడా అనునట్లుగా, పులుగులు = పక్షులు, కడలన్ = దిక్కులయందు, కూయంగ తొడగె = కూయుటకు మొదలిడినవి.

**తా :** సూర్యుని రథమును నడపు అనూరుడు పద్మమనే వనితకు ప్రభువగు సూర్యుడు వచ్చు విధమును తెలుపుటకొరకై తనజాతి పక్షులను పంపించినట్లు పక్షులు కూయసాగినవి.

**తే.గీ.** **చివురు చెలికాని చెయ్యుల సేదగొన్న**
**యన్ను మిన్నల సిబ్బెంపుఁ జన్నుఁగవల**

**నలముకొనియున్న చెమ్మట లార్చుకొనుచుఁ**
**బొలిచె వలినాలి పయ్యెర బోద లపుడు** **40**

చివురు విలుకాని = మన్మథునియొక్క, చెయ్వులన్ = చేష్టలచేత, సేదగొన్న = అలసట చెందిన, అన్నుమిన్నల = స్త్రీలయొక్క సిబ్బెంపు చన్నున్ కవలన్ = గుండ్రని స్తనముల జంటను, అలముకొని ఉన్న = వ్యాపించియున్న. చెమ్మట = చెమటను, ఆర్చుకొనుచున్ = ఆరబెట్టుచు, వలి = చల్లని, నాలి పయ్యెర బోదలు = మెల్లని దక్షిణపు పిల్లగాలులు, పొలిచెన్ = వీచెను.

**తా :** మన్మథ చేష్టలచేత అలసిన స్త్రీలయొక్క స్తనముల జంటను అలముకొన్న చెమటను ఆరబెట్టుచు చల్లని మెల్లని దక్షిణ పిల్లగాలులు వీచెను.

**ఆ.వె.** **తొగల యెదురు చుక్క ముగురు వేల్పుల యిక్క**
**జగము విందు తమ్మి ముగుద పొందు**
**కాఁడు వేఁడివేల్పు గాముల యెకిమీఁడు**
**దూర్పు కొండమీఁదఁ దోఁచె నంత** **41**

తొగల ఎదురుచుక్క = కలువలకు విరోధియైనచుక్క (సూర్యుడు), ముగురువేల్పుల యిక్క = త్రిమూర్తులకు స్థానమైనవాడు, జగము విందు = లోకాలకు విందొనరించువాడు, తమ్మి ముగుద పొందుకాడు = పద్మమనుస్త్రీకి ప్రియుడు, వేడివేల్పు = వేడిదైవము, గాముల = గ్రహములకు, ఎకి మీడు = నాయకుడు, తూర్పుకొండ మీదన్ = ఉదయ పర్వతముమీద, తోచెన్ = కనబడెను, అంత–

**తా :** కలువలకు విరోధి, త్రిమూర్తులకు స్థానమైనవాడు, లోకాలకు విందొనరించువాడు, పద్మములకు ప్రియుడు, వేడి దైవము, గ్రహములకు నాయకుడు సూర్యుడు తూర్పుకొండపై కనబడెను. అంతట –

**తే.గీ.** **నిడుద త్రాళ్ళూని బయల నెప్పుడు దిరుగుచుఁ**
**బొసఁగ ముప్పొద్దు ముప్వేసములఁ జెలఁగుచు**
**వెలుఁగు లెల్లెడఁ గాంచుచు నలరు నిర్ల**
**వేఁటకాఁ డప్పు డెంతయుఁ దేట మీఱె** **42**

నిడుద = పొడవైన, త్రాళ్ళూని = కిరణములు కలిగి, బయలన్ = ఆకాశమునందు, ఎప్పుడు తిరుగుచు = ఎప్పుడూ సంచరించుచూ, పొసగన్ = చక్కగా, మూడు పొద్దు = మూడు సంధ్యలందును, మూడు వేసములన్ = త్రిమూర్తుల ఆకృతులతో, చెలగుచు = ఒప్పుచు, వెలుగులు ఎల్లెడ కాంచుచు = కాంతులు అన్ని దిక్కులయందును చూచుచు, అలరున్ = ప్రకాశించునట్టి , ఇర్ల వేటకాడు = చీకటిని వేటాడువాడు (సూర్యుడు), అప్పుడు = ఆ సమయమునందు, ఎంతయున్ = మిక్కిలి, తేట మీఱె = కాంతివంతుడయ్యెను.

**తా :** పొడవైన కిరణములు కలిగి, ఆకాశమున నిత్యమూ సంచరించుచూ, చక్కగా మూడు సంధ్యలయందును త్రిమూర్తుల ఆకృతులతో ఒప్పుచు, అన్ని దిక్కుల కాంతుల నుంచుచు ప్రకాశించు సూర్యుడు అప్పుడు మిక్కిలి కాంతివంతుడయ్యెను.

**మ.** **తొగసూఁ డల్గినఁ దమ్మి ముద్దియకుఁ జేతుల్సాఁచి నిద్దంపు మే**
**ల్జిగి గన్పట్టు మడుంగు దువ్వలువ లిచ్చెన్ గూర్మి నా నంచ జా**
**ల్దిగియె న్నిండు గొలంకు క్రేవలకు బత్తిం బొంగి యచ్చాన యా**
**జగవేల్పుం గొనియాడె నా మొఱసె నిచ్చం దేంట్లు నెత్తమ్ములన్** **43**

తొగసూడు = కలువల విరోధి (సూర్యుడు), అల్గిన = కోపగించిన, తమ్మి ముద్దియకు = తామర కన్యకు, చేతులు సాచి = చేతులను చాచి, నిద్దంపు = స్వచ్ఛమైన, మేలు జిగి కన్పట్టు = మంచి కాంతులతో ప్రకాశించు, మడుంగు దుగ వలువలు = తెల్లని వస్త్రద్వయమును, కూర్మిన్ = ప్రేమతో, ఇచ్చెన్ నా = ఇచ్చెనా యనునట్లు, అంచ జాలు = హంసల సమూహము, నిండు కొలంకు క్రేవలకున్ = నిండు సరస్సుల చేరువకు, దిగియెన్ = దిగినవి, ఆ చాన = ఆ స్త్రీ (పద్మము), బత్తిన్ పొంగి = భక్తితో పొంగిపోయి, ఆ జగవేల్పున్ = ఆ సూర్యుని, కొనియాడె నా = ప్రస్తుతించిందా యనగా, ఇచ్చన్ = కోరికతో, తేంట్లు = తుమ్మెదలు, నెఱ తమ్ములన్ = అందమైన తామరలందు, మొఱసెన్ = ధ్వనించినవి.

**తా :** సూర్యుడు కోపగించిన తామర కన్యకు చేతులను చాచి తెల్లని వస్త్రద్వయమును ప్రేమతో ఇచ్చెనాయన్నట్లు హంసలు సరోవరముల చేరువకు దిగినవి. ఆ పద్మకన్య పొంగిపోయి ఆ సూర్యుని కొనియాడిందా అన్నట్లు తుమ్మెదలు తామరలందు ధ్వనించినవి.

**ఆ.వె.** **అప్పు డదను చెయ్వు లలరించి సత్తి య**
**బ్బయు సుమంత్రుఁ డనఁగఁ బరఁగు ప్రెగ్గ**
**డయును మేల్పనికిఁ గడంగి కూరుపఁదగు**
**సరకు లెల్ల సంతసమునఁ గూర్చి** **44**

అప్పుడు = అప్పుడు, అదను చెయ్వులు = సమయానికి (పట్టాభిషేకానికి)కావలసిన పనులు, అలరించి = చేసి, సత్తి అబ్బయు = శక్తికి తండ్రియు (వశిష్ఠుడు), సుమంత్రుడు అనగ పరగు = సుమంత్రుడు అనబడే, ప్రెగ్గడయును = మంత్రియును, మేల్పనికి గడంగి = మంచి పనియైన రామ పట్టాభిషేకమునకు సిద్ధపడి, కూరుప తగు సరకుల ఎల్లన్ = సిద్ధపరచవలసిన సరుకులన్నిటిని, సంతసమున = ఆనందముగా, కూర్చి = చేర్చి.

**తా :** అప్పుడు పట్టాభిషేకానికి కావలసిన పనులు చేసి వశిష్ఠుడు, సుమంత్రుడు రాముని పట్టాభిషేకమునకు సిద్ధపడి కావలసిన సరుకులన్నిటిని ఆనందముగా కూర్చి.

**కం.** **పుడమి చెలి పట్టి నల్లునిఁ**
**గడు వేడుక తోడఁ గ్రొత్తగా సింగారం**
**బడరించి యెల్లఁ బెద్దలఁ**
**దడయక రావించి వాయిదములు సెలంగన్** **45**

పుడమిచెలి పట్టిని = భూదేవి కుమార్తెయైన సీతాదేవిని, అల్లునిన్ = అల్లుడైన రాముని, కడు వేడుకతోడన్ = మిక్కిలి సంతోషముతో, క్రొత్తగా = సరిక్రొత్తగా, సింగారంబు అడరించి =

అలంకరించి, ఎల్ల పెద్దలన్ = పెద్దలందరిని, తడయక రావించి = ఆలస్యము చేయకుండా రప్పించి, వాయిదములు చెలంగన్ = వాయిద్యములు ధ్వనించుచుండగా –

**తా :** భూదేవి కూతురుని, అల్లుడిని సంతోషంగా, సరిక్రొత్తగా అలంకరించి పెద్దలందరిని ఆలస్యము లేకుండగా రప్పించి వాయిద్యములు ధ్వనించుచుండగా –

**తే.గీ.** **అలరఁ బుట్టువు లేనివాఁ డనెడు పేరఁ**
**గ్రాలు నొడయని కొడుకు చెంగటికిఁ బోయి**
**ఱేఁడ! వేంచేయు మిపుడు నెఱిని జెలంగి**
**నీ యనుఁగుఁ బట్టి దొరనుగాఁ జేయవలయు** **46**

అలరన్ = సంతోషముతో, పుట్టువు లేనివాడు అనెడు పేర గ్రాలున్ = పుట్టుక లేనివాడు అనే పేరున ఒప్పుచున్న (అజుడు దశరధుని తండ్రి – న+జ = పుట్టుక లేనివాడు అని అర్థము), ఒడయని కొడుకు చెంగటికి = రాజు కొడుకు దగ్గరకు, పోయి = వెళ్ళి, ఱేడ = రాజా!, వేం చేయుము = రమ్ము, ఇపుడు = ఇప్పుడు, నెఱిని = అందముగా, చెలంగి = ఉప్పొంగి, నీ అనుగు పట్టిన్ = నీ ప్రియ పుత్రుని, దొరనుగాన్ = రాజునుగా, చేయవలయు = చేయవలసి ఉంది.

**తా :** సంతోషముతో దశరథుని దగ్గరకు వెళ్ళి 'రాజా! రమ్ము. ఇప్పుడు చెలరేగి నీ ప్రియ పుత్రుని రాజునుగా చేయవలసి ఉన్నది'.

**కం.** **మూరుతము డాసె నిదిగో!**
**బారులు కట్టుకొని మేలిపని కన్గొనఁగా**
**గోరి పజ లెల్ల నున్నా**
**రో రాయఁడ! జాగుసేయు టొప్పునె యిటులన్?** **47**

ఓ రాయడ = ఓ రాజా!, ఇదిగో = ఇదిగో విను, మూరుతము డాసె = ముహూర్తము సమీపించింది, మేలి పని = మంచి పనిని (పట్టాభిషేకమును), కను గొనగాన్ = చూచుటకు, కోరి = ఇష్టపడి, పజలు ఎల్లన్ = ప్రజలందరు, బారులు కట్టుకొని = వరుసలు తీరి, ఉన్నారు = ఉన్నారు, ఇటులన్ = ఈ విధముగా, జాగు చేయుట = ఆలస్యము చేయుట, ఒప్పునె = తగునా?

**తా :** ఓ రాజా! ఇదిగో విను. ముహూర్తము సమీపించినది. పట్టాభిషేకమును చూచుటకు ప్రజలందరు బారులు తీరి ఉన్నారు. ఇంక ఆలస్యము చేయుట తగదు.

**తే.గీ.** **అనిన నేమియు నన నోడి యాతఁ డూర**
**కున్నచోఁ గైక వారల నోలిఁ జూచి**
**పలికె వినుఁడిది మీ రాయఁ డెలమిఁ దొంటి**
**మెప్పునకు నేల యెల్ల మా కిప్పు డొసఁగె** **48**

అనిన = అనగా, ఏమియున్ అనన్ ఓడి = ఏమియు మాటాడలేక, ఆతడు = ఆ దశరథుడు, ఊరకున్నచోన్ = మౌనముగా యుండగా, కైక = కైక, వారలన్ = వారిని, ఓలిన్ = క్రమముగా,

చూచి = చూచి, పలికె = పలికెను, ఇది వినుడు = ఈ మాట వినండి, మీ రాయడు = మీ రాజు, ఎలమిన్ = ప్రేమతో, తొంటి మెప్పునకు = పూర్వమిచ్చిన మెచ్చుకోలుకు (వరములకు), నేల ఎల్లన్ = రాజ్యమునంతను, ఇప్పుడు = ఇప్పుడు, మాకు = మాకు, ఒసగెన్ = ఇచ్చెను.

**తా :** అనగా, ఏమియు మాటాడలేక ఆ దశరథుడు ఊరకుండగా, కైక వారిని చూచి పలికెను 'ఇది వినండి. మీ రాజు ప్రేమతో పూర్వమిచ్చిన వరములకుగాను రాజ్యమంతను ఇప్పుడు మాకు ఇచ్చెను.

**కం.** **మోమోటమిచే మీతో**
**నేమియు నన నోపఁడీతఁ డిప్పుడు మీ రా**
**రామునిఁ గానల కనుపుఁడు**
**సేమంబునఁ బుడమి తేనిఁ జేయుఁడు భరతున్** **49**

మోమోటమిచే = చెప్పడానికి మొహమాటపడి, ఈతడు = ఈ రాజు, మీతోన్ ఏమియున్ = మీతో ఏమియును, అనన్ ఓపడు = చెప్పడానికి ఇష్టపడడు, ఇప్పుడు = ఇప్పుడే, మీరు = మీరు, ఆ రాముని = ఆ రాముణ్ణి, క్షేమంబున = చక్కగా, కానలకు = అడవులకు, అనుపుడు = పంపండి, భరతున్ = భరతుణ్ణి, పుడమి తేనిన్ = రాజ్యానికి రాజునుగ, చేయుడు = చేయండి.

**తా :** చెప్పడానికి సిగ్గుపడి ఈ రాజు మీతో ఏమీ చెప్పడానికి ఇష్టపడడు. ఇప్పుడు మీరు ఆ రాముణ్ణి అడవులకు పంపండి. భరతుణ్ణి రాజును చేయండి'.

**చం.** **అనుటయు వారు దల్లడిలి యద్దిఱ! కర్జము దప్పె నిప్పు డి**
**చ్చెనఁటి పొలంతి పల్కు లఱసేయక కైకొని తేఁడు బేలయై**
**పనిఁ జెఱుపం దలంచెఁ జెలి పట్టిన పట్టు మరల్ప నింక నె**
**ట్లనువగు నంచు గాసిలుచు నాపెఁ గనుంగొని పల్కి రిమ్ముగన్** **50**

అనుటయు = అని కైక పలుకగా, వారు = ఆ వశిష్ఠ సుమంత్రులు, తల్లడిలి = అదరిపడి, అద్దిఱ = ఔరా!, కర్జము తప్పెన్ = పని అడ్డం తిరిగింది, ఇప్పుడు = ఈ సమయంలో, ఈ చెనటి పొలంతి = ఈ దుర్మార్గురాలైన స్త్రీ, పల్కులు = మాటలు, తేడు = రాజు, అఱ చేయక = ఆలోచించక, బేలయై = మూర్ఖుడై, కైకొని = స్వీకరించి, పని చెఱుపం తలంచెన్ = పని చెడగొట్టడానికి సిద్ధపడ్డాడు, చెలి పట్టిన పట్టు = కైక పంతమును, మరల్పన్ = మరల్చుటకు, ఇంక ఎట్లు అనువగున్ అంచు = ఇంక ఎలా వీలుపడుతుందా అని, గాసిలుచున్ = బాధపడుచు, ఆపె కనుంగొని = ఆమెను చూసి, ఇమ్ముగన్ = ఇష్టముగా, పల్కిరి = మాట్లాడిరి.

**తా :** అని కైక పలుకగా ఆ వశిష్ఠ, సుమంత్రులు అదరిపడి ఔరా! కథ అడ్డం తిరిగింది. ఇప్పుడు ఈ దుర్మార్గురాలైన కైక మాటలు రాజు మూర్ఖుడై అంగీకరించి పని చెడ గొట్టడానికి సిద్ధపడ్డాడు. కైక పంతం మరల్చడం ఇంక ఎలా వీలుపడుతుందా అని బాధపడుచు ఆమెను చూసి ప్రియముగా పలికిరి.

**కం. కటకట! యో ముద్దియ! నీ**
**కిటువలెఁ బెఱతలఁపు పూని యెకిమీని గలం**
**చుట దగునె? గరితలకుఁ బెని**
**మిటి పలు కరయంగఁ బ్రాఁత మినుకండ్రుఁ గదా! 51**

కటకట = అయ్యయ్యో!, ఓ ముద్దియ = ఓ కాంతా!, నీకు = నీకు, ఇటువలె = ఇలా, పెఱ తలపు = చెడు ఆలోచన, పూని = పొంది, ఎకిమీని = రాజును, కలంచుట = బాధపెట్టుట, తగునె = తగినదేనా?, గరితలకు = స్త్రీలకు, పెనిమిటి పలుకు = భర్త మాట, అరయగ = పరిశీలంపగా, ప్రాత మినుకు = వేద వాక్యము, అండ్రు కదా = అంటారుకదా!

తా : 'అయ్యయ్యో! ఓ కైకా! నీవు ఇలా చెడు ఆలోచన పూని రాజును కలతపెట్టడం తగినదేనా? స్త్రీలకు భర్తమాట వేదవాక్యము అంటారుకదా!

**కం. పున్నియపుఁ జేడియల కత**
**లెన్నఁడుఁ బొత్తములఁ బెద్ద లెఱిఁగింపఁగ మున్**
**విన్నావొ లేదొ? పెనిమిటి**
**కన్నం దెఱవలకు వేఱె కలరే వేల్పుల్! 52**

పున్నియపున్ = పుణ్యవతులగు, చేడియల కతలు = స్త్రీల కథలు, ఎన్నడున్ = ఎప్పుడైనను, పొత్తములన్ = గ్రంథములలోను, పెద్దలు ఎఱిగింపగన్ = పెద్దలు తెలియపరచగాను, మున్ = ఇంతకుముందు, విన్నావొ లేదొ? = వింటివో లేదో?, తెఱవలకు = స్త్రీలకు, పెనిమిటికన్నన్ = భర్తకంటే, వేఱె వేల్పుల్ = ఇతరమైన దైవములు, కలరే = కలరా? (లేరు)

**తా :** పుణ్యవతుల స్త్రీలకథలు ఎప్పుడైనా గ్రంథములలోను, పెద్దలు తెలియపరచగాను ఇంతకుముందు విన్నావో లేదో? స్త్రీలకు భర్తకంటే వేరే వేల్పులు కలరా?

**కం. వగవఁ బనిలేదు లేమికి**
**మొగి నైదువత్రాడు పదిలముగ నెపుడు మెడం**
**దగులుకొని యున్నఁజాలు**
**న్మగఁడే కద తొడవులెల్ల మగువల కెందున్ 53**

లేమికి = దారిద్ర్యమునకు, వగవ పనిలేదు = ఏడవ వలసిన పనిలేదు, ఐదువ = ముత్తైదువుల (మట్టెలు,మంగళసూత్రము,గాజులు,పసుపు,కుంకుమ), త్రాడు = మంగళసూత్రము, మొగిన్ = గట్టిగా, పదిలముగ, తగులుకొనియున్న చాలు = మెడలో ఉంటే చాలును, ఎందున్ = ఎప్పుడైనా, మగువలకు = స్త్రీలకు, తొడవులెల్ల = ఆభరణములన్నియు, మగడే = భర్తయే సుమా!

**తా :** లేమికి వగవ పనిలేదు. ముత్తైదువుల మంగళసూత్రము గట్టిగా, భద్రముగా మెడలో ఉంటే చాలు. ఎప్పుడైనా స్త్రీలకు ఆభరణాలన్నీ భర్తేసుమా!

**తే.గీ. వలవ దెన్నఁడు నీళ్ళలోపల మునుంగఁ**
**బలు తెఱంగుల నుప్పిళుల్ సలుపవలదు**

**పున్నియపు నేలలకు నిచ్చఁ బోవ వలవ**
**దెపుడుఁ బెనిమిటిపై బత్తి యెసఁగు చెలికి** **54**

పెనిమిటిపై, ఎపుడున్ = సతతము (ఎల్లప్పుడు), బత్తి యెసగు = భక్తి కలిగిన, చెలికి = స్త్రీకి, నీళ్ళ లోపల మునుంగన్ = నీటిలో మునిగి స్నానము చేయుట, ఎన్నడు వలవదు = ఎన్నడూ కలుగదు, పలుతెఱంగులన్ = పలు విధములైన, ఉప్పిళుల్ = సాత్వికాహారములు (ఉప్పు మొదలైనవి లేకుండా), సలుపవలదు = చేయ పనిపడదు, ఇచ్చన్ = కావాలని, పున్నియపు నేలలకు = పుణ్య క్షేత్రములకు, పోవ వలవదు = వెళ్ళ పనిలేదు (పైవన్నీ ఒంటరిగ భర్తలు లేని స్త్రీలు చేయకూడని పనులు)

**తా :** భర్తపై భక్తి కలిగిన చెలికి పుణ్యజలాల్లో మునిగి స్నానముచేయవలసిన, పలువిధములైన సాత్వికాహారములు తినవలసిన, పుణ్యక్షేత్రములకు వెళ్ళవలసిన పనిలేదు.

**కం.** **కావున నొడయని కంగదఁ**
**గావింపక తలఁచుకొన్న కర్జం బెల్లన్**
**ఠీవిన్ గొనసాగింపుము**
**పూవుంబోఁడిరో! చలంబుఁ బూనక యెలమిన్** **55**

కావున = కాబట్టి, పూవుంబోడిరో = ఓ కైకా!, ఒడయనికి = ప్రభువైన దశరథునికి, అంగదన్ గావింపక = కష్టము తలపెట్టక, తలచుకొన్న = నీ భర్త తలపెట్టిన, కర్జంబు + ఎల్లన్ = రామ పట్టాభిషేక కార్యమునంతను, చలంబు పూనక = అసూయ చెందక, ఎలమిన్ = సంతోషముతో, ఠీవిన్ = వైభవముగా, కొనసాగింపుము = నిర్వర్తింపుము.

**తా :** కాబట్టి ఓ కైకా! ప్రభువుకు కష్టము తలపెట్టక, నీ భర్త తలపెట్టిన పట్టాభిషేక కార్యమును అసూయ చెందక సంతోషముతో వైభవముగా నిర్వర్తింపుము.

**కం.** **ఆ పొల మేపరి సూ డిపు**
**డీ పుడమికి రాయఁడగుచు నెసఁగిన యెడలన్**
**నీ పట్టియు దొరగాఁడే?**
**చూపోపక కీడుఁ దలఁపఁ జొప్పడునె మదిన్?** **56**

ఆ పొలమేపరి సూడు = ఆ రాక్షసుల విరోధియగు రాముడు, ఇపుడు, ఈ పుడమికి రాయడగుచు = ఈ కోసల రాజ్యమునకు రాజగుచు, ఎసగిన యెడలన్ = ఒప్పినట్లయితే, నీ పట్టియు దొరగాడే = నీ కొడుకు భరతుడును ప్రభువు కాడా! చూపోపక = సంహించలేక, మదిన్ = మనసునందు, కీడున్ దలపన్ = ఆపదను తలంచుట, చొప్పడునె = తగునా?

**తా :** ఆ రాక్షస విరోధియగు రాముడు ఈ కోసల రాజ్యానికి రాజయితే నీ కొడుకు భరతుడు ప్రభువుకాడా! సహించలేక మనసులో కీడు తలపెట్టుట తగదు'.

**ఆ.వె.** **అనిన నలికి కలికి యహహా! మేల్మిమాట**
**లీఁటె లగుచుఁ జెవుల నాటుకొనియె**

**నింకఁ గాని కఱద లేమియుఁ దెల్పక**
**చనుఁ డటన్న బిగువు సడలి వారు** **57**

అనినన్ = అనగా, కలికి = కైక, అలికి = కోపించి, అహహ = ఆహా!, మీ మాటలు = మీరు ఇపుడన్న మాటలు, మేలు = చాల బాగున్నవి, ఈటెలగుచున్ = ఈటెలయి, చెవుల = నా చెవులందు, నాటుకొనియె = నాటుకొన్నవి. ఇంకన్ = ఇకమీదట, కాని కఱదలు = కాని బుద్ధులు, ఏమియు తెల్పక = ఏమీ చెప్పక, చనుడు = వెళ్ళండి, అటన్న = అని పలుకగా, వారు = ఆ వశిష్ఠ, సుమంత్రులు, బిగువు సడలి = ధైర్యము తగ్గి.

**తా :** అనగా, కైక కోపించి 'ఆహా! మీ మాటలు చాల బాగున్నవి. ఈటెలయి నా చెవులందు నాటుకొన్నవి. ఇంక కాని బుద్ధులు చెప్పక వెళ్ళండి' అని పలుకగా ఆ వశిష్ఠ, సుమంత్రులు ధైర్యము తగ్గి.

**తే.గీ.** **వెల్లనైయున్న నత్తెఱంగెల్ల నెఱిఁగి**
**రాచచిన్నెలు సడలించి రఘువు కొలపు**
**సామి వెలినారచీరలు జడలు దాల్చి**
**తపసి రూపూని యచటికిఁ దరలి వచ్చి** **58**

వెల్లనైయున్నన్ = నిశ్చేష్టులైయుండగా, ఆ+తెఱంగెల్ల = ఆ విషయమునంతను, ఎఱిగి = తెలుసుకొని, రఘువు కొలపు సామి = రఘురాముడు, రాచ చిన్నెలు = రాజ చిహ్నాములు, సడలించి = విడచిపెట్టి, వెలినారచీరలు = తెల్లని నారచీరలు, జడలు = జడలను, తాల్చి = ధరించి, తపసి రూపూని = ముని వేషముతో, అచటికిన్ = ఆ కైక యింటికి, తరలి వచ్చి = బయలుదేరి వచ్చి.

**తా :** నిశ్చేష్టులైయుండగా ఆ విషయము తెలుసుకొని రఘురాముడు రాజ చిహ్నాములు విడిచిపెట్టి నారచీరలు, జడలు ధరించి మునివేషముతో కైక ఇంటికి బయలుదేరి వచ్చి –

**కం.** **పినతల్లిం బొడఁగని క**
**మ్మని పలుకుల నిట్టులనియె మము నేదఁగ నో**
**పినతల్లీ! నీ డెందం**
**బున నటువలె లాఁతితనము బూఁనఁగ జనునే?** **59**

పినతల్లిన్ = పినతల్లియగు కైకను, పొడగని = చూచి, కమ్మని పలుకుల = మృదువైన మాటలతో, ఇట్టులనియె = ఇట్లు పలికెను, ఓ పినతల్లీ = ఓ పిన్నమ్మా!, నీ డెందంబునన్ = నీ మనసులో, మమున్ ఏదగన్ = మమ్మల్ని సందేహిస్తూ, అటువలె = ఆ విధముగా, లాతితనము = పరాయి భావన, పూనగన్ = వహించుట, చనునే = తగునా?

**తా :** పినతల్లియగు కైకను చూచి మృదువైన మాటలతో పలికెను 'ఓ పినతల్లీ! నీ మనసులో మమ్మల్ని సందేహిస్తూ పరాయిభావన వహించుట తగదు.

**కం.** **ఓ యమ్మ! యిట్టి లఱమఱ**
**సేయంగా నేల? నీవు సెప్పిన చెయ్యి**

**త్రోయంగా నేర్తుమె? యిఁక**
**నీ యానతిఁ గడవఁ బోము నీ యాన సుమీ! 60**

ఓ అమ్మ = ఓ తల్లీ!, ఇట్టులు = ఈ విధముగా, అఱమఱ = సంశయము, చేయంగా నేల = చేయుట ఎందులకు?, నీవు చెప్పిన = నువ్వు ఆదేశించిన, చెయ్వులు = పనులు, త్రోయంగాన్ = దూరము పెట్టుటను, నేర్తుమె = ఎఱుగుదుమా?, ఇక = ఇంక, నీ యానతి = నీ ఆజ్ఞను, కడవ బోము = దాటము, నీ ఆన సుమీ = నీమీద ఒట్టు సుమా!

**తా :** ఓ తల్లీ! ఇలా భేదములు చేయుట ఎందులకు? నువ్వు ఆదేశించిన పనులు దూరముపెట్టుట ఎఱుగుదుమా? ఇంక నీ యాజ్ఞను దాటము. నీ మీద ఒట్టు సుమా!

**తే.గీ. ఒనరఁ దలిదండ్రు లెలమితోఁ బనుపుదురఁట**
**తోడఁబుట్టువు పుడమికి దొరయగునఁట**
**పున్నియఁపు నేల లొగిఁ గాంచఁ బోవుటయఁట**
**మెలఁత! మఱి యింతకంటెను మేలు గలదె? 61**

మెలత = అమ్మా!, తలిదండ్రులు = తల్లిదండ్రులు, ఒనరన్ = చక్కగా, ఎలమితో = ప్రేమతో, పనుపుదురట = పంపిస్తారట, తోడ పుట్టవు = సోదరుడు, పుడమికి = ఈ రాజ్యమునకు, దొరయగునట = రాజవుతాడట, పున్నియపు నేలలు = పవిత్ర ప్రదేశములు, ఒగిన్ = క్రమముగా, కాంచన్ పోవుటయట = చూచుటకు వెళుతున్నానట, మఱి = ఇంక, ఇంతకంటెను = ఇంతకు మించి, మేలు కలదె = మంచి ఉందా?

**తా :** అమ్మా! తలిదండ్రులు ప్రేమతో పంపిస్తారట, సోదరుడు రాజ్యానికి రాజవుతాడట, పవిత్ర ప్రదేశములు క్రమంగా చూడ్డానికి వెళుతున్నానట ఇంతకు మించి మేలుందా?

**కం. తలఁపఁగ జగమునఁ గల వే**
**ల్పులు సంగడికాండ్రుఁ జుట్టములు మఱి సెప్పం**
**గలవార లెందఱేనియుఁ**
**దలిదండ్రుల కెన యొనర్పఁ దగుదురె యెందున్ 62**

తలపగన్ = ఆలోచింపగా, జగమునన్ కల = లోకములోనున్న, వేల్పులు = దేవతలు, సంగడి కాండ్రు = స్నేహితులు, చుట్టములు = బంధువులు, మఱిన్ = ఇంకను, చెప్పంగలవారు = హితమును చెప్పగలవారు, ఎందఱేనియు = ఎంతమందైనను, ఎందున్ = ఎప్పుడైనా, తలిదండ్రులకు = తల్లి తండ్రులకు, ఎన యొనర్పన్ = సాటియని చెప్పుటకు, తగుదురె = సరిపోతారా?

**తా :** ఆలోచింపగా లోకములోనున్న దేవతలు, స్నేహితులు, బంధువులు ఇంకా చెప్పగలవారు ఎంతమందైనా ఎప్పుడైనా తల్లిదండ్రులకు సాటి అని చెప్ప తగుదురె?

**తే.గీ. అట్లు గావున యిపుడు మీ యాన బత్తి**
**దవిలి యొనరింతునని యటఁదరలి తనదు**
**తల్లి కడకేఁగి యత్తెఱంగెల్లఁ దెలిపి**
**యడుగులకు మ్రొక్కుటయు నాతి యతనిఁ జూచి 63**

అట్లు కావునన్ = ఆ కారణమున, ఇపుడు = ఇప్పుడు, మీ యానన్ = మీ ఆజ్ఞను, బత్తి తవిలి = భక్తితో స్వీకరించి, ఒనరింతునని = చేస్తానని, అట దరలి = అక్కడినుండి వెళ్లి, తనదు = తనయొక్క, తల్లి కడకేగి = తల్లి దగ్గఱకు వెళ్లి, అత్తెఱంగెల్ల = అక్కడ జరిగిన విషయమునంతను, తెలిపి = చెప్పి, అడుగులకు మ్రొక్కుటయు = పాదములకు నమస్కరింపగా, నాతి = స్త్రీ (కౌసల్య), అతని చూచి = రాముని చూసి –

**తా :** ఆ కారణమున ఇప్పుడు మీ ఆజ్ఞను భక్తితో స్వీకరించి చేస్తాన'ని అక్కడినుంచి తన తల్లిదగ్గరకు వెళ్ళి జరిగిన విషయమును చెప్పి నమస్కరింపగా, కౌసల్య రాముని చూచి –

**కం.** **కటకట! బిడ్డఁడ! కోరిక**
**లటమటలై చనియె నిప్పు డద్దిఱ తా నొ**
**క్కటిఁ దలఁచిన దయ్యం బొ**
**క్కటిఁ దలంచు నఁటన్నమాట కదు బెడఁగగుచున్** **64**

కటకట = అయ్యయ్యో, బిడ్డడ = కుమారా!, కోరికలు = నా కోరికలు, ఇప్పుడు = ఇప్పుడు, అటమటలై చనియెన్ = వ్యర్థములైపోయాయి, అద్దిఱ = అంతేలే!, తాను = తాను, ఒక్కటి తలచిన = ఒకటి ఊహించుకొనగా, దయ్యంబు = దైవము, ఒక్కటి తలచునట = దైవం వేరొకటి తలుస్తాడట, అన్నమాట = అని ఉన్న మాట, కడున్ = మిక్కిలి, బెడగగుచున్ = ఎక్కువగుచూ –

**తా :** అయ్యయ్యో! కుమారా! నా కోరికలు ఇప్పుడు వ్యర్థములై పోయాయి. అంతేలే! 'తానొకటి తలచిన దైవమొకటి తలచునట' అని ఉన్నమాట మిక్కిలి సత్యమగుచూ –

**కం.** **పుడమిఁ దన కన్న కొడుకున**
**కడుగుకొనియెఁ గాక కైక యహహా! నినుం గా**
**ఱడవులకుఁ బనుపు మనుచున్**
**నుడువఁగ నెప్పగిదిఁ దనకు నోరాడెనొకో!** **65**

అహహ = అయ్యో, కైక = ఆ కైక, పుడమిన్ = రాజ్యమును, తన కన్న కొడుకునకు = తన కన్నకొడుకైన భరతునకు, అడుగుకొనియె కాక = అడుక్కోవచ్చును కాని, నినున్ = నిన్ను, కాఱడవులకు = ఘోర అరణ్యములకు, పనుపు మనుచున్ = పంపమని, నుడువగ = పలకడానికి, తనకు = ఆమెకు, ఏపగిదిన్ నోరాడెనొకో = నోరెలా వచ్చిందో కదా!

**తా :** అయ్యో! ఆ కైక రాజ్యమును తన కన్నకొడుకుకు అడుక్కోవచ్చును కాని నిన్ను ఘోర అరణ్యములకు పంపుమని పలకడానికి ఆమెకు నోరెలా వచ్చిందో కదా!

**తే.గీ.** **సవతితన మూని యిట్టు లయ్యువిద పలుక**
**నటులె తానును డెందంబు దిటము పఱచు**
**కొని యయో! నినుఁ గానల కనుపు కొనఁగ**
**దండ్రి యేచందమున నఱఁ దలఁచెఁ జెపుమ!** **66**

అయో = అయ్యో!, సవతితన మూని = సవతుల సహజ లక్షణమును పొంది, ఇట్టులు = ఈ ప్రకారంగా, ఆ యువిద = ఆ స్త్రీ (కైక), పలుక = పలుకగా, తండ్రి = దశరథుడు, అటులె = అంగీకరించి, తానును = తానుకూడా, డెందంబు = మనసును, దిటము పఱచుకొని = కఠినము చేసుకొని, నినున్ = నిన్ను, కానలకు = అడవులకు, అనుపు కొనగన్ = పంపుకొనుటకు, ఏ చందమున = ఏ ప్రకారంగా, అఱన్ తలచె = కీడుతలచాడో, చెపుమ = చెప్పుము.

**తా :** అయ్యో! సవతుల సహజ లక్షణము పూని ఇలా ఆ కైక పలుకగా నీ తండ్రి అంగీకరించి తానుకూడా మనసును కఠినముచేసుకొని నిన్ను కానలకు పంపడానికి ఏ ప్రకారంగా కీడు తలచాడో చెప్పు. –

**కం.** **అజ్జోటియు నొడయఁడు నీ**
**పజ్జం గనికరము మాలి పనిగొల్పినచో**
**నిజ్జాడ మీకుఁ దగదని**
**యొజ్జయుఁ బ్రగ్గడలు నాడకుండిరె వారిన్? 67**

ఆ జోటియున్ = ఆ కైకయును, ఒడయడున్ = ప్రభువును, నీ పజ్జన్ = నీయందు, కనికరము మాలి = దయ లేక, పనిగొల్పినచోన్ = ఆజ్ఞాపింపగా, ఈ జాడ = ఈ పద్ధతి, మీకు తగదని = మీలాంటివారికి పనికిరాదని, ఒజ్జయున్ = గురువగు వశిష్ఠుడును, ప్రగ్గడలు = మంత్రులును, వారిని = వారితో, ఆడకుండిరె = పలుకకున్నారా?

**తా :** ఆ కైక అయినా ప్రభువును నీయందు దయలేక ఆజ్ఞాపింపగా, ఈ పద్ధతి మీకు తగదని గురువగు వశిష్ఠుడు, మంత్రులును ఆ కైకను, దశరథుని పలుకకున్నారా?

**కం.** **గడియయ యేఁడగు మును నినుఁ**
**బొడఁగానక యున్న యెడలఁ బొలుపరి నీ వి**
**ట్లెడబాసి దవ్వు చనుచోఁ**
**గొడుకా! యిఁకనెట్లు తాళుకొనఁగలఁ జెపుమా? 68**

కొడుకా = కుమారా!, మును = తొలినుంచీ, నినున్ = నిన్ను, పొడ కానక యున్న యెడల = చూడకుండినచో, గడియయ = ఒక్క గడియ కాలమే, ఏడగున్ = ఏడాదిగా కనబడును, పొలుపు అరి = స్థైర్యము లేక, నీవు = నీవు, ఇట్లు = ఈ రీతిగా, ఎడబాసి = నన్ను విడచి, దవ్వు = దూరము, చనుచోన్ = వెళితే, ఇకన్ = ఈ పైన, ఎట్లు = ఏ విధముగా, తాళుకొనగలన్ = తట్టుకోగలను, చెపుమా = చెప్పుము?

**తా :** కుమారా! తొలినుంచీ నిన్ను చూడకున్నచో ఒక్క గడియకాలమైనా ఏడాదిగా కనబడుతుంది. స్థైర్యములేక నీవు ఇలా నన్ను విడిచి దూరం వెళితే ఎలా తట్టుకోగలను చెప్పు

**తే.గీ.** **అనుచు నడలెడు తల్లి నూరార్చి యంప**
**దొనలు విల్లును గైకొని చనఁదలంచు**
**నెడల నడ్డంబుగా వచ్చి పుడమి కాన్పు**
**వలపు గులుకంగ మెల్లనఁ బలికె నపుడు 69**

అనుచున్ = అని ఈ ప్రకారంగా, అడలెడు = దుఃఖించుచున్న, తల్లిన్ = తల్లిని, ఊరార్చి = ఓదార్చి, అంప దొనలు = అమ్ముల పొదులను, విల్లును = వింటిని, గైకొని = తీసుకొని, చనన్ = వెళ్ళుటకు, తలంచు = సిద్ధపడుచున్న, ఎడలన్ = సమయమునందు, అపుడు = అప్పుడు, పుడమి కాన్పు = భూ పుత్రి (సీత), అడ్డంబుగా వచ్చి = అడ్డుగా నిలబడి, వలపు కులుకంగ = ప్రేమతో, మెల్లనన్ = నెమ్మదిగా, పలికె = పలికెను.

**తా :** అంటూ దుఃఖిస్తున్న తల్లిని ఓదార్చి అమ్ముల పొదులను, వింటిని తీసుకొని చన సిద్ధపడుచున్న సమయమున సీత అడ్డుగా నిలబడి ప్రేమతో నెమ్మదిగా పలికెను.

**ఆ.వె.** **ఎమ్మెకాఁడ! యగ్గి యెలగాఁగఁ బెండిలి**
**యైన చెలిని డించి యకట యొంటి**
**నేఁగఁదగునె? మీర లెఱుఁగని నడవడు**
**లింకఁ బుడమిఁ గలవె యేర్పరింప?** **70**

ఎమ్మెకాడ = మనోహరుడా! అగ్గి ఎలగాగ = అగ్నిసాక్షిగా, పెండిలి యైన = పెళ్ళాడిన, చెలిని = భార్యని, డించి = విడచి, ఒంటిన్ = ఒంటరిగా, ఏగ తగునె = వెళ్ళుట న్యాయమా?, అకట = అయ్యో, మీరలు ఎఱుగని = మీకు తెలియని, నడవడులు = ప్రవర్తనలు (ధర్మములు), ఇంకన్ = ఇంకనూ, పుడమిన్ = ఈ భూమియందు, ఏర్పరింపన్ = వేరుగా చెప్పుటకు, కలవె = ఉన్నాయా?

**తా :** మనోహరుడా! రామా! అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్యను విడచి ఒంటరిగా వెళ్ళుట న్యాయమా? అయ్యో! మీకు తెలియని ధర్మములు ఈ నేలలో వేరే చెప్పుటకు ఉన్నాయా?

**తే.గీ.** **మేలుగలనాఁడు మురియుచు మెసవ నేర్చి**
**గొడవ లొదవెడు తఱిఁ బోవ విడువఁ దగునె?**
**తలఁప నుసురుల యొడయఁడై తనరు మగని**
**వెర వెఱింగిన నాడెంపు వెలఁదుకలకు** **71**

మేలుగల నాడు = మంచిగా జరిగిన రోజున, మురియుచు = ఆనందముగా, మెసవ నేర్చి = అనుభవించుట తెలిసి, గొడవలు ఒదవెడు తఱిన్ = సమస్యలు వచ్చిన సమయమున, తలపన్ = ఆలోచింపగా, ఉసురుల యొడయడై = ప్రాణనాధుడై, తనరు = ఒప్పునట్టి, మగని = భర్తను, వెరవు ఎఱింగిన = పద్ధతి తెలిసిన, నాడెంపు వెలదుకలకు = శ్రేష్టులైన స్త్రీలకు, పోవ విడువన్ = వెళ్ళుటకు అంగీకరించుట, తగునె = తగునా? (కూడదు)

**తా :** మంచిగా జరిగిన రోజున ఆనందంగా అనుభవించటం తెలిసి, సమస్యలు వచ్చిన సమయమున పతివ్రతలకు ప్రాణనాధుని వెళ్ళుటకు అంగీకరించుట తగునా?

**ఉ.** **ఉడుగక బుత్తి, ముత్తులిడ నోపి యొడళ్ళఱలేక యుండఁగాఁ**
**గడు నెదలోఁ దలంచుకొని గాటపు మక్కువఁ బ్రోదిసేయు న**
**య్యొడయనిఁ బాసి యాగడపు టోజలఁ ద్రిమ్మరునట్టి గట్టి వా**
**పడఁతుక యెయ్యడం దలకుఁబాసిన వెంద్రుకగాదె యెన్నఁగన్** **72**

ఉడుగక = మానక, బుత్తి, ముత్తులు ఇడన్ = భుక్తి, ముక్తి ఇవ్వడానికి, ఓపి = సమర్థుడై, ఒడళ్ళు = శరీరములు, అఱలేక యుండగాన్ = ఏ కొఱత లేక యుండగా (ఆభరణ, అలంకారాది విశేషము), కడున్ = ఎక్కువగా, ఎదలో = మనసులో, తలంచుకొని = ఊహించుకొని, గాటపు మక్కువన్ = అధికమైన ప్రేమతో, ప్రోది చేయు = పోషించు, ఆ యొడయని = ఆ నాథుని, పాసి = విడచి, ఆగడము ఓజలన్ = అల్లరి చేష్టలతో, త్రిమ్మరునట్టి = తిరిగేటటువంటి, గట్టివాయి పడతుక = ఎక్కువగా నోరున్న ఆడది (గయ్యాళి), ఎయ్యెడన్ ఎన్నగన్ = ఏవిధంగా చూచినా, తలకున్ = తలనుండి, పాసిన = విడిచిన, వెంద్రుకగాదె = వెంద్రుకే కదా!(విలువ లేనిదే కదా!)

**తా :** మానక భుక్తి, ముక్తి ఇవ్వడానికి ఓపి, దేహమున కేకొరత లేకుండా అధికమైన ప్రేమతో పోషించు నాథుని విడచి అల్లరిచేస్టలతో తిరిగే గయ్యాళి ఏవిధంగాచూసినా తలనుంచి రాలిన వెంట్రుకే కదా!

**ఆ.వె.** **మగనితోడ నెలమిఁ దగిలి ముత్తయిదువ**
**పోణిమిని గరంబు రాణఁ బొసగు**
**చున్న నాఁడె కాక యన్నుల కటమీఁద**
**నెన్నఁడైన నెమ్మి యింత కలదె?** **73**

మగనితోడన్ = భర్తతో, ఎలమిన్ తగిలి = సంతోషముతో ఉండి, ముత్తయిదువ = పుణ్య స్త్రీ, పోణిమిని = చక్కగా, కరంబున్ = మిక్కిలి, రాణ పొసగు చున్ననాడె కాక = వైభవమును పొందు చున్ననాడే కాని, అన్నులకు = స్త్రీలకు, అట మీద = ఆ పతి లేనినాడు, నెమ్మి = సంతోషము, ఎన్నడైన = ఏనాడైనను, ఇంత = ఇంతగా, కలదె = ఉన్నదా? (ఉండదు)

**తా :** భర్తతో ముత్తయిదువ చక్కగా వైభవమును పొందుచున్ననాడే కాని ఆ పతి లేనినాడు స్త్రీలకు ఏనాడైనా సంతోషము ఉన్నదా?

**ఆ.వె.** **అట్టులగుటఁజేసి యరగడియయుఁ దాళఁ**
**జాల నిన్నుఁ బాసి నేలఱేఁడ!**
**మాఱుమాట లుడిగి కాఱియఁ బెట్టక**
**తోడుకొని కడంకతోడఁ జనుము** **74**

నేల ఱేడ = ఓ భూభర్తా!, అట్టు లగుటన్ చేసి = ఆ ప్రకారంగా అగుటచేత, అరగడియయు = అర గడియయైనా, నిన్నున్ పాసి = నిన్ను విడచి, తాళ జాల = ఉండలేను. మాఱుమాట లుడిగి = వేరు మాటలు చెప్పక, కాఱియ పెట్టక = నా మనసు కష్టపెట్టక, కడంకతోడన్ = పూనికతో, తోడుకొని చనుము = తీసుకొని వెళ్ళుము.

**తా :** ఓ భూభర్తా! అరగడియయైనా నిన్ను విడచి ఉండలేను. మాఱుమాటలు చెప్పక, నా మనసు కష్టపెట్టక తీసుకొని వెళ్ళు.

**కం.** **అనవుడు నబ్బల్లిదుఁ డా**
**ననబోఁడుల మిన్నఁ జూచి నగి యిట్లనియెన్**

**బెను గానలఁబడి చెలులకుఁ**
**జనఁ జనునే వెఱపుమాలి చక్కెరబొమ్మా? 75**

అనవుడు = అని సీత అనగా, ఆ బల్లిదుడు = ఆ శూరుడు, ఆ ననబోడుల మిన్నన్ చూచి= ఆ స్త్రీరత్నమును చూసి, నగి = నవ్వుచూ, ఇట్లనియెన్ = ఇట్లు పలికెను, చక్కెరబొమ్మా = పంచదార బొమ్మా!, చెలులకున్ = స్త్రీలకు, వెఱపుమాలి = భయములేక, పెనుకానలబడి = కారడవులలోపడి, చనన్ = వెళ్ళుట, చనునే = తగునా?

**తా :** అని సీత అనగా ఆ శూరుడు ఆ సీతను చూసి నవ్వుచూ పలికెను 'చక్కెరబొమ్మా! స్త్రీలకు భయములేక కారడవులలోపడి వెళ్ళుట తగునా?

**కం. నగువారి నెల్లఁ దలఁపక**
**మగువా! మగవారి వెంట మచ్చికతో రాఁ**
**దగవా? పగవాఁడనె నినుఁ**
**దిగనాడి చనంగా లాఁతి తెఱఁగెన్నుదురే? 76**

మగువా = ఓ కామినీ!, నగువారిని నెల్లన్ = పరిహసించేవారినందరిని, తలపక = తలంచక, మచ్చికతో = మోహంతో, మగవారివెంట = మగవారి వెంట, రాన్ తగవా = వచ్చుట న్యాయమా?, నినున్ = నిన్ను, దిగనాడి చనంగా = విడచి వెళ్ళగా, పగవాడినె = నీకు విరోధినా?, లాతి తెఱగు = (ప్రజలు)వేరొక విధముగా, ఎన్నుదురే = అనుకుంటారా? (అనుకోరు).

**తా :** ఓ మగువా! పరిహసించేవారిని తలంచక మోహంతో మగవారివెంట వచ్చుట న్యాయమా? నిన్ను దిగనాడి వెళ్ళుటకు నేను విరోధినా? ప్రజలు వేరొకవిధంగా అనుకుంటారా?

**సీ. చెలిమితో నాడంగ జింక కూనలు గావు**
**గద్దఱి కొదమ సింగములు గాని**
**కులుకుచుఁ బలికింపఁ జిలుక బారులు గావు**
**దుగ మొగంబుల పుల్గు తెగలు గాని**
**వలపుతోఁ బెనుప జవాది పిల్లులు గావు**
**బలితంపుఁ బొగరు బెబ్బులులు గాని**
**కయిసేయఁ బువ్వు దీవియ పందిరులు గావు**
**పొదలు జొంపపుఁ గాఱుపొగలు గాని**

**తే.గీ. గొండ్లి సలుపంగ ననుఁగుఁ బూబోండ్లు గారు**
**తులువ పొలయోగిరపు పొలంతుకలు కాని**
**గోల లెచ్చట? గాటంపుఁ గోన లెచట?**
**వలవ దుడుగుము పయనంబుఁ దలిరుబోడి! 77**

తలిరుబోడి = చిగురుటాకువంటి మేనుగలదానా!, గద్దఱి = గడిదేరిన, కొదమ సింగములు కాని = సింహము కిశోరములు కాని, చెలిమితోన్ = స్నేహముతో, ఆడంగన్ = ఆటలాడుటకు,

జింక కూనలు కావు, దుగమొగంబుల = రెండు ముఖములుగల, పుల్గు తెగలు గాని = గండభేరుండ పక్షిసమూహములు కాని, కులుకుచున్ = కులుకులాడుతూ, పలికింపన్ = పలుకులు నేర్పుటకు, చిలుక బారులు కావు = చిలుకల గుంపులు కావు, బలితంపు = బలిసిన, పొగర = పొగరైన, బెబ్బులులు కాని = పెద్దపులులే కాని, వలపుతోన్ = ఆసక్తితో, పెనుపన్ = పెంచుటకొనుటకు, జవాది పిల్లులు కావు = కస్తూరి మృగములు కావు, పొదలు = అంతటా వ్యాపించిన, జొంపపు = పొదలయొక్క, కాఱు పొగలు కాని = దట్టమైన పొగలే కాని, కయిసేయన్ = పోషణ చేయుటకు, పువ్వు తీవియ = పూల తీగల, పందిరులు కావు = పందిళ్ళు కావు, తులువ = దుష్టులైన, పొల యోగిరపు = మాంస భక్షకులైన, పొలంతుకలు కాని = రాక్షస స్త్రీలు కాని, గొండ్లి సలుపంగన్ = వలయాకార నాట్యము సలుపుటకు, అనుగు పూబోండ్లు కారు = చెలికత్తెలు కారు, గోలలు = ముద్దరాండ్రు (స్త్రీలు), ఎచ్చట = ఎక్కడ?, గాటంపు = దట్టమైన, కోనలు = అడవులు, ఎచట = ఎక్కడ?, వలవదు = వద్దు, పయనంబు = నీ ప్రయాణమును, ఉడుగుము = మానుము.

**తా :** ఓ సీతా! అరణ్యములో స్నేహముతో ఆటలాడుటకు సింహము పిల్లలు కాని జింక పిల్లలుండవు. గండభేరుండ పక్షులు కాని కులుకుతూ పలుకులు నేర్పుటకు చిలుకల గుంపులుండవు. పెద్దపులులే కాని పెంచుకొనుటకు కస్తూరి మృగములుండవు. పొదల కారుపొగలే కాని పూలతీగల పందిళ్ళుండవు. దుష్టులైన రాక్షసస్త్రీలే కాని ఆటలాడుటకు చెలికత్తెలుండరు. సుకుమారులైన స్త్రీలెక్కడ? దట్టమైన అడవులెక్కడ? వద్దు, నీ ప్రయాణం మాను.

**కం.** **వల నొదవని పని యగుటం**
**బలికితి రావలవదనుచుఁ బరికింపఁగ నో**
**యెలదీవఁబోఁడి! నిన్నుం**
**గలలోపలనైనఁ బాయఁగలనే? చెపుమా! 78**

ఓ ఎల తీవ బోడి = ఓ లేత తీగవలె మృదువైన దేహముకలదానా!, వలను ఒదవని = అవకాశము లేని, పని యగుటన్ = పని కావున, రా వలదనుచు = రా తగదనుచు, పలికితి = పలికితిని, పరికింపగ = ఆలోచింపగా, నిన్నున్ = నిన్ను, గలలోపలనైనన్ = కలలోనైనను, పాయగలనే = విడువగలనా?, చెపుమా = చెప్పుము.

**తా :** ఓ సీతా! అవకాశము లేని పని కావున రావలదని పలికితిని. ఆలోచింపగా నిన్ను కలలోనైనా విడువగలనా? చెప్పు.

**కం.** **అని యిట్టు లెన్ని సెప్పిన**
**విన నొల్లక కలువకంటి వెగటొదవఁగఁ బ**
**ల్కినఁ దలఁకుచు వెంటం దో**
**డ్కొని చనుటకు నాతఁ డియ్యకొని యుండుటయున్ 79**

అని ఇట్టులు = అని ఈ ప్రకారంగా, ఎన్ని సెప్పిన = ఎంతగా చెప్పినా, విన నొల్లక = వినుటకు ఇష్టపడక, కలువకంటి = కలువల వంటి కన్నులుగల సీత, వెగటొదవగన్ =

వెటకారంగా, పల్కిన = పలుకగా, ఆతడు = ఆ రాముడు, తలకుచు = బాధనందుచూ, వెంటం తోడ్కొని చనుటకు = కూడబెట్టుకొని వెళ్ళుటకు, ఇయ్యకొని యుండుటయున్ = అంగీకరించుటయును.

**తా :** అని ఇట్లు ఎంతగా చెప్పినా వినని సీత వికటంగా పలుకగా, రాముడు బాధపడుచూ కూడబెట్టుకొని వెళ్ళుటకు అంగీకరించుటయును –

**తే.గీ.** **అత్తలకు మ్రొక్కి వారల యనుమతిఁ గొని**
**జానొదవఁ జెల్మిబోఁటులఁ జాలఁ గూర్మి**
**తోడఁ గవుఁగిటఁ బెనఁచి యా తొడవు తొడవు**
**నెమ్మిఁ బెనిమిటి దరిఁ జేరి నిలుచు నెడను** **80**

ఆ తొడవు తొడవు = ఆ భూషణములకే భూషణమైన సీత, అత్తలకు మ్రొక్కి = అత్తగార్లకు నమస్కరించి, వారల = వారియొక్క అనుమతి కొని = అంగీకారాన్ని పొంది, జానొదవన్ = అందముగా, చాల కూర్మితోడ = చాలా ప్రేమతో, చెల్మిబోటులన్ = చెలికత్తెలను, కవుగిట పెనచి = కౌగలించుకొని, నెమ్మిన్ = నెమ్మదిగా, పెనిమిటి దరి చేరి, నిలుచు నెడను = నిలబడు సమయమున.

**తా :** ఆ భూషణములకే భూషణమైన సీత అత్తగార్లకు మ్రొక్కి, వారి అనుమతి పొంది చాల ప్రేమతో చెలికత్తెలను కౌగలించుకొని నెమ్మదిగా భర్తనుచేరి నిలబడగా –

**కం.** **లక్కుమనుఁడు సింగాణియు**
**నక్కజపుం దొనలు బూని యరుదెంచి కడున్**
**మ్రొక్కులిడియున్న నాతని**
**మక్కువ కెదలోన నలరి మఱి యప్పిదపన్** **81**

లక్కుమనుడు = లక్ష్మణుడు, సింగాణియున్ = ధనుస్సును, అక్కజపున్ దొనలు = ఆశ్చర్యము గొల్పు అమ్ములపొదులను, పూని = ధరించి, అరుదెంచి = వచ్చి, కడున్ = మిక్కిలి, మ్రొక్కు లిడియున్న = నమస్కరించి యుండగా, ఆతని = ఆ లక్ష్మణుని, మక్కువకు = ప్రేమకు, ఎద లోనన్ = మనసులో, అలరి = సంతసించి, మఱి = ఇంకను, ఆ పిదపన్ = ఆ తరువాత,

**తా :** లక్ష్మణుడు ధనుస్సును, అమ్ములపొదులును పూని వచ్చి అణకువతో నమస్కరించగా ఆ లక్ష్మణుని ప్రేమకు మనసులో సంతసించి, ఇంక ఆ తరువాత –

**తే.గీ.** **తమ్ముఁడును గేస్తురాలును దాను నగరు**
**వెడలి యమ్మేటి దమ వీటి నడిమిత్రోవఁ**
**జనుచు నుండెడిచోఁ గనుంగొనుచునుండి**
**యెల్లవారలు దమలోన నిట్టు లనిరి** **82**

ఆ మేటి = ఆ శ్రేష్ఠుడగు రాముడు, తమ్ముడును = తమ్ముడును, గేస్తురాలును = భార్యయును, తాను = తానును, నగరు వెడలి = అంతఃపురము వదలిపెట్టి, తమ వీటి నడిమిత్రోవన్ = తమ

పట్టణపు రాజమార్గమున, చనుచు నుండెడిచోన్ = వెళ్ళుచుండగా, కనుంగొనుచునుండి = చూచుచుండి, ఎల్లవారలు = నగర ప్రజలందరు, తమలోన = తమలో, ఇట్టులు అనిరి = ఇట్లు అనుకొనిరి.

**తా :** ఆ శ్రేష్ఠుడగు రాముడు తమ్ముడు, భార్య, తాను అంతఃపురము వెడలి రాజమార్గమున వెళ్ళుచుండగా చూచి నగర ప్రజలందరు తమలో ఇట్లనుకొనిరి.

**కం.** **ఇట్టి నిగారపు గొనముల**
**తిట్టలఁ గనికరము మాని తెంపొదవంగాఁ**
**గట్టడవులకుం బనుపఁగఁ**
**గట్టా! యిమ్ముదుకఁ డెంత కట్టిఁడి చెపుమా?** **83**

ఇట్టి = ఇటువంటి, నిగారపు = శ్రేష్ఠమైన, గొనముల తిట్టలన్ = గుణముల రాసులను, కనికరము మాని = దయ లేక, తెంపు ఒదవంగా = సాహసించి, కదు అడవులకున్ = కీకారణ్యములకు, పనుపగన్ = పంపుటకు, కట్టా = అయ్యో, ఈ ముదుకడు = ఈ ముసలివాడు, ఎంత కట్టిడి = ఎంత కఠినాత్ముడో, చెపుమా = చెప్పుము.

**తా :** ఇట్టి గుణరాసులను కనికరము లేక సాహసించి కీకారణ్యములకు పంపుటకు అయ్యో! ఈ ముదుకడు ఎంత కఠినాత్ముడో చెప్పు.

**కం.** **తడవేఁడు లయ్యెఁ దనకుం**
**గొడుకులు లేరనుచు ముందుఁ గుందుచు నెన్నో**
**పడరాని పాట్లు పడి యిపు**
**డడవులకుం ద్రోచుకొనుట యరుదై తోఁచున్** **84**

తడవు = కాలము, ఏడులు అయ్యెన్ = సంవత్సరములు గడిచిపోయాయి, తనకున్ = తనకు, కొడుకులు = పుత్రులు, లేరనుచు = లేరని, ముందున్ = మొదట్లో, కుందుచున్ = బాధ పడుచూ, ఎన్నో = ఎన్నియో, పడరాని పాట్లుపడి = పడకూడని కష్టములుపడి, ఇపుడు = ఇప్పుడు, అడవులకుం త్రోచుకొనుట = అడవులకి తోసెయ్యడం, అరుదై తోచున్ = ఆశ్చర్యంగా తోస్తోంది.

**తా :** ఎన్నో సంవత్సరాలు గడిచిపోయాయి. తనకు కొడుకులు లేరని మొదట్లో బాధపడుతూ ఎన్నో పడరాని పాట్లుపడి ఇప్పుడు అడవులకి తోసెయ్యడం ఆశ్చర్యంగా తోస్తోంది.

**కం.** **తప్పక యాడుది గోరిన**
**మెప్పులకై వెడఁగుదనము మీఱఁగ నిటు లీ**
**యొప్పుల కుప్పల విడుచుట**
**ముప్పందటి నితనికేమొ ముది మది తప్పెన్** **85**

తప్పక = తప్పించుకోలేక, ఆడుది కోరిన, మెప్పులకై = ఆమె మెప్పుకొరకు, వెడగు తనము మీరగా = వెఱ్ఱితనము బయల్పడగా, ఇటులు = ఈ విధంగా, ఒప్పుల కుప్పలన్ = అందాల

రాసులను, విడుచుట = వదలిపెట్టుట, ముప్పు అను తఱి = కీడు అనే సమయంలో, ఇతనికి ఏమొ = ఇతనికైతే, ముది = ముసలితనముచే, మది తప్పెన్ = మనసు స్థిరత్వము తప్పింది.

**తా :** ఆడది కోరగా తప్పించుకోలేక ఆమె మెప్పుకోసం మూర్ఖంగా ఒప్పుల కుప్పలను వదలిపెట్టడం ఇతనికైతే కీడు కలిగేవేళ ముసలితనంచేత మనసు స్థిరత్వం తప్పింది.

**ఆ.వె.** **ఆలి మాటకొఱకు బేలయై కోడలిఁ**
**గొడుకుఁ బోవఁ ద్రోచుకొనియె నితని**
**కేటి మగతనం బిసీ! కడుఁగొదలేని**
**అట్టు వొందె నింక అంతు లేల?** **86**

ఆలి మాట కొఱకు, బేలయై = లొంగిపోయినవాడై, కోడలిన్ = కోడలిని, కొడుకున్ = కొడుకును, పోవన్ = ఇంటినుంచి పోడానికి, త్రోచుకొనియెన్ = నెట్టివేసుకున్నాడు, ఇతనికి = ఈ దశరథునికి, ఇసీ = ఛీ, ఏటి మగతనంబు = ఏమి మగతనం?, కడున్ = గొప్ప, కొదలేని = లోటులేని, అట్టు పొందెను = నిందను పొందాడు, ఇంక అంతులు ఏల = ఇంక ఏడుపులెందుకు?

**తా :** ఆలి మాటకోసం బేలయై కోడలిని, కొడుకుని ఇంటినుంచి నెట్టి వేసుకున్నాడు. ఈ దశరథునికి ఛీ ఏమి మగతనం? గొప్ప నిందను పొందాడు. ఇంక ఏడుపెందుకు?

**తే.గీ.** **అనుచుఁ గలగుచు నెల్లరు నాడుకొనఁగ**
**బ్రోల్వెడలి వార లొయ్యనఁ బోవుచుండి**
**రా తెఱంగెల్ల నాలించి యపుడు చాల్పు**
**టరదములదొర దద్దయు నడలుకొనుచు** **87**

అనుచు = అంటూ, కలగుచు = కలతచెందుచూ, ఎల్లరున్ = ప్రజలందరూ, ఆడుకొనగ = పలుకుచుండగా, వారలు = వారు, ప్రోలు వెడలి = నగరము దాటి, ఒయ్యనన్ = నెమ్మదిగా, పోవుచుండిరి = వెళ్ళుచుండిరి, అపుడు = అప్పుడు, చాల్పు అరదముల దొర = దశరథుడు, ఆ తెఱంగు ఎల్లన్ = ఆ విషయమును సమస్తమును, ఆలించి = విని, దద్దయున్ = మిక్కిలి, అడలుకొనుచు = దుఃఖించుచు.

**తా :** అంటూ కలతపడుతూ ప్రజలందరూ పలుకుచుండగా, వారు నగరము దాటి నెమ్మదిగా పోవుచుండిరి. అప్పుడు దశరథుడు ఆ విషయము విని మిక్కిలి దుఃఖించుచు.

**శా.** **ఏఁడీ? నా బలుమానికంబుల కొటారేఁడీ? జగా వన్నెకాఁ**
**డేఁడీ? రక్కసి నీరుదాలుపుల గాడ్పేఁడీ? జగంబేలు తే**
**డేఁడీ? పేదలపాలి వేలుపుల చెట్టేఁడీ? నిరాబార్ల మే**
**లేఁడీ? వేఁడి వెలుంగు వంగడపు రేవెల్గంచు బిట్టేడ్చుచున్** **88**

ఏడీ = నా రాముడేడీ?, నా = నాయొక్క, పలు మానికంబుల కొటారు = గొప్ప మాణిక్యముల గని, ఏడీ = ఎక్కడ?, జగా = లోకానికే, వన్నెకాడు = అందగాడు, ఏడీ = ఎక్కడ?, రక్కసి నీరుదాలుపుల = రాక్షసులనే మేఘాలకి, గాడ్పు = వాయువు, ఏడీ = ఎక్కడ?, జగంబు ఏలు =

లోకాన్ని పాలించే, ఱేడు = ప్రభువు, ఏడీ = ఎక్కడ?, పేదలపాలి = పేదలపాలిట, వేలుపుల చెట్టు = కల్పవృక్షము, ఏడీ = ఎక్కడ?, నిరాబార్ల = మునుల, మేలు = మేలుచేయువాడు, ఏడీ = ఎక్కడ?, వేడి వెలుంగు వంగడపు = సూర్యవంశమునకు, రేవెలుగు అంచు = చంద్రుడని, బిట్టు = గట్టిగా, ఏడ్చుచున్ = ఏడుస్తూ,

**తా :** నా రాముడేడీ? మా మాణిక్యముల గని ఏడీ? లోకానికే అందగాడేడీ? లోకాన్నేలే ప్రభువేడీ? పేదల కల్పవృక్షం ఎక్కడ? మునుల మేలుచేయువాడేడీ? సూర్య వంశమునకు చంద్రుడని బిగ్గరగా ఏడుస్తూ –

**ఉ. రా! యనుఁగా యనున్ దొగలరాయనిఁ గేరు నిగారపుం గుడా**
**రా! యను మేటి నాడెపు దొరా! యనుఁ గిన్క యొనర్చెదేమి మే**
**రా! యను నింద నీకుఁ గనరా! యను దయ్యము పాడిఁదప్పె నౌ**
**రా! యను గన్నవారు నగరా! యను నిప్పని మానురా! యనున్ 89**

అనుగా = ప్రియమైనవాడా!, రా యనున్ = రారా అనును, తొగలరాయని = కలువలరాయని (చంద్రుని), కేరు = తిరస్కరించు, నిగారపుం గుడారా = కాంతుల నిలయమా, యనున్, మేటి = శ్రేష్ఠులలో, నాడెపు దొరా = నాణ్యమైన దొరా!, అనున్ = అనును, కిన్క ఒనర్చెదేమి = కోపగిస్తా వెందుకు?, మేరా = దూరమెందుకురా?, అనున్, కనరా = చూడరా, నీకు, నింద = తండ్రి మాట వినలేదనే నింద వస్తుంది, అనున్, ఔరా = అయ్యో!, దయ్యము = దైవము, పాడి తప్పె = ధర్మం తప్పినాడు, అనున్ = అనును, కన్నవారు = చూసినవారు, నగరా = నవ్వుతారురా!, అనున్ = అనును, ఈ పని = ఇలా అడవులకు వెళ్ళే పనిని, మానురా = మానివేయరా! అనున్ = అనును.

**తా :** ప్రియమైనవాడా! రారా! చంద్రుని తిరస్కరించు కాంతి నిలయమా రారా! నాణ్యమైన దొరా! రారా! కోపగిస్తావెందుకు? దూరమెందుకురా? రారా! చూడరా! నీకు తండ్రిమాట వినలేదనే నింద వస్తుందిరా! అయ్యో! దైవము పాడి తప్పాడురా! చూసినవాళ్ళు నవ్వుతారురా! ఇలా అడవులకు వెళ్ళే పని మానివేయరా! అనును.

**ఉ. కా! యను మేటి తప్పు కొడుకా! యను నిద్దపుఁ బూతమావి మో**
**కా! యనుఁ బంజరంపుఁ జిలుకా! యను నబ్రపు సోయగంపుఁ బ్రో**
**కా! యనుఁ బల్కవేమి యలుకా! యనుఁ బంతము దీఱె నోటు కై**
**కా! యను నేర యిట్లు దుడుకా యనుఁ బాయఁగఁ గోరికా యనున్ 90**

కా యను = కా యని దుఃఖించును (కాకిలా అరుస్తున్నావనేది వాడుక), మేటి = గొప్ప, తప్పు = తప్పుచేస్తున్నావు, కొడుకా = కుమారా!, అనున్ = అనును, నిద్దపు = చక్కని, పూతమావి మోకా = పూత పూసిన గున్నమామిడి మొలకా!, అనున్ = అనును, పంజరంపు చిలుకా = పంజరంలోవున్న చిలుకా (పంజరంలోని చిలుకలా ఇన్నాళ్లు అంతఃపురలో ఉండి ఆనందం కలిగించినవాడు), అనున్ = అనును, అబ్రపు = ఆశ్చర్యకరమైన, సోయగంపు = చక్కని, ప్రోకా = రాశీ, అనున్ =

అనును, పల్కవేమి = మాటలాడవేరా!, అలుకా = కోపమా?, అనున్ = అనును, కైకా = ఓ కైకా!, పంతము = నీ పంతము, తీఱెనోటు = తీరిందికదా!, అనున్ = అనును, నేర = భరించలేను, ఇట్లు = ఈ రీతిగా, దుడుకా అనున్ = దుర్మార్గమా! అనును, పాయగన్ = నన్ను విడిచిపోవాలని, కోరికా అనున్ = కోరుకున్నావా? అనును.

**తా :** కాకిలా అరచును, గొప్ప తప్పుచేస్తున్నావు కుమారా! పూతపూసిన గున్నమామిడి మొలకా! పంజరపు చిలుకా! చక్కని ప్రవర్తన కలవాడా! మాటాడవేలరా? కోపమా? ఓ కైకా! నీ పంతము తీరిందికదా! నేను భరించలేను. ఈ రీతిగా దుర్మార్గమా? నన్ను విడిచిపోవాలని కోరుకున్నావా? అనును.

**కం.** **అప్పా! విప్పారెడు నగ**
**వొప్పారఁగఁ జూచి పలుకకున్నాఁడ వదే**
**చొప్పా! తప్పా! బంగరు**
**కుప్పా! యిప్పాటి నింత కొఱకొఱ మెప్పా!** **91**

అప్పా = నాయనా!, విప్పారెడు = వికసించిన, నగవు ఒప్పారగ = నవ్వు అందగించగా, చూచి = నన్ను చూసి కూడా, పలుకక ఉన్నాడవు, అదే చొప్పా = అలావుండడం నీకు తగినదా?, తప్పా = నేను చేసిన తప్పా?, బంగరు కుప్పా = బంగారు రాశీ, ఈ పాటిన్ = ఈ విధముగా, ఇంత = ఇంతగా, కొఱకొఱ = కొఱకొఱలాడడం (కోపగించుకోవడం), మెప్పా = మెచ్చుకోదగినదా!

**తా :** నాయనా! వికసించిన నవ్వు అందగించగా నన్నుచూసి కూడా పలుకరించకున్నావు. అలావుండడం నీకు తగినదా? నేను చేసిన తప్పా? బంగారుకుప్పా! ఈ విధముగా కొఱకొఱలాడడం మెచ్చుకోదగినదా?

**కం.** **ఉడుకా విడకున్నది మది**
**పడుకా మిడుకంగ నుఱక పఱవం జనునే?**
**కొడుకా! నడు కానల కిటు**
**దుడుకా? నాపాలి పుడుకుఁ దొడుకా! నీకున్** **92**

ఉడుకా = నాలో తాపమా, విడకున్నది = పోకున్నది, కొడుకా = కుమారా, నా పాలి = నా పాలిట, పుడుకు తొడుకా = కామధేనువా!, మిడుకంగ = నేను ఇలా పరితపిస్తూండగా, ఉరక = పట్టించుకోక, పఱవన్ = పరుగెత్తుట, జనునే = తగునా? నీకున్ = నీకు, ఇటు = ఈ విధంగా, నడు కానలకు = అరణ్యాల మధ్యలోకి, దుడుకా = తొందరా?, మది = నీ మనస్సు, పడుకా = పాషాణమా?

**తా :** నాలో తాపమా పోకున్నది. కుమారా! నా పాలి కామధేనువా! నేను ఇలా పరితపిస్తుండగా పట్టించుకోక పరుగెత్తుట తగునా? నీకు ఈ విధంగా కానలకు తొందరా? నీ మనస్సు పాషాణమా?

**నిరోష్ఠ్య సీ.**

**చలియిక్క దిండి యందెల ఱేని జిగి సేగ**
**సింగాణిఁ జెఱచిన చేఁతకాఁడ!**
**జడదారి నెల దండఁ జని క్రచ్చఱ గయాళి**
**రాకాసిఁ జెండిన రాచకంద!**
**తలఁగని కడగండ్లఁ దగిలి చట్టయియున్న**
**చాన నేదిన నెఱజాణరాయ!**
**నీ టార నెదిరిన నేల జేజే దంట**
**తేజెల్ల నడఁచిన దిట్ట లెంక!**

**తే.గీ.** **తండ్రి నైనట్టి నా యాన దాఁటలేక**
**కడిఁది కాణాచి రాసిరి యెడలఁజేసి**
**హాళిఁ గానల కరిగిన యందగాఁడ!**
**తలర నిన్గాంచకేఁ దాళఁగలనె యింక?** **93**

చలి ఇక్క = చలికి స్థానమైనది (గాలి), తిండి = తిండిగా గలది (పాము), అందెల ఱేని = అందెలుగా ధరించు ప్రభువు (శివుని), జిగి = తేజస్సు, సేగన్ = కోల్పోవునట్లుగా, సింగాణిన్ = అతని ధనుస్సును, చెఱచిన = విరచిన, చేతకాడ = కార్యశూరుడా!, జడదారి నెల = మునిచంద్రుడు (విశ్వామిత్రుడు), దండన్ = వెంట, చని = వెళ్ళి, క్రచ్చఱ = శీఘ్రముగా, గయాళి రాకాసిన్ = గయ్యాళియైన రాక్షసిని (తాటకను), చెండిన = చంపిన, రాచకంద = రాచబిడ్డా!, తలగని = తొలగిపోని, కడగండ్లన్ = కష్టములకు, తగిలి = లొంగి, చట్టయియున్న = రాయిగానున్న, చానన్ = స్త్రీని (అహల్యను), ఏదిన = రక్షించిన, నెఱజాణరాయ = నేర్పుకాడా!, నీటు ఆరన్ = గొప్ప గర్వముతో, ఎదిరిన = ఎదిరించిన, నేలజేజే దంట = బ్రాహ్మణ వీరుని (పరశురాముడు), తేజెల్ల = శౌర్యమునంతను, అడచిన = అణచిన, దిట్ట లెంక = సమర్థుడైన వీరుడా!, తండ్రిని ఐనట్టి = తండ్రినయినటువంటి, నా ఆన = నా ఆజ్ఞను, దాటలేక = తిరస్కరించుటకు ఇష్టపడక, కడిది = గొప్ప, కాణాచి = వాసస్థానమైన, రాసిరిన్ = రాచసంపదను, ఎడల చేసి = వదలుకొని, హాళిన్ = హాయిగా, కానలకు అరిగిన = అడవులకు వెళ్ళిన, అందగాడ = సోగ్గాడా!, తలరన్ = (ఇలా) ఒప్పుచున్న, నినున్ = నిన్ను, కాంచక = చూడక, ఇంక = ఇకపైన, తాళన్ కలనె = సహింపగలనా?

**తా :** శివుని తేజస్సు కోల్పోవునట్లుగా శివధనుస్సును విరిచిన కార్యశూరుడా! మహర్షి వెంటవెళ్ళి గయ్యాళి రాక్షసిని చంపిన రాచబిడ్డా! కష్టములకు లొంగి రాయిగానున్న స్త్రీని రక్షించిన నేర్పుకాడా! గర్వముతో ఎదిరించిన పరశురాముని గర్వమును అణచిన సమర్థుడా! నా ఆజ్ఞను తిరస్కరించలేక రాచసంపదను వదలుకొని అడవులకు వెళ్ళిన అందగాడా! నిన్ను చూడక ఇకపైన తాళగలనా!

**కం. కైకా! నీపూనిన పని**
**కై కా కై కందినట్టి యనుఁగుం గొడు కి**
**ట్లై కానల కేఁగెడు నిఁక**
**నే కడ నీవంటి తులువ లేరీ పుడమిన్? 94**

కైకా = ఓ కైకా!, నీ పూనిన = నీవు తలచుకొన్న, పనికై కా = పనికొఱకుకదా!, కైకి అందినట్టి = చేతికి అందివచ్చినట్టి, అనుగున్ కొడుకు = ఇష్టుడైన కుమారుడు, ఇట్లు ఐ = ఈ విధముగానై, కానలకు = అడవులకు, ఏగెడున్ = వెళ్ళుచున్నాడు, ఇకన్ = ఈపైన, పుడమిన్ = భూమండలంలో, ఏకడన్ = ఎక్కడను, నీవంటి = నీవంటి, తులువలు = దుష్టులు, ఏరీ = ఎక్కడున్నారు?

**తా :** ఓ కైకా! నీ పూనిన పనికై కదా! చేతికి అందివచ్చిన ప్రియ పుత్రుడు ఈ విధముగా అడవులకు వెళ్ళుచున్నాడు. ఇక భూమండలములో ఎక్కడను నీవంటి తులువలు ఏరీ?

**కం. నెయ్యపుఁ గొడుకుల నిటు లెడ**
**సెయ్యంగా మిగులఁ జలముఁ జేకొనియెను నేఁ**
**డయ్యయొ! యా కట్టిఁడి బ**
**ల్దయ్యంబున కేమి యెగ్గుఁ దలఁచితినొ సుమీ! 95**

అయ్యయొ = అయ్యయ్యో, ఆ కట్టిడి = ఆ క్రూరుడైన, బల్ దయ్యంబునకు = గొప్పవాడైన దైవానికి, ఏమి ఎగ్గు తలచితినొ సుమీ = ఏమి కీడు చేయాలనుకున్నానో కదా!, నేడు = ఈనాడు, నెయ్యపు కొడుకులన్ = ప్రియమైన కుమారులను, ఇటులు = ఈ రీతిగా, ఎడసెయ్యంగా = దూరం చేయాలని, మిగులన్ = మిక్కిలి, చలమున్ = పట్టుదలను, చేకొనియెన్ = చేపట్టినాడు.

**తా :** అయ్యయ్యో! ఆ క్రూర దైవానికి ఏమి కీడు చేయాలనుకున్నానోకదా! ఈనాడు నా ప్రియకుమారులను ఈ రీతిగా దూరంచేయాలని మిక్కిలి పట్టుదల చేపట్టినాడు.

**తే.గీ. అంగదలకోర్చి సిరులపై నాస వదలి**
**గరితతనమెల్ల జగములఁ గనఁబడంగ**
**మగని వెనువెంట నడవికిఁ దగిలి చనితె**
**తొడరి మముఁ జూడ రోసి యో పుడమికాన్ప! 96**

అంగదలకు ఓర్చి = కష్టాలను సహించి, సిరులపైన్ = సంపదలపై, ఆస వదలి = ఆశను వదలిపెట్టి, గరితతనము = పతివ్రతాత్త్వము, ఎల్ల జగములన్ = లోకములన్నిటా, కనపడంగ = కనబడునట్లుగా, ఓ పుడమి కాన్ప = ఓ భూపుత్రీ!, మమున్ = మమ్మల్ని, చూడన్ = చూచుటకు, రోసి = అసహ్యించుకొని, మగని వెనువెంట = భర్త వెనుకనే, తొడరి = అనుసరించి, అడవికి = అరణ్యమునకు, తగిలి = సిద్ధపడి, చనితె = వెళ్లితివా?

**తా :** కష్టాలను సహించి సంపదలపై ఆశను వదలిపెట్టి పతివ్రతాత్త్వము లోకములన్నిటా కనబడునట్లుగా ఓ భూపుత్రీ! మమ్మల్ని చూచుటకు అసహ్యించుకొని భర్త వెనుకనే అనుసరించి అరణ్యమునకు సిద్ధపడి వెళ్ళితివా?

**తే.గీ.** **కోడలా! యింక బంగరు కోట లేల?**
**మేడ లేఁటికి? రతనంపు వాడ లేల?**
**మాడ లేఁటికి? పలు రాచజాడ లేల?**
**వాడలో నీవు ద్రిమ్మర నోడి చనిన** **97**

కోడాలా = కోడలా!, వాడలోన్ = అంతిపురములో, నీవు = నీవు, త్రిమ్మరన్ = సంచరించుటకు, ఓడి = ఇష్టపడక, చనిన = వెళ్ళిన, ఇంక = ఇకపైన, బంగరు కోట లేల = ఈ బంగారు కోట లెందుకు?, మేడలు ఏటికి = బంగారు మేడ లెందుకు?, రతనంపు వాడలు ఏల = రత్నాల పేట లెందుకు?, మాడలు ఏటికి = బంగారు మాడలెందుకు?, పలు = అనేకములైన, రాచజాడలు ఏల = రాజవైభవములెందుకు?.

**తా :** కోడలా! అంతఃపురంలో నీవు సంచరించడం ఇష్టపడక వెళ్ళిన తరువాత ఈ బంగారు కోట లెందుకు? మేడ లెందుకు? మాడ లెందుకు? ఈ రాజవైభవము లెందుకు?

**తే.గీ.** **మక్కువల యిమ్మ! వలతేని మానికమ్మ!**
**పసిఁడి కీల్బొమ్మ! జగముల పట్టుఁగొమ్మ!**
**పొగడ పూరెమ్మ! వలపుఁ గప్పురపు దిమ్మ!**
**కాన వేలమ్మ! యో నేలకాన్పుఁ గొమ్మ!** **98**

ఓ నేలకాన్పు కొమ్మ = ఓ సీతమ్మా!, మక్కువల = ప్రేమలకు, ఇమ్మ = నిలయమైనదానా!, వలతేని = మన్మథుని, మానికమ్మ = మాణిక్యమా! పసిడి కీలు బొమ్మ = బంగారు కదిలే బొమ్మా!, జగముల = లోకములకు, పట్టు కొమ్మ = ఆధారమైనదానా!, పొగడపూవు రెమ్మ = పొగడ పూల కొమ్మా!, వలపున్ = పరిమళములను వెదజల్లు, కప్పురపు దిమ్మ = కర్పూరపు రాశీ!, కానవు ఏలమ్మ = కనబడవేమమ్మా!

**తా :** ఓ సీతమ్మా! మక్కువ నిలయమా! మన్మథుని మాణిక్యమా! పసిడి కీలుబొమ్మా! జగముల పట్టుకొమ్మా! వలపు కప్పురపు రాశీ! కనబడవేమమ్మా!

**తే.గీ.** **అనుచుఁ గడలేని మక్కువ నఱచి యఱచి**
**సైఁపఁ జాలక యా రాచ చలివెలుంగు**
**నేలఁబడి సొమ్మవోయి జేజేల ప్రోలి**
**కేఁగె నట రాముదును ద్రోవ నేఁగి యేఁగి** **99**

ఆ రాచ చలివెలుంగు = ఆ రాజ చంద్రుడు, అనుచు = అంటూ, కడలేని = అంతులేని, మక్కువన్ = ఇష్టముతో, అఱచి అఱచి = ఎలుగెత్తి, సైప్ చాలక = భరించలేక, నేలన్ పడి = నేలమీదపడి, సొమ్మ పోయి = సొమ్మసిల్లి, జేజేల ప్రోలికిన్ = దేవతల పట్టణానికి ( స్వర్గం), ఏగెను = వెళ్ళెను, అట = అక్కడ, రాముడును = రాముడున్ను, త్రోవన్ = అరణ్యమార్గమున, ఏగి ఏగి = వెళ్ళి వెళ్ళి.

**తా :** అనుచు ఆ రాజచంద్రుడు అంతులేని మక్కువతో ఎలుగెత్తి భరించలేక నేలను పడి సొమ్మసిలి స్వర్గము చేరెను. అక్కడ రాముడు అరణ్యమార్గమున వెళ్ళి వెళ్ళి –

**కం.** **సుడివాలు దాల్పు నడుగునఁ**
**బొడమిన పెన్ వెల్లి దరిసి పొందఁగ న**
**క్కడ గుహుఁడనియెడు చెంచుల**
**యొడయనిఁ బొడఁగాంచి వాని యొద్దికవలనన్** **100**

సుడివాలు తాల్పు = చక్రాయుధం ధరించినవాడు (విష్ణువు), అడుగునన్ = పాదమునందు, పొడమిన = పుట్టిన, పెన్ వెల్లి = పెద్ద ప్రవాహంకల గంగను, దరసి = చూచి, పొందగన్ = సమీపించగ, అక్కడ = ఆ గంగానదీ సమీపమున, గుహుడు అనియెడు = గుహుడు అని పిలువబడే, చెంచుల ఒడయనిన్ = కోయల రాజును, పొడగాంచి = చూచి, వాని ఒద్దికవలనన్ = వాని సహకారంతో,

**తా :** విష్ణు పాదమున పుట్టిన గంగను చేరి గుహుడు అనే కోయ రాజును చూచి వాని సహకారంతో –

**ఆ.వె.** **ఓడ యెక్కి వైళ మొప్పార నయ్యేటి**
**తేవు దాఁటి చెంచు తేని నచట**
**మిక్కుటంపు నెనరు నెక్కొన వీడ్కొని**
**మువురుఁ గడఁకతోడ నవలఁ జనుచు** **101**

ఓడ యెక్కి = ఆ గుహుడు తెచ్చిన ఓడనెక్కి, వైళమ = వెంటనే, ఒప్పారన్ = తగినరీతిగా, ఆ ఏటి తేవు దాటి = ఆ గంగానది రేవును దాటి, అచట, చెంచు తేనిన్ = కోయరాజును (గుహుని), మిక్కుటంపు నెనరు నెక్కొనన్ = మిక్కిలి అనురాగము అతిశయింపగా, వీడ్కొని = విడిచి పెట్టి, మువురు = ఆ ముగ్గురును, కడకతోడ = పూనికతో, అవలన్ = ముందుకు, చనుచు = వెళ్ళుచు

**తా :** ఆ గుహుడు తెచ్చిన ఓడనెక్కి వెంటనే ఆ గంగానదిని దాటి అచట కోయరాజును మిక్కిలి అనురాగముతో విడిచిపెట్టి ఆ ముగ్గురును ముందుకు వెళ్ళుచు –

**కం.** **పనిమీఱ భరద్వాజుం**
**డను దపసులమిన్న యున్న యండకుఁ జని యా**
**యన యొసఁగెడు పూజలఁ గై**
**కొని చయ్యనఁ జనిరి చిత్రకూటంబునకున్** **102**

పనిమీఱ = ప్రయోజనము అతిశయించగా, భరద్వాజుండు అను = భరద్వాజుడనే, తపసుల మిన్న ఉన్న అండకు = మునీశ్వరుడున్న ప్రదేశమునకు, చని = వెళ్ళి, ఆయన యొసగెడు = ఆయన ఇచ్చేటటువంటి, పూజలన్ = మర్యాదలను, కైకొని = స్వీకరించి, చయ్యన = వెంటనే, చిత్రకూటంబునకున్ = చిత్రకూటమను పర్వతమునకు, చనిరి = వెళ్ళిరి.

**తా :** అవసరార్థము భరద్వాజుడను మునీశ్వరుని చెంతకు  వెళ్ళి ఆయన పూజలను స్వీకరించి వెంటనే చిత్రకూటమునకు వెళ్ళిరి.

**తే.గీ.** **మలల తలకట్టు తపసుల మనికి పట్టు**
**నాడెముల గట్టు బలు రతనముల కొట్టు**
**రమణఁ గన్పట్టు నయ్యబ్బురంపుఁ గట్టు**
**బిట్టెలమిఁ గూర్చె నా రాచపుట్టువులకు** **103**

మలల తలకట్టు = పర్వతములకు మకుటాయమానమైన, తపసుల మనికి పట్టు = మునుల నివాస స్థలమును, నాడెముల గట్టు = నాణ్యతలు కలిగిన కొండ, పలు రతనముల కొట్టు = అనేకములైన రత్నములకు నిలయమునునై, రమణన్ = మనోహరముగా, కన్పట్టు = కనబడుచున్న, ఆ అబ్బురంపున్ కట్టు = ఆ ఆశ్చర్యకరమైన ప్రదేశము, ఆ రాచ పుట్టువులకు = ఆ రాచవంశమున పుట్టిన వారలకు, బిట్టు ఎలమిన్ = మిక్కిలి సంతోషమును, కూర్చెన్ = కలిగించెను.

**తా :** పర్వతములకు మకుటాయమానమైన మునుల నివాస స్థలమును, నాణ్యతలకు హద్దును, అనేక రత్నములకు నిలయమునునై మనోహరముగా కన్పట్టు ఆ పర్వతము వారలకు మిక్కిలి సంతోషమును కలిగించెను.

**సీ.** **బలితంపు గండు రాచిలుక పల్కులఁ బిల్చి**
**కడిఁది జక్కర నీళ్ళఁ గాళ్ళు గడిగి**
**నిద్దంపు నెత్తంపు గద్దియల్ సవరించి**
**వలినాలి గాడ్పు వీవనలు వైచి**
**కపురంపు వెలిబూది గంద పొడులల్లి**
**కొమరుఁ బూఁబొద చప్పరముల నునిచి**
**నలిమావి పండ్ల పానకముల దగమాన్చి**
**నాడెంపు దుంప బోనములు వెట్టి**

**తే.గీ.** **క్రొత్త తలిరాకు జొంపఁపు మెత్త లొసఁగి**
**మఱియుఁ బెక్కు తెఱంగుల నెఱి నొసంగి**
**తెరవు బడలిక లన్నియుఁ దీర్చి వారిఁ**
**దనిపె నెదనెన్న నమ్మన్ను తాల్పు మిన్న** **104**

ఆ మన్నుతాల్పు మిన్న = ఆ పర్వతశ్రేష్ఠమైన చిత్రకూటము, బలితంపు గండు రా చిలుక = బలిసిన మగ రామచిలుక, పల్కులన్ = మాటలతో, పిల్చి = స్వాగతము చెప్పి, కడిది = అధికమైన, జక్కర నీళ్ళన్ కాళ్ళు కడిగి= నది నీటితో కాళ్ళు కడిగి, నిద్దంపు నెత్తంపు గద్దియల్ = నున్నని ఉన్నతమైన సమ ప్రదేశములందు వేదికలను, సవరించి = ఏర్పరచి, వలినాలి గాడ్పు = చల్లని పిల్లగాలుల, వీవనలు వైచి = వింజామరలు విసరి, కపురంపు వెలిబూది గంద పొడులు చల్లి = కర్పూరపు తెల్లని పొడి అనే గంధపుపొడుల చల్లి, కొమరున్ = అందమైన,

పూవు పొద = పూల పొదలను, చప్పరములు ఉనచి = పందిరులుగా ఉంచి, నలి మావిపండ్ల = రసవంతములైన మామిడిపండ్ల, పానకములన్ = రసములతో, దగన్ మాన్చి = దప్పికను పోగొట్టి, నాడెంపు = శ్రేష్ఠములైన, దుంప బోనములు పెట్టి = పలురకముల దుంపలతో భోజనములు పెట్టి, క్రొత్త తలిరాకు జొంపపు మెత్తలు = నూతనమైన చిగురుటాకుల గుత్తుల పఱుపులు, ఒసగి = ఇచ్చి, మరియున్ = ఇంకను, పెక్కు తెఱంగులన్ = అనేక విధములుగా, నెఱిన్ ఒసగి = రమ్యత్వమునిచ్చి, తెరవు బడలికలు అన్నియున్ = మార్గాయాసమునంతను, తీర్చి = పోగొట్టి, వారిన్ = వారిని, ఎదన్ ఎన్నన్ = మనసులో ఎంచుకొనునట్లు, తనిపెన్ = తృప్తిపరచెను.

**తా :** ఆ చిత్రకూటము రామచిలుకల పలుకులతో స్వాగతించి, మధురమైన నీటితో కాళ్ళు కడిగి, నున్నని ఉన్నతమైన సమప్రదేశములందు వేదికలను ఏర్పరచి, చల్లని పిల్లగాలుల వింజామరలు విసరి, కర్పూరపు తెల్లని గంధపుపొడులు చల్లి, అందమైన పూపొదలను పందిరులుగా ఉంచి, మామిడిపండ్ల రసములతో దప్పికను పోగొట్టి, పలురకముల దుంపలతో భోజనములు పెట్టి, చిగురుటాకుల పఱుపులు పరచి, ఇంకను అనేక విధములుగా రమ్యత్వము నిచ్చి మార్గాయాసమునంతను పోగొట్టి వారిని మనసున ఎంచుకొనునట్లు తృప్తి పరచెను.

**తే.గీ.** **అట్టు లమ్మెట్టుపై విడి పట్టు చేసి**
**యుండి రంతకు మున్న యయోధ్యలోన**
**దనరు ప్రగ్గడ లందఱుఁ దాత యింట**
**నున్న భరతుని రప్పించి యొప్పు మీఱ** **105**

అట్టులు = ఆ విధంగా, ఆ మెట్టుపైన్ = ఆ కొండమీద, విడిపట్టు చేసి = వాసస్థలము చేసుకొని, ఉండిరి, అంతకు మున్న = వారు చిత్రకూట పర్వతానికి చేరక పూర్వమే, అయోధ్యలోన, తనరు = ఉన్నటువంటి, ప్రగ్గడలు అందరు = మంత్రులందరును, తాత ఇంటన్ ఉన్న = తాతగారి ఇంటిలోవున్న, భరతుని రప్పించి = భరతుని రావించి, ఒప్పు మీఱన్ = తగినట్లుగా,

**తా :** ఆ విధంగా ఆ కొండమీద వాసస్థలము చేసుకొని ఉండిరి. అంతకు పూర్వమే అయోధ్యలో నున్న మంత్రులు తాతగారి ఇంటిలోవున్న భరతుని రప్పించి తగినట్లుగా –

**కం.** **మొదలి తెఱఁగెల్లఁ దెలిపిన**
**నదిరిపడి యతండు మిగుల నడలొందుచు బ**
**ల్లిదుఁడగు తన తండ్రికిఁ బెం**
**పొదవఁగఁ బెఱ జగము చెయ్వు లొనరించి వెసన్** **106**

మొదలితెఱగు ఎల్లతెలిపిన = ముందునుంచీ జరిగినవిషయమునంతను తెలుపగా, అదిరిపడి = చలించిపోయి, అతండు = ఆ భరతుడు, మిగులన్ అడలు ఒందుచు = మిక్కిలి దుఃఖించుచు, బల్లిదుడగు = శ్రేష్ఠుడైన, తన తండ్రికి, పెంపు ఒదవగ = వృద్ధి కలుగునట్లుగా, పెఱ జగము చెయ్వులు = ఉత్తరలోక క్రియలు, ఒనరించి = నిర్వర్తించి, వెసన్ = వెంటనే,

**తా :** మొదటినుంచీ జరిగిన విషయమునంతనూ తెలుపగా అదిరిపడి ఆ భరతుడు మిక్కిలి దుఃఖించుచు తన తండ్రికి ఉత్తరలోక క్రియలు నిర్వర్తించి, వెంటనే –

**ఆ.వె.** **మూఁక లెల్లఁ దన్ను డాకొని కొలువంగ**
**నన్న యున్న తిప్ప కరిగి యతని**
**యడుగుఁ దామరలకుఁ గడువడి నెరఁగి యిం**
**పెసఁగ నవ్వలంతి యిట్టు లనియె** **107**

మూకలు ఎల్లన్ = సైన్యమంతయు, తన్ను = తనను, డాకొని = చేరి, కొలువంగన్ = సేవించుచుండగా, అన్న ఉన్న తిప్పకు = రాముడున్న కొండకు, అరిగి = వెళ్ళి, అతని అడుగు తామరలకు = అతని పాదపద్మములకు, కడువడి = శీఘ్రముగా, ఎరగి = నమస్కరించి, ఇంపు ఎసగన్ = ఇష్టమగు రీతిని, ఆ వలంతి = ఆ సమర్ధుడైన భరతుడు, ఇట్టులు అనియెన్ = ఈ ప్రకారముగా అనెను –

**తా :** సైన్యమంతయు తనను చేరి కొలువగా అన్నవున్న కొండకు వెళ్ళి అతని పాదపద్మములకు నమస్కరించి ప్రియముగా ఆ భరతుడు ఇట్టు లనెను –

**తే.గీ.** **తేండ్లరాయడ! మిగుల గాటియలఁ గుంది**
**తండ్రి వేలుపుఁ బ్రోలికిఁ దరలి చనియె**
**మీర లిటు కైక మాటకై యూరు వదలి**
**సొరిది నడవుల కిపుడు వచ్చుటను జేసి** **108**

తేండ్ల రాయడ = సార్వభౌమా!, మిగులు కాటియల కుంది = ఎన్నో కష్టాలకు క్రుంగిపోయి, తండ్రి = మన తండ్రి దశరథమహారాజు, వేలుపు ప్రోలికిన్ = స్వర్గమునకు, తరలి చనియె = వెళ్ళిపోయెను, మీరలు = మీరైతే, ఇటు = ఈ విధముగా, కైక మాటకై = కైక చెప్పిన మాటకోసం, ఊరు వదలి = అయోధ్యను విడచి, సొరిది = క్రమంగా, ఇపుడు = ఇలాంటి పరిస్థితిలో, అడవులకు = అరణ్యములకు, వచ్చుటను చేసి = రావడంతో –

**తా :** ఓ సార్వభౌమా! ఎన్నో కష్టాలకు క్రుంగి మన తండ్రి స్వర్గమునకు వెళ్ళిపోయిరి. మీరైతే కైక మాటకై ఊరు వదలి ఇలాంటి పరిస్థితిలో అడవులకు రావడంతో –

**ఆ.వె.** **ముసలివాని మాట ముద్దియ మాటయు**
**నేటు చేసి యేలు నేల వదలి**
**కటకటా! కడింది కార్మెకంబులు గల**
**పొలము సొరఁగఁ దగునె పొలఁతిఁ గూడి** **109**

ముసలివాని మాట = వృద్ధుని మాటయు, ముద్దియ మాటయు = స్త్రీ మాటయును, నేటు చేసి = లెక్క చేసి, ఏలు = పరిపాలించెడి, నేలన్ వదలి = రాజ్యమును విడిచిపెట్టి, కటకటా = అయ్యయ్యో!, కడింది = బలిష్ఠమైన, కారు మెకంబులు కల= క్రూర మృగములుకల, పొలము = అరణ్యము, పొలతి కూడి = భార్యతో కలిసి, చొరగన్ = ప్రవేశించుటకు, తగునె = తగినపనేనా?

**తా :** వృద్ధుని మాట, స్త్రీ మాట లెక్కచేసి పరిపాలించు రాజ్యమును వీడి అయ్యయ్యో! క్రూర మృగములుకల అరణ్యము భార్యతో కలిసి ప్రవేశించుట తగినపనేనా?

**కం. అన్నాతియు నొడయఁడు లటు**
**లన్నారని నీవు కోన కరుదెంచినచో**
**నన్నా! యన్నాడిక య**
**న్నన్నా! యాఁగుకొనఁజాలు నట్టిదె చెపుమా? 110**

ఆ నాతియున్ ఒడయడులు = ఆ స్త్రీయగు కైకయును, రాజగు దశరథుడును, అటులు అన్నారని = ఆ ప్రకారంగా అన్నారని, నీవు కోనకు అరుదెంచినచో = నీవు అడవులకు వచ్చినచో, అన్నా = అన్నా రామా!, ఆ నాడు = ఆ రాజ్యము, అన్నన్నా = అయ్యయ్యో! ఆగుకొనన్ చాలునట్టిదె చెపుమా = కాపాడుకొనడానికి సమర్థమైనదేనా చెప్పు?

**తా :** ఆ స్త్రీయును, రాజును అలా అన్నారని నీవు అడవులకు వస్తే అన్నా! ఆ రాజ్యము అయ్యయ్యో! కాపాడుకొనడానికి చాలనట్టిదేనా చెప్పు.

**కం. ఏ నినుఁ గొలుచుచు నుండెదఁ**
**గాని యికం బుడమి యేలఁగా నొల్లను నీ**
**యాన యని మ్రొక్కుటయు న**
**మ్మానిసి ఱేఁడపుడు దండ్రి మడియుట కెదలోన్ 111**

ఏన్ = నేను, నినున్ = నిన్ను, కొలుచుచు = సేవించుచు, ఉండెదన్ కాని = ఉంటాను కానీ, ఇకన్ = ఇంక తిరిగి, పుడమి ఏలగాన్ = రాజ్యమును పాలించుటకు, ఒల్లను = ఇష్టపడను, నీ ఆన అని = నీమీద ఒట్టు అని, మ్రొక్కుటయున్ = నమస్కరింపగా, అపుడు = అప్పుడు, ఆ మానిసి ఱేడు = ఆ మనుజేంద్రుడు, తండ్రి మడియుటకు = తండ్రి మరణించుటకు, ఎదలోన్ = మనసులో –

**తా :** నేను నిన్ను సేవించుచుందును కానీ ఇంక తిరిగి రాజ్యమును పాలించుటకు ఇష్టపడను. నీమీద ఒట్టు అని నమస్కరింపగా రాముడు తండ్రి మరణించుటకు ఎదలో –

**ఆ.వె. కలఁక మీఱ మిగులఁ గన్నీరు నించుచుఁ**
**గొంత దడవు నొగిలి యంతఁ జతన**
**మొనర నువులు నీళ్ళు నోరెంపుఁ గళ్ళను**
**మొదలు గలుగు చెయ్వు లదనఁ జేసి 112**

కలక మీఱన్ = అధికమైన వేదనతో, మిగుల కన్నీరు నించుచు = బాగా రోదిస్తూ, కొంత తడవు = కొంత సమయము, నొగిలి = దుఃఖించి, అంతన్ = అంతట, జతనము ఒనరన్ = ప్రయత్న పూర్వకముగా, నువులు = నువ్వులు, నీళ్ళున్ = నీళ్ళను, ఓరెంపు కళ్ళను = పిండములును, మొదలు కలుగు చెయ్వులు = మొదలైన పనులు, అదనన్ చేసి = ఆ సమయమున చేసి –

**తా :** అధికమైన వేదనతో కన్నీరు కారుస్తూ కొంత తడవు దుఃఖించి అంతట ప్రయత్నించి నువ్వులు, నీళ్ళు, పిండములు మొదలైన పనులు ఆ సమయమున చేసి –

**కం.** **అక్కైక కొడుకుఁ గనుఁగొని**
**మక్కువతోఁ బలికె నీవు మగుడన్ మూఁకల్**
**క్రిక్కిరిసి రాఁగ బ్రోలికిఁ**
**గ్రక్కునఁ జని నేలయేలు కనికర మెసగన్** **113**

ఆ కైక కొడుకు కనుగొని = ఆ కైక కొడుకైన భరతుని చూచి, మక్కువతో = ప్రేమతో, నీవు = నీవు, కనికర మెసగన్ = దయ అతిశయించగా, మగుడన్ = తిరిగి, మూకల్ = సైన్యములు, క్రిక్కిరిసి = తోసుకుంటూ, రాగ = వచ్చుచుండగా, బ్రోలికి = అయోధ్యకు, గ్రక్కునన్ = శీఘ్రముగా, చని = వెళ్ళి, నేల ఏలుము = రాజ్యమును పాలించుము.

**తా :** ఆ కైక కొడుకు భరతుని కనుగొని ప్రేమతో నీవు దయయుంచి తిరిగి సైన్యములు తోడురాగా అయోధ్యకు వెంటనే వెళ్ళి రాజ్యమును పాలించు.

**తే.గీ.** **తండ్రి యానతి యింతయు దాఁటఁబోల**
**దడవిఁ బదునాలుఁగేఁడులుఁ గడిపి వత్తుఁ**
**బదిలముగ నుండుమని తన పావ లొసఁగి**
**సెలవుఁ బెట్టిన నతఁ డెద నలరి యపుడు** **114**

తండ్రి ఆనతి = తండ్రి ఆజ్ఞ, ఇంతయు = కొంచెము కూడా, దాట పోలదు = దాటుట సరికాదు, అడవిన్ = ఈ అడవియందు, పదునాలుగు ఏడులు = పదునాలుగు సంవత్సరములు, కడిపి = జరిపి, వత్తున్ = వచ్చెదను, పదిలముగన్ ఉండుమని = భద్రముగవుండుమని, తన పావలు ఒసగి = తన పాదుకలనిచ్చి, సెలవు పెట్టిన = పంపగా, అపుడు = అప్పుడు, అతడు = ఆ భరతుడు, ఎదన్ = మనసునందు, అలరి = వికాసమునంది,

**తా :** తండ్రి ఆజ్ఞ దాటరాదు. ఈ అడవిలో పదునాలుగు వత్సరములు జరిపి వచ్చెదను. భద్రముగ ఉండుమని తన పాదుకలనిచ్చి పంపగా అప్పుడు భరతుడు మనసున అలరి –

**ఆ.వె.** **దండుతోడఁ గూడి తరలి గొబ్బునఁ దమ**
**నేల కరిగి మొదలి ప్రోలు సొరక**
**మిత్తి వేటకాని తత్తడి యూర నిం**
**పెసఁగ నిలిచి పజల నేలుచుండె** **115**

దండుతోడన్ కూడి = సైన్యముతో కలిసి, తరలి = బయలుదేరి, గొబ్బునన్ = తొందరగా, తమ నేలకు = తమ రాజ్యమునకు, అరిగి = వెళ్ళి, మొదలి ప్రోలు చొరక = రాజధానిని ప్రవేశింపక, మిత్తి వేటకాని = మృత్యువును వేటాడిన శివునియొక్క, తత్తడి ఊరన్ = వాహనము పేరనున్న ఊరియందు (నందిగ్రామమునందు), ఇంపెసగన్= సంతోషముగా, నిలిచి = ఉండి, పజలన్ = ప్రజలను, ఏలుచు ఉండె = పరిపాలించుచుండెను.

**తా :** సైన్యముతో కూడి బయలుదేరి తొందరగా తమ రాజ్యమునకు వెళ్ళి రాజధానిని ప్రవేశింపక నందిగ్రామమునందు నిలిచి సంతోషముగా ప్రజలను పాలించుచుండెను.

**కం. అని నెనరొదవఁగ నిటుల**
**య్యని యోరెపు దిండి దాసరయ్య దెలిపినన్**
**విని బొటియచూలి యెదలోఁ**
**దనివి సనక యవలి కతయుఁ దమి నడుగుటయున్ 116**

అని, ఇటుల, నెనరు ఒదవన్ = ప్రీతిపూర్వకంగా, ఆ అని ఓరెపు తిండి దాసరయ్య = ఆ కలహమే ఆహారముగా కల సంచారి (నారదుడు), తెలిపినన్ = తెలుపగా, విని = విని, బొటియ చూలి = పుట్టలో జనించిన వాల్మీకి మహర్షి, ఎదలోన్ = మనసులో, దనివి చనక = తృప్తి తీరక, అవలి కతయున్ = ఆ తరువాతి కథను, తమిన్ = వినాలనే కోరికతో, అడుగుటయున్ = అడగడంతో–

**తా :** అని ఈ ప్రకారంగా ప్రీతిపూర్వకముగా ఆ నారదుడు తెలుపగా విని వాల్మీకి మనసున తృప్తిపడక ఆ తరువాతి కథను వినాలనే కోరికతో అడుగుటయును

**చం. కదలని తేరు తేటిఁ గడ కానక పూనెడు నారి నారి పైఁ**
**బొదలెడు తూపు తూపు నెటిఁ బ్రోచిన మావులు మావు తిట్టకుం**
**గుదురగు తేరు పూన్పరియు గోమునఁ గ్రాలఁగ గట్టి దీటుచే**
**యెదిరిచి మూఁడు ప్రోళ్ళఁ దెగ నేసిన గద్దటి వేల్పురాయడా! 117**

కదలని = కదలని భూమి, తేరు = రథముగాను, తేటి కడ = భూమియొక్క చివర, కానక పూనెడు = కానక మోసేటటువంటి (ఆదిశేషుడు), నారి = వింటినారిగాను, నారిపైన్ పొదలెడు = ఆదిశేషునిపై ఒప్పేటటువంటి (విష్ణువు), తూపు = బాణముగాను, తూపున్ = బాణమును (పరమాత్ముని), నెటిన్ = చక్కగా, ప్రోచిన = కాపాడుచున్న (వేదములు), మావులు = గుఱ్ఱములు, మావు తిట్టకున్ = వేదముల సమూహమునకు, కుదురగు = మూలమైన (బ్రహ్మదేవుడు), తేరు పూన్పరియు = సారథియునై, గోమున క్రాలగ = చక్కగా ప్రకాశింపగా, గట్టి దీటుచేన్ = సమర్థమైన శక్తిచే, ఎదిరిచి = ఎదిరించి, మూడు ప్రోళ్ళన్ = త్రిపురములను, తెగన్ ఏసిన = కూలకొట్టిన, గద్దటి = దృఢత్వముకల, వేల్పురాయడా = దేవతా శ్రేష్ఠుడా! (శివా!)

**తా :** కదలని భూమి రథముగా, ఆ భూమిని మోసే ఆదిశేషుడు వింటినారిగా, ఆదిశేషునిపై శయనించు విష్ణువు బాణముగా, విష్ణుని మహిమ కాపాడుచున్న వేదములు గుఱ్ఱములుగా, వేదములకు మూలమగు బ్రహ్మ సారథిగా ప్రకాశింపగా సమర్థమైన శక్తితో ఎదిరించి త్రిపురములను కూలకొట్టిన శ్రేష్ఠ దైవమా! శివా!

**కం. తల యేటిఁ జిలువ పేరును**
**బొలుపారు కడింది సౌరు బూచులబారున్**
**మలయూరుఁ బుడమి తేరును**
**గలిగిన నెఱవేల్ప! మొనల కైదువతాల్పా! 118**

తల = తలపైన, ఏటిన్ = గంగను, చిలువ పేరును = నాగాభరణమును, పొలుపారు = ఒప్పుచున్న, కడింది = గొప్ప, సౌరున్ = సొగసును (పార్వతి), బూచుల బారున్ = పిశాచముల

సమూహమును, మల ఊరున్ = కైలాసపర్వతము నివాసమును, పుడమి తేరును = భూమి రథముగాను, కలిగిన = కలిగినట్టి, నెఱ వేల్పా = గొప్ప దైవమా!, మొనల కైదువ తాల్పా = త్రిశూలము ధరించువాడా!

**తా :** తలపైన గంగ, నాగాభరణముతో ఒప్పుచున్న గొప్ప సొగసును, పిశాచముల సమూహమును, కైలాసపర్వత నివాసమును, భూమి రథముగాను కలిగినట్టి గొప్ప దైవమా! త్రిశూలము ధరించువాడా!

**మణిగణనికరము.** **కలువలదొర కొఱగల తలవిరిగా**
**వలిమల లలి నిలువఁ గడఁగు బసగాఁ**
**గలుముల చెలువ మగఁడు గడుఁ జెలిగా**
**మలయుచు జగముల మనుచు నొడయఁడా!** **119**

కొఱగల కలువలదొర = లోపమున్న కలువల ప్రియుడు (చంద్రరేఖ మాత్రమే), తల విరిగాన్ = తలపై పుష్పముగా, వలిమల = మంచుకొండ, లలి = ఇష్టముగా, నిలువన్ కడగు బసగాన్ = ఉండుటకు తగిన నివాసముగాను, కలుముల చెలువ మగడు = సంపదల నిచ్చే స్త్రీ మగడు (విష్ణువు), కడున్ చెలి కాన్ = ప్రియమిత్రుడుగా, మలయుచు = ఒప్పుచు, జగములన్ = లోకములను, మనుచు = రక్షించు, ఒడయడా = ప్రభువా!

**తా :** చంద్రరేఖ తలపై పుష్పముగా, మంచుకొండ నివాసముగా, విష్ణువు చెలికాడుగా ఒప్పుచు లోకములను రక్షించు ప్రభువా!

**గద్యము:**

**ఇది శ్రీమదుమారమణ కరుణా కటాక్ష నిరీక్షణ సంలబ్ధ**
**సరస కవితా సామ్రాజ్య దురంధర ఘన యశోబంధుర కౌండిన్య సగోత్ర పవిత్ర**
**కూచిమంచి గంగనామాత్య పుత్ర బుధజన విధేయ తిమ్మయ నామధేయ ప్రణీతంబయిన**
**యచ్చ తెలుఁగు రామాయణమను మహాకావ్యమందు**
**అయోధ్య కాండము సర్వమేకాశ్వాసము.**

**వ్యాఖ్యాతృ గద్యము:**

**ఇది బుధజన విధేయుండును, బులుసు వంశ సంభూతుండును,**
**కీ.శే. శేషమ్మ వేంకటరమణయ్య పుణ్యదంపతీ తనూజుండును,**
**గౌతమ గోత్రజుండునగు వేంకటసత్యనారాయణమూర్తి**
**ప్రణీతంబైన అచ్చ తెలుఁగు రామాయణమను మహాకావ్యమందు**
**అయోధ్య కాండమునకు టీక, తాత్పర్యములు.**



# అచ్చతెలుఁగు రామాయణము
# అరణ్య కాండము

**కం. సిరుల చెలి మగని యడుగునఁ**
**గర మరుదుగఁ బొడమి ముజ్జగంబుల యందున్**
**గరగరిక నెఱపు జక్కర**
**విరిఁబోడి బొజుంగ! ప్రాఁత వేల్పులగొంగా! 1**

సిరుల చెలి = లక్ష్మీదేవి, మగని అడుగునన్ = భర్త పాదమునందు, కరము అరుదుగన్ = మిక్కిలి ఆశ్చర్యకరముగా, పొడమి = పుట్టి, మూడు జగంబుల అందున్ = మూడు లోకములందును, గరిగరికన్ నెఱపు = నైర్మల్యమును కలిగించు, జక్కర విరిబోడి = ప్రవహించు స్త్రీ (గంగానది), బొజుంగ = విటుడైనవాడా!, ప్రాత వేల్పుల గొంగా = రాక్షసులకు శత్రువైనవాడా?
**తా :** లక్ష్మీదేవి భర్త (విష్ణు) పాదమునందు పుట్టి మూడులోకములను పవిత్రముచేయు గంగ విటుడైనవాడా! రాక్షసులకు శత్రువైనవాడా!

**తే.గీ. వినుము కత వేల్పుజడదారి విన్ను చూలి**
**మేపరుల నట్టు పుట్టువు మేటి తపసిఁ**
**గాంచి యిట్లను నంత నగ్గట్టు మీఁదఁ**
**దరలి రాగవు లవలికి దాఁటి చనుచు 2**

వినుము కత = ఆ పైని కథను వినుము, వేల్పు జడదారి = నారదుడు, విన్నుచూలి మేపరుల = వాయువు ఆహారముగాకల పాములయొక్క, నట్టు పుట్టువు = స్థానమున జనించినట్టి, మేటి తపసిన్ = గొప్ప తపస్విని (వాల్మీకిని), కాంచి = చూచి, ఇట్లు అనున్ = ఇట్లు పలికెను. అంతన్ = ఆ తరువాత, రాగవులు = రఘువంశ శ్రేష్ఠులైన వారు, ఆ గట్టు మీదన్ = ఆ చిత్రకూట పర్వతము మీదనుండి, తరలి = వెళ్ళి, ఆవలికి దాటి = అవతలకి చేరి, చనుచు = పయనించుచు,
**తా :** ఆ పై కథ వినుము. నారదుడు గొప్ప తపస్వియగు వాల్మీకిని చూచి ఇట్లు పలికెను 'ఆ తరువాత రఘువంశశ్రేష్ఠులైన సీతారామలక్ష్మణులు చిత్రకూట పర్వతమునుండి బయలుదేరి కొండ అవతలికి చేరి పయనించుచు.

**తే.గీ.** **దారిలో నత్రియను జడదారి తేని**
**నెలవునకుఁ బోయి యందు నబ్బలియుఁ దొసఁగు**
**పూజ లెల్లను గైకొని పొసఁగ నచటు**
**వెడలి దండక యనియెడు నడవి దరిసి** **3**

దారిలోన్ = మార్గమధ్యమున, అత్రియను జడదారి తేని = అత్రియను మునిశ్రేష్ఠునియొక్క, నెలవునకున్ పోయి = ఆశ్రమమునకు వెళ్ళి, అందున్ = అచట, ఆ బలియుడు ఒసగు = ఆ శ్రేష్ఠుడు ఇచ్చునట్టి, పూజలు ఎల్లను, కైకొని = స్వీకరించి, పొసగన్ = చక్కగా, అచటు వెడలి = ఆ చోటునుండి బయలుదేరి, దండక యనియెడున్ అడవి = దండకమని పిలువబడే అరణ్యమును, దరిసి = చేరి.
**తా :** మార్గమధ్యమున అత్రి మహర్షి ఆశ్రమమునకు వెళ్ళి ఆయన సత్కారములను స్వీకరించి అక్కడినుండి బయలుదేరి దండకారణ్యము చేరి –

**సీ.** **పులులు దోఁదేళ్ళు దుప్పులును జివ్వంగులు**
**నెలుఁగులుఁ బందులు నేనుఁగులును**
**గురుపోతు లేఁదులుఁ గోఁతులు మనుఁబోతు**
**లెనుబోతులును తేఁచు లిఱ్ఱు దచ్చి**
**కాళ్ళ మెకంబులుఁ గడతులు దప్పులుఁ**
**గుందేళ్ళు నక్కలుఁ గొండముచ్చు**
**లెక్కుడు మెకపు సూళ్ళిరుదల గ్రుడ్డు కా**
**నుపులుఁ బిల్లులు నడిదపు మెకములు**

**తే.గీ.** **మొదలుగాఁ గల కాఱుమెకంబులకు నెల్లఁ**
**దానకంబగు నబ్బలు కానలోనఁ**
**జొచ్చి విచ్చలవిడిఁ జనుచో విరాధుఁ**
**డనెడు రక్కసుఁ డొకఁడు పెంపడరఁ జేరి** **4**

పులులు తోడేళ్ళు దుప్పులును, చివ్వంగులు = సివంగులును, ఎలుగులున్ = ఎలుగుబంట్లును, పందులున్ = అడవిపందులును, ఏనుగులును = ఏనుగులును, గురుపోతులు = గవయ మృగములును, ఏదులున్ = ఏదుపందులును, కోతులు = కోతులు, మనుబోతులు = ఋశ్యమృగములు, ఎనుబోతులును = అడవి దున్నలును, తేచులు = కుక్కలు, ఇఱ్ఱు = ఇఱ్ఱులును, దచ్చికాళ్ళ మెకంబులు = ఎనిమిది కాళ్ళ శరభములును, కడతులు = గంధర్వ మృగములును, దప్పులు = జింకలును, కుందేళ్ళు, నక్కలు, కొండముచ్చులు, ఎక్కుడు మెకపు సూళ్ళు = ఏనుగులకు విరోధులైన సింహములును, ఇరు తల గ్రుడ్డు కానుపులున్ = రెండు తలలుకల పాములును, పిల్లులున్ = అడవి పిల్లులును, అడిదపు మెకములు = ఖడ్గ మృగములు, మొదలుగాన్ కల = మొదలుకొని ఉన్నటువంటి, కాఱు మెకంబులకు ఎల్లన్ = అడవి జంతువులకన్నిటికి, తానకంబు అగు = స్థానమైన, ఆ బలు కానలోనన్ = ఆ దట్టమైన అడవిలోపల, చొచ్చి = ప్రవేశించి,

విచ్చలవిడి చనుచోన్ = స్వేచ్ఛగ వెళ్ళుచుండగా, విరాధుడు అనెడు రక్కసుడు ఒకడు = విరాధుడను పేరుగల రాక్షసుడు ఒకడు, పెంపు అడరన్ = పరాక్రమముతో, చేరి = సమీపించి –

**తా :** పులులు,తోడేళ్ళు,దుప్పులు,సివంగులు,ఎలుగుబంట్లు,అడవిపందులు,ఏనుగులు, గవయమృగములు,ఏదుపందులు,కోతులు,మనుబోతులు,ఎనుబోతులు,రేచులు,ఇఱ్ఱులు, శరభములు,కడతులు,జింకలు,కుందేళ్ళు,నక్కలు,కొండముచ్చులు,సింహములు,పాములు, అడవిపిల్లులు,ఖడ్గమృగములు మొదలుగా ఉన్నటువంటి అడవిజంతువులన్నిటికి స్థానమైన ఆ కీకారణ్యములో ప్రవేశించి వెళ్ళుచుండగా విరాధుడను రాక్షసుడు చేరి –

**కం. అప్పుడమి కాన్పు నెత్తుక**
**తిప్పునఁ జదలునకు నెగసి రేచిన కడఁకన్**
**గుప్పునఁ జను తఱి నొడయఁడు**
**తప్పక యొక కోల వాని తలఁ దెగనేసెన్ 5**

ఆ పుడమి కాన్పున్ = ఆ భూమికి పుట్టిన సీతాదేవిని, ఎత్తుక = ఎత్తుకొని, తిప్పున = వేగముగా, చదలునకు = ఆకాశమార్గమునకు, ఎగసి = ఎగిరి, రేచిన = రెచ్చిపోయిన, కడకన్ = పూనికతో, గుప్పునన్ = తొందరగా, చను తఱిన్ = వెళ్ళిపోతున్న సమయంలో, ఒడయడు = రాముడు, తప్పక = గుఱి చూచి, ఒక కోలన్, వాని తలన్ = వాని శిరస్సును, తెగనేసెన్ = ఖండించెను.

**తా :** ఆ సీతాదేవిని ఎత్తుకొని వేగముగా ఆకాశమార్గమున ఎగిరి వెళ్ళిపోతున్న సమయంలో రాముడు గుఱిచూచి ఒక్క బాణముతో వాని శిరస్సును ఖండించెను.

**ఆ.వె. ఏసి తలఁకుచున్న యెలనాగ వెఱపెల్లఁ**
**దీర్చి బుజ్జగించి తెఱువు వట్టి**
**చనుచు నెలమి నెదుర శరభంగుఁడను జడ**
**దారి యొసఁగు పూజఁ దనరఁ గాంచి 6**

ఏసి = ఆ విరాధుని తలను ఖండించి, తలకుచున్న = బెదరుచున్న, ఎలనాగ = యౌవనవతియగు సీతాదేవియొక్క, వెఱపు ఎల్లన్ తీర్చి = భయమునంతను పోగొట్టి, బుజ్జగించి = ఓదార్చి, తెఱువు పట్టి చనుచు = మార్గమును పట్టుకొని వెళ్ళుచుండగా, ఎలమిన్ = సంతోషముతో, ఎదురన్ = ఎదుట, శరభంగుడను జడదారి = శరభంగుడను పేరుగల తపస్వి, ఒసగు = ఇచ్చునట్టి, పూజన్ = సపర్యలను, దనరన్ కాంచి = తగినరీతిగా పొంది.

**తా :** విరాధుని తలను ఖండించి బెదరుతున్న సీతకు భయమును పోగొట్టి, ఓదార్చి వెళ్ళుచుండగా, ఎదుట సంతోషముతో శరభంగ ముని ఇచ్చు సపర్యలను చక్కగా పొంది.

**ఆ.వె. మఱువ కందు జోగి తెఱవాయి మెకమున్న**
**చెంత కరిగి యతనిచేత విండ్లు**
**గత్తలములు దూపుగములును దద్దయుఁ**
**గొంచు నంతఁ జనిరి పంచవటికి 7**

మఱువక = జ్ఞాపకముంచుకొని, అందున్ = ఆ అరణ్యమునందు, జోగి తెఱవాయి మెకము = యోగి సింహమైన అగస్త్యుడు, ఉన్న చెంతకు అరిగి = ఉన్న చోటికి వెళ్ళి, అతనిచేత = ఆ అగస్త్యుని చేత, విండ్లు = ధనుస్సులు, కత్తలములు = కవచములు, తూపు గములును = బాణ సమూహములను, తద్దయున్ = మిక్కిలిగా, కొంచు = స్వీకరించుచు, అంతన్ = అంతట, పంచవటికి = పంచవటికి (పంచ వటములు (మఱ్ఱిచెట్లు) ఉన్న అడవి – పంచవటి) చనిరి = వెళ్ళిరి.

**తా :** మఱువక అందు యోగి సింహమైన అగస్త్యుడు ఉన్నచోటికి వెళ్ళి అతనినుండి ధనుస్సులు, కవచములు, బాణములను స్వీకరించి, పంచవటికి వెళ్ళిరి.

**తే.గీ.** **చని వెఱవు మీఱ నొక యాకుఁ జవికె నచట**
**నిలుపుకొని పండ్లు దుంపలు నెలమిఁ దినుచు**
**నున్నచో నబ్బురం బొప్ప నొక్కనాడు**
**సుప్పనక యను రక్కస జోటి యొకతె** **8**

చని = పంచవటికి వెళ్ళి, అచట = అచ్చట, వెఱవు మీఱన్ = మిక్కిలి నేర్పుగా, ఒక ఆకు చవికెను = ఒక పర్ణశాలను, నిలుపుకొని = నిర్మించుకొని, పండ్లు దుంపలు ఎలమిన్ తినుచు = పండ్లను, దుంపలను సంతోషముగా తినుచు, ఉన్నచోన్ = ఉండగా, ఒక్కనాడు = ఒకరోజున, అబ్బురంపు ఒప్పన్ = ఆశ్చర్యకరముగా, సుప్పనకయను = శూర్పణఖయను, రక్కసజోటి ఒకతె = ఒక రాక్షస స్త్రీ.

**తా :** పంచవటికి వెళ్ళి అక్కడ ఒక పర్ణశాలను నిర్మించుకొని పండ్లు, దుంపలు తింటూ ఉండగా ఒకనాడు శూర్పణఖ అను ఒక రాక్షస స్త్రీ.

**కం.** **నీటొదవఁగ నయ్యొడయని**
**చోటికిఁ బరతెంచి వలపు సొంపెసలారన్**
**జోటి పనుల్ గోరిన న**
**జ్జోటిం గని పొలసుదిండి సూఁడిట్లనియెన్** **9**

నీటు ఒదవగన్ = గర్వము అతిశయింపగా, ఆ యొడయని చోటికి = ఆ రాముడున్న చోటికి, పరతెంచి = వచ్చి, వలపు సొంపు ఎసలారన్ = వలపు సొగసును ఒలకబోయుచు, జోటిపనుల్ కోరిన = జంటగా చేయవలసిన పనులను కోరగా, ఆ జోటిన్ కని = ఆ స్త్రీని చూచి, పొలసు తిండి సూడు = మాంసాహారులగు రాక్షసులకు శత్రువగు రాముడు, ఇట్లు అనియెన్ = ఈ రీతిగా అనెను.

**తా :** నీటుగా రాముని చేరి వలపు సొంపు లొలకపోయుచు జోటిపనుల్ కోరగా, ఆ స్త్రీని చూచి రాముడు ఇట్లు అనెను.

**కం.** **మగువా! మగువం దగిలిన**
**మగవానిం గోరుకొనుట మంచిదె? నీకున్**

**దగువాఁడు లక్ష్మణుం డా**
**జగజెట్టిం గోరుకొనుము సరగ నటన్నన్** **10**

మగువా = ఓ కాంతా! మగువన్ = భార్యను, దగిలిన = కూడియున్న, మగవానిన్, కోరుకొనుట మంచిదె = కోరుకోవడం మంచిదంటావా?, నీకున్ తగువాడు = నీకు తగినవాడు, లక్ష్మణుడు, ఆ జగజెట్టిన్ = ఆ శూరుని, సరగన్ = శీఘ్రముగా, కోరుకొనుము అటన్నన్ = కోరుకో అనగానే –

**తా :** 'ఓ కాంతా! భార్యను కూడిన పురుషుని కోరుకొనుట మంచిదా? నీకు తగ్గవాడు లక్ష్మణుడు. ఆ శూరుని కోరుకో' అనగానే –

**ఆ.వె.** **సంతసించి యతివ చెంతకట్టులు వోవఁ**
**జేటగోళ్ళ బోటి బూటకంబు**
**దెలిసి యవ్వలంతి దిట మొప్పఁగా దాని**
**ముక్కు సెవులు నొకటఁ జెక్కివైచె** **11**

అతివ = ఆ శూర్పణఖ, సంతసించి = సంతోషించి, చెంతకు = ఆ లక్ష్మణుని దగ్గరకు, అట్టులు = రాముడు చెప్పిన రీతిగా, పోవన్ = వెళ్ళగా, చేటగోళ్ళ బోటి = చేటలవంటి గోళ్ళు కల స్త్రీ (శూర్పణఖ), బూటకంబు = కపటమును, తెలిసి = తెలుసుకొని, ఆ వలంతి = ఆ సమర్థుడు, దిటము ఒప్పగా = నిశ్చయించుకుని, దాని = ఆ శూర్పణఖ యొక్క, ముక్కు చెవులు = ముక్కును, చెవులను, ఒకటన్ = ఒక్కసారిగా, చెక్కివైచె = చెక్కివేసెను.

**తా :** ఆ శూర్పణఖ సంతోషించి రాముడు చెప్పిన రీతిగా లక్ష్మణుని దగ్గరకు వెళ్ళగా ఆమె కపటమును తెలుసుకొని లక్ష్మణుడు ఆమె ముక్కు చెవులను చెక్కివేసెను.

**సీ.** **వైచినఁ గ్రొత్తగాఁ బూచిన మోదుగు**
**కరణి నత్తెఱవ నెత్తురుల దోఁగి**
**నానయు నలుకయు లోనఁ బెనంగొన**
**ఖరుఁడు దూషణుఁడు త్రిశిరుఁడు ననఁగఁ**
**బరగు రే ద్రిమ్మరి దొరల పాలికిఁ బోయి**
**యత్తెఱం గెఱిఁగించి యలమటింప**
**నాలంబునకుఁ బదునాలుగు వేల ర**
**క్కసులతో వాండ్రు రాగవుని మీదఁ**

**తే.గీ.** **దరలి వచ్చిన నవ్విలు దాల్పు గడిమి**
**నెదురుకొని పెక్కు నెఱదూపు లేసి యెల్ల**
**నల్ల ద్రావుడు మూఁకఁల ద్రెళ్ళఁ జేసి**
**యగ్గరాసుల పైని బిట్టార్చు కొనుచు** **12**

వైచినన్ = ముక్కు చెవులు చెక్కివేయగా, ఆ తెఱవ = ఆ శూర్పణఖ, క్రొత్తగాన్ పూచిన మోదుగు కరణిన్ = క్రొత్తగా పూచిన మోదుగు చెట్టువలె, నెత్తురుల దోగి = రక్తంతో తడిసి, నానయున్ = సిగ్గును, అలుకయు = కోపమును, లోనన్ = మనసు లోపల, పెనంగొన = కలచివేయగా, ఖరుడు, దూషణుడు, త్రిశిరుడు, అనగన్ బరగు = అనగా ఒప్పునట్టి, రేద్రిమ్మరి దొరల పాలికి = రాక్షస నాయకుల దగ్గరకు, పోయి = వెళ్ళి, ఆ తెఱంగు = ఆ విషయమును, ఎఱింగించి = తెలిపి, అలమటింప = ఏడ్వగా, వాండ్రు = వాళ్ళు, రాగవుని మీదన్ = రాముని మీదకు, ఆలంబునకున్ = యుద్ధమునకు, పదునాలుగు వేల రక్కసులతో = పద్నాలుగు వేలమంది రాక్షసులతో, తరలి వచ్చిన = బయలుదేరి రాగా, ఆ విలు తాల్పు = ఆ ధనుర్ధారి, కడిమిన్ = సాహసముతో, ఎదురుకొని = ఎదిరించి, పెక్కు నెఱ తూపులు ఏసి = అనేకములైన వాడియైన బాణములను వేసి, ఎల్ల నల్లద్రావుడు మూకలన్ = రక్తం త్రాగే రాక్షస సమూహాల నన్నిటిని, త్రెళ్ళన్ చేసి = చంపి, ఆ గరాసులపైనన్ = ఆ దుష్టులమీదకు, బిట్టు ఆర్చుకొనుచు = గట్టిగా సింహనాదము చేయుచు.

**తా :** ముక్కు, చెవులు చెక్కివేయగా ఆ శూర్పణఖ క్రొత్తగా పూచిన మోదుగుచెట్టువలె రక్తంతో తడిసి సిగ్గు, కోపము మనసును కలచివేయగా ఖరుడు, దూషణుడు, త్రిశిరుడు అను రాక్షస నాయకులకు పోయి తెలుపగా వాళ్ళు రాముని మీదకు యుద్ధమునకు పదునాలుగువేల రాక్షసులతో బయలుదేరి రాగా రాముడు వారి నెదిరించి వాడి బాణములతో రాక్షస సైన్యములను చంపి, ఆ దుష్టుల మీదకు సింహనాదము చేయుచు.

**కం.** **బలు నారసములు వఱపినఁ**
**దలఁకక యబ్బలియురుక్కు దళుకొత్తఁగ ని**
**ప్పులు గ్రక్కెడు బెడిదపు ము**
**ల్కులుఁ దఱచుగ నతనిమీదఁ గురిసిరి మరలన్** **13**

బలు నారసములు = కఠినమైన బాణములు, పఱపినన్ = ప్రయోగింపగా, తలకక = చలించక, ఆ బలియురు = ఆ బలవంతులు, ఉక్కు తళుకొత్తగన్ = తమ బలము ప్రకాశమానమగునట్లుగ, నిప్పులు క్రక్కెడు = నిప్పులు కక్కేటటువంటి, బెడితపు ముల్కులు = వాడియైన బాణములు, తఱచుగన్ = దట్టముగా, మరలన్ = తిరిగి, అతనిమీద = ఆ రామునిమీద, కురిసిరి = కురిపించిరి.

**తా :** కఠినమైన బాణములు ప్రయోగింపగా చలించక ఆ బలవంతులు తమ బలము ప్రకాశమాన మగునట్లుగ నిప్పులు కక్కే వాడి బాణములు రామునిమీద కురిపించిరి.

**కం.** **అక్కరణిఁ బోరు టక్కరి**
**రక్కసి గమికాండ్రు ముప్వురన్ మానిసితేఁ**
**డొక్కొక్క కఱకుటమ్మున**
**జిక్కంగా నీక తలలు చదిమెన్ గినుకన్** **14**

ఆ కరణిన్ = ఆవిధముగా, పోరు = యుద్ధము చేయుచున్న, టక్కరి = వంచకులైన, రక్కసి గమికాండ్రు మువ్వురన్ = రాక్షస నాయకులు ముగ్వురను, మానిసి ఱేడు = మనుజ ప్రభువగు రాముడు, కినుకన్ = కోపముతో, ఒక్కొక్క కఱకు అమ్మున = ఒక్కొక్క వాడియైన బాణముతో, చిక్కంగా నీక = మళ్ళీ దొరకకుండా, తలలు చిదిమెన్ = తలలు ఖండించెను.

**తా :** ఆ విధముగా యుద్ధము చేయుచున్న వంచకులైన రాక్షస నాయకులు మువ్వురను రాముడు కోపముతో ఒక్కొక్క వాడి బాణముతో మళ్ళీ దొరకకుండా తలలు ఖండించెను.

**ఆ.వె.** **అట్లు వాండ్రు మువ్వురడఁగిన నడలుచు**
**సుప్పనాతి మిగుల స్రుక్కి లంక**
**కరిగి తోడఁబుట్టువగు రావణునిఁ గాంచి**
**తన తెఱంగుఁ దెలియ వినుచుటయును** **15**

అట్లు = ఆ విధముగా, వాండ్రు మువ్వురు = వాళ్ళు ముగ్గురును, అడగిన = చచ్చిన, అడలుచు = ఏడ్చుచు, చుప్పనాతి = శూర్పణఖ, మిగుల స్రుక్కి = మిక్కిలి భయపడి, లంకకు అరిగి = లంకకు వెళ్ళి, తోడ పుట్టువగు రావణుని కాంచి = సోదరుడైన రావణుని చూచి, తన తెఱంగు = తనకు జరిగిన అవమానమును, తెలియ = తెలియునట్లుగా, వినుచుటయును = వినిపించుటయును,

**తా :** ఆ విధముగా వాళ్ళు ముగ్గురు చనిపోగా, ఏడ్చుచు శూర్పణఖ లంకకు వెళ్ళి సోదరుడైన రావణుని చూచి – తనకు జరిగిన అవమానమును తెలియునట్లుగా వినిపించుటయును.

**కం.** **కలఁకయు నలుకయు నెదలో**
**మొలవఁగ నమ్మేటి సోఁకు మూఁకల ఱేఁడో**
**చెలియల! నిన్నిటు చేసిన**
**పలువల తెఱఁగెల్ల నేఱుపఱపు మటన్నన్** **16**

ఎదలోన్ = మనసులో, కలకయున్ = బాధయును, అలుకయున్ = కోపమును, మొలవగన్ = మొలకెత్తగా, ఆ మేటి సోకుమూకల ఱేడు = ఆ శూరుడైన రాక్షసుల రాజు (రావణుడు), ఓ చెలియల!, నిన్ను ఇటు చేసిన = నిన్ను ఇలా కురూపిని చేసిన, పలువల = దుష్టుల, తెఱగు ఎల్లన్ = విషయమునంతను, ఏఱుపఱపుము అటన్నన్ = వివరింపుము అనగా –

**తా :** మనసులో బాధ, కోపము మొలకెత్తగా ఆ రావణుడు ఓ చెల్లెలా! నిన్ను ఇలా కురూపిని చేసిన దుష్టుల విషయమంతా వివరించు, అనగా –

**ఆ.వె.** **అన్నెలంత పలికె 'అన్న! నిన్నెఱుఁగక**
**చేటు కొఱకు నిట్లు చేసినట్టి**
**కూళ నేలవేల్పు కొమరుల తెఱఁగేమి**
**దెలుపవలయు? నొక్క పలుకు వినుము** **17**

ఆ నెలంత = ఆ శూర్పణఖ, పలికెన్ = ఈ రీతిగా పలికెను, అన్న = ఓ అన్నా రావణా!, నిన్ను ఎఱుగక = నీ గురించి తెలియక, చేటు కొఱకు = నాశనము కొరకు, ఇట్లు = ఈ విధముగా,

చేసినట్టి = చేసినటువంటి, కూళ నేలవేల్పు కొమరుల తెఱగు = నీచులైన రాజకుమారుల పద్ధతిని, ఏమి దెలుపవలయు = ఏం చెప్పాలి?, ఒక్క పలుకు వినుము = ఒక్క మాట విను (చాలు)

**తా :** ఆ శూర్పణఖ ఈ రీతి పలికెను 'ఓ అన్నా! నీ గురించి తెలియక నాశనము కోరి ఈ రీతి చేసిన నీచ రాజకుమారుల గురించి ఏం చెప్పాలి? ఒక్క మాట విను

**కం.** **ఆ రాముని నెడఁ బాయక**
**గారామున మెలఁగుచున్న కన్నియ నెఱయొ**
**య్యారం బెన్నిక సేయఁగ**
**నే రాకన్నియల యందు నెఱుఁగము సుమ్మీ! 18**

ఆ రామునిన్ = ఆ రాముని, ఎడబాయక = విడువక, గారామున = ప్రేమతో, మెలగుచున్న = ఉంటున్న, కన్నియ = సీతయొక్క, నెఱ యొయ్యారంబు = చక్కని విలాసమును, ఎన్నిక చేయంగన్ = పరిశీలించి చూడగా, ఏ రాకన్నియల యందున్ = ఏ రాచకన్యలయందును, ఎఱుగము సుమ్మీ = తెలియము సుమా!

**తా :** ఆ రాముని విడువక ప్రేమతో వుంటున్న సీత విలాసమును పరిశీలింపగా ఏ రాచకన్యల యందును ఎఱుగము సుమా!

**కం.** **రక్కసి మగువల యందును**
**జక్కుల చెలులందు వేల్పు చానల యందున్**
**బక్కి దొరర కొలపు నవలా**
**రొక్కమునందైన నట్టి రూపసి గలదే? 19**

రక్కసి మగువల యందును = రాక్షస స్త్రీలయందును, జక్కుల చెలులందు = యక్ష కన్యలయందును, వేల్పు చానల యందున్ = దేవతా స్త్రీలయందును, పక్కిదొరర కొలపు నవలా రొక్కమునందైన = పక్షిదొరర (గరుత్మంతుడు) వంశమునకు చెందిన స్త్రీ సమూహములో కాని, అట్టి = అటువంటి, రూపసి కలదే = సౌందర్యవతి ఉన్నదా?

**తా :** రాక్షస స్త్రీలయందు, యక్ష కన్యలయందు, దేవకాంతలయందు, గరుడ వనితల యందు అటువంటి సౌందర్యవతి లేదు.

**చం.** **నిలుకడ గన్న కాఱ్మెఱుఁగు నిద్దఁపుఁ బల్కులు నేర్చుకొన్న క్రొం**
**దళుకు పసిండి బొమ్మ మెయిఁదాల్చి మెలంగెడు గుజ్జుమావి పే**
**ర్వలపలఁ బడ్డ మానికము వాఁడఁగ నేరని పూవుబంతి నాఁ**
**జిలుకల కొల్కి యబ్బురపుఁ జెల్వమునం దనరారు సారెకున్ 20**

ఆ చిలుకల కొల్కి, నిలుకడ కన్న = నిలబాటును పొందిన, కాఱ్మెఱుగు = మెఱపుతీగ, నిద్దపు = స్పష్టంగా, పల్కులు నేర్చుకొన్న, క్రొత్త తళుకు పసిడి బొమ్మ = క్రొత్తదై మెఱుస్తున్న బంగారు బొమ్మ, మెయిన్ తాల్చి = రూపము ధరించి, మెలంగెడు = సంచరిస్తున్న, గుజ్జు మావి = గున్నమామిడి, పేరు వలపలన్ పడ్డ మానికము = పేరొంది ప్రసిద్ధిచెందిన మాణిక్యము, వాడగ

నేరని = వాడిపోనటు వంటి, పూబంతి నాన్ = పూలగుత్తి అనునట్లుగా, సారెసారెకున్ = చూచిన ప్రతి సారెకును, అబ్బురపున్ = ఆశ్చర్యమును కలిగించు, చెల్వమునన్ = సౌందర్యముతో, తనరారున్ = ఒప్పును.

**తా :** ఆ ఆడుది నిలచిన మెఱుపుతీగ, మాటలు నేర్చిన బంగరు బొమ్మ, రూపము దాల్చిన గున్నమామిడి, పేరొందిన మాణిక్యము, వాడని పూలగుత్తి అనునట్లుగా చూచిన ప్రతిసారీ ఆశ్చర్యపరచు సౌందర్యముతో ఒప్పుచున్నది.

**సీ.** **తమ్మికెంపులకు నెత్తావిఁ గూర్పని తప్పు**
**చివురులఁ గార్కొనఁ జేయు అవ్వ**
**కలికి మించులకు నిల్కడ యీని యారడి**
**కడలి వెన్నకు మచ్చ యిడిన యెగ్గు**
**జక్కవ పులుగుల జత విప్పు కొద పుట్ట**
**పెద్దల మలకలఁ బెట్టు అట్టు**
**మబ్బుల యవయుట ల్మాన్పని యాడిక**
**తొగల డాల్పగ లెల్ల ద్రోచు వాదు**

**తే.గీ.** **మలపుకొనఁ బోలు నలువ యత్తలిరుఁ బోఁడి**
**మోవియును గేలు నొడలును ముద్దు మోముఁ**
**గులుకు గుబ్బల నూఁగారు క్రొమ్ముడియును**
**దళుకు నునుసోఁగ వెడఁద కన్నులు నొనర్చి** **21**

నలువ = బ్రహ్మ, ఆ తలిరుబోడి = ఆ చిగురుటాకులవంటి మెత్తని దేహముకల సీతాదేవియొక్క, మోవియును = పెదవిని, కేలును = చేతులును, ఒడలును = దేహమును, ముద్దు మోము = అందమైన ముఖమును, కులుకు గుబ్బలన్ = సొగసైన స్తనములను, నూగారు = రోమావళిని, క్రొమ్ముడిని = కేశబంధమును, తళుకు = ప్రకాశించు, నునుసోగ = మిక్కిలి సొగసైన, వెడద = విశాలములైన, కన్నులు = నేత్రములను, ఒనర్చి= చేసి, తమ్మి కెంపులకు = పద్మరాగ మణులకు, నెత్తావి = నిండైన పరిమళమును, కూర్పని = చేర్చని, తప్పు = దోషమును (మోవి), చివురులన్ = చిగురుటాకులను, కారు కొనన్ చేయు = నల్లనివాటినిగా చేయు, అవ్వ = నిందను (కేలు), కలికి మించులకు = అందమైన మెఱుపుతీగలకు, నిల్కడ ఈని = స్థిరత్వము నివ్వని, ఆరడి = తప్పును (ఒడలు), కడలి వెన్నకు = సముద్రము చిలుకగా వచ్చిన వెన్నకు (చంద్రునకు), మచ్చన్ = కళంకమును, ఇడిన ఎగ్గు = ఉంచిన దోషమును (మోము), జక్కవ పులుగుల జత = చక్రవాక పక్షుల జంటకు, విప్పు = వియోగము కల్పించు, కొద = తప్పును (గుబ్బలు), పుట్ట పెద్దలన్ = సర్పరాజులయందు, మలకలన్ పెట్టు = వంకరదారులను పెట్టిన, అట్టు = దొసగును (నూగారు), మబ్బులన్ = మేఘములందు, అవయుటల్ = చెదరిపోవుటను, మాన్పని = పోగొట్టని, ఆడిక = నిందను (క్రొమ్ముడి), తొగల డాల్ = కలువ కాంతులను, పగలు ఎల్లన్ = పగటి

భాగమంతయు, త్రోచు = తోసివేసిన, వాదు = నిందను (కన్నులు), మలపుకొనన్ పోలున్ = పోగొట్టుకొనుటకే యగును.

**తా :** బ్రహ్మ ఆ సీత పెదవులను, చేతులను, దేహమును, ముఖమును, స్తనములను, రోమావళిని, కేశబంధమును, నేత్రములను చేసింది పద్మరాగమణులకు పరిమళము కూర్పని తప్పును, చిగురుటాకులను నల్లగా చేసిన నిందను, మెఱుపు తీగలకు స్థిరత్వము నివ్వని తప్పును, చంద్రునకు కళంకముంచిన దోషమును, చక్రవాకములకు వియోగము కల్పించు తప్పును, సర్పములకు వంకరదారులు పెట్టిన దొసగును, మేఘములకు చెదరిపోవుటను మాన్పని నిందను, కలువలకు పగటిభాగము తోసివేసిన నిందను పోగొట్టుకొనుటకే యగును.

**సీ.** **తాఁబేలు కడుపులోఁ దలఁగ్రుక్కుకొనియెఁ బో**
**తెఱవ మీఁగాళ్ళతో దినుసు గాక**
**బలు రాజనంపుఁ బొట్టలు పీఁకె వాఱెఁబో**
**ముద్దియ పిక్కల కుద్ది గాఁక**
**చెలువంపు టిసుక తిట్టలు మెత్తవడియెఁ బో**
**జోటి పిఱుందులు దీటు గాక**
**పడగ తాలుపు మోము ముడుచుక యుండెఁబో**
**బోఁటి నూఁగారుతో సాటి గాక**

**తే.గీ.** **తరఁగ చాల్పులు విచ్చెఁబో తరతరంబ**
**చేడియల మిన్న తరులతో నీడు గాక**
**చిందములు వెల్ల నయ్యెఁబో చిగురుటాకుఁ**
**బోఁడి నాడెంపుఁ గుత్తుక పురుడు గాక** **22**

తెఱవ = ఆ సీతాదేవియొక్క, మీదు కాళ్ళతోన్ = పాదముల పైభాగముతో, దినుసు కాక = సమానము కాలేక, కచ్ఛపము = తాబేలు, కడుపులోనన్ = కడుపులోనికి, తల క్రుక్కుకొనియె పో = తల కుక్కుకుందికదా!, ముద్దియ పిక్కలకు = సీతాదేవియొక్క జంఘలకు, ఉద్ది కాక = సమానము కాలేక, బలు = శ్రేష్ఠమైన, రాజనంపు పొట్టలు = వరిపైరుల పొట్టలు, పీకె వాఱెన్ పో = చప్పబడిపోయెనుకదా! జోటి పిఱుందులు = సీతాదేవియొక్క పిఱుదులకు, దీటు కాక = సమానము కాక, చెలువంపు = అందమైన, ఇసుక తిట్టలు = ఇసుక తిన్నెలు, మెత్తవడియె పో = పఱుపుగా నయ్యెను కదా!, బోటి నూగారుతో = సీతాదేవియొక్క రోమావళితో, సాటి కాక = సమానము కాక, పడగ తాలుపు = పాము, మోము ముడుచుక ఉండె పో = ముఖము ముడుచుకుని ఉండిపోయెనుకదా!, చేడియల మిన్న = స్త్రీ రత్నమైన సీతాదేవియొక్క, తరులతోన్ = వళులతో, ఈడు కాక = సమానము కాక, తరగ చాల్పులు = కెఱటముల వరుసలు, తరతరంబ విచ్చెన్ పో = పరంపరగా చెదరిపోయినవి కదా! చిగురు ఆకు బోడి = సీతాదేవియొక్క, నాడెంపు = శ్రేష్ఠమైన, కుత్తుక = కంఠముతో, పురుడు కాక = సమానము కాలేక, చిందములు వెల్లనయ్యెన్ పో = శంఖములు తెల్లబారెనుకదా!

**తా :** ఆ సీత మీగాళ్ళను పోలలేక తాబేలు కడుపులోనికి తల కుక్కుకుంది. జంఘలకు సాటి రాలేక వరి పొట్టలు చప్పబడిపోయాయి. పిఱుదులకు సమానము కాక ఇసుక తిన్నెలు మెత్తబడ్డాయి. నూగారుకు సాటికాక పాము ముఖము ముడుచుకొంది. వళులకు ఈడు కాక కెరటములు పరంపరగా చెదరిపోయాయి. కంఠమునకు సాటి కాక శంఖములు తెల్లబారేయి.

**ఆ.వె.** **కలికి కురుల నిడుపు కన్నుల వెడలుపు**
**గుబ్బదోయి హెచ్చు గొనబుఁ గౌను**
**కొంచెదనము పిఱుఁదు గొబరును బొక్కిలి**
**లోఁతు నెన్న నెన గలుగుట యరిది** **23**

కలికి కురుల నిడుపు = సీతాదేవియొక్క వెంట్రుకల పొడవును, కన్నుల వెడలుపు = కన్నుల విశాలత్వమును, గుబ్బదోయి = చన్నుల యొక్క, హెచ్చు గొనబున్ = అధికమైన మనోజ్ఞతయు, కౌను కొంచెముతనము = నడుము కృశత్వమును, పిఱుదు గొబరును = కటి ప్రదేశపు విశాలత్వమును, పొక్కిలి లోతును = నాభి లోతును, ఎన్నన్ = ఎంచగా, ఎన కలుగుట = సాటి ఉండుట, అరిది = అశక్యము.

**తా :** సీత వెంట్రుకల నిడుపును, కన్నుల విశాలత్వమును, చన్నుల మనోజ్ఞతను, నడుము కృశత్వమును, కటి విపులత్వమును, నాభి లోతును ఎంచగా సాటి యుండుట అశక్యము.

**తే.గీ.** **బిత్తరపు గుబ్బ లేపునఁ బెరుఁగు నంచు**
**నెంచి మును నల్వ మొనలను నినుప మొనల**
**నించ నవి యంత నిలువక నెరయఁ బెరుఁగఁ**
**బొలఁతి నెటిఁ గంచెల బిగించఁ బోలుఁ జుమ్మి** **24**

బిత్తరపు = శృంగార చేష్టలైన, గుబ్బలు = స్తనములు, ఏపున పెరుగునంచు = చక్కగా అభివృద్ధినందుచున్నవనుచు, ఎంచి = తలంచి, నల్వ = బ్రహ్మ, మును = ముందుగనే, మొనలను = స్తనముల చివరలందు, ఇనుప మొనలన్ నించన్ = ఇనుప మేకులను బిగించగా, అవి అంత నిలువక = ఆ చన్నుల పెరుగుదల అంతటితో ఆగక, నెరయన్ పెరుగన్ = నిండుగా పెరుగగా, పొలతి = ఆ సీతాదేవి, నెఱి = అందమైన, కంచెలన్ = కంచెవేసినట్టుగా ఆవికతో, బిగించన్ పోలు చుమ్మీ = బిగించినదేమో సుమా!

**తా :** శృంగారచేష్టలైన స్తనములు చక్కగా పెరుగుచున్నవని తలంచి బ్రహ్మ ముందుగానే స్తనముల చివరలందు ఇనుప మేకులను బిగించగా, ఆ చన్నుల పెరుగుదల అంతటితో ఆగక నిండుగా పెరగగా ఆ సీత కంచెవేసినట్టుగా ఆవికతో బిగించిందేమో సుమా!

**కం.** **కన్నియల మిన్న పిఱుఁదుల**
**కన్నరొ! యిసుమంత లేసియగు నిద్దంపుం**
**దిన్నియలు సాటియగునని**
**యెన్నంగా రాదు చువ్వె యెచ్చో నైనన్** **25**

అన్నరో = ఓ అన్నా!, ఎచ్చోనైనన్, కన్నియల మిన్న = స్త్రీరత్నమైన సీతాదేవియొక్క, పిఱుదులకు, ఇసుము అంతలేసి అగు = ఇసుక రేణువంత పరిమాణము కల, నిద్దంపున్ తిన్నియలు = నున్ననైన ఇసుక తిన్నెలు, సాటి అగునని = సమానమగునని, ఎన్నంగరాదు చువ్వె = చెప్పరాదు సుమా!

**తా :** ఓ అన్నా! ఎక్కడా కూడా ఆ సీత పిఱుదులకు ఇసుక రేణువంత చిన్నవైన నున్ననైన ఇసుక తిన్నెలు సమానములని చెప్పరాదుసుమా!

**సీ.** **పాలతో నును మగరాలతో నలువ తే**
**జీలతో బేడిస మీల తోడ**
**విండ్లతోఁ గ్రొన్నన చెండ్లతో విసదారి**
**పిండ్లతోఁ దమ్మి లేఁదూండ్ల తోడ**
**లేళ్ళతో మావి యిగుళ్ళతోఁ గొదమ తా**
**బేళ్ళతోఁ గాఱు మొగిళ్ళ తోడఁ**
**జవులతోఁ జెందొవ పువులతో నసలు పు**
**ట్టువులతోఁ జిలుక కూటవల తోడ**

**తే.గీ.** **దొడరుఁ జెలి నవ్వుఁ బలుచాల్పు నడలుఁ గన్ను**
**లును బొమలు గుబ్బ చన్ను లారును బుజములు**
**చూపుఁ బెదవియు మీఁగాళ్ళు సొబగు తుఱుము**
**గోరు లడుగులు మొగముఁ బల్కులు చెలంగు** **26**

పాలతోన్ = పాలతోను, నును మగరాలతోన్ = నున్నని వజ్రములతోను, నలువ తేజీలతో = బ్రహ్మదేవుని వాహనములైన హంసలతోను, బేడిస మీలతోడ = వాలుగ చేపలతోను, విండ్లతోన్ = ధనుస్సులతోను, క్రొత్త నన చెండ్లతో = నూతనములైన పూలగుత్తులతోను, విసదారి పిండ్లతో = పాముల సమూహముతోను, తమ్మి లేత తూండ్లతోడ = తామర లేతకాడలతోను, లేళ్ళతో = లేళ్ళతోను, మావి యిగుళ్ళతో = మామిడి చిగురులతోను, కొదమ తాబేళ్ళతోన్ = మదించిన తాబేళ్ళతోను, కాఱు మొగిళ్ళ తోడన్ = నల్లని మేఘములతోను, చవులతోన్ = ముత్యముల కాంతితోను, చెన్నుతొవ పూవులతో = ఎఱ్ఱతామర పూవులతోను, అసలు పుట్టువులతోన్ = బురదలో పుట్టిన పంకజములతోను, చిలుక కూటవల తోడ = చిలుకల సమూహములతోను, తొడరు = పోల్చదగిన, చెలి = సుందరియైన సీతాదేవియొక్క, నవ్వున్ = నవ్వును (పాలతో), పలు చాల్పు = దంతముల వరుసను (వజ్రములతో), నడలున్ = నడకలను (హంసలతో), కన్నులును (చేపలతో), బొమలు = కనుబొమలు (ధనుస్సులతో), గుబ్బ చన్నులు = గుండ్రని స్తనములు (చెండ్లతో), ఆరును = రోమరాజియును (విసదారి పిండుతో), భుజములు (తమ్మి తూండ్లతో), చూపు (లేళ్ళతో), పెదవియు (మావి యిగుళ్ళతో), మీగాళ్ళు (తాబేళ్ళతో) సొబగు

తుఱుము = అందమైన కొప్పు (కాఱు మొగిళ్ళతో), గోరులు (చవులతో), అడుగులు (తామరపూలతో) ముఖము ( పంకజముతో), పల్కులు (చిలుకలతో), చెలంగున్ = సరసమాడును.

**తా :** పాలతో, వజ్రములతో, హంసలతో, వాలుగ చేపలతో, ధనుస్సులతో, పూలగుత్తులతో, పాములతో, తామరతూడులతో, లేళ్ళతో, మావి చిగురుతో, తాబేళ్ళతో, నల్లని మేఘములతో, ముత్యములతో, ఎఱ్ఱతామర పూలతో, పంకజములతో, చిలుకలతో సీతాదేవి నవ్వు, దంతములు, నడక, కన్నులు, కనుబొమలు, స్తనములు, రోమరాజి, భుజములు, చూపు, పెదవి, మీగాళ్ళు, కొప్పు, గోళ్ళు, అడుగులు, ముఖము, పల్కులు సరసమాడును.

**ఉ.** **కన్నుల చెన్ను పెన్నెఱుల కప్పు వెడంద పిఱుంద ముద్దులే**
**జన్నుల నీటు ముత్తరుల సౌరు మిటారపు టారు తీరు గౌన్**
**సన్నము మోము గోము మెయిజానును బూని మెలంగుచున్న య**
**య్యన్నుల మిన్న నెన్నఁదరమా? పెఱమాటలు వేయు నేటికిన్** **27**

కన్నుల చెన్ను = కన్నులయొక్క అందము, పెన్నెఱుల కప్పు = పొడవైన వెంట్రుకల నల్లదనము, వెడంద పిఱుందు = విశాలమైన కటిప్రదేశము, ముద్దు లేత చన్నుల నీటు = ముద్దైన లేత స్తనముల సొగసు, మూడు తరుల సౌరు = త్రివళుల అందము, మిటారపు ఆరు తీరు = అతిశయించిన నూగారు పద్ధతి, కౌన్ సన్నము = నడుము సన్నము, మోము గోము = ముఖము అందము, మెయి జానును = దేహ కాంతియును, పూని = పొంది, మెలంగుచు ఉన్న = సంచరించుచున్న, ఆ అన్నులమిన్నను = ఆ స్త్రీ రత్నమును, ఎన్నన్ తఱమా = ఎంచుటకు శక్యమా?, పెఱ మాటలు = వ్యర్థపు పల్కులు, వేయును ఏల = వేయి ఎందులకు?

**తా :** కన్నుల అందము, వెంట్రుకల నల్లదనము, విశాలమైన కటిప్రదేశము, ముద్దైన లేత స్తనముల సొగసు, త్రివళుల అందము, అతిశయించిన నూగారు, నడుము సన్నము, ముఖము అందము, దేహ కాంతి పొంది మెలగుచున్న ఆ స్త్రీరత్నమును ఎంచుటకు శక్యమా! వ్యర్థపు పల్కులు వేయి ఎందులకు?

**తే.గీ.** **ముజ్జగంబుల యందు నమ్ముద్దుగుమ్మ**
**కరయ నెనలేరు చెలులు నీ యడుగులాన**
**యహహ! యో యన్న! దాని సోయగము గన్న**
**సోలి జడదారులైన విరాలి గొనరె?** **28**

మూడు జగంబుల అందును = మూడు లోకములందును, అరయన్ = చూడగా, ఆ ముద్దుగుమ్మకు = ఆ సీతకు, ఎనలేరు చెలులు = సాటియైన స్త్రీలెవ్వరును లేరు, నీ అడుగులు ఆన = నీ పాదము లపై ప్రమాణము, అహహ ఓ అన్న = ఆహా ఓ అన్నా!, దాని సోయగము కన్న = ఆమె అందమును చూచినచో, జడదారులైన = తపస్వులైనను, సోలి = చొక్కి, విరాలి కొనరె = మరులు పొందరా?

**తా :** మూడు లోకములందును ఆ సీతకు సాటి స్త్రీలెవ్వరును లేరు. నీ పాదముల ఆన. ఓ అన్నా! ఆమె అందము చూచినచో జడదారులైనా సోలి విరహం పొందుతారు.

**కం. అడవుల నిడుమలఁ గుడుచుచుఁ**
**గడ బడలియుఁ గడిఁది సోయగము పూనెడు న**
**ప్పడఁతుక నగరుల నుండెడు**
**నెడఁ బొడ గనువారి చూడ్కి కెట్లుండునొకో? 29**

అడవులన్ = అరణ్యములందు, ఇడుములన్ = కష్టములను, కుడుచుచున్ = అనుభవించుచు, కడుబడలియు = మిక్కిలిఅలసియు, కడిది = మిక్కిలి, సోయగము పూనెడు = అందమునే పొందచున్న, ఆ పడతుక = ఆ సీతాదేవి, నగరులన్ = అంతిపురములందు, ఉండు నెడన్ = ఉన్న కాలమున, కనువారి చూడ్కికిన్ = చూచేవారి చూపులకు, ఎట్లు ఉండును ఒకో = ఎలా ఉంటుందో కదా!

**తా :** అరణ్యాల్లో కష్టాల ననుభవిస్తూ మిక్కిలి అలసిన మిక్కిలి సోయగమున్న ఆ సీత అంతఃపురంలో ఉన్నంతకాలము చూచేవారి చూపులకు ఎలా ఉండి ఉండేదోకదా!

**తే.గీ. అడవిఁ గూరలు దుంపలు గుడుచుచుండు**
**కూళ మానిసి కమ్ముద్దరాలి నోలిఁ**
**దగులఁ గట్టిన వేటిఁడి తమ్మిచూలి**
**చెయ్వులకుఁ నెద్దియిఁక గుఱి సేయవచ్చు? 30**

అడవిన్ = అడవిలో, కూరలు = కాయగూరలు, దుంపలు = కందమూలములు, కుడుచుచు ఉండు = తినుచుండిన, కూళ మానిసికి = క్రూర మనుజునకు, ఆ ముద్దరాలిన్ = ఆ అమాయకురాలిని, ఓలిన్ తగులన్ కట్టిన = తగునని కట్టబెట్టిన, వేటిడి = మూర్ఖుడైన, తమ్మిచూలి చెయ్వులకున్ = బ్రహ్మదేవుని పనులకు, ఇక = ఇంక, ఎద్ది = దేనిని, గుఱి సేయవచ్చు = దృష్టాంతముగా చెప్పవచ్చును.

**తా :** అడవిలో కాయగూరలు, కందమూలములు తింటున్న ఆ క్రూర మనుజునకు ఆ అమాయకురాలిని తగునని కట్టబెట్టిన మూర్ఖుడైన బ్రహ్మ పనులకు ఇంక ఏంచెప్పాలి?

**కం. వినఁ బోల్పరాని సొగసుల**
**గనియగు నమ్మెఱుఁగుఁబోడి కౌఁగిట నెపుడుం**
**బెనఁగొన నొనగూడని మగ**
**తన మేటికి? నింక రాచతన మేమిటికిన్? 31**

వినన్ = వినుటకుకూడా, పోల్పన్ రాని = పోల్చుటకు లేని, సొగసుల గని అగు = అందాల ఖనియైన, ఆ మెఱుగుబోడి కౌగిట = ఆ మెఱుపు తీగ కౌగిటియందు, ఎపుడున్ = సదా, పెనన్ కొనన్ = బంధింపబడుటకు, ఒన కూడని = కుదరని, మగతనము ఏటికి = మగతనము ఎందులకు?, ఇంక = ఆమెను పొందనినాడు, రాచతనము ఏమిటికిన్ = రాచతనమెందులకు?

**తా :** వినడానికి కూడా పోల్చుటకు లేని అందాల గనియైన ఆ మెఱుపు తీగ కౌగిటిలో సదా బంధింపబడుటకు కుదరని మగతనము ఏటికి? ఆమెను పొందనినాడు రాచతనమెందుకు?

**కం. పొంగుచు మూఁడు జగంబులు**
**రంగెసఁగఁగ నేలుచుండి వ్రాలని బలు దీ**
**విం గేరెడు నీ కిపుడా**
**బంగరు చిటిపాప చెలిమి పాటిలవలదే! 32**

పొంగుచు = ఉప్పొంగుచు, మూడు జగంబులు = ముల్లోకములు, రంగు ఎసగగన్ = గొప్పతనము ఒప్పుచుండగా, ఏలుచుండి = పరిపాలించుచుండి, వ్రాలని = మీఱని, బలు దీవిన్ =గొప్ప ద్వీపమున, కేరెడు = ఉల్లాసముగానున్న, నీకు, ఇపుడు, ఆ బంగరు చిటిపాప చెలిమి = ఆ బంగారు చిన్నదాని స్నేహము, పాటిలవలదే = కుదరవద్దా?

**తా :** గర్వంతో ముల్లోకాలు పరిపాలిస్తూ, గొప్ప ద్వీపంలో ఉల్లాసంగా ఉన్న నీకు ఆ బంగారు చిన్నదాని స్నేహము కుదరవద్దా?

**తే.గీ. అనుచుఁ దెలిపిన డెందమునందు వలపు**
**పెనఁగొనఁగ రక్కసుల ఱేఁడు పని దలంచి**
**సరిగ మారీచు నింటికిఁ జనిన నతఁడు**
**బత్తి నెఱపుచు నిట్లని పలికె నపుడు 33**

అనుచు = అని పలుకుచూ, తెలిపిన = తెలుపగా, డెందమునందు = మనసునందు, వలపు పెనగొనగ = కోరిక పెనవేసుకొనగా, రక్కసుల ఱేడు = రాక్షస రాజు రావణుడు, పని తలంచి = పనిగూర్చి ఆలోచించి, సరిగ = తిన్నగా, మారీచుని ఇంటికి, చనినన్ = వెళ్ళిన, అపుడు = అప్పుడు, అతడు = ఆ మారీచుడు, బత్తి నెఱపుచున్ = భక్తిని చూపుచు, ఇట్లని పలికె = ఈ రీతిగా పలికెను.

**తా :** అని తెలుపగా మనసున కోరిక పెనవేసుకొనగా రావణుడు పనిగురించి ఆలోచించి తిన్నగా మారీచుని ఇంటికి వెళ్ళిన అపుడు ఆ మారీచుడు భక్తితో ఇట్లని పలికెను.

**కం. రాయఁడ! మీ రిచటికి వేం**
**చేయఁగఁ బనియేమి గల్గెఁ? జెచ్చెర నెఱుఁగం**
**జేయుము మఱి మీ యానతిఁ**
**ద్రోయక యొనరింతు వెరవు తోడుత ననినన్ 34**

రాయడా! = ఓ ప్రభూ!, మీరు ఇచటికి వేంచేయగన్ = మీరు ఇక్కడికి వచ్చుటకు, పని ఏమి కల్గెన్ = ఏం పని పడింది, చెచ్చెరన్ = వెంటనే, ఎఱుగన్ చేయుము = తెలియచేయుము, మీ ఆనతి త్రోయక = మీ ఆజ్ఞను తిరస్కరించక, వెరవు తోడుతన్ = ఉపాయముతో, మఱి = ఆపనిని, ఒనరింతు అనినన్ = చేస్తాను అనగా –

**తా :** 'ప్రభూ! మీరిక్కడికి రావడానికి ఏం పని పడింది? వెంటనే తెలియ జేయుము. మీ ఆజ్ఞను తిరస్కరించక బుద్ధి కుశలతతో ఆ పనిని చేస్తాను' అనగా –

**ఆ.వె. వానిఁ జూచి చెలిమి వరల నత్తొలివేల్పు**
**టేఁడు పలికె వినుము వాఁడి మగఁడ!**
**పంచవటికి రాచబంటు లిర్వురు నొక్క**
**యుగ్మలియును జేరియున్నవారు 35**

వానిన్ = ఆ మారీచుని, చూచి = చూచి, చెలిమి వరలన్ = స్నేహము ఒలకపోస్తూ, ఆ తొలివేల్పు టేడు = ఆ రాక్షసరాజు రావణుడు, పలికె = పలికెను, వాడి మగడ = మహావీరుడా!, వినుము = విను, పంచవటికి = జనస్థానమునకు, రాచబంటులు ఇర్వురు = ఇద్దరు రాజకుమారులు, ఒక్క యుగ్మలియును = ఒక స్త్రీయును, చేరి ఉన్నారు = వచ్చియున్నారు.

**తా :** ఆ మారీచుని చూచి స్నేహభావంతో ఆ రావణుడు పలికెను 'మహావీరుడా! విను. పంచవటికి ఇద్దరు రాజకుమారులు, ఒక స్త్రీయును వచ్చియున్నారు.

**కం. అబ్బిత్తరి చెలువెంతయు**
**నబ్బురముగ నిపుడు చెవుల నాలించుటచే**
**నిబ్బరపు వలపు మదిలో**
**ప్రబ్బికొని యొకింత సైఁపరాదయ్యె చెలీ! 36**

చెలీ = ఓ స్నేహితుడా!, ఆ బిత్తరి చెలువు = బెదురుచూపులుకల ఆమెయొక్క అందము, ఎంతయు అబ్బురముగ = ఎంతో ఆశ్చర్యకరంగా, ఇపుడు, చెవుల నాలించుటచే = నా చెవులతో వినుటచేత, మదిలో = మనస్సులో, నిబ్బరపు వలపు = అధికమైన కోరిక, ప్రబ్బికొని = వ్యాపించి, ఒకింత = కొంచెమైనను, సైపరాదు అయ్యెన్ = సహింపశక్యము కానిదయ్యెను.

**తా :** ఓ స్నేహితుడా! ఆమె అందమును ఎంతో అబ్బురంగ ఇపుడు నా చెవులతో వినుటచేత మనసులో అధికమైన కోరిక వ్యాపించి కొంచెంకూడా సహింపరానిదయింది.

**ఉ. కావున నీవు బంగరు మెకంబు తెఱంగున వేగ నేఁగి య**
**త్తీవియఁబోడి క్రేవలను ద్రిమ్మరు చుండిన నవ్వెలందికై**
**వావిరి నిన్నుఁ బట్టుకొనవచ్చిన రాయని గొంచు దవ్వుగాఁ**
**బోవుము నేను దానిఁగొని పొల్పుగ లంకకు వత్తు నర్మిలిన్ 37**

కావున = కాబట్టి, నీవు బంగరు మెకంబు తెఱంగున = నువ్వు బంగారు లేడిలా, వేగన్ = శీఘ్రముగా, ఏగి = వెళ్ళి, ఆ తీవియబోడి = ఆ తీగవలె మెత్తని దేహముగల సీతాదేవి, క్రేవలను = పరిసరము లందు, త్రిమ్మరుచుండిన = సంచరించుచుండిన, ఆ వెలందికై = ఆ స్త్రీకొరకై, వావిరి = పూనుకొని, పట్టుకొనవచ్చిన = పట్టుకోడానికి వచ్చిన, రాయనిన్ కొంచు = రాముని తీసుకొని, దవ్వుగాన్ = దూరముగా, పోవుము = వెళ్ళుము, నేను దానిన్ కొని = నేను ఆమెను తీసుకొని, పొల్పుగ = చక్కగా, నర్మిలిన్ = సంతోషముతో, లంకకు వత్తున్ = లంకకు వచ్చెదను.

**తా :** కాబట్టి నీవు బంగరు లేడిలా శీఘ్రముగా వెళ్ళి ఆ సీత పరిసరములందు సంచరించుచుండిన, ఆ స్త్రీకోసం పూనుకొని పట్టుకోడాని కొచ్చిన రాముని దూరంగా తీసుకొని పొమ్ము. నేను దానిని చక్కగా సంతోషంగా లంకకు తెస్తాను'.

**కం. అనిన నగి వాఁడు పలికెన్**
**వినుమా! నీ కిట్టి కాని వెరవిఁడి కఱదల్**
**చనునే? పెఱ తెఱవలఁ గై**
**కొనఁ గోరెడువాని బ్రతుకు కొంచెము కాదే? 38**

అనినన్ = అని పలుకగా, వాడు = ఆ మారీచుడు, నగి = నవ్వి, పలికెన్ = పలికెను, వినుమా = వినవలసినది, నీకు ఇట్టి కాని వెరవిడి కఱదల్ = నీకు ఇలాంటి పనికిరాని ఆలోచనలేని బుద్ధులు, చనునే = తగునా?, పెఱ తెఱవలన్ = పరాయి స్త్రీలను, కైకొన కోరెడువాని బ్రతుకు = కావాలనేవాని జీవితము, కొంచెము కాదే = తగ్గిపోవడమే కదా!

**తా :** అని పలుకగా ఆ మారీచుడు నవ్వి పలికెను 'రాజా! వినవలసినది. నీకు ఇలాంటి పనికిరాని, ఆలోచనలేని బుద్ధులు తగునా? పరాయి స్త్రీలను కావాలనేవాని జీవితము తగ్గిపోవడమేకదా!

**కం. మున్నొక్క తపసి రాయని**
**జన్నము చెఱుఁపంగఁ బూని చనుదెంచినచో**
**నన్నేలతేఁడు ననుఁ గడు**
**బన్నము వొందించె మరలఁ బఱవం జనునే? 39**

మున్ను = ఇంతకు ముందు, ఒక్క తపసి రాయని జన్నము = ఒక మునిశ్రేష్ఠుని యజ్ఞమును, చెఱుపంగ = చెడగొట్టాలని, పూని = అనుకొని, చనుదెంచినచోన్ = వెళ్ళగా, ఆ నేల ఱేడు = ఆ రాముడు, ననున్ = నన్ను, కడు = మిక్కిలి, బన్నము పొందించె = కష్టాల పాల్చేశాడు, మరలన్ = తిరిగి, పఱవన్ చనునే = పారిపోవడం కుదురుతుందా?

**తా :** ఇంతకుముందు ఒక మునిశ్రేష్ఠుని యజ్ఞమును చెడగొట్టాలని వెళ్ళగా ఆ రాముడు నన్ను మిక్కిలి కష్టాల పాల్జేశాడు. తిరిగి పారిపోవడం కుదురుతుందా?

**ఆ.వె. అనిన నులికి యతఁడు గనుగొనలను నిప్పు**
**లొలుక నలుకఁ జూచుచున్నచో నె**
**ఱింగి కినుక యేల? ఱేపె దొసంగుల**
**జెందఁ గలవటంచు సెలవుఁ గాంచి 40**

అనినన్ = అని మారీచుడు పలుకగా, ఉలికి = అదిరిపడి, అతడు = ఆ రావణుడు, కను కొనలను = కంటి చివరలయందు, నిప్పులు ఒలుకన్ = నిప్పులు రాలుచుండగా, అలుకన్ = కోపముతో, చూచుచు ఉన్నచోన్ = చూచుచుండగా, ఎఱింగి = తెలుసుకొని, కినుక ఏల = కోపమెందులకు?, ఱేపె = వెంటనే, దొసంగున్ = కోరికను, చెందన్ కలవటంచు = పొందగలవనుచు, సెలవు కాంచి = సెలవు తీసుకొని –

**తా :** అని మారీచుడు పలుకగా అదిరిపడి ఆ రావణుడు కనుకొసల నిప్పులు రాలగా కోపంతో చూస్తూండగా తెలుసుకొని 'కోపమెందులకు? వెంటనే దోషమును పొంద గలవ'నుచు సెలవు తీసుకొని –

**కం. బంగారు జింకయై పసఁ**
**బొంగారుచు నేఁగి పుడమి పుట్టువు మ్రోలన్**
**సింగారము నెఱపిన దా**
**నింగొని తెమ్మనుచు రామునిం జెలి పనిచెన్ 41**

బంగారు జింకయై, పసన్ పొంగు ఆరుచున్ = అందములొలకపోయుచు, ఏగి = వెళ్ళి, పుడమి పుట్టువు మ్రోలన్ = సీతాదేవి సమీపమున, సింగారము నెఱపిన = సౌందర్యము ప్రదర్శింపగా, చెలి = సీతాదేవి, దానిన్ = ఆ మాయలేడిని, కొని తెమ్మనుచు = తెచ్చిపెట్టమని, రామునిన్ = రాముని, పనిచెన్ = పంపెను.

**తా :** బంగరు జింక రూపంలో అందాలొలకబోస్తూ వెళ్ళి సీత సమీపమున సింగారము ప్రదర్శింపగా సీత దానిని తెచ్చిపెట్టమని రాముని పంపెను.

**కం. పనిచిన నయ్యింతికిఁ ద**
**మ్ముని కావలి యునిచి విల్లు ములుకులు గొని మె**
**ల్లన నమ్మెకముం బట్టెద**
**నని మానిసితేఁడు దరియ నరుదెంచుటయున్ 42**

పనిచినన్ = పంపగా, ఆ ఇంతికి = ఆ సీతాదేవికి, తమ్మునిన్ = లక్ష్మణుని, కావలి ఉనిచి = కాపలా ఉంచి, విల్లు ములుకులు కొని = ధనుస్సు బాణములు తీసుకొని, మెల్లన = మెల్లగా, ఆ మెకముం పట్టెదనని = ఆ లేడిని పట్టుకుంటానని, మానిసితేడు = మనుజప్రభువు రాముడు, దరియన్ = చేరుటకు, అరుదెంచుటయున్ = వచ్చుటయును.

**తా :** పంపగా ఆ సీతకు లక్ష్మణుని కావలి ఉంచి ధనుర్బాణములను తీసుకొని మెల్లగా ఆ లేడిని పట్టుకుంటానని రాముడు చేరవచ్చుటయును

**సీ. దట్టించి సంగున దాఁటి పేటెము వెట్టు**
**నీడల నంతంత నిలిచి చూచుఁ**
**జేతి కిచ్చిన యట్ల చేరువ నలయించుఁ**
**గదిసి పట్టఁగఁబోవ బెదరి యుఱుకుఁ**
**బొద లడ్డమైనచోఁ బొడకట్టక యడంగు**
**గడితంపు టడవుల నడుమఁ దూఱు**
**నొకచోట డాఁగు వేఱొకచోటఁ గనఁబడుఁ**
**దన నీడ దానె కన్గొని కలంగు**

**తే.గీ. బడలి యెకిమీఁడు తనుఁ గూడఁబడఁగ నోడి**
**తడయు నెడలను మగుడ ముందఱకు వచ్చు**
**మచ్చికలు చేసి డాయుచో ఱెచ్చి పాఱుఁ**
**జెలఁగి యగ్గారడంపుఁ బసిండి జింక 43**

చెలగి = రెచ్చిపోయి, ఆ గారడంపు పసిండి జింక = ఆ మాయ బంగారు లేడి, దట్టించి = లంఘించి, సంగునన్ దాటి = ఒక్కసారిగా దూకి, పేటెము పెట్టు = దౌడు తీయును, నీడలన్ = చెట్ల నీడలయందు, అంత అంత = అక్కడక్కడ, నిలిచి చూచు = ఆగి చూచు చుండును, చేతికి ఇచ్చిన అట్ల = చేతికి చిక్కిన విధముగా, చేరువన్ అలయించున్ = దగ్గరలో ఆలస్యముచేయును, కదిసి = చేరి, పట్టగ పోవ = పట్టుకొనబోగా, బెదరి ఉఱుకు = భయపడి పరుగెత్తును, పొదలు అడ్డము ఐనచో = గుబురులు అడ్డుగా వచ్చినచో, పొడకట్టక = కనబడక, అడంగు = నక్కును, గడితంపు = దట్టమైన, అడవుల నడుమ = అరణ్యముల మధ్య, తూఱున్ = దూరును, ఒక చోటన్ = ఒకచో, డాగున్ = దాగును, వేఱు ఒకచోట = మరొకచో, కనబడున్ = కనబడును, తన నీడ తానె కన్గొని = తన నీడను తానె చూచి, కలంగున్ = భయపడును, బడలి = అలసిపోయి, ఎకిమీడు = రాముడు, తనన్ కూడన్ పడగ = తన వెంటపడగా, ఓడి = పరుగెత్తి, తడయు ఎడలన్ = దూరమునకు పోయి, మగుడన్ = మరల, ముందఱకు వచ్చున్ = రాముని ముందరకు వచ్చును, మచ్చికలు చేసి = నమ్మకము కలిగించి, డాయుచో = సమీపించగా, ఱెచ్చి పాఱున్ = రెచ్చిపోయి పరుగెత్తును.

**తా :** రెచ్చిపోయి ఆ మాయ బంగరు లేడి చెంగుమని దూకి దౌడు తీయును. చెట్ల నీడలయందు అక్కడక్కడ ఆగి చూచుచుండును. చేతికి చిక్కినట్టుగా దగ్గరలో చేరి పట్టుకొనబోగా భయపడి పరుగెత్తును. గుబురులు అడ్డుగా రాగా నక్కును. దట్టమైన అడవుల మధ్య దూరును. ఒకచో దాగును. మరొకచో కనబడును. తన నీడను తానె చూచి భయపడును. అలసిపోయిన రాముడు తన వెంటపడగా పరుగెత్తి దిక్కులు వెదకును. మళ్ళీ రాముని ముందరకు వచ్చును. నమ్మకము కలిగి సమీపించగా రెచ్చిపోయి పరుగెత్తును.

**తే.గీ.** **అట్లు ద్రిప్పులఁ బెట్టుచుఁ జెట్లు గట్లు**
**పొదలు గడ్డలు వడి దాఁటి పోవుచున్నఁ**
**బట్ట నొదవక కినిసి యబ్బల్లిదుండు**
**దివిరి యొకకోల నయ్యిట్టిఁ ద్రెళ్ళనేసె** **44**

అట్లు = ఆ విధముగా, త్రిప్పులన్ పెట్టుచు = తిప్పలు పెడుతూ, చెట్లు గట్లు పొదలు గడ్డలు = చెట్లు, గట్టులు, పొదలు, గుట్టలు, వడి దాటి పోవుచున్నన్ = వేగముగా దుముకి పోతుండగా, పట్టన్ = పట్టుకొనుటకు, ఒదవక = అవకాశము లభింపక, కినిసి = కోపించి, ఆ బల్లిదుండు = ఆ వీరుడు రాముడు, తివిరి = పూనుకొని, ఆ ఇట్టిన్ = ఆ లేడిని, ఒక కోలన్ = ఒక బాణముతో, త్రెళ్ళన్ ఏసె = చావ కొట్టెను.

**తా :** ఆ విధముగా తిప్పలు పెడుతూ చెట్లు, గట్లు, పొదలు, గుట్టలు వేగంగా దాటి పోతున్నా పట్టుకొనుటకు అవకాశం లభించక కోపించి ఆ లేడిని ఒక బాణంతో చావకొట్టెను.

**ఆ.వె.** **ఏయ నేలఁ గూలు నెడల నో లక్ష్మణుఁ**
**డా యటంచు మెకము కూయుటయును**

**విని కలంగి పుడమి విరిఁబోడి కూరిమి**
**కాన్పు ముద్దుమఱఁదిఁ గాంచి పలికె** **45**

ఏయన్ = రాముడు బాణమును వేయగా, నేల కూలు నెడలన్ = మరణించు సమయమున, మెకము = లేడి, ఓ లక్ష్మణుడా అటంచు = ఓ లక్ష్మణా అంటూ, కూయుటయను విని = అరచుటను విని, కలంగి = కలత చెంది, పుడమి విరిబోడి కూరిమి కాన్పు = భూజాత, ముద్దు మఱదిన్ = ప్రియమైన మరదిని, కాంచి పలికె = చూచి మాట్లాడెను.

**తా :** రాముడు బాణమును వేయగా నేలకూలు సమయమున లేడి 'ఓ లక్ష్మణా!' అంటూ అరచుటను విని కలతచెంది సీత ముద్దుల మరదిని చూచి పలికెను.

**కం.** **ఓ లక్ష్మణుఁడా! యను రొద**
**యాలింపంబడియె నిప్పు డడవిం జనుచో**
**నేలాటి చేటు వొందెనొ?**
**వైళమ మీ యన్న నరయ వెడలు మటన్నన్** **46**

ఓ లక్ష్మణుడా అను రొద = ఓ లక్ష్మణా! అను కేక, ఇప్పుడు ఆలింపంబడియె = ఇప్పుడు వినబడింది, అడవిం చనుచో = అడవిలో వెళుతున్నప్పుడు, ఏలాటి చేటు = ఎటువంటి ఆపదను, పొందెనొ = అనుభవించెనో!, వైళమ = వేగముగా, మీ అన్నన్ = మీ అన్నయగు రాముని, అరయన్ = వెదకుటకు, అటు = ఆ శబ్దము వచ్చిన దెసకు, వెడలుము అన్నన్ = వెళ్ళు అనగా

**తా :** 'ఓ లక్ష్మణా! అను కేక ఇప్పుడు వినపడింది. అడవిలో వెళుతున్నప్పుడు ఏం ఆపద కలిగిందో, వెంటనే మీ అన్నను వెదకుటకు ఆ శబ్దం వచ్చినవైపు వెళ్ళు' అనగా

**కం.** **నగి యతఁడు వదినె కనియెన్**
**మగువా! బెగడంగనేల? మా యన్నకుఁ జే**
**టగపడియెనేని జేజేల్**
**ముగురును గడలేని గోరముల పాల్గారే?** **47**

అతడు = లక్ష్మణుడు, నగి = నవ్వి, వదినెకు అనియెన్ = వదినతో అనెను, మగువా = ఒదినా!, బెగడంగన్ ఏల = బెంగపడుట ఎందులకు? మా అన్నకున్ = మా అన్నయైన రామునకు, చేటు అగపడియెను ఏనిన్ = కీడు కనపడితే చాలు, జేజేల్ ముగురును = దేవతలు ముగ్గురును (త్రిమూర్తులు), కడలేని = అంతములేని, గోరములపాలు కారే = ఘోరమైన ఆపదల పాలు కారా?

**తా :** లక్ష్మణుడు నవ్వి వదినతో అనెను 'ఒదినా! బెంగ ఎందుకు? మా అన్నకు కీడు కనబడితే చాలు, దేవతలు ముగ్గురును అంతులేని ఘోరమైన ఆపదలపాలు కారా?

**చం.** **జగములు గ్రుంకవే? నెలయుఁ జాయ మగండును దేట దప్పరే?**
**పగులదె నేల? వే తలల పాము దలంకదె? తిప్పు లుర్లవే?**
**పగ లిరు లెల్లెడన్ గవియఁ బర్వవె? సంద్రము లింక బారవే?**
**రగులదె నల్వ గ్రుడ్డుగమి? రాముడ కించుక కీడు గల్గినన్** **48**

రామునకు = మా అన్న రామునకు, ఇంచుక కీడు కల్గినన్ = కొంచెము ఆపద కలిగినా, జగములు క్రుంకవే = లోకాలు దిగపడిపోవా?, నెలయున్ చాయ మగండును = చంద్రుడును, సూర్యుడును, తేట తప్పరే = కాంతి విహీనులుకారా? నేల పగులదె = భూమి పగిలిపోదా? వే తలల పాము = శేషఫణి, తలంకదె = వణకదా?, తిప్పలు = పర్వతములు, ఉర్లవే = ఊగులాడవా?, పగలు ఎల్లడన్ ఇరులు = పగటియందే అంతటా చీకటులు, కవియన్ పర్వవె = దట్టముగా వ్యాపింపవా?, సంద్రములు = సముద్రములు, ఇంక పారవే = ఇంకిపోవా?, నల్వ గ్రుడ్డు గమి = బ్రహ్మాండముల సమూహము, రగులదె = మండిపోదా?

**తా :** మా అన్నకు ఏ కొంచెం ఆపద కలిగినా లోకాలు దిగపడిపోవా? చంద్రుడు, సూర్యుడు కాంతిహీనులు కారా? భూమి పగిలిపోదా? శేషఫణి వణకదా? పర్వతములు ఊగులాడవా? పగలే చీకట్లు వ్యాపింపవా? సముద్రములు ఇంకిపోవా? బ్రహ్మాండములు మండిపోవా?

**ఆ.వె.** **గోల! యిట్టి కాఱుఁ గోనలో నిన్నొంటి**
**డించి చనఁగ జనునె? యించుకైన**
**నిడుమ కలుగ నేర దిపుడు మా యన్నకు**
**వింత కఱద లెల్ల విడువు మింక** **49**

గోల = అమాయకురాలా! ఇట్టి = ఇటువంటి, కాఱు కోనలో = దట్టమైన అడవిలో, నిన్ను ఒంటి డించి = నిన్ను ఒంటరిగా వదలి, చనగ చనునె = వెళ్ళుట తగునా?, మా అన్నకు, ఇంచుక ఐనన్ = కొంచెమైనను, ఇడుమ కలుగ నేరదు = కష్టము కలుగనే కలుగదు, ఇపుడు = ఇంక, వింత కఱదలు = వింత ఆలోచనలు, ఎల్లన్ = అన్నిటిని, ఇంక విడువుము = ఇక విడచిపెట్టుము.

**తా :** బేలా! ఇటువంటి దట్టమైన అడవిలో నిన్ను ఒంటరిగా వదలి వెళ్ళుట తగునా? మా అన్నకు కొంచెమైనా కష్టము కలుగనే కలుగదు. ఇపుడు వింత ఆలోచనలు అన్నిటిని విడిచిపెట్టుము'.

**తే.గీ.** **అనినఁ గనలుచు నయ్యింతి వినఁగరాని**
**మాటలాడిన నతఁడు వేమఱుఁ గలంగి**
**దయ్య మిఁక నేమి గావింపఁ దలఁచుకొనెనొ**
**కాని పనిఁ బూనె నీ వెఱ్ఱి కలికి యనుచు** **50**

అనినన్ = అని లక్ష్మణుడు పలుకగా, కనలుచు = కోపించుచు, ఆ ఇంతి = ఆ సీతాదేవి, వినగరాని మాటలు ఆడిన = చెవిపడకూడని మాటలు మాట్లాడగా, అతడు = ఆ లక్ష్మణుడు, వేమఱు కలంగి = పలుమార్లు నొచ్చుకొని, దయ్యము = దైవము, ఇకన్ ఏమి కావింపన్ తలచుకొనెనొ = ఇకపైన ఏమి చేయదలచుకున్నాడో, ఈ వెఱ్ఱి కలికి = ఈ అమాయకపు ఇల్లాలు, కాని పని పూనె అనుచు = చేయకూడని పనికి పూనుకొనుచున్నది అనుకొనుచు,

**తా :** అని లక్ష్మణుడు పలుకగా కోపించి ఆ సీత చెవిపడకూడని మాటలు మాట్లాడగా పలుమార్లు నొచ్చుకొని లక్ష్మణుడు దైవము ఏమి చేయనున్నాడో, ఈ అమాయకపు ఇల్లాలు చేయకూడని పనికి పూనుకొనుచున్నది అనుకొనుచు

**కం.** **ఉల్లమున నఱుఁజుఁ జూపని**
**తల్లడమున నడుగుదోయి తడఁబడ విల్లున్**
**బల్లెపుఁ గోలలు గైకొని**
**యల్లనఁ బఱతెంచె యన్న యరిగిన త్రోవన్** **51**

ఉల్లమున = మనసున, నఱుజు చూపని = కొంచెముకూడ వదలని, తల్లడమున = బాధతో, అడుగుదోయి తడబడన్= పాదములు తడబడుచుండగా, విల్లున్ బల్లెమున్ కోలలు గైకొని = వింటిని, బల్లెమును, బాణములను తీసుకొని, అల్లనన్ = మెల్లగా, అన్న అరిగిన త్రోవన్ = రాముడు వెళ్ళిన మార్గమున, పఱతెంచెన్ = వచ్చెను.

**తా :** మనసున కొంచెంకూడా వదలని బాధతో పాదముల తడబడుచుండగా వింటిని, బల్లెమును, బాణములను తీసుకొని మెల్లగా అన్న అరిగిన త్రోవను వచ్చెను.

**కం.** **అంతట నెద గొద యొదవని**
**సంతసమునఁ బొంగి తలఁపు సాఁగెనటంచున్**
**బంతి మొగంబుల రక్కసుఁ**
**డెంతయు వైళంబ ఠవళి యేఁఱుపడంగన్** **52**

అంతటన్ = అలా లక్ష్మణుడు నిష్క్రమించగా, ఎదన్ = మనసునందు, కొద ఒదవని = అంతము లేని, సంతసమునన్, పొంగి = ఉప్పొంగి, తలపు సాగెన్ = తన ఊహ ఫలించినది, అటంచున్ = అని తలంచుచు, బంతి మొగంబుల రక్కసుడు = పంక్తి ముఖముల రాక్షసుడు రావణుడు, ఎంతయున్ = మిక్కిలి, వైళంబ = శీఘ్రముగా, ఠవళి ఏఱుపడంగన్ = వంచన బయల్పడగా,

**తా :** అలా లక్ష్మణుడు నిష్క్రమించగా మనసున అంతులేని సంతోషముతో ఉప్పొంగి తన ఊహ ఫలించినదని రావణుడు మిక్కిలి శీఘ్రముగా వంచన బయల్పడగా.

**తే.గీ.** **పులి కళాసము కకపాల బూదిపూఁత**
**జడలుఁ బొత్తంబు రుదురుక్క సరులు కావి**
**పుట్టములు లాతమును జోగి పట్టియయును**
**దనర నయ్యింతిఁ జేరి దీవనలిడుటయు** **53**

పులి కళాసము = పులి తోలును, కకపాల = సన్యాసుల జోలె, బూది పూత = విభూది రేఖలును, జడలున్ = జడలును, పొత్తంబు = పుస్తకమును, రుదురుక్క సరులు = రుద్రాక్ష మాలలును, కావిపుట్టములు = కాషాయవస్త్రములును, లాతము = యోగదండమును, జోగిపట్టియయును = యోగపట్టమును, తనరన్ = ఒప్పుచుండగా, ఆ ఇంతిన్ చేరి = ఆ సీతాదేవని సమీపించి, దీవనలు ఇడుటయు = ఆశీస్సులిడగా,

**తా :** పులి తోలు,కక్షపాల,విభూతి రేఖలు,జటలు,పుస్తకము,రుద్రాక్షమాలలు,కాషాయ వస్త్రములు, యోగదండము,జోగిపట్టి ఒప్పుచుండగా ఆ సీతను చేరి దీవన లిడగా –

**కం. ఎలదీవఁబోడి తద్దయు**
**నెలమిం జెయిదోయి మోడ్చి యెడలని బత్తిం**
**దలరుచు నున్నన్ గని య**
**త్తొలి వేలుపు పెద్ద ఆపెతో నిట్లనియెన్ 54**

ఎల తీవ బోడి = లేత తీగవంటి దేహముకల సీతాదేవి, తద్దయున్ = మిక్కిలి, ఎలమిన్ = వికాసముతో, ఎడలని బత్తిం = నిండైన భక్తితో, చెయిదోయి మోడ్చి = నమస్కరించి, తలరుచునున్నన్ = కలతచెందుచుండగా, కని = చూచి, ఆ తొలి వేలుపు పెద్ద = ఆ రాక్షస నాయకుడు, ఆపెతో = ఆమెతో, ఇట్లు అనియెన్ = ఇట్లు పలికెను.

**తా :** సీత మిక్కిలి వికాసముతోను, నిండైన భక్తితోను నమస్కరించి కలతచెందుట చూచి ఆ రావణుడు ఆమెతో ఇట్లు పలికెను.

**కం. పువ్వారుఁ బోడి నీ పే**
**రెవ్వరు? నీ తల్లిదండ్రు లెవ్వారు? మగం**
**డెవ్వఁడు? మీ ప్రో లెయ్యది?**
**యివ్వడువున నొంటి దిరుగనేఁటికి చెపుమా? 55**

పువ్వు ఆరు బోడి = పువ్వువలె మృదువైన దేహముకలదానా!, నీ పేరు ఎవ్వరు = నీ పేరు ఏమిటి?, నీ తల్లిదండ్రులు ఎవ్వారు = నీ తల్లిదండ్రులు ఎవరు?, మగండు ఎవ్వడు = భర్త ఎవరు?, మీ ప్రోలు ఎయ్యది = మీ నివాస నగరం ఏది? ఈ వడువున = ఈ విధముగా, ఒంటి = ఒంటరిగా, తిరుగన్ ఏటికి = సంచరించుట ఎందుకు? చెపుమా = చెప్పుమా!

**తా :** పూవువలె మృదువైన దేహముకలదానా! నీ పేరేమిటి? నీ తల్లిదండ్రులెవరు? భర్త ఎవరు? మీ నగరమేది? ఈ విధముగా ఒంటరిగా సంచరించడమెందుకు? చెప్పు.

**తే.గీ. అనినఁ దొయ్యలి తన తెఱఁ గతనితోడ**
**నంతయును జెప్పి పిదప నో యయ్య! మీర**
**లెవ్వ రెందుండి వచ్చితి రెఱుఁగ బలుకుఁ**
**డనినఁ జిరునవ్వు నిగుడ నచ్చెనఁటి పలికె 56**

అనినన్ = అని ఆతడు అడుగగా, తొయ్యలి = సీతాదేవి, తన తెఱగు = తన విషయమును, అతని తోడ = ఆ రావణునితో, అంతయును చెప్పి = వివరంగా చెప్పి, పిదప = తరువాత, ఓ అయ్య = ఓ తండ్రీ!, మీరలు ఎవ్వరు = మీరెవరు?, ఎందుండి వచ్చితిరి = ఎక్కడినుండి వచ్చారు?, ఎఱుగ పలుకుడు అనిన = తెలియపరచండి అనగా, చిరునవ్వు నిగుడన్ = చిరునవ్వులు చిందించుచూ, ఆ చెనటి = ఆ మోసగాడు, పలికె = పలికెను.

**తా :** అని అడుగగా సీత తన విషయమును ఆ రావణునితో వివరంగా చెప్పి 'ఓ తండ్రీ! మీరెవరు? ఎక్కడినుండి వచ్చారు? తెలియపరచండి' అనగా చిరునవ్వు చిందిస్తూ ఆ మోసగాడు పలికెను.

**తే.గీ.** **ఇంతి! మున్నీటి నడు దీవి నేలు ఱేఁడ**
**నరయ రావణుఁడను పేరఁ బరఁగువాఁడఁ**
**దుద యెఱుంగని కలుములఁ బొదలు ప్రోడఁ**
**జెలఁగి జగములు మూఁడును గెలిచినాఁడ** **57**

ఇంతి = ఓ సుందరీ! మున్నీటి నడు దీవిన్ = సముద్రము మధ్యగల దీవిని, ఏలు ఱేడన్ = పరిపాలించు ప్రభువును, అరయ = చూడ, రావణుడు అను పేరన్ = రావణుడను పేరుతో, పరగువాడను = ఒప్పువాడను, తుద ఎఱుంగని = లోపములేని, కలుములన్ = సంపదలచేత, పొదలు = ఒప్పునట్టి, ప్రోడన్ = సమర్థుడను, చెలగి = చెలరేగి, జగములు మూడును = మూడు లోకములను, గెలిచినాడన్ = జయించినవాడను.

**తా :** 'ఓ సుందరీ! సముద్రము మధ్యగల దీవిని ఏలు రాజును. రావణుడను పేరున ఒప్పువాడను. లోపములేని సంపదలతో ఒప్పునట్టి సమర్థుడను, మూడు లోకములను జయించినవాడను.

**సీ.** **గిబ్బ బాబాజోదు గుబ్బలి పెకలించి**
**బంతి కైవడిఁ గేలఁ బట్టినాఁడఁ**
**గడయేలికల నెల్లఁ గడిమి మీఱఁగఁ బట్టి**
**యిడి యూడిగములు సేయించినాఁడ**
**మేలు వన్నియ పొట్టవేలుపు మన్నిచేఁ**
**గడలేని మెప్పులు గాంచినాఁడ**
**వేల్పురాయని ప్రోల వెలయు నాడెంపు టచ్చ**
**రల నెల్లఁ దమి గొల్పి కలసినాఁడఁ**

**తే.గీ.** **బులుగురా ముద్దుగుమ్మలఁ జిలువ చెలులఁ**
**జదలు ద్రిమ్మరు కొమ్మల జక్కి మోము**
**మెఱుఁగుఁబోఁడుల నెల్లను జెఱలు దెచ్చి**
**మనికి పట్టున ననయంబు నునిచినాఁడ** **58**

గిబ్బ బాబాజోదు = ఎద్దు వాహనముగాకల వీరుని (శివుడు), గుబ్బలి = కైలాసమును, పెకలించి = పైకెత్తి, బంతి కైవడిన్ = బంతివలె, కేలన్ పట్టినాడన్ = చేతితో పట్టినాను, కడ ఏలికలను ఎల్లన్ = దిక్పాలకుల నందరిని, కడిమి మీఱగన్ = సాహసముతో, పట్టి = పట్టుకొని, ఏను = నేను, ఊడిగములు = సేవలు, చేయించినాడన్ = చేయించితిని, మేలువన్నియ పొట్టవేలుపు మిన్నచేన్ = హిరణ్యగర్భుడను దేవతా శ్రేష్టునిచే (బ్రహ్మ), కడలేని మెప్పులు = అంతులేని పొగడ్తలను, కాంచినాడన్ = పొందితిని, వేల్పురాయని ప్రోలన్ = స్వర్గమునందు, వెలయు = ఒప్పుచున్న, నాడెపు అచ్చరలను ఎల్లన్ = ప్రసిద్ధమైన అప్సరస స్త్రీలనందరిని, తమి కొల్పి = మోహమును కల్పించి, కలసినాడన్ = అనుభవించితిని, పులుగు ముద్దుగుమ్మలన్ = గరుడజాతికి చెందిన కాంతలను, చిలువ చెలువలన్ = నాగ కన్యలను, చదలు త్రిమ్మరు కొమ్మలన్ = ఖేచర

వనితలను, జక్కిమోము మెఱుగుబోడులన్ = కిన్నర వెలదులను, ఎల్లను = అందరిని, చెఱలు తెచ్చి = బంధించి తెచ్చి, మనికిపట్టునన్ = నా నివాసమునందు, ఉనిచినాడన్ = ఉంచితిని.

**తా :** శివుని కైలాసమును పెకలించి బంతిలా చేతితో పట్టితిని. దిక్పాలకుల నందరిని పట్టుకొని సేవలు చేయించితిని. బ్రహ్మచే పొగడ్తల నందితిని. స్వర్గమునందలి అప్సరస స్త్రీలకు మోహమును కల్పించి అనుభవించితిని. గరుడ కాంతలను, నాగ కాంతలను, ఖేచర కాంతలను, కిన్నెర కాంతలను అందరిని బంధించి తెచ్చి నా నివాసమునందు ఉంచితిని.

**సీ.** **వేల్పురాయఁడు బత్తి వెలయఁ బుత్తెంచిన**
**పుడుకు ఁ బ్రమాన్వలితావి పూవు టెత్తు**
**లీఁద మేపరిసామి యిమ్ముగాఁ బంచిన**
**మవ్వంపు బలు దమ్మి మానికములు**
**ట్రాడు దాలుపు మెత్తదనమున నొసఁగిన**
**క్రొత్తను న్గుటాణి ముత్తియంబు**
**లెద్దు తత్తడిజోదు నుద్దికాడిడిన హెూం**
**బట్టు నాడెపు జిల్గు పుట్టములును**

**తే.గీ.** **మరియుఁ దక్కిన కడల ఱేండ్లుఱక మంచి**
**సేయుటకుఁ బంచు నపరంజి యూయెలలును**
**గద్దియలు మేలి సెజ్జలు పెద్ద తొడవు**
**లెపుడు నా యింటఁ గొదలేక యెనసియుండు** **59**

వేల్పురాయడు = ఇంద్రుడు, బత్తి వెలయన్ = నాయందు భక్తిని ప్రకటించుచు, పుత్తెంచిన = పంపిన, పుడుకు మ్రాను = కల్పవృక్షముయొక్క, వలితావి పూవుటెత్తులు = పరిమళించు పూలగుత్తులు, ఈదమేపరి సామి = గాలి ఆహారముగాకలవి పాములు వాని సామి (శేషుడు), ఇమ్ముగాన్ = ప్రీతితో, పంచిన = పంపిన, మువ్వంపు = అందమైన, బలు = గొప్ప, తమ్మి మానికములు = పద్మరాగ మణులు, త్రాడు తాలుపు = పాశము ధరించినవాడు (వరుణుడు), మెత్తదనమునన్ = అణకువతో, ఒసగిన = ఇచ్చిన, క్రొత్త = నూతనమైన, నును = గుండ్రని, కుఱు ఆణి ముత్తియములు = మేలైన ముత్యములును, ఎద్దు తత్తడి జోదు ఉద్దికాడు = ఎద్దు వాహనముగా కల శివుని స్నేహితుడు (కుబేరుడు), ఇడిన = ఇచ్చిన, హొన్ను పట్టు = బంగారు పట్టుతో నేయబడిన, నాడెపు జిల్గు పుట్టములును = శ్రేష్ఠమైన మెరిసే వస్త్రములును, మరియున్ = ఇంకను, తక్కిన = మిగిలిన, కడల ఱేండ్లు = దిక్పాలకులు, ఉఱక = ఊరకనే, మంచి చేయుటకు = నన్ను మంచి చేసుకొనుటకు, పంచు = పంపిన, అపరంజి ఊయెలలును = బంగారు ఉయ్యాలలును, గద్దియలు = సింహాసనములు, మేలి సెజ్జలు = మంచి శయ్యలు, పెద్ద తొడవులు = చాలా ఆభరణములు, ఎపుడు = ఎల్లప్పుడు, నా ఇంటన్ = నా ఇంటియందు, కొదలేక = లోటు లేక, ఎనసి = సమృద్ధిగా, ఉండున్ = ఉండును.

**తా :** ఇంద్రుడు నాయందు భక్తిని ప్రకటించుచు పంపిన కల్పవృక్షపు పూలు, శేషుడు ప్రీతితో పంపిన పద్మరాగమణులు, వరుణుడు అణకువతో ఇచ్చిన ఆణిముత్యాలు, కుబేరుడు ఇచ్చిన బంగారు పట్టు వస్త్రాలు, ఇంకా మిగిలిన దిక్పాలకులు నన్ను మంచి చేసుకోడానికి పంపిన బంగారు ఉయ్యాలలు, సింహాసనములు, మంచి శయ్యలు, పెద్ద ఆభరణములు ఎపుడూ నా ఇంటిలో లోటులేక సమృద్ధిగా ఉంటాయి.

**కం.** **త్రుంపుల గనివగు నీ వీ**
**సొంపెడలిన పేదమానుసుల వెంటఁ గటా!**
**దుంపలుఁ గూరలు నములుచుఁ**
**గంపలఁ బడి తిరుగనేల కైకొను నన్నున్** **60**

కటా = అయ్యో!, త్రుంపుల = శ్రేష్ఠ వస్తువుల, గనివి అగు = గనివైన, నీవు, ఈ సొంపు ఎడలిన = ఈ వైభవం పోగొట్టుకున్న, పేదమానుసుల వెంటన్ = మురికిమనుషుల వెనక, దుంపలున్ కూరలు = కందమూలములు, కాయగూరలు, నములుచున్ = తినుచు, కంపలన్ పడి = ఈ ముళ్ళకంపలలో పడి, తిరుగన్ ఏల = సంచరించడం ఎందుకు?, నన్నున్ కైకొమ్ము = నన్ను స్వీకరించుము.

**తా :** అయ్యో! శ్రేష్ఠ వస్తువుల గనివైన నీవు ఈ వైభవం పోగొట్టుకున్న పేద మనుషుల వెంట కందమూలాలు తింటూ ఈ ముళ్ళకంపలలో పడి సంచరించడమెందుకు? నన్ను స్వీకరించు'.

**తే.గీ.** **అనుచుఁ దన తొంటిరూపు చూపిన వడంకి**
**యన్నుతలమిన్న బెబ్బులిఁ గన్న లేడి**
**జోటియుం బోలె నేలపై సొమ్మసిలినఁ**
**జూచి యబ్బేరజపు రక్కసుండు వేగ** **61**

అనుచు, తన తొంటిరూపు చూపిన = తన నిజరూపమును చూపగా, అన్ను తలమిన్న = స్త్రీలలో శ్రేష్ఠురాలైన సీతాదేవి, వడంకి = వణకిపోయి, బెబ్బులిన్ కన్న = పులిని చూచిన, లేడి జోటియుం పోలె = ఆడులేడి వలె, నేలపైన్ సొమ్మసిలిన = నేలపై పడి మూర్ఛనందగా, చూచి = చూచినవాడై, ఆ బేరజపు రక్కసుడు = ఆ కుత్సితుడైన రాక్షసుడు (రావణుడు), వేగ = శీఘ్రముగా,

**తా :** అని పలుకుచు తన నిజరూపమును చూపగా, సీత వణకిపోతూ పులిని చూచిన లేడిలా సొమ్మసిలగా చూచి ఆ కుత్సితుడైన రాక్షసుడు వెంటనే –

**కం.** **పొంగుచు నరదముపైఁ బొల**
**తిం గూరిమి నునిచి వేల్పు తెఱవునఁ బఱచెం**
**బంగరు పిచ్చిక గొంచున్**
**నింగికి సాళువపు పులుఁగు నెగయు తెఱఁగునన్** **62**

పొంగుచున్ = సంతోషించుచు, అరదముపైన్ = తన రథముమీద, పొలతిన్ = ఆ సీతాదేవిని, కూరిమిన్ ఉనిచి = ప్రీతితో ఉంచి, బంగరు పిచ్చిక కొంచున్ = బంగారు పిచ్చుకను పట్టుకొని,

సాళువపు పులుగు = గ్రద్ద, నింగికిన్ = ఆకాశమునకు, ఎగయు తెఱగునన్ = ఎగిరిపోయే విధముగా, (ఆ రావణుడు) వేల్పు తెఱవునన్ = ఆకాశ మార్గమున, పఱచెన్ = పారిపోయెను.

**తా :** సంతోషిస్తూ, తన రథంమీద సీతను ప్రీతితో ఉంచి బంగారు పిచ్చుకను పట్టుకొని గ్రద్ద ఆకాశానికి ఎగిరిపోయే విధంగా ఆ రావణుడు ఆకాశమార్గమున పారిపోయెను.

**తే.గీ.** **అత్తెఱంగునఁ గొనిపోవునపుడు గన్ను**
**విచ్చి కడలెల్లఁ జూచి యమ్మచ్చెకంటి**
**యురక విలపింపఁ దొడఁగె నయ్యో! మఱంది!**
**ఏల పొమ్మంటి గొదకొని యెగ్గులాడి** **63**

ఆ తెఱంగునన్ = ఆ విధముగా, కొనిపోవున్ అపుడు = తీసుకొని వెళ్ళుచున్నప్పుడు, ఆ మచ్చెకంటి = ఆ చేపలవంటి కన్నులుకల సీతాదేవి, కన్ను విచ్చి = కనులు విప్పి, కడలు ఎల్లన్ చూచి = అన్ని ప్రక్కలను చూచి, అయ్యో మఱంది = ఓ మరదివగు లక్ష్మణా!, గొదకొని = తొందరపడి, ఎగ్గులాడి = నిందావాక్యములు పలికి, ఏల పొమ్ము అంటి = ఎందుకు వెళ్ళమన్నాను (అని), ఉరక విలపింప తొడగె = ఆగకుండ ఏడువ సాగెను.

**తా :** ఆ విధంగా తీసుకు పోతున్నప్పుడు సీత కన్నులు విప్పి, అన్ని ప్రక్కల చూచి 'ఓ మరదీ! లక్ష్మణా! తొందరపడి నిందావాక్యాలు పలికి ఎందుకు వెళ్ళమన్నాను' అని ఆగకుండ ఏడువసాగెను.

**కం.** **కటకట! యిపు డద్దోసమె**
**తటుకునఁ దగులుకొనఁబోలుఁ దప్పక యిఁక నె**
**చ్చటఁ గలరు వీనిఁ దెరలిచి**
**దిటముగ ననుఁ గాచుకొనఁగఁ దివిరెడు వారల్** **64**

కటకట = అయ్యయ్యో, ఇపుడు = ఇప్పుడు, ఆ దోసమె = నిష్కారణంగా లక్ష్మణుని దూషించిన దోషమే, తప్పక = విడువక, తటుకున తగులుకొనన్ పోలు = వెంటనే తగులుకొని ఉంటుంది, ఇకన్ వీనిన్ = ఇంక వీనిని, తెరలిచి = బాధించి, దిటముగ = ధైర్యముగ, ననున్ కాచుకొనగ = నన్ను రక్షించుటకు, తివిరెడు వారల్ = ప్రయత్నించువారు, ఎచ్చట కలరు = ఎక్కడున్నారు?

**తా :** అయ్యయ్యో! ఇప్పుడు నిష్కారణంగా లక్ష్మణుని దూషించిన దోషమే విడువక వెంటనే తగులుకొని ఉంటుంది. ఇంక వీనిని అడ్డు తొలగించి ధైర్యంగా నన్ను రక్షించుటకు ప్రయత్నించేవాళ్ళు ఎక్కడున్నారు?

**ఆ.వె.** **కడలఱేఁడులార! జడదారులార! మె**
**కంబులార! గ్రుడ్డుకాన్పులార!**
**చెట్టులార! తోడఁబుట్టువులార! పె**
**న్గట్టులార! నన్నుఁ గావరయ్య** **65**

కడలఱేఁడులార = దిక్పాలకులార!, జడదారులార = మహర్షులార!, మెకంబులార = ఓ జంతువులార!, గ్రుడ్డుకాన్పులార = ఓ పక్షులార!, చెట్టులార = వృక్షములార!, తోడన్ పుట్టువులార

= ఓ వన సోదరులార!, పెన్ గట్టులార = ఓ కొండలార!, నన్నున్ కావరయ్య = నన్ను కాపాడండి.

**తా :** దిక్పాలకులార! మహర్షులార! ఓ మృగములార! ఓ పక్షులార! ఓ వన సోదరులారా! ఓ కొండలార! నన్ను కాపాడండి.

**కం.** **కల్లరి తొలివేలుపు తేఁ**
**డల్లనఁ జెఱపట్టుకొనుచు నరుగుచున్నాఁ**
**డెల్ల తెఱంగుల నిపుడో**
**తల్లీ! విడిపింప రాగదవె! పంటచెలీ!** **66**

కల్లరి = దొంగయైన, తొలివేలుపు తేడు = రావణుడు, చెఱపట్టుకొనుచున్ = నన్ను బంధించుకొని, అల్లనన్ = మెల్లగా, అరుగుచున్నాడు = వెళ్ళిపోతున్నాడు, ఇపుడు = ఈ సమయంలో, ఎల్ల తెఱంగుల = ఏదో విధంగా, విడిపింపన్ = విడిపించుటకు, తల్లీ పంటచెలీ = ఓ అమ్మా! భూదేవీ!, రాగదవె = రావే!

**తా :** మాయగాడైన రావణుడు నన్ను బంధించుకొని మెల్లగా వెళ్ళిపోతున్నాడు. ఈ సమయంలో ఏదో విధంగా విడిపించడానికి తల్లీ! ఓ భూదేవీ! రావమ్మా!

**తే.గీ.** **జనకుఁడను తేని పట్టినిఁ జాల్పు తేర్ల**
**తేని కోడల రాముని చాన నిట్లు**
**రక్కసునిచేత ననదనై చిక్కువడితి**
**వేల్పుదొరలార! కావరే! వేగఁ జేరి** **67**

జనకుడు అను తేని పట్టిని = జనకుని కూతురిని, చాల్పు తేర్ల తేని కోడల = దశరథుని కోడల్ని, రాముని చానను = రాముని భార్యను, ఇట్లు = ఈ విధంగా, అనదనై = అనాథనై, రక్కసుని చేతన్ = రాక్షసుని చేతిలో, చిక్కువడితి = చిక్కిపోయాను, వేల్పుదొరలార = ఓ దేవతాశ్రేష్ఠులార!, వేగన్ చేరి = శీఘ్రముగా వచ్చి, కావరే = రక్షించండి.

**తా :** జనకుని కూతురిని, దశరథుని కోడల్ని, రాముని భార్యను ఈ విధంగా అసహాయురాలనై రాక్షసుని చేతిలో చిక్కుపడ్డాను. ఓ దేవతాశ్రేష్ఠులారా! శీఘ్రముగా వచ్చి రక్షించండి.

**తే.గీ** **అనుచుఁ బెక్కు తెఱంగుల నమ్మెలంత**
**మొఱ నొసంగిన నాలించి నెఱి జటాయు**
**వనెడి పులుఁగులదొర యొక్కఁ డడ్డుఁ దాకి**
**సోఁకుమూఁకల యెకిమీనిఁ జూచి పలికె** **68**

అనుచు పెక్కు తెఱంగులన్ = అని అనేక విధములుగా, ఆ మెలంత = ఆ సీతాదేవి, మొఱను ఒసంగినన్ = మొఱపెట్టగా, ఆలించి = విని, నెఱి = ప్రజ్ఞ కల, జటాయువు అనెడి పులుగుల దొర = జటాయువనే పక్షి శ్రేష్ఠము, అడ్డున్ తాకి = అడ్డుపడి, సోకుమూకల ఎకిమీనిన్ = రాక్షసరాజును, చూచి పలికె = చూచి పలికెను.

**తా :** అని అనేక విధములుగా ఆ సీతాదేవి మొఱపెట్టగా విని ప్రజ్ఞకల జటాయువనెడి పక్షి అడ్డుపడి రావణుని చూచి పలికెను.

**ఆ.వె. ఓరి దోసకారి! యుడుగని క్రొవ్వునఁ**
**బెల్లుమీఱి జగము తల్లియైన**
**ప్రొద్దు కొలపుసామి ముద్దియ నిటు లేల**
**కొంచుఁ బోయె దిపుడు గొంకులేక 69**

ఓరి దోసకారి = ఓ దోషాత్ముడా!, ఉడుగని = అధికమైన, క్రొవ్వునన్ = గర్వముతో, పెల్లు మీఱి = రెచ్చిపోయి, జగము తల్లియైన = పతివ్రతయైన, ప్రొద్దు కొలపు సామి = సూర్య వంశపు ప్రభువైన రాముని, ముద్దియన్ = భార్యను, ఇపుడు = ఇప్పుడు, కొంకు లేక = ఏ మాత్రము జంకులేక, ఇటులు = ఈ విధంగా, ఏల = ఏ కారణమున, కొంచున్ పోయెదు = తీసుకునిపోతున్నావు?

**తా :** ఓ దోషాత్ముడా! గొప్ప గర్వంతో రెచ్చిపోయి పతివ్రతయైన సూర్యవంశ ప్రభువైన రాముని ఇల్లాలిని ఇప్పుడు ఏ మాత్రం జంకులేక ఈ విధంగా ఏ కారణంతో తీసుకు పోతున్నావు?

**కం. తాతకు మనుమఁడవై పొల**
**మేఁతరి తెగలందు వాసి మీఱి తనరు నీ**
**కీ తెఱఁగున గొదుగక పెఱ**
**నాతిం దమి నిగుడఁ దాకొనం దగవగునే! 70**

తాతకు మనుమడవై = బ్రహ్మకు మనుమడవగుచు, పొలమేతరి తెగలందు = మాంస భక్షకులైన రాక్షసుల తెగలో, వాసి మీఱి = ప్రసిద్ధినంది, తనరు = ఒప్పునట్టి, నీకు ఈ తెఱగున = నీకు ఈ విధంగా, కొదుగక = జంకులేక, పెఱ నాతిం = పరాయి స్త్రీని, తమి నిగుడన్ = అధికమైన వ్యామోహముతో, తాకొనన్ = తాకుట, తగవు అగునే = తగిన పని అవుతుందా?

**తా :** బ్రహ్మకు మనుమడవై, రాక్షసుల తెగలో ప్రసిద్ధుడవైన నీకు ఈ విధంగా జంకులేక పరాయిస్త్రీని వ్యామోహంతో తాకుట తగిన పనేనా?

**కం. వలదు ముడికాఁడ! రాముని**
**కలికిం దిగనాడి చనుము కాకుండిన న**
**బ్బలు మగని తూపు టగ్గిం**
**దొలివేలుపు పంగడంబు త్రుంగెడుఁ జుమ్మీ! 71**

ముడికాడ = ఓ ధూర్తుడా!, వలదు = వద్దు, రాముని కలికిం = రాముని భార్యను, దిగనాడి చనుము = వదలిపెట్టి వెళ్ళుము, కాక ఉండిన = కాకపోతే, ఆ బలు మగని తూపు అగ్గిం = ఆ పరాక్రమవంతుని బాణాగ్నికి, తొలివేలుపు వంగడంబు = రాక్షసవంశ మంతయును, త్రుంగెడున్ చుమ్మీ = నాశనమగును సుమా!

**తా :** ఓ ధూర్తుడా! వద్దు. రాముని భార్యను వదలిపెట్టి వెళ్ళు. లేకపోతే ఆ శూరుని బాణాగ్నికి రాక్షస వంశమంతా నాశనమగునుసుమా!

**కం. అని యదలించుచు వడిఁ బై**
**కొని యప్పాలసుని తలలఁ గొనబారెడు కుం**
**దనపుం బొమిడికములు పది**
**యును దటుకున నేలఁగూల నురువడిఁ దన్నెన్ 72**

అని అదలించుచు = అని గద్దించుచూ, వడిన్ = వేగముగా, పైకొని = మీదపడి, ఆ పాలసుని = ఆ దుర్మార్గుడైన రావణుని, తలలన్ = తలలందు, కొనబారెడు = ప్రకాశించుచున్న, కుందనపున్ బొమిడికములు = బంగారు కిరీటములు, పదియును = పదింటినీ, తటుకున = ఒక్కసారిగా, నేలన్ కూలన్ = నేలపై పడునట్లుగా, ఉరవడిన్ = మిక్కిలి వేగముగా, తన్నెన్ = తన్నెను.

**తా :** అని గద్దించుచూ వేగముగా మీదపడి ఆ దుర్మార్గుడైన రావణుని తలలపై ప్రకాశిస్తున్న బంగారు కిరీటములు పదింటినీ ఒక్కసారిగా నేల పడునట్లుగా వేగంగా తన్నెను.

**ఉ. తన్నిన నాతఁ డల్గి బెడిదంబుగ ముమ్మొనవాలు వానిపైఁ**
**గ్రన్నన నేయ నప్పులుఁగురాయఁడు ముక్కున జక్కుసేసి యా**
**మన్నియ తేరి యక్కజఁపు మావులఁ గూల్చి కడంగుచున్నచోఁ**
**గన్నెఱఁ జేసి చాలుపు మొగంబుల రక్కసుఁ డుక్కు మీఱఁగన్ 73**

తన్నినన్ = తన్నగా, ఆతడు = ఆ రావణుడు, అల్గి = కోపించి, బెడిదంబుగన్ = భీకరంగా, ముమ్మొనవాలు = త్రిశూలమును, వానిపైన్ = ఆ జటాయుపై, క్రన్ననన్ ఏయన్ = వేగముగా విసరగా, ఆ పులుగురాయడు = ఆ పక్షిరాజు, ముక్కునన్ = తన ముక్కుతో, చక్కు చేసి = ముక్కలు చేసి, ఆ మన్నియ తేరి = ఆ వీరుని రథమునకున్న, అక్కజపు మావులన్ = శ్రేష్ఠములైన గుఱ్ఱములను, కూల్చి = చంపి, కడంగుచున్నచోన్ = విజృంభించుచుండగా, చాలుపు మొగంబుల రక్కసుడు = రావణుడు, కన్ను ఎఱన్ చేసి = కళ్ళెఱ్ఱచేసి, ఉక్కు మీఱగన్ = శౌర్యమతిశయింపగా–

**తా :** తన్నగా, ఆ రావణుడు కోపించి భీకరంగా త్రిశూలాన్ని ఆ జటాయుపై వేగంగా విసరగా ఆ పక్షిరాజు తన ముక్కుతో ముక్కలు చేసి ఆ రావణుని రథమునకున్న గుఱ్ఱములను చంపి విజృంభించుచుండగా రావణుడు కళ్ళెఱ్ఱజేసి శౌర్యమతిశయంపగా –

**కం. పది వాఁడి తూపులా పు**
**ల్గుదొరం గుఱిసేసి యేయ గొబ్బున నవి పైఁ**
**బొదువంగ నీక ఱెక్కలఁ**
**జదియంగా మోఁదె బలిమి సడలక యతఁడున్ 74**

పది వాడి తూపులు = పది పదునైన బాణములు, ఆ పుల్గు దొరం = ఆ పక్షిరాజును, గుఱి చేసి = లక్ష్యముగా చేసుకొని, ఏయ = వేయగా, అతడున్ = ఆ జటాయును, బలిమి సడలక = శక్తి తగ్గక, గొబ్బునన్ = వెంటనే, అవి = ఆ బాణములు, పైన్ పొదువంగనీక = మీద పడకుండగా, ఱెక్కలన్ = తన ఱెక్కలచే, చదియంగాన్ = నలిగిపోయేటట్లుగా, మోదెన్ = బాదెను.

**తా :** పది పదునైన బాణములు ఆ పక్షిరాజును లక్ష్యముగా చేసుకొని వేయగా ఆ జటాయువు శక్తి తగ్గక వెంటనే ఆ బాణములను మీద పడకుండగా తన ఱెక్కలచే నలిగిపోయేటట్లుగా బాదెను.

**తే.గీ. అట్టు లెడలేని కడిమిఁ గయ్యం బొనర్చు**
**జడ బ్రతుకు గూడు పుట్టువు సామి మీఁదఁ**
**గినిసి కైదువ కేల సంకించి రక్క**
**సుండు గాళ్ళును ఱెక్కలుఁ జెండివైచె 75**

అట్టులు = ఆ విధముగా, ఎడలేని = అంతులేని, కడిమిన్ = సాహసముతో, కయ్యంబు ఒనర్చు = యుద్ధం చేస్తున్న, జడ బ్రతుకు గూడు పుట్టువు = వెంద్రుకలతో గూటిలో పుట్టి బ్రతికేది (పక్షి), సామి = శ్రేష్ఠుడు (జటాయు), మీదన్ = పైని, కినిసి = కోపించి, కైదువ కేల పంకించి = కత్తిని చేత ధరించి, రక్కసుండు = రావణుడు, కాళ్ళును, రెక్కలున్ = ఆ జటాయు కాళ్ళను ఱెక్కలను, చెండివైచె = నరికివేసెను.

**తా :** ఆ విధముగా అంతులేని సాహసంతో యుద్ధం చేస్తున్న జటాయుపైని కోపించి కత్తిని చేత ధరించి రావణుడు ఆ పక్షి కాళ్ళు, ఱెక్కలను నరికివేసెను.

**ఆ.వె. వైచి నెమ్మితోడ వడిఁ జనుచున్నచోఁ**
**బుడమి కాన్పు చీఱ కడ చెఱంగు**
**సించి తొడవులెల్ల గొంచక ముడిచి యా**
**పజ్జనున్న కొండపైని వైచె 76**

వైచి = అలా జటాయును పడగొట్టి, నెమ్మితోడ = సంతోషముతో, వడిన్ = శీఘ్రముగా, చనుచున్నచోన్ = వెళ్ళుచుండగా, పుడమి కాన్పు = సీతాదేవి, కొంచక = సందేహించక, చీఱ కడచెఱంగు చించి = తాను కట్టుకున్న చీర చివరి చెంగును చింపి, తొడవులు ఎల్ల ముడిచి = ఆభరణముల నన్నిటిని కట్టి, ఆ పజ్జను ఉన్న = ఆ ప్రక్కనున్న, కొండపైని వైచె = కొండమీద పడవేసెను.

**తా :** అలా జటాయును పడగొట్టి సంతోషముతో శీఘ్రముగా వెళ్ళుచుండగా సీత సందేహించక తన చీర చెంగును చింపి ఆభరణము లన్నిటిని కట్టి ఆ ప్రక్కనున్న కొండమీద పడవేసెను.

**తే.గీ. వేల్పు గొంగయుఁ గడలేని వేడ్కతోడ**
**నపుడె తన దీవి కేఁగి నెయ్యమున నింటి**
**చెంతఁ బూఁదోఁటలోన నచ్చెలువ నునిచి**
**కఱకు రాకాసి కొమ్మలఁ గాపు వెట్టె 77**

వేల్పు గొంగయున్ = దేవతలకు శత్రువగు రావణుడును, కడలేని = అంతులేని, వేడ్కతోడ = సంతోషముతో, అపుడె = తొందరగా, తన దీవికి ఏగి = తన లంకానగరానికి వెళ్ళి, నెయ్యమున = ప్రీతితో, ఇంటి చెంతన్ పూవు తోటలోన = తన అంతిపురము ప్రక్కనున్న ఉద్యాన వనములో (అశోకవని), ఆ చెలువన్ = ఆ సీతను, ఉనిచి = ఉంచి, కఱకు రాకాసి కొమ్మలన్ = క్రూరులైన రాక్షస స్త్రీలను, కాపు వెట్టె = కాపలా పెట్టెను.

**తా :** రావణుడు అంతులేని సంతోషముతో అపుడె లంకానగరము చేరి ప్రీతితో తన అంతిపురము ప్రక్కనున్న ఉద్యానవనములో ఆ సీతను ఉంచి క్రూరులైన రాక్షస స్త్రీలను కాపలా పెట్టెను.

**తే.గీ.** **అంత నచ్చట నడవిలో నమ్మెకంబు**
**నొఱలఁ బఱియలు చేసి తిత్తొలచి తెచ్చు**
**నెడలఁ దోఁబుట్టు వెదురైన నడలి రాముఁ**
**డతనిఁ గనుగొని కినుక నిట్లనుచుఁ బలికె** **78**

అంతన్ = అంతట, అచ్చటన్ అడవిలోన్ = అక్కడ అడవిలో, ఆ మెకంబున్ = ఆ లేడిని, ఒఱలన్ = అరచుచుండగా, పఱియలు చేసి = చంపి, తిత్తు ఒలిచి = చర్మము ఒలిచి, తెచ్చు ఎడలన్ = తెచ్చునంతలో, తోడ పుట్టువు = సోదరుడు, ఎదురైన = ఎదుటపడగా, అడలి = భయపడి, రాముడు అతనిన్ కనుగొని = రాముడు అతనిని చూచి, కినుకన్ = కోపముతో, ఇట్లు అనుచున్ పలికె = ఈ రీతిగా పలికెను.

**తా :** అంతట అక్కడ అడవిలో ఆ లేడిని అరచుచుండగా చంపి చర్మము ఒలిచి తెచ్చునంతలో సోదరుడు ఎదుటపడగా భయపడి రాముడు అతనిని చూచి కోపముతో పలికెను.

**కం.** **అక్కట! బలితఁపు టడవిన్**
**మొక్కలముగ గోలనునిచి మోమోడక నీ**
**విక్కడకు రాఁగ నెదలో**
**నక్కటికం బేల పొడమదయ్యెం జెపుమా!** **79**

అక్కట = అయ్యో!, బలితంపు అడవిన్ = భయంకరమైన అడవిలో, మొక్కలముగ = మూర్ఖత్వముతో, గోలను ఉనిచి = సీతను విడచి, మోమోడక = మొగమాటము లేకుండా, నీవు ఇక్కడకు రాగన్ = నీవు ఇక్కడకు వచ్చుటకు, ఎదలో = మనసులో, అక్కటికంబు = కనిరము, ఏల పొడమదు అయ్యెన్ = ఎందుకు పుట్టలేదు, చెపుమా = చెప్పుము.

**తా :** 'అయ్యో! భయంకరమైన అడవిలో మూర్ఖత్వముతో సీతను విడచి ఆలోచించక నీవు ఇక్కడకు రావడానికి మనసులో కనికరం ఎందుకు పుట్టలేదు చెప్పు.

**కం.** **తోడంబుట్టువ వనుచున్**
**నాడెంబుగ నెదను జాల నమ్మిక మీఱం**
**దోడిడి వచ్చిన నయ్యో!**
**చేడియ నిటు డించి రాఁగఁ జెల్లునె నీకున్** **80**

తోడం పుట్టువవు అనుచున్ = సోదరుడవని, నాడెంబుగ = లోతుగ, ఎదను = మనసులో, చాల నమ్మిక మీఱన్ = ఎక్కువ విశ్వాసము పెంచుకొని, తోడు ఇడి వచ్చిన = తోడుగా ఉంచి వచ్చిన, అయ్యో = దురదృష్టమా!, నీకున్ = నీకు, చేడియన్ = ఆడుదానిని, ఇటు = ఈ విధముగా, డించి రాగన్ = వదలి వచ్చుటకు, చెల్లునె = తగునా?

**తా :** సోదరుడవని నమ్మకంగా మనసులో విశ్వాసముంచుకొని తోడుంచి వచ్చిన నీకు అయ్యో! ఆడుదానిని ఇలా వదలి రావడం తగునా?'

**ఆ.వె.** **అనినఁ దల్లడిల్లి యతఁ డిట్టులను నింత**
**కినుక యేల? యన్న! విను మెకంబు**

**గూలుచున్న యెడల నో లక్ష్మణుఁడ యంచు**
**నఱచుటయు వెలంది యాలకించి** **81**

అనినన్ = అని పలుకగా, తల్లడిల్లి = బాధపడి, అతడు = ఆ లక్ష్మణుడు, ఇట్టులు అనున్ = ఈ విధముగా పలికెను, ఇంత కినుక ఏల = ఇంత కోపము ఎందులకు?, అన్న = ఓ సోదరా!, విను = వినుము, మెకంబు కూలుచున్న యెడలన్ = లేడి చనిపోవు సమయమున, ఓ లక్ష్మణుడా అంచు = ఓ లక్ష్మణా అని, అఱచుటయు = అరవడాన్ని, వెలంది = సీత, ఆలకించి = విని –

**తా :** అని పలుకగా బాధపడి లక్ష్మణుడు ఇట్లు పలికెను. 'ఇంత కోపమెందులకు? అన్నా! విను. లేడి చనిపోవు సమయమున ఓ లక్ష్మణా! అని అరవడాన్ని సీత విని –

**తే.గీ.** **కళవళించుచు నెన్నిలాగులఁ దెలిపిన**
**మాననొల్లక కొఱగాని మాటలాడి**
**పనిచె నటుఁ జేయకున్నచోఁ బడతి యలుగుఁ**
**జేయుటకు మీ రలుగ నేమి సేయువాడ** **82**

కళవళించుచు = కలత చెందుచు, ఎన్ని లాగులన్ = ఎన్ని విధములుగా, తెలిపిన = చెప్పినా, మానను ఒల్లక = విడిచిపెట్టక, కొఱగాని మాటలాడి = పనికిరాని మాటలు మాటలాడి, పనిచెన్ = పంపేసింది, అటు చేయకున్నచోన్ = అలా చేసి ఉండకపోయినచో, పడతి = వదినగారు, అలుగున్ = కోపపడుతుంది, చేయుటకు = అలా చేసినందుకు, మీరు అలుగన్ = మీరు కోపపడగా, ఏమి చేయువాడ = ఏం చెయ్యను?

**తా :** కలతచెందుచు ఎన్ని విధాలుగా చెప్పినా వినక పనికిరాని మాటలు మాటలాడి నన్ను పంపేసింది. అలా చేయకపోతే వదినగార్కి కోపం. చేస్తే మీరు కోప్పడుతున్నారు. ఏంచెయ్యను?'

**కం.** **అని నుడివినఁ దమ్మునిపై**
**గినుక యొకించుకయు మదిని గీల్కొలుపక గొ**
**బ్బున ఱేఁ డాకుం జవికకుఁ**
**జని చెలి గనఁబడకయున్న సడలిన కడఁకన్** **83**

అని నుడివినన్ = అని చెప్పగా, తమ్మునిపై = సోదరునిపై, కినుక ఒకించుకయు = కోపము కొంచెమును, మదిని కీల్కొలుపక = మనసులో ఉంచుకొనక, గొబ్బునన్ = తొందరగా, ఱేడు = రాముడు, ఆకుం చవికకున్ = పర్ణశాలకు, చని = వెళ్ళి, చెలి కనబడకయున్న = సీత కనబడక పోవడంతో, సడలిన = ధైర్యము జారిపోగా, కడకన్ = పూనికతో.

**తా :** అని చెప్పగా సోదరునిపై కొంచెంకూడా కోపం మనసులో ఉంచుకొనక తొందరగా రాముడు పర్ణశాలకు చని సీత కనబడకపోవడంతో ధైర్యము కోల్పోయి –

**కం.** **సందుల గొందులఁ బదుకుల**
**క్రిందుల యయ్యాకుటింటి క్రేవల నెల్లన్**

**సందడిగొని నెమకుచుఁ జెలి**
**నెందుం బొడఁగానలేక యెంతయు వంతన్** **84**

సందుల గొందులన్ = సందులందు గొందులందును, పడుకుల క్రిందులన్ = గుట్టల వెనుకను, అయ్యాకుటింటి క్రేవలన్ = ఆ పర్ణశాల ప్రక్కలందును, ఎల్లన్ = అంతటా, సందడిగొని = తొందరగా, నెమకుచున్ = వెదకుచు, చెలిన్ = సీతను, ఎందున్ పొడగానలేక = ఎక్కడను కాంచలేక, ఎంతయు వంతన్ = చాల బాధతో –

**తా :** సందులు, గొందులు, గుట్టల వెనుక, ఆ పర్ణశాల ప్రక్కలందు అంతటా తొందరగా వెదకుచు ఎక్కడా సీత జాడ కనబడక చాల బాధతో –

**సీ.** **కటకట! సైదోడ! క్రాల్గంటి కార్మెకం**
**బులచేతఁ బొలిసెనో? యలుకఁ జేసి**
**కానల డాఁగెనో? కఱకు రక్కసుల చేఁ**
**జిక్కెనో? లోయలఁ జేరుకొనెనొ**
**పెను జక్కరలయందు మునిఁగెనో? చిఱుత గు**
**బ్బలు లెక్కి మరల నోపక యడఁగెనొ?**
**పొదలలో నీఁగెనో? కొదుకక చెంచు దొ**
**య్యలులతోఁ జేరిక నాడఁ జనెనొ?**

**తే.గీ.** **కాని కనఁబడదయ్యె నక్కలికి చంద**
**మరసి కొందము రమ్మంచుఁ దెరవు వట్టి**
**గుట్టు వీడంగ నెదఁగ్రాలు బెట్టిదంపు**
**వెతలఁ గుందుచు నందంద వెతకికొనుచు** **85**

కటకట = అయ్యయ్యో!, సై తోడ = ఓ సోదరుడా!, క్రాలు కంటి = అందమైన కన్నులుకల సీత, కారు మెకంబులచేతన్ = క్రూర మృగములచే, పొలిసెనో = చంపబడెనో?, అలుక చేసి = కోపగించి, కానల డాగెనో = ఈ అడవిలో దాక్కుందో?, కఱకు రక్కసుల = దుర్మార్గులైన రాక్షసుల, చేన్ చిక్కెనో = చేత చిక్కిందో? లోయలన్ = లోయ ప్రాంతములను, చేరుకొనెనొ = చేరుకుందంటావా?, పెను = పెద్దవియగు, జక్కరలయందు మునిగెనో = నదులలో మునిగిపోయిందా?, చిఱుత గుబ్బలులు ఎక్కి = చిన్న గుట్టలను ఎక్కి, మరలన్ ఓపక = దిగలేక, అడగెనొ = ఉండిపోయిందా?, పొదలలోన్ ఈగెనో = పొదలలో దాగెనా? కొదుకక = అనుమానించక, చెంచు తొయ్యలులతోన్ = చెంచు కాంతలతో, చేరికన్ = మచ్చికతో, ఆడన్ చనెనొ = ఆటలాడ వెళ్ళిందా?, కాని = ఎంత వెదకినను, కనబడదు అయ్యెన్, ఆ కలికి చందము = ఆ సీతయొక్క జాడను, అరసికొందము = తెలుసుకుందాం, రమ్మి అంచు = రా అంటూ, తెరవు పట్టి = దారిపట్టి, గుట్టు వీడంగన్ = జాడ తెలిసేలా, ఎదన్ క్రాలు = మనసులో మండుచున్న, బెట్టిదంపు వెతలన్ = కఠినమైన బాధలతో, కుందుచున్ = క్రుంగిపోవుచు, అందు అందు వెతకికొనుచు = అక్కడక్కడ వెదకుచూ –

**తా :** అయ్యయ్యో! ఓ సోదరుడా! సీత క్రూరమృగములచే చంపబడెనో, కోపగించి ఎక్కడైనా దాగుందో, రాక్షసుల చేత చిక్కిందో, లోయలు చేరుకుందంటావా? నదులలో మునిగిపోయిందా? గుట్టలెక్కి దిగలేక ఉండిపోయిందా? పొదలలో దాగెనా? చెంచు కాంతలతో ఆటలాడ వెళ్ళిందా? ఎంత వెదికినా కనబడదు. ఆ సీత జాడ తెలుసుకుందాం రా! అంటూ దారిపట్టి జాడ తెలిసేలా మనసులో మండుచున్న బాధతో క్రుంగిపోతూ అక్కడక్కడ వెదకుచూ –

**సీ.** **చానల తలమిన్న కానరుగద గొర**
**వంకలార! తుటారి జింకలార!**
**సోయగంబుల ప్రోకఁ జూడరుగద నెమ్మి**
**దాటులార! పిసాళి తేటులార!**
**రతనంపు గని యిందు రాదుగదా చెంచు**
**కల్కులార! యొయారి చిల్కలార!**
**పసిఁడి కీల్బొమ్మ మీ పజ్జ నేఁగదు గదా**
**కొంచలార! కొలంక టంచలార!**

**తే.గీ.** **వన్నియల దొంతి మీ చెంత నున్నదేమొ?**
**కన్ను లలలార జూపరే పొన్నలార!**
**మిన్ను ముట్టిన యేనిక గున్నలార!**
**తిన్నెలార! నిరాబారి కన్నెలార!** **86**

చానల తలమిన్న = స్త్రీ శిరోరత్నమును, గొరవంకలార = ఓ గోరువంకలార, తుటారి జింకలార = దిట్టతనముకల జింకలార, కానరుగద = చూడలేదు కదా!, సోయగంబుల ప్రోకన్ = అందాల రాశియగు సీతను, నెమ్మి దాటులార = నెమలి గుంపులార, పిసాళి తేటులార = ఓ సుందరమైన తుమ్మెదలార, చూడరు కద = మీరు చూడలేదు కదా, రతనంపు గని = రత్నాల గని యైన సీత, చెంచు కల్కులార = చెంచు వనితలార, ఒయారి చిల్కలార = ఒయ్యారము కల ఓ చిలుకలార, ఇందు రాదు కదా = ఇక్కడికి రాలేదు కదా, పసిడి కీలు బొమ్మ = బంగారు బొమ్మవంటి సీత, కొంచలార = కొంగలార, కొలంకు అంచలార = సరస్సులలోనున్న హంసలార, మీ పజ్జన్ = మీ ప్రక్కనుండి, ఏగదు కదా = వెళ్ళలేదు కదా, వన్నియల దొంతి = వన్నెలు చిందించే సీత, మీ చెంత, ఉన్నది ఏమొ = ఉందేమో?, పొన్నలార = పొన్న తరువులార, మిన్ను ముట్టిన ఏనిక గున్నలార = ఆకాశమంటిన ఏనుగు గున్నలార, తిన్నెలార = ఓ ఇసుక దిబ్బలార, నిరాబారి కన్నెలార = ఓ తాపస కన్యలార, కన్నులు అలరార చూపరే = కన్నుల కానందమగునట్లు చూపండి.

**తా :** ఓ గొరువంకలార! ఓ జింకలార! స్త్రీరత్నమును చూడలేదుకదా! నెమలి గుంపులార! తుమ్మెదలార! అందాలరాశి సీతను చూడలేదుకదా!

**కం.** **తొవలార! కొదమ జక్కవ**
**కవలార! కడింది సోయగపుఁ దుమ్మెద కూ**

**టువులార! మీ రిపుడు మా**
**నవలా రతనంబుఁ జూచినారే? చెపుడా! 87**

తొవలార = ఓ కలువపూవులార!, కొదమ జక్కవ కవలార = యువ కోకముల జంటలార!, కడింది సోయగపు = మిక్కిలి అందముగానున్న, తుమ్మెద కూటువులార = తుమ్మెద సమూహములార!, మీరు = మీరు, ఇపుడు = ఇప్పుడు, మా నవలా రతనంబున్ = మా స్త్రీరత్నమైన సీతను, చూచినారే = చూచినారా?, చెపుడా = చెప్పండి.

**తా :** ఓ కలువపూవులార! జక్కవ కవలార! తుమ్మెద కూటువులార! మా సీతను చూచారా? చెప్పండి.

**సీ.** **మీ కెంజివురుఁ బోలు మెఱుఁగు వాతెరగల**
**ముగుదఁ గానరె? మావి మోకలార!**
**మీ క్రొన్ననలఁ బోలు మేలి పొక్కిలిగల**
**కొమ్మఁ గానరె? పొన్నగున్నలార!**
**మీ పండ్ల చెలువూను మేటి గుబ్బలుగల**
**చేడియఁ గానరే? యీడెలార!**
**మీ కంబములఁ గేరు మేలి తొడల్గల**
**నాఁతి గానరే? లే యనంటులార!**

**తే.గీ.** **మీ యలరు రేకుగమి పోల్కి మిగుల నలరు**
**చికిలి కొనగోళ్ళు గల ముద్దు చిగురుఁబోఁడి**
**ఊఁగతనమున నెచ్చోట దాఁగెనో క**
**నుంగొనరె? మీరు కమ్మ గేదంగులార! 88**

మీ, కెంపు చివురు పోలు = ఎఱ్ఱని చిగుటాకులను పోలిన, మెఱుంగు = కాంతి కల్గిన, వాతెరకల = క్రింది పెదవియున్న, ముగుదన్ = స్త్రీని, మావిమోకలార = గున్నమామిడిలార!, కానరె = చూడలేదా?, మీ, క్రొత్త ననలన్ పోలు = విరిసిన పూవులను పోలిన, మేలి పొక్కిలికల = లోతైన నాభికల, కొమ్మన్ = కాంతను, పొన్నగున్నలార = పొన్న వృక్షములార!, కానరె = చూడలేదా?, మీ పండ్ల చెలువు ఊను = మీ పండ్లయొక్క అందమును వహించు, మేటి గుబ్బలుకల = ఉన్నతమైన స్తనములుకల, చేడియన్ = స్త్రీని, ఈడెలార = కిత్తలి చెట్టులార!, కానరే = చూడలేదా?, మీ కంబములన్ = మీ కాండములను, కేరు = తిరస్కరించు, మేలి తొడల్కల = మంచి తొడలు కల, నాతిన్ = స్త్రీని, లే అనంటులార = లేత అరటి బోదెలార! కానరే = చూడలేదా?, మీ = మీయొక్క, అలరు రేకుగమిన్ పోల్కి = పూవురేకుల సమూహమువలె, మిగులన్ అలరు = మిక్కిలి అందముగానుండు, చికిలి కొనగోళ్ళుకల = వాడియైన గోళ్ళచివరలుకల, ముద్దు చిగురుబోడి = ముద్దులొలికే స్త్రీ, ఊగతనమునన్ = దుడుకు తనముతో, ఎచ్చోట దాగెనో = ఎక్కడ దాగెనో, కమ్మ గేదంగులార = అందమైన మొగలి చెట్టులార!, మీరు = మీరు, కనుంగొనరె = చూడలేదా?

**తా :** గున్నమావిలారా! మీ చిగురాకు పోలి కాంతిగల పెదవియున్న స్త్రీని చూడలేదా? పొన్నవృక్షములారా! విరిసిన పూలను పోలిన లోతైన నాభికల కాంతను మీరు చూడలేదా? కిత్తలిచెట్టులారా! మీ పండ్లవలె అందమైన స్తనములుకల స్త్రీని కానరే? అరటిబోదెలారా! మీ కాండములను తిరస్కరించు తొడలుకల నాతిని కానరే? మొగలిచెట్టులారా! మీ పూరేకులను పోలు గోళ్ళ చివరలుకల ముద్దులొలికే స్త్రీ క్రీడా దృష్టితో ఎక్కడ దాగెనో మీరు చూడలేదా? (ఈడె ఒక రకపు నారింజ – పంపర పనస కావచ్చు)

**తే.గీ.** **మొల్ల పొదలార! మీ తొలి మొగ్గచాల్పు**
**కరణి సొంపునఁ బొదలు పల్వరుస గలిగి**
**చెలఁగు నాడెంపు రాచ కెంజిగురుటాకు**
**బోఁడి నెందైనఁ బరికించి చూడరుగద?** **89**

మొల్ల పొదలార, మీ తొలి మొగ్గ చాల్పు కరణిన్ = మీకు ముందుగా పూసిన మొగ్గల సమూహము వలె, సొంపునన్ పొదలు = సొగసుచే అతిశయించు, పలువరుసకలిగి = పంటివరుసకలిగి, చెలగు = ఒప్పునట్టి, నాడెంపు = శ్రేష్ఠమైన, రాచ కెంపు చిగురు ఆకు బోడిన్ = ఎఱ్ఱని చిగురుటాకువంటి మేనుకల రాజ కాంతను, ఎందైనన్, పరికించి = పరిశీలించి, చూడరు కదా = చూడలేదు కదా?

**తా :** మొల్ల పొదలారా! మీ మొగ్గలవలె సొగసు పలు వరుసకల, ఎఱ్ఱని చిగురుటాకు వంటి మేనుకల కాంతను ఎచ్చటనైనను పరిశీలించి చూడలేదుకదా!

**కం.** **నడలం దొడలం గుబ్బల**
**నడరఁగ నిన్నోట పఱచెనని డెందమునన్**
**గడు నలుగక యేనుంగురొ!**
**పడఁతుక తెఱఁగిప్పు డెఱుక పఱుపుము నాకున్** **90**

నడలన్ = నడకలచేతను, తొడలన్ = ఊరువులచేతను, గుబ్బలన్ = స్తనములచేతను, అడరగన్ = అతిశయింపగా, నిన్ను ఓట పఱచెనని = నిన్ను ఓడించెనని, డెందమునన్ = మనసునందు, ఏనుంగురొ = ఓ మదపుటేనుగా! కడున్ అలుగక = మిక్కిలి కోపింపక, ఇప్పుడు = ఇప్పుడు, నాకున్ = నాకు, పడతుక తెఱగు = మా సీత విషయము, ఎఱుక పఱుపుము = తెలియపరచుము.

**తా :** నడకలచేతను, ఊరువులచేతను, స్తనములచేతను అతిశయముతో నిన్ను ఓడించెనని మనసునందు ఓ మదపుటేనుగా! మిక్కిలి కోపింపక ఇప్పుడు నాకు మాసీత విషయము తెలియపరచుము.

**కం.** **రంగున నెన్నడుమున ని**
**న్నుం గేరె నటంచుఁ గినుక నూల్కొన గరితన్**
**మ్రింగితివో? నిక్కంబుగ**
**సింగమ! కల చందమెల్లఁ జెపుమా? సరగన్** **91**

రంగున = దేహ కాంతిచేతను, నెఱి నడుమున = అందమైన నడుముచేతను, నిన్నున్, కేరెన్ = తిరస్కరించెను, అటంచున్ = అనుచు, కినుక నూల్కొనన్ = అధికమైన కోపముతో, గరితన్ = మా సీతను, సింగమ = ఓ సింహమా!, మ్రింగితివో = మింగేసేవా?, సరగన్ = వెంటనే, కల చందము ఎల్లన్ = ఉన్న విషయమునంతను, నిక్కంబుగ = సత్యముగ, చెపుమా = చెప్పుము.

**తా :** దేహ కాంతిచేతను, అందమైన నడుముచేతను, నిన్ను తిరస్కరించుననే కోపముతో ఓ సింహమా! మా సీతను మింగేసేవా? వెంటనే ఉన్న విషయం నిక్కముగ చెప్పు.

**కం.** **ఇదె మాటికిఁ బెనఁగొనియెడుఁ**
**గొదమాలిన వలపు తేఁటికొదమా! చెలిపై**
**నెద మానని యఱపూనుచుఁ**
**బొదమా! పరికింత మలరుఁ బొదమాటునకున్** **92**

ఇదె మాటికిన్ = ఇదిగో ఎప్పుడును, పెనన్ కొనియెడు = బంధము కలిగి యుండెడు, కొదమాలిన = కొఱతలేని, వలపు = ప్రేమకల, తేటి కొదమా = గండు తుమ్మెదా!, చెలిపైన్ = మా సీతయందు, ఎదన్ = మనసునందు, మానని అఱ పూనుచున్ = తగ్గని అభిమానమును చూపుచు, అలరున్ పొదమాటునకున్ = పూపొదరిల్లు చాటునకు, పరికింతము = చూద్దాం, పొదమా = వెళదామా?

**తా :** ఇదిగో ఎప్పుడూ బంధము కలిగియుండే, కొఱతలేని ప్రేమకల గండు తుమ్మెదా! మా సీతయందు మనసున అభిమానము చూపుచు పూపొదరిల్లు చాటునకు చూద్దాం వెళదామా?

**కం.** **పలుకుల తియ్యఁదనంబున**
**నలువుగ నీతోడ నీడనం జాలిన లేఁ**
**జిలుకల కొలికినిఁ జూచితె**
**చిలుకా! మాతోడ ముద్దు చిలుకం జెపుమా?** **93**

చిలుకా!, పలుకుల తియ్యన్ తనంబున = మాటల తియ్యదనముచే, నలువుగ = చక్కగా, నీతోడన్ = నీతో, ఈడు అనన్ చాలిన = సరి అనుటకు సరిపోయిన, లే చిలుకల కొలికినిన్ = చిన్న చిలుక వంటి స్త్రీని, చూచితె = చూశావా? ముద్దు చిలుకం = ముద్దులొలికేటట్టు, మాతోడ = మాతో, చెపుమా = చెప్పుము.

**తా :** చిలుకా! మాటల తియ్యదనముచే చక్కగా నీతో ఈడగు చిలుకవంటి స్త్రీని చూశావా? ముద్దులొలికేటట్టు మాతో చెప్పు.

**తే.గీ.** **అనుచుఁ దద్దయుఁ బలవించుకొనుచు ముందు**
**వచ్చి నిలిచిన చోటికి వచ్చి కొనుచుఁ**
**దొడరి యడిగిన దానినే యడిగికొనుచు**
**అంతకంతకు వెక్కసంబైన వెతల** **94**

అనుచు = అంటూ, తద్దయున్ = ఎక్కువగా, పలవించుకొనుచు = పలవరిస్తూ, వచ్చి = వచ్చి, ముందు నిలిచిన చోటికి వచ్చికొనుచు = ముందు నిలబడిన చోటికే మరల వచ్చుచు, తొడరి = పూనుకొని, అడిగిన దానినే అడిగికొనుచు = అడిగిన దానినే మరల అడుగుచు, అంతకు అంతకు = క్రమక్రమంగా, వెక్కసంబు ఐన = భరింపశక్యముకాని, వెతల = బాధలతో –

**తా :** అనుచు ఎక్కువగా పలవరిస్తూ వచ్చి ముందు నిలబడిన చోటుకే మళ్ళీ వస్తూ, అడిగిన దానినే మళ్ళా అడుగుతూ అంతకంతకు భరింపశక్యముకాని వెతలతో –

**సీ.** **పురివిచ్చి నట్టువ పుల్గు లాడెడుచోటఁ**
**బడఁతి వేనలియంచుఁ బరువు వెట్టు**
**గవగూడి కొదమ జక్కవ లేఁగుచో నింతి**
**పాలిండులని కేలఁ బట్టఁ దివురు**
**గుంపు గట్టుక గండుఁ గోయిలల్ గూయుచో**
**నతివ యెలుంగని యాలకించుఁ**
**జెలరేఁగి రాయంచ చేరువ నెమ్మెలఁగుచోఁ**
**గలికి నెన్నడలని కలవరించుఁ**

**తే.గీ.** **జిలుక బోదలు గిరికొని పలుకుచోటఁ**
**జెలువ నును బల్కులని తమిఁ జేరఁబోవుఁ**
**దేఁటి దాటులు మొఱయుచో బోటి జిలుగు**
**పాటలని చొక్కు వలవంత ప్రబ్బికొనఁగ** **95**

నట్టువ పుల్గులు = నెమలులు, పురివిచ్చి = పింఛము విప్పి, ఆటలు ఆడెడు చోట = నాట్యమాడుచోట, పడతి = తన భార్య, వేనలి = జడ, అంచున్ = అనుచు, పరువు పెట్టున్ = పరుగు పెట్టును. కవ కూడి = జంటగా కలసి, కొదమ = వయసులోనున్న, జక్కవలు = చక్రవాకములు, ఏగుచోన్ = పోవుచుండగా, ఇంతి పాలిండులు అని = సీత స్తనములని, కేలన్ = చేతితో, పట్టన్ తివురున్ = పట్టడానికి ప్రయత్నించును, గుంపు కట్టుక = గుంపుగా కూడి, గండు కోయిలల్ = కొదమ కోయిలలు, కూయుచోన్ = కూయుచుండగా, అతివ ఎలుంగని = తన భార్య పిలుపని, ఆలకించున్ = వినును, చెలరేగి = విజృంభించి, రాయంచ చేరువన్ = రాజహంసలు సమీపమున, మెలగుచో = సంచరించుచుండగా, కలికి నెఱి నడలని = సీత అందమైన నడకలని, కలవరించున్ = పలవరించును, చిలుక బోదలు = చిలుక పిల్లలు, గిరికొని = చుట్టుకొని, పలుకు చోట = కూయు ప్రదేశమున, చెలువ నును పల్కులు అని = సీత ముద్దు మాటలని, తమిన్ = ఆసక్తితో, చేరన్ పోవున్ = సమీపించుటకు వెళ్ళును, తేటి దాటులు = తుమ్మెదల సమూహములు, మొఱయుచోన్ = ధ్వనించుచుండగా, బోటి జిలుగు పాటలు అని = సీత రమ్యమైన పాటలని, వలవంత ప్రబ్బికొనగ = వియోగవ్యథ అలముకొనగ, చొక్కున్ = వెతచెందును.

**తా :** నెమలులు పురివిప్పి నాట్యమాడుచోట తన భార్య వేనలియని పరుగు పెట్టును. చక్రవాకముల జంట పోవుచుండగా సీత స్తనములని చేతితో పట్ట ప్రయత్నించును. కొదమ కోయిలలు కూయుచుండగా తన భార్య పిలుపని ఆలకించును. రాజహంసలు చేరువన సంచరించుచుండగా సీత అందమైన నడకలని కలవరించును. చిలుకలు కూయుచుండగా సీత ముద్దుమాటలని ఆసక్తితో చేరబోవును. తుమ్మెదలు ధ్వనించుచుండగా సీత రమ్యమైన పాటలని వియోగ వ్యధ అలముకొనగ వెతచెందును.

**ఉ. మా యనుఁగుం జెలిన్ వెదకుమా! యనువొప్పఁ దుటారి చిల్కలే**
**మా! యను గండుఁదేఁటికొదమా! యను నిద్దపు ముద్దులఁ జందమా**
**మా! యనుఁ జుట్టు పుల్గు తుటుమా! యను గ్రద్దటి కారు చింక కూ**
**మా! యను నింక నోర్వఁదరమా! యను నక్కట దయ్యమా! యనున్ 96**

అనువు ఒప్పన్ = ఉపాయముతో, తుటారి = సమర్ధతకల, చిల్కలేమా = ఓ ఆడు చిలుకా!, మా అనుంగు చెలిన్ = మా ప్రియురాలిని, వెదకుమా అనున్ = వెదకిపెట్టుము అనును, గండు తేటి కొదమా అనున్ = మదించిన గండుతుమ్మెదా (మా చెలిన్ వెదకుమా) అనును, నిద్దపు ముద్దుల చందమామా అనున్ = స్వచ్ఛమైన, అందమైన చందమామా (మా చెలిన్ వెదకుమా) అనును, చుట్టు పుల్గు తుటుమా అనున్ = చక్రవాక పక్షుల సమూహమా (మా చెలిన్ వెదకుమా) అనును, గ్రద్దటి కారు చింకకూమా అనున్ = ధైర్యముకల ఎఱ్ఱని మోముకల కోతిపిల్లా (మా చెలిన్ వెదకుమా) అనును, ఇంకన్ ఓర్వ తరమా అనున్ = ఇంక ఓర్చుకోవడం సాధ్యము కాదనును, అక్కట దయ్యమా అనున్ = అయ్యో దైవమా అనును.

**తా :** 'ఉపాయముతో సమర్ధతకలిగి మా ప్రియురాలిని వెదకిపెట్టు ఓ ఆడుచిలుకా! ఓ గండు తుమ్మెదా! ఓ అందమైన చందమామా! చక్రవాక పక్షుల సమూహమా! ఎఱ్ఱని మోముకల కోతిపిల్లా! ఇంక ఓర్చుకోవడం సాధ్యం కాదు అయ్యో దైవమా! అనును.

**ఉ. పాయను నేరమేమి? బలుపాయపు నాడెపు ప్రోడరాచ పా**
**పా! యనుఁ గుందనంపు మెఱుపా! యనుఁ బూవిలుకాని వాలుఁ దూ**
**పా! యనుఁ బల్కవేమి విసుపా యనుఁ బంటవలంతి ముద్దుఁగా**
**న్పా! యను నిట్టులింత మఱపా యను నీకిది నేరుపా యనున్ 97**

బలుపాయపు = ఎలప్రాయము నందున్న, నాడెపు = శ్రేష్ఠమైన, ప్రోడ రాజ పాపా అనున్ = సమర్థమైన రాచకాంతా అనును, కుందనంపు మెఱుపా అనున్ = బంగారపు కాంతిరేఖా అనును, పూవిలుకాని వాలు దూపా అనున్ = మన్మథుని వాడి బాణమా అనును, పల్కవేమి విసుపా అనున్ = మాటాడవు విసుగా అనును, పంటవలంతి ముద్దు కాన్పా అనున్ = భూదేవి ముద్దు బిడ్డా అనును, ఇట్టులు ఇంత మఱపా అనును = ఇలా ఇంత మరచిపోవుటా అనును, నీకిది నేరుపా అనున్ = నీకు ఇలా మాట్లాడకపోవడం నేర్పా అనును, పాయను = నన్ను విడచిపెట్టుటకు, నేరము ఏమి = నే చేసిన తప్పు ఏమిటి? అనును.

**తా :** వయసులోనున్న రాచకాంతా! బంగరు కాంతిరేఖా! మన్మథుని వాడిబాణమా! మాటాడవు విసుగా భూదేవి ముద్దుబిడ్డా! ఇలా ఇంత మరచిపోవుటా? ఇలా మాట్లాడక పోవడం నీకు నేర్పా? నన్ను విడిచిపెట్టడానికి నే చేసిన నేరమేమిటి? అనును.

**కం.** **అళుకేల లేదు మదిలో**
**బలు కానల నడుమ దాఁగి పలుకవు మరు పూ**
**ములికీ! కలికీ! చిలుకల**
**కొలికీ! చెలికిట్టి ములుక గూడునె యెందున్** **98**

మరు పూ ములికీ = మన్మథుని పుష్ప బాణమా, కలికీ = ఓ సౌందర్యరాశీ, చిలుకల కొలికీ = చిలుకలవంటి కనుకొలకులు కలదానా!, మదిలో = మనస్సులో, అళుకు ఏల లేదు = భయమెందుకు లేదు, బలు కానల నడుమ దాగి = దట్టమైన అడవుల మధ్య దాగి, పలుకవు = మాట్లాడవు, చెలికి = ప్రియురాలికి, ఎందున్ = ఎప్పుడైనా, ఇట్టి ములుక కూడునె = ఈ విధమగు ఆగడము తగునా?

**తా :** మన్మథుని పుష్పబాణమా! ఓ సౌందర్యరాశీ! చిలుకల కొలికీ! మనస్సులో భయమెందుకు లేదు. దట్టమైన అడవులమధ్య దాగి మాట్లాడవు. ప్రియురాలికి ఎప్పుడైనా ఇట్టి ఆగడము తగునా?

**కం.** **వంతల పొంతలఁ బడి వల**
**వంతల గాసిలఁగఁ దగునె? వలిగౌజ్జఁగి పూ**
**బంతీ! యింతీ! సొగసుల**
**దొంతీ! మము నింత గలఁప దోసము గాదే!** **99**

వలి గౌజ్జగి పూ బంతీ = చల్లనైన గౌజ్జగి పూలబంతీ, ఇంతీ = సుందరీ, సొగసుల దొంతీ = అందముల దొంతరా, వంతలన్ పొంతలన్ పడి = కష్టాల దారుల్లోపడి, వలవంతల = మన్మథ వేదనలతో, గాసిలగన్ తగునె = బాధపడుట తగునా?, మమున్ = మమ్ము, ఇంత కలపన్ = ఇంత కలతచెందించుట, దోసము కాదే = తప్పు కాదా!

**తా :** గౌజ్జంగి పూలబంతీ! సుందరీ! సొగసుల దొంతీ! కష్టాల దారుల్లోపడి మన్మథ వేదనలతో బాధపడుట తగునా? మమ్ము ఇంత కలతచెందించుట తప్పుకాదా?

**కం.** **వలదని యెన్ని తెఱంగుల**
**మలపిన విన నొల్లఁబోక మక్కువతోఁ గా**
**నలకు న్నాతో వచ్చితి**
**వెలనాఁగరో! నిన్నుఁ బాసి యిఁక నెటులోర్తున్** **100**

ఎలనాగరో = ఓ యౌవనవతివగు సీతా!, వలదు అని = వద్దని, ఎన్ని తెఱంగుల మలపినన్ = ఎన్ని విధాలుగా తిరస్కరించినను, వినన్ ఒల్లన్ పోక = వినిపించుకొనక, మక్కువతో = ఇష్టముతో, కానలకున్ = అడవులకు, నాతో = నా కూడా, వచ్చితి = వచ్చితివి, నిన్నున్ = నిన్ను, పాసి = విడచి, యికన్ = ఇంక, ఎటులు ఓర్తున్ = ఎలా సహించగలను?

**తా :** ఓ యౌవనవతీ! వద్దని ఎన్నివిధాల తిరస్కరించినా వినిపించుకొనక మక్కువతో అడవులకు నాకూడా వచ్చితివి. నిన్ను విడచి ఇంక ఎలా సహించగలను?

**తే.గీ.** **మెలఁత! నిద్దంపుఁ బానుపు మీఁద నలరు**
**రేకు సోఁకినఁ గందఁ బాఱెడు నలంతి**
**మేను దీవియ యిబ్బలు కానలోన**
**నోలిఁ ద్రిమ్మరుచో నెట్టు లోర్చెఁ జెపుమ? 101**

మెలత = ఓ సుందరీ!, నిద్దంపు = మెత్తనైన, పానుపు మీదన్, అలరు రేకు సోకినన్ = పూవు రేకు తాకినా, కందన్ పాఱెడు = కందిపోవునటువంటి, అలంతి మేను తీవియ = మృదువైన తీగవంటి దేహము, ఈ బలు కానలోనన్ = ఈ దట్టమైన అరణ్యమునందు, ఓలిన్ = వరుసగా, త్రిమ్మరుచోన్ = సంచరించుచున్నప్పుడు, ఎట్టులు ఓర్చె చెపుమ = ఎలా సహించగలిగేవో చెప్పుము.

**తా :** ఓ సుందరీ! మెత్తని శయ్యమీద పూరేకు తాకినా కందిపోవు మృదువైన దేహము ఈ దట్టమైన అరణ్యమునందు తిరిగేటప్పుడు ఎలా సహించగలిగావో చెప్పు.

**సీ.** **ఆకుటిక్కలు నాడెమైన మాడువులయ్యె**
**మంటి దుంపలు పిండి వంటలయ్యె**
**నారచీరలు జిల్గు నలువుఁ బుట్టములయ్యెఁ**
**బడుకు సెజ్జలు పూవుఁ బాన్పులయ్యె**
**వాఁకనీరులు తియ్యవలి పానకములయ్యె**
**బిగువు నేలలు పైఁడి జగిలులయ్యెఁ**
**బొలము డొంకలు మేలి చలువ పందిరులయ్యెఁ**
**బూదిపూఁతలు తావిపూఁతలయ్యెఁ**

**తే.గీ.** **దిప్ప లెల్లను గప్రంపుఁ దిప్పలయ్యెఁ**
**గార్మెకంబులుఁ దలగని కాపులయ్యె**
**నిన్నుఁ దగఁ గూడి యడవుల నున్నయపుడు**
**చాన యెడఁబాసి యిఁక నెట్టు సైచువాఁడ? 102**

నిన్నున్ తగన్ కూడి = నీతో చక్కగా కలిసి, అడవులన్ ఉన్న అపుడు = అడవులలో ఉన్న సమయమున, ఆకు ఇక్కలు = పర్ణశాలలు, నాడెమైన మాడువులు ఆయ్యెన్ = మంచి మేడలైనవి, మంటి దుంపలు = నేలలోని కందమూలములు, పిండి వంటలు అయ్యెన్ = పిండివంటలైనవి, నారచీరలు = నార వస్త్రములు, జిల్గు నలువున్ పుట్టములు అయ్యెన్ = మెరిసే మెత్తని వస్త్రములైనవి, పడుకు సెజ్జలు = రాతి శయ్యలు, పూవు పాన్పులు అయ్యెన్ = పూల పాన్పులైనవి, వాకనీరులు = సెలయేటి నీళ్ళు, తియ్య వలి పానకములు అయ్యెన్ = మధురమైన చల్లని పానీయములైనవి, బిగువు నేలలు = కఠినమైన ప్రదేశములు, పైడి జగిలులు అయ్యెన్ = బంగారు వేదికలైనవి, పొలము డొంకలు = అడవిలోని డొంకలు, మేలి చలువ పందిరులు అయ్యెన్ =

చక్కని చలువ పందిరులైనవి, బూది పూతలు = ధూళి పూతలు, తావి పూతలు అయ్యెన్ = పరిమళ పూతలైనవి, తిప్పలు ఎల్లను = దిబ్బలన్నియును, కప్రంపు తిప్పలు ఆయ్యెన్ = కర్పూరపు తిన్నెలైనవి, కారు మెకంబులు = క్రూర మృగములు, తలగని = తప్పించుకోని, కాపులు అయ్యెన్ = రక్షకులైనవి, ఇకన్ = ఇకపైన, చాన ఎడబాసి = భార్యను దూరముచేసుకొని, ఎట్టు సైచువాడ = ఎలా సహింపగలవాడను?

**తా :** నీతో చక్కగా కలిసి అడవులలో ఉన్న సమయంలో పర్ణశాలలు మేడలయ్యాయి, కందమూలాలు పిండివంటలయ్యాయి, నార వస్త్రములు పట్టు వస్త్రములయ్యాయి, రాతి శయ్యలు పూలపాన్పులయ్యాయి, సెలయేటి నీళ్ళు మధుర పానీయములయ్యాయి, బిగువు నేలలు బంగరు వేదికలయ్యాయి, అడవి డొంకలు చలువ పందిళ్ళయ్యాయి, విభూది పూతలు మావి చిగుళ్ళయ్యాయి, దిబ్బలన్నీ కర్పూర తిన్నెలయ్యాయి, క్రూరమృగాలు రక్షకులయ్యాయి, నిన్ను దూరంచేసుకుని ఇంక ఎలా బ్రతకను?

**తే.గీ.** **అనుచుఁ బెక్కు తెఱంగుల నడలుచున్న**
**యన్నఁ గన్గొని లక్ష్మణుం డనియె నహహ!**
**తెఱవకై యిట్టు చెల్లఁబో దిటము దప్పి**
**యొఱల దగునయ్య? నీ వంటి యుఱియ దొరకు** **103**

అనుచున్ = ఈ ప్రకారంగా, పెక్కు తెఱంగులన్ = పలు విధములుగా, అడలుచున్న = బాధపడుచున్న, అన్నన్ = రాముని, కన్గొని = చూచి, లక్ష్మణుడు = లక్ష్మణుడు, అహహ = ఎంత ఆశ్చర్యము, తెఱవకై = ఒక స్త్రీకోసమై, నీవంటి యుఱియదొరకు = నీవంటి శౌర్యవంతునకు, ఇట్టు = ఈ రీతిగా దుఃఖపడుట, చెల్లన్ పో = తగునా?, దిటము తప్పి = ధైర్యము కోల్పోయి, యొఱల తగున అయ్య = ఏడ్చుట తగునటయ్యా?

**తా :** అనుచు పలు విధములుగా బాధపడుచున్న రాముని కనుగొని లక్ష్మణుడు 'అహహ! ఒక స్త్రీకోసమై నీవంటి శౌర్యవంతునకు ఈ రీతిగా దుఃఖపడుట తగునా? ధైర్యము కోల్పోయి ఏడ్చుట తగునటయ్యా?'

**కం.** **మగఁటిమి విడనాడి యయో**
**నగువారల నెల్లఁ దలఁపునం బెట్టక ప**
**ల్వగలం బొగలం దగవా?**
**జగమెల్లం బ్రోదిసేయఁ జాలెదు నీకున్** **104**

జగము ఎల్లన్ = లోకమంతటిని, ప్రోది చేయన్ = రక్షించుటకు, చాలెడు నీకున్ = సమర్థుడవైన నీకు, అయో = అయ్యో, మగటిమి విడనాడి = పౌరుషాన్ని విడిచిపెట్టి, నగువారలన్ ఎల్లన్ = పరిహసించువారందరిని, తలపునన్ పెట్టక = ఆలోచించక, పలు వగలన్ పొగలన్ తగవా = పలు విధములైన బాధలతో వేదనపడుట తగినదేనా?

**తా :** లోకమంతటిని రక్షించుటకు సమర్థుడవైన నీకు అయ్యో! మగటిమి విడచిపెట్టి పరిహసించువారిని ఆలోచించక పలువిధముల వగలను వేదనపడుట తగినదేనా?

**ఉ. ఉల్లమునందు నీకు వెఱపూనఁగ నేఁటికిఁ? దమ్మిచూలి బల్**
**త్రుళ్ళడగింతుఁ బంతమున దుంత హుమాయి వజీరుఁ బట్టి యే**
**పెల్ల నడంతు వేలుపుల నేఁచి కలంతు జగంబు లన్నియుం**
**దల్లడ మందఁజేతుఁగద తామరకంటిని జూపకుండినన్ 105**

ఉల్లమునందు = మనసునందు, నీకు వెఱపు ఊనగన్ ఏటికి = నీకు భయము కలుగుట ఎందులకు?, తామరకంటిన్ = పద్మనేత్రను, చూపక ఉండినన్ = చూపకున్నచో, తమ్మిచూలి = పద్మసంభవుడైన బ్రహ్మయొక్క, బల్ త్రుళ్ళు అడగింతు = గొప్ప గర్వమును లేకుండగ చేస్తాను, పంతమున = పంతముతో, దుంత హుమాయి వజీరున్ పట్టి = మహిషము వాహనముగా కల రౌతును (యముని) పట్టుకొని, ఏపు ఎల్లన్ అడంతున్ = గొప్పతనమునంతను పోగొట్టెదను, వేలుపులన్ = దేవతలను, ఏచి కలంతున్ = రెచ్చిపోయి కలతపెడతాను, జగంబులు అన్నియున్ = లోకములన్నిటిని, దల్లడము అంద చేతు కద = కలవరపడేలా చేస్తానుకదా!

**తా :** మనసులో నీకు భయమెందుకు? పద్మనేత్రను చూపకున్నచో బ్రహ్మ గర్వము నణచేస్తాను. యముని గొప్పతనం పోగొడతాను. దేవతలను కలతపెడతాను. లోకాలన్నీ కలవరపడేలా చేస్తాను.

**ఉ. ఇంత కొఱంత యేల విను మేచి జగంబులు తాఱుమాఱుగా**
**వింతునొ? ప్రొద్దువేఁడి యుడిగింతునొ? సంద్రము లొక్కమాటె యిం**
**కింతునొ? నల్వగ్రుడ్డు లుడికింతునొ? వేల్పులఁ బట్టి బిట్టు దూ**
**లింతునొ? కొండలెల్లఁ బెకలింతునొ? నిక్క మెఱుంగఁ జేయవే! 106**

ఇంత కొఱంత ఏల = ఇంత అవమానము భావించుట ఎందులకు?, వినుము = విను, ఏచి = విజృంభించి, జగంబులు = లోకములను, తాఱుమాఱు గావింతునొ = వ్యత్యస్తము చేసెయ్యనా?, ప్రొద్దు వేడి = సూర్యుని తాపమును, ఉడిగింతునొ = పోగొట్టనా?, ఒక్క మాటె = ఒక్కసారిగా, సంద్రములు = సముద్రములను, ఇంకింతునొ = ఎండబెట్టెయ్యనా?, నల్వగ్రుడ్డులు = బ్రహ్మాండములను, ఉడికింతునొ = తపింపచేయనా? వేల్పులన్ పట్టి = దేవతలను పట్టుకొని, బిట్టు తూలింతునా = వెంటనే పడగొట్టనా?, కొండలు ఎల్లన్ = కొండలన్నిటిని, పెకలింతునొ = పెల్లగించనా?, నిక్కము = నీ మనసులోని సత్యమును, ఎఱుంగ చేయవే = తెలియచేయుము.

**తా :** ఇంత అవమానము భావించుట ఎందులకు? లోకాలన్నీ వ్యత్యస్తం చేసెయ్యనా? సూర్యుని తాపాన్ని పోగొట్టనా? సముద్రాల్ని ఇంకించనా? బ్రహ్మాండాల్ని తపింపచేయనా? దేవతలను పడగొట్టనా? కొండలు పెకలించనా? నీ మనసు నిక్కము తెలుపుము.

**కం. ఓ ఱేఁడ! నీకు మది వే**
**మాఱును గుందంగనేల? మానని కినుకన్**
**దేఱి కనుంగొనుచో మఱి**
**మాఱువడం గలరె? యెట్టి మన్నీలయినన్ 107**

ఓ ఱేడ = ఓ ప్రభూ!, నీకు = నీవంటివానికి, మదిన్ = మనసునందు, వేమాఱును = మాటిమాటికి, కుందంగను ఏల = బాధపడుట ఎందులకు?, మానని కినుకన్ = తగ్గనట్టి కోపముతో, తేఱి

కనుంగొనుచో = కళ్ళుతెఱచి చూస్తే, ఎట్టి మన్నీలయినన్ = ఎంతటి వీరులైనను, మఱి మాఱు పడం కలరె = మళ్ళీ ఎదుట పడగలరా?

**తా :** ఓ ప్రభూ! నీ మనసులో మాటిమాటికి బాధపడడమెందుకు? కోపంతో కళ్ళు తెఱచి చూస్తే ఎంతటి వీరులైనా మళ్ళీ ఎదుటపడగలరా?'

**తే.గీ.** **అనినఁ దమ్ముని పలుకుల కలరి కొంత**
**దిటము గైకొని వేగ నచ్చటను దరలి**
**దక్కినపు నేల కెదురుగా దారివట్టి**
**యోర్మి వెలయంగఁ జనిచని యొక్కచోట** **108**

అనినన్ = అనగా, తమ్ముని పలుకులకున్ = తమ్ముని మాటలకు, అలరి = తేరుకొని, కొంత దిటము కైకొని = కొంచెము ధైర్యము తెచ్చుకొని, వేగన్ = వేగముగా, అచ్చటను తరలి = అక్కడినుండి బయలుదేరి, దక్కినపు నేలకు = దక్షిణమునందున్న ప్రదేశములకు, ఎదురుగా = అభిముఖముగా, దారి పట్టి = దారిపుచ్చుకొని, ఓర్మి వెలయంగన్ = ఓరుపు కలవారై, చనిచని = వెళ్ళి వెళ్ళి, ఒక్కచోట = ఒక ప్రదేశమున –

**తా :** అనగా తమ్ముని మాటలకు తేరుకొని కొచెం ధైర్యం తెచ్చుకొని శీఘ్రంగా అక్కడినుండి బయలుదేరి దక్షిణాని కభిముఖంగా దారిపట్టి ఓర్పుతో వెళ్ళి వెళ్ళి ఒక చోట –

**కం.** **స్రుక్కి తునిఁగిన కాళ్ళను**
**ఱెక్కలునై పడ్డ పక్కిఱేనిం గని యే**
**రక్కసి బూటకమో యిది**
**చక్కాడెదనంచుఁ దరియఁ జనుచున్న తఱిన్** **109**

స్రుక్కి = ముడిగి, తునిగిన = ముక్కలైన, కాళ్ళను ఱెక్కలునై పడ్డ = కాళ్ళును, ఱెక్కలును కలదై పడియున్న, పక్కిఱేనిం గని = పక్షిరాజును చూచి, ఏ రక్కసి బూటకమో యిది = ఇది ఏ రాక్షస మాయయో, చక్కాడెదను అంచున్ = చంపేస్తానని, తరియన్ చనుచున్న తఱిన్ = దగ్గరకు వెళ్ళుచున్న సమయంలో –

**తా :** ముడిగి ముక్కలైన కాళ్ళు, రెక్కలును కలదై పడియున్న పక్షిరాజును చూచి ఇది ఏ రాక్షస మాయయో చంపేస్తానని దరి చేరు సమయమున

**తే.గీ.** **పుడమిఱేని గనుంగొని పుల్గురాయఁ**
**డనియె నో తండ్రి! మీ తండ్రి కనుఁగ నరుణుఁ**
**డనఁగఁ బరఁగిన గ్రుడ్డు కాన్పునకుఁ గూర్మి**
**బిడ్డఁడ జటాయు వనియెడు పేరివాఁడ** **110**

పుడమి ఱేనిన్ = రాముని, కనుంగొని, పుల్గురాయడు = పక్షిరాజు, ఓ తండ్రి = ఓ నాయనా!, మీ తండ్రికి = మీ తండ్రియగు దశరథునకు, అనుగ = స్నేహితుడను, అరుణుడు అనగన్ = అరుణుడు అను పేరుతో, పరగిన = ఒప్పిన, గ్రుడ్డుకాన్పునకున్ = పక్షికి, కూర్మి = ప్రియమైన,

బిడ్డడన్ = కుమారుడను, జటాయువు అనియెడు = జటాయువు అనే, పేరివాడ = పేరు కలవాడను.

**తా :** రాముని కనుగొని పక్షిరాజు 'ఓ తండ్రీ! మీ తండ్రి దశరథునకు స్నేహితుడను. అరుణుడు పేరున ఒప్పిన పక్షికి కూర్మి బిడ్డడను. జటాయువు పేరు కలవాడను.

**కం.** **వినుమో! దేవఱ! రావణుఁ**
**డను రక్కస ఱేఁడు చెనఁటియై నీ పొలఁతిన్**
**గొని పోవఁగ వానిం బై**
**కొని యని యొనరింప నిట్టి గొడవలు సెందెన్** **111**

దేవఱ = ఓ ప్రభూ!, వినుమో = వినుము, రావణుడను రక్కసఱేడు = రావణుడను రాక్షసరాజు, చెనటియై = దుర్మార్గుడై, నీ పొలతిన్ = నీ భార్యను, కొని పోవగ = తీసుకొని పోతుండగా, వానిం = వానిని, పైకొని = ఎదిరించి, అని యొనరింపన్ = యుద్ధము చేయగా, ఇట్టి = ఇటువంటి, గొడవలు చెందెన్ = కష్టాలు కలిగెను.

**తా :** ఓ ప్రభూ! వినుము. రావణుడను రాక్షసరాజు దుర్మార్గుడై నీ భార్యను తీసుకొని పోతుండగా వానిని ఎదిరించి పోరొనరింప ఇట్టి కష్టము కలిగెను.

**తే.గీ.** **పున్నెముల ప్రోవ! నా తొంటి పున్నియంబు**
**వలన వలనుగఁ గడుఁ దొలిపలుకు గొనలు**
**గాంచి మించిన జడదారి గములకైనఁ**
**గనఁబడఁగ రాక యుండు నిన్గంటి నేఁడు** **112**

పున్నెముల ప్రోవ = ఓ పుణ్యాల రాశీ!, నా తొంటి పున్నియంబు వలన = నా పూర్వ పుణ్యం వలన, వలనుగన్ = నాకు దిక్కుగా, కడున్ = గొప్పగా, తొలిపలుకు కొనలు = వేదాంతములు, కాంచి = దర్శించి, మించిన = పేరుపొందిన, జడదారిగములకు ఐనన్ = మునీశ్వరబృందమునకైనను, కనన్ పడగ రాక ఉండు = కన్పించకయుండు, నిన్, నేడు = ఈ నాడు, కంటిన్ = చూడగల్గితిని.

**తా :** ఓ పున్నెముల ప్రోవా! నా పూర్వపుణ్యంవలన నాకు దిక్కుగా, వేదాంతములు దర్శించి మించిన మునీశ్వరులకైనను కనపడరాని నిన్ను నేడు కంటిని

**కం.** **తలఁగెం గడితపు దోసము**
**లలరెం డెందంబు పున్నియంబుల కెల్లన్**
**నెలవయ్యెఁ బుట్టు వింకను**
**గల పని మఱియేమి గలదు? కనికరపు గనీ!** **113**

**కనికరపు గనీ = దయానిధీ!, గడితపు = లెక్కలేనన్ని, దోసములు = పాపములు, తలగెన్ = తొలగిపోయినవి, డెందంబు = మనస్సు, అలరెం = తేలికపడినది, పుట్టువు = నా పుట్టుక, పున్నియంబులకు ఎల్లన్ = సమస్త పుణ్యములకు, నెలవు అయ్యెన్ = నిలయమయ్యెను, ఇంకను = ఇకమీదట, మఱి = ఇంకనూ, కల పని = నిర్వర్తింపవలసిన పని, ఏమి కలదు = ఏమి ఉన్నది?**

**తా :** దయానిధీ! నా లెక్కలేని పాపములు తొలగిపోయినవి. మనసు తేలికపడినది. నా పుట్టుక పుణ్యముల నెలవయ్యెను. ఇకముందు ఇంకనూ నేను చేయవలసిన పని ఏమున్నది?

**సీ.** **తొలిపలుకుఁ గొనలుఁ దెలియు తపసి చలి**
**వెలుఁగులకు దొరకు చెలువులగని**
**తెలికడలిని కరువలి కుడుపరి దొర**
**పఱుపుపయి నిదుర గొఱలు నుఱియ**
**మలవిలుతుఁడు నలుదలల యొడయుఁడును**
**బలియు రొగిఁ బెగడ నలరు వలఁతి**
**పలు దెఱఁగులు గల పొలుసు దినెడు గమి**
**గడిమిమయి నడఁచు కడిది బిరుద**

**తే.గీ.** **వలమురి సుడి కయిదువయుఁ బులుఁగు సిడము**
**పసిఁడి నును వలువ కలిమి పడఁతుకయును**
**గలుగు మగఁడగు నిను మది దలఁచి నపుడె**
**విడిచి చనుఁగదె బలు కొల లిడుమ గములు** **114**

తొలిపలుకున్ కొనలున్ = వేదాంతములను, తెలియు = తెలిసిన, తపసి చలివెలుగులకు = ముని చంద్రులకు, దొరకు = లభించెడి, చెలువుల గని = సౌందర్యనిధీ!. తెలి కడలిని = పాల సంద్రమున, కరువలి కుడుపరి దొర = గాలిని భక్షించు పాములకు దొర (శేషుడు), పఱుపుపయిన్ = శయ్యమీద, నిదురన్ కొఱలు ఉఱియ = నిద్రను పొందే శౌర్యుడా!, మల విలుతుడు = మేరుపర్వతము విల్లుగా కలవాడు (శివుడు), నలు తలల ఒడయుడును = నాలుగు తలలుకల సామి (బ్రహ్మ), బలియురు = వంటి శ్రేష్ఠులు, ఒగిన్ = లొంగి, బెగడన్ = భయపడునట్లుగా, అలరు = ఒప్పుచున్న, వలతి = సమర్థుడా!, పలు తెఱగులు కల = అనేక మాయలు కల, పొలుసు తినెడు గమిన్ = రాక్షస సమూహమును, కడిమిమయిన్ = సాహసముతో, అడచు = అణచివేయు, కడిది బిరుద = గొప్ప బిరుదుకలవాడా!, వలమురి = శంఖము, సుడి కయిదువయున్ = చక్రమును, పులుగు సిడము = పక్షి (గరుత్మంతుడు) ధ్వజమును, పసిడి నును వలువ = పట్టు పీతాంబరము, కలిమి పడతుకయును = లక్ష్మీదేవియును, కలుగు = కలిగియున్న, మగడు అగు = వీరుడవైన, నినున్ = నిన్ను, మది = మనసునందు, తలచిన అపుడె = తలంచగానే, బలు కొలలు = అధికమగు పాపములు, ఇడుమ గములు = కష్టముల సమూహములు, విడిచి చనున్ కదె = విడిచిపెట్టి పోతాయికదా!

**తా :** వేదాంతములు తెలిసిన మునిచంద్రులకు మాత్రమే లభించు సౌందర్యనిధీ! పాల సంద్రమున శేషశయ్యపై శయనించు శూరుడా! శివుడు, బ్రహ్మ వంటి శ్రేష్ఠులు లొంగి భయపడునట్టి సమర్థుడా! మాయగాళ్ళగు రాక్షసులను అణచివేయు గొప్ప బిరుదుకలవాడా! శంఖము, చక్రము, గరుడ ధ్వజము, పట్టు పీతాంబరము, లక్ష్మీదేవియును కలిగిన వీరుడవైన నిన్ను మనసున తలంచగానే అన్ని పాపములు, కష్టములు విడిచిపెట్టి పోతాయికదా!'

**కం.** **అని పొగడుచు నతఁడా సా**
**మిని డెందమునందు బత్తి మీఱఁగ నిడి చ**
**య్యన నొడలు విడిచి సంతస**
**మున నెన్నఁడుఁ జెడకయుండు ప్రోలికిఁ జనియెన్** **115**

అని = ఆ ప్రకారముగా, పొగడుచున్, అతడు = ఆ జటాయువు, సామిని = స్వామిని, డెందము నందు = మనసునందు, బత్తి మీఱగన్ ఇడి = అధికమైన భక్తితో నుంచుకొని, చయ్యనన్ = వెంటనే, ఒడలు విడిచి = దేహమును విడిచిపెట్టి, సంతసమున = సంతోషముతో, ఎన్నడు చెడకయుండు ప్రోలికిన్ = శాశ్వతమైన వైకుంఠమునకు, చనియెన్ = వెళ్ళెను.

**తా :** అని స్తుతిస్తూ ఆ జటాయువు స్వామిని మనసున అధికమైన భక్తితో నుంచుకొని వెంటనే దేహము విడిచిపెట్టి ఆనందంగా వైకుంఠమునకు వెళ్ళెను.

**తే.గీ.** **అపుడు రాచూలి దద్దయు నడలుకొనుచు**
**నప్పులుఁగు వంగడపు దొర కగ్గిపనులు**
**తొలిమినుకు జాడ నొనరిచి యలర నచట**
**వెడలి యరుగుచు నొక్కచో వెఱఁగు మీఱ** **116**

అపుడు = అప్పుడు, రాచూలి = రాముడు, దద్దయున్ అడలుకొనుచు = మిక్కిలి దుఃఖించుచు, ఆ పులుగు వంగడపు దొరకు = ఆ పక్షి రాజునకు, అగ్గి పనులు = అగ్ని సంస్కారము, తొలిమినుకు జాడన్ = వేదోక్తముగా, ఒనరిచి = కావించి, అలరన్ = తృప్తినందగా, అచట వెడలి = అక్కడినుండి బయలుదేరి, అరుగుచున్ = వెళ్ళుచూ, ఒక్కచోన్ = ఒకచోట, వెఱగు మీఱ = ఆశ్చర్యకరముగా–

**తా :** అప్పుడు రాముడు మిక్కిలి దుఃఖించుచు ఆ పక్షిరాజుకు అగ్ని సంస్కారము వేదోక్తముగా కావించి తృప్తినంది అక్కడినుండి బయలుదేరి వెళ్ళుచూ ఒకచోట ఆశ్చర్యకరముగా –

**కం.** **తల లేక నిడుపులగు చే**
**తులు గ్రాలఁగ నడవిలోన దొరకిన మే తా**
**ల్పుల నెల్లఁ బట్టి మ్రింగెడు**
**పొలమేపరి నొకనిఁ జూచి పొదవిన కినుకన్** **117**

తల లేక = తల లేకుండగా, నిడుపులగు = పొడవైన, చేతులు క్రాలగ = చేతులు ఒప్పు చుండగా, అడవిలోనన్ దొరకిన = ఆ అడవిలో లభించేటటువంటి, మే తాల్పులన్ = జీవులను, ఎల్లన్ పట్టి మ్రింగెడు = అన్నింటిని పట్టుకొని భక్షించే, పొలమేపరి ఒకనిన్ = ఒక రాక్షసుని (కబంధుని), చూచి = కాంచి, పొదవిన కినుకన్ = అతిశయించిన క్రోధముతో –

**తా :** తల లేకుండగా పొడవైన చేతులు కలిగి ఆ అడవిలో లభించే జీవులను పట్టుకొని భక్షించే ఒక రాక్షసుని కాంచి అధికమైన కోపముతో –

**కం.** **రెండు మొనవాఁడి కోలల**
**రెండు బుజంబులును వావిరిం గూల్చి కడున్**

**గొండవలె నున్న యబ్బలు**
**మొండెపు రక్కసుని మేను ముటియలు చేసెన్** **118**

వావిరిన్ = వెంటనే, రెండు మొన వాడి కోలలన్ = రెండు పదునైన మంచి బాణములతో, రెండు బుజంబులును = రెండు భుజములను, కూల్చి = ఖండించి, కడున్ = పెద్ద, కొండవలెన్ ఉన్న= కొండాలావున్న, ఆ బలు మొండెపు రక్కసుని మేను = ఆ గొప్ప మొండెమే కల రాక్షసుని దేహమును, ముటియలు చేసెన్ = ముక్కలు చేసెను.

**తా :** వెంటనే రెండు వాడి బాణములతో రెండు భుజములను ఖండించి పెద్ద కొండలావున్న ఆ కబంధుని దేహమును ముక్కలు చేసెను.

**కం.** **చేసిన నాతఁడు తొల్లిటి**
**దోసంబులఁ బాసి మొగిలు త్రోవను జేజే**
**వేసంబున నరుగుచు రా**
**కాసుల దొర సన్నదారిఁ గ్రన్ననఁ దెలిపెన్** **119**

చేసినన్ = చేయగా, ఆతడు = ఆ కబంధుడు, తొల్లిటి దోసంబులు పాసి = మునుపటి పాపములను పోగొట్టుకొని, మొగిలు త్రోవను = ఆకాశ మార్గమున, జేజే వేసంబున = దేవతా రూపమున, అరుగుచున్ = పోవుచు, క్రన్ననన్ = వెంటనే, రాకాసుల దొర = రావణాసురుడు, చన్న దారి = వెళ్ళిన మార్గమును, తెలిపెన్ = తెలిపెను.

**తా :** చేయగా ఆ కబంధుడు మునుపటి పాపములను పోగొట్టుకొని ఆకాశమార్గమున దేవతా రూపమున పోవుచు వెంటనే రావణుడు వెళ్ళిన మార్గమును తెలిపెను.

**కం.** **తెలిపినఁ జనుచో ముందఱ**
**వలనుగ నొక చెంచు తెఱవ వారలఁ దన యి**
**మ్ములకుం దోడ్కొని చని దుం**
**పలుఁ బండులు చాల నొసఁగి బలితపు టెలమిన్** **120**

తెలిపినన్ = తెలుపగా, చనుచోన్ = వెళ్ళుచుండగా, ముందఱ = ఎదుట, ఒక చెంచు దెఱవ = ఒక చెంచు వనిత (శబరి), వారలన్ = వారిరువురిని, వలనుగ = చక్కగా, తన ఇమ్ములకున్ = తన ఆశ్రమమునకు, తోడ్కొని చని = తీసుకొని వెళ్ళి, దుంపలు, పండులు = దుంపలు, పళ్ళు, చాలన్ ఒసగి = చాలా ఇచ్చి, బలితపు ఎలమిన్ = గొప్ప ప్రీతితో –

**తా :** తెలుపగా వారు వెళ్ళుచుండగా ఎదుట ఒక చెంచు వనిత వారిరువురిని చక్కగా తన ఆశ్రమమునకు తీసుకొని వెళ్ళి దుంపలు, పళ్ళు ఇచ్చి గొప్ప ప్రీతితో –

**కం.** **ఒరిమికయు బత్తియు న్మది**
**గర మలరఁగఁ బూజఁ జేసెఁ గన్నియ యపుడా**
**గరువంపు తెఱచి దిండుల**
**నిరుసత పదినూర్ల దొరల నేసిన దొరలన్** **121**

కన్నియ = శబరి (అవివాహితయే), ఒరిమికయున్ = ఒద్దికయును, బత్తియున్ = భక్తియును, మది కరమలరగ = మనసున అధికముగా ఒప్పుచుండగా, అపుడు, ఇరు సత = రెట్టింపైన ఏడు (14), పది నూర్ల = వేల (14 వేల), ఆ గరువంపు తెఆచి దిండులన్ = ఆ గర్వించిన రాక్షస సమూహమును, దొరలన్ ఏసిన = నేల పడగొట్టిన, దొరలన్ = శ్రేష్ఠులను, పూజ చేసెన్ = పూజించెను.

**తా :** శబరి ఒద్దిక, భక్తి మనసున అధికముగా ఒప్పుచుండగా అప్పుడు 14 వేలమంది రాక్షసులను పడగొట్టిన శ్రేష్ఠులను పూజించెను.

**ఆ.వె.** **అట్లు పూజ సేసి ఆ లేమ రామునిఁ**
**గాంచి పలికె వినుము కడిఁది మగఁడ!**
**పంప యనెడు వాఁక పజ్జల ఋష్యమూ**
**కంబనంగ నొక్క గట్టు కలదు** **122**

అట్లు పూజ చేసి = అలా పూజించి, రామునిన్ కాంచి = రాముని చూచి, ఆ లేమ = ఆ శబరి, పలికె = పలికెను, కడిది మగడ = వీరుడా!, వినుము = వినుము, పంప అనెడు వాక పజ్జల = పంప అను పేరుగల నది ప్రక్కన, ఋష్యమూకంబు అనంగన్ = ఋష్యమూకము అనబడే, ఒక్క గట్టు కలదు = ఒక పర్వతము ఉన్నది.

**తా :** అలా పూజించి రాముని చూచి శబరి పలికెను. 'వీరుడా! వినుము. పంపా నది ప్రక్కన ఋష్యమూకమను పర్వతమున్నది.

**తే.గీ.** **అందు సుగ్రీవుఁడను పేర నలరు నొక్క**
**చెట్టు ద్రిమ్మరి యెకిమీఁడు సెలఁగుచుండు**
**వానితోఁ జెల్మి యొనరించెదేని నీదు**
**కర్జమంతయు నెరవేరఁ గలదు సువ్వె** **123**

అందున్ = ఆ పర్వతమునందు, సుగ్రీవుడను పేరన్ = సుగ్రీవుడు అను పేరుతో, అలరున్ = ఒప్పునట్టి, ఒక్క చెట్టు ద్రిమ్మరి యెకిమీడు = ఒక వానరరాజు, చెలగుచుండు = ఉంటున్నాడు, వానితోన్ = ఆ సుగ్రీవునితో, చెల్మి ఒనరించెదేని = స్నేహము చేసినట్లయితే, నీదు కర్జము అంతయును = నీ పని అంతా, నెరవేర కలదు సువ్వె = నెరవేరుతుంది సుమా!

**తా :** ఆ పర్వతమునందు సుగ్రీవుడను పేరుతో ఒప్పు ఒక వానరరాజు ఉంటున్నాడు. ఆతనితో స్నేహము చేసినట్లయితే నీ పని అంతా నెరవేరుతుందిసుమా!'

**కం.** **అని తెల్పి యమ్మెలంతుక**
**పనిఁ బూనిచి పంపఁ బంప పజ్జకు వారల్**
**చని యచట చెట్ల నీడల**
**నొనరారఁగ మెలఁగుచుండి రోరిమి వెలయన్** **124**

అని తెల్పి = అని చెప్పి, ఆ మెలంతుక = ఆ శబరి, పనిన్ పూనిచి = కార్యమును తెలియజేసి, పంపన్ = పంపగా, వారల్ = వారు, పంప పజ్జకు చని = పంపానది దగ్గరకు వెళ్ళి, ఒనరారగ

= చక్కగా, అచట చెట్ల నీడలన్ = అక్కడ చెట్లనీడలయందు, ఓరిమి వెలయన్ = మిక్కిలి ఓరిమితో, మెలగుచుండిరి = సంచరించుచుండిరి.

**తా :** అని చెప్పి శబరి పనిని తెలియజేసి పంపగా వారు పంపా నది దగ్గరకు వెళ్ళి చక్కగా అక్కడ చెట్లనీడలయందు ఓరిమితో సంచరించుచుండిరి.

**తే.గీ.** **అనుచు జేజే నిరాబారి యనువు మెఱయ**
**నెఱుఁగ జెప్పిన కత వినియెడు వలంతి**
**యవలి కతయును దెలుపవే! యనుచు నతనిఁ**
**గడఁక దైవార మెల్లన నడుగుటయును** **125**

అనుచు = అని ఈ విధంగా, జేజే నిరాబారి = దేవముని నారదుడు, అనువు మెఱయన్ = చక్కని పద్ధతిలో, ఎఱుగ చెప్పిన = తెలిసేలా చెప్పగా, కత వినియెడు వలంతి = కథ వినే శ్రేష్ఠుడు, అవలి కతయును తెలుపవే = తరువాతి కథను కూడా చెప్పవా?, అనుచు = అని, అతనిన్ = ఆ నారదుని, కడక దైవారన్ = తన ఆసక్తి కనబడునట్లుగా, మెల్లన = మెల్లగా, అడుగుటయును = అడగడంతో –

**తా :** అనుచు దేవముని నారదుడు చక్కని పద్ధతిలో తెలిసేలా చెప్పగా కథ విను శ్రేష్ఠుడు వాల్మీకి తరువాతి కథను కూడా చెప్పవా? అని ఆ నారదుని తన ఆసక్తి కనబడునట్లుగా మెల్లగా అడగడంతో–

**చం.** **తొలికడరాయఁ డగ్గియును దుంత సిడంబు మగండు సోఁకుమూఁ**
**కల యొడయండు నీళ్ళదొర గాడుపు జక్కులతేఁడుఁ జిల్వ సొ**
**మ్ముల యెకిమీఁడు నాల్గు బుజముల్ గల వేలుపుఁ దమ్మిచూలియున్**
**గొలువఁగు వెండికొండపయిఁ గూర్మి చెలంగు కడింది దయ్యమా!** **126**

తొలికడ రాయడు = మొదటి దిక్కు (తూర్పు) ప్రభువు (ఇంద్రుడు), అగ్గియును = అగ్నిహోత్రుడును, దుంత సిడంబు మగండు = దున్నపోతు ధ్వజముగా కల వీరుడు (యముడు), సోకుమూకల ఒడయండు = రాక్షసులకు ప్రభువు (నైరృతి), నీళ్ళ దొర = వరుణుడు, గాడుపు = వాయువు, జక్కుల ఱేడు = యక్షరాజు (కుబేరుడు), చిల్వ సొమ్ముల ఎకిమీడు = ఈశానుడు, నాల్గు బుజముల్ గల వేలుపు = విష్ణువు, తమ్మిచూలియున్ = బ్రహ్మయును, కొలువగన్ = సేవింపగా, వెండికొండ పయిన్, కూర్మిన్ చెలంగు = ఆనందముతో ఒప్పుచున్న, కడింది దయ్యమా = గొప్ప దైవామా!

**తా :** ఇంద్రుడు, అగ్ని, యముడు, నైరృతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు, విష్ణువు, బ్రహ్మ సేవింపగా వెండికొండమీద ఆనందముతో ఒప్పుచున్న గొప్ప దైవమా!

**కం.** **కోఱల పొగయు గడితపుఁ**
**జాఱల దుప్పటియు సొరెసొరెకుఁ జలువల్**
**మీఱెడు క్రొంబువ్వును మి**
**న్నేఱును నెఱిఁ బూని వెలుఁగు నెక్కటి వేల్పా!** **127**

కోఱల పాగయున్ = పాములు తలపాగగాను, గడితపు చాఱల దుప్పటియు = దళసరి చారల పైవస్త్రమును (పులితోలు), సారెసారెకున్ = మాటిమాటికి, చలువల్ మీఱెడు = చల్లదనమునిచ్చే, క్రొత్త పువ్వును = తలపూవుగానున్న చంద్రరేఖయును, మిన్నేఱును = ఆకాశగంగయును, నెఱిన్ బూని = అందముగా ధరించి, వెలుగు = ప్రకాశించు, ఎక్కటి వేల్పా = ఒక్కడే ఐన దైవమా!

**తా :** పాములు తలపాగాగను, దళసరి పులితోలు వస్త్రముగను, తలపూవుగా చంద్రరేఖయును, ఆకాశగంగయును అందముగా ధరించి ప్రకాశించు ఎక్కటి దైవమా!

**తోటకము.** **పొలుపారు మగంటిమిఁ బూని జగం**
**బుల వేమఱు నేఁచుచుఁ బొంగెడు బ**
**ల్పొలమేపరి బంటుల ప్రోళ్ళొక యె**
**మ్మెల తూపునఁ గూల్చిన మేల్బిరుదా! 128**

జగంబులన్ = లోకములను, వేమఱు వేచుచున్ = పదేపదే బాధించుచు, పొంగెడు = గర్వముతో నున్న, బలు = గొప్ప, పొల మేపరి బంటుల = మాంస భక్షకులైన నీచ రాక్షసులయొక్క (త్రిపురాసురులు), ప్రోళ్ళు = నగరములు, పొలుపారు మగంటిమి పూని = చక్కని శౌర్యమును ప్రదర్శించుచు, ఒక = ఒకే ఒక, ఎమ్మె = అందమైన, ఎల తూపునన్ = వాడియైన బాణముతో, కూల్చిన = కూలకొట్టిన, మేలు బిరుదా = గొప్ప బిరుదము కలవాడా!

**తా :** లోకాల్ని పదేపదే బాధిస్తూ మాంసభక్షకులైన నీచ రాక్షసుల త్రిపురములను చక్కని శౌర్యము ప్రదర్శిస్తూ ఒకే ఒక్క బాణముతో కూల్చిన మేలు బిరుదా!

**గద్యము :**

**ఇది శ్రీమదుమారమణ కరుణా కటాక్ష నిరీక్షణ**
**సంలబ్ధ సరస కవితా సామ్రాజ్య దురంధర, ఘన యశోబంధుర**
**కౌండిన్య సగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర బుధజన విధేయ తిమ్మయ**
**నామధేయ ప్రణీతంబైన అచ్చ తెలుఁగు రామాయణ మహా కావ్య మందు**
**అరణ్య కాండము సర్వ మేకాశ్వాసము.**

**వ్యాఖ్యాతృ గద్యము :**

**ఇది బుధజన విధేయుండును, బులుసు వంశ సంభూతుండును,**
**కీ.శే. శేషమ్మ వేంకటరమణయ్య పుణ్యదంపతీ తనూజుండును,**
**గౌతమ గోత్రజుండునగు వేంకటసత్యనారాయణమూర్తి**
**ప్రణీతంబైన అచ్చ తెలుఁగు రామాయణమను మహాకావ్య మందు**
**అరణ్య కాండమునకు టీక, తాత్పర్యములు.**



# అచ్చతెలుఁగు రామాయణము
# కిష్కింధ కాండము

**కం. సిరుల నిడు మనికిపట్టా!**
**గరువపు రక్కసుల ప్రోళ్ళు కాల్చిన దిట్టా!**
**హరువు గొనమ్ముల తిట్టా!**
**పురుడెన్నఁగ రాని వేలుపుల తలకట్టా! 1**

సిరులను = సంపదలను, ఇడు = ఇచ్చుటకు, మనికిపట్టా = స్థానమైనవాడా!, గరువపు = గర్వముతో నున్న, రక్కసుల ప్రోళ్ళు = రాక్షసుల నగరములను (త్రిపురములను), కాల్చిన దిట్టా = తగులబెట్టిన సమర్థుడా!, హరువు గొనమ్ముల తిట్టా = చక్కని గుణముల రాశియైనవాడా!, పురుడు ఎన్నగరాని = సాటి లెక్కించలేని, వేలుపుల తలకట్టా = దేవతలలో శ్రేష్ఠుడా!

**తా :** సంపదల నిచ్చుటకు మనికిపట్టా! గర్వముతోనున్న రాక్షసుల త్రిపురములను తగులబెట్టిన దిట్టా! చక్కని గుణముల రాశీ! సాటిలేని వేల్పుల తలకట్టా!

**తే.గీ. వినుము వాల్మీకిఁ జూచి యవ్వేల్పు తపసి**
**పల్కె రాచందమామ యప్పగిదిఁ బంప**
**కడ మెలంగఁగ నద్దరి గట్టుమీఁద**
**నుండి కన్గొని ప్రొద్దు కుఱ్ఱండు దలఁకి 2**

వినుము = వినుము, వాల్మీకిన్ = వాల్మీకిని, చూచి = చూచి, ఆ వేల్పుతపసి = ఆ నారదుడు, పల్కె = పలికెను, ఆ పగిదిన్ = ఆ విధముగా, రా చందమామ = రామచంద్రుడు, పంప కడ = పంపానదీ సమీపంలో, మెలంగగ = సంచరించుచుండగా, ఆ దరి గట్టుమీద నుండి = అవతలి గట్టుమీదనుంచి, కన్గొని = చూచి, ప్రొద్దు కుఱ్ఱండు = సూర్యుని కుమారుడైన సుగ్రీవుడు, తలకి = భయపడి,

**తా :** వినుము. వాల్మీకిని చూచి ఆ నారదుడు పలికెను. ఆ విధముగా రామచంద్రుడు పంప చేరువలో సంచరించుచుండగా ఆవలి గట్టునుంచి చూచి సుగ్రీవుడు భయపడి.

**కం. వీరలు రాకొామరులొ? జడ**
**దారులొ? తూపులును విండ్లు దాలిచి యున్నా**
**రారయ వాలి కతంబున**
**నీ రూపున వచ్చిరేమొ యిపుడిచ్చటికిన్ 3**

వీరలు = ఈ రామ, లక్ష్మణులు, రా కొామరులొ = రాజకుమారులా?, జడదారులొ = తపస్వులా?, తూపులును = బాణములను, విండ్లు = ధనుస్సులను, దాలిచి యున్నారు = ధరించి యున్నారు, ఆరయ = పరిశీలింపగ, వాలి కతంబున = వాలి కారణముగా, ఈ రూపునన్ = ఈ వేషములతో, ఇపుడు ఇచ్చటికిన్ = ఇప్పుడు ఇక్కడికి, వచ్చిరి ఏమొ = వచ్చారేమో?

**తా :** 'వీరలు రాకుమారులా? తపస్వులా? బాణములు, ధనుస్సులు ధరించియున్నారు. చూడగా వాలి పంపగా ఈ వేషములతో ఇప్పుడిక్కడికి వచ్చారేమో!

**ఉ. వీరల చందమెల్ల సరవిం బరికింపక కాని యింక లో**
**నోరిమి కల్గదంచు నళుకొప్పఁగ నాడిన నాలకించి వి**
**న్గూరిమి మన్మఁడా సొబగు కుత్తుక కోఁతులఱేనిఁ జూచి యే**
**నారసి వత్తు వారి తెఱఁగంతయు నింతఁ దలంపనేటికిన్ 4**

వీరల చందము ఎల్ల = వీరి విషయమునంతను, సరవిం = చక్కగా, పరికింపక కాని = తెలుసు కుంటే కాని, ఇంక = ఇకపైన, లోన్ ఓరిమి కల్గదు అంచున్ = మనసు స్తిమితంగా ఉండదు అంటూ, అళుకు ఒప్పగ = భయము కలుగుచుండగా, ఆడిన = పలుకగా, ఆలకించి = విని, విన్ కూరిమి మన్మడు = ఆకాశమునకు ముద్దుల మనుమడు (వాయువు ఆకాశము కొడుకు) (హనుమంతుడు), ఆ సొబగు కుత్తుక కోతుల ఱేనిన్ జూచి = ఆ అందమైన కంఠముకల వానర ప్రభువగు సుగ్రీవుని చూచి, ఏన్ = నేను, వారి తెఱంగు అంతయు = వారి విషయమునంతను, ఆరసి వత్తున్ = తెలుసుకొని వచ్చెదను, ఇంత తలంపన్ ఏటికిన్ = ఇంతగా విచారించడమెందుకు?

**తా :** వీరి విషయం పూర్తిగా తెలుసుకుంటేకాని మనసు స్తిమితంగా ఉండదు' అన విని హనుమ సుగ్రీవుని చూచి 'నేను వారి విషయం తెలుసుకొని వస్తాను. విచారమెందుకు?

**తే.గీ. పున్నియపు మానుసులు గాని యెన్న దోస**
**కారి తీఱులు వీరిలోఁ గానబడవు**
**వంత యెంతయుఁ బూనఁగా వలవదిచట**
**నెలమితో నుండు మీవని పలుకుటయును 5**

పున్నియపు మానుసులు కాని = పుణ్య పురుషులే కాని, ఎన్నన్ = ఎంచగా, దోసకారి తీఱులు = దుర్మార్గుల పద్ధతులు, వీరిలో కానబడవు = వీరిలో కనిపించవు, ఎంతయు = మిక్కిలి, వంత పూనగాన్ వలవదు = విచారించ వద్దు, ఇచట = ఇక్కడ, ఈవు = నీవు, ఎలమితోన్ = సంతోషముతో, ఉండుము అని = ఉండుమని, పలుకుటయును = పలుకగానే –

**తా :** పుణ్యపురుషులే కాని చూడగా దుర్మార్గ లక్షణములు వీరిలో కనబడవు. ఎక్కువగా విచారించవద్దు. ఇక్కడ నీవు సంతోషముగా ఉండు' అని పలుకగానే

**కం. సంతసిలి యాతఁడా హను**
**మంతున కానతి యొసంగి మదిలో మిగులన్**
**వంత యొనర్పఁగ నపుడే**
**మంతులతోఁ గూడి చనియె మలయంబునకున్ 6**

సంతసిలి = సంతోషించి, ఆతడు = ఆ సుగ్రీవుడు, ఆ హనుమంతునకు ఆనతి ఒసంగి = ఆ ఆంజనేయుని ఆజ్ఞాపించి, మదిలోన్ = మనస్సులో, మిగులన్ = అధికముగా, వంత ఒనర్పగన్ = కలతను కలిగించగా, అపుడే = వెంటనే, మంతులతోన్ = మంత్రులతో, కూడి = కలిసి, మలయంబునకున్ = మలయపర్వతమునకు, చనియె = వెళ్ళిపోయెను.

**తా :** సంతోషించి, ఆ సుగ్రీవుడు ఆ హనుమను ఆజ్ఞాపించి మనసులో అధికముగా కలతను కలిగించగా వెంటనే మంత్రులతో కూడి మలయపర్వతమునకు వెళ్ళిపోయెను.

**ఆ.వె. అంత నీఁదచూలి యమ్మన్నుఁతేఁడుల**
**చెంత కరిగి బత్తిఁ జేయి దోయి**
**మొగిచి పలికె నరిది మొనగాండ్రురార! మీ**
**రెవ్వ రిందు మెలఁగ నేటి కిటుల 7**

అంతన్ = అంతట, ఈదచూలి = వాయుదేవుని కుమారుడగు ఆంజనేయుడు, ఆ మన్ను ఱేడుల చెంతకు అరిగి = ఆ పృథివీపతులగు రామ, లక్ష్మణుల చెంతకు వెళ్ళి, బత్తిన్ = భక్తితో, చేయి దోయి = రెండు చేతులను, మొగిచి = జోడించి, పలికెన్ = పలికెను, అరిది మొనగాండ్రరార = అద్భుతమైన వీరులారా!, మీరు ఎవ్వరు, ఇటుల = ఈ రీతిగా, ఇందు = ఇక్కడ, మెలగన్ ఏటికి = తిరుగుట ఎందులకు?

**తా :** అంతట ఆంజనేయుడు ఆ పృథివీపతుల చెంతకు వెళ్ళి భక్తితో చేతులు జోడించి పలికెను 'వీరులారా! మీరు ఎవ్వరు? ఈరీతిగా ఇక్కడ తిరుగుట ఎందులకు?'

**కం. అనిన విని రాము తమ్ముఁడు**
**నెనరొదవఁగ నతనిఁ జూచి నేర్పునఁ బలికెన్**
**విను కొమ్మ మెకపు బలియుఁడ**
**గొనకొని మా చందమెల్ల గుఱు తెఱిగింతున్ 8**

అనినన్ = అనగా, విని = విని, రాము తమ్ముడు = లక్ష్మణుడు, అతనిన్ చూచి = ఆ హనుమంతుని చూచి, నెనరు ఒదవగన్ = ప్రేమపూర్వకముగా, నేర్పున పలికెన్ = నైపుణ్యముగా పలికెను, కొమ్మ మెకపు బలియుడ = మర్కట శ్రేష్ఠమా!; గొనకొని = పూనుకొని, మా చందము ఎల్లన్ = మా విషయమునంతను, గుఱుతు ఎఱిగింతున్ = తెలిసేలా చెప్పెదను.

**తా :** అనగా విని లక్ష్మణుడు ఆ హనుమను చూచి ప్రేమపూర్వకముగా నేర్పున పలికెను 'వానరశ్రేష్ఠమా! మా విషయం చెబుతాను విను.

**సీ.** **పుడమి నయోధ్యయన్ బ్రోలి కేలికయైన**
**బంతితేరుల టేని పట్ల మేము**
**తండ్రి పంపున బల్లిదపుఁ గానలకు వచ్చి**
**మెలఁగుచో నీ టేని మెలఁత నొక్క**
**చెనఁటి రక్కసుఁ డెత్తుకొని పోవ నాపె కై**
**వలగొని వెదకుచు వచ్చి వచ్చి**
**చెంచుముద్దియ నోర్తుఁ గాంచి యత్తెరఁగెల్ల**
**వినిపింప నయ్యింతి నెఱవుమీర**

**తే.గీ.** **మంచిమెడ కోనద్రిమ్మరి మన్నెగాని**
**కత యెఱింగింప నాతనిఁ గనుగొనంగఁ**
**దలఁచి వచ్చితి మిచటికి బొలుపు మెఱయ**
**నతఁడు రాముఁడు లక్ష్మణుఁడండ్రు నన్ను** **9**

పుడమిన్ = భూమండలమున, అయోధ్యయన్ ప్రోలికి ఏలికయైన = అయోధ్య యనెడు నగరానికి ప్రభువైన, బంతి తేరుల టేని = దశరథునియొక్క, పట్ల మేము = కుమారులము మేము, తండ్రి పంపున = తండ్రి ఆజ్ఞతో, బల్లిదపు కానలకు వచ్చి = దట్టమైన అడవులకు వచ్చి, మెలగుచోన్ = వసించుచుండగా, ఈ టేని మెలతను = ఈ ప్రభువు భార్యను, ఒక్క చెనటి రక్కసుడు = ఒక దుర్మార్గుడైన రాక్షసుడు, ఎత్తుకొని పోవన్ = తీసు కొని పోగా, ఆపె కై = ఆమె కొఱకు, వలగొని = పూనుకొని, వెదకుచు వచ్చి వచ్చి = వెదకుచు రాగా రాగా, చెంచు ముద్దియన్ = చెంచు స్త్రీని, ఓర్తున్ = ఒకతెను, కాంచి = చూచి, అత్తెరగు ఎల్ల = ఆ విషయమునంతను, వినిపింప = చెప్పగా, ఆ యింతి = ఆ శబరి, నెఱవు మీర = మంచి ఉపాయముతో, మంచి మెడ కోన ద్రిమ్మరి మన్నె గాని కత = సుగ్రీవుని కథను, ఎఱింగింపన్ = తెలుపగా, ఆతని కనుగొనగ తలచి = ఆతనిని దర్శించాలని, ఇచటికి, పొలుపు మెఱయ వచ్చితిమి = దారి వెదకుచు వచ్చితిమి, అతడు రాముడు, నన్ను లక్ష్మణుడు అండ్రు.

**తా :** అయోధ్య ప్రభువు దశరథుని పుత్రులము మేము. తండ్రి ఆజ్ఞపై అడవులకు వచ్చి నివసిస్తున్నాము. ఈ ప్రభువు భార్యను ఒక దుష్ట రాక్షసుడు ఎత్తుకుపోయాడు. ఆమెను వెదకుచు రాగా ఒక చెంచుస్త్రీని చూచి మా విషయము చెప్పగా, ఆ శబరి సుగ్రీవుని కథను తెలుపగా అతనిని దర్శించాలని ఇక్కడికి దారి వెదకుచు వచ్చితిమి. అతడు రాముడు, నన్ను లక్ష్మణుడు అంటారు.

**తే.గీ.** **ఒనర నిద్దొరచేఁ గాని పని యొకింత**
**లేదు జగమున నితనికి లెంకయైనఁ**
**బ్రొద్దు కొమరుని పనియెల్లఁ బొసఁగఁ జేయు**
**నింక నీ వెవ్వఁడవు మాకు నెఱుఁగఁ బలుకు** **10**

ఒనరన్ = చక్కగా, ఈ దొరచేన్ = ఈ వీరునిచే, కాని పని ఒకింత లేదు జగమున = ఈ లోకంలో కానిపని ఏదీ లేదు, ఇతనికి లెంకయైనన్ = ఇతనికి తోడైనచో, ప్రొద్దు కొమరుని పని ఎల్ల = సుగ్రీవుని పని అంతను, పొసగ చేయును = నెరవేర్చును, ఇంక = ఇకను, నీవు ఎవ్వడవు = నీవు ఎవరవో, మాకున్ ఎఱుగన్ పలుకు = మాకు తెలిసేలా చెప్పు.

**తా :** ఈ వీరునిచే కాని పని కొంచెముకూడా లేదు. ఇతనికి తోడైనచో సుగ్రీవుని పని అంతను నెరవేర్చును. ఇక నీవు ఎవరవో మాకు తెలిసేలా చెప్పు'.

**తే.గీ.** **అనిన నాతఁడు వల్కె నో యయ్య! చిన్కు**
**దారి దారి యనుఁగుఁ గూనఁగోరి కూర్మి**
**దనరఁ గేసరియను కోన మనికిపట్టు**
**కలికి యంజన యనునది గన్నవాడ** **11**

అనిన = అని చెప్పగా, ఆతడు = ఆ ఆంజనేయుడు, పల్కెన్ = పలికెను, ఓ అయ్య = ఓ స్వామీ!, చిన్కు దారి = మేఘమునకు, దారి = దారియైన వాయువునకు, అనుగు కూనన్ = ప్రియ పుత్రుడను, కోన మనికిపట్టు = అడవిలో నివసించే, కేసరి అను = కేసరి అను పేరుగల వానరుని, కలికి = భార్యయగు, అంజన అనునది = అంజన అను పేరుకలది, కోరి = కోరుకొని, కూర్మిన్ = ప్రేమతో, కన్నవాడ = కన్నవాడను.

**తా :** అని చెప్పగా ఆ హనుమ పలికెను 'ఓ స్వామి! నేను వాయు పుత్రుడను. అడవిలో నివసించే కేసరి యను వానరుని భార్య అంజన పుత్రుడను.

**కం.** **హనుమంతుండను పేరం**
**దనరారెడువాఁడఁ బచ్చ తత్తడుల వజీ**
**రుని కొమరుని కెంతయు న**
**మ్మిన బంటఁ గడింది తేజు మీఱినవాఁడన్** **12**

హనుమంతుండు అను పేరన్ = హనుమంతుడను పేరుతో, తనరారెడు వాడన్ = ఒప్పుచున్న వాడను, పచ్చ తత్తడుల వజీరుని = పచ్చని గుఱ్ఱములు కల యోధుడు (సూర్యుడు), కొమరునికి = కుమారుడైన సుగ్రీవునికి, ఎంతయున్ = మిక్కిలి, నమ్మిన బంటన్ = నమ్మిన సేవకుడను, కడింది = మిక్కిలి, తేజు మీఱినవాడన్ = పరాక్రమము కలవాడను.

**తా :** హనుమ పేరుతో ఒప్పుచున్నవాడను. సూర్య కుమారుడైన సుగ్రీవునకు నమ్మిన బంటును. మిక్కిలి పరాక్రమవంతుడను.

**కం.** **అక్కోన త్రిమ్మరుల దొర**
**యక్కజపుం జెలిమితోడ ననిచిన నిపుడీ**
**చక్కికి మీ తెఱఁగఱఁయగ**
**నక్కఱఁ బఱతెంచినాఁడ నయ్య! వలంతీ!** **13**

అయ్య = స్వామీ!, వలంతీ = సమర్థుడా!, ఆ కోన త్రిమ్మరుల దొర = ఆ వానర రాజు, అక్కజపుం చెలిమితోడ = అంతులేని స్నేహముతో, అనిచినన్ = పంపగా, ఇపుడు = ఇప్పుడు, ఈ చక్కికి =

ఈ చోటికి, మీ తెఱగు అఱయగన్ = మీ విషయము తెలుసుకొనుటకు, అక్కఱన్ = అవసరముగా, పఱతెంచినాడన్ = వచ్చినాను.

**తా :** స్వామీ! సమర్థుడా! ఆ వానరరాజు స్నేహభావంతో పంపగా ఇప్పుడు ఇక్కడికి మీ విషయం తెలుసుకొనడానికి అవసరంగా వచ్చాను.

**తే.గీ.** **లెక్క కెక్కువయగు మ్రానుటిక్కదొరలు**
**గలరు బలు జోదు లాతని గొలుచువార**
**లట్టి బలియుఁడు మీకు బంటయ్యె నేని**
**అరయ నీరేడు జగముల నడ్డు గలదె?** **14**

లెక్కకు ఎక్కువ అగు = లెక్కకు మీరిన, మ్రాను ఇక్క దొరలు = చెట్లే వాసముగా కల వానర శ్రేష్ఠులు, పలు జోదులు = పలువురు వీరులు, ఆతని కొలుచువారలు = ఆతనిని సేవించువారు, కలరు = ఉన్నారు, అట్టి బలియుడు = అలాంటి వీరుడు, మీకు బంటు అయ్యెను ఏని = మీకు సేవకుడై తోడైనచో, అరయన్ = చూడగా, ఈరేడు జగములన్ = పదునాల్గు లోకములందును, అడ్డు కలదె = అడ్డనేది ఉండునా? (ఉండదు)

**తా :** లెక్కకు మీరి వానరులు పలువురు వీరులు అతనిని కొలుచువారలు కలరు. అలాంటి వీరుడు మీకు తోడైనచో చూడగా పదునాల్గు లోకాలలోను అడ్డే ఉండదు.

**తే.గీ.** **అట్లు గావున మీ రిపు డతనితోడఁ**
**జెలిమిఁ గావింపఁ జెల్లు వేంచేయుఁ డనుచు**
**వారిఁ దోడ్కొని యక్కరువలి యనుంగుఁ**
**గొమరుఁ డెలమిని ఋష్యమూకమున కరిగె** **15**

అట్లు కావున = ఆ కారణమున, మీరు ఇపుడు, అతనితోడన్ = ఆ సుగ్రీవునితో, చెలిమి కావింపన్ = స్నేహము చేయుటకు, చెల్లున్ = తగును, వేంచేయుడు = రండి, అనుచు = అంటూ, వారిన్ తోడ్కొని = వారిని తీసుకొని, ఆ కరువలి అనుంగు కొమరుడు = ఆ వాయుదేవుని ప్రియ పుత్రుడు, ఎలమిని = సంతోషముగా, ఋష్యమూకమునకు అరిగె = ఋష్యమూక పర్వతమునకు వెళ్ళెను.

**తా :** ఆ కారణమున మీరు ఇప్పుడు సుగ్రీవునితో స్నేహము చేయుటకు తగుదురు. రండి' అంటూ వారిని తీసుకొని ఆ హనుమ సంతోషముగా ఋష్యమూకమునకు వెళ్ళెను.

**ఆ.వె.** **అచట వారి నునిచి యపుడె క్రోఁతుల ఱేని**
**సరస కేగి తాను జన్న తెఱఁగు**
**విన్నపం బొనర్చి వ్రేల్మిడి నతని న**
**ద్దొరల కడకు వేడ్కఁ దోడి తెచ్చె** **16**

అచట = అక్కడ, వారిన్ = వారిని, ఉనిచి = ఉంచి, అపుడె = వెంటనే, క్రోతుల ఱేని సరసకు = సుగ్రీవుని చెంతకు, ఏగి = వెళ్ళి, తాను చన్న తెఱగు = తాను వెళ్ళిన విషయము, విన్నపంబు ఒనర్చి = తెలియజేసి, వ్రేల్మిడిన్ = క్షణకాలములో, అతనిన్ = ఆ సుగ్రీవుని, ఆ దొరల కడకు = ఆ రామ, లక్ష్మణుల దగ్గరకు, వేడ్కన్ = సంతోషముతో, తోడి తెచ్చె = కూడబెట్టుకొని వచ్చెను.

**తా :** ఆ ఋష్యమూకమున వారి నుంచి వెంటనే సుగ్రీవుని చేరి తాను వెళ్ళిన విషయం తెలియజేసి క్షణకాలంలో సుగ్రీవుని రామ,లక్ష్మణుల దగ్గరకు తోడి తెచ్చెను.

**కం. తెచ్చిన నతఁడా ఱేఁడుల**
**కొచ్చెము గనరాని బత్తి యొదవఁగ మ్రొక్కుల్**
**చెచ్చెర నిడి రామునితో**
**మచ్చిక వెలయంగఁ దియ్య మాటలు పలికెన్ 17**

తెచ్చినన్ = తీసుకొనిరాగా, అతడు = ఆ సుగ్రీవుడు, ఆ ఱేడులకు = ఆ రామ, లక్ష్మణులకు, ఒచ్చెము కనరాని = లోపము కన్పింపని, బత్తి ఒదవగ = భక్తి కలుగునట్లు, మ్రొక్కుల్ = సమస్కారములు, చెచ్చెరన్ ఇడి = తొందరగా చేసి, రామునితో, మచ్చిక వెలయంగన్ = నమ్మకము కలుగునట్లుగా, తియ్య మాటలు పలికెన్ = మధురముగా మాటలాడెను.

**తా :** తీసుకొనిరాగా, సుగ్రీవుడు ఆ రామ, లక్ష్మణులకు లోపములేని భక్తితో నమస్కరించి రామునితో నమ్మకము కలుగునట్లుగా మధురముగా మాటలాడెను.

**ఆ.వె. రాచవేల్పు ఱేఁడ! మీ చొక్కటపు హజ్జ**
**దోయి గంటి వెఱఁగు దోఁప నిపుడు**
**దొలఁగె నెల్ల చెడుగు దొసఁగులు గడలేని**
**పున్నియంబు లెల్లఁ బొదలె మాకు 18**

రాచవేల్పు ఱేడ = ఓ రాజశ్రేష్ఠా!, మీ చొక్కటపు హజ్జ దోయిన్ = మీ సుందరమైన పాదములను, వెఱగు తోపన్ = విస్మయముతో, కంటిన్ = చూచితిని, ఇపుడు = మిమ్ము చూచుట తోడనే, చెడుగు దొసగులు = దుష్ట దోషములు, ఎల్లన్ = అన్నియు, దొలగె = నశించిపోయినవి, కడ లేని = అంతులేని, పున్నియంబులు ఎల్లన్ = పుణ్యములన్నియు, మాకు పొదలె = మాకు లభించినవి.

**తా :** 'ఓ రాజశ్రేష్ఠా! మీ పాదములను వినయముతో చూచితిని. మిమ్ము చూచుటతోనే దుష్ట దోషములన్నీ తొలగిపోయినవి. అంతులేని పుణ్యం మాకు లభించినది.

**ఆ.వె. కడిఁది బిరుద! నీవె కాక మా వ్రేఁగిఁకఁ**
**బొసఁగ నరుఁడొకండు పూనఁగలడె?**
**పుడమి పడఁతి వ్రేగుఁ బడగదాలుపు రాయఁ**
**డూనుఁ గాక లాతి యూనఁ గలఁడె 19**

కడిది బిరుద = గొప్ప వీరుడా!, నీవె కాక = నీవు కాకున్నచో, మా వ్రేగు ఇకన్ = ఇక మా భారమును, నరుండు ఒకండు = వేరొక మానవుడు, పొసగన్ = చక్కగా, పూనన్ కలడె = భరించకలడా!, పుడమి పడతి వ్రేగు = భూభారమును, పడగ తాలుపు రాయడు = ఆదిశేషుడు, ఊను కాక = భరించును కాని, లాతి = ఇతరుడు, ఊన కలడె = భరింపగలడా?

**తా :** గొప్ప వీరుడా! నీవు కాకున్నచో ఇక మా భారమును వేరొక మానవుడు భరించగలడా? భూభారమును ఆదిశేషుడే భరించును కాని ఇతరుల భరింపగలరా?

**తే.గీ.　　నలువు మీఱంగ నన్ను మీ నలువురకును**
**దోడఁ బుట్టువునుగఁ జెల్మితోడఁ జూచి**
**కరము పెనుపొందు నా కనికరము నెఱపి**
**యిడుమ లెడఁబాపి కోరిక లిడుము మాకు　　　　20**

నలువు మీఱంగన్ = మిక్కిలి ప్రేమతో, నన్ను = నన్ను, మీ నలువురకును = మీ సోదరులు నలుగురకును, తోడ పుట్టువునుగ = సోదరునిగ, చూచి, కరము పెనుపొందు = మిక్కిలి దృఢమైన, చెల్మి తోడన్ = స్నేహభావముతో, నా కనికరము నెఱపి = నా ప్రార్థనను నెఱవేర్చి, ఇడుమలు ఎడన్ పాపి = కష్టములను పోగొట్టి, మాకు = మాకు, కోరికలు ఇడుము = శుభములు ఇమ్ము.

**తా :** ప్రేమతో నన్ను మీ సోదరులు నలుగురకును సోదరునిగ చూచి దృఢమైన స్నేహభావముతో నా ప్రార్థనను నెఱవేర్చి, మా కష్టములు పోగొట్టి మాకు శుభము లిమ్ము'.

**కం.　　అని మును రక్కసుఁ డెత్తుక**
**చని నప్పుడు పుడమి కాన్పు జతనంబుగఁ గొం**
**గున ముడిచి గట్టుపై వై**
**చిన తొడవులు దెచ్చి ఱేని చేతి కొసంగెన్　　　　21**

అని = అని చెప్పి, మును = అంతకు ముందు, రక్కసుడు ఎత్తుక చనిన అప్పుడు = రావణుడు ఎత్తుకుపోయేటప్పుడు, పుడమి కాన్పు = సీత, జతనంబుగన్ = ప్రయత్నపూర్వకముగా, కొంగున ముడిచి = చీర కొంగులో ముడివేసి, గట్టుపై = ఋష్యమూక పర్వతముపై, వైచిన = పడవేసిన, తొడవులు = ఆభరణములు, తెచ్చి, ఱేని చేతికి = రాముని చేతికి, ఒసంగెన్ = ఇచ్చెను.

**తా :** అని చెప్పి అంతకు ముందు రావణుడు ఎత్తుకుపోయేటప్పుడు సీత తాను కట్టిన చీర కొంగులో ముడివేసి పర్వతముపై పడవేసిన ఆభరణములు తెచ్చి రామునికిచ్చెను.

**కం.　　ఒసఁగిన నవి గైకొని వె**
**క్కసమగు కన్నీరు దొరుఁగఁ గళవళమున లో**
**నసురుసు రనుచుం గడితపు**
**దెసలం బడి కొంత వడికిఁ దెలివి దలిర్పన్　　　　22**

ఒసగినన్ = ఇవ్వగా, అవి కైకొని = వానిని తీసుకొని, వెక్కసము అగు కన్నీరు దొరుగన్ = దుస్సహమగు కంట నీరు స్రవించగా, కళవళమున = కలతతో, లోన అసురుసురు అనుచున్ = మనసులో తల్లడపాటు నందుచు, గడితపు దెసలన్ = భరిపంశక్యము కాని దురవస్థలందు, పడి = మునిగి, కొంత వడికిన్ = కొంత సమయానికి, తెలివి తలిర్పన్ = యథాస్థితికి వచ్చి,

తా : ఇవ్వగా, వానిని తీసుకొని కంట నీరు అగకుండా స్రవించగా కలతతో మనసున తల్లడపడుచు భరింపరాని దురవస్థను మునిగి కొంతవడికి యథాస్థితికి వచ్చి.

**కం.　　ముచ్చొకపు రూపులు పూ**
**న్వెచ్చని జేజే యనుంగు నిసుగుం గని లో**

**లొచ్చక యింతయు నొదవని**
**మచ్చిక నవ్వాసి రాచమానిసి పలికెన్ 23**

మూడు చౌకపు రూపులు = 3×4 పన్నెండు విధములైన ఆకారములను (ద్వాదశార్కులు), పూను = ధరించు, వెచ్చని జేజే యనుంగు నిసుగుం కని = సూర్యుని ప్రియ పుత్రుని (సుగ్రీవుని) చూచి, లోన్ = మనసులో, ఒక ఇంతయు = కొంచెము కూడా, లొచ్చు = న్యూనత, ఒదవని = కలుగని, మచ్చికన్ = నమ్మకముతో, ఆ వాసి = ఆ ప్రసిద్ధుడైన, రాచమానిసి పలికెన్ = రాముడు పలికెను.
**తా :** ద్వాదాశార్కుల రూపము ధరించు ఆ సూర్యుని పుత్రుడగు సుగ్రీవుని చూచి మనసులో కొంచెంకూడా లొచ్చులేని నమ్మకముతో రాముడు పలికెను.

**కం. మల ద్రిమ్మరి రాయఁడ! దిట**
**మలరఁగ నీ పవతు పీఁచ మడఁచి పుడమి కి**
**మ్ముల నొడయనిఁ జేసెద నినుఁ**
**దలపున మా మాట నమ్ము దలఁకకు మింకన్ 24**

మల ద్రిమ్మరి రాయడ = కొండలపై సంచరించువారి నాయకుడవైన సుగ్రీవా!, దిటము అలరగన్ = ధైర్యము ఒప్పుచుండగా, నీ పవతు = నీ శత్రువైన వాలియొక్క పీచము అడచి = గర్వము నణచి, పుడమికి = కిష్కింధకు, ఇమ్ములన్ = సంతోషముగా, నినున్ = నిన్ను, ఒడయనిన్ = ప్రభువును, చేసెదన్ = చేసెదను, తలపున = నీ బుద్ధిలో, మా మాట = మేము అన్న ఈ మాట, నమ్ము = నమ్ముము, ఇంకన్ = ఇకమీదట, తలకకు = బాధపడకు.
**తా :** సుగ్రీవా! ధైర్యంగా నీ శత్రువైన వాలి పీచమడచి కిష్కింధకు సంతోషంగా నిన్ను రాజును చేస్తాను. నీ బుద్ధిలో మేమన్న మాట నమ్ము. ఇంక బాధపడకు.

**కం. ఆ కొండసూడు పట్టికి**
**నీకును బగ యెట్టు లొదవె? నిక్కువ మొనరన్**
**మా కెఱిఁగింపుము దిగ్గన**
**నీ కర్జం బెల్లఁ బొదివి నెగడఁగఁ జేతున్ 25**

ఆ కొండ సూడు పట్టికిన్ = ఆ పర్వతములకు శత్రువైన ఇంద్రుని కొడుకికి (వాలి), నీకును = నీకు, పగ ఎట్టులు ఒదవె = శత్రుత్వము ఎలా వచ్చింది?, నిక్కువము = సత్యమును, ఒనరన్ = చక్కగా, మాకు ఎఱిగింపుము = మాకు తెలియపరచుము, దిగ్గనన్ = వెంటనే, పొదివి = పూను కొని, నీ కర్జంబు ఎల్లన్ = నీ పని అంతయు, నెగడగన్ చేతున్ = పూర్తగునట్టు చేయుదును.
**తా :** ఆ ఇంద్రుని కొడుకు వాలికి నీకు శత్రుత్వము ఎలా వచ్చింది? మాకు నిజం తెలియపరచు. వెంటనే సిద్ధపడి నీ పని పూర్తయేలా చేస్తాను.

**సీ. అనిన నాతఁడు వల్కె నయ్య మున్మాయావి**
**యనెడు రక్కసుఁ డొక్కఁ డాము మీఱఁ**
**జేరి పోరొనరింపఁ జీఱిన నెన్నిక**
**గను తోఁకగల కోన మనికిపట్టు**

**ననుఁ దోడు పిల్చుక మొనసి యచ్చెనఁటి పై**
**నఱుఁగ నిద్దఱిఁ జూచి కరము వెఱచి**
**పఱచి వాఁడొక్క గుబ్బలి పెను బొరియలోఁ**
**దూఱిన నాతఁడుఁ దోన తూఱి**

**తే.గీ.** **పెక్కులాగులఁ బైకొని పెనఁగుచున్న**
**తఱిని నెత్తురు వరదలై పఱచుటయును**
**బొలసు మేపరి బొబ్బలు సెలఁగుటయును**
**జూచి యవ్వాలి మడసె నంచుం దలంచి** **26**

అనినన్, ఆతడు = ఆ సుగ్రీవుడు, పల్కెన్, అయ్య = స్వామీ!, మును = చాలకాలం క్రిందట, మాయావి అనెడు = మాయావి అను పేరుగల, రక్కసుడు ఒక్కడు = ఒక రాక్షసుడు, ఆము మీఱన్ = మిక్కిలి గర్వముతో, చేరి = కిష్కింధకు వచ్చి, పోరు ఒనరింపన్ = యుద్ధము చేయుటకు, చీఱిన = పిలువగా, మొనసి = సిద్ధపడి, ఎన్నికగను తోక కల = గొప్పదైన తోకకల, కోన మనికిపట్టు = అరణ్యము నివాసముగాకల రాజు(వాలి), ననున్ తోడు పిల్చుక = నన్ను తోడు తీసుకొని, ఆ చెనటి పైన్ = ఆ దుష్టునిమీదకు, అఱుగన్ = వెళ్ళగా, ఇద్దఱిన్ చూచి = మా ఇద్దరను చూచి, కరము వెఱచి = మిక్కిలి భయపడి, వాడు పఱచి = వాడు పారిపోయి, ఒక్క గుబ్బలి పెను బొరియలోన్ = ఒక పెద్ద కొండ గుహలో, దూఱినన్ = దూరగా, ఆతడు తోన తూఱి = అతడు కూడా దూరి, పెక్కులాగులన్ = అనేక విధములుగా, పైకొని = పైన పడి, పెనగుచున్న తఱిని = కలబడుతున్న సమయంలో, నెత్తురు వరదలై పఱచుటయును = రక్తం ప్రవాహంకట్టి ప్రవహించడమును, పొలసు మేపరి బొబ్బలు చెలగుటయును = రాక్షసుడి అరుపులు పెరుగుటయును, చూచి = చూచి, ఆ వాలి = ఆ వాలి, మడసెను అంచున్ తలచి = చనిపోయాడని నిశ్చయించుకొని,

**తా :** అనగా ఆ సుగ్రీవుడు 'స్వామీ! చాలాకాలం క్రిందట మాయావి అనే రాక్షసుడు గర్వంతో కిష్కింధకు వచ్చి పోరుకు పిలువగా, వాలి నన్ను తోడు తీసుకొని ఆ దుష్టుని మీదకు వెళ్ళెను. మా ఇద్దరను చూచి వాడు భయపడి పారిపోయి ఒక కొండ గుహలో దూరగా, మా అన్న కూడా దూరి కలబడుతున్న సమయంలో రక్తం ప్రవాహం కట్టి ప్రవహించడం, ఆ రాక్షసుడి అరుపులు పెరగడం చూచి వాలి చనిపోయాడని నిశ్చయించుకొని.

**కం.** **కడు వడిఁ గలుగు మొగంబునఁ**
**బడు కొక్కటి ద్రోచి వెనుక పను లాతని కే**
**ర్పడఁ జేసి వీడు సేరినఁ**
**గడకం బజ లెల్ల నన్నుఁ గనుఁగొని యెలమిన్** **27**

కడు వడిన్ = మిక్కిలి తొందరగా, కలుగు మొగంబునన్ = ఆ గుహ ముఖద్వారమున, పడుకు ఒక్కటి = ఒక బండ రాయిని, త్రోచి = అడ్డముగా త్రోసి, ఆతనికి, వెనుక పనులు = ఉత్తర

క్రియలు, ఏర్పడన్ చేసి = కలుగునట్లుగా చేసి, వీడు చేరినన్ = కిష్కింధ చేరగా, కడకన్ = పూనికతో, పజలు ఎల్లన్ = ప్రజలందరూ, నన్నున్, కనుగొని = చూచి, ఎలమిన్ = ప్రేమతో –

**తా :** తొందరగా ఆ గుహ ముఖద్వారానికి ఒక బండరాయిని అడ్డముగా త్రోసి, ఆ వాలికి ఉత్తర క్రియలు చేసి కిష్కింధ చేరగా ప్రజలందరూ నన్ను ప్రేమతో –

**తే.గీ.** **త్రిప్ప ద్రిమ్మరి నాడెల్లఁ దివిరి ప్రోవు**
**మనుచు నొడయనిఁ గావించి యునుచు నంత**
**రక్కసుని ద్రుంచి మిక్కిలి యుక్కు మెఱయ**
**వచ్చి నను జూచి కినిసి యవ్వాలి పలికె** **28**

త్రిప్ప ద్రిమ్మరి నాడు = కిష్కింధ, ఎల్లన్ = అంతయూ, తివిరి = ప్రయత్నించి, ప్రోవుము అనుచున్ = కావుమనుచు, ఒడయనిన్ కావించి = ప్రభువును చేసి, ఉనుచు అంత = ఉంచగా, ఆ వాలి, రక్కసుని త్రుంచి = రాక్షసుని చంపి, మిక్కిలి ఉక్కు మెఱయ = అధికమైన బలం ప్రదర్శిస్తూ, వచ్చి నను చూచి, కినిసి = కోపించి, పలికె = పలికెను.

**తా :** కిష్కింధ అంతా ప్రోవుమనుచు నన్ను ప్రభువును చేసి ఉంచగా, ఆ వాలి రాక్షసుని చంపి చాల బలం ప్రదర్శిస్తూ వచ్చి నన్ను చూచి కోపించి పలికెను.

**ఆ.వె.** **ఓరి! దోసకారి! కూరిమి సైదోడ**
**వనుచు నిన్ను నమ్మి యకట! పగతు**
**తోడఁ బోరొనర్పఁ దొడఁగినచోఁ గికు**
**రించి రాఁగఁ జనునె? కొంచులేక** **29**

ఓరి = ఓరీ!, దోసకారి = పాపకర్ముడా!, కూరిమి సైదోడవు అనుచు = ప్రియమైన తమ్ముడవని, నిన్ను నమ్మి, అకట = అయ్యో!, పగతు తోడన్ = శత్రువుతో, పోరు ఒనర్పన్ = యుద్ధము చేయుటకు, తొడగినచోన్ = పూనుకొనగా, కికురించి = నన్ను మోసగించి, కొంచులేక = సందేహించక, రాగన్ చనునె = రావచ్చునా?

**తా :** ఓరీ! దోసకారీ! ప్రియమైన తమ్ముడవని నిన్ను నమ్మి శత్రువుతో యుద్ధం చేయడానికి సిద్ధపడగా నన్ను మోసగించి సందేహించక రావచ్చునా?

**తే.గీ.** **అనుచు నా కూర్మి గేస్తురాలైన రుమను**
**గొని పుడమి యెల్లఁ గొని తఱిమినఁ గరంబుఁ**
**దలఁకి యిక్కొండపైఁ జేరి మెలఁగుచుండి**
**తిచటి కాతఁడు రాలేమి యెద నెఱింగి** **30**

అనుచు = అని పల్కుచూ, నా కూర్మి గేస్తురాలైన రుమను = నా ప్రియ భార్యయైన రుమను, కొని = గ్రహించి, పుడమి ఎల్లన్ కొని = రాజ్యమునంతను లాక్కొని, తఱిమినన్ = తరిమికొట్టగా, కరంబు = మిక్కిలి, తలకి = భయపడి, ఇచటికి = ఇక్కడికి, అతడు రాలేమి = ఆ వాలి రాలేకపోవడాన్ని, ఎదను ఎఱింగి = మనసులో తెలిసినవాడిని కనుక, ఈ కొండపైన్ = ఈ కొండమీద, చేరి = చేరుకొని, మెలగు చుండితి = బ్రతుకుతున్నాను,

**తా :** అని పల్కుచూ 'నా భార్య రుమను గ్రహించి రాజ్యమును లాక్కొని తరిమికొట్టగా చాల భయపడి ఇక్కడికి వాలి రాలేకపోవడాన్ని తెలిసినవాడిని కనుక ఈ కొండమీద బ్రతుకుతున్నాను'.

**చం.** **అనవుడు నేలఱేఁడు వెఱఁగందుచుఁ గోఁతుల ఱేఁడ! మేటి తే**
**జున జగమంతయుం గెలువఁ జొప్పడు లావును గల్గు వాలికి**
**ప్పెనుమల కెక్కరామి వినిపింపుము నిక్కముగా నటన్న న**
**మ్మినుకుల యిక్క గుఱ్ఱఁ డెకిమీనిఁ గనుంగొని పల్కె వెండియున్** **31**

అనవుడు = తరువాత, నేల ఱేడు = రాముడు, వెఱగు అందుచు = ఆశ్చర్యపడుచు, కోతుల ఱేడ = సుగ్రీవా!, మేటి తేజునన్ = గొప్ప పరాక్రమముతో, జగమంతయున్ గెలువన్ = లోకము నంతను గెలుచుటకు, చొప్పడు = అవసరమైన, లావును కల్గి = బలమును కలిగియున్న, వాలికి, ఈ పెనుమలకు = ఈ ఋష్యమూక పర్వతమునకు, ఎక్కరామి = రాలేని పరిస్థితిని, నిక్కముగా = యధార్థముగా, వినిపింపుము = చెప్పుము, అట అన్నన్ = అని పలుకగా, ఆ మినుకుల ఇక్క కుఱ్ఱడు = ఆ సూర్యుని కుమారుడగు సుగ్రీవుడు, ఎకిమీనిన్ = రాముని, కనుంగొని = చూచి, వెండియున్ = మరియును, పల్కె = పల్కెను.

**తా :** తరువాత రాముడు 'సుగ్రీవా! శౌర్యముతో లోకాన్ని గెలవగలిగిన బలముకల వాలి ఈ ఋష్యమూకానికి రాలేని పరిస్థితి యదార్థం తెల్పుమ'న సుగ్రీవుడు రామునితో –

**కం.** **విను దేవర! మును దుందుభి**
**యను రక్కసుఁ డొకఁడు దుంతయై వేల్పులరా**
**యని కొమరునిఁ దనతో దుర**
**మునకుం బిలిచినఁ గడింది మురితో నతఁడున్** **32**

దేవర విను = ప్రభూ వినండి, మును = చాల కాలము క్రిందట, దుందుభి అను రక్కసుడు ఒకడు = దుందుభి అనే రాక్షసుడొకడు, దుంతయై = దున్నపోతు రూపమున, వేల్పులరాయని కొమరునిన్ = ఇంద్రుని కుమారుడగు వాలిని, తనతోన్ దురమునకున్ పిలిచిన = తనతో యుద్ధమునకు పిలువగా, అతడున్ = ఆ వాలియును, కడింది మురితోన్ = మిక్కిలి గర్వముతో–

**తా :** 'ప్రభూ! చాలాకాలం క్రిందట దుందుభి అనే రాక్షసుడు దున్నపోతుగా వచ్చి వాలిని పోరాటానికి పిలువగా వాలి మిక్కిలి గర్వముతో –

**ఉత్సాహ.** **అలుక మీఱ నప్పిసాళి యాము దుంత రక్కసుం**
**దలఁ కొకింత లేక కూడఁ దఱిమి రెండు కొమ్ములుం**
**గలయఁ బట్టి యబ్బురంబుగాఁగఁ గ్రిందఁ ద్రోచి రే**
**వెలుఁగు జోదుబిడ్డఁ డేలు వీటి కంపె వ్రేల్మిడిన్** **33**

అలుక మీరన్ = అధికమైన కోపముతో, ఆ పిసాళి = ఆ దొంగయెత్తుగడకల, ఆము = మదించిన, దుంత రక్కసున్ = దున్నపోతు రాక్షసుని, తలకు ఒకింత లేక = సందేహము కొంచెము కూడా లేకుండా, కూడన్ తఱిమి = వెంటబడి తఱిమి, రెండు కొమ్ములున్ కలయ

పట్టి, అబ్బురంబు కాగన్ = అశ్చర్యకరముగా, క్రిందన్ ద్రోచి = క్రింద పడవేసి, వ్రేల్మిడిన్ = ఒక్క క్షణములో, రే వెలుగు జోదు బిడ్డడు = రాత్రిపోయేక వచ్చే వెలుగు ఉదయం వచ్చే వీరుడు సూర్యుని కొడుకు(వాలి) యమధర్మరాజు, ఏలు వీటికి = పరిపాలించు పట్టణమునకు (యమలోకానికి), అంపెన్ = పంపెను.

**తా :** మిక్కిలి కోపముతో ఆ మదించిన రక్కసుని వెంటబడి తరిమి రెండు కొమ్ములను పట్టుకొని క్రిందపడవేసి ఒక్క క్షణములో యముని పట్టణమునకు పంపెను.

**ఆ.వె.** **అనిచి బలిమి నొక్క యామడ నరి వాని**
**యొడలు దన్నివైవ నురలి నల్ల**
**బొట్టు లివ్వెడంద గట్టుపైఁ బడిన మ**
**తంగుఁ డనెడు దొడ్డ తపసి కినిసి** **34**

అనిచి = పంపి, బలిమిన్ = బలముతో, ఒక్క ఆమడ = ఒక యోజనము, నరి = మేర, వాని = ఆ దుందుభి యొక్క, ఒడలు = కాయమును, తన్నివైవ = తన్నగా, ఉరలి నల్ల బొట్టులు = రక్తం స్రవించి, ఈ వెడంద గట్టుపైన్ = ఈ విశాలమైన పర్వతము మీద, పడిన = పడగా, మతంగుడు అనెడు = మతంగుడను పేరుగల, దొడ్డ తపసి = గొప్ప ముని, కినిసి = కోపించి.

**తా :** పంపి బలంగా ఒక ఆమడ దూరము వెళ్ళేలా ఆ దుందుభి కాయమును తన్నగా కారుతున్న రక్తం ఈ పర్వతంమీద పడగా, మతంగుడను ముని కోపించి

**కం.** **ఇక్కొండ వాలి కెన్నఁడు**
**నెక్కఁగ రాకుండ మేరయిడె నటులా బల్**
**రక్కసుని మేను సిమ్మెడు**
**నుక్కతనికె కాక పుడమి నొరులకుఁ గలదే?** **35**

ఈ కొండ = ఈ కొండను, వాలికి = వాలికి, ఎన్నడున్ ఎక్కగ రాకుండ = ఎన్నటికి ఎక్కడానికి కుదరకుండా, మేర ఇడెను = హద్దు నియమించెను, అటులు = ఆ ప్రకారముగా, ఆ బల్ రక్కసుని = ఆ గొప్ప రాక్షసుని, మేను = కాయమును, చిమ్మెడున్ ఉక్కు = విసరివేసే బలము, అతనికె కాక = అతనికే కాని, పుడమిన్ = ఈ భూమండలమున, ఒరులకు కలదే = ఎవరికైనా కలదా?

**తా :** ఈ కొండను వాలికి ఎన్నటికి ఎక్కడానికి కుదరకుండా హద్దు నియమించెను. అలా ఆ రాక్షసుని మేను విసరే బలం అతనికే కాని ఈ నేలలో ఎవరికైనా కలదా?

**తే.గీ.** **అనిన రతనాల బొజ్జ ప్రోయాలి ముద్దు**
**పాప పెనిమిటి తొగదాయ పట్టి నపుడె**
**పలువ యెనుపోతు పొలదిండి పడ్డ చోటి**
**కెలమితోఁ దోడుకొని చని బలిమి మెఱయ** **36**

అనినన్ = అని చెప్పగా, రతనాలబొజ్జ ప్రోలు ఆలి = రత్నగర్భ పట్టణం భూమి, అనే స్త్రీ, ముద్దు పాప పెనిమిటి = కూతురు సీత, భర్త రాముడు, తొగదాయ పట్టిన్ = కలువలకు శత్రువు సూర్యుడు,

కొడుకు సుగ్రీవుని, అపుడె = వెంటనే, పలువ = దుష్టుడైన, యెనుపోతు పొలదిండి = దున్నపోతు రాక్షసుడు(దుందుభి), పడ్డచోటికి = పడివున్న చోటికి, ఎలమితోన్ = ఉత్సాహముగా, తోడుకొని చని = తీసుకొని వెళ్ళి, బలిమి మెఱయ = తన బలమును ప్రదర్శించుచు,

**తా :** అని చెప్పగా రాముడు సుగ్రీవుని వెంటనే ఆ దుందుభి పడివున్న చోటికి తీసుకొని వెళ్ళి తన బలం ప్రదర్శిస్తూ

**కం.** **కొదుకక యా రక్కసు మెయి**
**పొదలుచుఁ దన నునుపు టజ్జ బొటమన వ్రేలన్**
**బదియామడ సనఁ జిమ్మిన**
**నెద నలరుచుఁ గొమ్మ మెగపుటేలిక యనియెన్** **37**

కొదుకక = సందేహించక, ఆ రక్కసు మెయిన్ = ఆ రాక్షసుని దేహమును, తన నునుపు అజ్జ బొటమన వ్రేలన్ = తన నున్నని పాదము యొక్క బొటన వ్రేలితో, పొదలుచున్ = పెరుగుచు, పదిఆమడ చనన్ = ఐదుయోజనములు పోవునట్లుగా, చిమ్మినన్ = విసరివేయగా, కొమ్మమెగపు ఏలిక = సుగ్రీవుడు, ఎదన్ = మనసునందు, అలరుచున్ = ఉప్పొంగుచు, అనియెన్ = అనెను.

**తా :** సందేహించక ఆ రాక్షసుని దేహమును తన బొటన వ్రేలితో పెరుగుచు ఐదు యోజనములు పోవునట్లుగా విసరివేయగా సుగ్రీవుడు మనసున ఉప్పొంగుచు అనెను.

**తే.గీ.** **అయ్య! మును వాలి వంకరయైన తాటి**
**చెట్టు లొక యేడు కౌఁగిటఁ బట్టి యాకు**
**లెల్లఁ గోయును నీ వవి యిప్పు డొక్క**
**యమ్మున నడంచు మనుటయు నట్ట యేసి** **38**

అయ్య = స్వామీ!, మును = ఇంతకు ముందు, వాలి, వంకరయైన = వంకరగా నున్న, తాటిచెట్టులు ఒక ఏడు = ఏడు తాటిచెట్టులను, కౌగిట పట్టి = తన కౌగిలితో బంధించి, ఆకులు ఎల్లన్ కోయును = ఆకులన్నిటిని కోసివేయును, నీవు, అవి ఇప్పుడు = వాటిని ఇప్పుడు, ఒక్క అమ్మునన్ = ఒకే బాణమున, అడంచుము = త్రుంచి వేయుము, అనుటయున్, అట్ట ఏసి = అలా కొట్టివేసి.

**తా :** అయ్యా! ఇంతకుముందు వాలి వంకరగానున్న ఏడు తాటిచెట్లు కౌగిటపట్టి ఆకు లన్నిటిని కోసివేయును. నీవు ఇప్పుడు వాటిని ఒకే బాణమున త్రుంచివేయుము అన అలా కొట్టివేసి.

**సీ.** **అడవి ద్రిమ్మరి ఱేఁడ! తడవేల కిష్కింధ**
**కరిగి మీ యన్నతో దుర మొనర్చు**
**చుండుము మేము నీయండనే పఱతెంచి**
**యక్కూళఁ బోనీక యుక్కడంచి**
**నిను దొరఁ జేయుదుమని ఱేఁడు వనిచిన**
**నతఁ డట్లు చనివాని ననికిఁ బిలువఁ**
**గొఱకొరతోడ గ్రక్కున వాఁడు వెడలిన**
**నిరువురుఁ గదిసి వావిరిఁ బెనంగు**

**తే.గీ. నెడలఁ దోడనఁ జని వారి వేఱుపఱప**
**రాకయుండినఁ గొంకుచు రాము డొక్క**
**యిక్క నూరకయున్న నియ్యివము సూడు**
**పట్టి వ్రేటులఁ బడి వేగఁ బాఱుతెంచి 39**

అడవి త్రిమ్మరి ఱేడ = కోతుల నాయకుడవైన సుగ్రీవుడా, తడవు ఏల = ఆలస్యమెందులకు?, కిష్కింధకు అరిగి = కిష్కింధకు వెళ్ళి, మీ అన్నతో = వాలితో, దురము ఒనర్చుచు ఉండుము = యుద్ధము చేయుచూ ఉండుము, మేము = మేము, నీ అండనే పఱతెంచి = నీకు తోడుగా వచ్చి, ఆ కూళన్ = ఆ నీచుని, పోనీక = పోనీయకుండగ, ఉక్కు అడంచి = సంహరించి, నినున్ = నిన్ను, దొరన్ చేయుదుము = ప్రభువును చేయుదుము, అని = అని చెప్పి, ఱేడు పనిచిన = రాముడు పంపగా, అతడు అట్లు చని = సుగ్రీవుడు ఆవిధంగా వెళ్ళి, వానిన్ అనికిన్ పిలువన్ = వాలిని యుద్ధమునకు పిలువగా, కొఱకొఱతోడన్ = కోపముతో, గ్రక్కునన్ = వెంటనే, వాడు వెడలినన్ = ఆ వాలి బయలుదేరిరాగా, ఇరువురున్ = వారు ఇరువురును, కదిసి = దగ్గరపడి, వావిరిన్ = ఘోరముగా, పెనంగున్ ఎడలన్ = పోరుచుండగా, తోడన చని = తోడుగా వెళ్ళి, రాముడు = రాముడు, వారి వేఱుపఱపన్ రాక ఉండినన్ = వారిని గుర్తించలేక పోతుండగా, గొంకుచు = సందేహించుచు, ఒక్క ఇక్కన్ = ఉన్నచోటనే, ఊరక ఉన్నన్ = మౌనముగానుండగా, ఆ ఇవము సూడు పట్టి = ఆ మంచుకు శత్రువగు సూర్యుని కొడుకు సుగ్రీవుడు, వ్రేటులు పడి = దెబ్బలు తిని, వేగన్ = వేగముగా, పాఱుతెంచి = పారిపోయి వచ్చి –

**తా :** సుగ్రీవా! ఆలస్య మెందులకు? కిష్కింధకు వెళ్ళి మీ అన్నతో యుద్ధము చేయుము. మేము నీకు తోడుగా వచ్చి ఆ నీచుని సంహరించి నిన్ను ప్రభువును చేయుదుము. అని చెప్పి పంపగా సుగ్రీవుడు వెళ్ళి వాలిని యుద్ధమునకు పిలువగా వెంటనే వాలి కోపంతో బయలుదేరి రాగా, ఇరువురు ఘోరంగా పోరుచుండగా, తోడువెళ్ళిన రాముడు వారిని గుర్తించలేక సందేహంతో మౌనంగా ఉండిపోగా సుగ్రీవుడు దెబ్బలు తిని పారిపోయి వచ్చి –

**కం. ఒడయని యడుగునఁబడి కడు**
**నడలిన నూరార్చి మరల నరుగుమటంచున్**
**మెడ నొక పూలసరంబిడి**
**వడి ననిచిన నేఁగి పెనకువకుఁ బిల్చుటయున్ 40**

ఒడయని అడుగునన్ పడి = రాముని కాళ్ళమీద పడి, కడున్ అడలినన్ = మిక్కిలి రోదింపగా, ఊరార్చి = ఓదార్చి, మరలన్ = తిరిగి, అరుగుమటంచున్ = వెళ్ళుమనుచు, మెడన్ = కంఠము నందు, ఒక పూలసరంబు ఇడి = ఒక పూలమాలను ఉంచి, వడిన్ = శీఘ్రముగా, పనిచినన్ = పంపగా, ఏగి = వెళ్ళి, పెనకువకున్ = యుద్ధమునకు, పిల్చుటయున్ = పిలువగానే

**తా :** రాముని కాళ్ళమీద పడి మిక్కిలి రోదించగా ఓదార్చి తిరిగి వెళ్ళుమని మెడలో ఒక పూలదండను ఉంచి పంపగా సుగ్రీవుడు వెళ్ళి పోరునకు పిలువగానే –

**తే.గీ.** **పొసఁగఁ దోబుట్టువను కూర్మి పోవ విడిచి**
**బ్రతుకఁ జాలక మిక్కిలి బంటువోలెఁ**
**దిరుగ నరుదెంచుటకు వీనిఁ దేర్తు ననుచు**
**నొడలి చూపుల యొడయని కొడుకు వెడలి** **41**

పొసగన్ = ఒప్పుగా, తోబుట్టువను కూర్మి = సోదరుడను ప్రీతిని, పోవ విడిచి = వదలిపెట్టి, బ్రతుకన్ చాలక = బ్రతుకలేక, మిక్కిలి బంటువోలెన్ = పెద్ద వీరుడిలా, తిరుగన్ అరుదెంచుటకు = తిరిగి వచ్చినందులకు, వీనిన్ = వీనిని, తేర్తును అనుచున్ = కడతేర్చెద ననుచు, ఒడలి చూపుల ఒడయని కొడుకు = ఒళ్ళంతా కన్నులున్న దొర ఇంద్రుడు కొడుకు వాలి, వెడలి = వెళ్ళి.
**తా :** సోదరుడను ప్రీతిని వదలిపెట్టి, బ్రతుకలేక పెద్ద వీరుడిలా తిరిగి వచ్చినందుకు వీనిని కడతేర్చెదననుచు వాలి వెళ్ళి –

**కం.** **ఉడివోవని కొఱకొఱతోఁ**
**గడువడిఁ బైగదిసి కడిమి గడలుకొనఁగ బల్**
**పిడుగున కెన యనఁదగు తన**
**పిడికిటన ప్రొద్దు కొడుకు పేరెదఁ బొడిచెన్** **42**

ఉడివోవని = తగ్గని, కొఱకొఱతోన్ = కోపముతో, కడు వడిన్ = మిక్కిలి వేగముగా, పై కదసి = మీదపడి, కడమి కడలుకొనగ = మిక్కిలి సాహసముతో, బల్ పిడుగునకు = కఠినమైన పిడుగునకు, ఎన అనదగు = సమానమనదగు, తన పిడికిటన = తన పిడికిలితో, ప్రొద్దు కొడుకు = సుగ్రీవుని, పేరు ఎదన్ = విశాలమైన రొమ్మునందు, పొడిచెన్ = పొడిచెను.
**తా :** మిక్కిలి కోపముతో వేగముగా మీదపడి పిడుగుల్లా తన పిడికిలితో సుగ్రీవుని ఎదపై పొడిచెను.

**కం.** **పొడిచిన నిలువక పుడమిం**
**బడి నెత్తురు గ్రక్కి లేచి పాయక యతఁడ**
**గ్గడుసరిపై బలితపు లా**
**వదరఁగ నొక మద్ది పెఱికి యార్చుచు వైచెన్** **43**

పొడిచిన = అలా పొడువగా, నిలువక = ఆ దెబ్బకు నిలబడజాలక, పుడమిన్ పడి = భూమిమీద పడిపోయి, నెత్తురు గ్రక్కి, లేచి, పాయక = విడువక, అతడు = ఆ సుగ్రీవుడు, ఆ గడుసరిపైన్ = ఆ వీరుడైన వాలిపై, బలితపు లావు = గొప్ప శక్తి, అదరగన్ = ఒప్పుచుండగా, ఒక మద్ది పెఱికి = ఒక మద్దిచెట్టును పెల్లగించి, ఆర్చుచు వైచెన్ = బొబ్బలిడుచు వేసెను.
**తా :** అలా పొడువగా ఆ దెబ్బకు నిలబడలేక భూమిమీదపడిపోయి నెత్తురు కక్కుకుంటూ లేచి విడువక ఆ సుగ్రీవుడు వాలిపై ఒక మద్దిచెట్టును పెల్లగించి అరచుచు వేసెను.

**తే.గీ.** **వైచుటయు వాలి ముమ్మొన వాలు పూని**
**చీఁకటుల గొంగ కొడుకుపైఁ జెలఁగి యేయ**

**నతఁడు దాని నడంగించి యతని మీఁదఁ**
**దొడర క్రమ్మఱ నొక పెద్ద పడుకు వైచె** **44**

వైచుటయు = వేయగా, వాలి, మూడు మొన వాలు పూని = త్రిశూలమును ధరించి, చీకటుల గొంగ కొడుకుపైన్ = సుగ్రీవునిమీద, చెలగి = విజృంభించి, ఏయన్ = వేయగా, అతడు = ఆ సుగ్రీవుడు, దానిని, అడంగించి = అడ్డుకొని, అతని మీద = ఆ వాలిమీద, తొడర క్రమ్మరన్ = పరాక్రమంతో మరల, ఒక పెద్ద పడుకు = ఒక పెద్ద బండరాయిని, వైచె = విసిరెను.

**తా :** వేయగా వాలి త్రిశూలమును ధరించి సుగ్రీవునిమీద విజృంభించి వేయగా ఆ సుగ్రీవుడు దానిని  అడ్డుకొని ఆ వాలిమీద మళ్ళా ఒక పెద్ద బండరాయిని విసరెను

**సీ.** **అటువలె వారు పేరలుక లిబ్బడిగాఁగఁ**
**దొడరి యక్కజమొప్పఁ దొడయుఁ దొడయుఁ**
**బెనుచుక పెనగుచుఁ బిడికిళ్ళ నడఁచుచుఁ**
**దాఁచుచుఁ జఱచుచుఁ దటిమి బొబ్బ**
**లిడుచుఁ బెన్ర్మాకులఁ బడుకుల రువ్వుచుఁ**
**దోఁకల మోదుచుఁ దొలఁగఁ జనుచు**
**గోళ్ళ వ్రచ్చుచుఁ బండ్ల గురుకొని కఱచుచు**
**మెడలు నొక్కుచుఁ దూలి పుడమిఁ బడుచు**

**తే.గీ.** **బిట్టు పూఁచిన బూరుగు చెట్టులట్ల**
**నెత్తురులఁ దోగి పోరుచో నేలఱేఁడు**
**వేడి వేలుపు బిడ్డని వాఁడి చెడుట**
**తెలిసి  సింగిణి నొక దొడ్డ చిలుకుఁ గూర్చి** **45**

అటువలెన్ = ఆ విధముగా, వారు = వాలి, సుగ్రీవులు, పేరలుకలు = అధికమైన క్రోధములు, ఇబ్బడి కాగ = రెట్టింపవగా, తొడరి = పూనుకొని, అక్కజము ఒప్పన్ = ఆశ్చర్యకరముగా, తొడయున్ తొడయున్ = తొడతో తొడను, పెనుచుక = పెనవేసుకుని, పెనగుచున్ = పెనుగులాడుచును, పిడికిళ్ళన్ = పిడికిటి పోటులతో, అడచుచున్ = బాధించుచు, తాచుచున్ = తన్నుచూ, చఱచుచున్ = చేతులతో చఱుస్తూ, తటిమి బొబ్బలు ఇడుచు = తటిమికొడుతూ గర్జిస్తూ, పెను ప్రాకులన్ పడుకులన్ రువ్వుచున్ = పెద్ద చెట్లను, రాళ్ళను విసరుచు, తోకలన్ మోదుచున్ = తోకలతో బాదుచూ, తొలగన్ చనుచు = తొలగిపోవుచూ, గోళ్ళ వ్రచ్చుచు = గోళ్ళతో చీల్చుచు, పండ్ల గురుకొని కఱచుచు = పళ్ళతో భీకరంగా కఱచుచు, మెడలు నొక్కుచున్ = ఒకరి పీకి ఒకరు నొక్కుకుంటూ, తూలి పుడమిన్ పడుచు = తూలి భూమిమీద పడిపోతూ, బిట్టు = అధికముగా, పూచిన బూరుగు చెట్టులు అట్ల = పుష్పించిన బూరుగు చెట్లవలె, నెత్తురులన్ = రక్తముతో, తోగి = తడిసిపోయి, పోరుచో = పోరాడుచుండగా, నేలఱేడు = రాముడు, వేడి వేలుపు బిడ్డని = సుగ్రీవుని, వాడి చెడుట = పరాక్రమము తగ్గుట, తెలిసి = తెలుసుకొని, సింగిణిన్ = ధనుస్సునకు, ఒక దొడ్డ చిలుకున్ కూర్చి = ఒక పెద్ద బాణమును తగిలించి,

**తా :** అలా వాలి, సుగ్రీవులు రెట్టించిన కోపంతో తొడతో తొడను పెనవేసుకొని పెనుగు లాడుచు, పిడికిళ్ళతో బాధించుచు, తన్నుచూ, చేతులతో చఱుస్తూ, తరిమికొడుతూ, గర్జిస్తూ, పెద్ద చెట్లను, రాళ్ళను విసరుచు, తోకలతో బాదుచూ, తొలగిపోవుచూ, గోళ్ళతో చీల్చుచు, పళ్ళతో కరచుచు, ఒకరి పీక ఒకరు నొక్కుకుంటూ, తూలి భూమిమీద పడిపోతూ పూచిన బూరుగు చెట్లవలె రక్తంతో తడిసిపోయి పోరాడుచుండగా రాముడు సుగ్రీవుని శౌర్యము తగ్గుట తెలిసి ధనుస్సునకు ఒక బాణమును తగిలించి –

**తే.గీ.** **వేయు గన్నులు గల బలు వేల్పుకొడుకు**
**ఱొమ్ము గురిచేసి యేయ మెఱుంగు లెల్ల**
**కడల నింపుచు నది సని కాఁడుటయును**
**బుడమిపైఁ ద్రెళ్ళి యీల్గెఁ గొబ్బున నతండు** **46**

వేయు కన్నులు కల బలు వేల్పు కొడుకు = (ఇంద్రుని కొడుకు) వాలియొక్క, ఱొమ్ము గురిచేసి, ఏయ = బాణమును వేయగా, మెఱుంగులు ఎల్ల కడల నింపుచు = కాంతులు అన్ని దిక్కులయందును నింపుచు, అది చని = ఆ బాణము వెళ్ళి, కాడుటయును = తగులుటతోనే, అతడు = ఆ వాలి, పుడమిపైన్ = భూమిమీద, త్రెళ్ళి = పడి, గొబ్బున = వెంటనే, ఈల్గె = చనిపోయెను.

**తా :** వాలి గుండెను గురి చేసుకొని బాణమును వేయగా అన్ని దిక్కుల కాంతిని నింపుచూ ఆ బాణము వెళ్ళి తగులుటతోనే ఆ వాలి భూమిపై పడి వెంటనే చనిపోయెను.

**ఆ.వె.** **అపుడు కోఁతిఱేని కమ్మానుసుల ఱేఁడు**
**రిక్కపేరి చెలిని దక్క నొసఁగి**
**కొమ్మ మెకపు ప్రోలి కిమ్ముగా నేలికఁ**
**జేసి యనుప బత్తిచే నతండు** **47**

అపుడు = అప్పుడు, కోతిఱేనికి = సుగ్రీవునకు, ఆ మానుసుల ఱేడు = రాముడు, రిక్క పేరి చెలిని = నక్షత్రము పేరుగా కల స్త్రీని (తార), దక్కన్ = దక్కునట్లుగా, ఒసగి = ఇచ్చి, కొమ్మ మెకపు ప్రోలికి = కోతుల పట్టణానికి (కిష్కింధకు), ఇమ్ముగాన్ = తగినరీతిగా, ఏలికన్ చేసి = రాజును చేసి, అనుపన్ = పంపగా, అతండు = ఆ సుగ్రీవుడు, బత్తిచేన్ = భక్తిచే.

**తా :** అప్పుడు సుగ్రీవునకు రాముడు తార దక్కునట్లుగా ఇచ్చి కిష్కింధకు రాజును చేసి పంపగా ఆ సుగ్రీవుడు భక్తితో –

**కం.** **తొడవులు మానికములు విడి**
**ముడియు న్నాడెంపుఁ బుట్టములుఁ బ్రోవులుఁగా**
**నుడుగరలు తెచ్చి యిడి య**
**య్యొడయని యడుగుల కెరంగి యొప్పుగఁ బలికెన్** **48**

తొడవులు = ఆభరణములు, మానికములు = మాణిక్యములు, విడిముడియున్ = ధనములును, నాడెంపు పుట్టములు = నాణ్యమైన వస్త్రములు, ప్రోవులుగాన్ = అధిక సంఖ్యలో, ఉడుగరలు =

కానుకలు, తెచ్చి ఇడి = తెచ్చి ఇచ్చి, ఆ ఒడయని = ఆ రాముని, అడుగులకు ఎరంగి = పాదములకు నమస్కరించి, ఒప్పుగ = తగినరీతిగా, పలికెన్ = పలికెను.

**తా :** ఆభరణములు, మాణిక్యములు, ధనములు, పట్టు వస్త్రములు ఎన్నో కానుకలు తెచ్చి ఇచ్చి ఆ రాముని పాదములకు నమస్కరించి తగినరీతిగా పలికెను.

**ఆ.వె. రాచ రేవెలుంగ! నీ చేత నిపుఁ డెల్ల**
**గొడవలునుఁ దొలంగెఁ జెడని మేలు**
**గలిగె మాకు నిన్నుఁ గొలిచిన వారల**
**కొకట ముత్తి బుత్తు లొదవుఁ గదవె 49**

రాచ రేవెలుంగ = రాజచంద్రమా!, నీ చేతన్ ఇపుడు ఎల్ల గొడవలును తొలంగె = నీవల్ల ఇప్పుడు అన్ని గొడవలు తొలగిపోయాయి, మాకు, చెడని మేలు కలిగె = శాశ్వతమైన మంచి జరిగింది, నిన్ను కొలిచిన వారలకు = నిన్ను సేవించిన వారికి, ఒకటన్ = ఒక్కసారిగా, ముత్తి బుత్తులు = ముక్తియు, భుక్తియును, ఒదవు కాదె = లభిస్తాయికదా!

**తా :** రాజచంద్రమా! నీ వలన అన్ని గొడవలును తొలగిపోయినవి. మాకు శాశ్వతమైన మంచి జరిగింది. నిన్ను సేవించిన వారికి ఒక్కసారిగా ముక్తి, భుక్తి లభిస్తాయికదా!

**కం. వేలుపులకైనఁ జిక్కని**
**వాలిం బొరిగంటి వొక్క వాల్తూపున నీ**
**మ్రోల నిఁక నిలిచి మగఁటిమి**
**నాలం బొనరింప నొరుల కలవియె పుడమిన్ 50**

వేలుపులకు ఐనన్ = దేవతలకైనను, చిక్కని = దొరకని, వాలిన్, ఒక్క వల్తూపునన్ = ఒకే ఒక్క వాడియైన బాణముతో, పొరిగొంటివి = సంహరించితివి, ఇక = ఇంక, నీ మ్రోల = నీ ఎదుట, నిలిచి = నిలబడి, మగటిమిన్ = పౌరుషముతో, ఆలంబు ఒనరింపన్ = యుద్ధము చేయుటకు, పుడమిన్ = ఈ భూమండలమున, ఒరులకు = ఇతరులకు, అలవియె = సాధ్యమగునా?

**తా :** దేవతలకైనను దొరకని వాలిని ఒకే ఒక్క బాణమున సంహరించితివి. ఇంక నీ ఎదుట నిలబడి మగటిమితో యుద్ధం చేయడానికి ఈ భువిలో ఇతరులకు సాధ్యమా?

**కం. పది మోముల రక్కసు నిఁక**
**సదమదమొనరించి కొఱలు సంతసమున న**
**మ్మిదిల దొర బోదఁ జేకొని**
**యెద వెదలో దిటము విడకు మింతయు తండ్రీ! 51**

తండ్రీ = ఓ రామా!, ఇక = ఈ పైన, పది మోముల రక్కసున్ = రావణుని, సదమదము ఒనరించి = చంపి, కొఱలు సంతసమున = అధికమైన సంతోషముతో, ఆ మిదిల దొర బోదన్ = ఆ మిథిల ప్రభువు కూతురును (సీతను), చేకొనియెదవు = తెచ్చుకొనెదవు, ఎదలో = మనసులో, ఇంతయు = కొంచెమును, దిటము = ధైర్యమును, విడకుము = విడిచిపెట్టకుము.

**తా :** ఓ రామా! రావణుని చంపి సంతోషంగా సీతను తెచ్చుకుంటావు. ఇక మనసులో కొంచెంకూడా ధైర్యమును విడచిపెట్టకు.

**కం. వాన తటీ వచ్చె నిదిగో!**
**మానుగ నీ నాల్గు నెలలు మక్కువ మీఱన్**
**మా నెలవుననుండి తుదిన్**
**జాన తెఱంగరసి దండు సాగింపఁ దగున్ 52**

ఇదిగో, వాన తటీ వచ్చెను = వానా కాలము వచ్చెను, మానుగన్ = చక్కగా, ఈ నాల్గు నెలలు = వానాకాలము నాల్గు నెలలును, మక్కువ మీఱన్ = మిక్కిలి కూర్మితో, మా నెలవునన్ ఉండి = మా కిష్కింధలో ఉండి, తుదిన్ = వర్షాకాలము తరువాత, చాన తెఱంగు = సీత విషయము, అరసి = తెలుసుకొని, దండు సాగింపన్తగున్ = సైన్యమును తరలించుట తగినది.

**తా :** ఇదిగో వానాకాలం వచ్చేసింది. చక్కగా ఈ నాలుగు నెలలు ప్రీతితో మా కిష్కింధలో ఉండి వర్షాకాలం తరువాత సీత విషయం తెలుసుకొని సైన్యం తరలించడం తగినది.

**కం. కావున నా విన్నపమో**
**దేవర! నీ యెదను నిలిపి తేకువ మీఱం**
**గా వేంచేయుఁడు గొబ్బున**
**నావుడు నా రిక్కతేఁడు నగుచుం బలికెన్ 53**

ఓ దేవర = ఓ ప్రభూ!, కావున = కాబట్టి, నా విన్నపము = నా వినతిని, నీ ఎదను నిలిపి = నీ మనసున తర్కించి, తేకువ మీఱంగా = మిక్కిలి ధైర్యముతో, గొబ్బున = శీఘ్రముగా, వేంచేయుడు = కిష్కింధకు రండి, నావుడున్ = అనగా తరువాత, ఆ రిక్క తేడు = ఆ నక్షత్ర నాథుడు చంద్రుడు (రామచంద్రుడు), నగుచుం పలికెన్ = నవ్వుచు పలికెను.

**తా :** ఓ ప్రభూ! కాబట్టి నా వినతిని నీ ఎదను నిలిపి ధైర్యంతో శీఘ్రంగా కిష్కింధకు రండి అనగా ఆ రాముడు నవ్వుచు –

**తే.గీ. కోఁతిరాయఁడ! మాపయిఁ గూర్మి నిలిపి**
**వాన తటీ యెల్ల నగళుల లోన నుండఁ**
**దపసి రూపులఁ బ్రోళ్ళకుఁ దవిలి రాఁగ**
**మాకుఁ బొసఁగదు పొమ్ము మఱాక రమ్ము 54**

కోతిరాయడ = వానరరాజా!, వాన తటీ ఎల్లన్ = వానాకాల మంతయు, నగళుల లోనన్ = రాజ గృహములలో, ఉండన్ = ఉండుటకు, మాకున్, పొసగదు = కుదరదు, తపసి రూపులన్ = తాపసులుగ, తవిలి = పూనుకొని, ప్రోళ్ళకు రాగన్ = నగరములకు వచ్చుట, పొసగదు = తగదు, మా పయిన్ కూర్మి నిలిపి = మాయందు ప్రీతినుంచి, పొమ్ము = వెళ్ళుము, మఱాక = మా మేలును మఱువక, రమ్ము = వానాకాలము అనంతరమే రమ్ము.

**తా :** వానరరాజా! వానాకాలమంతయు రాజగృహములలో ఉండుటకు మాకు కుదరదు. తాపసులుగ ఉండి నగరములకు వచ్చుట తగదు. మాయందు ప్రీతినుంచి పొమ్ము, మా మేలును మఱువక వానాకాలము అనంతరమే రమ్ము.

**కం. అని యతనికి సెలవిడి తలఁ**
**పునఁ బంట నెలంత కానుపు న్నిలిపి వెతం**
**గనలుచుఁ దమ్మునితో నొ**
**య్యనఁ గూడుక మాల్యవంతమన్ మల కరిగెన్ 55**

అని = ఆ ప్రకారంగా, అతనికి = సుగ్రీవునికి, సెలవిడి = ఆజ్ఞాపించి, తలపునన్ = మనస్సు నందు, పంట నెలంత కానుపున్ = భూజాతయగు సీతను, నిలిపి = తలచుకొని, వెతం కనలుచు = విరహము నందుచు, ఒయ్యనన్ = శీఘ్రముగా, తమ్మునితోన్ కూడుక = లక్ష్మణునితో కూడి, మాల్యవంతమన్ మలకు అరిగెన్ = మాల్యవంతమను కొండకు వెళ్ళెను.

**తా :** అని అతనికి సెలవిడి, మనసున సీతను తలచుకొని విరహమునందుచు శీఘ్రుంగా తమ్మునితో కూడి మాల్యవంతమునకు వెళ్ళెను.

**తే.గీ. అంతఁ దన పట్టియగు వాలి నడఁగఁ జేసె**
**నీ కొమరుఁ డంచు వేల్పుమన్నీఁడు ప్రొద్దు**
**నలమి ముట్టడి వేయించె ననఁగ మబ్బు**
**తెగలు వడిఁ బర్వెఁ జుక్కల తెరవునందు 56**

అంతన్ = అంతట, తన పట్టి అగు = తన కుమారుడైన, వాలిన్ = వాలిని, నీ కొమరుడు = నీ కుమారుడు, అడగన్ చేసెన్ = సంహరించెను, అంచు = అనుచు, వేల్పుమన్నీడు = ఇంద్రుడు, అలమిన్ = పట్టుదలతో, ప్రొద్దున్ = సూర్యుని, ముట్టడి వేయించెను అనగన్ = కట్టడి చేయించెను అనునట్లుగా, మబ్బు తెగలు = మబ్బుల సమూహములు, వడిన్ = శీఘ్రముగా, చుక్కల తెరవునందు పర్వెన్ = ఆకాశమున వ్యాపించెను.

**తా :** అంతట తన కుమారుడైన వాలిని నీ కుమారుడు సంహరించెను అనుచు ఇంద్రుడు పట్టుదలతో సూర్యుని ముట్టడించెననగా మబ్బుల సమూహములు ఆకాశమున వ్యాపించెను.

**కం. తొలివేల్పు ఱేని సిరు లిఁక**
**నిలువక చను నిట్టులనుచు నెఱి జగములకుం**
**దెలుపు తెఱంగున నఱిముఱి**
**మెలఁగెం దెఱగంటి త్రోవ మించుం దుటముల్ 57**

తొలివేల్పు ఱేని = రావణుని యొక్క, సిరులు = సంపదలు, ఇకన్ = ఇకమీదట, నిలువక చనున్ = నిలువకుండా పోతాయి, ఇట్టులు అనుచు = ఇలా అని, నెఱి = చక్కగా, జగములకుం = లోకములకు, తెలుపు తెఱంగున = తెలుపుచున్న విధముగా, తెఱగంటి త్రోవన్ = దేవతలు సంచరించు ఆకాశ మార్గమున, అరిముఱి = సంభ్రమ ముతో, మించుం తుటముల్ = మెఱుపుల సమూహములు, మెలగెన్ = వర్తించెను.

**తా :** రావణుని సంపదలు ఇక నిలువవు అని చక్కగా లోకములకు తెలుపుచున్న విధముగా ఆకాశమున మెఱుపులు వర్తించెను.

**కం. పంటచెలి యల్లునకుఁ దెఱ**
**గంటిదొర ల్పగతు గట్టిగా గెల్చుటకై**
**యొంటెఱిఁగి యునుచు విండ్లన**
**వింటన్ వేలుపుల రాచవిండ్లు దనర్చెన్ 58**

పంటచెలి అల్లునకున్ = రామునకు, తెరగంటి దొరల్ = దేవతా శ్రేష్ఠులు, పగతు గట్టిగా గెల్చుటకై = శత్రువును తప్పకుండా గెలవడానికై, ఒంటు ఎఱిగి = అనుకూలతను తెలిసి, ఉనుచు = ఉంచిన, విండ్లన = ధనుస్సులనునట్లుగా, వింటన్ = ఆకాశమున, వేలుపుల రాచవిండ్లు = ఇంద్ర ధనుస్సులు, తనర్చెన్ = ఒప్పెను.

**తా :** దేవతలు రామునకు శత్రువును తప్పకుండా గెలవడానికై అనుకూలతను తెలిసి ఉంచిన ధనుస్సులనునట్లుగా ఆకాశమున ఇంద్ర ధనుస్సులు ఒప్పెను.

**ఆ.వె. జగము లేఁచు చాల్పు మొగముల రక్కసుఁ**
**జిదిమి వైచి నెయ్య మొదవ మమ్ముఁ**
**బ్రోవు మనుచు వేలుపులు రాముని గురించి**
**మొఱలు పెట్టి రనఁగ నుఱుము లమరె 59**

జగములు ఏచు = లోకములను బాధించు, చాల్పు మొగముల రక్కసున్ = దశకంఠుని, చిదిమివైచి = చంపి, నెయ్యము ఒదవన్ = స్నేహభావముతో, మమ్ము ప్రోవుము అనుచు = మమ్ము కాపాడు మనుచు, వేలుపులు, రాముని గురించి = రాముని గూర్చి, మొఱలు పెట్టిరి అనగన్ = మొరపెట్టిరి అనునట్లుగా, ఉఱుములు అమరె = మేఘ గర్జనలు ఒప్పెను.

**తా :** లోకములను బాధించు రావణుని చంపి స్నేహభావముతో మమ్ము కాపాడుమనుచు దేవతలు రాముని గూర్చి మొఱపెట్టిరి అనునట్లుగా మేఘగర్జనలు ఒప్పెను.

**చం. పొల కవణంపు ఱేని నిఁకఁ బూనఁగఁ జాలనటంచు నేల తొ**
**య్యలి గఱి వేల్పు హజ్జఁ బడి యంగదతోఁ దన చందమంతయున్**
**బొలుపుగ విన్నవించుకొనఁ బోయెనొకో యన మబ్బుత్రోవకుం**
**బలుపుగఁ గ్రమ్మి దుమ్మెసఁగి పారె వడిన్ సుడిగాడ్పు పెంపునన్ 60**

పొలకవణంపు ఱేనిన్ = మాంసమే ఆహారముగాకల రాక్షసులరాజును, ఇకన్ పూనగన్ = ఇంకా భరించుటకు, చాలను = సమర్థురాలనుకాను, అటంచున్ = అనుచు, నేల తొయ్యలి = భూదేవి, కఱివేల్పు = నల్లనివాడైన విష్ణువుయొక్క, హజ్జన్ పడి = పాదములపై పడి, అంగదతో = ఆర్తితో, తన చందము అంతయున్ = తన విషయమునంతను, పొలుపుగన్ = చక్కగా, విన్నవించుకొనన్ = తెలుపు కొనుటకు, పోయెను ఒకో అనన్ = వెళ్ళిందా అనునట్లుగా, సుడిగాడ్పు = సుడిగాలి, మబ్బు త్రోవకున్ = ఆకాశమార్గము నకు, బలుపుగన్ = దట్టముగా, క్రమ్మి = వ్యాపించి, దుమ్ము ఎసగి = దుమ్ము లేచి, పెంపునన్ = ఆధిక్యముతో, వడిన్ పారెన్ = వేగముగా ప్రవహించెను.

**తా :** ఈ రాక్షసరాజును ఇంకా భరించడానికి సమర్థురాలను కాను అనుచు భూదేవి విష్ణువు పాదములపై పడి ఆర్తితో తన విషయమును తెలుపుకొనుటకు వెళ్ళిందా అనునట్లుగా సుడిగాలి ఆకాశమున దట్టముగా వ్యాపించి దుమ్ము లేచి వేగముగా ప్రవహించెను.

**కం. మొఱకుదనంబునఁ బెఱ చెలిఁ**
**జెఱఁగొని నీ మనుమఁ డుఱకఁ జెడఁ బొల్పడె రూ**
**పఱియని నలువకుఁ దెలుఁపగఁ**
**బఱచెనన న్మింట నంచబారులు సనియెన్ 61**

మొఱకుతనంబునన్ = మూర్ఖత్వముతో, పెఱచెలిన్ = పరాయి స్త్రీని, చెఱకొని = బంధించి, నీ మనుమడు = నీ మనుమడగు రావణుడు, ఉఱకన్ = వ్యర్థముగా, రూపు అఱి = ప్రతిష్ట పోగొట్టుకొని, చెడన్ పొల్పడె = చెడిపోడానికి సిద్ధపడ్డాడు, అని నలువకు = అని బ్రహ్మకు, తెలుపగ = చెప్పడానికి, పఱచెను అనన్ = పరుగెత్తుతున్నాయి అనునట్లుగా, మింటన్ = ఆకాశమున, అంచబారులు చనియెన్ = హంసల సమూహములు వెళ్ళెను.

**తా :** మూర్ఖత్వముతో పరాయ స్త్రీని బంధించి నీ మనుమడు రావణుడు వ్యర్థముగా ప్రతిష్ఠ పోగొట్టుకుని చెడిపోడానకి సిద్ధపడ్డాడు అని బ్రహ్మకు చెప్పడానికి పరుగెత్తుతున్నాయి అన్నట్లుగా ఆకాశమున హంసల బారులు వెళ్ళెను.

**తే.గీ. తన యనుఁగుఁ గూన చెఱనుంట దలఁచి వెతలఁ**
**దూలు నేలపొలంతుక దూప యడఁప**
**మొగిలు కడవల జేజేలు ముంచి నించు**
**వలి చదలు వాఁక నీరన వాన లెసగె 62**

తన అనుగుకూన = తన ముద్దుల కూతురు, చెఱన్ ఉంట = బంధింపబడుట, తలచి = తలచుకొని, వెతలన్ తూలు = బాధతో క్రుంగిపోవుచున్న, నేల పొలంతుక = భూదేవి యొక్క, తూప అడపన్ = దప్పికతీర్పగా, జేజేలు = దేవతలు, మొగిలు = మేఘములను, కడవల ముంచి = కడవలతో ముంచి, నించు = క్రిందకు వంచుచున్న, వలిచదలువాక నీరనన్ = చల్లని ఆకాశగంగయందలి నీరనగా, వానలు ఎసగెన్ = వర్షములు ఒప్పెను.

**తా :** తన కూతురు బంధింపబడుట తలచి బాధతోనున్న భూదేవి దప్పిక తీర్పగా దేవతలు మేఘములను కడవలతో ముంచి క్రిందకు వంచుచున్న ఆకాశగంగయందలి నీరనగా వర్షములు ఒప్పెను.

**తే.గీ. రక్కసుని దోఁకఁగట్టి సంద్రముల నెల్ల**
**ముంచు వాలిని ద్రుంచి తౌనంచు వేల్పు**
**తెఱవ లా రాముమీఁద ముత్తియపుఁ బ్రాలు**
**గడకతోఁ జల్లిరన వడగండ్లు రాలె 63**

రక్కసుని = రావణుని, తోకన్ కట్టి = తోకకు కట్టుకొని, సంద్రములను ఎల్లన్ = సముద్రముల న్నిటిలోను, ముంచు = ముంచిన, వాలిని = వాలిని, ద్రుంచితి = సంహరించితివి, ఔను = నిజముగా నీవు వీరుడవు, అంచు = అనుచు, వేల్పు తెఱవలు = దేవతా స్త్రీలు, ఆ రాము మీద = ఆ రామునిమీద, ముత్తియపు ప్రాలు = ముత్యాల అక్షతలు, కడకతో = పూనికతో, చల్లిరి అనన్ = చల్లారు అనునట్లుగా, వడ గండ్లు రాలె = వడగళ్ళు రాలినవి.

**తా :** రావణుని తోకకు కట్టుకొని సముద్రము లన్నిటిలోను ముంచిన వాలిని సంహారించితివి. నీవు నిజముగా వీరుడవు అనుచు దేవతా స్త్రీలు ఆ రామునిమీద ముత్యాల అక్షతలు చల్లారనునట్లుగా వడగళ్ళు రాలినవి.

**చం.** **కలువల దాయ వంగడపు గామిడి చామను దెచ్చినట్టి మొ**
**క్కలపుఁ బిసాళి రక్కసుని గట్టిగ లోనిడుకొంటి వింక రా**
**నెల కడిమిం గలంచుఁ గన నిన్ననుచుం దమ ఱేని కేర్పడన్**
**దెలుపఁగ నేఁగెనాఁ బఱచెఁ దెల్లగ నేఱులు నీటి వామికిన్ 64**

కలువల దాయ వంగడపు = సూర్య వంశమునకు చెందిన, గామిడి = శ్రేష్ఠమైన, చామను = స్త్రీని, తెచ్చిన అట్టి = తీసుకొనివచ్చినట్టి, మొక్కలపు పిసాళి = సాహసంతో కూడిన దొంగబుద్ధి వాని (రావణుని), లోన ఇడుకొంటివి = నీలో ఉంచుకొంటివి (లంక సముద్రంలో ఉంది), ఇంక = ఇకపైన, కనన్ = చూడగా, రానెల = రాజచంద్రుడు (రాముడు), కడిమిన్ = శౌర్యముతో, నిన్ను కలంచున్, అనుచున్ = అనుకొనుచు, తమ ఱేనికి = తమ ప్రభువగు సముద్రునికి, ఏర్పడన్ = వివరముగా, తెలుపగ = తెలియజేయుటకు, ఏగెనాన్ = వెళ్ళెనా అనునట్లుగా, తెల్లగన్ = స్పష్టముగ, ఏఱులు = నదులు, నీటి వామికిన్ = సముద్రమువైపు, పరచెన్ = పరుగులెత్తినవి.

**తా :** సూర్యవంశానికి చెందిన పవిత్రమైన స్త్రీని సాహసంతో తీసుకొనివచ్చిన దొంగబుద్ధి వాణ్ణి నీలో ఉంచుకొన్నావు. ఇకపై రాముడు శౌర్యముతో నిన్ను కలచివేయును అనుకొనుచు తమ ప్రభువగు సముద్రునకు తెలియజేయుటకు వెళ్ళెనా అనునట్లు నదులు సముద్రమువైపు పరుగులెత్తినవి.

**తే.గీ.** **ఎఱచి మేపరి నెత్తురు టేఱు లిట్లు**
**పఱచునని తెల్పు వడువున వరద లెసఁగె**
**వాని నంజుడు మఱియ లివ్వరుసఁ బుడమి**
**బొరలు నంచన జేవురు పురువు లడరె 65**

ఎఱచి మేపరి = మాంసమే ఆహారముగాకల రావణునియొక్క, నెత్తురు ఏర్లు = రక్తపు ప్రవాహ ములు, ఇట్లు = ఈ విధముగా, పఱచునని = ప్రవహించునని, తెల్పు వడువున = తెల్పుచున్న విధముగా, వరదలు ఎసగె = వరదలు ఒప్పెను, వాని నంజుడు మఱియలు = వాని దేహము లోని మాంసఖండములు, ఈ వరుసన్ = ఈ రీతిగా, పుడమిన్ = నేలపై, పొరలున్ = దొర్లు తాయి, అంచనన్ = అనునట్లుగా, జేవురుపురువులు = ఇంద్రగోపములు, అడరెన్ = ఒప్పెను.

**తా :** రావణుని రక్త ప్రవాహములు ఈ విధంగా ప్రవహిస్తాయని తెల్పుచున్న విధంగా వరదలు ఒప్పెను. వాని దేహములోని మాంస ఖండములు ఈ రీతిగా నేలపై దొర్లుతాయి అనునట్లుగా ఇంద్రగోపములు ఒప్పెను.

**సీ.** **గాటంపు వలినాలిగాడ్పు లూర్పులు గాఁగ**
**నిండారు వఱద కన్నీరు గాఁగఁ**

గొమరొందు తెలినుర్వు లుమియు కళ్ళెలు గాఁగ
నెఱయ సల్జీరాడు నెఱులు గాఁగ
మొగలిపూఁ బొదలు మోమునఁ జేర్చు చీరగాఁ
బూరి మోసులు గగుర్పొడుపు గాఁగ
జిమ్మట రొదలు గాసిల యుస్సురనుటగా
నలరు నెమలి కూఁత లార్పులుగను
తే.గీ. గడిఁది వేలుపు రాచ దాపుడు పురువులు
రాలు రవణంపు నునుఁ గెంపుఱాలు గాఁగ
నేల ప్రోయాలు దన ముద్దు చూలిఁ దలఁచి
తెఱపి గనరాని వంతలఁ గొఱలి యొఱలె 66

గాటంపు = దట్టమైన, వలి నాలి గాడ్పులు = చల్లని మంచు గాలులు, ఊర్పులు = నిట్టూర్పులు, కాగన్ = అవగా, నిండారు = నిండుగా ప్రవహించు, వఱద = వరదనీరు, కన్నీరు కాగన్ = కన్నీరు కాగా, కొమరు ఒందు = అందమైన, తెలి నుర్వు = తెల్లనైన నురుగు, ఉమియు కళ్ళెలు కాగన్, నెఱ = నిండైన, అసల్ = బురద, జీరాడు నెఱులు కాగా = వ్రేలాడుచున్న వెంట్రుకలు కాగా, మొగలి పూపొదలు = మొగలిపూల పొదలు, మోమునన్ చేర్చు = ముఖముపై చేర్చుకునే, చీర కాన్ = చీర కాగా, పూరి మోసులు = గడ్డి పరకలు, గగుర్పొడుపు కాగ = పులకరింతలు కాగా, చిమ్మట రొదలు = ఈలపురుగు ధ్వనులు, గాసిలన్ = అలసిపోవుటచే, ఉస్సురు అనుట కాన్ = ఉస్సురని ధ్వనిచేయుట కాగా, అలరు = ఒప్పుచున్న, నెమలి కూతలు = నెమలి కూసే కూతలు, ఆర్పులుగను = అరుపులు కాగా, కడిది = అధికమైన, వేలుపు రాచ దాపుడు పురువులు = ఇంద్రగోప పురుగులు, రాలు = రాలిపోవుచున్న, రవణంపు = భూషణములందలి, నును = కాంతికల, కెంపుఱాలు కాగ = కెంపురాళ్ళు కాగా, నేల ప్రోయాలు = భూదేవి, తన ముద్దుచూలిన్ = తన ముద్దుబిడ్డను, తలచి = తలచుకొని, తెఱపి కనరాని = ఊరట కన్పింపని, వంతలన్ = బాధలను, కొఱలి = పొంది, ఒరలెన్ = విలపించెను.

**తా :** దట్టమైన మంచుగాలులు నిట్టూర్పులవగా, నిండుగా ప్రవహించు వరదనీరు కన్నీరుకాగా, తెల్లని నురుగు ఉమియు కళ్ళెలుకాగా, బురద వ్రేలాడు వెంట్రుకలుకాగా, మొగలి పొదలు ముఖమున చేర్చు చీరకొంగుకాగా, గడ్డిపరకలు పులకరింతలుకాగా, ఈలపురుగు ధ్వనులు అలసటతో ఉస్సురను ధ్వనికాగా, నెమలి కూతలు అరుపులుకాగా, మెఱుగుడు పురుగులు రాలుతున్న ఆభరణములందలి కెంపు రాళ్ళుకాగా భూదేవి తన ముద్దుబిడ్డను తలచుకొని ఊరటలేని బాధలను పొంది విలపించెను.

సీ. చిలువ దిండులకుఁ జెచ్చెర నాటతమి మీఱె
వానకోయిలల నీర్వట్టు దీఱెఁ
దెఱువరి గములపై మరుఁడు గైదువ నూఱెఁ
బొరిఁబొరి నేఱులు పొఱలి పాఱె

**నడవులలో నెల్ల గడితంపుఁ జిచ్చారె**
**మీఁదటి డిగ్గియ ల్మిగుల నూరెఁ**
**గొదగొని రాయంచ పదువు నింగికిఁ బాఱె**
**మొల్లంపు టెండలు పెల్లు దీఱెఁ**

**తే.గీ. గాఱు దుంతలు వంతల కడకుఁ బాఱె**
**గ్రుడ్లఁ బెట్టుక పులుఁగులు గూండ్ల దూఱెఁ**
**బేద గేస్తుల కొంపలు బిట్టు కాఱె**
**బజల వెట్టలు వడి నింకబారె నపుడు** **67**

అపుడు = అప్పుడు, చిలువ తిండులకున్ = పాములు ఆహారముగా కల నెమళ్ళకు, చెచ్చెర = వెంటనే, ఆటతమి మీఱెన్ = నాట్యమునందు ఆసక్తి పెరిగెను, వానకోయిలల = చాతక పక్షుల, నీరు పట్టు = దప్పికలు, తీఱెన్ = తీరెను, తెఱువరి గములపైన్ = బాటసారుల గుంపుపై, మరుదు = మన్మథుడు, కైదువ నూఱెన్ = తన ఆయుధమునకు పదును పెట్టెను, పొరి పొరిన్ = పొర్లి పొర్లి, ఏఱులు = నదులు, పొఱలి పాఱె = పొంగి ప్రవహించెను, అడవులలోన్ ఎల్లన్ = అడవులన్నిటి లోను, గడితంపున్ = బలమైన, చిచ్చు = దావాగ్ని, ఆఱె = ఆరెను, మీదటి = భూమిపైనున్న, డిగ్గియల్ = దిగుడు బావులు, మిగులన్ ఊరెన్ = బాగుగా ఊటలూరెను, కొదగొని = గుంపులుకట్టి, రాయంచ పదువు = రాజహంసల సమూహము, నింగికిన్ పాఱె = ఆకాశమునకు పరుగులెత్తెను, మొల్లంపు = అధికమైన, ఎండలు = గ్రీష్మముయొక్క, పెల్లు = ఆధిక్యము, తీఱెన్ = తీరిపోయెను, కాఱు = నల్లనైన, దుంతలు = దున్నపోతులు, వంతల కడకున్ పాఱె = నదుల చెంతకు పరుగులెత్తెను, గ్రుడ్లన్ పెట్టుక పులుగులు = గ్రుడ్లను పెట్టుకొని పక్షులు, గూండ్ల దూఱెన్ = గూళ్ళలో దూరి ఉండిపోయెను, పేద గేస్తుల కొంపలు = బీదవారైన గృహస్థులయొక్క పూరిపాకలు, బిట్టు = అధికముగా, కాఱెన్ = వర్షమునీరు కారెను, పజల = ప్రజలయొక్క, వెట్టలు = తాపములు, వడిన్ = శీఘ్రముగా, ఇంకబారెన్ = తొలగిపోయినవి.

**తా :** అప్పుడు నెమళ్ళకు నాట్యమునందు ఆసక్తి పెరిగెను. చాతకపక్షుల దప్పిక తీరెను. బాటసారులపై మన్మథుడు తన ఆయుధమును పదును పెట్టెను. నదులు పొర్లి పొర్లి ప్రవహించెను. అడవులలో దావాగ్ని ఆరెను. దిగుడుబావులు బాగుగా ఊటలూరెను. రాజహంసలు ఆకాశమున గుంపులుకట్టి పరుగులెత్తెను. ఎండల ఆధిక్యము తీరిపోయెను. దున్నపోతులు నదుల చెంతకు పరుగులెత్తెను. గ్రుడ్లను పెట్టి పక్షులు గూళ్ళలో ఉండి పోయెను. పేదల పూరిపాకలు బాగా వర్షపునీరు కారెను. ప్రజల తాపములు తీరిపోయినవి.

**తే.గీ. అంత నవ్వాన తరువాతి యదను దోఁపఁ**
**బంట పూఁబోఁడి తన ముద్దుపట్టి కొఱకుఁ**
**బలు వగలఁ గుంద మేనెల్లఁ బచ్చవాఱె**
**ననఁగ బరవంపుఁ బైరులు గొనబు మీఱె** **68**

అంతన్, ఆ వాన = ఆ వర్ష ఋతువు, తరువాతి = తరువాత వచ్చెడు, అదను = కాలమునకు (శరదృతువు), తోపన్ = ప్రవేశించగా, పంట పూబోడి = భూదేవి, తన ముద్దుపట్టి కొఱకు = తన ముద్దుల కూతురుకోసం, పలు వగలన్ కుందన్ = పలురకములైన వేదనలతో బాధనందగా, మేను ఎల్లన్ = శరీరమంతయు, పచ్చ బాఱె = పచ్చపడెను, అనగన్ = అనునట్లుగా, పరువంపు = సరియైన కాలమునందలి, పైరులు = సస్యములు, గొనబు మీఱెన్ = మనోజ్ఞత్వముతో అతిశయించెను.

**తా :** అంతట ఆ వర్షఋతువు తర్వాత వచ్చెడు అదను ప్రవేశించగా భూదేవి తన ముద్దులపట్టికోసం పలురకాల వేదనలతో బాధపడుచుండగా శరీరమంతా పచ్చబడెను అన్నట్లుగా పరువంపు పైరులు మనోజ్ఞముగా నుండెను.

**సీ.** **కప్పుకుత్తుక పుల్గుగముల పెల్లు దొలంగెఁ**
**దెలిమొగుల్ సదల నేడ్తెరఁ జెలంగెఁ**
**గొలఁకులఁ దామరల్గలువలు నలరారె**
**గిబ్బపోతులు దద్ద యుబ్బి పాఱె**
**నలువ బాబా పిండు నులివు లెంతయు హెచ్చెఁ**
**బొలము పొంతల ఱెల్లు పూయఁజొచ్చె**
**బొదలెల్ల గార్కొని పొరిఁబొరిఁ బచరించెఁ**
**బ్రాల్నిగ్గు వరిచేలఁ బసలు మించె**

**తే.గీ.** **రొంపు లెడవాసె నేఱుల పెంపుఁ దీసె**
**జగము లుప్పొంగె రేలెల్ల మిగులఁ దేట**
**వెన్నెలలు గాసెఁ గన్నుల విల్తునయ్య**
**నిదుర మేల్కాంచెఁ గడలి నయ్యదనునందు** **69**

కప్పు కుత్తుక పుల్గుగముల = నీల కంఠముకల నెమిళ్ళయొక్క, పెల్లు = గొప్పతనము, తొలంగెన్ = తొలగిపోయెను, తెలి మొగుల్ = తెల్లని మేఘములు, చదలన్ = ఆకాశమునందు, ఏడ్తెరన్ = అతిశయముగా, చెలంగెన్ = ఒప్పెను, కొలకులన్ = చెఱువులందు, తామరల్ కలువలు = పద్మములు, కలువపూవులు, అలరారెన్ = చక్కగా పూచెను, గిబ్బపోతులు = వృషభములు, తద్ద = మిక్కిలిగా, ఉబ్బి = పొంగి, పాఱెన్ = పరువులు పెట్టెను, నలువబాబా పిండున్ = బ్రహ్మ దేవుని వాహనములైన హంసల గుంపుల, ఉలివులు = గమనములు, హెచ్చెన్ = అధికమైనవి, పొలము పొంతలన్ = చేల సమీపమున, ఱెల్లు = ఱెల్లు దుబ్బు, పూయఁజొచ్చె = పూయ సాగెను, పొదలు ఎల్లన్ = పొదలన్నియు, కార్కొని = పచ్చబడి, పొరిపొరిన్ = మిక్కిలిగా, పచరించె = వ్యాపించెను, ప్రాలు నిగ్గు వరి చేలన్ = కంకిపట్టుచున్న వరి చేలలో, పసలు మించె = శోభలు అతిశయిల్లెను, రొంపులు ఎడవాసెన్ = బురదలు ఎండిపోయెను, ఏఱుల పెంపు తీసె = నదుల పొంగుట తగ్గెను, జగములు ఉప్పొంగె = లోకములు ఆనందపడెను, రేలు ఎల్ల = రాత్రులన్నియు, మిగులన్ = మిక్కిలిగా, తేట వెన్నెలలు = స్వచ్ఛమైన వెన్నెలలను, కాసెన్ = కాసినవి, కన్నుల విల్తుని

అయ్య = మన్మథుని తండ్రి విష్ణువు, కడలిన్ = సముద్రమున, ఆ అదనునందు = ఆ సమయమున, నిద్ర మేల్కాంచెన్ = యోగనిద్రనుండి లేచెను.(కార్తీక శుద్ధ ఏకాదశి దాటింది)

**తా :** నెమళ్ళ గొప్పతనము తొలగిపోయెను. తెల్లని మేఘములు ఆకాశమున వ్యాపించెను. చెరువులందు తామరలు, కలువలు పూచెను. వృషభములు పొంగి పరుగులెత్తెను. హంసల గమనములు అధికమైనవి. చేల సమీపమున తెల్లు దుబ్బు పూయసాగెను. పొదలన్నీ నల్లబడి అందముగా నొప్పెను. వరిచేల శోభలు అతిశయించెను. బురదలు ఎండిపోయెను. నదులు పొంగుట తగ్గెను. లోకములు ఆనందపడెను. రాత్రులన్నియు స్వచ్ఛమైన వెన్నెలలు కాసెను. విష్ణువు పాలసంద్రమున యోగనిద్రనుండి లేచెను.

**తే.గీ.** **ముగుద నెడఁబాసి వంతలఁ బొగులుచున్న**
**రాగవుని మీఁద దండెత్త సాగె ననుచుఁ**
**జిలుక తుటుములఁ దోల జొచ్చిరి చెలంగి**
**పొలము కాపరి కాపులేఁ దలిరుఁబోండ్లు** **70**

ముగుదన్ = సీతను, ఎడన్ పాసి = దూరము చేసుకొని, వంతలన్ బొగులుచున్న = బాధలతో రగిలిపోవుచున్న, రాగవుని మీద = రాముని మీద, దండెత్త సాగెను అనుచున్, పొలము కాపరి = చేలకు కాపు కాయుచున్న, కాపు లేత తలిరుబోండ్లు = రైతు యువతులైన కాంతలు, చెలంగి, జిలుక తుటుములన్ = చిలుకల సమూహములను, తోలన్ చొచ్చిరి = తోలుటకు ప్రారంభించిరి.

**తా :** సీతను దూరము చేసుకొని బాధలతో రగిలిపోతున్న రామునిమీద దండెత్తసాగెనని పొలము కాపరి కాపు కాంతలు చెలరేగి చిలుకలను తోలసాగిరి.

**తే.గీ.** **అపుడు కోఁతుల ఱేఁడు వాయని కడంక**
**నారెకుల చేత వడిఁ గమ్మ లనిచి యెల్ల**
**కోన త్రిమ్మరి మూఁకలఁ గూడఁ బెట్టి**
**రీవి మెఱయంగ బూర వట్టించి తరలి** **71**

అపుడు = అప్పుడు, కోతులఱేడు = సుగ్రీవుడు, పాయని కడంకన్ = వదలని పూనికతో, ఆరెకులచేత = వార్తాహరులచేత, వడిన్ = వెంటనే, కమ్మలు అనిచి = లేఖలను పంపి, ఎల్ల కోన త్రిమ్మరి మూకలన్ = అన్ని అడవులలోని కోతిమూకలను, కూడన్ పెట్టి = సమీకరించి, రీవి మెఱయంగన్ = గొప్ప రీవితో, బూర పట్టించి = సమరశంఖము పూరించి, తరలి = బయలుదేరి,

**తా :** అప్పుడు సుగ్రీవుడు వదలని పూనికతో వార్తాహరులచేత వెంటనే లేఖలను పంపి అన్ని అడవులలోని కోతిమూకలను సమీకరించి గొప్ప రీవితో సమరశంఖమును పూరించి బయలుదేరి.

**కం.** **అతిమితి నప్పొట్లెము దను**
**గితికొని కొలువంగ నరిగి కెరలెడు బత్తిన్**
**మొతియుచు నడుగుల కెరఁగిన**
**నఱకడఁ బెట్టుకొని రాముఁ డాతని కనియెన్** **72**

ఆ పొట్లెము = ఆ వానర సమూహము, తనున్ = తనను, గిఱికొని కొలువంగన్ = చుట్టుకొని సేవించుచుండగా, అఱిముఱిన్ = సంభ్రమముతో, అరిగి = వెళ్ళి, కెరలెడు బత్తిన్ = అతిశయించు భక్తితో, ముఱియుచున్ = సంబరపడుచూ, అడుగులకు = రాముని పాదములకు, ఎరగినన్ = నమస్కరింపగా, అఱకడన్ పెట్టుకొని = పొదివికొని, రాముడు ఆతనికి, అనియెన్ = అనెను.

**తా :** ఆ వానర సమూహము తనను సేవించుచుండగా వెళ్ళి మిక్కిలి భక్తితో సంబరపడుతూ రాముని పాదములకు నమస్కరింపగా రాముడు పొదివికొని అతనితో అనెను.

**ఆ.వె.** **జగము విందుకంద! జాగేమిటికిఁ గ్రొమ్మె**
**ఱుంగుఁబోడి నింక రోయు కొఱకు**
**దంటలైన పోటు బంటులఁ గొందఱి**
**నేర్చి పనిచి జాడ లెఱుఁగ వలయు** **73**

జగము విందు కంద = లోకములకు విందొనరించువాని (సూర్యుడు) కొడుకు (సుగ్రీవుడు), జాగు ఏమిటికిన్ = ఆలస్యము ఎందులకు?, ఇంక = ఇపుడు, క్రొమ్మెఱుంగు పోడిన్ = సీతను, రోయు కొఱకు = వెదకుటకై, దంటలైన పోటు బంటులన్ = సమర్థులైన వీర భటులను, కొందఱిన్ ఏర్చి = కొందరిని ఏరి, పనిచి = పంపి, జాడలు = సీత ఉన్న జాడలను, ఎఱుగవలయు = తెలుసుకోవాలి.

**తా :** సుగ్రీవా! ఆలస్యమెందుకు? ఇపుడు సీతను వెదకుటకై సమర్థులైన బంటులను కొందరిని ఏరి పంపి సీతవున్న జాడలను తెలుసుకోవాలి.

**తే.గీ.** **తెఱవ యున్నట్టి తెఱఁగెల్లఁ దెలిసి పిదప**
**దురము గావింపఁ బగఱపై నరుగవలయు**
**ననిన వల్లె యనుచు నాతఁ డక్కడింది**
**మగనిఁ గనుగొని యింపొంద మరల ననియె** **74**

తెఱవు ఉన్నట్టి = సీత ఉన్నటువంటి, తెఱగు ఎల్లన్ = మార్గము నంతను, తెలిసి = తెలుసుకొని, పిదప, దురము కావింపన్ = యుద్ధము చేయుటకు, పగఱపైన్ = శత్రువుల మీదకు, అరుగవలయున్ = వెళ్ళాలి, అనినిన్ = అనగా, వల్లె అనుచు = సరే అని, ఆతడు = ఆ సుగ్రీవుడు, ఆ కడింది మగనిన్ = ఆ శూరుని, కనుగొని = చూచి, ఇంపు ఒందన్ = ఇష్టమగు రీతిగా, మరలన్ అనియెన్.

**తా :** సీతవున్న తెఱగంతను తెలుసుకొని తరువాత యుద్ధము కావించుటకు శత్రువుల మీదకు వెళ్ళాలి అనగా సరే అని ఆ సుగ్రీవుడు ఆ శూరునితో ఇంపుగా ఇట్లు పలికెను.

**కం.** **ఱేఁడులరాయడ! విను మి**
**వ్వాఁడి మగల్ గయ్యమునకు వచ్చినచో న**
**వ్వేఁడిమి కన్దొర నైనన్**
**బోఁడిమితో గెలుచుటకును బోలుదురు సుమీ!** **75**

ఱేడులరాయడ = రాజశేఖరా!, వినుము = విను, ఈ వాడి మగల్ = ఈ శూరులైన వీరులు, కయ్యమునకు వచ్చినచోన్ = యుద్ధమునకు సిద్ధపడినచో, ఆ వేడిమి కన్ దొరను ఐనన్ = ఆ

అగ్ని నేత్రముగా కల శివునినైనను, పోడిమితోన్ = పరాక్రమముతో, గెలుచుటకును పోలుదురు సుమీ = జయించుటకు సమర్థులౌతారు సుమా!

**తా :** రాజశేఖరా! విను, ఈ శూరులైన వీరులు కయ్యమునకు సిద్ధపడినచో ఆ ఫాలనేత్రుడైన శివునినైనను పరాక్రమముతో గెలుచుటకు సమర్థులౌదురుసుమా!

**తే.గీ.** **పుడమి వీరికిఁ జొరరాని యెడలు లేవు**
**మీఁటి నిక్కపు జగమైనఁ దూఁటి వాలు**
**గంటి చందంబుఁ దెలిసి రాఁగలరు మీరు**
**సెలవొసంగిన నంచుఁ జెచ్చెర నతండు** **76**

మీరు సెలవు ఒసంగినన్ = మీరు అనుజ్ఞ నిచ్చినచో, పుడమిన్ = భూమండలమున, వీరికిన్ = వీరికి, చొరరాని ఎడలు లేవు = ప్రవేశించలేని స్థలములు లేవు, మీఁటి = అంతేగాక, నిక్కపు జగము ఐనన్ = సత్యలోకమునైనను, దూఁటి = ప్రవేశించి, వాలు కంటి చందంబు = సీత విషయమును, తెలిసి రాగలరు = తెలుసుకొని తిరిగి రాగలరు, అంచున్ = అనుచు, అతండు = ఆ సుగ్రీవుడు, చెర చెరన్ = వెంట వెంటనే,

**తా :** 'మీరు సెలవొసంగిన భూమండలమున వీరికి చొరరాని స్థలములు లేవు. అంతేగాక సత్య లోకమునైనను దూఁటి సీత విషయమును తెలుసుకొని రాగలరు' అని సుగ్రీవుడు వెంటవెంటనే –

**సీ.** **కరువలి కొమరుఁ డంగదుఁడు గవాక్షుండు**
**నలుఁడు నీలుఁడు శతవలి గజుండు**
**గవయుఁడు మైందుఁడు గంధమాదనుఁడు ధూ**
**మ్రుండును బావకాక్షుండు వాల**
**పాశుండు తారుండు పనసుండు వేగద**
**ర్శియు వినతుఁడుఁ గేసరియు సుషేణుఁ**
**డెలుఁగుల యెకిమీఁడు వృషభుండు గిరిభేద**
**నుఁడు కుముదుఁడు కరభుఁడును మొదలు**

**తే.గీ.** **గలుగు నాడెఁపు మొనగాండ్రఁ గదియఁ బిలిచి**
**కడఁకతో మీర లేఁగి యిప్పుడమి నెల్ల**
**కడల గుట్టలఁ బ్రోళ్ళఁ గాఱడవులందు**
**దీవులందునుఁ జెలి జాడఁ దెలిసి రండు** **77**

కరువలి కొమరుడు = వాయువు కొడుకు హనుమంతుడు, అంగదుడు, గవాక్షుడు, నలుడు, నీలుడు, శతవలి, గజుడు, గవయుడు, మైందుడు, గంధమాదనుడు, ధూమ్రుడు, పావకాక్షుడు, వాలపాశుడు, తారుడు, పనసుడు, వేగదర్శి, వినతుడు, కేసరి, సుషేణుడు, ఎలుగుల ఎకిమీడు = ఎలుగు జాతి నాయకుడు జాంబవంతుడు, వృషభుడు, గిరిభేదనుడు, కుముదుడు, కరభుడు,

మొదలు కలుగు = మొదలైన, నాడెపు మొనగాండ్రన్ = శ్రేష్ఠమైన వీరులు, కదియన్ పిలిచి = చేర పిలిచి, కడకతో = పట్టుదలతో, మీరలు ఏగి = మీరు వెళ్ళి, ఈ పుడమిన్ = ఈ భూమండలమున, ఎల్లన్ కడలన్ = అన్ని చోట్ల, గుట్టలన్ = కొండలను, ప్రోళ్ళన్ = నగరములను, కాఱడవులందున్ = కీకారణ్యములందును, దీవులందును = ద్వీపములందును, చెలి జాడన్ = సీత జాడను, తెలిసి రండు = తెలిసికొని రండి.

**తా :** హనుమ, అంగదుడు, గవాక్షుడు, నలుడు, నీలుడు, శతవలి, గజుడు, గవయుడు, మైందుడు, గంధమాదనుడు, ధూమ్రుడు, పావకాక్షుడు, వాలపాశుడు, తారుడు, పనసుడు, వేగదర్శి, వినతుడు, కేసరి, సుషేణుడు, జాంబవంతుడు, వృషభుడు, గిరిభేదనుడు, కుముదుడు, కరభుడు మొదలైన మొనగాండ్రను చేరపిలిచి పూని మీరు వెళ్ళి ఈ భూమండలమున అన్నిచోట్ల కొండలు, నగరములు, కాఱడవులు, దీవులు అంతటా వెదకి సీత జాడను తెలిసికొని రండి.

**కం.** **మీ మీ లావులు నెఱపుచు**
**వేమఱుఁ జొరరాని చోట్ల వెదకి కడంకన్**
**జామ తెఱఁగరసి గొబ్బున**
**సేమంబున రండటంచు సెలవొనరించెన్** **78**

మీమీ లావులు నెరపుచు = మీమీ శక్తులను ఉపయోగించి, చొరరానిచోట్లన్ = ప్రవేశింప శక్యముకాని ప్రదేశములైనను, వేమరున్ = మళ్ళీమళ్ళీ, కడంకన్ వెదకి = పట్టుదలతో వెదకి, చామ తెఱగు అరసి = సీత విషయము తెలుసుకొని, గొబ్బున = శీఘ్రముగా, సేమంబున = క్షేమముగా, రండి అటంచున్ = రమ్మని, సెలవు ఒనరించెన్ = ఆజ్ఞాపించెను.

**తా :** మీమీ శక్తులనుపయోగించి చొరరానిచోట్లను మళ్ళీమళ్ళీ వెదకి సీత విషయము తెలుసుకొని శీఘ్రముగా, క్షేమముగా రండి అని ఆజ్ఞాపించెను

**ఆ.వె.** **అపుడు రాచూలి జింకవార్వపు వజీరు**
**గారవపుఁబట్టి నొయ్యనఁ జేరఁ బిలిచి**
**వ్రేలి యుంగర మొసఁగి కూరిమి దలిర్ప**
**నవ్వలంతినిఁ జూచి యిట్లనుచుఁ బలికె** **79**

అపుడు, రాచూలి = రాముడు, జింకవార్వపు వజీరు = జింక వాహనముగాకల యోధుడు వాయువు, గారవపు పట్టి = ప్రియమగు కుమారుని (ఆంజనేయుని), ఒయ్యనన్ = ప్రేమగా, చేరన్ పిలిచి = దగ్గరకు పిలిచి, వ్రేలి ఉంగరము ఒసగి = చేతికున్న ఉంగరమునిచ్చి, కూరిమి తలిర్పన్ = ప్రేమ కనబడునట్లుగా, ఆ వలంతిన్ = ఆ సమర్థుని, చూచి, ఇట్లు అనుచు, పలికె = పలికెను.

**తా :** అప్పుడు రాముడు ఆంజనేయుని చేర పిలిచి వ్రేలి ఉంగరము ఒసగి ప్రేమగా ఆతని చూచి అనెను.

**కం.** **క్రోతి తొగవింద! మాకుం**
**బ్రాంతిగ దొరకిన యనుంగు బంటువగుట నీ**

**లోఁతెఱిఁగి యుంగరం బా**
**గోఁతికి నిమ్మనుచుఁ గోరుకొంటిమి నిన్నున్** **80**

క్రోతి తొగవింద = వానరవంశ చంద్రుడా! మాకున్ ప్రాతిగాన్ = మాకు విశ్వసనీయుడుగా, దొరకిన = దొరకినట్టి, అనుంగు బంటువు అగుటన్ = ప్రియమైన సేవకుడవగుటచే, నీ లోతు ఎఱిగి = నీ సామర్థ్యము తెలిసి, ఉంగరంబు, ఆ గోతికి = ఆ కాంతకు (సీతకు), ఇమ్ము అనుచున్ = ఇమ్మని, నిన్నున్ కోరుకొంటిమి = నిన్ను అడుగుచుంటిమి.

**తా :** 'వానరవంశ చంద్రుడా! మాకు విశ్వసనీయుడుగా దొరకినట్టి అనుంగు బంటువు అగుటచే నీ సామర్థ్యమును ఎఱిగి ఉంగరము ఆ కాంతకు ఇమ్మని నిన్ను అడుగుచుంటిమి.

**కం.** **ఓడక లంకకుఁ జని య**
**వ్వీ డెల్లను వెదకి యందు వెలఁదుకఁ గని యి**
**న్నాడెంపు రవణ మిడి యా**
**చేడియ తలమానికంబుఁ జేకొని రమ్మా!** **81**

ఓడక = వెనుకంజవేయక, లంకకు చని = లంకకు వెళ్ళి, ఆ వీడెల్లను = ఆ నగరము నంతను, వెదకి = పరిశోధించి, అందు వెలదుక కని = అక్కడ సీతను చూచి, ఈ నాడెంపు రవణము = ఈ విశేషమైన ఆభరణమును, ఇడి = ఇచ్చి, ఆ చేడియ తల మానికంబున్ = ఆ సీతయొక్క శిరోరత్నమును, చేకొని రమ్మా = తీసుకొని రమ్ము.

**తా :** వెనుకంజవేయక లంకకు వెళ్ళి ఆ నగరమునంతను వెదకి అక్కడ సీతను చూచి ఈ ఉంగరము ఇచ్చి ఆ సీత శిరోరత్నమును తీసుకొని రమ్ము'.

**చం.** **అనవుడు నాతఁ డుక్కుఁ దనరారఁగ నిట్లను నేలతాల్ప! యి**
**ప్పనిఁ దలఁ బూని రక్కసుని బాళెము వాలెముఁ జొచ్చి చేడియం**
**గనుఁగొని యుంగరం బొసఁగి క్రన్నన నౌదల మానికంబుఁ గై**
**కొని పఱతెంతు వెండియును, గోఁతి దొరల్గని సంతసిల్లఁగన్** **82**

అనవుడున్ = తరువాత, ఆతడు = ఆ హనుమంతుడు, ఉక్కు తనరారగన్ = శౌర్యము ప్రకటించుకొనుచు, ఇట్లు అను = ఇలా పలికెను, నేలతాల్ప = రాజా!, ఈ పనిన్, తలన్ పూని = శిరసావహించి, రక్కసుని పాళెము = లంకను, వాలెమున్ = తప్పకుండా, చొచ్చి = ప్రవేశించి, చేడియం కనుంగొని = సీతను చూచి, ఉంగరంబు ఒసంగి, క్రన్ననన్ = వెంటనే, ఔదల మానికంబున్ = శిరోరత్నమును, కైకొని = తీసుకొని, వెండియును = తిరిగి, కోతి దొరలన్ కని = వానర నాయకులను పొంది, సంతసిల్లగన్ = వారు సంతోషపడగా, పరతెంతున్ = వత్తును.

**తా :** తరువాత ఆ హనుమ శౌర్యముతో ఇట్లు పలికెను 'రాజా! ఈ పనిని శిరసావహించి లంకను తప్పకుండా ప్రవేశించి సీతను చూచి ఉంగరమును ఇచ్చి వెంటనే శిరోరత్నమును తీసుకొని తిరిగి వానర నాయకులతో సంతోషంగా వస్తాను.

**చం. తెఱవను జూపకున్నఁ దొలిదేవర ప్రేవులు ప్రోవులై పడన్**
**బెఱికెద నౌదలల్ దలఁగ బెట్టెద జుట్టులు పట్టి నేలపై**
**జిఱ జిఱఁ ద్రిప్పికొట్టి మెయి జిప్పిలి నెత్తురులుబ్బి పొఱఁగా**
**జఱజఱ నీడ్చి వైచెద నెసంగ దొసంగుల నెల్ల ముంచెదన్ 83**

తెఱవను చూపక ఉన్నన్ = సీతను చూపించకున్నచో, తొలి దేవర ప్రేవులు = రావణుని ప్రేగులు, ప్రోవులై పడన్ = కుప్పలుగా పడేలా, పెఱికెదన్ = పెకలించెదను, ఔదలల్ = తలలను, తలగ పెట్టెదన్ = తొలగించెదను, జుట్టులు పట్టి = జుట్టు పట్టుకొని, జిఱజిఱన్ = గిరగిరా, త్రిప్పి నేలపైన్ కొట్టి = తిప్పి నేలనేసి కొట్టి, మెయిన్ = శరీరమునుండి, నెత్తురులు, చిప్పిలి = చిమ్ముచు, ఉబ్బి పొఱగా = పొంగి ప్రవహించగా, జఱజఱన్ ఈడ్చివైచెదన్ = జరజరా ఈడ్చేస్తాను, ఎసంగన్ = ఒప్పునట్లుగా, దొసంగులను ఎల్లన్ = అన్ని కష్టాలలోను, ముంచెదన్ = వానిని ముంచేస్తాను.

**తా :** సీతను చూపించకున్నచో రావణుని ప్రేగులు కుప్పలుగా పడేలా పెకలించెదను. తలలను తొలగించెదను. జుట్టుపట్టుకుని గిరగిరా తిప్పి నేలనేసి కొట్టి శరీరమునుండి రక్తము చిమ్ముచు పొంగి ప్రవహించగా జరజరా ఈడ్చేస్తాను. చక్కగా అన్ని కష్టాలలోను వానిని ముంచెదను.

**చం. తొవలయనుంగుఁ బ్రొద్దు నొక తూఁకున మ్రింగుదు, వేల్పు మూఁకలం**
**దవిలి కలంతు నజ్జముని దామరచూలినిఁ గ్రొవ్వడంతుఁ దేఁ**
**కువ మెఱయంగ రక్కసుల గుండియ లెల్లను జింతు నేలయుం**
**దివియును వ్రక్కలింతుఁగద! దేవర యానతి యింత గల్గినన్ 84**

దేవర ఆనతి ఇంత కల్గినన్ = ప్రభువు ఆజ్ఞ కొంచెం లభిస్తే, తొవల అనుంగున్ = కలువల మిత్రుడగు చంద్రుని, ప్రొద్దున్ = సూర్యుని, ఒక తూకున = ఒక్కసారిగా, మ్రింగుదు = మింగెదను, వేల్పు మూకలన్ = దేవతల సమూహములను, తవిలి = వెంటాడి, కలంతున్ = బాధించెదను, ఆ జముని = ఆ యముని, తామరచూలిని = బ్రహ్మను, క్రొవ్వు అడంతున్ = గర్వమును అణచివేస్తాను, తేకువ మెఱయంగన్ = సాహసము ప్రకటింపబడునట్లుగా, రక్కసుల గుండియలు ఎల్లను = రాక్షసుల గుండెలన్నిటిని, చింతు = చింపివేసెదను, నేలయుం దివియును = భూమిని ఆకాశమును, వ్రక్కలింతు కద = బ్రద్దలు కొట్టేస్తానుకదా!

**తా :** దేవర ఆనతి ఇంత కల్గిన చంద్రుని, సూర్యుని ఒక్కసారిగా మ్రింగెదను. దేవతల సమూహము లను వెంటాడి బాధించెదను. ఆ యముని, బ్రహ్మను గర్వమును అణచివేసెదను. సాహసముతో రాక్షసుల గుండెలన్నిటిని చింపివేసెదను. భూమిని, ఆకాశాన్ని బ్రద్దలు కొట్టేస్తానుకదా!

**కం. రాకలువ తేఁడ! గట్టిగ**
**మీ కడకు జగంబు లెల్ల మేలిమి పొగడన్**
**రాకాసుల దొరఁ దెచ్చెదఁ**
**గాకుండిన లంక వెఱికి గడువడిఁ దెత్తున్ 85**

రా కలువ ఱేడ = ఓ రాజచంద్రమా!, జగంబులు ఎల్ల పొగడన్ = లోకాలన్ని స్తుతింపగా, రాకాసుల దొరన్ = రావణుని, గట్టిగ = తప్పకుండా, మీ కడకు = మీ దగ్గరకు దెచ్చెదన్, కాకుండినన్ = కుదరనిచో, లంక పెఱికి = లంకను పెల్లగించి, కడువడిన్ = శీఘ్రముగా, తెత్తున్.

**తా :** ఓ రాజచంద్రమా! లోకాలన్నీ స్తుతింపగా రావణుని తప్పకుండా మీ దగ్గరికి తీసుకువస్తాను, కుదరనిచో లంకను పెల్లగించి శీఘ్రముగా తెచ్చెదను'.

**తే.గీ.** **అనిన సంతసిల్లి యద్దొర యెంతయు**
**గారవించి యనుప గట్లసూడు**
**కొడుకు కొడుకుఁ బుట్ట కూడు మేపరి ఱేఁడు**
**దోడుగాఁగ నెలమితోడఁ జనియె** **86**

అనినన్ = అనగా, సంతసిల్లి = సంతోషించి, ఆ దొర = ఆ రాముడు, ఎంతయు గారవించి = ఎంతగానో మర్యాద ఇచ్చి, అనుప = పంపగా, గట్లసూడు కొడుకు కొడుకున్ = పర్వతముల శత్రువు (ఇంద్రుడు) కొడుకు వాలి, వాలి కొడుకు (అంగదుడు)ను, పుట్ట కూడు మేపరి ఱేడు = పుట్ట తేనెలు భక్షించు (ఎలుగుబంట్ల) నాయకుడు (జాంబవంతుడు), తోడు కాగన్ = కూడా రాగా, ఎలమితోడ చనియె = సంతోషముగ బయలుదేరెను.

**తా :** అనిన సంతోషించి ఆ రాముడు ఎంతగానో మర్యాద ఇచ్చి పంపగా అంగదుడును, జాంబవంతుడు తోడుకాగా సంతోషముగ బయలుదేరెను.

**కం.** **మిగిలిన చెట్టుం ద్రిమ్మరి**
**జగబంటులు నందు నందుఁ జని రటువలెనా**
**మొగిలు పగవాని కూనయు**
**నొగిఁ గొందఱఁగూడి యరుగుచుండెడు నెడలన్** **87**

మిగిలిన, చెట్టుం త్రిమ్మరి జగబంటులున్ = వానరయోధులును, అందున్ అందున్ = అక్కడక్కడకు, చనిరి = వెళ్ళిరి, అటువలెన్ = ఆ రీతిగా, ఆ మొగిలు పగవాని కూనయు = ఆ మేఘములకు శత్రువైన వాయుదేవుని పుత్రుడును (హనుమంతుడు), ఒగిన్ = క్రమముగా, కొందఱన్ కూడి = కొందరు వానరులతో కలిసి, అరుగుచుండెడు ఎడలన్ = వెదకుచు వెళ్ళుచున్న సమయమున,

**తా :** మిగిలిన వానరయోధులును అక్కడక్కడకు చనిరి. ఆ రీతిగా హనుమ క్రమముగా కొందరు వానరులతో కలిసి వెదకుచు వెళ్ళుచున్న సమయమున

**తే.గీ.** **అలర సంపాతి యనియెడు పులుఁగు రాయఁ**
**డొకఁడు బలు వేల్పు రామెట్టు నొద్ద వారిఁ**
**గాంచి యీరైదు మెడల రక్కసుని దీవి**
**కేరుపడఁ ద్రోవ యెఱిఁగించి యేఁగుటయును** **88**

అలరన్ = అలా వెదకుచుండగా, సంపాతి అనియెడు = సంపాతి అను పేరుకల, పులుగు రాయడు = పక్షిరాజు, ఒకడు, పలు వేల్పు రామెట్టున్ ఒద్ద = అనేకమంది దేవతలతో కూడియున్న గొప్ప

పర్వతము (వింధ్య పర్వతము) దగ్గర, వారిన్ కాంచి = వారిని చూసి, ఈరు ఐదు మెడల రక్కసుని దీవికి = పది కంఠములుకల రాక్షసుని దీవికి (లంకకు), త్రోవన్ = మార్గమును, ఏరుపడన్ = స్పష్టముగా, ఎఱిగించి = తెలిపి, ఏగుటయును = వెళ్ళిపోగా,

**తా :** అలా వెదకుచుండగా సంపాతి అను పేరుకల పక్షిరాజు ఒకడు వింధ్యపర్వతము దగ్గర వారిని చూసి లంకకు మార్గమును స్పష్టముగా తెలిపి వెళ్ళిపోగా –

**కం.** **అక్కొమ్మ మెకపు జోదులు**
**నిక్కుచు నక్కొండ యెక్కి విరి దేనియలం**
**జొక్కటపుఁ దీయ పండుల**
**జక్కర తెలినీళ్ళ నలుపు సడలించి తగన్** **89**

ఆ కొమ్మ మెకపు జోదులు = ఆ వానరవీరులు, నిక్కుచున్ = గర్వముతో, ఆ కొండ ఎక్కి = ఆ వింధ్యపర్వతమును ఎక్కి, విరి తేనియలన్ = పూల తేనెలను, చొక్కటపున్ = ముగ్గిన, తీయపండులన్ = తీయని పండ్లను, జక్కర తెలినీళ్ళన్ = నదిలోని స్వచ్ఛమైన నీటితోను, తగన్ = తగినరీతిగా, అలుపున్ = శ్రమను, సడలించి = పోగొట్టుకొని,

**తా :** ఆ వానరవీరులు నిక్కుచు ఆ కొండ ఎక్కి పూలతేనెలతోను, ముగ్గిన తీయని పండ్లతోను, నదిలోని స్వచ్ఛమైన నీటితోను శ్రమను పోగొట్టుకొని –

**తే.గీ.** **మ్రుచ్చుఁదనమున రాకొమ్మఁ దెచ్చినట్టి**
**యుఱియ రక్కసుఁ డిదె దాఁగి యున్నవాడు**
**రండనుచుఁ దమ్ము నెమ్మిఁ జేరంగఁ బిలుచు**
**కరణిఁ గడు మ్రోయు నీర్వామిఁ గాంచి రెదుట** **90**

మ్రుచ్చు తనమున = దొంగతనముగా, రాకొమ్మన్ = సీతను, తెచ్చినట్టి = తీసుకొనివచ్చి నటువంటి, ఉఱియ = దిట్టతనముకల, రక్కసుడు = రాక్షసుడు, ఇదె = ఇడిగో, దాగి ఉన్నవాడు = దాగికొని ఉన్నాడు, రండి అనుచు = రమ్మనుచూ, తమ్ము = తమను, నెమ్మిన్ = ప్రేమతో, చేరంగన్ పిలుచు కరణిన్ = చేరువకు పిలుచుచున్న విధముగా, ఎదుట = ఎదురుగా, కదు మ్రోయు = మిక్కిలి ధ్వనించుచున్న, నీరు వామిన్ = సముద్రమును, కాంచిరి = చూచిరి.

**తా :** దొంగతనముగా సీతను తీసుకొనివచ్చిన దిట్టతనముకల రాక్షసుడు ఇడిగో ఇక్కడ దాగి ఉన్నాడు రండి అని తమను ప్రీతితో చేరువకు పిలుచుచున్న విధముగా ఎదుట మ్రోయుచున్న సముద్రమును చూచిరి.

**ఆ.వె.** **కాంచి యబ్బురంబు గదుర నీ మున్నీరు**
**దాటి చనఁగ నేరి తరమటంచుఁ**
**గొంకు మీఱ గాడ్పు కొమరునిఁ గన్గొని**
**వలఁతి తనము వెలయఁ బలికి రపుడు** **91**

కాంచి = చూచి, అబ్బురంబు = ఆశ్చర్యము, కదురన్ = వ్యాపించగా, ఈ మున్నీరున్ = ఈ సముద్రమును, దాటి చనగన్ = దాటి వెళ్ళుటకు, ఏరి తరము అటంచున్ = ఎవరికి శక్యము అనుకొనుచు, కొంకు మీఱ = పెద్ద సందేహముతో, గాడ్పు కొమరునిన్ కన్గొని = వాయుపుత్రుని చూచి, వలతితనము వెలయన్ = నేర్పరితనము ప్రకటితమగునట్లుగా, అపుడు పలికిరి.

**తా :** చూచి ఆశ్చర్యపడుచూ ఈ సముద్రమును దాటి వెళ్ళుటకు ఎవరి తరము అనుకొనుచు సందేహముతో హనుమను చూచి నేర్పుగా అప్పుడు పలికిరి.

**కం.** **విను మనుమడ! మా నుడువులు**
**విను మనువు దలిర్ప నీవు వేఱొండు తలం**
**పున నుండిన నీ రతనపు**
**గని యిందిఁక నొరుఁడు దాఁటఁగలఁడే చెపుమా! 92**

విను మనుమడ = ఆకాశము కొడుకు గాలి, గాలి కొడుకు హనుమా!, మా నుడువులు = మా మాటలను, వినుము, అనువు తలిర్ప నీవు = ఎదురీదగల నీవు, వేఱు ఒందు తలంపునన్ ఉండినన్ = వేరొక ఆలోచనలో ఉన్నట్లైతే, ఈ రతనంపు గని = ఈ సముద్రమును, ఇందు = ఇక్కడ ఉన్న వారిలో, ఇక ఒరుడు = ఇంకొకడు, దాట కలడే = దాటకలడా, చెపుమా.

**తా :** ఓ హనుమా! మా మాటలు విను. ఆకాశాన్ని ఎదురీదగల నువ్వే వేరే అలోచనలో ఉన్నట్లైతే ఈ సముద్రాన్ని ఇక్కడవున్న వారిలో ఇంకొకడు దాటగలడా చెప్పు.

**కం.** **పిల్లారి జియ్య తేజుఁనఁ**
**దెల్లంబుగ జింక మావు దేవర కతనన్**
**బెల్లడరారఁగఁ బుట్టిన**
**బల్లిదుఁడవు నీకు గడ్డుపనులుం గలవే? 93**

పిల్లారి = వినాయకునకు, జియ్య = తండ్రియగు శివుని, తేజునన్ = తేజస్సుతో, తెల్లంబుగ = చక్కగా, జింక మావు దేవర కతనన్ = లేడి వాహనముగా కల వాయుదేవుని కారణముగ, పెల్లు అదరారగన్ = గొప్ప అతిశయముతో, పుట్టిన = పుట్టినటువంటి, బల్లిదుడవు = బలశాలివి, నీకు గడ్డుపనులుం కలవే = నీకు అశక్యమైన పనులుకూడా ఉన్నాయా?

**తా :** శివుని తేజస్సుతో వాయుదేవుని కారణముగ పుట్టిన బలశాలివి. నీకు అశక్యమైన పనులుకూడా ఉన్నాయా?

**ఆ.వె.** **పిన్ననాఁడె జగము లెన్న నబ్రమ్ము మీ**
**రెడు కడంకతోడ రేగుపండు**
**పగిది నిరులఁగొంగఁ బట్టుక మ్రింగిన**
**ప్రోడ నింక నిన్నుఁ బొగడనేల? 94**

పిన్ననాడె = చిన్నతనములోనే, జగములు ఎన్నన్ = లోకములు మెచ్చునట్లుగా, అబ్రమ్ము మీఱెడు = ఆకాశమును దాటే, కడంకతోడ = పూనికతో, రేగుపండు పగిది = రేగుపండు వలె, ఇరుల

కొంగన్ = చీకటులకు శత్రువైన సూర్యుని, పట్టుక = పట్టుకొని, మ్రింగిన = మ్రింగినట్టి, ప్రోడన్ = సమర్థుని, నిన్నున్ ఇంకన్ పొగడన్ ఏల = నిన్ను ఇంక పొగడుట ఎందులకు?(మింగలేదు హనుమను ఉబ్బించడానికి అతిశయోక్తి).

**తా :** చిన్నతనంలోనే లోకాలు మేచ్చేట్లుగా ఆకాశాన్ని దాటే పూనికతో రేగిపండువలె సూర్యుని మింగినట్టి సమర్థుని నిన్ను ఇంక పొగడుట ఎందులకు?

**కం.** **ముందటి బంటవటంచున్**
**డెందంబునఁ గూర్మి నివ్వటిల్లఁగ నపుడే**
**కుందనపు టుంగరము ఱేఁ**
**డిందఱలో నిన్నె పిలిచి యిచ్చెనొ? లేదో?** **95**

ముందటి బంటవు అటంచున్ = ముందుకురికే వీరుడవని, డెందంబునన్ = మనసున, కూర్మి నివ్వటిల్లగన్ = అధికమైన ప్రేమతో, అపుడే = బయలుదేరు సమయముననే, ఱేడు = రాముడు, ఇందఱలో = ఇంతమందిలో, నిన్నె పిలిచి = నిన్నుమాత్రమే పిలిచి, కుందనపు ఉంగరము = బంగారు ఉంగరమును, ఇచ్చెనొ లేదో = ఇచ్చాడా లేదా?

**తా :** ముందుకురికే వీరుడవని ప్రేమతో బయలుదేరే సమయంలో రాముడు ఇంతమందిలో నిన్నే పిలిచి ఉంగరమును ఇచ్చాడా? లేదా?

**కం.** **కావున నేలిక కర్జము**
**గావింపఁగఁ బూని కొంకఁగాఁ దగదింకన్**
**లావదరఁ గడలి దాఁటుము**
**వేవేగం దెరవఁ జూచి వెండియు రమ్మా!** **96**

కావున = కాబట్టి, ఏలిక కర్జము = రాముని కార్యము, కావింపగన్ = పూర్తిచేయుటకు, పూని = సిద్ధపడి, కొంకగాన్ = సందేహించుటకు, తగదు = వీలుకాదు, ఇంకన్ = ఇక, లావు అడరన్ = శక్తిచూపుచూ, కడలి దాటుము = సముద్రమును దాటుము, వేగ వేగన్ = త్వరితముగా, తెరవన్ చూచి = సీతను చూచి, వెండియు రమ్మా = తిరిగి రమ్ము.

**తా :** కాబట్టి, రాముని కార్యము పూర్తిచేయుటకు సిద్ధపడి సందేహించడం తగదు. ఇక నీ శక్తిచూపుచూ సముద్రమును దాటుము. వేగముగా సీతను చూచి తిరిగి రమ్ము.

**ఆ.వె.** **అనుడు వారిఁ జూచి యతఁడిట్టులనియె నో**
**కొలము సాములార! కొఱఁత లేని**
**యేపుతోడఁ జెలఁగి యిపుడ మీ యానతి**
**దాటఁబోక కడలి దాటువాఁడ** **97**

అనుడు = అని పలుకగా, వారిన్ చూచి = ఆ వానరులను చూచి, అతడు ఇట్టులు అనియెన్ = ఆ హనుమంతుడు ఇట్లనెను, ఓ కొలము సాములార = ఓ కుల పెద్దలార!, మీ ఆనతి దాటన్

పోక = మీ ఆజ్ఞను తిరస్కరించక, కొఱతలేని ఏపుతోడన్ = లోపములేని సాహసముతో, చెలగి = విజృంభించి, ఇపుడ = ఇప్పుడే, కడలి దాటువాడ = సముద్రమును దాటగలను.

**తా :** అని పలుకగా ఆ వానరులను చూచి హనుమ 'ఓ కులపెద్దలార! మీ ఆనతి తిరస్కరించక సాహసముతో ఇప్పుడే సముద్రమును దాటగలను.

**ఆ.వె.** **దాటి లంకఁ జొచ్చి బోటియున్న తెఅగు**
**గాంచి మగిడి వత్తుఁ గాకయున్న**
**జెడుగు పొలసుదిండి యొడయని నిచటకుఁ**
**గడిమి మీఱ నంటఁగట్టి తెత్తు** **98**

దాటి = సముద్రమును దాటి, లంకన్ చొచ్చి = లంకలో ప్రవేశించి, బోటియున్న తెఅగు = సీతయున్న స్థితిని, కాంచి = చూచి, మగిడి వత్తున్ = తిరిగి వచ్చెదను, కాకయున్నన్ = పనికానిచో, చెడుగు పొలసు తిండి ఒడయనిన్ = దుర్మార్గుడైన రావణుని, ఇచటకు = ఇక్కడికి, కడిమి మీఱన్ = మిక్కిలి శౌర్యముతో, అంటన్ కట్టి తెత్తు = బంధించి తెచ్చెదను.

**తా :** దాటి లంకలో ప్రవేశించి సీత స్థితిని చూచి తిరిగి వచ్చెదను. కానిచో దుర్మార్గుడైన రావణుని శౌర్యముతో ఇక్కడికి బంధించి తెచ్చెదను.

**కం.** **వచ్చు నెడల నడ్డంబై**
**వచ్చిన రాయంచ వారువపు దొర నైనన్**
**గ్రచ్చుఱ నిడుమలఁ బెట్టెద**
**నిచ్చలు నిపుడమిలోన నించెద నసముల్** **99**

వచ్చున్ ఎడలన్ = రావణుని బంధించి తీసుకొని వస్తుండగా, అడ్డంబై వచ్చిన = అడ్డుగా వచ్చినచో, రాయంచ వారువపు దొరను ఐనన్ = హంస వాహనముగా కల దొర (బ్రహ్మ) నైనను, క్రచ్చుఱన్ = నిస్సంశయముగా, ఇడుమలన్ పెట్టెదన్ = కష్టముల పాల్చేసెదను, నిచ్చలు = శాశ్వతముగా, ఈ పుడమిలోనన్ = ఈ భూమిపై, అసముల్ = కీర్తులను, నించెదన్ = నింపెదను.

**తా :** వస్తుండగా అడ్డంవస్తే బ్రహ్మనైనా నిస్సంశయంగా కష్టముల పాల్జేసెదను. శాశ్వతముగా ఈ భూమిపై కీర్తిని నిలిపెదను.

**ఆ.వె.** **అనుచు జగము లెల్ల నడపఁ గడంగెడు**
**జముని కరణిఁ బొంగి చదలు చూలి**
**దలఁచి రాము నజ్జ దామర నెదలోన**
**నిలుపుకొని దిటంబు నివ్వటిలఁగ** **100**

అనుచున్ = అని పలుకుచూ, జగములు ఎల్లన్ = లోకములనన్నిటిని, అడపన్ కడంగెడు = నశింపచేయ పూనుకొన్న, జముని కరణిన్ = యమునిలా, పొంగి = విజృంభించి, చదలు చూలిన్ తలచి = ఆకాశమునకు పుత్రుడైన వాయుదేవుని తలచుకొని, రాముని = రాముని యొక్క, అజ్జ తామర = పాదపద్మములను, ఎదలోన = మనసులో, నిలుపుకొని = ఉంచుకొని, దిటంబు నివ్వటిలగ = మిక్కిలి ధైర్యముతో,

**తా :** అని పలుకుచూ లోకములన్నిటిని నశింపచేయ పూనుకొన్న యమునిలా పొంగి హనుమ రాముని పాదపద్మములను మనసులో నిలుపుకొని మిక్కిలి ధైర్యముతో –

**ఆ.వె.** **అడుగులూనఁ ద్రొక్కి మెడయుఁ జేతులు సాచి**
**తోఁక యూచి మేను వీఁకఁ బెంచి**
**చెవులు నిక్కఁజేసి చివ్వునఁ జుక్కల**
**దారి కెగసి కడలి దాఁటె వేగ** **101**

అడుగులు ఊనన్ = పాదములు బాగా ఆనుకునేలా, త్రొక్కి = తొక్కిపట్టి, మెడయున్ చేతులు చాచి = మెడను చేతులను చాచి, తోక ఊచి = తోకను ఊపి, మేను వీకన్ పెంచి = శరీరమును బాగా పెంచుకొని, చెవులు నిక్కచేసి = చెవులు నిక్కించి, చివ్వునన్ = ఒక్కసారిగా, చుక్కల దారికి = ఆకాశమార్గానికి, ఎగసి = ఎగిరి, వేగ = వేగముగా, కడలి దాటె = సముద్రమును లంఘించెను.

**తా :** పాదములు బాగా అనుకునేలా తొక్కిపట్టి, మెడ,చేతులు చాచి, తోక ఊపి, మేను పెంచి, చెవులు నిక్కించి ఒక్కసారిగా ఆకాశానికి ఎగిరి వేగంగా సంద్రమును లంఘించెను.

**కం.** **దాఁటుటయుఁ గొండగోపులు**
**బీటలు వాఱెం గడింది బీతున జేజే**
**దాఁటు వడంకం బాఱెను**
**గాటపుఁ బయ్యెరల మొగిలు గడలకుఁ బాఱెన్** **102**

దాటుటయున్ = అలా లంఘించగా, కొండ గోపులు = పర్వతశిఖరములు, బీటలు వారెన్ = నెరలు తీసెను, కడింది బీతునన్ = మిక్కిలి భయముతో, జేజే దాటు = దేవతల సమూహము, వడంకం పాఱెను = వణుకుచూ పరుగెత్తెను, గాటపు = దట్టమైన, పయ్యెరలన్ = గాలి తాకుడుచే, మొగిలు = మేఘము, కడలకు = దిక్కులకు, పాఱెన్ = చెదరిపోయెను

**తా :** అలా ఉఱుకగా పర్వత శిఖరములు బీటలు వారెను. దేవతల సమూహములు భయపడి పరుగెత్తెను. దట్టమైన గాలి తాకుడుచే మేఘము దిక్కులకు చెదరిపోయెను.

**ఆ.వె.** **అపుడు మింటివేల్పు లాతని దిటమెల్ల**
**నరయు కొఱకు సురస యనెడు వేల్పు**
**పడఁతిఁ బనుప నదియుఁ గడు నబ్బురపు రూపు**
**దాల్చి యెదుట నడ్డు దాఁకుటయును** **103**

అపుడు = ఆ సమయమున, మింటి వేల్పులు = ఆకాశమునందలి దేవతలు, ఆతని = ఆ హనుమంతుని, దిటము ఎల్లన్ = శక్తినంతను, అరయు కొఱకు = తెలుసుకొనుటకు, సురస అనెడు వేల్పు పడతిన్ = సురస అనే దేవకాంతను, పనుపన్ = పంపగా, అదియున్ = అదియును, కడు నబ్బురపు రూపు తాల్చి = మిక్కిలి ఆశ్చర్యకరమైన రూపమును పొంది, ఎదుటన్ = ఎదురుగా, అడ్డు తాకుటయును = అడ్డుగా ఎదిరించుటయును,

**తా :** ఆ సమయమున ఆకాశమునందలి దేవతలు ఆ హనుమ శక్తినంతను తెలియుటకై సురస అనే దేవకాంతను పంపగా, అది అపురూపమైన రూపమును పొంది ఎదురుగా అడ్డుగా ఎదిరించుటయును

**కం. నరజు మెయి పూని యా ద**
**బ్బర పొలఁతుక లోనఁ దూఱి పరువిడి వెలికిన్**
**బఱచి తటాలున దానిం**
**బఱియలు గావించి యెలమి పరఁగన్ జనియెన్ 104**

నరజు మెయి పూని = తన శరీరమును తగ్గించుకొని, ఆ దబ్బర పొలతుక లోన దూఱి = ఆ అసత్యపు స్త్రీ లోపల ప్రవేశించి, పరువిడి = శీఘ్రముగా, వెలికిన్ పఱచి = వెలుపలికి పరుగెత్తి, తటాలున = వెంటనే, దానిన్ = దానిని, పఱియలు గావించి = చీలికలు చేసి, ఎలమి పరగన్ = సంతోషించి, చనియెన్ = సాగెను.

**తా :** తన శరీరమును తగ్గించుకొని అ దబ్బర పొలతుక లోన దూఱి వెంటనే వెలుపలికి పరుగెత్తి తటాలున దానిని చీలికలు చేసి సంతోషముగా సాగిపోయెను

**కం. చని యా మ్రోల సువేలం**
**బను గుబ్బలిన్ యెక్కె నప్పు డాతని కర్జం**
**బునకుం దోడను చందం**
**బున వేఁడి వెలుంగు గ్రుంకఁబోయెన్ గడలిన్ 105**

చని = వెళ్ళి, ఆ మ్రోల = ఆ లంక సమీపమునందు, సువేలంబు అను గుబ్బలిన్ ఎక్కెన్ = సువేలమనే కొండను ఎక్కెను, అప్పుడు = ఆ సమయమున, ఆతని కర్జంబునకుం = ఆ హనుమంతుని కార్యమునకు, తోడు అను చందంబున = సహాయపడుచున్న విధముగా, వేడి వెలుంగు = సూర్యుడు, కడలిన్ = సముద్రమున, క్రుంకన్ పోయెన్ = మునుగుటకు వెళ్ళెను (అస్తమించెను).

**తా :** వెళ్ళి ఆ లంక చేరువలో సువేల పర్వతము నెక్కెను. అపుడు హనుమ కార్యమునకు తోడు అను విధముగా సూర్యుడు అస్తమించెను.

**కం. అని నారదుఁ డెఱిఁగించిన**
**విని యా వాల్మీకి మిగుల వేడుకతోడన్**
**దనరుచు నవ్వలి కతయున్**
**వినిపింపు మటంచు నతని వేఁడుకొనుటయున్ 106**

అని = ఈ విధముగా, నారదుడు ఎఱిగించిన = నారదుడు చెప్పగా, విని = విని, ఆ వాల్మీకి = ఆ వాల్మీకి మహర్షి, మిగుల వేడుకతోడన్ = మిక్కిలి వినాలనే కోరికతో, తనరుచున్ = ఒప్పుచు, అవ్వలి కతయున్ = తరువాత జరిగిన కథను, వినిపింపుము అటంచున్ = వినిపింపుమని, అతనిన్ = ఆ నారదుని, వేడుకొనుటయున్ = ప్రార్థించుటయును,

**తా :** అని నారదుడు ఎటిగించిన విని ఆ వాల్మీకి వినాలనే కోరికతో ఒప్పుచు, తరువాత జరిగిన కథను వినిపింపుము అని ఆ నారదుని ప్రార్థించుటయును.

**ఆశ్వాసాంతము :**

**చం.** **పొడల వెడంత దుప్పటియుఁ బున్కల పేరులు గాడ్పు దిండి బ**
**ల్తొడవులు మిన్కు టందియలుఁ దోరపుఁ గ్రొన్నెల పూవు విన్ను క్రొ**
**మ్ముడియును జింక పిల్లయును ముమ్మొన వాలును బూది పూఁతయు**
**న్మెడ నలు పెద్దు వారువము మిక్కిలి కన్నును గల్గు దేవరా!** **107**

పొడల వెడంద దుప్పటియున్ = మచ్చలతోనున్న పెద్ద వస్త్రమును (పులి చర్మము), పున్కల పేరులు = పుఱ్ఱెల దండలు, గాడ్పు తిండి బల్ తొడవులు = పాముల గొప్ప భూషణములు, మిన్కు అందియలున్ = వేదములు అందెలును, తోరపు క్రొన్నెల పూవు = అందమైన చంద్రరేఖ తలపూవును, విన్ను క్రొమ్ముడియును = ఆకాశము జటాజూటమును, జింక పిల్లయును = లేడి పిల్లయును, ముమ్మొన వాలును = త్రిశూలమును, బూది పూతయున్ = విభూతి పూతయును, మెడ నలుపు = కంఠము నలుపును, ఎద్దు వారువము = ఎద్దు వాహనమును, మిక్కిలి కన్నును = ఎక్కువగా ఒక కన్నును, కల్గు దేవరా!

**తా :** పులి చర్మము, పుఱ్ఱెల దండలు, పాముల భూషణములు, వేదముల అందెలు, చంద్రరేఖ తలపూవు, ఆకాశము జటాజూటము, లేడిపిల్ల, త్రిశూలము, విభూతి పూత, నలుపు కంఠము, ఎద్దు వాహనము, ఎక్కువగా ఒక కన్నును కలుగు దేవరా!

**కం.** **మిత్తియుఁ బితరుల ఱేఁడున్**
**మత్తిలి తిరుగంగఁ జూచి నలిఁ బొగరడఁగ**
**న్మొత్తిన తెల గిత్తరవాల్**
**తత్తడి నెఱ రౌత! నల్తలలదొర తాతా!** **108**

మిత్తియున్ = మృత్యుదేవతయును, పితరుల ఱేడున్ = యముడును, మత్తిలి = మదించి, తిరుగంగన్ = తిరుగుచుండగా, చూచి = చూచి, నలిన్ = హేలగా, పొగరడగన్ = గర్వమణగిపోవునట్లుగ, మొత్తిన = దండించిన, తెల గిత్త అరవాల్ = శ్రేష్టమైన తెల్లని వృషభము, తత్తడి = వాహనముగా కల, నెఱ రౌత = చక్కని రౌత!, నల్ తలల దొర తాతా = నాలుగు తలలుకల బ్రహ్మను దయ చూచినవాడా! (త్రాత ప్రకృతి – తాత వికృతి)

**తా :** మృత్యుదేవత, యముడు మదించి తిరుగుచుండగా చూచి హేలగా గర్వమణగు నట్లుగా దండించిన శివా! నాలుగు తలలుకల బ్రహ్మను దయచూచినవాడా!

**మాలిని :** **జగముల యెకిమీఁడా! జాళువా వింటివాఁడా!**
**తిగ కొటికల గొంగా! దిట్ట జేజే బొజుంగా!**
**పొగడిక గను వేల్పా! పూప జాబిల్లి తాల్పా!**
**సొగసుల నెఱ దంటా! జోగి బార్నోము పంటా!** **109**

జగముల = లోకములకు, ఎకిమీడా = ప్రభువైనవాడా!, జాళువా = మేరు పర్వతము, వింటివాడా = ధనుస్సుగా కలవాడా, తిగ కొటికల గొంగా = త్రిపురములకు శత్రువైనవాడా!, దిట్ట జేజే = శక్తిస్వరూపిణియగు పార్వతికి, బొజుంగా = ప్రియుడా!, పొగడిక కను వేల్పా = స్తుతులను పొందు దైవమా! పూప జాబిల్లి తాల్పా = చంద్రరేఖను ధరించినవాడా!, సొగసుల నెఱ దంటా = సొగసులకు స్థానమైనవాడా!, జోగి బారు నోము పంటా = యోగి బృందము యొక్క తపస్సునకు ఫలమైనవాడా!.
**తా :** లోకముల ప్రభువా! మేరుపర్వతము ధనుస్సుగా కలవాడా! త్రిపురములకు శత్రువైనవాడా! శక్తి స్వరూపిణి పార్వతికి ప్రియుడా! స్తుతులను పొందు దైవమా! చంద్రరేఖను ధరించినవాడా! సొగసులకు స్థానమైనవాడా! యోగుల తపస్సుకు ఫలమైనవాడా!

**గద్యము :**

**ఇది శ్రీమదుమారమణ కరుణా కటాక్ష నిరీక్షణ**
**సంలబ్ధ సరస కవితా సామ్రాజ్య దురంధర, ఘన యశోబంధుర**
**కౌండిన్య సగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర బుధజన విధేయ తిమ్మయ**
**నామధేయ ప్రణీతంబైన అచ్చ తెలుఁగు రామాయణ మహాకావ్యమందు**
**కిష్కింధ కాండము సర్వ మేకాశ్వాసము.**

**వ్యాఖ్యాతృ గద్యము :**

**ఇది బుధజన విధేయుండును, బులుసు వంశ సంభూతుండును,**
**కీ.శే. శేషమ్మ వేంకటరమణయ్య పుణ్యదంపతీ తనూజుండును,**
**గౌతమ గోత్రజుండునగు వేంకటసత్యనారాయణమూర్తి**
**ప్రణీతంబైన అచ్చ తెలుఁగు రామాయణమను మహాకావ్య మందు**
**కిష్కింధ కాండమునకు టీక, తాత్పర్యములు.**



# అచ్చతెలుఁగు రామాయణము

# సుందర కాండము

**కం. సిరులఁ బరగించి బత్తుల**
**నిరవగు కనికరముతోడ నేలుచు నెపుడున్**
**దొర మీఱిన దొరయనఁ దగి**
**విరివిగ జగ మేదు మెట్టువిలు బలుదిట్టా! 1**

బత్తులన్ = భక్తులను, సిరులన్ పరగించి = సంపదలతో ఒప్పించి, ఇరవగు = స్థిరమైన, కనికరముతోడన్ = దయతో, ఎపుడున్ = ఎల్లప్పుడును, ఏలుచు = రక్షించుచు, దొర మీఱిన దొర అనన్ తగి = సాటిలేని విభుడవనుటకు తగినవాడవై, విరివిగ = సమృద్ధిగ, జగము = లోకమును, ఏదు = రక్షించు, మెట్టు విలు బలుదిట్టా = మేరు పర్వతము విల్లుగా కల గొప్ప వీరుడా!

**తా :** భక్తుల సంపదల పరగించి స్థిరమైన కనికరమున ఎల్లప్పుడు రక్షించుచు సాటిలేని దొరవనుటకు తగినవాడవై సమృద్ధిగ లోకమును రక్షించు శివా!

**తే.గీ. ఆలకింపుము గూర్మిఁ గయ్యంపుఁ దిండి**
**తపసి కన్నాకు కత విను తపసిఁ జూచి**
**యిట్టులను గాడ్పు చూలి యిట్లివము సూడు**
**గ్రుంకునంతకు నొదిగి యక్కొండనున్న 2**

ఆలకింపుము = వినవలసినది, కూర్మిన్ = ప్రేమతో, కయ్యంపున్ తిండి = కలహభోజనుడు, తపసి కన్నాకు = మునిశ్రేష్ఠుడునైన నారదుడు, కత విను తపసి చూచి = రామగాథను వింటున్న వాల్మీకి మహర్షిని చూచి, ఇట్టులు, అనున్ = చెప్పసాగెను, గాడ్పుచూలి = వాయు పుత్రుడగు హనుమంతుడు, ఇట్లు = ఈ విధముగా, ఇవము చూడు = మంచుకు శత్రువగు సూర్యుడు, క్రుంకునంతకున్ = అస్తమించు వరకును, ఒదిగి = తగ్గి, ఆ కొండను ఉన్న = ఆ సువేల పర్వతముపై ఉండగా –

**తా :** ఆలకింపుము, ప్రీతితో నారదుడు రామగాథను వింటున్న వాల్మీకిని చూచి ఇట్లు చెప్పసాగెను. హనుమ సూర్యుడు అస్తమించువరకు తగ్గి ఆ సువేల పర్వతముపై ఉండగా

**కం.** **అంతటఁ గడలందెల్లఁ గొ**
**అంత యొకింతయును లేక అంపిల్లె నిరుల్**
**పంతపు రక్కసి మూఁకల**
**అంతు లుడిగె నెలమిఁ గనిరి అంకు వెలందుల్** **3**

అంతటన్ = అప్పుడు, కడలందు ఎల్ల = దిక్కులన్నిటియందును, కొఱంత = లోటు, ఒకింతయును లేక = కొంచెముకూడా లేకుండా, ఇరుల్ = చీకటులు, అంపిల్లెన్ = వ్యాపించెను, పంతపు = పొగరుకల, రక్కసి మూకల అంతులు = రాక్షసుల కేకలు, గంతులు, ఉడిగెన్ = తగ్గినవి, అంకు వెలందుల్ = వేశ్యలు, ఎలమిన్ కనిరి = సంతోషమును పొందిరి.

**తా :** అప్పుడు దిక్కులన్నిటియందును చీకట్లు వ్యాపించెను. పొగరుకల రాక్షసుల కేకలు, గంతులు ఉడిగెను. వేశ్యలు సంతోషమును పొందిరి.

**ఆ.వె.** **అపుడు కోఁతిమిన్న యసదురూపునఁ జని**
**ప్రోలి చాగ కాని మూలగవను**
**దూఱి యచటఁ గాంచె మాఱట మిత్తియో**
**యనఁగఁ బరఁగు లంకిణిని జెలంగి** **4**

అపుడు, కోతి మిన్న = వానరశ్రేష్ఠుడు, అసదురూపునన్ = చిన్న రూపముతో, చని = వెళ్ళి, ప్రోలి = పట్టణముయొక్క, చాగకాని మూల గవనున్ = కుబేరుని దిక్కున (ఉత్తరం) కల ద్వారమును, దూఱి = ప్రవేశించి, అచటన్, చెలంగి = విజృంభించి, మాఱట మిత్తియో యనగన్ = మృత్యువుకు మాఱురూపమో యనునట్లుగ, పరగు = ఒప్పుచున్న, లంకిణిని కాంచె = లంకిణిని చూసెను.

**తా :** అప్పుడు హనుమ చిన్న రూపముతో పట్టణము ఉత్తర ద్వారమును ప్రవేశించి అక్కడ మృత్యువునకు మారురూపమో యనగ ఒప్పుచున్న లంకిణిని చూచెను.

**ఆ.వె.** **కాంచి దీని నిపుడు ద్రుంచినఁ బ్రోలి వా**
**రెఱిఁగి చేరవచ్చి రేనిఁ గర్జ**
**మెల్లఁ దప్పు మరల నేఁగుచోఁ దునిమెద**
**నని తలంచి సరగ నవలి కరిగె** **5**

కాంచి = చూచి, దీనిని = ఈ రక్కసిని, ఇపుడు ద్రుంచిన = ఇపుడు చంపినచో, ప్రోలివారు = నగరములోనివారు, ఎఱిగి = తెలుసుకొని, చేరవచ్చిరి ఏని = సమీపించినచో, కర్జము ఎల్లన్ = వచ్చిన పనియంతయు, తప్పు = తప్పిపోవును, మరలన్ ఏగుచోన్ = తిరిగి వెళ్ళు సమయమున, తునిమెదన్ = సంహరించెదను, అని తలంచి = అని అనుకొని, సరగన్ = వేగముగా, అవలికి అరిగె = పక్కకు పోయెను.

**తా :** చూచి, ఈ రక్కసిని ఇపుడు చంపినచో నగరములోనివారు తెలుసుకొని చేరవచ్చిరేని వచ్చిన పని తప్పిపోవును. తిరిగి వెళ్ళునపుడు సంహరించెదను అని వేగముగా పక్కకుపోయెను.

**కం.** **అరిగెడుచో నీతఁడు నెఱి**
**నరయు నెడ న్వెలుఁగు వలయునని జేజే ల్వా**
**విరిఁ బట్టు దివ్విటీయనఁ**
**దిరముగ రేతేఁడు తూర్పు దెసఁ గన్పట్టెన్** **6**

ఈతడు = ఈ హనుమంతుడు, అరిగెడుచోన్ = వెళ్ళునప్పుడు, నెఱిన్ = చక్కగా, అరయున్ ఎడన్ = వెదకు సమయమున, వెలుగు వలయున్ అని = వెలుగు కావలెనని, జేజేలు = దేవతలు, వావిరిన్ పట్టు = క్రమముగా పట్టుచున్న, దివ్విటీయనన్ = దివిటీలనునట్లుగ, తిరముగ = స్థిరముగ, రేయి ఱేడు = చంద్రుడు, తూర్పు దెసన్ కన్పట్టెన్ = తూర్పు దిక్కున ఉదయించెను.

**తా :** ఈ హనుమ వెళ్ళునప్పుడు, చక్కగా వెదకునప్పుడు వెలుగు కావలెనని దేవతలు పట్టిన దివిటీలనునట్లు స్థిరముగ చంద్రుడు తూర్పుదిక్కున ఉదయించెను.

**తే.గీ.** **అట్లు జాబిల్లి తనకు జోడై చెలంగఁ**
**బొలుపు తళుకొత్త మెల్లనఁ బ్రోలు సొచ్చి**
**యొరులు తన్నెవ్వ రెఱుఁగక యుండునటులఁ**
**గలయ నెల్లెడఁ బరికింపఁగాఁ దొడంగి** **7**

అట్లు = ఆ విధముగా, జాబిల్లి = చంద్రుడు, తనకు జోడై చెలంగన్ = తనకు తోడుగా ప్రకాశించు చుండగా, పొలుపు = స్థైర్యము, తళుకొత్తన్ = అతిశయింపగా, మెల్లనన్ = మెల్లగా, ప్రోలు చొచ్చి = నగరమున ప్రవేశించి, ఒరులు ఎవ్వరు = ఇతరులెవ్వరును, తన్ను = తనను, ఎఱుగక యుండు నటులన్ = తెలుసుకొన లేకుండునటుల, కలయన్ ఎల్లెడన్ = అంతటా కలయతిరిగి, పరికింపగాన్ తొడంగి = వెదకటం ప్రారంభించి,

**తా :** ఆ విధముగా చంద్రుడు తనకు తోడుగా ప్రకాశించుచుండగా పొలుపు తళుకొత్త మెల్లగా నగరమున ప్రవేశించి ఇతరులెవ్వరు తనను తెలుసుకొనకుండునటుల అంతటా కలయ తిరిగి వెదకటం ప్రారంభించి

**సీ.** **ఇరవులు రోసి దేవరగుళ్ళు నెమకి యు**
**ప్పరిగలు వెదకి చప్పరము లరసి**
**మోసల ల్దడవి లోముంగిళ్ళు గనుఁగొని**
**గొందులు పరికించి కొల్ల గాంచి**
**మందసంబులు దేవి మాడువు ల్వొడఁగని**
**కొత్తడంబులు చూచి కోట గవఁను**
**లారసి బలితంపు తేరులు గాలించి**
**కొలఁకులు తోఁటలు గలియఁ బెట్టి**

**తే.గీ.** **యాటపట్టులు చొరరాని చోటు లెల్లఁ**
**దేటతెల్లముగాఁ గని తెఱవ నెందుఁ**

**బొడగనఁగ లేక కడు డెందమునఁ గలంక**
**నిగుడఁ బొలదిండి యెకిమీని నగరు సేరి** **8**

ఇరవులు రోసి = నివాసములు వెదకి, దేవర గుళ్ళు నెమకి = దేవాలయములు వెదకి, ఉప్పరిగలు వెదకి = మేడలు వెదకి, చప్పరములు అరసి = మండపములు పరీక్షించి, మోసలల్ తడవి = మొగసాలలను వెదకి, లోముంగిళ్ళు కనుగొని = లోపలి మధ్యభాగములను చూచి, గొందులు పరికించి = మూలలను పరిశీలించి, కొల్ల కాంచి = దోపిడులను చూచి, మందసంబులు దేవి = బోషాణములను వెదకి, మాడువుల్ పొడగని = హర్మ్యములందు వెదకి, కొత్తడంబులు చూచి = కోట బురుజులు చూసి, కోట గవనులు ఆరసి = కోట గోపురములను వెదకి, బలితంపు తేరుల గాలించి = బలిష్ఠమైన రథములను వెదకి, కొలకులు, తోటలు కలియ పెట్టి = చెఱువులు, ఉద్యానవనములు కలయ తిరిగి, ఆటపట్టులు, చొరరాని చోటులు ఎల్లన్ = క్రీడాస్థలములు, రహస్య ప్రదేశములను అన్నిటిని, తేటతెల్లముగాన్ కని = స్పష్టముగా చూచి, తెఱవన్ = సీతను, ఎందున్ పొడ కనగ లేక = ఎక్కడా జాడ తెలుసుకొనలేక, డెందమున = మనస్సున, కడు, కలంక నిగుడన్ = బాధ పెరుగగా, పొలతిండి ఎకిమీని నగరు చేరి = రావణుని అంతిపురము ప్రవేశించి, **తా :** నివాసములు,దేవాలయములు,మేడలు,మండపములు,మొగసాలలు,లోముంగిళ్ళు, గొందులు, దోపిడులు, బోషాణములు, హర్మ్యములు, కోటబురుజులు, కోటగవనులు, రథములు, కొలకులు, తోటలు, ఆటపట్టులు, చొరరాని చోటులు అంతటా స్పష్టముగా చూచి సీతను ఎందును కానక మనసున బాధ పెరుగగా రావణుని అంతఃపురమును ప్రవేశించి.

**సీ.** **పసిఁడి గోడలు పుల్గుపచ్చ తోరనములు**
**గొప్ప క్రొన్నెలఱాల యుప్పరిగలు**
**మగఱాలు దాపిన పగడంపుఁ గంబముల్**
**తెఱగంటి రాచరాతిన్నియలును**
**బిల్లికన్ రతనంపు పెద్ద మందసములు**
**ప్రొద్దుగల్నాడెంపు మిద్దియలును**
**జెలువంపు ముత్తెంపు చలువ చప్పరములు**
**వలుద నెత్తమ్మి కెంపుల తలుపులు**

**తే.గీ.** **మఱియు వెలలేని ముత్తిగ మానికముల**
**యందలంబులు నుయ్యేల లరదములను**
**గవని కట్టులుఁ బెండియల్ గద్దియలును**
**బాఱఁ జూచుచు సరిగ లోపలికిఁ దూఱె** **9**

పసిడి గోడలు = బంగారు గోడలు, పుల్గుపచ్చ తోరనములు = గరుడపచ్చ తోరణాలు, గొప్ప క్రొన్నెలఱాల ఉప్పరిగలు = గొప్పగా చంద్రకాంతపు రాళ్ళతో కట్టిన మేడలు, మగఱాలు తాపిన = వజ్రములు తాపడం చేసిన, పగడంపు కంబముల్ = పగడాల స్తంభాలు, తెఱగంటి రాచరా

తిన్నియలును = ఇంద్రనీలమణుల వేదికలను, పిల్లికన్ రతనంపు పెద్ద మందసములు = వైడూర్యపు పెద్ద బోషాణములు, ప్రొద్దు కల్ నాడెంపు మిద్దియలును = సూర్యకాంత మణుల శ్రేష్ఠమైన మిద్దెలును, చెలువంపు ముత్తెంపు చలువ చప్పరములు = అందమైన ముత్యాల చలువ పందిళ్ళు, వలుద నెఱ తమ్మి కెంపుల తలుపులు = పెద్ద మంచి పద్మరాగ మణుల తలుపులు, మఱియు = ఇంకను, వెలలేని = విలువైన, మూడు తిగ మానికముల = నవరత్నాలతో కూడిన, అందలంబులు = పల్లకీలు, ఉయ్యెలలు = తూగుటుయ్యెలలు, అరదములును = రథములును, గవని కట్టులు = దుర్గపు గోడలు, పెండియల్ = దొడ్లు, గద్దియలును = సింహాసనములును, పాఱన్ చూచుచు = దూరమునుండియే చూచుచు, సరిగన్ = చక్కగా, లోపలికిన్ తూఱెన్ = ప్రవేశించెను.

**తా :** బంగారు గోడలు, గరుడపచ్చ తోరణాలు, చంద్రకాంతపు రాళ్ళతో కట్టబడిన మేడలు, వజ్రాలు తాపిన పగడాల స్తంభాలు, ఇంద్రనీలమణుల వేదికలు, వైడూర్యపు బోషాణములు, సూర్యకాంతమణుల మిద్దెలు, ముత్యాల పందిళ్ళు, పద్మరాగముల తలుపులు ఇంకను విలువైన నవరత్నములతో కూడిన పల్లకీలు, ఉయ్యలలు, రథములు, దుర్గపు గోడలు, దొడ్లు, సింహాసనములు దూరము నుండియే చూచుచు చక్కగా ఆ అంతఃపురమున ప్రవేశించెను.

**తే.గీ.** **తూఱి యెనలేని సొగసుల మీఱుచున్న**
**జాళువా మేడఁ గన్గొని సంతసమున**
**డాయఁజని యందు మేలికడాని చీని**
**పనుల నలరొందు నొక పూలపాన్పునందు** **10**

తూరి = ప్రవేశించి, ఎనలేని = సాటిలేని, సొగసుల = అందములచే, మీఱుచున్న = అతిశయించు చున్న, జాళువా మేడన్ కన్గొని = బంగారు భవనమును చూచి, సంతసమున = సంతోషముతో, డాయన్ చని = సమీపించి, అందు = ఆ భవనములో, మేలి కడాని చీని పనులన్ = మంచి మేలిమి బంగారు పనులతో, అలరొందు = ఒప్పుచున్న, ఒక పూలపాన్పునందు = ఒక పూలపాన్పుపైన,

**తా :** ప్రవేశించి సాటిలేని సొగసులతో అతిశయించుచున్న బంగారు భవనమును చూచి సంతోషముతో సమీపించి, ఆ భవనములో మేలిమి బంగరు పనులతో ఒప్పు పూలపాన్పుపై

**సీ.** **చెఱగొన్న ముగుద జేజే పొలంతు లలంతి**
**నిదురలతో నజ్జ లొదిగి యొత్త**
**మొనసి యీరైదు క్రొమ్ముడులఁ జాగపు చెట్ల**
**పూవుటెత్తులు క్రొత్త తావులీన**
**నొడలి మేల్రవణంపు టొరపు మానికములు**
**మలయు దివ్వెలలతో మాఱ్వెలుంగఁ**
**దివిరి వేల్పుల మీఁది రవరవ ల్నిగుడించు**
**వడువున నూర్పులు గడలుకొనఁగఁ**

**తే.గీ.** **బుడమి పుట్టువు నెదలోన నిడి మరల్ప**
**రాని వలవంత సెకలఁ గరంగి బయల**
**మఱచి నిదురించు రక్కెస మన్నెగానిఁ**
**జూచి తనలోన నిట్లనుచుం దలంచె** **11**

చెఱగొన్న = బందీలుగా తెచ్చిన, ముగుద = ముగ్ధలైన, జేజే పొలంతులు = దేవతా స్త్రీలు, అలంతి = కొద్దిగా, నిదురలతోన్ = కునికిపాట్లతో, అజ్జలు = ఆ రావణుని పాదములు, ఒదిగి ఒత్త = ప్రక్కకు ఒరిగి ఒత్తుచుండగా, మొనసి = ఒప్పి, ఈరు ఐదు క్రొత్త ముడులన్ = పది జుట్టు ముడులందును, చాగపు చెట్ల పూవు ఎత్తులు = సంపంగిచెట్ల పూలగుత్తులు, క్రొత్త తావులు ఈన = సరికొత్త వాసనలను పంచుచుండగా, ఒడలి = దేహమునందలి, మేల్ రవణంపు = విలువైన ఆభరణములందలి, ఒరపు = అందమైన, మానికములు = మాణిక్యములు, మలయు = కాంతులను వ్యాపింపచేస్తున్న, దివ్వెలలతోన్ = దీపములతో, మాఱు వెలుంగన్ = సమానముగా ప్రకాశించు చుండగా, తివిరి = ప్రయత్నించి, వేల్పులమీది రవరవల్ = దేవతలమీది స్పర్థను, నిగుడించు = వ్యాప్తిచేయుచున్న, వడువునన్ = విధముగా, ఊర్పులు = శ్వాసలు, కడలుకొనగన్ = వ్యాపించు చుండగా, పుడమి పుట్టువున్ = సీతను, ఎదలోనన్ ఇడి = మనసులోనుంచుకొని, మరల్పరాని = త్రిప్పుకొనజాలని, వలవంత సెకలన్ = విరహాగ్ని జ్వాలలతో, కరంగి = కరిగిపోయి, బయలన్ మఱచి = బయటి విషయములను మరిచిపోయి, నిదురించు = నిద్రపోతున్న, రక్కెస మన్నెగానిన్ చూచి = రాక్షస రాజగు రావణుని చూచి, తనలోనన్ = తనలోపల, ఇట్లు అనుచుం తలంచె = ఈ విధముగా తలంచెను.

**తా :** బందీలుగా తెచ్చిన ముగ్ధ దేవతాస్త్రీలు కునికిపాట్లతో ఆ రావణుని పాదములు ఒత్తుచుండగా, పది జుట్టుముడులలో సంపంగి పూలగుత్తులు సరిక్రొత్త వాసనలు పంచు చుండగా, ఆభరణముల మాణిక్య కాంతులు దివ్వెలతో సమానముగా ప్రకాశించుచుండగా, దేవతలమీది స్పర్థను వ్యాప్తిచేయుచున్న విధముగా శ్వాసలు వ్యాపింపగా, సీతను మనసులో ఉంచుకొని మరల్పరాని విరహాగ్ని జ్వాలలతో కరిగిపోయి బయటి విషయములను మరచి పోయి నిద్రపోతున్న రావణుని చూచి తనలో ఈ విధముగా తలచెను.

**ఉ.** **అద్దిఱ! వీని టీవియు నొయారము దిట్టతనంబు చేవయున్**
**దద్దయు నబ్బురం బెదకు దార్కొనఁ జేయఁ దొడంగె నిట్టి బ**
**ల్గద్దతికాఁడు వాఁడిని జగంబులు గెల్చుట యేమివింత? మే**
**ల్బుద్ధి యొకింత లేక చెడిపోవు తలంపిడెఁగాక యిత్తఱిన్** **12**

అద్దిఱ = అదిరా!, వీని టీవియు = వీని ఠీవియును, ఒయారము = సొగసును, దిట్టతనంబు = ధైర్యమును, చేవయున్ = బలమును, తద్దయున్ = మిక్కిలి, అబ్బురంబు = ఆశ్చర్యమును, ఎదకు = మనస్సుకు, తార్కొన చేయన్ తొడంగెన్ = తగిలేలా చేస్తోంది, ఇట్టి = ఇటువంటి, బల్ గద్దరికాడు = గొప్ప ధైర్య,స్థైర్యములు కలవాడు, వాడినిన్ = పరాక్రమముతో, జగంబుల గెల్చుట = లోకములను

జయించుట, ఏమి వింత, మేలు బుద్ధి = మంచి బుద్ధి, ఒకింత లేక = కొంచెమును లేక, ఇత్తఱిన్ = ఇపుడు, చెడిపోవు = నశించిపోయే, తలంపిడెన్ కాక = ఆలోచన చేసేడు కాని –

**తా :** అదిరా! వీని ఠీవియును, సొగసును, ధైర్యమును, బలమును మిక్కిలి ఆశ్చర్యమును మనసుకు తగిలేలా చేస్తోంది. ఇట్టి గొప్ప ధైర్య, స్థైర్యములు కలవాడు పరాక్రమముతో లోకములను జయించుట ఏమి వింత? మంచి బుద్ధి కొంచెం కూడా లేక ఇపుడు చెడిపోయే ఆలోచన చేసేడు కాని –

**కం.** **ఈ టీవికి నీ పేర్మికి**
**మేటితనమునకుఁ జాల మేలి గొనంబే**
**నాటుకొనియున్న నీతఁడు**
**సేటెన్నడు లేని సిరులఁ జెన్నారుఁగదా!** **13**

ఈ టీవికి = ఈ గాంభీర్యమునకు, ఈ పేర్మికిన్ = ఈ అతిశయమునకు, మేటితనమునకున్ = శ్రేష్ఠత్వమునకును, చాల మేలి = మిక్కిలి మంచి, గొనంబే నాటుకొనియున్నన్ = గుణమే కలిగి యున్నచో, ఈతడు = ఈ రావణుడు, చేటు ఎన్నడు లేని = ఎప్పటికిని నాశనమే లేని, సిరులన్ = సంపదలతో, చెన్నారున్ కదా = ఒప్పునుకదా!

**తా :** ఈ గాంభీర్యమునకు, ఈ అతిశయమునకు, ఈ శ్రేష్ఠత్వమునకు మంచి గుణములే కలిగి యున్నచో ఈ రావణుడు ఎప్పటికి నాశమే లేని సంపదలతో ఒప్పునుకదా!

**కం.** **తెఱఁగెఱుఁగక రామునితో**
**గుఱుతుగఁ బగఁ గూడఁబెట్టుకొని కొలమెల్లం**
**జెఱచుకొనెఁగాక యాతం**
**డుఱఁడుగదా! పూని వేల్పుటొడయని నైనన్** **14**

తెఱఁగు ఎఱుగక = మంచి తెలియక, రామునితోన్ = ఆ రామునితో, గుఱుతుగ = మచ్చగ, పగన్ = విరోధమును, కూడన్ పెట్టుకొని = తెచ్చిపెట్టుకొని, కొలము ఎల్లన్ చెఱచుకొనెన్ = రాక్షస కులాన్నంతని నాశనం చేస్తున్నాడు, కాక = కానిచో, అతండు = ఆ రావణుడు, పూని = సిద్ధపడి, వేల్పు ఒడయనిని ఐనన్ = దేవేంద్రుడినైనను, ఉఱడుకదా = లక్ష్యపెట్టడుకదా!

**తా :** మంచి గ్రహించక మచ్చగ ఆ రామునితో విరోధమును తెచ్చిపెట్టుకొని రాక్షస కులాన్నంతను నాశనం చేస్తున్నాడు. కానిచో ఆ రావణుడు దేవేంద్రునైనా లక్ష్యపెట్టడు.

**కం.** **అని యెదలో నెన్నుచు మె**
**ల్లన నాతని సెజ్జ పజ్జలకుఁ జని యొక మా**
**టున నిలిచి కోఁతిదొర తన**
**కనుదోయికి నబ్బురంబు గడలుకొనంగన్** **15**

కోతిదొర = కోతులలో శ్రేష్ఠుడగు హనుమంతుడు, అని = ఈ ప్రకారముగా, ఎదలోన్ = మనసులో, ఎన్నుచు = ఎంచుకొనుచు, మెల్లన = మెల్లగా, ఆతని సెజ్జ పజ్జలకున్ = ఆ రావణుని శయ్య సమీపమునకు, చని = వెళ్ళి, ఒక మాటున = ఓ మూల, నిలిచి = నిలబడి, తన కనుదోయికి = తన కన్నులకు, అబ్బురంబు = ఆశ్చర్యము, కడలుకొనంగన్ = వ్యాప్తిచెందగా –

**తా :** వానర శ్రేష్ఠుడగు హనుమ ఈ విధముగా మనసులో ఎంచుకొని మెల్లగా ఆ రావణుని శయ్య సమీపమునకు వెళ్ళి ఓ మూల నిలబడి ఆశ్చర్యం కడలుకొనగా –

**సీ.** **ఎడసిన జిలుఁగు పయ్యెదతోడ ముడివీడి**
**నేల జీరాడు పెన్నెఱులతోడఁ**
**గరఁగి నెమ్మొగమెల్లఁ బెరయఁ గస్తురితోడఁ**
**దొలఁగిన చెవియాకు దోయితోడ**
**నుడుగక నినుచు నిట్టూర్పు గాడ్పులతోడ**
**జాఱిన నెఱి బన్న సరముతోడఁ**
**జెదరిన పాపట చేర్చుక్క బొట్టుతోఁ**
**బొడిపొడియైన మే పూఁతతోడ**

**తే.గీ.** **మగని పిమ్మట నెమ్మేను మఱచి నిదురఁ**
**జెందు మందోదరిని జూచి చెలువ కిపుడు**
**చెడు తెఱంగులు గడుగనఁబడఁ దొడంగె**
**నంచుఁ దలయూచి చయ్యన నచటు దరలి** **16**

ఎడసిన = తొలగిన, జిలుగు పయ్యెదతోడన్ = మెరిసే పైటచెంగుతోపాటు, ముడి వీడి = జుట్టు ముడి వీడిపోయి, నేల జీరాడు = నేలపై పొరలుచున్న, పెను నెఱులతోడన్ = పొడవైన వెంట్రుకలతో, కరగి = ద్రవించి, నెఱి మొగము ఎల్లన్ = అందమైన ముఖమంతయు, పెరయన్ = వ్యాపించిన, కస్తురితోడన్ = కస్తూరితో, తొలగిన = జారిన, చెవియాకు = పెళ్లి అయిన గుర్తుగా చెవికి అలంకరించుకొను తాటి ఆకుల తాటంకముల, దోయి తోడన్ = జంటతో, ఉడుగకన్ = తగ్గక, నినుచు = నించు, నిడు ఊర్పు గాడ్పులతోడన్ = నిశ్వాసపు గాలులతో, జాఱిన = జారిపోయిన, నెఱి బన్న సరముతోడన్ = అందమైన వివిధమణుల రంగులుకల హారముతో, చెదరిన పాపటన్ = చెదిరిపోయిన పాపటయందు, చేర్చుక్క బొట్టుతో = పాపట బొట్టుతో, పొడిపొడి ఐన = పొడారిపోయిన, మే పూతతోడన్ = మై లేపనముతోను, మగని పిమ్మట = భర్త ప్రక్కన, నెఱి మేను = సుందరమైన తన దేహమును, మఱచి = విస్మరించి, నిదుర చెందు = నిద్రించుచున్న, మందోదరిని చూచి, చెలువకు ఇపుడు = ఈ సుందరికి ఇప్పుడు, చెడు తెఱంగులు = చెడుకలిగే విధములు, కడు కనబడన్ తొడగె = ఎక్కువగా కనబడుచున్నవి. అంచున్ = అనుకొనుచు, తల ఊచి = తలను ఊపి, చయ్యన = శీఘ్రముగా, అచటు వదలి = ఆ ప్రదేశము విడిచిపెట్టి,

**తా :** తొలగిన పైటచెంగుతో, వీడిన జుట్టుముడినుండి నేలపై పొరలాడు వెంట్రుకలతో, కరిగి ముఖమంతా వ్యాపించిన కస్తూరితో, జారిన తాటంకముల జంటతో, తరుగని నిట్టూర్పు గాలులతో, జారిన వివిధ రంగుల హారముతో, చెదరిన పాపిటయందు చేర్చుక్క బొట్టుతో, పొడారిన మైపూతతో, భర్త ప్రక్కన తన దేహమును మరచి నిద్రించుచున్న మందోదరిని చూచి 'ఈ సుందరి కిప్పుడు చెడు కలుగు విధములు ఎక్కువగా కనబడుచున్నవి' అనుకొంటూ శీఘ్రముగా ఆ ప్రదేశం విడిచిపెట్టి

**తే.గీ.** **పొలసు మేపరి తేని తోబుట్టువులును**
**గొడుకులును నెమ్మినుండు టెంకులకుఁబోయి**
**వెలఁది నచ్చోటు లందెల్ల వెదకి వాండ్ర**
**పెంపు గన్గొని యెదలోన బిట్టు సోలి** **17**

పొలసు మేపరి తేని = రావణుని, తోబుట్టువులును = సోదరులును, కొడుకులును, నెమ్మిని ఉండు = ప్రీతితోనుండు, టెంకులకున్ పోయి = నివాసములకు వెళ్ళి, వెలదిన్ = సీతను, ఆ చోటుల అందు ఎల్ల = ఆ ప్రదేశములన్నిటియందును, వెదకి = పరిశీలించి, వాండ్ర పెంపు కన్గొని = వాళ్ళ గొప్పతనాన్ని కళ్ళారా చూసి, ఎదలోన = మనస్సులో, బిట్టు సోలి = మిక్కిలి వివశత్వము పొంది,

**తా :** రావణుని సోదరులు, కొడుకులు ఉండు నివాసములకు వెళ్ళి సీతను వెదకి, వాళ్ళ గొప్పతనాన్ని కన్గొని మనసులో మిక్కిలి వివశత్వము పొంది.

**కం.** **మఱియుఁ బేరగు రక్కసి**
**నెఱజోదుల కాపురంపు నెలవుల యందుం**
**జెఱసాలలందుఁ జెలిఁ బ**
**ల్మఱు నారసి కనఁగలేక మదిఁ దలఁ కెలయన్** **18**

మఱియున్ = ఇంకను, పేరగు = ప్రసిద్ధులైన, రక్కసి నెఱ జోదుల = రాక్షస మహావీరులయొక్క, కాపురంపు నెలవుల యందున్ = నివాస గృహములయందును, చెఱసాలలందున్ = కారాగృహము లందును, చెలిన్ = సీతను, పల్మఱున్ ఆరసి = పలుమార్లు వెదకి, కనగలేక = కానక, మదిన్ = మనస్సునందు, తలకు ఎలయన్ = మిక్కిలి వెతచెంది,

**తా :** ఇంకను పేరున్న రాక్షస వీరుల ఇళ్ళను, కారాగారములను సీతను పలుమార్లు వెదకి కానక మనసున మిక్కిలి వెతచెంది.

**చం.** **కటకట! రాచ రేవెలుఁగు కర్జము పూని కడింది చేవతో**
**నిట కరుదెంచి బోఁటి నిపు డెందును గానక కోఁతి తేని చెం**
**గటి కిఁక నూరకే మరలగాఁ బఱతెంచిన నెల్లవారుఁ బి**
**మ్మట నగరే? మగంటిమియు మాట నిజంబును గోలుపోవదే?** **19**

కటకట = అయ్యయ్యో!, రాచ రేవెలుగు = రాజచంద్రుడైన రామచంద్రునియొక్క, కర్జము = పని, పూని = చేపట్టి, కడింది చేవతోన్ = మిక్కిలి సాహసముతో, ఇటకు అరుదెంచి = ఇక్కడికి వచ్చి, ఇపుడు = ఇప్పుడు, బోటిన్ = సీతను, ఎందును కానక = ఎక్కడా కనబడక, కోతితేని చెంగటికి = సుగ్రీవుని సన్నిధికి, ఇకన్ = ఇంక, ఊరకే మరలగాన్ = వట్టిచేతులతో తిరిగిపోయి, పరతెంచినన్ = వెళ్ళిన, పిమ్మట = ఆ తరువాత, ఎల్లవారు నగరే, మగంటిమియు = మగతనమును, మాటనిజంబును = మాటకు కట్టుబడియుండుటయు, కోలుపోవదే = నేటితో పోవునుకదా!

**తా :** కటకట! రాజచంద్రుడైన రామచంద్రుని పనిపూని సాహసించి ఇక్కడకు వచ్చి ఇప్పుడు సీతను కానక  సుగ్రీవుని సన్నిధికి వట్టిచేతులతో వెళ్ళిన అందరూ నవ్వరా? మగతనమును, మాటకు కట్టుబడియుండుటయు నేటితో పోవునుకదా!

**తే.గీ.** **లెక్క కెక్కువయగు కోతి లెంకలెల్ల**
**గనుఁగొనఁగ నేలతేఁడు నన్గదియఁ బిలిచి**
**పడఁతి కిమ్మని యుంగరం బిడుట కెటులఁ**
**బని యొనర్పక క్రమ్మఱఁ జనఁగఁ బోలు?** **20**

లెక్కకు ఎక్కువయగు = లెక్క పెట్టలేని, కోతి లెంకలు ఎల్లన్ = వానర వీరులందరును, కను గొనగ, నేలతేడు = రాముడు, నన్ గదియ పిలిచి = నన్ను చెంతకు పిలిచి, పడతికి ఇమ్ము అని = సీతకు ఇయ్యమని, ఉంగరంబు ఇడుటకు = ఉంగరాన్ని ఇచ్చినందుకేనా, ఎటుల పని యొనర్పక = ఏవిధంగా పనిని పూర్తిచేయకుండా, క్రమ్మఱన్ = తిరిగి, చనగ పోలు = వెళ్ళుటకు తగును?

**తా :** లెక్కకు మీఱిన వానర వీరులందరును చూచుచుండగా రాముడు నన్ను పిలిచి సీతకు ఇమ్మని ఉంగరాన్ని ఇచ్చినందుకేనా ఈ పని పూర్తిచేయకుండా తిరిగి వెళ్ళడం తగదు.

**ఆ.వె.** **తులువ రక్కసుండు దొంగిలి తెచ్చుచో**
**మడఁతి బీతు గుడిచి మడిసె నొక్కొ?**
**కానఁ గానరాని కడ దాఁచె నొక్కొ యి**
**చ్చెనఁటి? యింకనేమి సేయువాఁడ?** **21**

తులువ రక్కసుండు = దుర్మార్గుడైన రావణుడు, దొంగిలి తెచ్చుచో = దొంగిలించి తెచ్చు నపుడు, మడతి = సీతాదేవి, బీతు కుడిచి = భయపడి, మడిసెను ఒక్కొ = చనిపోయిన దేమో?, ఈ చెనటి = ఈ నీచుడు, కానన్ = అడవిలోనే, కానరాని కడ = కనబడని చోట, దాచెను ఒక్కొ = దాచి ఉంచెనేమో?, ఇంకన్ = ఇకమీదట, ఏమి చేయువాడ = ఏం చెయ్యాలి?

**తా :** దుర్మార్గుడైన రావణుడు దొంగిలించి తెచ్చునపుడు సీత భయపడి చనిపోయిందేమో? ఈ నీచుడు అడవిలోనే కనబడనిచోట దాచివుంచెనేమో? ఇక మీదట ఏం చెయ్యాలి?

**చం.** **వెలఁదినిఁ జూపుమంచుఁ దొలివేలుపు రాయని యెమ్ము లొక్కటం**
**గులగులఁగా నడంతునొ? రగుల్కొన జేతునొ ముజ్జగమ్ములన్?**
**మిలమిలలాడుచున్ దవిలి మింట వెలింగెడు రిక్కలన్నియుం**
**జలజల రాలఁ దన్నుదునొ? సంద్రము లుమ్మడి నింకఁ జేతునో?** **22**

వెలదిని చూపుము అంచున్ = సీతను చూపుమని, తొలివేలుపురాయని = రావణుని, ఎమ్ములు = ఎముకలు, ఒక్కటన్ = ఒక్కసారిగా, గులగులగాన్ = గులగుల శబ్దముతో రాలిపోవునట్లుగ, అడంతునొ = అణచివేసెదనా?, మూడు జగంబులన్ = మూడు లోకములను, రగుల్కొనన్ = తగులబడి పోవునట్లుగ, చేతునొ = చేయుదునా?, మింటన్ = ఆకాశమున, తవిలి = తగుల్కొని, మిలమిలలాడుచున్ = తళ తళమంటూ, వెలింగెడు = ప్రకాశించు, రిక్కలు అన్నియున్ =

నక్షత్రములు అన్నియును, జలజల రాలన్ = జలజల రాలిపోవునట్లుగా, తన్నుదునొ = తన్ననా?, సంద్రములు ఉమ్మడిన్ = ఉమ్మడిగా అన్ని సముద్రములను, ఇంకన్ చేతునో = ఇంకిపోవునట్లుగ చేయుదునా?

**తా :** సీతను చూపుమని రావణుని ఎముకలు ఒక్కసారిగా గులగుల రాలునట్లుగ అణచివేసెదెనా? ముల్లోకాలు రగుల్కొన చేయుదునా? ఆకాశమున వెలిగే నక్షత్రాలన్నీ జలజల రాలిపోవునట్లుగ తన్ననా? ఉమ్మడిగా అన్ని సముద్రాలను ఇంక చేయనా?

**కం.** **కొండలు పిండి యొనర్తునొ?**
**గండెసఁగఁగ నలువగ్రుడ్డు గాలింతునొ? వే**
**చెండుదునొ గుదియ తాలుపు**
**కండలు గుండియలు వేల్పుగమి నొంపుదునో? 23**

కొండలు, పిండి ఒనర్తునొ = పిండి చేయుదునా?, గండు ఎసగగ = పరాక్రమము అతిశయించు నట్లుగా, నలువ గ్రుడ్డు = బ్రహ్మాండమును, గాలింతునో = క్షుణ్ణముగా వెదకనా?, వే = శీఘ్రముగా, గుదియ తాలుపు కండలు = గదను ధరించు యముని కండలను, గుండియలు = గుండెలను, చెండుదునొ = నరకివైచెదనా? వేల్పుగమిన్ = దేవతా సమూహమును, నొంపుదునో = బాధింతునా?

**తా :** కొండలు పిండి చేయుదునా? పరాక్రమంతో బ్రహ్మాండమును గాలించనా? శీఘ్రముగా యముని కండలను, గుండెలను నరకివైచెదనా? దేవతలను బాధింతునా?

**కం.** **అని యిత్తెఱఁగున డెందం**
**బునఁ దలఁపుచుఁ గొమ్మ మెకపు పోటరి యత్తా**
**పునఁ దరలి మెల్లమెల్లనఁ**
**జని యొకచో మిగుల సంతసము దైవారన్ 24**

అని = అనుకొని, కొమ్మ మెకపు పోటరి = వానరవీరుడగు హనుమంతుడు, ఈ తెఱంగున = ఈ ప్రకారముగా, డెందంబునన్ = మనసునందు, తలపుచున్ = తలంచుచు, ఆ తావునన్ = ఆ ప్రదేశమునుండి, తరలి = బయలుదేరి, మెల్లమెల్లన చని = నెమ్మదిగా వెళ్ళి, ఒకచో = ఒకచోట, మిగుల = మిక్కిలి, సంతసము దైవారన్ = సంతోషము అతిశయింపగా –

**తా :** అనుకొని హనుమ ఈ ప్రకారంగా మనసున తలంచుచు, ఆ తావునుండి బయలుదేరి వెళ్ళి ఒకచో మిక్కిలి సంతోషము అతిశయింపగా –

**సీ.** **మారేళ్ళు నేరేళ్ళు మావులు రావులు**
**పనసలు గొజ్జంగు లనఁటు లిప్ప**
**లీడెలు సంపంగు లిరువుడు ల్పొగడలు**
**దబ్బలు ప్రబ్బలు త్రాళ్ళు మేళ్ళు**
**గోఁగులు రేఁగులు క్రోవులు మోవులు**
**మద్దులు నిమ్మలు లొద్దుగులును**

**గలుగొట్లు పొన్నలు కదుములు వెలగలు**
**గోరంటలు సిరిక ల్నారికెడము**
**తే.గీ. లందుగులు గేదఁగులు మఱ్ఱు లిందుగులును**
**మోదుగులు దాసనంబులు మొదలు గలుగు**
**మ్రాఁకులకు నిక్క యగుచు వేమఱుఁ జెలంగు**
**చున్న నాడెంపు పూఁ దోట యొకటిఁ గనియె** **25**

మారేళ్ళు = మారేడు చెట్లు, నేరేళ్ళు = నేరేడు చెట్లు, మావులు = మామిడి చెట్లు, రావులు = రావి చెట్లు, పససలు = పనస చెట్లు, గొజ్జంగులు = గొజ్జంగి చెట్లు, అనటులు = అరటి చెట్లు, ఇప్పలు = ఇప్ప చెట్లు, ఈడెలు = ఎట్టికిత్తలి చెట్లు, సంపంగులు = సంపంగి చెట్లు, ఇరువుడులు = శింశుపా వృక్షములు, పొగడలు = పొగడ చెట్లు, దబ్బలు = దబ్బ చెట్లు, ప్రబ్బలు = ప్రబ్బలి చెట్లు, త్రాళ్ళు = తాటి చెట్లు, మేళ్ళు = మేడి చెట్లు, గోగులు = గోగు చెట్లు, రేగులు = రేగి చెట్లు, క్రోవులు = కురవక చెట్లు, మోవులు = మోవి చెట్లు, మద్దులు = మద్ది చెట్లు, నిమ్మలు = నిమ్మ మొక్కలు, లొద్దుగులును = లోధ్రక వృక్షములును, కలుగొట్లు = కలిగొట్టు చెట్లు, పొన్నలు = పొన్న చెట్లు, కదుములు = కడిమి చెట్లు, వెలగలు = వెలగ చెట్లు, గోరంటలు = గోరింట చెట్లు, ఉసిరికల్ = ఉసిరి చెట్లు, నారికెడమలు = కొబ్బరి చెట్లు, అందుగులు = సల్లకీ వృక్షములు, గేదగులు = మొగిలి పొదలు, మఱ్ఱులు = మఱ్ఱి చెట్లు, ఇందుగులును = చిల్ల చెట్లును, మోదుగులు = మోదుగ చెట్లు, దాసనంబులు = జపావృక్షములు, మొదలు కలుగు = మొదలైన, మ్రాకులకున్ = వృక్షములకు, ఇక్క అగుచు = స్థానమగుచు, వేమఱున్ చెలంగు = మిక్కిలి అతిశయించుచున్న, నాడెంపు = శ్రేష్ఠమైన, పూవుతోట = పూలతోటను, ఒకటిన్ = ఒకదానిని, కనియెన్ = చూచెను.

**తా :** మారేడు, నేరేడు, మామిడి, రావి, పనస, గొజ్జంగి, అరటి, ఇప్ప, ఎట్టికిత్తలి, సంపంగి, శింశుపా, పొగడ, దబ్బ, ప్రబ్బలి, తాడి, మేడి, గోగు, రేగు, క్రోవు, మోవి, మద్ది, నిమ్మ, లోధ్రక, కలిగొట్టు, పొన్న, కడుము, వెలగ, గోరంట, ఉసిరిక, కొబ్బరి, అందుగు, మొగిలి, ఇందుగు, మోదుగ, దాసనములు మొదలైన మ్రాకులకు స్థానమై అతిశయించచున్న శ్రేష్ఠమైన పూలతోటను హనుమ చూచెను.

**కం. కని తప్పటడుగు లిడుచం**
**జని మెల్లనె యందు దూఱి జతనంబున నిం**
**తిని నెమకుచు మ్రోలం జ**
**క్కని బంగరు మేడ యొకటి గనుఁగొని సరగన్** **26**

కని = చూచి, తప్పటడుగులు ఇడుచం చని = (సీత కనబడలేదని) నిరుత్సాహముగా చప్పిడి అడుగులు వేయుచూ వెళ్ళి, మెల్లనె, అందు = ఆ తోటలో, దూఱి = ప్రవేశించి, జతనంబునన్ = ప్రయత్నముతో, ఇంతిని = సీతను, నెమకుచు = వెదకుచు, మ్రోలన్ = చేరువను, చక్కని = అందమైన, బంగరు మేడ ఒకటి = ఒక బంగారు మేడను, కనుగొని = చూచి, సరగన్ = వెంటనే,

**తా :** చూచి నిరుత్సాహంగా చప్పిడి అడుగులు వేస్తూ వెళ్ళి నెమ్మదిగా ఆ తోట ప్రవేశించి ప్రయత్నంతో సీతను వెదకుచు చేరువను చక్కని బంగరు మేడ ఒకటి చూచి వెంటనే –

**కం.** **అమ్మేడ చివర కెంతయు**
**నెమ్మదితో నెక్కి కడలు నెమకుచుఁ జెట్టుం**
**ద్రిమ్మరి తెలిడాలు మెకం**
**బిమ్ముగ నొక మ్రానినీడ నెనసిన కడఁకన్** **27**

చెట్టుం త్రిమ్మరి = హనుమంతుడు, ఆ మేడ = ఆ భవనముయొక్క, చివరకు = ఉపరి భాగమునకు, ఎంతయు నెమ్మదితోన్ = మిక్కిలి మెల్లిగా, ఎక్కి = అధిరోహించి, కడలు = అన్నివైపుల, నెమకుచున్ = వెదకుచు, ఒక మ్రాని నీడన్ = ఒక చెట్టు నీడలో, ఇమ్ముగ = సుఖముగ, తెలిడాలు మెకంబు = తెల్లని రంగుకల సింహము, ఎనసిన కడకన్ = ఉన్నదో యనునట్లుగా –

**తా :** హనుమ ఆ భవనము ఉపరిభాగమునకు ఎక్కి అన్నివైపుల వెదకుచు ఒక చెట్టు నీడలో సుఖముగ తెల్లని సింహము ఉన్నదో అనునట్లుగ –

**సీ.** **కట్టిన నెఱ మాపు గడితంపు పుట్టంబు**
**సెన్ను మీఱెడు నార చీరగాఁగఁ**
**గలయంగ నంటలు గట్టి మూఁపున వ్రేలు**
**నిడుద పెన్నెఱులు కెంజడలుగాఁగఁ**
**బుడమిపై నిచ్చలుఁ బొరలుచో నొదవిన**
**బూడిద మైపూత బూది కాఁగ**
**నిదురయుఁ గుడుపును వదలి యుండుటయెల్లఁ**
**దరలక యొనరించు తబముగాఁగఁ**

**తే.గీ.** **వానలకు నెండలకు గరువలికి నలికి**
**సైఁచి డెందంబు తన పాలి సామియందె**
**నిలుపుకొని కేరు జోగి జాబిలి తెఱఁగునఁ**
**బొనరు నొక రాచ తలిరాకుఁబోఁడిఁ జూచె** **28**

కట్టిన = కట్టుకొన్న, నెఱ మాపు = పూర్తిగా మాసిపోయిన, గడితంపు పుట్టంబు = ముదుగైన వస్త్రము, చెన్ను మీఱెడు = మిక్కిలి అందమైన, నారచీర కాగన్, కలయంగ = వ్యాపించి, అంటలు కట్టి = జడలు కట్టి, మూపున = వీపుపై, వ్రేలు = వ్రేలాడుచున్న, నిడుద పెన్నెఱులు = పొడవైన వెంట్రుకలు, కెంపు జడలు కాగన్ = ఎఱ్ఱని జటలు కాగా, పుడమిపై = భూమిమీద, నిచ్చలున్ = నిత్యమును, పొరలుచోన్ = దొర్లుటచేత, బూడిద = ఒంటికి అంటిన బూడిద, మైపూత = శరీరమునకు పూసుకొనిన, బూదికాగన్ = విభూతి కాగా, నిదురయున్ = నిద్రయును, కుడుపును = భోజనమును, వదలి = విడిచిపెట్టి, ఉండుట ఎల్లన్ = ఉండుటంత యును, తరలక = వదలక, ఒనరించు = చేయుచున్న, తబము కాగన్ = తపస్సు కాగా, వానలకున్, ఎండలకున్, గరువలికిన్ = చలికి,

అలికి = బాధను, సైచి = సహించి, డెందమున = మనస్సున, తన పాలి = తన భాగమైన, సామి యందె = రాముని యందే, నిలుపుకొని = ఉంచుకొని, కేరు = ఆనందించుచున్న, జోగి జాబిలి = యోగి చంద్రమ, తెఱగునన్ = పద్ధతితో, పొనరు = ఒప్పుచున్న, ఒక రాచ తలిరాకు బోడిన్ = ఒక అందమైన చిగురుటాకు వంటి దేహముగల స్త్రీని, చూచె = చూచెను.

**తా :** కట్టుకున్న పూర్తిగా మాసిన ముదగైన నారచీర, అట్టలుకట్టి వీపుపై వ్రేలాడుచున్న ఎఱ్ఱని జడలు, ఒంటికి అంటిన బూడిద మైపూత విభూతిగా, కూడు, నిద్ర విడిచిపెట్టడం గొప్ప తపస్సుగా, ఎండ,వాన,చలి బాధను సహించి మనసు తన స్వామియందే నిలుపుకొని ఆనందించుచున్న యోగి విధమున ఒప్పుచున్న ఒక సుందరిని చూచెను.

**తే.గీ.** **పెల్లు గిఱిగొన్న బావురు పిల్లిగముల**
**చేతఁ జిక్కిన యాట రాచిలుక వోలెఁ**
**జెడుగు పొలదిండి పడఁతుల నడుమనున్న**
**యన్నెలంతుక నటఁ జూచి మిన్ను ముట్టి** **29**

పెల్లు = అధికముగా, గిఱి కొన్న = చుట్టును మూగియున్న, బావురు పిల్లి గముల చేతన్ = పెద్ద బావురు పిల్లుల గుంపుచేత, చిక్కిన = దొరికిన, ఆట రాచిలుక పోలెన్ = పెంపుడు రామచిలుక మాదిరిగా, చెడుగు = దుష్టులైన, పొలతిండి పడతుల నడుమను ఉన్న = రాక్షస స్త్రీల మధ్యలోనున్న, ఆ నెలంతుకన్ = ఆ స్త్రీని, అటన్ చూచి = అక్కడ చూచి, మిన్నుముట్టి = సంతోషముతో ఆకాశమున కెగిరి,

**తా :** చుట్టూమూగిన బావురుపిల్లి గుంపుకు దొరికిన పెంపుడు రామచిలుకలా దుష్టులైన రాక్షసస్త్రీల నడుమనున్న ఆ స్త్రీని చూచి సంతోషముతో ఆకాశమున కెగిరి.

**ఆ.వె.** **పడఁతి చందమెల్లఁ బరికింపఁ బంట పై**
**దలి యనుంగుపట్టి వలెనె తోఁచు**
**చున్న దనుచు మేడఁ గ్రన్నన దిగి యాపె**
**గూరుచున్న మాని కొనకుఁ బ్రాఁకె** **30**

పడతి చందము ఎల్లన్ = ఆ స్త్రీయొక్క విధానమంతయు, పరికింపన్ = పరిశీలింపగా, పంట పైదలి = భూదేవియొక్క, అనుంగుపట్టి వలెనె = కూతురు (సీత) వలెనె, తోచుచున్నది అనుచు = అనిపించుచున్నది అనుచు, క్రన్నన = శీఘ్రముగా, మేడ దిగి = మేడను దిగివచ్చి, ఆపె కూరుచున్న = ఆమె కూర్చున్నటువంటి, మాని కొనకు ప్రాకె = చెట్టు కొనకు పాకెను.

**తా :** ఆ స్త్రీ చందమంతయు పరిశీలింపగా సీత వలెనె తోచుచున్నది అనుచు తొందరగా మేడ దిగివచ్చి ఆమె కూర్చున్న చెట్టుకొనకు పాకెను.

**తే.గీ.** **ప్రాఁకి యమ్మేటి యిరుగుడు మాఁకు చివురు**
**జొంపములలోన నిటికి యజ్జోటి సారె**
**సారెకును రామ రామ యన్పేరు నుడువ**
**నొనర నాలించి సీతయంచును దలంచి** **31**

ప్రాకి = చెట్టు కొనకు పాకి, ఆ మేటి = ఆ హనుమంతుడు, ఇరుగుడు మాకు = శింశుపా వృక్షముయొక్క, చివురు జొంపములలోనన్ = చిగురుటాకుల గుబురులో, ఇఱికి = నక్కి, ఆ జోటి = ఆ స్త్రీ, సారె సారెకును = మాటిమాటికిని, రామ రామ అను పేరు, నుడువన్ = పలుకుచుండగా, ఒనరన్ ఆలించి = చక్కగా విని, సీత అంచును తలంచి = సీతయే అని నిశ్చయించుకుని,
**తా :** చెట్టు కొనకు పాకి హనుమ శింశుపా వృక్షము చిగురుటాకుల గుబురులో నక్కి ఆ స్త్రీ మాటిమాటికి రామ రామ అను పేరు పలుకుచుండగా విని సీతయే అనుకొని –

**కం.** **ఈ పున్నియంపు జెలికే**
**రూపునఁ దన నిక్కువంపు రూపేరుపడన్**
**జూపుదుఁ? బైదలితో నిఁక**
**నీ పట్టున మాటలాడ నెట్లొనగూడున్? 32**

ఈ పున్నియంపు చెలికి = ఈ పవిత్రమైన సీతకు, ఏరూపునన్ = ఏ విధముగా, తన నిక్కువంపు రూపు = తన నిజమైన రూపు, ఏరుపడన్ చూపుదు = ప్రకటితము చేయుదును?, పైదలితో = ఈ స్త్రీతో, ఇక, ఈ పట్టున = ఈ ప్రదేశంలో, మాటలాడన్, ఎట్లు ఒనగూడున్ = ఎలా కుదురుతుంది?
**తా :** ఈ పవిత్రురాలికి ఏ విధంగా తన నిజరూపాన్ని ప్రకటితం చేయడం? ఈమెతో ఇంక ఈ ప్రదేశంలో మాట్లాడడం ఎలా కుదురుతుంది?

**తే.గీ.** **అని తలంచుచునున్నచో నంతలోనె**
**మన్ను కానుపు సొగసెల్ల మదిని నిల్పి**
**రక్కసుల ఱేఁడు మిగుల విరాళి దేలి**
**తాల్మి యెల్లను బ్రీలి తత్తరము తోడ 33**

అని తలంచుచును ఉన్నచోన్ = అని ఆలోచించుచుండగా, అంతలోనె = ఆ సమయములోనే, మన్ను కానుపు సొగసు ఎల్లన్ = సీతాదేవి సౌందర్యమునంతను, మదిని నిల్పి = మనసులో తలచుకొని, రక్కసుల ఱేడు = రావణుడు, మిగుల విరాళి తేలి = అధికమైన విరహమున తేలి, తాల్మి ఎల్లను ప్రీలి = ఓర్మిని పూర్తిగా కోల్పోయి, తత్తరము తోడ = తడబాటుతో –
**తా :** అని ఆలోచించుచుండగా ఆ సమయంలోనే సీతాదేవి సొగసునంతను మనసులో నిల్పుకొని రావణుడు విరహమున తేలి ఓరిమి నశించి తడబాటుతో –

**సీ.** **చలువ గొజ్జఁగినీట జలకంబులాడి జి**
**ల్గు మణుంగు గొనబు పుట్టములు గట్టి**
**వినుప్రాని పరువంపు విరిదండ లెదనించి**
**కలయ నెమ్మెయిఁ గమ్మ కలపమలఁది**
**వెలమించు రతనంపు గిలుకు పావలు మెట్టి**
**కేల జాబిలి పువ్వు వాలువట్టి**
**మొసలివాపోఁగు లింపెసఁగ వీనులఁ బెట్టి**
**తలల హొంబొమిడికల్ తనర నిల్పి**

**తే.గీ.** **గొలుసు లుంగరములు మురుంగులును బతక**
**ములును దాళీలు నేవళంబులును గండ**
**పెండెరంబులు మొదలగు పెద్ద తొడవు**
**లెల్ల బలితంపు సింగార మెలయఁ బూని** **34**

చలువ గొజ్జగి నీట = చల్లని పన్నీటితో, జలకంబులు ఆడి = స్నానము చేసి, జిల్గు = మెరిసే, మణుంగు = శుభ్రమైన, గొనబు = శ్రేష్ఠమైన, పుట్టములు కట్టి = వస్త్రములు ధరించి, వినుమ్రాని = కల్పవృక్షముయొక్క, పరువంపు = బాగా విరిసిన, విరిదండలు = పూలదండలను, ఎద నించి = గుండెలపై నింపుకొని, నెఱ మెయిన్ = శరీరమంతయును, కలయన్ = వ్యాపించునట్లుగా, కమ్మకలపము = సుగంధ ద్రవ్యములు, అలది = పూసికొని, వెలమించు = విలువైన, రతనంపు = రత్నాలు పొదిగిన, గిలుకు = ధ్వనించుచున్న, పావలు = పాదరక్షలు, మెట్టి = తొడుగుకొని, కేలన్ = చేతిలో, జాబిలి పువ్వు వాలు = చంద్రుడు పువ్వుగాగల శివుని ఆయుధమైన త్రిశూలమును, పట్టి = పట్టుకొని, మొసలివా ప్రోగులు = మకర కుండలములు, ఇంపు ఎసగ = మిక్కిలి అందముగా, వీనులన్ పెట్టి = చెవులకు పెట్టుకొని, తలల = పది తలలయందును, హొన్ను బొమిడికల్ = బంగారు కిరీటములు, తనర నిల్పి = చక్కగా ఉంచుకొని, గొలుసులు, ఉంగరములు, మురుంగులును, పతకములును, తాళీలు = తావళములు, నేవళంబులును = మణుల హారములును, గండపెండెరంబులు, మొదలగు, పెద్ద తొడవులు ఎల్ల = గొప్ప అలంకారములన్నిటిని, బలితంపు = మనోజ్ఞమైన, సింగారము = శృంగారము, ఎలయన్ పూని = ఒప్పునట్లుగా ధరించి,

**తా :** చల్లని పన్నీటితో స్నానము చేసి, మెరిసే శుభ్రమైన వస్త్రములు ధరించి, కల్పవృక్షపు పూలు గుండెలపై నింపుకొని, శరీరమంతా సుగంధ ద్రవ్యములు పూసుకొని, రత్నాలు పొదిగిన పాదరక్షలు తొడుగుకొని, చేతిలో త్రిశూలమును పట్టుకొని, మకర కుండలములు చెవులకు అందముగా పెట్టుకొని, పది తలలకు బంగారు కిరీటములు ఉంచుకొని, గొలుసులు,ఉంగరములు,మురుగులు, పతకములు,తావళములు,మణుల హారములు,గండపెండేరములు మొదలైన గొప్ప అలంకారము లన్నిటిని చక్కగా ధరించి.

**సీ.** **అచ్చర విరిఁబోఁడు లాలవట్టము లూన**
**వినుటెంకి చెలులు వీవనలు వైవఁ**
**బాఁప చానలు దమ్మపడగలు సేకొనఁ**
**బక్కి కొమ్మలు బరాబరు లొనర్పఁ**
**తెఱగంటి గాణల తెఱవ లెల్లను బాడఁ**
**దొలివేల్పు బోండ్లు కైదువలు దాల్ప**
**జక్కుల పొలఁతు లిచ్చల దివ్వెటీ ల్వట్టఁ**
**దత్తడి మోర పైదలులు వొగడ**

**తే.గీ.** **మఱియుఁ దక్కిన వేలుపు మచ్చెకంటు**
**లూడిఁగపు చెయ్వు లొనరింప నీడు లేని**
**ఠీవిఁ బొదలుచుఁ జెలువంపు పూవుఁదోట**
**కేపు దళుకొత్త గొబ్బున నేఁగు దెంచె** **35**

అచ్చర విరిబోడులు = అప్సరస కాంతలు, ఆలవట్టములు ఊనన్ = ఛత్రములు పట్టుకొనగా, వినుటెంకి చెలులు = ఖేచర వనితలు, వీవనలు వైవన్ = విసనకఱ్ఱలతో విసరుచుండగా, పాప చానలు = నాగ కన్యలు, తమ్మపడగలు చేకొనన్ = తాంబూల పేటికలు చేపట్టగా, పక్కి కొమ్మలు = గరుడ కన్యలు, బరాబరులు ఒనర్పన్ = హెచ్చరికలు చేయగా, తెఱగంటి గాణల తెఱవలు ఎల్లన్ = గంధర్వ కాంతలు అందరును కలిసి, పాడన్ = కీర్తించుచుండగా, తొలివేల్పు బోండ్లు = రాక్షస స్త్రీలు, కైదువలు దాల్ప = ఆయుధములను ధరింపగా, జక్కుల పొలతులు = యక్ష వనితలు, ఇచ్చలన్ = కోరి, దివ్విటీలు పట్టన్ = కాగడాలు పట్టుకొనగా, తత్తడి మోర పైదలులు = కిన్నెర కాంతలు, పొగడ = స్తుతించుచుండగా, మఱియు = ఇంకను, తక్కిన వేలుపు మచ్చెకంటులు = మిగిలిన దేవకాంతలు, ఊడిగపు చెయ్వులు ఒనరింప = సేవాకార్యక్రమములు చేయుచుండగా, ఈడులేని ఠీవిన్ పొదలుచున్ = సాటిలేని వైభవముతో ప్రకాశించుచు, చెలువంపు = సుందరమైన, పూవు తోటకు = అశోకవనమునకు, ఏపు తళుకొత్త = తన గొప్పతనము ప్రదర్శితమగుచుండగా, గొబ్బునన్ = తొందరగా, ఏగు తెంచెన్ = వచ్చెను.

**తా :** అప్సరసలు వింజామరలు పట్టుకొనగా, ఖేచర వనితలు విసనకఱ్ఱల విసరుచుండగా, నాగకన్యలు తాంబూల పేటికలు పట్టుకొనగా, గరుడ కాంతలు హెచ్చరికలు చేయగా, గంధర్వ కన్యలు కీర్తించుచుండగా, రాక్షస స్త్రీలు ఆయుధములను ధరింపగా, యక్ష వనితలు కాగడాలు పట్టుకొనగా, కిన్నెర కాంతలు స్తుతించుచుండగా, మిగిలిన దేవకాంతలు ఊడిగము లొనరింపగా సాటిలేని వైభవముతో అశోకవనమునకు తన గొప్పతనము ప్రదర్శితమగునట్లుగా వచ్చెను.

**ఆ.వె.** **ఏఁగుదెంచి సొగసులేర్పడ నమ్మన్ను**
**చూలి మ్రోల నిలిచి సొరిదిఁ బలికె**
**వాలుఁగంటి వట్టి బేలవై నీ విట్లు**
**వెతలఁ గుందఁ దగునె వెఱవుమాలి?** **36**

ఏగుదెంచి = వచ్చి, సొగసులు ఏర్పడన్ = అందములు చిందించుచూ, ఆ మన్ను చూలి మ్రోలన్ = ఆ సీతాదేవి ఎదుట, నిలిచి, సొరిది పలికె = క్రమముగా పలికెను, వాలు కంటి = ఓ సుందరమైన కన్నులుకల సీతా, వట్టి బేలవై = శుద్ధ అమాయకురాలవై, నీవు ఇట్లు = నీవు ఈవిధముగా, వెఱవుమాలి = తెలివితక్కువగా, వెతలన్ కుందన్ = కష్టములతో బాధపడుట, తగునె = తగునా?,

**తా :** వచ్చి సొగసు లేర్పడగా ఆ సీత ఎదుట నిలబడి పలికెను 'ఓ వాలుకంటీ! వట్టి బేలవై ఇలా తెలివితక్కువగా కష్టములతో బాధపడడం తగునా?

**కం. ఇమ్మేటి సోయగంబున**
**కి మ్మేలిమి గారవమున కిప్పగిది నయో!**
**నెమ్మది బెరయక ముద్దుల**
**గుమ్మా! బలితంపు దెసలఁ గుందుట మేలే? 37**

ఈ మేటి సోయగంబునకు = ఇంతటి సౌందర్యమున్నందులకు, ఈ మేలిమి గారవమునకు = ఇంతటి బంగారు ప్రతిష్ఠవున్నందుకు, ముద్దులగుమ్మా = ముద్దులొలికేదానా!, ఈ పగిదిన్ = ఈ విధముగా, అయో = అయ్యో!, నెఱ మది = నిండు మనసుతో, బెరయక = నన్ను చేరక, బలితంపు దెసలన్ = అనవరసమైన అవస్థలను, కుందుట = బాధపడుట, మేలే = మంచిదంటావా?

**తా :** ముద్దులగుమ్మా! ఇంతటి సౌందర్యమున్నందుకు, ఇంతటి బంగారు ప్రతిష్ఠవున్నందుకు మనసుపడి నన్ను చేరక ఈ విధంగా అనవసరమైన అవస్థలు పడడం మంచిదంటావా?

**కం. క్రొన్ననబోఁడిరొ! దిటమగు**
**జన్నియఁ గైకొని మెఱుంగు జవ్వనమెల్లన్**
**మిన్నక కోనం గాచిన**
**వెన్నెలగాఁ జేయఁ దగునె వేఁటిడివగుచున్? 38**

క్రొత్త ననబోడిరొ = క్రొత్త తీగవంటి దేహముకలదానా!, దిటమగు = కఠినమైన, జన్నియన్ = వ్రతమును, కైకొని = స్వీకరించి, మెఱుంగు జవ్వనము ఎల్లన్ = శోభాయుక్తమైన నీ యౌవనమునంతను, వేఁటిడివి అగుచున్ = అవివేకివగుచు, మిన్నక = వ్యర్థముగా, కోనం గాచిన = అడవిని కాచిన, వెన్నెలగాన్ = వెన్నెల రీతిగా, చేయన్ తగునె = చేయుట తగినదేనా?

**తా :** క్రొన్ననబోడిరొ! దృఢమైన వ్రతంపూని శోభాయుక్తమైన నీ యౌవనమంతా అవివేకివగుచు వ్యర్థంగా అడవికాచిన వెన్నెల చేయడం తగినదేనా?

**కం. అలములు దుంపలు నమలుచుఁ**
**బొలములఁ బడి తిరుగు రాచపురువులపై ని**
**చ్చలముగఁ దలఁపిడి యకటా!**
**చలమున నిటులుంట ప్రోడ జాడయె నీకున్? 39**

అలములు దుంపలు = కాయగూరలు, దుంపలు, నమలుచు = తినుచు, పొలముల పడి = అడవులవెంట పడి, తిరుగు = సంచరించు, రాచపురువులపైన్ = పురుగులవంటి రాజపురుషులపై, నిచ్చలముగ = స్థిరముగ, తలపు ఇడి = బుద్ధిని ఉంచి, అకటా = అయ్యో!, చలమున = మూర్ఖత్వమున, ఇటులు ఉంట = ఇలాగ ఉండడం, నీకున్ = నీకు, ప్రోడ జాడయె = తెలివైన పనేనా?

**తా :** కాయగూరలు, దుంపలు తింటూ అడవుల వెంటపడి తిరుగుతూ పురుగులవంటి రాజపురుషులపై బుద్ధినుంచి మూర్ఖత్వంతో ఇలా ఉండడం నీకు తెలివైన పనేనా?

**కం. తెఱవా! నాడెపు టచ్చులు**
**తెఱవలకున్ లేని మేల్గదియ వచ్చు నెడం**

**జెలుచుకొనఁ గూడ దిపుడీ**
**కలిటితనం బుడిగి నెమ్మిఁ గైకొను నన్నున్ 40**

తెలవా = ఓ సీతా!, నాడెపు = శ్రేష్ఠరాం్రడైన, అచ్చర తెలవలకున్ = అప్సరస స్త్రీలకు, లేని మేల్ = కలుగనటువంటి శుభము, కదియ వచ్చునెడన్ = చేరువవుతుండగా, చెలచుకొనన్ కూడదు = చెడగొట్టుకోకూడదు, ఇపుడు = ఇప్పుడు, ఈ కలిటితనంబు = ఈ మూర్ఖత్వమును, ఉడిగి = విడిచిపెట్టి, నెమ్మిన్ = ప్రీతితో, నన్నున్ కైకొను = నన్ను చేపట్టుము.

**తా :** ఓ సీతా! నాడెమైన అప్సరస స్త్రీలకు లేని మేలు చేరువవుతుండగా చెలచుకోకూడదు. ఇప్పుడు ఈ మూర్ఖత్వమును వదలి ప్రీతితో నన్ను చేపట్టుము.

**సీ. మలగొంగ యలరు టెత్తులు గట్టియిడుచుండు**
**దంటమోముల సామి వంటసేయు**
**గవని వాకిలి నిచ్చఁ గాచుచుండు జముండు**
**వాలు మోచుక యుండు మూలతేఁడు**
**త్రాడు దాలుపు మేలి రతనముల్ గొనితెచ్చు**
**గందవొళ్ళొసఁగు నాకసపుఁ గుఱ్ఱ**
**బచ్చయి వెచ్చంబు లిచ్చు రొక్కపు దొర**
**దళవాయియై కొల్చు చిలువతాల్పు**

**తే.గీ. తమ్మి పూఁజూలి మ్రోల పొత్తమ్ము విప్పి**
**చదువుచుండుఁ గరంబు హెచ్చరికతోడ**
**నిట్టి నా దొడ్డతన మెద నెన్నికొనక**
**గోల! యూరక చెడిపోవనేల చెపుమ? 41**

గోల = ముద్దరాలా!, మల గొంగ = పర్వతములకు శత్రువగు ఇంద్రుడు (తూర్పు), అలరు ఎత్తులు కట్టి = పూల మాలలను కట్టి, ఇడుచుండు = ఇచ్చుచుండును, దంటమోముల సామి = అగ్నిదేవుడు (ఆగ్నేయం), వంట చేయు = వంట చేయును, జముండు = యముడు (దక్షిణం), గవని వాకిలి = కోట ద్వారము, నిచ్చ = నిత్యమూ, కాచుచుండు = కాపలా ఉండును, మూల తేడు = నైరృతి, వాలు = ఆయుధమును, మోచుక ఉండు = ధరించి సిద్ధముగానుండును, త్రాడు తాలుపు = పాశ హస్తుడగు వరుణుడు (పశ్చిమం), మేలి రతనముల్ = మంచి రత్నములను, కొనితెచ్చు = తీసుకొని వస్తాడు, ఆకసపు కుఱ్ఱ = శూన్యంలోంచి పుట్టేది వాయువు, గంద పొళ్ళు ఒసగున్ = గంధపు పొడులను ఇచ్చును, రొక్కపు దొర = కుబేరుడు (ఉత్తరం) , బచ్చు అయి = వ్యాపారియై, వెచ్చంబులు ఇచ్చు = ఇంటికి సరుకులను ఇచ్చును, చిలువ తాల్పు = పామును ధరించినవాడు ఈశానుడు, దళవాయియై కొల్చు = సైన్యాధిపతియై సేవించును, తమ్మిపూవు చూలి = పద్మమున పుట్టినవాడు బ్రహ్మ, మ్రోల = నా దగ్గర, పొత్తమ్ము విప్పి = పంచాంగమును తెరచి, కరంబు హెచ్చరిక తోడ = చాల జాగ్రత్తగా, చదువుచుండున్ = చదువుచుండును, ఇట్టి = ఇటువంటి, నా

దొడ్డతనము = నా గొప్పతనమును, మదిన్ = నీ మనసునందు, ఎన్నికొనక = ఎంచుకోక, ఊరక = వ్యర్థముగా, చెడిపోవన్ ఏల చెపుమ = చెడిపోవడం ఎందుకు చెప్పు?

**తా :** ముగ్ధా! ఇంద్రుడు పూలమాలలు కట్టి ఇచ్చుచుండును. అగ్ని వంటచేయును. యముడు కోటద్వారము కాపలా ఉండును. నిరృతి ఆయుధమును ధరించి సిద్ధముగా నుండును. వరుణుడు మంచి రత్నములు తీసుకొనివచ్చును. వాయువు గంధపుపొడులు ఇచ్చును. కుబేరుడు ఇంటి సరుకులు ఇచ్చును. ఈశానుడు సైన్యాధిపతియై సేవించును. బ్రహ్మ పంచాంగము చదువుచుండును. ఇట్టి నా దొడ్డతనము నీ మనసున ఎంచుకొనక వ్యర్థముగా చెడిపోవుట ఎందుకు చెప్పు?

**సీ.** **అడవుల నిడుమలు గుడుచుచుఁ దిరుగు రా**
**గవుఁ డింక నిచటి కేకరణి వచ్చు?**
**వచ్చి అచ్చెరువుగా విచ్చలవిడిఁ బొంగి**
**పొఱెడు కడలి నేపగిది దాఁటు?**
**దాఁటి గాటపు నల్లద్రావుడు పౌఁజుల**
**గొఱలు నిద్దీవి యే నెఱినిఁ జొచ్చుఁ?**
**జొచ్చి యొచ్చెము లేక హెచ్చున నదరు నా**
**తోడఁ గడంగి యేజాడ నెదురు?**

**తే.గీ.** **నెదిరి పఱవక దురమున నెట్లు నిలుచు?**
**నిలిచి యే చందమున నన్ను నెమ్మి గెలుచు?**
**గెలువగాఁ బోలదిఁకఁ బెఱ తలఁపు లుడిగి**
**తీవబోఁడిరొ! కోరికల్ దీర్చు మిపుడు** **42**

తీవబోడిరొ = ఓ సీతా!, అడవులన్ = అడవులలో, ఇడుమలు గుడుచుచున్ = కష్టముల ననుభవించుచు, తిరుగు = తిరిగే, రాగవుడు = రాముడు, ఇంకన్ = ఇంక, ఇచటికి, ఏ కరణిన్ = ఏ విధముగా, వచ్చు, వచ్చి = వచ్చినను, అచ్చెరువుగా = ఆశ్చర్యకరముగా, విచ్చలవిడిన్ = స్వేచ్ఛగా, పొంగి పొఱెడు = పొంగి ప్రవహించే, కడలిన్ = సముద్రమును, ఏపగిది దాటు = ఏ విధంగా దాటగలడు?, దాటి = దాటేడే అనుకో, గాటపు = సమర్థు లైన, నల్లద్రావుడు పౌజులన్ = రక్తం త్రాగే రాక్షస సైన్యములచే, కొఱలు = వ్యాపించియున్న, ఈ దీవిన్ = ఈ లంకను, ఏ నెఱిని చొచ్చున్ = ఏ ఉపాయముతో ప్రవేశించును?, చొచ్చి = ప్రవేశించినను, ఒచ్చెము లేక = కొఱత లేక, హెచ్చునన్ అదరు = ఆధిక్యముతో ఒప్పునట్టి, నా తోడన్, కడంగి = పూనుకొని, ఏ జాడన్ ఎదురు = ఏవిధంగా ఎదుర్కోగలడు?, ఎదిరి = ఎదిరించగలిగినను, పఱవక = పారిపోకుండా, దురమున = యుద్ధమున, ఎట్లు = ఏ విధముగా, నిలుచన్ = నిలబడగలుగును? నిలిచి = నిలిచినట్లయిన, ఏ చందమున = ఏ విధముగా, నన్ను = నన్ను, నెమ్మిన్ = చక్కగా, గెలుచు = గెలువగలడు?, గెలువగా పోలదు = గెలుచుటనేది జరుగదు, ఇక = కావున, పెఱ తలపులు ఉడిగి = వేరే ఆలోచనలు మాని, ఇపుడు = వెంటనే, కోరికల్ = నా కోరికలను, తీర్చు = తీర్చుము.

**తా :** ఓ సీతా! అడవులలో కష్టాల ననుభవస్తూ తిరిగే రాముడు ఇంక ఇక్కడికి ఎలా వస్తాడు? వచ్చినా సముద్రాన్ని ఏ విధంగా దాటగలడు? దాటేడే అనుకో, సమర్థులైన రక్తం త్రాగే రాక్షస సైన్యం వ్యాపించియున్న ఈ లంకను ఏ ఉపాయంతో ప్రవేశిస్తాడు? ప్రవేశించినా కొఱతలేని ఆధిక్యంకల నాతో ఏ విధంగా ఎదుర్కోగలడు? ఎదిరించగలిగినా పారిపోకుండా యుద్ధంలో ఎలా నిలబడగలుగును? నిలిచినా ఏ విధంగా నన్ను గెలువగలడు? గెలుచుటయే జరుగదు. కాబట్టి వేరు ఆలోచనలు మాని నా కోరికలను తీర్చు.

**తే.గీ.** **కోఁతులను గొండ్రముచ్చులఁ గూడఁ బెట్టు**
**కొని పుడమిఱేఁడు మాతోడ మొనయఁ గలఁడె?**
**వట్టి యడియాస లన్నియుఁ గట్టిపెట్టి**
**పైదలిరా! యింక మేల్పట్టుఁ బట్టుకొనుము** **43**

పైదలిరా = ఓ సీతా! కోతులను, కొండ్రముచ్చులన్, కూడ పెట్టుకొని, పుడమిఱేడు = రాముడు, మాతోడ = ఇంత శక్తివంతుమైన మాతో, మొనయ కలడే = ఎదిరించకలడా? వట్టి అడియాసలు అన్నియున్ = వ్యర్థమైన లేనిపోని ఆశలనన్నిటిని, కట్టిపెట్టి = మానివేసి, ఇంకన్ = ఇంక, మేలు పట్టు పట్టుకొనుము = మంచి మార్గమును స్వీకరించుము.

**తా :** ఓ సీతా! కోతులను, కొండముచ్చులను కూడ పెట్టుకొని రాముడు మాతో ఎదిరించ కలడా? వ్యర్థమైన ఆశలు మానివేసి ఇంక మంచి మార్గం పట్టుకో.

**తే.గీ.** **కొదమ బెబ్బులి నేడిక లెదురఁ గలవె?**
**దొడ్డ సింగంబు నేనుఁగు ల్దొడరఁ గలవె?**
**పిల్లితో నింటి యెలుకలు పెనఁగఁ గలవె?**
**కలన నా మ్రోల మానుసు ల్నిలువఁ గలరె?** **44**

కొదమ బెబ్బులిన్ = బలమైన పెద్దపులిని, ఏడికలు = గొఱ్ఱెపొట్టేళ్ళు, ఎదుర కలవె = ఎదిరించ కలవా?, దొడ్డ సింగంబును = దృఢమైన సింహమును, ఏనుగుల్, తొడర కలవె = ఎదిరించ కలవా?, పిల్లితోన్, ఇంటి ఎలుకలు, పెనగ కలవె = పోరాడకలవా?, కలనన్ = యుద్ధమున, నా మ్రోల = నా యెదుట, మానుసుల్ = మానవమాత్రులు, నిలువ కలరె = నిలబడగలరా?

**తా :** పెద్దపులిని గొఱ్ఱెపొట్టేళ్ళు ఎదిరించకలవా? సింహమును ఏనుగులు ఎదిరించకలవా? పిల్లితో ఎలుకలు పోరాడకలవా? యుద్ధమున నా యెదుట మానవమాత్రులు నిలువగలరా?

**కం.** **ప్రన్నని జాణఁడు లేఁడిక**
**వెన్నవలెం గరఁగి మదికి వేడుక లొదవన్**
**సన్నకసన్నం గదియక**
**మున్నరకలఁ బోవఁ దగునె ముగుదల కెందున్** **45**

ప్రన్నని జాణడు = చక్కనైన సమర్థుడైన భర్త, లేడు ఇక = ఇంక లేడు, వెన్న వలెన్ = వెన్నలా, కరగి = కరిగిపోయి, మదికి = మనస్సునకు, వేడుకలు = సంతోషములు, ఒదవన్ = కలుగునట్లుగా,

సన్నకసన్నన్ కదియక = మెల్లగా చేరక, ముగుదలకు = ముద్దరాం(డకు, ఎందున్ = ఏ విధముగానైనను, మున్నరకలన్ పోవన్ = సాహసములకై పోవుట, తగునె = తగునా?

**తా :** సమర్థుడైన భర్త ఇంక లేడు. వెన్నలా కరిగిపోయి మనసుకు సంతోషం కలుగు నట్లుగా మెల్లగా చేరక ముద్దరాం(డకు ఏవిధంగానైనా సాహసానికి పోవడం తగునా?'

**ఆ.వె.** **అనిన మోమువంచి యవ్వెలందుక యొక్క**
**పూరిపుడక కేలఁ బూని వానిఁ**
**గూర్చి పలికె 'నోరి! కూళ రక్కసుఁడ! యి**
**క్కొఱంత కఱద లేటికొఱకు వినుర!** **46**

అనినన్ = అనగా, ఆ వెలందుక = ఆ సీత, మోము వంచి = ముఖము వాల్చుకొని, ఒక్క పూరిపుడకన్ = ఒక గడ్డిపరకను, కేలన్ పూని = చేతితో పట్టుకొని, వానిన్ కూర్చి = ఆ రావణుని ఉద్దేశించి, 'ఓరి కూళ రక్కసుడ = ఓరీ నీచ రాక్షసుడా!, ఈ కొఱత కఱదలు = ఈ కొంచెపు బుద్ధులు, ఏటి కొఱకు = ఎందుకోసం? వినుర = నా మాట వినరా?

**తా :** అనగా ఆ సీత ముఖము వాల్చుకొని ఒక గడ్డిపరకను చేత పట్టుకొని ఆ రావణుని ఉద్దేశించి 'ఓరీ నీచ రాక్షసుడా! ఈ కొంచెపు బుద్ధులు ఎందుకోసం? నామాట వినరా!'

**కం.** **ఉక్కేది నేలతేఁడులఁ**
**డక్కునఁ గను బ్రామి నన్నిటకుఁ దెచ్చిన బ**
**లైక్కలికాడవు నీ కీ**
**చిక్కని మగతనము దెల్ప సిబ్బితి గాదే?** **47**

ఉక్కు ఏది = చేవపోగొట్టుకొని, నేలతేడులన్ = రామలక్ష్మణులను, టక్కువన్ = మోసముతో, కనుబ్రామి = కనుగప్పి, నన్ను ఇటకు దెచ్చిన, బలు తెక్కలికాడవు = పెద్ద గజ దొంగవు, నీకు = గొప్ప శౌర్యశాలినని చెప్పుకునే నీకు, ఈ చిక్కని మగతనము = ఈ అంతుచిక్కని పరాక్రమము, తెల్పన్ = చెప్పుకొనుటకు, సిబ్బితికాదే = సిగ్గు అగుటలేదా?

**తా :** చేవ పోగొట్టుకుని రామలక్ష్మణులను మోసముతో కనుగప్పి నన్ను ఇక్కడకు తెచ్చిన గజదొంగవు నువ్వు. గొప్ప శౌర్యశాలినని చెప్పుకునే నీకు ఈ పరాక్రమము చెప్పుకోడానికి సిగ్గవటం లేదా?

**కం.** **ఎల్ల జగంబుల లోపల**
**బల్లిదుఁడగు రాగవుండు పరికింపంగాఁ**
**జెల్లంబో నీకెంతయు**
**నెల్లిదమై తోఁచె నింక నేమియనఁ జనున్** **48**

ఎల్ల జగంబులలోపల = లోకములన్నిటియందును, బల్లిదుడగు = బలవంతుడైన, రాగవుండు = రాముడు, పరికింపంగా = పరిశీలింపగా, చెల్లంబో = అయ్యో!, నీకు, ఎంతయున్ = మిక్కిలి, ఎల్లిదమైతోచెన్ = తక్కువవాడుగా తోచుచున్నాడు, ఏమియనన్ చనున్ = ఏమనడానికి ఉంది?

తా : లోకము లన్నిటియందు బల్లిదుడైన రాముడు పరికింపగా నీకు చాలా తక్కువ వాడుగా కనిపిస్తున్నాడు. ఇంక ఏమనడానికుంది?

**కం. అల నేలతేని బెడిదపు**
**టలుగులు నీ లంక ముంచి యరుదుగ నీ చే**
**తులు దలలు దునుముచో ని**
**మ్ముల నాతని లావు నీవు పొడcగనెదు గదా! 49**

అల = ఆ ప్రసిద్ధుడగు, నేలతేని = రామునియొక్క, బెడిదపు = కఠినములైన, అలుగులు = బాణములు, నీ లంక ముంచి = నీ లంకను కప్పివేసి, అరుదుగ = ఆశ్చర్యకరముగ, నీ చేతులు, తలలు, దునుముచో = ఖండించుచున్నప్పుడు, ఇమ్ములన్ = చక్కగా, ఆతని లావు = ఆతని పరాక్రమము, నీవు పొడగనెదు కదా = నువ్వు తెలుసుకుంటావు కదా!

**తా :** ఆ ప్రసిద్ధుడగు రాముని కఠినములైన బాణములు నీ లంకను కప్పివేసి నీ చేతులు, తలలు ఖండించుచున్నప్పుడు చక్కగా ఆతని పరాక్రమము నువ్వు తెలుసుకుంటావు.

**కం. కుఱకుఱ వేలుపు తెఱవలc**
**జెఱ వట్టిన యటులె తెలివి చెడి రామునితో**
**నుఱక పగc దెచ్చుకొంటివి**
**కొఱవిం దలcగోకు కొనcగc గోరెదు కరణిన్ 50**

కుఱకుఱన్ = అల్పత్వముతో, వేలుపు తెఱవలన్ = దేవతా స్త్రీలను, చెఱ పట్టిన అటులె = చెఱపట్టిన విధముగా, తెలివి చెడి = మూర్ఖుడవై, ఉఱక = వ్యర్థముగా, రామునితోన్ = రామచంద్రునితో, పగ తెచ్చుకొంటివి = శత్రుత్వము తెచ్చుకొంటివి, కొఱవిం = కొరవితో, తలగోకు కొనగన్, కోరెదు కరణిన్ = కోరుకొను విధముగా –

**తా :** కొఱవితో తలగోకుకొనగ కోరుకొను విధంగా అల్పత్వముతో దేవతాస్త్రీలను చెఱపట్టిన విధముగా మూర్ఖుడవై వ్యర్థముగా రామునితో శత్రుత్వమును తెచ్చుకొంటివి.

**తే.గీ. పొట్ట క్రొవ్వున నిప్పుడ ప్పుడమితేని**
**కడిమి యెఱింcగియు నెఱుcగవు గాక నీవు**
**పాలివాండ్రొక పదునాల్గు వేల కూళ**
**పొలసు మేపరు లతనిచేc బొలిసి చనరె? 51**

పొట్ట క్రొవ్వునన్ = మదించిన కారణముగా, ఇప్పుడ = ఇప్పుడు, ఆ పుడమితేని = ఆ రామచంద్రుని, కడిమి = పరాక్రమము, ఎఱిగియున్ = తెలిసికూడా, ఎఱుగవు కాక నీవు = నువ్వు తెలుసు కోలేకపోతున్నావు, పాలివాండ్రు = నీ సంబంధీకులైన, ఒక పదునాల్గు వేల, కూళ పొలసు మేపరులు = నీచులైన రాక్షసులు, అతనిచేన్ = అతని చేతిలో, పొలిసి చనరె = చచ్చిపోలేదా?

**తా :** మదించిన కారణముగా ఇప్పుడు ఆ రామచంద్రుని పరాక్రమము తెలిసికూడా నువ్వు తెలుసుకోలేకపోతున్నావు? నీవాళ్ళు 14 వేలమంది అతని చేతిలో చచ్చిపోలేదా?

**కం. గరితలఁ బలుమరుఁ గలఁచుచు**
**గరువము మెఱయంగ నీ మగంటిమి నీవే**
**కరమరుదుగఁ గొనియాడెదు**
**సిరియుం బ్రదుకెల్ల సరగఁ జెడుఁగద చెనటీ! 52**

చెనటీ = మూర్ఖుడా!, గరువము మెఱయంగ = గర్వము ప్రకటించుకొనుచు, గరితలన్ = స్త్రీలను, పలుమరున్ = అనేక విధములుగా, కలచుచు = బాధపెట్టుచు, నీ మగంటిమి = నీ పరాక్రమమును, నీవే కరము అరుదుగన్ = నువ్వే మిక్కిలి ఆశ్చర్యకరముగ, కొనియాడెదు = పొగుడుకొంటున్నావు, (తన్ను తాను పొగుడుకుంటే), సిరియుం = సంపదయును, బ్రదుకు = జీవితము, ఎల్ల = అన్నీ, సరగన్ = శీఘ్రముగా, చెడు కద = నాశనమైపోతాయి కదా!,

**తా :** మూర్ఖుడా! గర్వంతో స్త్రీలను పలు విధాలుగా బాధపెడుతూ నీ మగతనాన్ని నువ్వే పొగుడుకుంటున్నావు. ఇలా అయితే నీ సంపద, నీ జీవితం అన్నీ నాశనమయిపోతాయి.

**తే.గీ. మిడుత గడితంపు టెరగలి మీఁద నుఱికి**
**పొలయు తెఱఁగున నా ఱేని చిలుకు టగ్గి**
**కగ్గమై నీవు దిగ్గన మ్రగ్గె దుఱకఁ**
**దులువతనమున నిపుడింత త్రుళ్ళనేల? 53**

మిడుత, గడితంపు = దట్టమైన, ఎరగలి మీద ఉఱికి = అగ్నిమీద దూకి, పొలయు తెఱగునన్ = చనిపోవు విధముగా, ఆ ఱేని = ఆ రాముని, చిలుకు అగ్గికి = బాణాగ్నికి, అగ్గమై = ఆహుతియై, నీవు, దిగ్గన = శీఘ్రముగా, ఉఱక = నిష్కారణంగా, తులువతనమునన్ = మూర్ఖత్వముచే, మ్రగ్గెదు = చనిపోతావు, ఇపుడు = ఇంతదానికి, ఇంత = ఇంతగా, త్రుళ్ళన్ ఏల = ఎగిరిపడనేల?

**తా :** మిడుత దట్టమైన అగ్నిమీద దూకి చనిపోవు విధముగా ఆ రాముని బాణాగ్నికి ఆహుతై నువ్వు శీఘ్రంగా నిష్కారణంగా చనిపోతావు. ఇపుడింతగా ఎగిరిపడ్డమెందుకు?

**కం. సిరి మగఁడు జడల సిక దే**
**వరయున్ రాయంచ వారువపు జోదును జె**
**చ్చెర నడ్డగింపఁ బూనిన**
**దురమున రాగవుఁడు నిన్నుఁ దునిమెడుఁ జుమ్మీ! 54**

సిరి మగడు = విష్ణువు, జడల సిక దేవరయున్ = జటాజూటముకల శివుడును, రాయంచ వారువపు జోదును = హంస వాహనుడైన బ్రహ్మయును, చెచ్చెరన్ = తొందరగా, అడ్డగింప పూనిన = అడ్డగించాలని అనుకున్నా, దురమున = యుద్ధమున, రాగవుడు = రాముడు, నిన్నున్ = నిన్ను, దునిమెడున్ చుమ్మీ = చంపకమానడు సుమా!

**తా :** విష్ణువు, శివుడు, బ్రహ్మ అడ్డగించాలనుకున్నా యుద్ధంలో రాముడు నిన్ను చంపక మానడుసుమా!

**తే.గీ. అనుచు నింతయు సరకుసేయక నెలంత**
**దూలc బలికిన రక్కసి దొర కడంగి**
**కినుక నిగుడంగ నొడుపు దప్పిన పిసాళి**
**నాగుcబామును బోలుచు నవుడు గఱచి 55**

అనుచు = అని పలుకుచూ, నెలంత = సీత, ఇంతయున్ = కొంచెముకూడా, సరకు చేయక = రావణుని లెక్కచేయక, తూలన్ పలికిన = నిందించగా, రక్కసి దొర = రావణుడు, కడంగి = పూనుకొని, కినుక నిగుడంగన్ = మిక్కిలి కోపముతో, ఒడుపు తప్పిన పిసాళిన్ = గురి తప్పిన వంచనతో, నాగుపామును పోలుచు, అవుడు కఱచి = పెదవి కొరుకుచు,

**తా :** అని పలుకుచూ సీత కొంచెంకూడా రావణుని లెక్కచేయక తూలనాడగా రావణుడు కోపముతో గురి తప్పిన వంచనతో త్రాచుపాములా పెదవి కొరకుచు

**కం. అద్దిఱ! ఆడుదిగా యని**
**తద్దయుc గనికరము సేయc దలcచిన నెంతో**
**గద్దఱియై ప్రేలెడు ని**
**మ్ముద్దియ యిcకc దేర్పకున్న మోసము కాదే? 56**

అద్దిర = ఔరా!, ఆడుదిగా అని = ఆడదికదా అని, తద్దయున్ = మిక్కిలి, కనికరము చేయన్ = దయను చూపగా, తలచినన్ = ఆలోచింపగా, ఈ ముద్దియ = ఈ కాంత, ఎంతో గద్దఱియై = ఎంతో పొగరుకలదై, ప్రేలెడున్ = ప్రేలుతోంది, ఇకన్ = ఇంక, తేర్పక ఉన్న = వధింపకయున్న, మోసము కాదే = ప్రమాదము కదా!

**తా :** ఔరా! ఆడదికదా అని కనికరం చూపగా ఈ కాంత ఎంతో పొగరుకలదై ప్రేలుతోంది. ఇంక ఈమెను వధింపకయున్న ప్రమాదముకదా!

**సీ. నిడుద వెన్ను గయాళి తొడవుల దొరయుండు**
**గుండు గండెసcగcగc బెండు సేసి**
**తెలిగూడు కానుపు తేజీ వజీరు చే**
**విప్పుగాc గొదలేని మెప్పులంది**
**మగమానికపు వాలు జగబంటు నగరునc**
**గొఱలేని సిరియెల్లc గొల్లవెట్టి**
**రూఢి నెన్నికcగన్న నాడెంపు తెఱగంటి**
**చిగురాకు బోcడులc జెఱలు దెచ్చి**

**తే.గీ. యెపుడు నిరుసత జగముల నెదురు లేక**
**మిక్కుటంబైన తేజున మెఱయు నన్నుc**
**జులకc బలుకుచు నున్న దిక్కలికి యిపుడు**
**చెండుబెండాడి రూపఱc జేతు ననుచు 57**

నిడుద వెన్ను గయాళి = పొడవైన నడుముకల గడుసుది (పాము), తొడవుల దొర ఉండు = ఆభరణములుగా కలవాడు (శివుడు) ఉండు, గుండు = పర్వతమును (కైలాస పర్వతము), గండు ఎసగగన్ = బలము అతిశయింపగా, బెండు చేసి = తేలిక ఎత్తివేసి, తెలి గూడు కానుపు = తెల్లని పక్షి, తేజీ వజీరుచే = వాహనముగాకల రౌతుచే (బ్రహ్మచే), విప్పుగాన్ = చక్కగా, కొదలేని = తక్కువకాని, మెప్పులు = పొగడ్తలు, అంది = పొంది, మగమానికపు వాలు = వజ్రము ఆయుధముగాకల, జగబంటు నగరున = ఇంద్రుని నగరమున (అమరావతి), కొఱలేని = అధికమైన, సిరి ఎల్లన్ = సంపదనంతను, కొల్లగొట్టి = దోచుకొని, రూడిన్ = ప్రసిద్ధిచే, ఎన్నిక కన్న = పేరొందిన, నాడెంపు = చక్కనైన, తెఱగంటి చిగురాకు బోడులన్ = దేవలోకపు స్త్రీలను, చెఱలు తెచ్చి = బంధించి తెచ్చి, ఎపుడున్ = ఎల్లప్పుడు, ఇరు సత జగములన్ = పదునాలుగు లోకములందును, ఎదురు లేక = ఎదిరించువాడు లేక, మిక్కుటంబైన = అధికమైన, తేజున = పరాక్రమమున, మెఱయు నన్నున్ = ప్రకాశించుచున్న నన్ను, చులకన్ పలుకుచు ఉన్నది = తేలికగా మాటాడుచున్నది, ఈ కలికిన్ = ఈ సీతను, ఇపుడు = ఇప్పుడు, చెండుబెండాడి = ఖండించి, రూపు అఱన్ చేతును అనుచు = రూపు మాసిపోయేలా చేస్తాను అని పలుకుచూ,

**తా :** కైలాస పర్వతమును తేలికగా ఎత్తివేసి, బ్రహ్మ పొగడ్తలు పొంది, అమరావతి సంపదనంతను కొల్లగొట్టి, చక్కని దేవలోకపు స్త్రీలను బంధించి తెచ్చి, పద్నాలుగు లోకాల్లో ఎదురులేక తేజస్సుతో ప్రకాశిస్తున్న నన్ను చులకనగా మాట్లాడుతోంది. ఈ సీతను ఇప్పుడు చంపి రూపు మాసిపోయేలా చేస్తాను అని పలుకుతూ –

**కం.** **తివిరి కరవాలు సేకొని**
**అవఱవ లెసఁగంగ నత్తెఱవ పైఁ జనుచోఁ**
**దివ జడల రేయి ద్రిమ్మరి**
**పువుబోఁడి యొకర్తు నెయ్యమున నడ్డంబై** **58**

తివిరి = వేగముగా, కరవాలు చేకొని = కత్తిని పట్టుకొని, అవఱవలు ఎసగంగన్ = మిక్కిలి కోప వికారముతో, ఆ తెఱవపైన్ చనుచో = ఆ సీతమీదకు వెళ్ళుచుండగా, తివ జడల = మూడు జడలుకల, రేయి ద్రిమ్మరి పువుబోడి ఒకర్తు = ఒక రాక్షస స్త్రీ, నెయ్యమునన్ = ప్రీతితో, అడ్డంబై = ఆ రావణునికి అడ్డమువచ్చి,

**తా :** వేగముగా కత్తిని పట్టుకొని కోప వికారముతో ఆ సీతమీదకు వెళ్ళుచుండగా మూడు జడలుకల ఒక రాక్షస స్త్రీ ప్రీతితో ఆ రావణునకు అడ్డమువచ్చి.

**కం.** **దేవఱ! నీ విపు దలుగఁగ**
**నీ వెలఁదుక బేసికంటి యెకిమీఁడొ? జముం**
**డో? వేల్పుతేఁడొ? నెత్తురు**
**ద్రావుడు గమికాఁడొ? నీళ్ళరాయఁడొ? చెపుమా!** **59**

దేవఱ = ప్రభూ!, ఇపుడు = ఇప్పుడు, నీవు అలుగగన్ = నువ్వు కోపించుటకు, ఈ వెలదుక = ఈ స్త్రీ, బేసికంటి ఎకిమీఁడొ = బేసికన్నులు కల శివుడా?, జముండో = యముడా?, వేల్పుఱేఁడొ = ఇంద్రుడా?, నెత్తురు ద్రావుడు గమికాఁడొ = రాక్షసాధిపతియగు నైర్భతుడా? నీళ్ళరాయఁడొ = జలాధిపతియగు వరుణుడా?, చెపుమా = చెప్పుము.

**తా :** ప్రభూ! ఇప్పుడు నువ్వు కోపించడానికి ఈ స్త్రీ శివుడా? యముడా? ఇంద్రుడా? నిర్భతియా! వరుణుడా? చెప్పు.

**తే.గీ.** **బమ్మ కొలమునఁ బుట్టిన బల్లిదుఁడవు**
**చదువు లెల్లను నెఱిఁగిన జాణ వెల్ల**
**కడలు గెలిచిన నెఱ మొనగాఁడ విట్లు**
**తెఱవపై నీవు కైదువు వెఱుకఁ జనునె? 60**

బమ్మ కొలమునన్ = బ్రహ్మ వంశమున, పుట్టిన, బల్లిదుడవు = బలశాలివి, చదువులు ఎల్లను = అన్ని వేదములను, ఎఱిగిన = తెలిసిన, జాణవు = నేర్పరివి, ఎల్ల కడలు = అన్ని దిక్కులు, గెలిచిన = జయించిన, నెఱ మొనగాడవు = మంచి వీరుడవు, ఇట్లు = ఈ విధముగా, తెఱవపై = ఒక స్త్రీపై, కైదువు పెఱుకన్ = కత్తి దూయుట, చనునె = తగునా?

**తా :** బ్రహ్మ వంశమున పుట్టిన బలశాలివి. అన్ని వేదములు తెలిసిన జాణవి, అన్ని దిక్కులు జయించిన వీరుడివి ఈ విధముగా ఒక ఆడదానిపై కత్తి దూయడం తగునా?

**కం.** **తాలిమి పూనుము కొఱకొఱ**
**చాలింపుము కొఱంత గొనము సడలింపుము వే**
**వేలింటను జేజే నవ**
**లా లుండఁగ నీకు నివ్వెలందుక గొఱయే? 61**

తాలిమి = ఓర్పును, పూనుము = పొందుము, కొఱకొఱ = కోపమును, చాలింపుము, కొఱత గొనము = అల్పత్వమును, సడలింపుము = వదలిపెట్టుము, ఇంటను = ఇంటిలో, వేలు వేలు =, జేజే నవలాలుండగ = దేవతా స్త్రీలుండగా, నీకు, ఈ వెలందుక = ఈ స్త్రీ, కొఱయే = లోటా?

**తా :** ఓర్పు వహించుము. కోపమును చాలింపుము. అల్పత్వమును వదలిపెట్టుము. ఇంటిలో వేలాదిగా దేవతా స్త్రీలు ఉండగా నీకు ఈ స్త్రీ లోటా?

**తరలము.** **అనుచు నెచ్చెలి యోర్పు పుట్టఁగ నాడుచోఁ దనుఁ జాల న**
**చ్చెనఁటి రక్కసి ఱేఁడు పల్కిన చిన్న మాటల కెద్దలోఁ**
**గనలి పంటవలంతి గాదిలి కాన్పు పెద్ద యెలుంగుతో**
**మొనసి యామని గండుకోయిల మ్రోఁగు చాడ్పున నేడిచెన్ 62**

అనుచు = అని, నెచ్చెలి = ప్రియురాలు, ఓర్పు పుట్టగన్ = సహనము కలిగేలా, ఆడుచోన్ = పలుకగా, తనున్ = తనను, చాల = మిక్కిలిగా, ఆ చెనటి = ఆ మూర్ఖుడైన, రక్కసి ఱేడు = రాక్షస రాజు రావణుడు, పల్కిన = పలికినటువంటి, చిన్న మాటలకు = తక్కువ మాటలకే, ఎద్దలోన్ =

మనసులో, కనలి = కుమిలి, పంటవలంతి గాదిలి కాన్పు = భూదేవి ప్రియ పుత్రిక సీత, మొనసి = పూని, పెద్ద ఎలుంగుతో = గట్టిగా, ఆమని = వసంతంలో, గండు కోయిల = మగ కోయిల, మ్రోగు చాడ్పునన్ = కూయు విధముగా, ఏడిచెన్ = రోదించెను.

**తా :** అని ప్రియురాలు ఓర్పు కలిగేలా పలుకగా, రావణుడు పలికిన తక్కువ మాటలకు మనసులో కుమిలి సీత గట్టిగా వసంతంలో మగకోయిల కూసినట్లు రోదించెను.

**తే.గీ.** **ఏడ్పుటలు చూచి తెరగంటి యిగురుబోండ్లు**
**చిలువ బోటులు జక్కుల చెలులుఁ బులుఁగు**
**చేడియలు నేడ్చి రప్పు డచ్చెట్టు మీఁద**
**నుండి రిక్కల త్రోవ మన్మండు గినిసి** **63**

ఏడ్పుటలు = సీత ఏడవడం, చూచి, తెరగంటి ఇగురుబోండ్లు = దేవతా స్త్రీలు, చిలువ బోటులు = నాగ కన్యలు, జక్కుల చెలులు = యక్ష కాంతలు, పులుగు చేడియలు = గరుడ వనితలు, ఏడ్చిరి = వారికి కూడా ఏడుపు వచ్చెను, అప్పుడు = ఆ సమయమున, ఆ చెట్టు మీదనుండి = అదే చెట్టుమీద ఉండి, రిక్కల త్రోవ మన్మండు = ఆకాశపు మనుమడు హనుమంతుడు, కినిసి = కోపించి –

**తా :** సీత ఏడవడం చూచి దేవతా స్త్రీలు, నాగ కన్యలు, యక్ష కాంతలు, గరుడ వనితలు వారికి కూడా ఏడుపు వచ్చెను. అప్పుడు అదే చెట్టుమీదనుండి హనుమ కోపించి –

**ఆ.వె.** **తొడరి వీని నిపుడె తునుముదునో కాక**
**మన్ను కాన్పుఁ జూచి మాటలాడి**
**మరలి పోవునపుడు మడియింతునో యంచుఁ**
**దత్తరమున మదినిఁ దలఁచు చుండె** **64**

తొడరి = పూనుకొని, వీనిని ఇపుడె = వీనిని ఇప్పుడే, తునుముదునో = సంహరింతునా?, కాక = అలా కాక, మన్ను కాన్పున్ = సీతను, చూచి మాటలాడి = చేరి సంభాషించి, మరలిపోవునపుడు = తిరిగి వెళ్ళునపుడు, మడియింతునో అంచు = చంపుదునా అని, మదిని = మనస్సునందు, తత్తరమున = తొట్రుపడుచూ, తలచుచు ఉండె = ఆలోచించుచుండెను.

**తా :** వీనిని ఇప్పుడే సంహరించనా? అలా కాక సీతను చేరి సంభాషించి తిరిగి వెళ్ళేటప్పుడు చంపుదునా? అని మనసున తొందరగా ఆలోచించుచుండెను.

**కం.** **మసలక నా కిప్పొలఁతిం**
**బొసఁగింపుఁడు కాకయున్నఁ బొరిగొనుఁడని ర**
**క్కసి చెలుల నునిచి రావణుఁ**
**డు సనియెఁ దన నగరునకుఁ గడున్ సిబ్బితితోన్** **65**

మసలక = ఆలసింపక, నాకు ఈ పొలతిన్ = ఈ సీతను నాకు, పొసగింపుడు = కలుపుడు, కాక ఉన్న = కానిచో, పొరిగొనుడు = చంపివేయుడు, అని రక్కసి చెలులున్ ఉనిచి = అని రాక్షస

స్త్రీలను కాపలా ఉంచి, కడున్ సిబ్బితితోన్ = చాలా సిగ్గుపడుతూ, రావణుడు = రావణుడు, తన నగరునకున్ = తన నివాసమునకు, చనియెన్ = వెళ్ళెను.

**తా :** ఆలసింపక ఈ సీతను నాకు కలపండి. కానిచో చంపివేయండి. అని రాక్షస స్త్రీలను కావలి ఉంచి చాలా సిగ్గుపడుతూ రావణుడు తన నివాసమునకు వెళ్ళిపోయెను.

**తే.గీ.** **అంత నారేయి ద్రిమ్మరి యలరుబోఁడు**
**లలసి యందంద నిదురించునపుడు త్రిజట**
**చెడుగుఁ గలఁ గాంచి రావణు చేటు వారి**
**కెల్ల నెఱిఁగించి మక్కువ యెదఁ దలిర్ప** **66**

అంతన్ = అంతట, ఆ రేయి ద్రిమ్మరి అలరుబోడులు = ఆ రాక్షస స్త్రీలు, అలసి = అలసటచేత, అందంద = అక్కడక్కడ, నిదురించునపుడు = నిద్రపోతున్న సమయంలో, త్రిజట = త్రిజట అనే రాక్షస స్త్రీ, చెడుగున్ = చేటును, కలన్ కాంచి = కలను కని, రావణు చేటు = రావణుపొంద బోయే నాశనమును, వారికి ఎల్లన్ = వారికందరికిని, ఎఱిగించి = తెలియజేసి, ఎదన్ = మనసునందు, మక్కువ తలిర్ప = ప్రేమ చిగురించగా –

**తా :** అంతట ఆ రాక్షస స్త్రీలు అలసి అక్కడక్కడ నిద్రపోతున్న సమయంలో త్రిజట అనే రాక్షస స్త్రీ చేటు కలగాంచి రావణుడు పొందబోయే నాశమును వారి కందరికిని తెలియజేసి మనసున మక్కువ చిగురింపగా –

**తే.గీ.** **పొలఁతి గములార! యింక యిప్పుడమి కాన్పు**
**నేఁప వలదంచుఁ గనుమూయు నెడ యెఱింగి**
**చెట్టులో నుండి కరువలి పట్టి మిగుల**
**నెలమి నా రాచ వాల్గంటి కిట్టులనియె** **67**

పొలతి గములారా = ఓ రాక్షస స్త్రీలారా!, ఇంక, ఈ పుడమి కాన్పున్ = ఈ సీతను, ఏప వలదు అంచున్ = బాధపెట్టవద్దని చెప్పి, కనుమూయున్ ఎడ ఎఱింగి = నిద్రపోయే సమయము గ్రహించి, కరువలి పట్టి = వాయుసుతుడైన హనుమ, చెట్టులోనుండి = చెట్టుమీద నుండి, మిగులన్ ఎలమిన్ = మిక్కిలి సంతోషముతో, ఆ రాచవాల్గంటికి = ఆ సీతకు, ఇట్టులు అనియె,

**తా :** ఓ రాక్షస స్త్రీలారా! ఇంక ఈ సీతను బాధపెట్టవద్దు అని చెప్పి వారు నిద్రపోతున్న విషయం గ్రహించి హనుమ చెట్టునుండి సంతోషముతో ఆ సీత కిట్టులనెను.

**తే.గీ.** **పడఁతి! నీ ఱేని కూరిమిబంట నతఁడు**
**దమ్ముఁడును దాను మాల్యవంతమ్ము నందుఁ**
**దమ్ము వలఁగొని కోఁతి మొత్తమ్ము లెల్ల**
**నోలిఁ గొలువంగ నెమ్మది నున్నవాఁడు** **68**

పడతి = ఓ వనితా!, నీ ఱేని కూరిమిబంటను = నీ భర్తకు ప్రియమైన సేవకుడను, అతడు తమ్ముడును = ఆతని తమ్ముడును, తాను = తానును, మాల్యవంతమ్మునందు = మాల్యవంత

మనే పర్వతమునందు, తమ్ముం = తమను, కోతి మొత్తములు ఎల్లన్ = కోతి సమూహము లన్నియును. వలగొని = చుట్టుకొని, ఓలిన్ = క్రమముగా, కొలువంగన్ = సేవించుచుండగా, నెమ్మదిన్ = సుఖముగా, ఉన్నవాడు = ఉన్నాడు.

**తా :** 'ఓ వనితా! నీ భర్తకు కూరిమి బంటును, అతని తమ్ముడు, తాను మాల్యవంతమున తమను వానరులందరును సేవించుచుండగా సుఖముగా ఉన్నారు.

**కం.** **ఓ చాన! యానవాలుగ**
**నాచే నీ యుంగరంబు నలువుగ నీ కా**
**రాచూలి పనిచె నిదిగోఁ**
**జూచుకొనుమటంచు నెలమిఁ జూపించుటయున్ 69**

ఓ చాన = ఓ కాంతా!, ఆనవాలుగన్ = గుర్తుకోసం, నాచేన్, ఈ ఉంగరంబున్ = ఈ ఉంగరమును, నలువుగ = ఒప్పిదముగ, నీకు, ఆ రాచూలి పనిచెన్ = ఆ రామచంద్రుడు పంపెను, ఇదిగో చూచుకొనుము, అటంచున్, ఎలమిన్ = సంతోషముతో, చూపించుటయున్ = చూపించగా–

**తా :** ఓ కాంతా! ఆనవాలుగా నాచేత ఈ ఉంగరమును నీ కొరకు రామచంద్రుడు పంపెను. ఇదిగో చూచుకొనుము' అని చూపించగా –

**తే.గీ.** **డెంద మిగురొత్త నమ్మేలి కుందనంపు**
**టుంగరము దన మగని చేయుంగరంబు**
**గా నెఱింగియు నమ్మక వానిఁ జూచి**
**యన్ను తలమానికం బిట్టులనుచుఁ బలికె 70**

డెందము = మనస్సు, ఇగురు ఒత్తన్ = ఆనందింపగా, ఆ మేలి కుందనంపు ఉంగరమున్ = ఆ మేలిమి బంగారపు ఉంగరమును, తన మగని, చేయుంగరంబుగాన్ = చేతి ఉంగరమునుగా, ఎఱింగియు = తెలుసుకొనినప్పటికినీ, నమ్మక = నమ్మకము సరిపోక, వానిన్ చూచి = ఆ హనుమను చూచి, అన్ను తలమానికంబు = స్త్రీలలో శ్రేష్ఠురాలైన సీతాదేవి, ఇట్టులు అనుచు పలికె.

**తా :** మనసు ఆనందించగా ఆ ఉంగరమును తన భర్త చేతి ఉంగరమునుగా గ్రహించినా నమ్మకము సరిపోక ఆ హనుమను చూచి సీత ఇలా అని పలికెను.

**తే.గీ.** **అన్న! యే ప్రొద్దుఁ దక్కరులగు కడింది**
**పొలసుదిండుల చేతి చెట్టలఁ గలంగు**
**చున్న కతమున నెకిమీని యుంగరంబు**
**గన్గొనియు లోన నమ్మిక గలుగ దిపుడు 71**

అన్న = నాయనా!, ఏ ప్రొద్దున్ = ఎప్పుడును, కడింది టక్కరులగు = మిక్కిలి మోసగాళ్ళైన, పొలసు తిండుల = రాక్షసులయొక్క, చేతి చెట్టలన్ = చేతులద్వారా జరిగే చెడులచేత, కలంగుచున్న కతమున = కలత చెందుచున్న కారణమున, ఇపుడు, ఎకిమీని = రాముని, ఉంగరమును, కన్గొనియు = చూచియును, లోన = మనసులో, నమ్మిక = విశ్వాసము, కలుగదు = కలుగుట లేదు.

**తా :** 'అన్నా! ఎప్పుడూ మోసగాళ్ళైన రాక్షసుల చేతులద్వారా జరిగే చెడులచేత కలత చెందుచున్న కారణంగా ఇప్పుడు రాముని ఉంగరాన్ని చూచినా మనసులో విశ్వాసము కలగటం లేదు.

**తే.గీ ఎవ్వఁడవు నీవు? నీకుఁ బేరెద్ది? యెట్లు**
**పుడమి ఱేనికి నీకును బొందు బెరసె?**
**నద్దొరల రూపు లెట్టి? విం దనుచు నపుడు**
**సామి నను గూర్చి నీతోడ నేమి పలికె? 72**

నీవు ఎవ్వడవు?, నీకు పేరు, ఎద్ది = ఏమిటి?, పుడమి ఱేనికి = రామునికి, నీకును, పొందు = కూడిక, ఎట్లు బెరసెన్ = ఎలా కలిగింది?, ఆ దొరల = ఆ ప్రభువులయొక్క రూపులు = ఆకారములు, ఎట్టివి?, ఇందు = ఇక్కడికి, అనుచున్ అపుడు = పంపేటప్పుడు, సామి = నా ప్రభువు, నను కూర్చి = నన్ను గురించి, నీతోడన్ = నీతో, ఏమి పలికె = ఏం చెప్పారు?

**తా :** నీవెవరు? నీ పేరేమిటి? రామునికి నీకు కూడిక ఎలా కలిగింది? ఆ దొరల రూపరేఖలు ఎటువంటివి? ఇక్కడికి పంపేటప్పుడు నా ప్రభువు నా గురించి నీతో ఏం చెప్పారు?

**కం. ఏ కరణిఁ గడలి దాఁటితి?**
**వీ కడ కేపగిదిఁ ద్రోవ యెఱిఁగితి? వెట్లీ**
**రాకాసుల మొఱఁగితి? విఁక**
**నీ కల తెఱఁగెల్ల మాకు నిక్కము చెపుమా! 73**

ఏ కరణిన్ = ఏ విధముగా, కడలి దాటితివి, ఈ కడకున్ = ఈ ప్రదేశమునకు, త్రోవ = దారిని, ఏ పగిదిన్ = ఏ విధముగా, ఎఱిగితివి = తెలుసుకున్నావు?, ఈ రాకాసులన్ = ఈ దుష్టులైన రాక్షసులను, ఎట్లు మొఱగితివి = ఎలా మోసపుచ్చావు?, ఇక = ఇంక, నీ కల తెఱగు ఎల్ల = ఉన్న నీ విషయమునంతను, మాకు = మాకు, నిక్కము చెపుమా = సత్యమును చెప్పుము.

**తా :** ఏవిధంగా సముద్రమును దాటగలిగేవు? ఈ ప్రదేశానికి దారి ఏ విధంగా తెలుసుకున్నావు? ఈ దుష్ట రాక్షసులను ఎలా మోసపుచ్చావు? ఇంక నీ ఉన్న విషయాన్నంతను మాకు సత్యమును తెలుపుము'.

**కం. అనవుడు నతఁడ పొలతిం**
**గనుఁగొని యిట్లనుచుఁ దెల్పఁగడఁగెం దల్లీ!**
**విను మేఁ జలినట్టు కతం**
**బున నంజన యనెడు చెలికిఁ బుట్టిన వాఁడన్ 74**

అనవుడు = తరువాత, అతడు = ఆ హనుమ, ఆ పొలతిం కనుగొని = ఆ సీతాదేవిని చూచి, ఇట్లనుచు = ఈ రీతిగా, తెల్పన్ కడగెన్ = చెప్పుటకు పూనుకొనెను, తల్లీ = ఓ అమ్మా!, వినుము = విను, ఏన్ = నేను, చలినట్టు కతంబునన్ = వాయుదేవుని కారణముగా, అంజన అనెడు చెలికి = అంజన అనే స్త్రీకి, పుట్టిన వాడన్ = జన్మించినవాడను.

**తా :** తరువాత హనుమ సీతాదేవిని చూచి ఈ రీతిగా చెప్పుటకు పూనుకొనెను.'తల్లీ! విను. నేను వాయుదేవుని కారణముగా అంజన అనే స్త్రీకి జన్మించినవాడను.

**కం.** **హనుమంతుఁ డనెడు పేరం**
**దనరారెడువాఁడఁ దొవల దాయ యనుఁగు బి**
**డ్డనికిం గడు నెయ్యుఁడ నీ**
**పెనిమిటికిం గూర్చునట్టి బిరుదుమగండన్** **75**

హనుమంతుడు అనెడు పేరన్, తనరారెడువాడన్ = ఒప్పుచుండు వాడను, తొవల దాయ అనుగు బిడ్డనికిన్ = కలువల శత్రువగు సూర్యుని ప్రియపుత్రుడగు సుగ్రీవునకు, కడు నెయ్యుడ = మిక్కిలి స్నేహితుడను, నీ పెనిమిటికిన్, కూర్చునట్టి = ఇష్టమైనట్టి, బిరుదుమగండన్ = వీరవరుడను,

**తా :** హనుమంతుడను పేర ఒప్పుచున్నవాడను. సూర్య పుత్రుడగు సుగ్రీవునికి కడు నెయ్యుడను. నీ భర్తకు కార్యములు నిర్వహించునట్టి వీరవరుడను.

**సీ.** **అమ్మ! నిన్నీ రేయి ద్రిమ్మరి యెకిమీఁడు**
**గొనివచ్చు నెడ నిర్లగొంగ కొమరుఁ**
**డిమ్ముగా ఋష్యమూకమ్మను గట్టుపై**
**మముఁ గూడి మెలఁగుచో నమర నీవు**
**రవణము ల్దివిచి చీర చెఱంగుతోఁ గట్టి**
**వైచిన నవి దాఁచి వగపుమీఱ**
**రాముఁడుఁ దమ్ముఁడు రమణ నిన్వెదకుచు**
**నచటి కేతెంచిన నతఁడు వారి**

**తే.గీ.** **తోడ నెయ్యం బొనర్చి యత్తొడవులిడిన**
**మిగుల నలరొంది దొర వాని పగతుఁడైన**
**వాలిఁ దెగటార్చి వాఁడేలు నేల కెల్ల**
**యొడయనిగఁ జేసి నెమ్మదియొదవ నునిచె** **76**

అమ్మ = తల్లీ!, నిన్ను, ఈ రేయి ద్రిమ్మరి ఎకిమీడు = ఈ రావణుడు, కొనివచ్చునెడన్ = తీసుకొని వచ్చుచున్న సమయమున, ఇర్లగొంగ కొమరుడు = చీకటికి శత్రువు (సూర్యుడు) కొడుకు (సుగ్రీవుడు), ఇమ్ముగాన్ = చక్కగా, ఋష్యమూకమ్మను గట్టుపై = ఋష్యమూక పర్వతముపై, మము కూడి = మాతో కలిసి, మెలగుచోన్ = వర్తించుచుండగా, నీవు అమరన్ = నీవు తగినరీతిగా, రవణముల్ తివిచి = ఆభరణములను తీసివేసి, చీర చెఱంగుతో కట్టి = చీరకొంగుకు కట్టి, వైచిన = పడవేసిన, అవి = ఆ ఆభరణములు, దాచి = భద్రముచేసి, వగపుమీఱ = శోకమతిశయింపగా, రాముడున్ తమ్ముడున్ = రాముడును తమ్ముడు లక్ష్మణుడును, రమణన్ = కుతూహలముతో, నిన్ వెదకుచు = నిన్ను వెతుక్కుంటూ, అచటికి ఏతెంచినన్ = అక్కడికి రాగా, అతడు = ఆ సుగ్రీవుడు, వారితోడ = ఆ రామ, లక్ష్మణులతో, నెయ్యంబు ఒనర్చి = స్నేహము చేసి, ఆ తొడవులు ఇడిన = ఆ

నగలను ఇవ్వగా, మిగులన్ అలరొంది = మిక్కిలి సంతోషించి, దొర = రాముడు, వాని పగతుడు ఐన = ఆ సుగ్రీవుని శత్రువైన, వాలిన్ = వాలిని, తెగటార్చి = చంపి, వాడు ఏలు నేలకు ఎల్లన్ = వాడు పరిపాలించే రాజ్యమునకంతకును, ఒడయినిగ చేసి = ప్రభువునుచేసి, నెమ్మది ఒదవన్ = స్వస్థతకలుగునట్లుగా, ఉనిచె = ఉంచెను.

**తా :** అమ్మా! నిన్ను ఈ రావణుడు తీసుకొని వచ్చు సమయమున సుగ్రీవుడు మాతోకలిసి ఋష్యమూక పర్వతముపై వర్తించుచుండగా, నీవు నీ ఆభరణములు చీర చెఱంగుతో కట్టి పడవేసిన, అవి భద్రము చేసి, రాముడు, తమ్ముడు నిన్ను వెదకుచూ అక్కడికి రాగా సుగ్రీవుడు వారితో స్నేహముచేసి, ఆ నగలను ఇవ్వగా మిక్కిలి సంతోషించి రాముడు సుగ్రీవుని శత్రువైన వాలిని చంపి వాడి రాజ్యానికి ప్రభువును చేసి స్వస్థతతో నుంచెను.

**కం.** **ఆ కోఁతుల దొర దనుఁ బలు**
**మూఁకలతోఁ గొలువనుండి ముద్దియరో! యీ**
**రాకొమరుఁడు నిన్వెదుకుట**
**కై కొందఱ బంట్ల నేర్చి యనిపెడు నెడలన్** **77**

ముద్దియరో = ఓ ముద్దరాలా!, ఆ కోతుల దొర = ఆ సుగ్రీవుడు, తనున్ = తనను (రాముని), పలు మూకలతోన్ = అనేకములగు సేనలతో, కొలువన్ ఉండి = సేవించుచుండగా, ఈ రాకొమరుడు = ఈ రామచంద్రుడు, నిన్ వెదకుటకై = నిన్ను అన్వేషించుటకై, కొందఱ బంట్లను ఏర్చి = కొంతమంది వీరులను ఏరుకొని, అనిపెడున్ ఎడలన్ = పంపే సమయములో,

**తా :** ఓ ముద్దరాలా! ఆ సుగ్రీవుడు తనను పలు సేనలతో సేవించుచుండగా ఈ రామచంద్రుడు నిన్ను అన్వేషించుటకై కొందఱు వీరులను నియమించి పంపే సమయంలో

**కం.** **రంగుగ నా చేతికి ని**
**య్యుంగర మిడి సెలవు వెట్ట నుప్పొంగుచు ను**
**ప్పుం గడలి దాఁటి వచ్చి ని**
**నుం గాంచితి నిచట వేడ్క నూల్కొనఁ బడఁతీ!** **78**

పడతీ = ఓ సీతాదేవీ!, రంగుగన్ = విశేషముగా, ఈ ఉంగరము నా చేతికిన్ ఇడి, సెలవు పెట్టన్ = ఆజ్ఞాపింపగా, ఉప్పొంగుచున్ = ఉరకలు వేస్తూ, ఉప్పుం కడలి = సముద్రమును, దాటి వచ్చి, ఇచట, వేడ్క నూల్కొనన్ = సంబరపడుతూ, నినుం, కాంచితిని = చూసితిని,

**తా :** ఓ సీతాదేవి! విశేషంగా ఈ ఉంగరం నాచేతికిచ్చి ఆజ్ఞాపింపగా ఉత్సాహముగా సముద్రమును దాటి వచ్చి సంబరపడుతూ నిన్ను చూసితిని.

**కం.** **బల్లిదపుఁ గోఁతి మూఁకలు**
**పెల్లుగఁ దనుఁ గొల్వ నీదు పెనిమిటి యిదిగో!**
**నెల్లిట నేఁటనొ యిచటికిఁ**
**దల్లీ! యరుదెంచు నింకఁ దలఁకకు మదిలో** **79**

బల్లిదపున్ = బలవంతులైన, కోతి మూకలు = కోతుల సైన్యములు, పెల్లుగన్ = అధిక సంఖ్యలో, తనున్ కొల్వ = తనను సేవింపగా, నీదు పెనిమిటి = నీ భర్తయైన రాముడు, ఇదిగో, ఎల్లిట = రేపు, నేటనొ = నేడో, ఇచటికిన్ = ఇక్కడికి, అరుదెంచును = వచ్చును, తల్లీ = ఓ అమ్మా!, ఇంకన్ = ఇక, మదిలో = మనసులో, తలకకు = కలత చెందకు.

**తా :** బలవంతులైన వానర సైన్యము తనను సేవింపగా నీ భర్తయైన రాముడు ఇదిగో రేపు నిశ్చయంగా ఇక్కడికి వచ్చును. ఓ అమ్మా! ఇంక నువ్వు మనసులో కలతచెందకు.

**తే.గీ.** **ఎఱచి యెరదిండి మన్నియ యిపుడు వచ్చి**
**నిన్నుఁ గఱకులు పలుకుచున్న యెడలఁ**
**జాన! యిచ్చెట్టుపైనుండి వానిఁ దునమఁ**
**దలఁచి మరలితి నీకుఁ గీడెలయు ననుచు** **80**

ఎఱచి ఎర తిండి మన్నియ = మాంసము ఆహారముగా తినే రాక్షసుల ప్రభువు (రావణుడు), ఇపుడు వచ్చి నిన్ను, కఱకులు = కఠినమైన మాటలు, పలుకుచున్న, ఎడలన్ = సమయమునందు, చాన = ఓ సీతా!, ఈ చెట్టుపై నుండి, వానిన్ = ఆ రావణుని, తునుమన్ = చంపుటకు, తలచి = అనుకొని, నీకున్, కీడు ఎలయును అనుచు = ఆపద కలుగుతుందని, మరలితి = మానితిని.

**తా :** రావణుడు ఇపుడు వచ్చి నిన్ను కఱకులు పలుకుతున్న సమయంలో ఓ సీతా! నేను చెట్టుపైనుండి ఆ రావణుని చంపాలనుకొని నీకు ఆపదవుతుందని మానేసేను.

**ఉ.** **కల్లరి రక్కసుండు నినుఁ గైకొని వచ్చిన గోలె బల్లిదం**
**బెల్లను దూలి పూఁట యొక యేడుగఁ ద్రోయుచు నబ్బురంపు బల్**
**తల్లడమూని తిండియును దప్పియు నిద్దురయుం దొరంగి ఱేఁ**
**డుల్లము దద్ద నీ పయినె యుంచి కలంగుఁ జుమీ! పొలంతుకా!** **81**

పొలంతుకా = ఓ సీతాదేవీ!, కల్లరిరక్కసుండు = మోసగాడైన రావణుడు, నినున్, కైకొని = తీసుకొని, వచ్చిన గోలె = వచ్చినప్పటి నుండియు, ఱేడు = రాముడు, ఉల్లము = మనస్సు, తద్ద = పూర్తిగా, నీ పయినె యుంచి, బల్లిదంబు ఎల్లను = తన శక్తినంతను, తూలి = పోగొట్టుకొని, పూట ఒక ఏడుగన్, త్రోయుచు = నెట్టుకొస్తూ, అబ్బురంపు = ఆశ్చర్యకరమైన, బల్ తల్లడము ఊని = గొప్ప సందేహమును పొంది (ఉందా? లేదా? ఎక్కడ ఉంది?), తిండియును, దప్పియు = దాహమును, నిద్దురయున్, తొరంగి = పోగొట్టుకొని, కలంగు జుమీ = కలతచెందుచున్నాడు సుమా!

**తా :** ఓ సీతాదేవీ! రావణుడు నిన్ను తీసుకొనివచ్చినప్పటినుండియు రాముడు మనసు పూర్తిగా నీపైనే ఉంచి, తన శక్తినంతను పోగొట్టుకొని పూట ఒక ఏడుగ నెట్టుకొస్తూ సందేహంతో తిండి, దప్పి, నిద్ర పోగొట్టుకొని కలతచెందుచున్నాడుసుమా!

**తే.గీ.** **తడవు లేనిదె దండుతోఁ దరలి వచ్చి**
**కడలి వడి దాఁటి రక్కసు నడఁచి నిన్ను**

**మరలఁ గైకొందు నుమ్మలింపకు మటంచుఁ**
**తెలుపుమని పల్కె నతఁడు క్రొందలిరుబోఁడి!** **82**

క్రొత్త తలిరుబోడి = క్రొత్త చిగురువంటి దేహముకల సీతా!, అతడు = ఆ రాముడు, తడవు లేనిదె = ఆలస్యం లేకుండా, దండుతోన్ = సైన్యముతో, తరలి వచ్చి = బయలుదేరి వచ్చి, కడలిన్ = సముద్రమును, వడి దాటి = శీఘ్రముగా దాటి, రక్కసున్ అడచి = రావణుని సంహరించి, నిన్ను = నిన్ను, మరలన్ కైకొందును = తిరిగి చేపడతాను, ఉమ్మలింపకుము = బాధపడకుము, అటంచు = అని, తెలుపుమని = చెప్పుమని, పల్కెన్ = పలికెను.

**తా :** సీతా! రాముడు ఆలస్యం లేకుండా సైన్యంతో తరలి వచ్చి శీఘ్రముగా సముద్రం దాటి రావణుని సంహరించి నిన్ను తిరిగి చేపడతాను, బాధపడకుమని చెప్పమన్నాడు.

**సీ.** **మొలక నవ్వులవాఁడు తలుకారు తొలుకారు**
**బలు కార్మొగులు గేరు పొలుపువాఁడు**
**నిడుద చేతులవాఁడు నిద్దంపు టద్దంపు**
**సుద్దంపు నెఱి చెక్కు జోటివాఁడు**
**వెడఁద కన్నులవాఁడు విప్పారి యొప్పారు**
**గొప్ప నెన్నుదురుచే నొప్పువాఁడు**
**పఱపు పేఱెదవాఁడు పరువంపు గరువంపు**
**నెలవోని నెమ్మోము గలుగువాఁడు**

**తే.గీ.** **కేల సింగాణి విల్లొగిఁ గ్రాలువాఁడు**
**కుఱుచ మెడవాఁడు సోగ పెన్నెఱులవాఁడు**
**వలఁతియగువాఁడు ముజ్జగంబులును వలచు**
**సోయగమువాఁడు సువ్వె! నీ రాయఁడింతి!** **83**

ఇంతి = ఓ సీతాదేవీ!, నీ రాయడు = నీ భర్త రాముడు, మొలక నవ్వులవాడు = చిఱునవ్వులు కలవాడు, తలుకారు = కాంతులీనే, తొలుకారు = తొలకరి సమయమందలి, బలు కారు మొగులు = గొప్ప దట్టమైన మేఘములను, కేరు = తిరస్కరించు, పొలుపువాడు = అందగాడు, నిడుద = పొడవైన, చేతులవాడు = చేతులున్నవాడు, నిద్దంపు = నున్ననైన, అద్దంపు = స్వచ్ఛమైన, సుద్దంపు = పరిశుద్ధమైన, నెఱి = చక్కని, జోటివాడు = చెక్కిళ్ళు కలవాడు, వెడద = విశాలములైన, కన్నులవాడు = కన్నులు కలవాడు, విప్పారి ఒప్పారు = వికసించి ఒప్పుచున్న, గొప్ప = ప్రశస్తమైన, నెఱి నుదురుచేన్ = అందమైన ఫాలభాగముచే, ఒప్పువాడు = ప్రకాశించువాడు, పఱపు = గొప్ప, పేఱు ఎదవాడు = బలిసిన వక్షస్థలమువాడు, పరువంపు = పున్నమినాటి, గరువంపు = శోభతోకూడిన, నెలవోని = చంద్రునివంటి, నెఱి మోము కలుగువాడు = అందమైన ముఖము కలవాడు, కేల = చేతిలో, సింగాణి విల్లు = బాణము ధనుస్సు, ఒగిన్ = చక్కగా, క్రాలువాడు = ధరించువాడు, కుఱుచ మెడవాడు = పొట్టి మెడ కలవాడు, సోగ = బాగా క్రిందకు వ్రేలాడు, పెన్నెఱులవాడు =

పెద్ద వెంట్రుకలు కల వాడు, వలతి అగువాడు = సమర్థుడైనవాడు, ముజ్జగంబులలును = మూడు లోకములును, వలచు = కోరు, సోయగమువాడు = అందమున్నవాడు, చువ్వె = సుమా!

**తా :** ఓ సీతా! నీ భర్త మొలక నవ్వులవాడు, తొలకరి మేఘములను తిరస్కరించు అందగాడు, పొడవైన చేతులున్నవాడు, స్వచ్ఛమైన చెక్కిళ్ళు, విశాలమైన కన్నులు, వికసించిన అందమైన ఫాలభాగము, బలిసిన వక్షస్థలము, పున్నమి చంద్రుని వంటి ముఖము కలవాడు, చేతిలో శారఙ్గము ధనుస్సును ధరించువాడు, పొట్టిమెడ కలవాడు, పెద్ద వెంట్రుకలవాడు, సమర్థుడైనవాడు, ముల్లోకములును కోరు సోయగమువాడుసుమా!

**తే.గీ.** **అరయ నిన్ని తెఱంగుల నలరువాఁడు**
**సూవె! నీ ముద్దుల మఱంది తీవబోఁడి!**
**యనిన నెద నమ్మి సంతసం బెనయ నతని**
**గారవించుచుఁ బడఁతి యుంగరముఁ గొనియె** **84**

అరయన్ = పరిశీలింపగా, తీవబోడి = ఓ సీతాదేవీ!, ఇన్ని తెఱంగులన్ = ఇన్ని విధములుగాను, నీ ముద్దుల మఱంది = నీకు ప్రియమైన మరది లక్ష్మణుడు, అలరువాడు చూవె = ఒప్పువాడు సుమా!, అనినన్ = అనగా, ఎద నమ్మి = మనసున విశ్వాసం కలిగి, సంతసంబు ఎనయన్ = సంతోషము కలుగగా, అతని గారవించుచున్ = ఆ హనుమంతుని ప్రీతిగా పలుకరించుచు, పడతి = సీత, ఉంగరము కొనియెన్ = ఉంగరము తీసుకొనెను.

**తా :** ఓ సీతా! పరిశీలింపగా ఇన్ని విధములుగాను నీ మరది లక్ష్మణుడు ఒప్పువాడు. అనగా మనసున విశ్వాసం కలిగి ప్రీతిగా ఆ హనుమను పలుకరించుచూ సీత ఉంగరము తీసుకొనెను.

**కం.** **కొని కన్నుల నద్దుచు న**
**క్కునఁ జేర్చుచుఁ దలను మోపుకొనుచు న్మదిలోఁ**
**బెనిమిటిఁ జూచిన కంటెం**
**దనరారి యొకింత వడి కతని కిట్లనియెన్** **85**

కొని = తీసుకొని, కన్నులన్ అద్దుచున్ = కనులకు అద్దుకొనుచు, అక్కునన్ చేర్చుచున్ = గుండెలకు హత్తుకొనుచు, తలను మోపుకొనుచున్ = తలపై పెట్టుకొనుచు, మదిలో = మనసులో, పెనిమిటిన్ = భర్తను రాముని, చూచిన కంటెన్ = చూచిన దానికన్నను, తనరారి = అతిశయించి, ఒకింత వడికి = కొంతసేపటికి, అతనికి ఇట్లనియెన్ = ఆ హనుమతో ఇట్లు పలికెను.

**తా :** తీసుకొని కన్నులకద్దుకొనుచు, గుండెలకు హత్తుకొనుచు, తలపై పెట్టుకొనుచు మనసులో రాముని చూచినదానికన్నను అతిశయించి కొంతవడికి ఆ హనుమతో అనెను.

**తే.గీ.** **అన్న! గాదిలి చుట్టమ వగుచు తేని**
**నెమ్మి యెఱిఁగించి యుసురులు నిలిపినట్టి**
**నిన్నొకింతయు నగ్గింప నేర నింకఁ**
**బుడమి నెదురెందులను లేక తడవు మనుము** **86**

అన్న = నాయనా!, గాదిలి చుట్టమవు అగుచు = మిక్కిలి దగ్గరి బంధువువు అగుచు, ఱేని = రాముని యొక్క, నెమ్మిన్ = క్షేమమును, ఎఱిగించి = తెలిపి, ఉసురులు = నా ప్రాణములు, నిలిపినట్టి = నిలబెట్టినటువంటి, నిన్ను = నిన్ను, ఒకింతయున్ = కొంచెము కూడా, అగ్గింప నేరను = ప్రశంసింపజాలను, ఇంకన్ = ఇకపైన, ఎదురు ఎందులను లేక = ఎందును ఎదురులేక, పుడమిన్ = ఈ పృథివిపై, తడవు = సుదీర్ఘకాలము, మనుము = జీవించుము.

**తా :** నాయనా! మిక్కిలి దగ్గరి బంధువవుతూ రాముని క్షేమాన్ని తెలిపి నా ప్రాణములు నిలబెట్టిన నిన్ను కొంచెంకూడా ప్రశంసింపలేను. ఇకపై ఎదురులేక ఈ పుడమిపై చిరకాలము జీవించుము.

**కం.** **గుబ్బలి ద్రిమ్మరి సింగమ!**
**దబ్బర రక్కసుఁడు నన్గొదవ పల్కుటయున్**
**దబ్బున వింటివిగద! యిది**
**గొబ్బున నీ వరిగి దొరకు గుఱుతుగఁ జెపుమా! 87**

గుబ్బలి ద్రిమ్మరి సింగమ = కొండలలో తిరిగే కోతులలో శ్రేష్ఠుడా!, దబ్బర రక్కసుడు = మాయ రాక్షసుడు, నన్ కొదవ = నన్ను నీచముగా, పల్కుటయున్ = మాట్లాడుటను, దబ్బున వింటివిగద = నిశ్చయంగా విన్నావుకదా!, గొబ్బున = శీఘ్రముగా, నీవు అరిగి = నీవు వెళ్ళి, ఇది = ఈ విషయమును, దొరకు = రామునికి, గుఱుతుగ చెపుమా = జరుగుతున్నది గుర్తించేలా చెప్పుము.

**తా :** వానర శ్రేష్ఠమా! దొంగ రాక్షసుడు నన్ను నీచముగా మాట్లాడుటను విన్నావుకదా! శీఘ్రముగా వెళ్ళి ఈ విషయమును మీ దొరకు గుఱుతుగ చెపుమా!

**తే.గీ.** **వలదనంగను వెంటఁ గానలకు వచ్చి**
**యింత పుట్టించెనని కిన్క యిడకు మనుము**
**తన వెలందుక నొరుల కప్పనము సేసి**
**యూరకుండిన మగఁటిమి యొదవదనుము 88**

వలదు అనంగను = వద్దన్నా వినక, వెంటన్ = కూడాపడి, కానలకు వచ్చి = అడవులకు వచ్చి, ఇంత పుట్టించెను అని = ఇంత కష్టమును కలిగించితినని, కిన్క ఇడకుము అనుము = కోపగించవద్దు అనుము, తన వెలందుకను = తన భార్యను, ఒరులకు = పరాయివానికి, అప్పనము చేసి = అప్పగించి, ఊరకుండిన = మౌనముగా నుండుట, మగటిమి ఒదవదు = మగతనము అనిపించుకోదు, అనుము.

**తా :** వద్దన్నా వినక వెంట కానలకు వచ్చి ఇంత పుట్టించెనని కోపగించవద్దనుము. తన భార్యను ఒరులకు అప్పగించి ఊరకుండుట మగటిమి అనిపించుకోదనుము.

**తే.గీ.** **అరుదు మీఱిన బల్లిదుండనుచుఁ దనకుఁ**
**దవిలి మా తండ్రి యిడుట లోఁ దలఁపు మనుము**
**కోరి పెండిలి యాడిన కొలము చెలిని**
**విడువఁ జనదని తగ విన్నవింపవయ్య! 89**

అరుదు మీఱిన = మిక్కిలి అపూర్వమైన, బల్లిదుండు అనుచున్ = శౌర్యవంతుడనుచు, తనకున్ = తనకు, తవిలి = సిద్ధపడి, మా తండ్రి ఇదుట = మా తండ్రి జనకుడు నన్ను భార్యగ ఇచ్చుటను, లోన్ తలపుము అనుము = తన మనసులో తలచుకొనుమనుము. కోరి పెండిలి యాడిన = ప్రీతితో పెండ్లాడిన, కొలము చెలిని = కులవధువును, విడువన్ చనదని = విడిచిపెట్టుట న్యాయముకాదని, తగన్ = సముచితముగా, విన్నవింపుము అయ్య = తెలుపుము.

**తా :** మిక్కిలి అపూర్వమైన శౌర్యవంతుడనుచు మా తండ్రి సిద్ధపడి నన్ను తనకు భార్యగ ఇచ్చుటను తనలో తలచుకొనుమనుము. కోరి పెండ్లాడిన కులవధువును విడచిపెట్టుట న్యాయముకాదని సముచితముగా విన్నవింపుమయ్య

**చం.** **కడు ననుఁ గన్నతల్లి కెనఁగా నల రామునిఁ దండ్రి మాఱుగా**
**నుడుగని బత్తితోఁ గొలుచుచుండెడి తన్ను వెడంగుఁ బూని కా**
**ఱడవుల లోపలం గఱకులాడిన దోసపుఁ బంట యంతయున్**
**గుడిచితి నంచు నా మఱఁదిగుఱ్ఱకు నిక్క మెఱుంగఁ బల్కుమా!** **90**

ననున్ = నన్ను, కడు = మిక్కిలిగా, కన్న తల్లికి ఎనగాన్ = కన్నతల్లికి సాటిగాను, అల రాముని తండ్రి మాఱుగాన్ = ఆ రాముని తండ్రికి మారుగాను, ఉడుగని బత్తితోన్ = తగ్గని భక్తితో, కొలుచుచు ఉండెడి తన్ను = సేవించేటటువంటి తనను, వెడంగున్ పూని = వెఱ్ఱితనముతో, కాఱడవుల లోపలన్ = కీకారణ్యములో నున్నప్పుడు, కఱకులు ఆడిన = నిందలు పలికిన, దోసపున్ పంట అంతయున్ = దోషముయొక్క ఫలితమునంతను, కుడిచితిని అంచు = అనుభవించానని, ఆ మఱది కుఱ్ఱకు = ఆ కుఱ్ఱవాడైన నా మరదికి, నిక్కము, ఎఱుంగ = తెలియునట్లుగా, పల్కుమా,.

**తా :** నన్ను కన్నతల్లికి సాటిగా, ఆ రాముని తండ్రికి మారుగా ఉడుగని భక్తితో సేవించు తనను వెఱ్ఱితనముతో కాఱడవులలోనున్నప్పుడు నిందలు పలికిన దోషము ఫలితమును అనుభవించితినని నా మరదికి నిజము తెలియునట్లుగా చెప్పుము.

**కం.** **ఆ మాటలు మదిఁ బెట్టక**
**నామీఁదం గనికరంబు నాటు కొలుపుచున్**
**వే మొనలు దెచ్చి రక్కసి**
**గామిడి నడపుమని యతనికడఁ గడుఁ జెపుమా!** **91**

ఆ మాటలు మదిన్ పెట్టక = నేను పలికిన నిందలను మనసులో ఉంచుకొనక, నా మీదన్ = నాయందు, కనికరంబు, నాటు కొలుపుచున్ = పాతుకొనునట్లు చేయుచు, వే = శీఘ్రముగా, మొనలు తెచ్చి = సైన్యమును తీసుకొనివచ్చి, రక్కసి గామిడిన్ = రాక్షస శ్రేష్ఠుని, అడపుము అని = సంహరింపుమని, కడున్ = మిక్కిలిగా, అతని కడన్ = లక్ష్మణుని దగ్గర, చెపుమా = చెప్పుము.

**తా :** నే పలికిన నిందలు మనసులో ఉంచుకొనక నాయందు దయను నాటుకొలుపుచు వెంటనే సైన్యమును తెచ్చి రాక్షస శ్రేష్ఠుని సంహరింపుమని అతనితో చెప్పుము.

**తే.గీ. అనిన నతఁ డట్లు చేసెదనమ్మ! యింక**
**రిత్తచేతుల దొర కడ కెత్తెఱఁగున**
**మరలి చనఁ జను? నీ తలమానికంబు**
**నెమ్మి యలరార నానవాలిమ్ము నాకు 92**

అనినన్, అతడు = ఆ హనుమంతుడు, అట్లు చేసెదను అమ్మ = ఆ విధముగానే చేస్తాను తల్లీ!, ఇంక = ఇంత మాట్లాడి, రిత్త చేతుల = వట్టి చేతులతో, దొర కడకు = రాముని చెంతకు, ఏ తెఱగున = ఏ విధముగా, మరలి చనన్ చను = తిరిగి వెళ్ళుట తగును, నాకు, నెమ్మి అలరారన్ = మిక్కిలి సంతోషముతో, నీ తలమానికంబున్ = నీ శిరోరత్నమును, ఆలవాలు = గుర్తుగా, ఇమ్ము.

**తా :** అనిన హనుమంతుడు ఆ విధంగానే చేస్తాను తల్లీ! ఇంక వట్టిచేతులతో దొరకడకు ఏ విధముగా తిరిగి వెళ్ళుటతగును. నాకు నీ శిరోరత్నమును గుర్తుగా ఇమ్ము.

**ఆ.వె. అనిన నన్నెలంత యన్న! నీ నిక్కపు**
**రూపుఁ జూచిగాని రూఢి నిక్క**
**డింది మానికంబు డెందంబులో నిన్ను**
**నచ్చి గారవమున నిచ్చి పనుప 93**

అనినన్, ఆ నెలంత = ఆ సీతాదేవి!, అన్న = నాయనా!, నీ నిక్కపు రూపున్, చూచి కాని = చూస్తేనే కాని, రూఢిన్ = నిశ్చయముగా, డెందంబులో నిన్ను నచ్చి = నిన్ను మనసులో నమ్మి, ఈ కడింది మానికంబున్ ఇచ్చి = ఈశ్రేష్ఠమైన శిరోరత్నాన్ని ఇచ్చి, గారవమున = ప్రీతితో, పనుప = పంపలేను.

**తా :** అనిన ఆ సీతాదేవి! నాయనా! నీ నిజ స్వరూపాన్ని చూస్తేనే కాని నిశ్చయంగా నిన్ను మదిలో నమ్మి ఈ శిరోరత్నాన్ని నీకు ఇచ్చి ప్రీతితో పంపలేను'.

**తే.గీ. అనిన నతఁ డట్లె యొనరింప నలరి యలరు**
**బోఁడి తలమానికంబు గొబ్బున నొసంగి**
**వీడుకొల్పిన మ్రొక్కి యవ్వినుచూలి**
**కొమరుఁ డచ్చోటు వెలువడి కొమరు మెఱయ 94**

అనినన్ = అనగా, అతడు = ఆ హనుమ, అట్లె ఒనరింపన్ = అలా చేయగా (తన రూపమును చూపగా), అలరి = సంతోషించి, అలరుబోడి = సీతాదేవి, గొబ్బునన్ = వెంటనే, తలమానికంబు ఒసంగి = శిరోరత్నమును ఇచ్చి, వీడుకొల్పిన = సాగనంపగా, ఆ వినుచూలి కొమరుడు = ఆ వాయుదేవుని కొడుకు హనుమంతుడు, ఆ చోటు = ఆ ప్రదేశము, వెలువడి = బయటకు వచ్చి, కొమరు మెఱయ = చక్కదనము ప్రకాశింపగా,

**తా :** అనిన ఆ హనుమంతుడు తన రూపమును చూపగా సంతోషించి సీతాదేవి వెంటనే శిరోరత్నమును ఇచ్చి సాగనంపగా ఆ హనుమ ఆ ప్రదేశము బయటకు వచ్చి చక్కగా –

సీ. బావులు గలఁచి చప్పరములు వడిఁ ద్రోచి
పేరైన మ్రాఁకులు పెల్లగించి
పూవుగుత్తులు ద్రెంచి పులుఁగుల బెదరించి
పండ్లు రాలిచి పొదరిండ్లు సదిపి
తేనె తెఱల్ రేఁచి తీవియల్ నుగ్గాడి
మేడలు గోడలుఁ బాడు సేసి
యాటతిప్పలు ద్రచ్చి పాటబందులు గూల్చి
కట్టువలన్నియు గాసి సేసి
తే.గీ. తోటకావలి రక్కసి దాఁటు నొక్క
మాటె యెనిమిది వేలను మడియఁ జేసి
యడరుచున్నఁ గనుంగొని పుడమి కాన్పు
చెంతఁ గాపున్న పొలదిండి చెలులు పఱచి **95**

బావులు కలచి = బావులను కల్లోల పరచి, చప్పరములు వడిన్ ద్రోచి = పందిరులను శీఘ్రముగా తోసివేసి, పేరైన మ్రాకులు పెల్లగించి = పెద్దవియైన చెట్లను పెకలించి, పూవుగుత్తులు త్రెంచి = పూలగుత్తులను త్రెంపివేసి, పులుగుల బెదరించి = పక్షులను బెదిరించి, పండ్లు రాలిచి = ఫలములను రాల్చివేసి, పొదరిండ్లు చదిపి = గుబురులను నేలమట్టముచేసి, తేనె తెఱల్ రేచి = తేనెపట్టులలోని ఈగలను రెచ్చగొట్టి, తీవియల్ నుగ్గాడి = తీగలను త్రెంపివేసి, మేడలు గోడలు పాడుచేసి = క్రీడా గృహములను, ప్రాకారములను నాశనమొనరించి, ఆటతిప్పలు ద్రచ్చి = క్రీడా ప్రదేశములు నాశనము చేసి, పాటబందులు కూల్చి = గాడీలను కూల్చి, కట్టువలు అన్నియు గాసిచేసి = పశువుల శాలలను చిందరవందరచేసి, తోట కావలి రక్కసిదాటున్ = తోటకు కాపలాయున్న రాక్షస సమూహమును, ఒక్క మాటె ఎనిమిది వేలను = ఒక మాటుగ 8 వేల మందిని, మడియన్ చేసి = చంపి, అదరు చున్నన్ = అతిశయించుచుండగా, కనుంగొని = చూచి, పుడమి కాన్పు చెంతన్ కాపు ఉన్న = సీత చెంత కాపలా ఉన్న, పొలదిండి చెలులు = రాక్షస స్త్రీలు, పఱచి = పరుగులు తీసి,

**తా :** బావులు కలచి, పందిళ్ళు త్రోసేసి, చెట్లను పెకలించి, పూలగుత్తులు త్రెంపివేసి, పక్షులను బెదరించి, పండ్లను రాల్చివేసి, పొదరిళ్ళు నేలమట్టముచేసి, తేనెపట్టుల ఈగలను రెచ్చగొట్టి, తీగలను త్రెంపివేసి, మేడలు గోడలు పాడుచేసి, క్రీడా ప్రదేశములు నాశనముచేసి, గాడీలను కూల్చి, పశువులశాలలు చిందరవందరచేసి, తోట కావలి రక్కసులను ఎనిమిది వేలమందిని చంపి అతిశయించు హనుమను చూచి సీత చెంత కాపాలాగానున్న రాక్షస స్త్రీలు పరుగులు తీసి.

తే.గీ. రక్కసుల తేనిఁ బొడఁగని మ్రొక్కు లొసఁగి
వెఱఁగు కన్పట్ట నిట్లని విన్నవించి

**రేమి చెప్పుదు మెకిమీద! యిప్పు డొక్క**
**క్రోఁతి యెందుండియో రాచగోతిఁ జేరి** **96**

రక్కసుల ఱేనిన్ = రావణుని, బొడగని = చూసి, మ్రొక్కులు ఒసగి = సమస్కరించి, వెఱగు కన్పట్టన్ = భయము ప్రదర్శితమగునట్లుగా, ఇట్లు అని విన్నవించిరి = ఈ విధముగా మనవి చేసికొనిరి, ఎకిమీడ = శూరుడా!, ఏమి చెప్పుదుము = ఏం చెప్పమంటావు? ఇప్పుడు = ఇప్పుడే, ఒక్క క్రోతి = ఒక కోతి, ఎందుండియో = ఎక్కడినుంచో, రాచగోతిన్ = రాచవనితను (సీతను), చేరి = సమీపించి –

**తా :** రావణుని చూసి నమస్కరించి భయముతో మనవి చేసుకొనిరి 'శూరుడా! ఏం చెప్పమంటావు? ఇప్పుడే ఒక కోతి ఎక్కడినుంచో సీతను సమీపించి –

**తే.గీ.** **మంతనంబున నేమేమొ మాటలాడి**
**కడిమిఁ బూఁదోట నెల్లను గాకు సేసి**
**యచటఁ గావలియున్న గయాళి ప్రాఁత**
**వేల్పుమూఁకల నెనిమిది వేలఁ దునిమె** **97**

మంతనంబునన్ = రహస్యముగా, ఏమేమొ మాటలాడి, కడిమిన్ = పరాక్రమముతో, పూవు తోటను ఎల్లన్ = ఉద్యానవనమునంతను, కాకు చేసి = పనికిరాకుండ చేసి, అచటన్ = అక్కడ, కావలియున్న = కాపలాగా ఉన్న, గయాళి = సమర్థులైన, ప్రాత వేల్పు మూకలన్ = రాక్షస సమూహములను, ఎనిమిది వేలన్ = ఎనిమిదివేల మందిని, తునిమెన్ = చంపెను.

**తా :** రహస్యంగా ఏమేమో మాటలాడి వీరత్వంతో ఉద్యానవనమునంతను పనికిరాకుండ చేసి, కావలియున్న సమర్థులైన రాక్షసులను ఎనిమిదివేలమందిని చంపెను.

**కం.** **తునిమి యెనలేని కడిమిం**
**దనరారుచునున్నవాఁ డతనిఁ దేఱి కనుం**
**గొన నలవి గాదు వేల్పుల**
**కును రక్కసి వంగడంపు క్రొన్నెలఁ! యనుడున్** **98**

రక్కసి వంగడంపు = రాక్షస వంశమునకు, క్రొన్నెల = క్రొత్త చంద్రుడా!, తునిమి = అలా సంహరించి, ఎనలేని కడిమిన్ = సాటిలేని పరాక్రమముతో, తనరారుచున్నవాడు = ఒప్పుచున్నాడు, అతనిన్ = ఆ వానరుని, తేఱి కనుంగొనన్ = స్పష్టముగా చూచుటకు, వేల్పులకును = దేవతలకును, అలవి కాదు = సాధ్యము కాదు,

**తా :** రాక్షస వంశమునకు క్రొన్నెలా! అలా సంహరించి ఎనలేని శౌర్యంతో ఒప్పుచున్నాడు. ఆ వానరుని తేఱి చూడ్డానికి దేవతలకుకూడా సాధ్యం కాదు .

**తే.గీ.** **మండిపడి యాతఁ డా కోఁతి గం దడంచి**
**వేగ రండని యెనిమిది వేల పొలసు**

**దిండి బంటులఁ బనిచినఁ దివిరి వార**
**లీఁద కొమరుని పయి నని కేఁగుటయును** **99**

ఆతడు = ఆ రావణుడు, మండిపడి = భగ్గున కోపముతో మండిపడి, ఆ కోతి గండు = ఆ కోతి పౌరుషమును, అడంచి వేగ రండు అని = అణచివేసి శీఘ్రముగా తిరిగిరండని, ఎనిమిది వేల పొలసు తిండి బంటులన్ = ఎనిమిది వేలమంది రాక్షస సైనికులను, పనిచిని = పంపగా, తివిరి వారలు = వారు పూనుకొని, ఈద కొమరుని పయిన్ = వాయుదేవుని కుమారునిపైకి, అనికి = యుద్ధమునకు, ఏగుటయును = వెళ్ళగా –

**తా :** ఆ రావణుడు మండిపడి ఆ కోతి పౌరుషాన్ని అణచివేసి వేగరండని ఎనిమిదివేల రాక్షస సైనికులను పంపగా వారు హనుమపైకి యుద్ధమునకు వెళ్ళగా –

**కం.** **ఆ రక్కసి మూఁకలఁ గని**
**పేరిమి మెయి వెంచి గాడ్పుబిడ్డఁ డనికిఁ బొం**
**గారు నెడఁ బచ్చమావుల**
**తేరి వజీరుండు తూర్పుదెసఁ గనుపట్టెన్** **100**

ఆ రక్కసి మూకలన్ కని = ఆ రాక్షస మూకల్ని చూసి, గాడ్పు బిడ్డడు = హనుమంతుడు, పేరిమి = పెద్దదిగా, మెయి పెంచి = శరీరమును పెంచి, అనికిన్ = పోరుకు, పొంగారునెడన్ = ముందుకు దూకు సమయమున, తూర్పుదెసన్ = తూర్పు దిక్కున, పచ్చమావుల తేరి వజీరుండు = పచ్చని గుఱ్ఱాల రథాన్ని ఎక్కే శూరుడు (సూర్యుడు), కనుపట్టెన్ = ఉదయించెను.

**తా :** ఆ రాక్షసమూకల్ని చూసి హనుమంతుడు పెద్దగా శరీరమును పెంచి పోరుకు దూకు సమయమున తూర్పు దిక్కున సూర్యుడు ఉదయించెను.

**సీ.** **అప్పు డా జగజెట్టి యా రేయి ద్రిమ్మరి**
**దండుపై నెవ్వఁడి దాఁకి యార్చి**
**తోఁకతో జుట్టి పదువుర నూఱువురను**
**బట్టి తోరనపుఁ గంబమునఁ గొట్టి**
**మూఁపులు వీఁపులు మోరలు బోరలు**
**కాళ్ళు చేతులు కుత్తుకలును దలలు**
**పిక్కలు డొక్కలు జక్కుగాఁ జెండాడి**
**యందఱ జము ప్రోలి కనిచివైచి**

**తే.గీ.** **మొసలి తోరన మెక్కి యామునఁ జెలంగు**
**చున్నఁ బొలియక చిక్కిన యుతియ బంట్లు**
**పఱచి తొలివేల్పు తేని కత్తెఱఁగుఁ దెలుప**
**నదరిపడి వాఁడు కొఱకొఱ యొదవికొనఁగ** **101**

అప్పుడు, ఆ జగజెట్టి = ఆ మహావీరుడు, ఆ రేయిడ్రిమ్మరి దండుపైన్ = ఆ రాక్షస సైన్యముపై, నెవ్వడి తాకి = మిక్కిలి వేగముగా దూకి, ఆర్చి = గట్టిగా అరచి, తోకతో పదువుర, నూఱువురను చుట్టిపట్టి, తోరనపు కంబమునన్, కొట్టి, మూపులు = భుజములు, వీపులు, మోరలు = ముఖ ములు, బోరలు = ఉదరములు, కాళ్ళు,చేతులు,కుత్తుకలును,తలలు,పిక్కలు,డొక్కలు, చక్కుగాన్ = ఖండములుగా, చెండాడి = ఖండించి, అందఱ = అందరిని, జముప్రోలికి = యముడి పట్ట ణానికి, అనిచివైచి = పంపి, మొసలి తోరనము ఎక్కి = మకర తోరణముపై ఎక్కి, ఆమునన్ = పరాక్రమముతో, చెలంగుచున్నన్ = ఒప్పు చుండగా, పొలియక చిక్కిన = చావక మిగిలిన, ఉఱియ బంట్లు =పరితపించు భటులు, పఱచి = పరుగెత్తి, తొలివేల్పు ఱేనికి = రావణునికి, ఆ తెఱగున్, తెలుపన్, వాడు అదరిపడి, కొఱకొఱ = ఎక్కడలేని కోపము, ఒదవికొనగ = కలుగగా –

**తా :** ఆ సైన్యమును చూచి ఆ హనుమ గట్టిగా అరచి ఆ సైన్యముపై వేగముగా దూకి తోకతో పది, నూరుమందిని చుట్టిపట్టి తోరణస్తంభానికి కొట్టి భుజములు, వీపులు, ముఖములు, ఉదరములు, కాళ్ళు, చేతులు, కుత్తుకలును, తలలు, పిక్కలు, డొక్కలు ఖండములుగా ఖండించి అందరిని యముడి పట్టణానికి పంపి, మకరతోరణముపై ఎక్కి పరాక్రమముతో ఒప్పుచుండగా చావక మిగిలిన భటులు పరుగెత్తి రావణునికి తెలుపగా వాడు అదరిపడి ఎక్కడలేని కోపము కలుగగా –

**తే.గీ.** **మున్నరక నొప్పు శార్దూలముఖుని నశ్మ**
**వక్షు మఱి పింగళాక్షుని వక్రనాసు**
**దీర్ఘజిహ్వునిఁ బిలిచి యా దిట్టకోఁతిఁ**
**దునియలుగఁ జేసి సరగ రండనుచుఁ బనిచె** **102**

మున్ను అరకన్ ఒప్పు = తన ముందున్న, శార్దూలముఖుని, అశ్మవక్షుని మరియు, పింగళాక్షుని, వక్రనాసుని, దీర్ఘజిహ్వుని, పిలిచి, ఆ దిట్టకోతిన్ = ఆ శక్తిగల కోతిని, తునియలుగ చేసి = ముక్క లుగా చేసి, సరగన్ = శీఘ్రముగా, రండి అనుచు పనిచె = రండని పంపెను.

**తా :** తన ముందున్న శార్దూలముఖుని, అశ్మవక్షుని, పింగళాక్షుని, వక్రనాసుని, దీర్ఘజిహ్వుని పిలిచి ఆ దిట్ట కోతిని తునియలు చేసి రండని పంపెను.

**కం.** **పనిచిన యమ్మేటి మగ**
**ల్చని బిట్టుగఁ బొదవి యంప జడివాన యొన**
**ర్చిన నతఁ డయ్యంపఱ యె**
**ల్లను దోఁకం బాయఁ ద్రోచి లావెలయంగన్** **103**

పనిచిన = పంపగా, ఆ మేటి మగల్ = ఆ గొప్ప వీరులు, చని = వెళ్ళి, బిట్టుగన్ పొదవి = సమూహముగా చుట్టుముట్టి, అంప జడివాన ఒనర్చినన్ = బాణవర్షమును కురిపింపగా, అతడు

= ఆ హనుమంతుడు, ఆ అంపఱ ఎల్లను = ఆ బాణ సమూహమునంతను, తోకన్ పాయన్ ట్రోచి = తోకతో ప్రక్కకు త్రోసివేసి, లావు ఎలయంగన్ = తన శక్తి ప్రకటితమగునట్లుగా –

**తా :** పంపగా ఆ వీరులు వెళ్ళి సమూహంగా చుట్టుముట్టి బాణవర్షము కురిపింపగా ఆ హనుమ తోకతో వాటిని ప్రక్కకు త్రోసివేసి తన శక్తి ప్రకటితమగునట్లుగా –

**సీ.** **పోనీక తఱిమి ఱాబోర రక్కసు ఱొమ్ము**
**బెడిదంపుఁ బిడికిటఁ బొడిచి చంపి**
**వాత ముక్కున నల్ల వరద లుబ్బఁగఁ దాఁచి**
**వెస వంకముక్కు తొల్వేల్పుఁ జెండి**
**మొగిఁ దోరనపుఁ గంబమునఁ గొట్టి బెబ్బులి**
**మోము రే ద్రిమ్మరి మిఱి యడంచి**
**తోఁకతోఁ జుట్టి వే వీఁక మింటికి వైచి**
**నిడునాల్క పొలదిండిఁ బుడమిఁ గెడపి**

**తే.గీ.** **వ్రేలిమిడిఁ బచ్చకన్నుల వేల్పుసూడుఁ**
**జిదిమివైచిన మ్రగ్గక చిక్కియున్న**
**బిరుదు లొక కొంద ఱేతెంచి వరుస మెడల**
**నల్ల ద్రావుడు దొరకు విన్నప మొనర్ప** **104**

పోనీక = పారిపోనీయక, తఱిమి = వెంటపడి, ఱా బోర = రాతివంటి ఱొమ్ముకల, రక్కసు ఱొమ్ము = అశ్మవక్షుని ఱొమ్మును, బెడిదంపు పిడికిట = బిగించిన పిడికిలితో, పొడిచి చంపి, వాత = నోటినుండియు, ముక్కున, నల్ల వరదలు ఉబ్బంగన్ = రక్త ప్రవాహములు పొంగగా, తాచి = తన్ని, వెసన్ = త్వరగా, వంకముక్కు తొల్వేల్పున్ = వక్రనాసుని, చెండి = చంపి, మొగిన్ = పూని, తోరనపు కంబమునన్ = తోరణ స్తంభమునకు, కొట్టి, బెబ్బులి మోము రే త్రిమ్మరిన్ = శార్దూల ముఖుని, మిఱి అడంచి = శక్తి నాశనముచేసి (చంపి), తోకతో చుట్టి, వే = శీఘ్రముగా, వీకన్ = బలముగా, మింటికి వైచి = నింగికి ఎగురవేసి, నిడునాల్క పొలదిండిన్ = దీర్ఘజిహ్వుని, పుడమిన్ కెడపి = నేలకు పడవేసి చంపి, వ్రేలిమిడిన్ = క్షణములో, పచ్చకన్నుల వేల్పుసూడున్ = పింగళాక్షుని, చిదిమివైచిన = చంపివేయగా, మ్రగ్గక = చావక, చిక్కియున్న = మిగిలిన, బిరుదులు = వీరులు, ఒక కొందరు = కొంతమంది, ఏతెంచి = వచ్చి, వరుస మెడల = పంక్తి శిరుడగు, నల్లద్రావుడు దొరకు = రావణునకు, విన్నపము ఒనర్ప = విన్నవించగా,

**తా :** పారిపోనీయక వెంటపడి రాతివంటి ఱొమ్ముకల అశ్మవక్షుని ఱొమ్మును బిగించిన పిడికిలితో పొడిచి చంపి, నోటినుండి, ముక్కునుండి రక్తము ప్రవహింపగా తన్ని వక్రనాసుని చంపి, తోరణస్తంభమునకు కొట్టి శార్దూలముఖుని చంపి, తోకతో చుట్టి బలముగా నింగికి ఎగరేసి దీర్ఘజిహ్వుని చంపి, క్షణములో పింగళాక్షుని చంపివేయగా చావక మిగిలిన వీరులు కొంతమంది పరువు పోగా వచ్చి రావణునికి విన్నవించగా –

**ఆ.వె.** **కనలి ప్రగడ కొమరులను శతజిహ్వుని**
**స్తనితహస్తు శూలదంష్ట్రు రక్త**
**రోము వ్యాఘ్రకబళు రుధిరాక్షు నతనిపై**
**నని యొనర్పుఁడనుచుఁ బనుచుటయును** **105**

కనలి = కోపించి, ప్రగడ కొమరులను = మంత్రి కుమారులగు, శతజిహ్వుని, స్తనితహస్తుని, శూలదంష్ట్రుని, రక్తరోముని, వ్యాఘ్రకబళుని, రుధిరాక్షుని, అతనిపైన్ = ఆ హనుమపైకి, అని యొనర్పుడు అనుచన్ = యుద్ధము చేయుడనుచు, పనుచుటయును = పంపుటయును,

**తా :** కోపించి మంత్రికుమారులగు శతజిహ్వుని, స్తనితహస్తుని, శూలదంష్ట్రుని, రక్త రోముని, వ్యాఘ్రకబళుని, రుధిరాక్షుని ఆ హనుమపైకి యుద్ధమునకు పంపుటయును.

**కం.** **మా ఱెందు లేని కడిమిన్**
**మీఱుచు నరదంబు లెక్కి నెఱ మొనగాండ్ర**
**య్యాఱుగురుఁ బొదలి తాఁకినఁ**
**బాఱి సనక కొమ్మ మెకపు బంటు కడంకన్** **106**

మాఱు ఎందు లేని కడిమిన్ = ఎందును ఎదరు లేదనే సాహసముతో, మీఱుచున్ = అతిశయించుచు, అరదంబులు ఎక్కి = రథములెక్కి, నెఱ మొనగాండ్రు = మంచి మొనగాళ్ళైన, ఆ ఆరుగురును, పొదలి = ప్రకాశించి, తాకినన్ = మార్కొనగా, కొమ్మ మెకంపు బంటు = హనుమ, పాఱి చనక = పారిపోక, కడంకన్ = పూనికతో –

**తా :** ఎదురు లేదనే సాహసముతో అతిశయించుచు రథములెక్కి మంచి మొనగాళ్ళైన ఆ ఆరుగురును మార్కొనగా హనుమ పారిపోక పూనికతో –

**తే.గీ.** **తోఁక నల్లార్చి కేవునఁ గూఁకఁ బెట్టి**
**తోరనము డిగ్గి పోరికిఁ దొడరు నెడల**
**గఱకుటమ్ములవాండ్రు మేఁ గాటనేసి**
**బిట్టు నొప్పింపఁ గినిసి యా జెట్టి బిరుదు** **107**

ఆ జెట్టి బిరుదు = ఆ మహావీరుడు, తోక నల్లార్చి = తోకను ఝాడించి, కేవున్ కూక పెట్టి = కెవ్వుమని కేకపెట్టి, తోరనము డిగ్గి = తోరణము దిగి, పోరికికన్ తొడరున్ ఎడల = పోరుకు సిద్ధపడు సమయమున, వాండ్రు = వారు ఆరుగురును, కఱకు అమ్ములన్ = కఠినమైన బాణములతో, గాటన్ ఏసి = నాటునట్లుగా వేసి, బిట్టు నొప్పింపన్ = బాగా బాధకలిగించగా, కినిసి = కోపించి,

**తా :** ఆ మహావీరుడు తోకను ఝాడించి కెవ్వుమని కేకపెట్టి తోరణము దిగి పోరుకు సిద్ధపడు సమయమున వారు ఆరుగురును కఠినమైన బాణములతో నాటునట్లుగా వేసి బాగా బాధకలిగించగా కోపించి –

సీ. అరదంబు లన్నియు నఱవఱల్గా మోఁది
మావుపిండుల సదమదము చేసి
చేగల మెకములఁ జెండు బెండొనరించి
కాలరి పౌజుల నేలఁ జమిరి
గొడుగులు పడగలఁ బొడిపొడి గావించి
దొనలును దూపులుఁ దునిమివైచి
కైదువుల్ విండ్లును కత్తళంబులు పేల్చి
బూరలుఁ దుడుములు బుగ్గిఁ గలిపి

తే.గీ. చివ్వ పట్టెల్ల నల్లయుఁ గ్రొవ్వు మెదడుఁ
బొలసుఁ బ్రేవులు నెముకలుఁ బుఱియ గములు
నిండుకొల్పిన ఱవఱవల్ నిగుడ నగ్గ
రాసు రాకాసు లతనిఁ జేరంగ డాసి **108**

అరదంబులు అన్నియున్ = రథముల నన్నిటిని, అఱవఱలు కాన్ మోది = చిన్న చిన్న ముక్కలుగా బాది, మావు పిండులన్ = గుఱ్ఱపు సమూహములను, సదమదము చేసి = సంహరించి, చేగల మెకములన్ = ఏనుగులను, చెండు బెండు ఒనరించి = ముక్కలుగా నరికి, కాలరి పౌజులన్ = పదాతి దళమును, నేలన్ చమిరి = నేలకంటుకొనునట్లు తొక్కివేసి, గొడుగులు = ఛత్రములు, పడగలన్ = టెక్కెములను, పొడిపొడి కావించి = పొడిపొడి చేసి, దొనలును = అమ్ముల పొదులును, తూపులున్ = బాణములును, దునిమివైచి = విరుగకొట్టి, కైదువుల్ = ఆయుధములు, విండ్లును = విల్లులను, కత్తళంబులు = కవచములను, పేల్చి = బ్రద్దలుచేసి, బూరలు = కాహళులను, తుడుములు = మద్దుకములను, బుగ్గిన్ కలిపి = నాశనము చేసి, చివ్వ పట్టు ఎల్ల = యుద్ధ ప్రాంగణమంతయు, నల్లయు = రక్తమును, క్రొవ్వు, మెదడు, పొలసున్ = మాంసమును, ప్రేవులు, ఎముకలు, పుఱియ గములు = పుఱ్ఱెల సమూహములు, నిండుకొల్పిన = నిండునట్లు చేయగా, ఆ గరాసు రాకాసులు = ఆ దుష్ట రాక్షసులు, ఱవఱవల్ = కోపవికారములు, నిగుడన్ = వ్యాపింపగా, అతనిన్ = ఆ హనుమంతుని, చేరంగన్ = పట్టుకొనగా, డాసి = సమీపించి –

**తా :** రథములన్నిటిని చిన్న చిన్న ముక్కలుగా బాది, గుఱ్ఱములను సంహరించి, ఏనుగులను ముక్కలుగా నరికి, పదాతిదళమును నేలకంటుకొనునట్లుగా తొక్కివేసి, ఛత్రములు, టెక్కెములు పొడిపొడి చేసి, దొనలను, తూపులను విరుగకొట్టి, ఆయుధములు, విండ్లు, కవచములు బ్రద్దలుచేసి, కాహళులు, మద్దుకములు నాశముచేసి యుద్ధప్రాంగణమంతా రక్తము, కొవ్వు, మెదడు, మాంసము, ప్రేవులు, ఎముకలు, పుఱ్ఱెలు నిండునట్లు చేయగా ఆ దుష్ట రాక్షసులు కోపవికారములు వ్యాపింపగా ఆ హనుమను పట్టుకొనుటకు సమీపించి –

**తే.గీ.** **కొండపైఁ బెల్లు జడివాన కురియు కరణి**
**బెట్టిదపు తూపు లేసిన బెగడ కతఁడు**
**పేర్మి నొక్కొక్కరినిఁ బట్టి పిడుగులట్లు**
**నదరు పిడికిటి పోటులఁ బుడమిఁ గూల్చె** **109**

కొండపైన్ = పర్వతము మీద, పెల్లు = గట్టిగా, జడివాన = దట్టమైన వాన, కురియు కరణి = కురియునట్లుగా, బెట్టిదపు = కఠినమైన, తూపులు = బాణములు, ఏసినన్ = వేయగా, అతడు = ఆ హనుమ, బెగడక = భయపడక, పేర్మిన్ = అతిశయముతో, ఒక్కొక్కరిని పట్టి, పిడుగులు అట్లు, అదరు = పూని, పిడికిటి పోటులన్, పుడమిన్ కూల్చెన్ = చంపెను.

**తా :** పర్వతముమీద పెద్ద వాన కురిసినట్లుగా కఠినమైన బాణములు వేయగా ఆ హనుమ భయపడక అతిశయముతో ఒక్కొక్కరిని పట్టి పిడుగులట్లు పూని పిడికిలి పోటులతో చంపెను.

**తే.గీ.** **అత్తెఱంగెల్లఁ గని పరువెత్తి కొంద**
**ఱెఱచి దిండులు రావణు నెదుటఁ జేరి**
**అనిరి 'దేవర! విను క్రోఁతి అబ్బురముగ**
**రక్కసుల బూచియై యిందు వ్రాలినదిగ** **110**

ఆ తెఱంగు ఎల్లన్ కని = ఆ విషయమునంతను చూసి, కొందరు ఎఱచి తిండులు = కొందరు రాక్షసులు, పరువెత్తి = పరుగున పోయి, రావణుని ఎదుట చేరి అనిరి, దేవర = ప్రభూ!, విను = వినుము, క్రోతి = ఆ కోతి, అబ్బురముగ = ఆశ్చర్యకరముగా, రక్కసుల బూచియై = రాక్షసులపాలిటి భూతమై, ఇందు వ్రాలినదిగ = ఈ లంకలో వాలింది కదా!,

**తా :** ఆ తెఱంగెల్ల కని కొందరు రాక్షసులు పరుగున పోయి రావణుని చేరి 'ప్రభూ! విను, ఆ కోతి ఆశ్చర్యకరముగా రాక్షసులపాలిటి భూతమై ఈ లంకలో వాలిందికదా!' అనిరి –

**కం.** **అటిముటి నెటి మొనగాండ్రే**
**డ్తెఱ దురమున కరిగి కడు కడిందిగ నిపు డం**
**దఱు నొక్క యుమ్మడిం బొ**
**ల్పటి రబ్బలు కోఁతి బారి కగ్గంబగుచున్** **111**

అటిముటి = తత్తరపాటుతో, నెటి మొనగాండ్రు = మంచి వీరులు, ఏడ్తెఱన్ = విజృంభ ణముతో, దురమునకు = యుద్ధమునకు, అరిగి = వెళ్ళి, కడు కడిందిగన్ = మిక్కిలి అసాధ్యమైన రీతిగా, ఇపుడు అందఱున్, ఒక్క ఉమ్మడిన్ = కలిసికట్టుగా, ఆ బలు కోతి బారికి = ఆ బలముకల కోతి చేతికి, అగ్గంబు అగుచున్ = లొంగినవారగుచు, పొల్పటిరి = మరణించిరి.

**తా :** తత్తరపాటుతో ఆ వీరులు 'విజృంభణముతో యుద్ధమునకు వెళ్ళి మిక్కిలి అశక్యముకాగా ఇప్పుడు అందరు ఒక్కుమ్మడిగా ఆ బలుకోతి బారికి లొంగినవారగుచు మరణించిరి'.

**తే.గీ.** **అనిన విని నెయ్యి సోఁకిన అగ్గివోలె**
**మండిపడి వాఁడపుడు జంబుమాలి ననుప**

**నక్కడిఁది జోదు వడిఁ జని యుక్కు మెఱయ**
**గట్టు ద్రిమ్మరి తలకట్టుఁ జుట్టుముట్టి** **112**

అనినన్ = అని చెప్పగా, విని, నెయ్యి సోకిన అగ్గి పోలె = నెయ్యి తగలగానే అగ్ని ప్రజ్వ రిల్లునట్లుగా, మండిపడి, వాడు అపుడు, జంబుమాలిన్ = జంబుమాలినిని, అనుప = పంపగా, ఆ కడిది జోదు = ఆ శౌర్యముకల వీరుడు, వడిన్ = శీఘ్రముగా, చని = వెళ్ళి, ఉక్కు మెఱయ = తన పరాక్రమము అతిశయింపగా, గట్టు ద్రిమ్మరి = కొండలలో సంచరించే కోతులలో, తలకట్టున్ = శ్రేష్ఠుని (హనుమను), చుట్టుముట్టి = ఆక్రమించి,

**తా :** అని చెప్పగా విని నెయ్యి సోకిన అగ్ని ప్రజ్వరిల్లినట్లు మండిపడి వాడు అపుడు జంబుమాలినిని పంపగా ఆ వీరుడు శీఘ్రముగా వెళ్ళి తన పరాక్రమము మెఱయ హనుమను చుట్టుముట్టి -

**కం.** **కఱకు మొన వాఁడి ములుకులు**
**వఱపిన నగ్గాలి యనుఁగుఁ బాపడు మదిలో**
**వెఱచఱువక యొక పెను మ్రా**
**న్పెఱికి వెస న్వాని తేరు నేలం గూల్చెన్** **113**

కఱకు = కఠినములైన, వాడి = పదును కలిగిన, మొన = చివరలు కల, ములుకులు = బాణములు, పఱపినన్ = ప్రయోగింపగా, ఆ గాలి అనుగు పాపడు = ఆ హనుమంతుడు, మదిలో = మనస్సులో, వెఱచఱువక = భీతి చెందక, ఒక పెను మ్రాను = ఒక పెద్ద చెట్టును, పెఱికి = పెకలించి, వెసన్ = శీఘ్రముగా, వాని తేరు = ఆ జంబుమాలి రథమును, నేలన్ కూల్చెన్ = విరుగ కొట్టెను.

**తా :** కఠినములైన వాడి బాణములు ప్రయోగింపగా ఆ హనుమ మనసులో వెఱవక ఒక పెద్ద మ్రాను పెకలించి శీఘ్రముగా ఆ జంబుమాలి రథమును విరుగకొట్టెను.

**ఆ.వె.** **కూల్చి యాముటేనుఁగుల గుఱ్ఱముల మూఁక**
**నెల్లఁ బొలియఁజేసి యెసఁగుచున్న**
**నలిగి వాఁడుఁ గేల నడిదంబు గొని గాడ్పు**
**పట్టిఁ బట్టి నొసలు బిట్టు నరికె** **114**

కూల్చి = కూల్చిన తరువాత, ఆము ఏనుగులన్ = మదించిన ఏనుగులను, గుఱ్ఱముల = గుఱ్ఱములను, మూకన్ = సమూహమును, ఎల్లన్ = అన్నింటిని, పొలియన్ చేసి = నాశనము చేసి, ఎసగుచు ఉన్న = అతిశయించుచుండగా, వాడు = ఆ జంబుమాలి, అలిగి = కోపించి, కేలన్ = చేతితో, అడిదంబు కొని = కత్తిని తీసుకొని, గాడ్పు పట్టిన్ = హనుమను, పట్టి = పట్టుకొని, నొసలు = నుదుటి భాగమును, బిట్టు = గట్టిగా, నరికె = నరికెను.

**తా :** కూల్చి, మదించిన ఏనుగులను, గుఱ్ఱములను, కాల్బలమును అన్నింటిని నాశనము చేసి ఎసగుచున్న ఆ జంబుమాలి కోపించి కత్తిపట్టి హనుమ నుదుటిని గట్టిగా నరికెను.

**చం. నఱికిన సోలి యయ్యడవి నట్టు జగా మొనగాండ్ర మిన్న యు**
**క్కఱక యొకింతసేపునకుఁ గ్రమ్మఱఁ దెప్పిరి యప్పిసాళిపై**
**నుఱికి చలంబు మీఱఁ దలయూడఁగ మొత్తెను వాని కత్తియే**
**వెఱఁగు దలిర్పఁ బుచ్చుకొని వేల్పులు నింగిఁ జెలంగి యార్వఁగన్ 115**

నఱికినన్ = నరుకగా, సోలి = సొమ్మసిలి, ఆ అడవి నట్టు = ఆ అడవులలో సంచరించే కోతుల, జగామొనగాండ్ర మిన్న = వీరులలో ప్రథముడైన హనుమ, ఉక్కు అఱక = పరాక్రమమును వీడక, ఒకింతసేపునకు = కొంచెము సమయమునకు, క్రమ్మరన్ = మరల, తెప్పిరి = తెలివి తెచ్చుకొని, ఆ పిసాళిపైన్ = ఆ దుష్టుడైన జంబుమాలిపై, ఉఱికి = దుమికి, చలంబు మీరన్ = మిక్కిలి పట్టుదలతో, వెఱగు తలిర్పన్ = ఆశ్చర్యకరముగా, వాని కత్తియే పుచ్చుకొని, వేల్పులు = దేవతలు, నింగిన్ = ఆకాశమున, చెలంగి = రెచ్చి పోయి, ఆర్వగన్ = అరచుచుండగా, తల ఊడగ మొత్తెను = తల నేలపడేలా కొట్టెను.

**తా :** నరుకగా సొమ్మసిలి ఆ హనుమ పరాక్రమము వీడక కొంతవడికి తెలివితెచ్చుకొని ఆ దుష్ట జంబుమాలిపై దుమికి పట్టుదలతో వాని కత్తి పుచ్చుకొని ఆకాశమున దేవతలు రెచ్చి అరచుచుండగా తల నేల పడునట్లుగా కొట్టెను.

**ఆ.వె. అటుల జంబుమాలి దిటమంతయును దూలి**
**సరగఁ బోరఁ గూలి జముని ప్రోలి**
**కేగినట్టి జోలి యెరచి మేపరు లోలిఁ**
**దెలుప నవుడు గఱచి దీవి ఱేఁడు 116**

అటుల = ఆ విధముగా, జంబుమాలి, దిటము = ధైర్యము, అంతయును, తూలి = పోగొట్టుకొని, పోరన్ కూలి = యుద్ధరంగమున చనిపోయి, సరగన్ = తొందరగా, జముని ప్రోలికి = యముని పట్టణమునకు, ఏగినట్టి జోలి = వెళ్ళిన విధమును, ఎరచి మేపరులు = రాక్షసులు, ఓలిన్ = క్రమముగా, తెలుపన్ = చెప్పగా, దీవి ఱేడు = రావణుడు, అవుడు కఱచి = పెదవి కొరుక్కొని–

**తా :** ఆ విధంగా జంబుమాలి ధైర్యమంతా పోగొట్టుకొని చనిపోయి యముని చేరిన విధమును రాక్షసులు క్రమముగా తెలుపగా రావణుడు పెదవి కొరుక్కొని –

**తే.గీ. అక్షుఁ డనుపేరుగల తన యనుఁగుఁ గొడుకుఁ**
**బిలిచి ఆ కోఁతి తలఁ గోసి బీరమొదవఁ**
**దోరనపు గంబమునఁ గట్టి పేరువాడి**
**మరలి రమ్మని సెలవిడ్డఁ గరము చెలఁగి 117**

అక్షుడు అను పేరుకల, తన అనుగు కొడుకున్ = తన ప్రియ పుత్రుని, పిలిచి, ఆ కోతి తల కోసి, బీరము ఒదవన్ = పరాక్రమము ప్రకాశించునట్లుగా, తోరనపు కంబమునన్ = తోరణ స్తంభానికి, కట్టి, పేరు వాడి = కీర్తినొంది, మరలి రమ్మని = తిరిగి రమ్మని, సెలవు ఇడ్డన్ = ఆజ్ఞాపించగా, కరము చెలగి = మిక్కిలి విజృంభించి,

**తా :** అక్షుని తన ప్రియ పుత్రుని పిలిచి ఆ కోతి తలకోసి పరాక్రమముతో తోరణ స్తంభానికి కట్టి కీర్తినొంది రమ్మని సెలవొసంగిన విజృంభించి.

**కం.** **వాఁడొక తేరెక్కి కడున్**
**వాఁడి మెయిం జని మెఱుంగు వాల్నారసముల్**
**పోఁడిమితోఁ గోఁతిపయిన్**
**మూఁడు పదుల్ వెక్కసముగ నో వేయుటయున్** **118**

వాడు ఒక తేరు ఎక్కి = ఆ అక్షకుమారుడు ఒక రథమునెక్కి, కడున్ = మిక్కిలి, వాడి మెయిన్ = పరాక్రమముతో, చని = వెళ్ళి, మెఱుంగు = వాడియైన, వాలు = పొడవైన, నారసముల్ = బాణములను, పోడిమితోన్ = నేర్పుగా, కోతి పయిన్ = హనుమంతుని మీద, మూడు పదుల్ = ముప్పదింటిని, వెక్కసముగన్ = దుస్సహత్వముగా, నోవ ఏయుటయున్ = బాధకలిగేలా వేయగా–

**తా :** ఆ అక్షకుమారుడు రథమునెక్కి పరాక్రమముతో వెళ్ళి వాడి బాణములను నేర్పుగా ఆ హనుమపై ముప్పదింటిని వెక్కసముగ, బాధకలిగేలా వేయగా –

**సీ.** **మబ్బు త్రోపరికూన గొబ్బున వాని సిం**
**గాణి ముత్తునియలుగా నడంప**
**వేఱొండు విల్గొని తూఱి ప్రా జేజేల**
**ఱేని ప్రేముడి పట్టి రేఁచి బల్క**
**డంక నచ్చెట్టు బిడారు బొబ్బ మెకంబు**
**పై నగ్గలంబుగఁ బాఱ వాఁడి**
**యమ్ములు వనుప నయ్యనుమఁడు తోఁకచే**
**నవి యెల్ల నుగ్గాడి యార్చి యుక్క**

**తే.గీ.** **తాడి మ్రానుక్కు మీఱంగ నూడఁ బెఱికి**
**య క్కువాళంపు రక్కసుఁ డెక్కుకొన్న**
**యరద మఱవఱ లొనరింప నలిగి వాఁడు**
**వాని నెన్నొస లుఱక నొవ్వంగ నేసె** **119**

మబ్బు త్రోపరి కూన = మబ్బులను చెదరగొట్టే వాయువునకు బిడ్డ (హనుమ), గొబ్బున = వెంటనే, వాని సింగాణిన్ = వాని విల్లును, మూడు తునియలుగాన్ = మూడు ముక్కలుగా, అడంప = విరువగా, తూరి = ఈ సారి, వేఱు ఒండు విలు కొని = మరొక విల్లును తీసుకొని, ప్రా జేజేల ఱేని = రావణుని, ప్రేముడి పట్టి = ప్రియపుత్రుడు (అక్షుడు), రేచి = రెచ్చిపోయి, పలు కడంకన్ = మిక్కిలి శౌర్యముతో, ఆ చెట్టు బిడారు = ఆ చెట్లే నివాసముగా కల, బొబ్బమెకంబుపైన్ = సింహమైన వానిపై, అగ్గలంబుగ = ఆగకుండా, పాఱన్ = పడునట్లుగా, వాడి అమ్ములు = పదునైన బాణములను, పనుప = పంపగా, ఆ అనుమదు = ఆ హనుమంతుడు, తోకచేన్ = తోకతోనే, అవి ఎల్ల నుగ్గాడి = వాటినన్నిటిని ముక్కలు చేసి, ఆర్చి = సింహనాదముచేసి, ఉక్కు మీఱంగన్ =

మిక్కిలి బలముతో, ఒక్క త్రాడి ప్రూను = ఒక తాటిచెట్టును, ఊడ పెఱికి, ఆ కువాళంపు = ఆ గౌసెనతో కూడిన, రక్కసుడు ఎక్కుకొన్న = అక్షుడు ఎక్కినటువంటి, అరదము = రథమును, అఱువఅలు ఒనరింపన్ = ముక్కలు చేయగా, వాడు అలిగి = వాడు కోపించి, వాని నెన్నొసలు = ఆ హనుమ నుదుటిని, ఉఱక = గట్టిగా, నొవ్వంగన్ ఏసె = బాధకలిగేలా కొట్టెను,

**తా :** హనుమ వాని విల్లును మూడుముక్కలుగా విరువగా, ఈ సారి మరొక విల్లును తీసుకొని అక్షుడు రెచ్చిపోయి హనుమపై ఆగకుండా బాణములు వేయగా, ఆ హనుమ తన తోకతోనే వాటినన్నిటిని ముక్కలు చేసి సింహనాదము చేసి మిక్కిలి బలముతో ఒక తాడిచెట్టును పెఱికి అక్షుడు ఎక్కిన రథమును ముక్కలు చేయగా, వాడు కోపించి ఆ హనుమ నుదుటిపై గట్టిగా నొచ్చేలా కొట్టెను.

**తే.గీ.** **ఏయుటయు బిట్టు సోలి యయ్యివము సూడు**
**కొలcపు రారిక్క దొర బంటు గొంతవడికిc**
**దెలిసి బిగియొప్ప నప్పాలదిండి మిన్న**
**టొమ్ము పిడికిటc బొడిచిన సొమ్మసిల్లె** **120**

ఏయుటయున్ = నొసట అలా కొట్టగా, బిట్టు = మిక్కిలి, సోలి = తూలిపడి, ఆ ఇవము సూడు కొలపు రారిక్క దొర బంటు = ఆ మంచునకు శత్రువగు సూర్యవంశమునకు రాజచంద్రుడగు రాముని బంటగు ఆంజనేయుడు, కొంతవడికి = కొంతసేపటికి, తెలిసి = తెలివి తెచ్చుకొని, బిగి ఒప్పన్ = పరాక్రమము అతిశయింపగా, ఆ పొల తిండి మిన్న టొమ్ము = ఆ రాక్షసులలో మేటియగు అక్షుని టొమ్మును, పిడికిటన్ = పిడికిలితో, పొడిచిన = పొడువగా, సొమ్మసిల్లె = ఆ అక్షుడు తెలివితప్పెను.

**తా :** నొసట అలా కొట్టగా తూలిపడి హనుమ కొంతవడికి తెలిసి పరాక్రమముతో ఆ రాక్షసులలో మేటియగు అక్షుని టొమ్మును పిడికిలితో పొడువగా ఆ అక్షుడు తెలివితప్పెను.

**కం.** **సొమ్మసిలి సరగc దెప్పిటి**
**యమ్మేటి మగండు గుదియ నా యనుమని పెన్**
**టొమ్ము నగలింప నాతcడు**
**గ్రమ్మఱ నగ్గుదియ నతనిc గడు వడి మోcదెన్** **121**

సొమ్మసిలి, సరగన్ = వెంటనే, తెప్పిటి = తెలివి తెచ్చుకొని, ఆ మేటి మగండు = ఆ శ్రేష్ఠుడైన వీరుడు, గుదియన్ = గదతో, ఆ అనుమనిన్ = ఆ హనుమంతుని, పెన్ టొమ్మున్ = విశాలమైన వక్షస్థలమును, అగలింపన్ = పగులగొట్టగా, ఆతడు, క్రమ్మఱన్ = తిరిగి, ఆ గుదియన్ = అదే గదతో, అతనిన్ = ఆ అక్షుని, కడువడిన్ = మిక్కిలి వేగముగా, మోదెన్ = బాదెను.

**తా :** స్మృహతప్పి వెంటనే తెలివితెచ్చుకొని ఆ మేటి వీరుడు గదతో ఆ హనుమ విశాల వక్షస్థలమును పగులగొట్టగా ఆ హనుమ తిరిగి అదే గదతో ఆ అక్షుని మిక్కిలి వేగముగా బాదెను.

**తే.గీ.** **మోఁదుటయు వాఁడు వాల్గొని మొనసి కోఁతి**
**తొడలు నొవ్వఁగ నడచినఁ దోన యెగసి**
**పట్టుకొని నేలపైఁ బడఁగొట్టి గాలి**
**పట్టి యా రక్కసుని జము పట్టుఁ జేర్చె** **122**

మోదుటయు = మోదగానే, వాడు = ఆ అక్షుడు, వాలు కొని = కత్తిని తీసుకొని, మొనసి = బలముగా పట్టుకొని, కోతి తొడలు నొవ్వగన్ = హనుమంతుని తొడలు నొచ్చునట్లుగా, అడచినన్ = కొట్టగా, తోన = వెన్వెంటనే, గాలిపట్టి = హనుమ, ఎగసి = ఎగిరి, పట్టుకొని = వాని పట్టుకొని, నేలపైన్ పడన్ కొట్టి = నేలమీద పడకొట్టి, ఆ రక్కసుని = ఆ అక్షుని, జము పట్టున్ = యమ నివాసమునకు, చేర్చె = చేర్చెను.

**తా :** మోదగానే ఆ అక్షుడు కత్తిని తీసుకొని హనుమ తొడలు నొచ్చునట్లుగా కొట్టగా వెంటనే హనుమ ఎగిరి వానిని పట్టుకొని నేలమీద పడకొట్టి ఆ అక్షుని చంపెను.

**తే.గీ.** **అంత మడియక మిగిలియున్నట్టి సోఁకు**
**బంట్లు పదికుత్తుకల ఱేని పాలి కేఁగి**
**మిక్కుటంబుగఁ బాముల మేఁత బుడుత**
**మగతనంబెల్లఁ బలుమఱుఁ బొగడి యనిరి** **123**

అంతన్ = అంతట, మడియక = చావక, మిగిలి ఉన్నట్టి = మిగిలియున్న, సోకు బంట్లు = రాక్షస భటులు, పది కుత్తుకల ఱేని పాలికి = రావణుని చెంతకు, ఏగి = వెళ్ళి, పాముల మేత బుడుత = పాములకు ఆహారమైన వాయుదేవుని పుత్రుని (హనుమ), మగతనంబు ఎల్లన్ = పరాక్రమమునంతను, పలుమఱున్ = చాలసార్లు, మిక్కుటంబుగన్ = ఎక్కువగా, పొగడి = స్తుతించి, అనిరి = చెప్పిరి.

**తా :** అంత చావక మిగిలిన రాక్షసభటులు రావణుని చెంతకు వెళ్ళి హనుమ మగతనమును పలుమార్లు ఎక్కువగా పొగడి చెప్పిరి.

**సీ.** **శార్దూలముఖుఁ డీల్గె స్తనితహస్తుడు సెల్లె**
**దీర్ఘజిహ్వుడు గడతేరిపోయె**
**శూలదంష్ట్రుఁడు మ్రగ్గెఁ గూలెఁ బింగళనేత్రుఁ**
**డశ్మవక్షుఁడు దెగటారె రక్త -**
**రోముఁడు మెయి వీడె రుధిరాక్షుఁడును వ్యాఘ్ర**
**కబళుండు నక్షుండుఁ గంతుఁగొనిరి**
**జంబుమాలి యడంగె శతజిహ్వుఁడును వక్ర**
**నాసుండు సుసురులఁ బాసి చనిరి**

**తే.గీ.** **మఱియు నెనిమిది వేలు గద్దఱి వజీర్లు**
**వడిరి పూఁదోఁట కావలి బానసీంద్రు**

**సాలఁ జచ్చిరి నేఁడు నీ మ్రోల నేమి**
**దెలుపుదుము సామి! యా కోఁతి తెఱఁగు మేము** **124**

సామి = ఓ ప్రభూ!, శార్దూలముఖుడు, ఈల్గె = చనిపోయెను, స్తనితహస్తుడు, చెల్లెన్ = చెల్లిపోయెను, దీర్ఘజిహ్వుడు, కడతేరిపోయె = మరణించెను, శూలదంష్ట్రుడు, మ్రగ్గెన్ = చచ్చెను, పింగలనేత్రుడు, కూలె = కూలిపోయెను, అశ్మవక్షుడు, తెగటారె = చనిపోయెను, రక్తరోముడు, మెయి వీడె = దేహము వీడెను, రుధిరాక్షుడును, వ్యాఘ్రకబళుండును, అక్షుండును, కంతుగొనిరి = జీవితపు గడువును తీసుకొనిరి (మరణించిరి), జంబుమాలి, అడంగె = చనిపోయెను, శతజిహ్వుడును, వక్రనాసుడును, ఉసురులు పాసి చనిరి = ప్రాణములు విడిచి వెళ్ళిరి. మఱియు = ఇంకను, ఎనిమిది వేల గద్దఱి వజీర్లు = ఎనిమిది వేలమంది సమర్థులైన యోధులు, పడిరి = చచ్చిరి, పూదోట కావలి బాససీంద్రు = అశోకవన కాపలా సేవకులు, చాలన్ చచ్చిరి = చాలమంది చని పోయిరి, నేడు = ఈనాడు, మేము = మేము, ఆ కొతి తెఱగు = ఆ కోతి విషయమును, నీ మ్రోలన్ = నీ దగ్గర, ఏమి తెలుపుదుము = ఏమి చెప్పగలము?

**తా :** ఓ ప్రభూ! శార్దూలముఖుడు చనిపోయెను. స్తనితహస్తుడు చెల్లిపోయెను. దీర్ఘజిహ్వుడు మరణించెను. శూలదంష్ట్రుడు చచ్చెను. పింగలనేత్రుడు కూలిపోయెను. అశ్మవక్షుడు తెగటారెను. రక్తరోముడు దేహము వీడెను. రుధిరాక్షుడు, వ్యాఘ్రకబళుడు, అక్షుడు సెలవు తీసుకొనిరి. జంబుమాలి యమసదనము చేరెను. శతజిహ్వుడు, వక్రనాసుడు ఉసురులు బాసిరి. ఇంకను ఎనిమిదివేలమంది సమర్థులైన వీరులు చచ్చిరి. అశోకవన కావలి సేవకులు చాలమంది చనిపోయిరి. నేడు ఆ కోతి విషయం మేము నీ దగ్గర ఏం చెప్పం.

**చం.** **అన విని సోఁకురాయఁ డెద నల్కయు నుమ్మలికంబు నబ్బురం**
**బును గదురంగ నక్షుఁ దలపోసి కడుం బలవించి యద్దిఱా!**
**మును నెపుడు న్వినంగనని ముచ్చట పుట్టెనుగాక కోఁతు లెం**
**దును పొలదిండి పోటరుల దున్మటఁ గంటిమె? తప్పిజాఱియున్** **125**

అనన్ విని, సోకురాయడు = రాక్షస రాజగు రావణుడు, ఎదన్, అల్కయున్, ఉమ్మలికంబున్ = దుఃఖమును, అబ్బురంబును = ఆశ్చర్యమును, కదురంగన్ = వ్యాపింపగా, అక్షున్ తలపోసి, కడున్ పలవించి = మిక్కిలి దుఃఖించి, అద్దిఱా = ఎంత ఆశ్చర్యము, మునున్ = ఇంతకు ముందు, ఎపుడున్, వినన్ కనని = విన్నది చూసినది కాని, ముచ్చట = విషయము, పుట్టెను కాక = పుట్టిందికదా!, కోతులు, ఎందును = ఎప్పుడైనా, పొల తిండి పోటరులన్ = రాక్షస వీరులను, తున్మట = చంపుట, తప్పిజాఱియున్ = పొరపాటుననైనను, కంటిమె = చూచితిమా?

**తా :** అనగా విని రావణుడు మనసులో కోపము, దుఃఖము, ఆశ్చర్యము వ్యాపింపగా అక్షుని తలచుకొని మిక్కిలి దుఃఖించి, ఎంత ఆశ్చర్యము ఇంతకు ముందు ఎన్నడు వినని కనని ముచ్చట పుట్టెనుకదా! కోతులు ఎప్పుడైనా రాక్షస వీరులను చంపుట పొరపాటునైనా కంటిమా?

**ఆ.వె.** **తలఁపఁ దటియు నిపుడు తారుమాఱయ్యెఁగాఁ**
**బోలు నేమి సేయఁబోలు దీని**
**కనుచు నుత్తలంబు పెనఁగొన దురపిల్లు**
**నెడల నింద్రజితుఁడు నేఁగు దెంచి** **126**

తలపన్ = ఆలోచింపగా, ఇపుడు = ఇప్పుడు, తటియు = కాలము కూడా, తారుమాఱయ్యెన్ = తలక్రిందులైనది, కాబోలు, దీనికిన్ = ఈ సమస్యకు, ఏమి చేయన్ పోలున్ = ఏమి చేయతగినది?, అనుచున్ = అని తలంచుచు, ఉత్తలంబు = పరితాపము, పెనగొనన్ = వృద్ధిపొందగా, దురపిల్లున్ ఎడలన్ = దుఃఖించుచున్న సమయమున, ఇంద్రజితుడు = ఇంద్రజిత్తు, ఏగు తెంచి = వచ్చి –

**తా :** ఆలోచింపగా ఇప్డు కాలముకూడా తలక్రిందులైంది కాబోలు, ఈ సమస్యకు ఏమి చేయ దగినది? అని తలంచుచు పరితాపము వృద్ధిపొందగా దుఃఖించుచుండగా ఇంద్రజిత్తు వచ్చి–

**కం.** **అప్పా! జగములు మూఁడును**
**విప్పారెడు కడిమి గెలిచి వెలసిన నీ వీ**
**చొప్పున నొక కోఁతికినై**
**తప్పక పలుమఱుఁ గలంగఁ దగవే? చెపుమా!** **127**

అప్పా = తండ్రీ!, జగములు మూడును = మూడు లోకములను, విప్పారెడు కడిమిన్ = అతిశయించిన శౌర్యముతో, గెలిచి, వెలసిన = ఒప్పినట్టి, నీవు, ఈ చొప్పునన్ = ఈ విధముగా, ఒక కోతికినై = ఒక కోతి కొఱకు, తప్పక = విడువక, పలుమఱు = పదేపదే, కలంగన్ = కలతచెందుట, తగవే = న్యాయమా?, చెపుమా = చెప్పుము.

**తా :** తండ్రీ! ముల్లోకములను శౌర్యముతో గెలిచిన నీవు ఇలా ఒక కోతికోసం పదేపదే కలతచెందడం న్యాయమా? చెప్పు.

**కం.** **ఉమ్మలిక యుడిగి తద్దయు**
**నెమ్మదితో నుండు మిపుడు నీ చెంతకు బీ**
**ర మ్మొదవఁగ నగ్గట్టుం**
**ద్రిమ్మరి మొనగానిఁ బట్టి తెచ్చెద నెలమిన్** **128**

ఉమ్మలిక ఉడిగి = విచారమును వదలి, తద్దయున్ = మిక్కిలి, నెమ్మదితోన్ = నెమ్మదించిన మనసుతో, ఉండుము, ఇపుడు, నీ చెంతకు = నీ దగ్గరకు, బీరమ్ము ఒదవగ = శౌర్యము ప్రకటితమగునట్లుగా, ఆ గట్టు ద్రిమ్మరిన్ = ఆ కోతిని, మొనగానిన్= మొనగాణ్ణి, ఎలమిన్ = సంతోషముతో, పట్టి తెచ్చెదన్ = బంధించి తెచ్చెదను.

**తా :** విచారింపక నెమ్మదించిన మనసుతో ఉండుము. ఇపుడు శౌర్యము ప్రకటితమగునట్లుగ నీ చెంతకు ఆ కోతిని, ఆ మొనగాణ్ణి సంతోషముగా బంధించి తెచ్చెదను.

**కం.** **అని యరద మెక్కి యుక్కునఁ**
**జని తెమ్మెర కూన నంప జడివానల ముం**
**చిన నవి యాతఁడు దోఁకం**
**దునిమి మలలు చెట్టులేసెఁ దొడరి యతనిపైన్** **129**

అని = అని చెప్పి, అరదము ఎక్కి = రథము ఎక్కి, ఉక్కునన్ = పరాక్రమముతో, చని = వెళ్ళి, తెమ్మెర కూనన్ = గాలి పుత్రుని (హనుమను), అంప జడివానల = బాణ వర్షముతో, ముంచినన్ = ముంచగా, అవి = వానినన్నిటిని, ఆతడు = ఆ హనుమ, తోకన్ = తోకతో, తునిమి = ముక్కలు చేసి, తొడరి = పూనుకొని, మలలు = గుట్టలు, చెట్టులు = చెట్లు, అతని పైన్ = ఆ ఇంద్రజిత్తు మీద, ఏసెన్ = వేసెను.

**తా :** అని చెప్పి రథము ఎక్కి పరాక్రమముతో వెళ్ళి హనుమను బాణవర్షముతో ముంచగా వానిని ఆ హనుమ తోకతో ముక్కలుచేసి పూనుకొని కొండలు, చెట్లు అతనిపై వేసెను.

**ఆ.వె.** **దాని కలిగి నల్లద్రావుడు మేల్బంతి**
**తోన మరలి వాలుఁ దూపు లేసె**
**నవియుఁ దునిమి వాని యరదంబు మావుల**
**గాలి బుడత నుగ్గుగా నొనర్చె** **130**

దానికి, అలిగి = కోపించి, నల్లద్రావుడు మేల్బంతి = రాక్షస శ్రేష్ఠుడైన ఇంద్రజిత్తు, తోన = శీఘ్రముగా, మరలి = మళ్ళీ, వాలు తూపులు ఏసెన్ = వాడి బాణములను వేసెను, అవియున్ = వానినికూడా, తునిమి = విరిచి, గాలిబుడత = హనుమ, వాని = ఆ ఇంద్రజిత్తు యొక్క, అరదంబు, మావుల = రథమును, గుఱ్ఱములను, నుగ్గుగాన్ ఒనర్చె = పిండి పిండి చేసివేసెను.

**తా :** దానికి కోపించి రాక్షస శ్రేష్ఠుడైన ఇంద్రజిత్తు శీఘ్రముగా మళ్ళీ వాడి బాణములను వేసెను. వానిని కూడా తునిమి హనుమ ఇంద్రజిత్తు రథానికున్న గుఱ్ఱములను పిండిపిండి చేసెను.

**తే.గీ.** **అట్లొనర్చిన రక్కసుం డతని కడిమి**
**కబ్రపడి కొన్ని నెఱతూపు లదరి యేయ**
**నవి యొకింతయు గాఁడక యవల జనియె**
**అప్పు డమ్మబ్బు రొదసోఁకుఁ డలుక నిగుడ** **131**

అట్లు ఒనర్చిన = అలా చేయగా, రక్కసుండు = ఇంద్రజిత్తు, అతని కడిమికి = అతని పరాక్రమానికి, అబ్రపడి = ఆశ్చర్యపడి, కొన్ని నెఱ తూపులు = కొన్ని మంచి బాణములను, అదరి ఏయన్ = అతిశయించి ప్రయోగించగా, అవి ఒకింతయు = అవి కొంచెమును, గాడక = గాయపరుపక, అవల చనియె = పక్కనుంచి పోయెను, అప్పుడు = ఆ సమయమున, ఆ మబ్బురొద సోకుడు = మేఘనాదుడనే రాక్షసుడు, అలుక నిగుడ = మిక్కిలి కోపముతో –

**తా :** అలా చేయగా ఇంద్రజిత్తు అతని పరాక్రమానికి ఆశ్చర్యపడి మంచి బాణములను అతిశయించి ప్రయోగించగా అవి కొంచెమును గాయపరుపక పక్కనుంచిపోయెను. అప్పుడు మేఘనాదుడు మిక్కిలి కోపముతో –

**తే.గీ.**　**బమ్మ యమ్మేర్చి యజ్జగబంటు మీఁద**
**వైవ నది సంపఁజాలక వానిఁ గుదియఁ**
**గట్టివైచిన మేనల్లఁ బట్టి వైచి**
**తండ్రి కడ నిల్పె నగ్గట్టు దాయ సూడు　　132**

బమ్మ అమ్ము = బ్రహ్మాస్త్రమును, ఏర్చి = వింటిని కూర్చి, ఆ జగబంటు మీద = ఆ జగజ్జెట్టియగు హనుమంతుని మీద, వైవన్ = వేయగా, అది చంపజాలక, వానిన్ = ఆ హనుమను, కుదియన్ కట్టివైచిన = కుంచించి బంధించగా, ఆ గట్టు దాయ సూడు = ఆ పర్వతములకు శత్రువగు ఇంద్రునికి శత్రువు (ఇంద్రజిత్తు), మేను = ఆ హనుమంతుని దేహమును, అల్లన్ = మెల్లగా, పట్టి = పట్టుకొని, వైచి = రథములో వేసుకుని, తండ్రి కడ నిల్పెన్ = రావణుని చెంత నిలబెట్టెను.

**తా :** బ్రహ్మాస్త్రమును వింటిని కూర్చి ఆ హనుమంతునిమీద వేయగా అది చంపజాలక ఆ హనుమను కుంచించి బంధించగా ఆ ఇంద్రజిత్తు హనుమ దేహమును మెల్లగా పట్టుకొని రథములో వేసుకుని తండ్రిచెంత నిలబెట్టెను.

**కం.**　**నిలిపిన నమ్మల ద్రిమ్మరి**
**తలకట్టుం జూచి నల్లద్రావుడు కన్నా**
**కలుకయు నులుకును మదిలో**
**నెలయఁగఁ గన్బొమలు ముడిచి యిట్లని పలికెన్　　133**

నిలిపినన్ = నిలబెట్టగా, ఆ మల త్రిమ్మరి = ఆ కొండలలో సంచరించే కోతులలో, తలకట్టున్ = శ్రేష్ఠుడైన హనుమంతుని, చూచి = కనుగొని, నల్ల త్రావుడు కన్నాకు = రాక్షసులలో అగ్రేసరుడు (రావణుడు), అలుకయును = కోపమును, ఉలుకును = ఉలికి పాటును, మదిలోన్ = మనసులో, ఎలయగన్ = వ్యాపింపగా, కన్బొమలు = కంటి రెప్పలు, ముడిచి = మూసి (భ్రుకుటి ముడిపడగా), ఇట్లని పలికెన్ = ఈ రీతిగా పలికెను.

**తా :** నిలబెట్టగా ఆ హనుమంతుని చూచి రావణుడు కోపమును, ఉలికిపాటును మనసులో వ్యాపింపగా భ్రుకుటి ముడిపడగా ఇట్లు పలికెను.

**ఆ.వె.**　**ఓరి! కోఁతి కూళ యొక్కింతయును మది**
**గొంకు లేక నీరు కుప్ప దాఁటి**
**గడుసు పొలసు దిండి గములుండు నిద్దీవి**
**కెట్లు చేరినాఁడ వెఱుకమాలి?　　134**

ఓరి కోతి కూళ = ఓ నీచ కోతీ!, ఒక్కింతయును = కొంచెము కూడా, మది కొంకు లేక = మనసులో శంక లేక, నీరుకుప్ప దాటి = సముద్రమును దాటి, గడుసు = భయంకరు లైన, పొలసు తిండి గములు ఉండున్ = రాక్షస సమూహములుండునట్టి, ఈ దీవికి = ఈ లంకకు, ఎఱుకమాలి = బుద్ధిలేక, ఎట్లు చేరినాడవు = ఏ విధంగా వచ్చావు?

**తా :** ఓ నీచ కోతీ! కొంచెముకూడా మనసులో శంక లేక సముద్రమును దాటి గడుసు రాక్షసగణములున్న దీవికి బుద్ధిలేక ఎట్లు వచ్చావు?

**తే.గీ.** **అరయ జగముల రావణుఁ డనెడు పేరు**
**విన్న గుండియ లవియుఁ బో వేలుపులకు**
**నహహా! నీ డెందమున నించుకైన జంకు**
**దవులకున్న దిదేమి చందంబొ గాని? 135**

అరయ = చూడగా, జగముల = లోకములలో, రావణుడు అనే పేరు విన్న, వేలుపులకు = దేవతలకు, గుండియలు అవియున్ పో = గుండెలు పగిలిపోవునుకదా!, అహహ = ఆశ్చర్యము, నీ డెందమునన్ = నీ మనస్సులో, ఇంచుక ఐన = కొంచెమైనను, జంకు = భయము, తవులకున్నది = కలుగకున్నది, ఇదేమి చందంబొ కాని = ఇదేం పద్ధతో కాని –

**తా :** చూడగా లోకాల్లో రావణుడు పేరు విన్న దేవతలకు గుండెలు పగిలిపోవునుకదా! ఆశ్చర్యము, నీ మనస్సులో కొంచెమైనను జంకు కలుగకున్నది. ఇదేం పద్ధతో కాని –

**కం.** **ఎవ్వని పంపున వచ్చితి?**
**వెవ్వఁడు నీ పేరు? కర్జ మెయ్యది నీ కి**
**ట్లివ్వీడు సొరఁగ నిమ్మెయిఁ?**
**గ్రొవ్వెల్ల నడంతు నింక గొబ్బునఁ జెపుమా! 136**

ఎవ్వని పంపున వచ్చితివి = ఎవరు పంపగా వచ్చావు?, నీ పేరు ఎవ్వడు = నీ పేరు ఏమిటి?, నీకు ఇట్లు ఈ వీడు, ఈ మెయిన్ = ఈ రీతిగా, చొరగన్ = ప్రవేశించుటకు, కర్జము ఎయ్యది = పని ఏమిటి?, ఇంక = ఇకపైన, క్రొవ్వు ఎల్లన్ = నీ గర్వమునంతను, అడంతున్ = అణచి వేస్తాను, గొబ్బునన్ = తొందరగా, చెపుమా = చెప్పుము.

**తా :** ఎవరు పంపగా వచ్చావు? నీ పేరేమిటి? నీకు ఈ నగరంలో ప్రవేశించడానికి పని ఏమిటి? ఇక నీ గర్వాన్ని అణచివేస్తాను.

**తే.గీ.** **అనిన విని గాలిపట్టి యచ్చెనఁటి సోఁకు**
**కొలము దేవరఁ గనుఁగొని పలికె మరల**
**నోరి! టక్కరికాఁడ! యియ్యోజలేని**
**కఱద లేటికి? వినుర! నిక్కముగ నిపుడు 137**

అనిన విని = అనగా విని, గాలిపట్టి = హనుమంతుడు, ఆ చెనటి = ఆ దుర్మార్గుడైన, సోకు కొలము దేవరన్ = రావణుని, కనుగొని = చూచి, మరల పలికెన్, ఓరి = ఓ నీచుడా!, టక్కరివాడ = వంచకుడా!, ఈ ఓజలేని కఱదలు = ఈ పనికిరాని కబుర్లు, ఏటికి = ఎందులకు?, నిక్కముగ = సత్యముగ నేను చెప్పేది, ఇపుడు = ఇప్పుడు, వినుర = వినుము,

**తా :** అనిన విని హనుమ ఆ దుర్మార్గుడైన రావణుని చూచి మరల పలికెను 'ఓ నీచుడా! వంచకుడా! ఈ పనికిరాని కబుర్లు ఎందులకు? నిక్కముగ నేను చెప్పేది విను.

**కం. మానుగ జగముల యావడి**
**మానుపగాఁ గోరి పుడమి మడఁతుకకై వి**
**న్మానికపు వంగడంబున**
**రా నెలయై పొడమినట్టి రాముని బంటన్ 138**

మానుగ = ఒప్పిదముగా, జగముల ఆవడి = లోకముల బాధను, మానుపగాన్ కోరి = పోగొట్టుటకై, పుడమి మడతుకకై = భూదేవి కొఱకు, విన్ మానికపు వంగడంబున = ఆకాశ మాణిక్యం (సూర్యుడు) వంశమున, రా నెలయై = రాజచంద్రుడై, పొడమినట్టి = పుట్టినట్టి, రాముని, బంటన్ = దూతను.

**తా :** లోకముల బాధను పోగొట్టడానికి భూదేవికోసం సూర్యవంశమున రాజచంద్రుడై పుట్టినట్టి రామచంద్రుని బంటును.

**కం. విను సుగ్రీవుఁ డనం బరఁ**
**గిన కోఁతుల మన్నెకానికి న్నెయ్యుఁడ గా**
**డ్పునకుం గాదిలి కొమరుడ**
**హనుమంతుం డనఁగ బేర్మి నలరినవాఁడన్ 139**

విను = విను, సుగ్రీవుడు అనన్ పరగిన = సుగ్రీవుడను పేరుతో ఒప్పిన, కోతుల మన్నెకానికి = వానరప్రభువుకు, నెయ్యుడన్ = మిత్రుడను, గాడ్పునకున్ గాదిలి కొమరుడ = వాయుదేవుని ప్రియ పుత్రుడను, హనుమంతుండు అనగ = హనుమంతుడు అనబడుతూ, పేర్మిన్ = ప్రసిద్ధిని, అలరినవాడన్ = ఒప్పుచున్నవాడను,

**తా :** విను, సుగ్రీవుడను వానర ప్రభువుకు మిత్రుడను. వాయుదేవుని ప్రియపుత్రుడను. హనుమంతుడనబడుతూ పేర్మినందినవాడను.

**కం. కావరమున నా రాముని**
**దేవేరి న్నీవు పట్టి తెచ్చిన వెదుకం**
**గా వలసి కడలి దాఁటి**
**ద్దీవికి గండెసఁగ నరుగుదెంచినవాఁడన్ 140**

కావరమునన్ = అహంకారంతో, ఆ రాముని దేవేరిన్ = ఆ రాముని భార్యను, నీవు పట్టి తెచ్చిన = నీవు బంధించి తీసుకొనిరాగా, వెదుకంగా వలసి = వెదుకవలసి వచ్చినందున, కడలి దాటి = సముద్రమును దాటి, ఈ దీవికి = ఈ లంకకు, గండు ఎసగన్ = అసాధ్యము సంభవించినను, అరుగుదెంచినవాడన్ = వచ్చినాడను.

**తా :** అహంకారతో ఆ రాముని భార్యను నీవు బంధించి తీసుకొనిరాగా వెదుకవలసి వచ్చినందున సముద్రమును దాటి ఈ లంకకు అసాధ్యము సంభవించినను వచ్చినాడను.

**కం. ఇమ్ముగ నీ ప్రోలంతయుఁ**
**ద్రిమ్మరి పూఁదోటఁలోనఁ దెల్లంబుగ రా**
**కొమ్మగని మాటలాడి క**
**ర మ్మెలమిన్ తేని కడకుఁ గ్రమ్మఱి చనుచున్ 141**

నీ ప్రోలు అంతయు = నీ పట్టణమునంతను, ఇమ్ముగ = పూర్తిగా, త్రిమ్మరి = తిరిగి, పూదోటలోన = అశోకవనంలో, తెల్లంబుగ = తెలిసేలా, రాకొమ్మన్ కని = సీతను చూచి, మాటలాడి, కరమ్ము, ఎలిమిన్ = సంతోషముతో, ఱేని కడకు = రామునిచెంతకు, క్రమ్మఱి చనుచున్ = తిరిగి వెళ్ళుచూ,

**తా :** నీ పట్టణమునంతను పూర్తిగా తిరిగి అశోకవనంలో సీతను చూచి మాటలాడి మిక్కిలి సంతోషముతో రాముని చెంతకు తిరిగి వెళ్ళుచూ

**తే.గీ.** **కెరలి నా రాక నీ కెఱిఁగింపఁగోరి**
**మేలి పూఁదోఁట యెల్లను గూలఁద్రోచి**
**మొనసి యనిలోన యక్షుఁడు మొదలుగలుగు**
**రక్కసుల నెల్ల పెక్కండ్ర నుక్కడించి** **142**

కెరలి = విజృంభించి, నా రాక = నా రాకను, నీకు ఎఱిగింపన్, కోరి = కావాలనే, మేలి పూతోట ఎల్లను = సుందరమైన ఉద్యాన వనమునంతను, కూలన్ త్రోచి = నాశనము చేసి, మొనసి = పూనుకొని, అనిలోన = పోరులో, అక్షుడు మొదలు కలుగు = అక్షుడు మొదలుగా కలుగు, రక్కసులను ఎల్లన్ = రాక్షసులనందరిని, పెక్కండ్రన్ = పలువురను, ఉక్కు అడగించి = చంపి,

**తా :** నా రాక నీకు తెలియపరచుటకై కావాలనే ఉద్యానవనమును నాశనము చేసి, పోరులో అక్షుడు మొదలగు రాక్షసులనందరిని పలువురను చంపి.

**ఆ.వె.** **నిన్నుఁ జూచి కూర్మి నివ్వటిల్లఁగఁ గొన్ని**
**బుద్ధు లెఱుఁగఁ జెప్పి బుజ్జగింపఁ**
**దలఁచి పట్టువడితిఁ దప్పక నా మాట**
**దిటము చేసి బ్రతుకుతెరవు కనుము** **143**

నిన్నున్ చూచి = నిన్ను కలుసుకొని, కూర్మి నివ్వటిల్లగన్ = స్నేహభావముతో, కొన్ని బుద్ధులు, ఎఱుగన్ జెప్పి = తెలియునట్లుగా చెప్పి, బుజ్జగింపన్ = ఒప్పించుటకు, తలచి = అనుకొని, పట్టువడితి = బంధింపబడ్డాను. నా మాట, తప్పక = వదలివేయక, దిటము చేసి = దృఢచిత్తముతో ఆచరించి, బ్రతుకు తెరువు = బ్రతికే మార్గమును, కనుము = చూడుము.

**తా :** నిన్ను కలుసుకొని స్నేహభావముతో కొన్ని హితవాక్యములు తెలిసేట్లుగా చెప్పి బుజ్జగించడానికి బంధింపబడ్డాను. నామాట వదలివేయక దృఢచిత్తముతో చేసి బ్రతుకు తెరువు చూడుము.

**చం.** **జగముల తల్లియై పుడమి జవ్వని గాదిలి పట్టియైన యి**
**మ్ముగుదల మిన్నఁ దెచ్చితివి మోస మెఱుంగక నీకు నెవ్వరుం**
**దగదిది యంచుఁ దెల్పఁగల దంటలు గల్గమిఁ జేసి యిట్టి గీ**
**డగపడె నింకనైన విడనాడక రాముని ప్రాపుఁ జేరుమీ!** **144**

జగముల తల్లియై = లోకమాతయై, పుడమి జవ్వని గాదిలి పట్టియైన = భూదేవికి ప్రియ పుత్రికయైన, ఈ ముగుదల మిన్నన్ = ఈ స్త్రీ శ్రేష్ఠురాలైన సీతాదేవిని, మోసము ఎఱుంగక = తరువాతి ఆపద

తెలియక, తెచ్చితివి = తెచ్చుకొంటివి. తగదు ఇది అంచున్ = ఇది తగదు అని, తెల్పగల దంటలు = చెప్పగల సమర్థులు, నీకున్ = నీకు, ఎవ్వరున్ = ఎవరును, కల్గమి చేసి = లేకుండుట చేత, ఇట్టి కీడు అగపడెను = ఇంతటి ఆపద సంభవించెను, ఇంకను ఐన = ఇప్పటికైనను, విడన్ ఆడక = విడిచిపెట్టను అనక, రాముని ప్రాపున్ = రాముని రక్షణమున, చేరుమీ = చేరుకొనమా!

**తా :** లోకమాతయై భూదేవి ప్రియపుత్రికయైన సీతాదేవిని తరువాతి ఆపద తెలియక తెచ్చుకొంటివి. ఇది తగదని చెప్పగల సమర్థులు నీకు ఎవ్వరును లేకుండుటచేత ఇట్టి ఆపద సంభవించెను. ఇప్పటికైనను విడిచిపెట్టను అనక రాముని రక్షణను చేరుకొనుమా!

**కం. చెన్నగు రతనఁపుఁ దొడవులు**
**మున్నుగ మన్నుం బడంతి ముద్దుల పట్టిన్**
**మిన్నక యుడుగర యిడుమీ!**
**చెన్నటితన ముడిగి రాచసింగంబునకున్ 145**

చెన్నటితనము ఉడిగి = మూర్ఖత్వమును విడిచిపెట్టి, చెన్నగు = అందమైన, రతనపు తొడవులు = రత్నాల ఆభరణములు, మున్నుగ = ముందు పెట్టుకొని, మన్నుం పడంతి ముద్దుల పట్టిన్ = భూదేవి పుత్రికయైన సీతాదేవిని, మిన్నక = మాటాడక, రాచసిం గంబు నకున్ = రాజశ్రేష్ఠుడైన రామచంద్రునికి, ఉడుగర ఇడుమీ = కానుకగా ఇమ్ము.

**తా :** మూర్ఖత్వమును విడిచిపెట్టి అందమైన రత్నాల ఆభరణములు మున్నుగ సీతాదేవిని మారుమాటలేక రాజశ్రేష్ఠుడైన రామచంద్రునికి కానుకగా ఇమ్ము.

**కం. అక్కటికపు గనియగు న**
**య్యెక్కటి రా చందమామ నెలమిఁ గొలిచి యీ**
**రక్కసి వంగడమంతయుఁ**
**దక్కించుకొనంగఁ జూడు టక్కుడిగి యిఁకన్ 146**

అక్కటికపు గని అగు = కరుణకు గనియైన, ఆ ఎక్కటి రాచందమామన్ = ఆ అసహాయ శూరుడైన రామచంద్రుని, ఎలమిన్ = ప్రేమతో, కొలిచి = సేవించి, ఇకన్ = ఇంక, టక్కు ఉడిగి = అహంకారమును వీడి, ఈ రక్కసి వంగడము అంతయున్ = ఈ రాక్షస వంశము నంతను, దక్కించుకొనంగన్ చూడు = దక్కించుకొనుటకు ప్రయత్నించు,

**తా :** కరుణాళువైన, అసహాయశూరుడైన రామచంద్రుని ప్రేమతో కొలిచి ఇంక టక్కులుడిగి ఈ రాక్షసవంశమును దక్కించుకొనుటకు ప్రయత్నించు.

**తే.గీ. చుట్ట లనుఁగులు బంట్లు తోఁబుట్టువులును**
**గొడుకు లేనుఁగు లరదముల్ గుఱ్ఱములును**
**నలరు నా తేని తూపు టింగలమునందు**
**మ్రగ్గిపోవక మున్నె వేమలఁపు కొనుము 147**

ఆ జేని = ఆ రామునియొక్క, అలరు = ఒప్పునట్టి, తూపు ఇంగలమునందు = బాణాగ్నియందు, చుట్టలు = బంధువులు, అనుగులు = మిత్రులు, బంట్లు = సైనికులు, తోడ పుట్టువులును = సోదరులును, కొడుకులు, ఏనుగులు, అరదముల్ = రథములు, గుఱ్ఱములును, క్రుగ్గిపోవక మున్నె = నాశనము చెందకముందే, వే = శీఘ్రముగా, మలపు కొనుము = త్రిప్పు కొనుము.

**తా :** ఆ రాముని బాణాగ్నియందు బంధువులు, మిత్రులు, సైనికులు, సోదరులు, కొడుకులు, ఏనుగులు, రథములు, గుఱ్ఱములును నాశనము కాకముందే త్రిప్పుకొనుము.

**కం.** **ఇప్పని సేయక మసలినఁ**
**గప్పుమెడ వలంతి వచ్చి కాచిన నిన్నుం**
**గుప్పునఁ బొరిగొను రాముడు**
**దప్పదు నామాట వినుము తఱచు లికేలా? 148**

ఈ పని = నేను చెప్పిన పనిని, చేయక = చేయకుండా, మసలినన్ = ఆలస్యముచేసిన, కప్పు మెడ వలంతి = కంఠము నల్లగా కల వీరుడు (శివుడు), వచ్చి కాచిన = వచ్చి రక్షించినను, నిన్నుం = నిన్ను, రాముడు = రామచంద్రుడు, గుప్పునన్ = శీఘ్రముగా, పొరిగొనున్ = సంహరించును, తప్పదు, తఱచులు = ఎక్కువగా చెప్పడం, ఇక ఏలా = ఇంకా ఎందుకు?, నామాట వినుము,

**తా :** ఈ పని చేయకుండా ఆలస్యముచేసిన శివుడు వచ్చి రక్షించినను నిన్ను రాముడు సంహరించును. తప్పదు. ఎక్కువగ చెప్పడం ఎందుకు?

**కం.** **నలువ కొలంబునఁ బుట్టిన**
**బలియుండవు తొలిపలుకులు పరికించిన మే**
**ల్వలఁతివి నీ కిటు పెఱ చెలిఁ**
**దెలివి యొకింతయును లేక తేఁ దగవగునే? 149**

నలువ కొలంబునన్ = బ్రహ్మ వంశమున, పుట్టిన బలియుండవు = జన్మించిన శూరుడవు, తొలిపలుకులు పరికించిన = వేదములు పరిశీలించిన, మేలు వలతివి = మంచి పండితుడవు, నీకు ఇటు = అటువంటి నీకు ఈ విధంగా, తెలివి ఒకింతయును లేక = కొంచెమైనను ఆలోచన లేక, పెఱ చెలిన్ = పరాయి స్త్రీని, తేన్ తగవు అగునే = తేవడం న్యాయమైన పని అవుతుందా?

**తా :** బ్రహ్మవంశమున పుట్టిన శూరుడవు. వేదములు పరికించిన మంచి పండితుడవు. అట్టి నీకు ఈ విధంగా కొంచెంకూడా తెలివిలేక పరాయి స్త్రీని తేవడం సరైనది అవుతుందా?

**ఆ.వె.** **అనినఁ గినిసి వాఁడు హనుమంతుతోడ ని**
**ట్లనియె నోరి! వెడఁగ! వినుర! యిట్లు**
**వెఱపుమాలి యొక్క చిఱుత మానిసిని నా**
**యెదుటఁ గొండఁ జేసి యెన్నె దిపుడు 150**

అనినన్, వాడు = ఆ రావణుడు, కినిసి = కోపించి, హనుమంతు తోడన్, ఇట్లు అనియె = ఈ రీతిగా పలికెను, ఓరి వెడగ = ఓరి వెఱ్ఱివాడా!, వినుర = వినరా!, ఇట్లు = ఈ విధంగా, వెఱపు మాలి = భయములేక, ఒక్క చిఱుత మానిసిని = ఒక స్వల్ప మనుష్యుని, నా ఎదుటన్ = నా ఎదురుగా, ఇపుడు = ఇప్పుడు, కొండన్ చేసి = కొండగా భావించుకొని, ఎన్నెదు = పొగడెదవు.

**తా :** అనిన ఆ రావణుడు కోపించి హనుమతో ఇట్లనెను 'ఓరి వెఱ్ఱివాడా! వినరా! ఈ విధంగా భయంలేక ఒక అల్ప మానిసిని నా ఎదుట కొండగా భావించి పొగడుదువు.

**మ.** **జముఁడో! వేల్పుల ఱేఁడొ! నీళ్ళ దొరయో! చాగంపు రాయండొ! వి**
**న్కొమరుండో! విసదారి తాల్పరియొ! సోఁకుం బెద్దయో! గాడ్పు చు**
**ట్టమొ! మున్నీటి యనుంగు పట్టి మగఁడో! దంబార నాతోడ నా**
**లము గావింపఁ దొడంగి యుక్కఱక నిల్వన్ దుల్వ మ్రాన్ద్రిమ్మరీ!** **151**

తుల్వ మ్రాను త్రిమ్మరీ = ఓ నీచ కోతీ!, నాతోడన్ = నాతో, దంబు ఆరన్ = పరాక్రమముతో, ఆలము కావింపన్ తొడంగి = యుద్ధము చేయ పూనుకొని, ఉక్కు అఱక = గర్వము నశింపక, నిల్వన్ = నిలుచుటకు, జముడో = యముడా?, వేల్పుల ఱేడొ = ఇంద్రుడా?, నీళ్ళ దొరయో = వరుణుడా?, చాగంపు రాయండొ = కుబేరుడా?, విన్ కొమరుండో = వాయువా?, విసదారి తాల్పరియొ = ఈశానుడా?, సోకుం పెద్దయో = నైరృతియా?, గాడ్పు చుట్టమొ = అగ్నియా?, మున్నీటి అనుంగు పట్టి మగడో = విష్ణువా?.

**తా :** ఓ నీచ కోతీ! నాతో యుద్ధముచేయ పూనిన, గర్వము నశించక నిలచుటకు ఆ రాముడు యముడా? ఇంద్రుడా? వరుణుడా? కుబేరుడా? వాయువా? ఈశానుడా? నిర్‌ృతియా? అగ్నియా? విష్ణువా?

**తే.గీ.** **తొడరి యెడలేని మూఁకలతోడఁ గూడ**
**గట్టు విలుకాఁడు గొలువున్న మెట్టు నెత్తి**
**నట్టి నాతోడఁ బోరాడు టెట్టు పొసఁగుఁ?**
**బేద మానుసులకుఁ గోఁతి పిండులకును** **152**

తొడరి = పూనుకొని, ఎడలేని = అంతులేని, మూకలతోడన్ కూడ = ప్రమథ గణములతో సహా, గట్టు విలుకాడు కొలువు ఉన్న = మేరుపర్వతం విల్లుగా కల శివుడు కొలువై ఉన్న, మెట్టున్ = కైలాస పర్వతమును, ఎత్తినట్టి = పైకి లేపినట్టి, నాతోడన్ = నాతో, పోరాడుట = యుద్ధము చేయుట, పేద మానుసులకున్ = బలహీనులైన మనుష్యులకు, కోతి పిండులకున్ = కోతి మూకలకును, ఎట్టు పొసగున్ = ఎలా సాధ్యమవుతుంది?

**తా :** అంతులేని ప్రమథగణములతో శివుడు కొలువైయున్న కైలాస పర్వతమును పైకి లేపినట్టి నాతో పోరాడుట బలహీనులైన మనుష్యులకు, కోతులకు ఎలా సాధ్యమౌతుంది?

**కం.** **కొండలయందుం జేరుక**
**పండులు గాయలును నమలి బ్రతికెడు మీకున్**

**దండులు గూడుక మానిసి**
**దిండులపై నడువ నెట్టి తెంపొదవెనొకో! 153**

కొండలయందున్, చేరుక = చేరి, పండులు, కాయలును, నమలి, బ్రతికెడు మీకున్, దండులు కూడుక = సైన్యంగా ఏర్పడి, మానిసి తిండులపైన్ = మనుష్యులను తినే రాక్షసులపైకి, నడువన్ = వచ్చుటకు, ఎట్టి తెంపు = ఎంత సాహసము, ఒదవెనొకో = కలిగిందో!

**తా :** కొండలలో పళ్ళు, కాయలు నమలి బ్రతికే మీకు సైన్యంగా ఏర్పడి రాక్షసులపైకి రావడానికి ఎతం సాహసం కలిగిందో?

**తే.గీ. అడవి దుంపలె కాని సంబడము లొసఁగఁ**
**గాసు వీసంబు చేత నెక్కడను లేక**
**మగువఁ గోల్పోయి కడు నిడుమలఁ గలంగు**
**నలఁతి దొరఁ గొల్వఁ గడఁగు వెంగలులుఁ గలరె? 154**

అడవి = అరణ్యములో, దుంపలె కాని = కందమూలములే కాని, సంబడములు ఒసగన్ = దారి బత్తెము లిచ్చుటకు, కాసు వీసంబు = కొంచెము ధనముకూడా, చేతన్ = చేతిలో, ఎక్కడను లేక = ఎందును లేక, మగువన్ = భార్యను, కోల్పోయి, కడున్ ఇడుమలన్ = మిక్కిలి ఆపదలతో, కలంగు = వ్యధ చెందుచున్న, అలతి దొరన్ = పనికిరాని ప్రభువును, కొల్వన్ = సేవించుటకు, కడగు = పూనుకొంటున్న, వెంగలులు కలరె = వెట్టివాళ్ళు ఎవరైనా ఉంటారా?

**తా :** అరణ్యాల్లో కందమూలాలే కాని దారిబత్తెము లిచ్చుటకు కొంచెంకూడా ధనం చేతిలో లేక భార్యను కోల్పోయి ఇడుమలతో వ్యధ చెందుచున్న పనికిరాని ప్రభువును సేవించడానికి పూనుకున్న వెట్టివాళ్ళు ఎవరైనా ఉంటారా?

**కం. కడ యొడయలఁ దఱిమెడు నం**
**జుడు దిండులు మిమ్ము మనుపఁ జూతురె పోరం**
**గుడి మ్రింగెడు వానికి లో**
**నడరెడు వేల్పుట్రవడియ మగుఁగద తలఁపన్ 155**

కడ ఒడయలన్ = దిక్పాలకులను, తఱిమెడు, నంజుడు తిండులు = రాక్షసులు, మిమ్ము = మీ వానరులను, పోరన్ = పోరునకు సిద్ధపడినచో, మనుపన్ చూతురె = బ్రతుక నిస్తారా?, తలపన్ = అలోచింపగా, గుడి మ్రింగెడు వానికి, లోన్ = ఆ గుడిలోపల, అడరెడు = ఒప్పునట్టి, వేల్పు = దేవుడు, ఉట్రవడియము = ఎండిన వడియము, అగు కద = అవుతుంది కదా!

**తా :** దిక్పాలకులను తరిమికొట్టే రాక్షసులు మీ వానరులను పోరునకు సిద్ధపడితే బ్రతుకనిస్తారా? ఆలోచిస్తే, గుడినే మ్రింగెడువానికి ఆ గుడిలోపల దేవుడు ఎండిన వడియమేకదా!

**తే.గీ. అనిన విని తొలివేల్పు రాయనికిఁ జెట్టు**
**నట్టు మొనగాఁడు వెండియు నిట్టులనియె**
**నహహ! చెడు కోరుకొనువాని కరయ నొరుల**
**పలుకు సెవులకుఁ గొరవియై పరఁగకున్నె! 156**

అనిన విని, తొలివేల్పు రాయనికిన్ = రావణునికి, చెట్టు నట్టు మొనగాడు = చెట్లపై సంచరించే వీరుడు(హనుమ), వెండియు = తిరిగి, ఇట్టులు అనియె = ఇట్లు పలికెను, అహహా = చాలాబాగుంది, చెడు కోరుకొనువానికి = చెడిపోవాలనుకునేవానికి, అరయన్ = చూడగా, ఒరుల పలుకు = ఇతరుల మాటలు, చెవులకు, కొరవియై = నిప్పుకణమై, పరగక ఉన్నె = మండకుండా ఉంటుందా?

**తా :** అనిన విని రావణునికి హనుమ తిరిగి ఇట్టులనెను 'అహహా! చెడు కోరుకొనువానికి ఇతరుల మాటలు చెవులకు కొరవియై మండకుండా ఉంటుందా?

**సీ.** **నినుఁ దోఁకఁ జుట్టి మున్నీటఁ బల్మఱు ముంచి**
**విడిచిన వాలి నుక్కడఁగఁ జేసె**
**నీ వొకింతయుఁ గేల నెగయ నెత్తఁగ లేని**
**విను సిక యెకిమీని విల్లుఁ దునిమె**
**నిను గెల్చుకొని వాఁడి నొనరెడు వేయి చే**
**తుల ఱేని గెడపిన బలియు గెలిచె**
**నీ చుట్టలగు ఖరునిన్ దూషణుని దిగ**
**తలల రాకాసిని బిలుకు మార్చె**

**తే.గీ.** **నీదు పంపున నిఱ్ఱియై నెఱిని జన్న**
**కూళ తొలివేల్పు నొక కోలఁ గూలనేసె**
**నట్టి రాముని యందు నీయందుఁ గలుగు**
**దొడ్డు కొంచెము లెంచుమా! త్రుళ్ళు సడలి** **157**

నినున్ = నిన్ను, తోక చుట్టి = తోకకు చుట్టుకొని, మున్నీటన్ = సముద్రములో, పల్మఱు ముంచి విడిచిన = పలుమార్లు ముంచి విడిచిపెట్టిన, వాలిన్ = వాలిని, ఉక్కడగన్ చేసె = గర్వము నణచివేసెను, నీవు, ఒకింతయున్ = కొంచెమును, కేలన్ = చేతితో, ఎగయన్ = లేపుటకు, ఎత్తగ లేని = ఎత్తలేని, విను సిక ఎకిమీని విల్లున్ = ఆకాశమే సిగగా కల్గిన వీరుడు (శివుడు) వింటిని, తునిమెన్ = ముక్కలు చేసెను, నిను గెల్చుకొని = నిన్ను జయించి, వాడిన్ ఒనరెడు = శౌర్యముతో నొప్పారు, వేయి చేతుల ఱేని = కార్తవీర్యార్జునుని, గెడపిన = సంహరించిన, బలియు గెలిచె = బలశాలియైన పరశురాముని జయించినాడు, నీ చుట్టలు అగు = నీ బంధువులైన, ఖరునిన్, దూషణుని, తిగ తలల రాకాసిని = మూడు తలలు కల త్రిశిరుని, పిలుకు మార్చెన్ = చంపినాడు, నీదు పంపున = నీవు పంపగా, ఇఱ్ఱియై = లేడియై, నెఱిని చన్న = అందముగా వెళ్ళిన, కూళ తొలివేల్పున్ = నీచుడైన రాక్షసుని, ఒక కోలన్ = ఒక్క బాణముతో, కూలన్ ఏసెన్ = చంపెను, అట్టి రామునియందు = అటువంటి రామునియందు, నీ యందున్ = నీయందును, కలుగు = కలిగినట్టి, దొడ్డు = ఆధిక్యములు, కొంచెములు = అల్పత్వములు, త్రుళ్ళు సడలి = అహంకారమును వదలి, ఎంచుమా = ఆలోచించుము.

**తా :** నిన్ను తోకకు చుట్టుకొని సముద్రములో పలుమార్లు ముంచి విడిచిపెట్టిన వాలి గర్వము నణచివేసెను. నువ్వు కొంచెం చేతితో కూడా ఎత్తలేకపోయిన శివుని వింటిని ముక్కలు చేసెను. నిన్ను గెలిచిన కార్తవీర్యార్జునుని సంహరించిన పరశురాముని జయించినాడు. నీ బంధువులైన ఖర,దూషణ,త్రిశిరులను చంపినాడు. నీవు పంపగా లేడియై చన్న మారీచుని చంపెను. అట్టి రాముని నీలోని ఎక్కువ తక్కువలను అహంకారం వదలి ఆలోచించుకో.

**తే.గీ.** **మిత్తి తలదన్ని గుదెతాల్పు మీసలూడఁ**
**బెఱికి విసదారి రాయని బెదరఁదోలి**
**గట్లు వెకలించి సంద్రము ల్గలఁపఁజాలు**
**కోఁతి బిందము లారాముఁ గొలుచుఁ జుమ్మీ** **158**

మిత్తి తల తన్ని = మృత్యువు తలను తన్ని, గుదె తాల్పు = దండధరుని (యముని), మీసలు ఊడన్ = పౌరుషము పోవునట్లు, పెఱికి = తొలగించి, విసదారి రాయని = పాముల నాయకుడగు వాసుకిని, బెదర తోలి = భయపెట్టి పారద్రోలి, గట్లు పెకలించి = పర్వతములను పెల్లగించి, సంద్రములు = సముద్రములను, కలపజాలు = ఏకము చేయగల, కోతి బిందములు = వానర సమూహములు, ఆ రామున్, కొలుచున్ చుమ్మి = సేవిస్తున్నాయి సుమా!

**తా :** మృత్యువు తలను తన్ని యముని పౌరుషం పోయేలా మీసాలు తొలగించి, వాసుకిని భయపెట్టి పారద్రోలి, పర్వతములను పెల్లగించి, సముద్రములను ఏకముచేయగల వానర సమూహములు ఆ రాముని సేవిస్తున్నాయిసుమా!

**కం.** **నీ పేరు సెప్పినప్పుడె**
**యా పోటరులెల్ల నలుక లఱిముఱిఁ బెరయం**
**జూపోపక బల్గ్రద్దఱు**
**లై పలికెడు తెఱఁగుఁ జెప్ప నచ్చెరువు గదా!** **159**

నీ పేరు చెప్పినప్పుడె = నీ పేరు చెప్పగానే, ఆ పోటరులు ఎల్లన్ = ఆ వీరులందరు, అలుకలు = క్రోధములు, అఱిముఱిన్ = సంభ్రమములు, పెరయన్ = అతిశయింపగా, చూపు ఓపక = చూస్తూ ఉండలేక (కాలయాపన సహించలేక), బల్ = అధికమైన, గ్రద్దఱులు ఐ = నైపుణ్యములు కలవారై, పలికెడు = మాటాడెడు, తెఱగు = పద్ధతి, చెప్పన్ = చెప్పుటకు, అచ్చెరువుకదా = ఆశ్చర్యమును కలిగించునుకదా!,

**తా :** నీ పేరు చెప్పగానే ఆ వీరులందరు అలుకలు, సంభ్రమములు అతిశయింపగా కాలయాపన సహించలేక అతిశయించి నిపుణతతో పలికే మాటల పద్ధతి చెప్పడానికి ఆశ్చర్యం కలిగించునుకదా!

**తే.గీ.** **అనిన రాకాసి దొర బొమ లదరఁ బండ్లు**
**గొఱుకుకొంచును గన్నుల నెఱుపు మీఱ**

**వీని నిటు డాయఁ బిల్చినఁ బూని వేయి**
**చందములఁ బ్రేలుచున్నాఁడు జంకుమాలి** **160**

అనినన్, రాకాసి దొర = రావణుడు, బొమలు అదరన్ = కనుబొమలదరగా, పండ్లు కొఱుకు కొంచును = పళ్ళు పటపటలాడిస్తూ, కన్నులన్ = కన్నులయందు, ఎఱుపు మీఱన్ = ఎఱుపు ఎక్కువకాగా, వీనిన్ = ఈ కోతిని, ఇటు డాయ పిల్చినన్ = ఇక్కడకు చేరడానికి పిలిస్తే, పూని = పూనుకొని, వేయి చందములన్ = వేయివిధములుగా, జంకుమాలి = భయములేక, ప్రేలుచున్నాడు,
**తా :** అనిన రావణుడు కనుబొమలు అదరగా పళ్ళు పటపటలాడిస్తూ కన్నులయందు ఎఱుపు ఎక్కువవగా 'ఈ కోతిని ఇక్కడకు చేరడానికి పిలిస్తే పూని వేయి విధాలుగా భయంలేక ప్రేలుచున్నాడు.

**కం.** **కావున నింకం గొంకక**
**నీ వెడఁగుం గొమ్మ మెకము నిపు డడలొదవం**
**దావిమల చక్కిరాయని**
**తావున కనుపుఁడని బంట్లఁ దగఁ బని కొలిపెన్** **161**

కావునన్, ఇంకం గొంకకన్ = ఇంక సందేహించక, ఈ వెడగున్ = ఈ మూర్ఖుని, కొమ్మ మెకమున్ = వానరుని, ఇపుడు = ఇపుడే, అడలు ఒదవన్ = భయపడేలా, తావి మల = మలయపర్వతము, చక్కి రాయని = దిక్కు (దక్షిణం) ప్రభువు (యముడు), తావునకు = ఉండు చోటునకు, అనుపుడు అని = పంపండని, బంట్లన్ = భటులను, తగన్ = గట్టిగా, పనికొలిపెన్ = ఆజ్ఞాపించెను.
**తా :** కాబట్టి ఇంక సందేహించక ఈ మూర్ఖ వానరుని ఇపుడే భయపడేలా యముని తావునకు పంపండ'ని భటులను ఆజ్ఞాపించెను.

**తే.గీ.** **అత్తటి విభీషణుండు డాసి యన్న! యిట్లు**
**తెగువతో రాచపనులూని తిరుగు బంటు**
**లేమి యాడిన నాడుదు రింతెగాని**
**తప్పుగాఁ గొని చంపింప దగదుసుమ్ము** **162**

ఆ తటి = ఆ సమయమున, విభీషణుడు, డాసి = అన్నను సమీపించి, ఆన్న = అన్నా!, ఇట్లు = ఈ ప్రకారంగా, తెగువతో = సాహసముతో, రాచపనులు ఊని = రాచకార్యములను వహించి, తిరుగు బంటులు, ఏమి ఆడినన్ = ఏం మాట్లాడినా, ఆడుదురు = మాట్లాడుతారు, ఇంతె కాని, తప్పుగా కొని = వానిని తప్పుగ స్వీకరించి, చంపింప = చంపించుట, తగదు సుమ్ము = తగదుసుమా!
**తా :** ఆ తటి విభీషణుడు రావణుని సమీపించి 'అన్నా! ఇట్లు సాహసంతో రాచకార్యము వహించి తిరిగే బంటులు ఏం మాట్లాడినా మాట్లాడుతారు. వానిని తప్పుగా స్వీకరించి చంపించుట తగదుసుమా!

**తే.గీ.** **కాక యించుక కినుక లోఁ గలిగెనేనిఁ**
**గొంత వెత వెట్టి విడుచుట కూడు ననిన**

**నట్ల కా కని యొప్పు నగ్గట్లసూడు**
**పగతుఁ దబ్బంట్లఁ గనుఁగొని నగుచుఁ బలికె** **163**

కాక = అలా కాక, ఇంచుక = కొంచెము, కినుక = కోపము, లోన్ కలిగెను ఏని = మనసులో కలిగినట్లైన, కొంత వెత పెట్టి = కొంత బాధపెట్టి, విడుచుట కూడును అనిన = విడిచిపెట్టడం తగినదని చెప్పగా, అట్ల కాక అని = అలాగే కానిమ్మని, ఒప్పున్ = ఒప్పుకొన్న, ఆ గట్లసూడు పగతుడు = ఆ పర్వతములకు శత్రువైన ఇంద్రుని శత్రువు (రావణుడు), ఆ బంట్లన్ = ఆ భటులను, కనుగొని = చూచి, నగుచున్ = నవ్వుచు, పలికె = పలికెను.

**తా :** అలా కాక కొంచెం కోపం కలిగినట్లైన కొంత బాధపెట్టి విడిచిపెట్టడం తగినద'న అలాగే కానిమ్మని ఒప్పుకొన్న రావణుడు ఆ భటులను చూచి నవ్వుచు పలికెను.

**కం.** **ఈ దుడుకుఁ గోతిఁ గొని చని**
**మీ దిట్టతనంబు లెల్ల మెఱయఁగ నిపు డౌ**
**గాదనక తోఁకఁ గాలిచి**
**వీదీవీదులను ద్రిప్పి విడువుడు కడకన్** **164**

ఈ దుడుకున్ కోతిన్ = ఈ దుర్మార్గుడైన కోతిని, కొని చని = తీసుకొని వెళ్లి, మీ దిట్టతనంబులు ఎల్లన్ = మీ సామర్థ్యములన్నియు, మెఱయగన్ = ప్రకటితమగునట్లుగా, ఇపుడు = ఇప్పుడే, ఔ కాదనక = తగినదా కాదా అని సందేహించక, కడకన్ = పూనుకొని, తోక కాలిచి = తోకను కాల్చి, వీదీవీదులను = వీధివీధిని, త్రిప్పి = ఊరేగించి, విడువుడు = విడిచిపెట్టండి.

**తా :** ఈ దుర్మార్గ కోతిని తీసుకొని వెళ్ళి మీ సామర్థ్యము ప్రకటితమగునట్లు ఇప్పుడే సందేహించక తోకను కాల్చి వీధివీధిని త్రిప్పి విడిచిపెట్టండి.

**తే.గీ.** **అనుడు రక్కసు లతనిఁ దోడ్కొని తొలంగ**
**నేఁగి మోకులు పగ్గము లెన్నియేని**
**గూర్చి బిగఁగట్టి తద్దయు నార్చుకొనుచుఁ**
**దప్పెటలు మ్రోయఁ బ్రోలెల్లఁ ద్రిప్పి మఱియు** **165**

అనుడు = అనగా, రక్కసులు = రాక్షసులు, అతనిన్ = ఆ హనుమను, తోడ్కొని = తీసుకొని, తొలంగన్ ఏగి = రావణుని ఎదుటనుండి వెళ్ళి, మోకులు = లావు త్రాళ్ళు, పగ్గములు = సన్న త్రాళ్ళు, ఎన్నియేని = ఎన్నో, కూర్చి = చుట్టి, బిగ కట్టి = గట్టిగా కట్టి, తద్దయున్ = మిక్కిలి, ఆర్చుకొనుచున్ = అరుచుకొంటూ, తప్పెటలు మ్రోయన్ = వాద్యములు మ్రోగుచుండగా, ప్రోలు ఎల్లన్ = పట్టణమంతయు, త్రిప్పి = ఊరేగించి, మఱియు = ఇంకను,

**తా :** అనగా రాక్షసులు ఆ హనుమను తోడ్కొని వెళ్ళి త్రాళ్ళు, పగ్గములు ఎన్నో కూర్చి గట్టిగా కట్టి మిక్కిలి అరుచుకొంటూ వాద్యములు మ్రోగుచుండగా నగరమంతయు ఊరేగించి, ఇంకా–

**తే.గీ.** **పుట్టములు దిట్టలుగఁ గూడఁబెట్టి నేయి**
**నూనియల ముంచి యవి తోఁకపైనిఁ జుట్టి**

**నిప్పుకలు వెట్టి రవులింపఁ గప్పు తెరవు**
**జాణ మంటలు వెదచల్లఁ జాగె మిగుల** **166**

పుట్టములు = వస్త్రములు, దిట్టలుగన్ = గుట్టలుగా, కూడన్ పెట్టి = సేకరించి, నేయి నూనియల ముంచి, అవి తోకపైనిన్, చుట్టి, నిప్పుకలు పెట్టి = అగ్నికణములు పెట్టి, రవులింపన్ = రగల్చగా, కప్పు(ఆకాశము) తెరవు జాణ = ఊర్ధ్వముఖంగా వెళ్లగలిగిన సమర్థుడు (అగ్ని), మిగులన్ = అధికముగా, మంటలు వెదజల్లన్ = మంటలు వ్యాపింపచేయ, చాగె = సాగెను.

**తా :** వస్త్రములు గుట్టలుగా సేకరించి నేయి, నూనెలలో ముంచి అవి తోకపైని చుట్టి, నిప్పు పెట్టి రగల్చగా, అగ్ని మంటలు వ్యాపింప చేయసాగెను.

తే.గీ. **అపుడు కొందఱు సోఁకు దొయ్యలులు దుక్కి**
**చాలు పేరింటి రాచ ప్రోయాలి కడకు**
**నేఁగి యత్తెఱఁ గంతయు నెఱుఁగఁ జెప్ప**
**నమ్మెలంతుక తద్దయు నుమ్మలించి** **167**

అపుడు = అప్పుడు, కొందఱు = కొంతమంది, సోకు తొయ్యలులు = రాక్షస స్త్రీలు, దుక్కిచాలు = నాగలి దున్నగ ఏర్పడిన రేఖ, పేరింటి = పేరుగా కల (సీత = నాగటిచాలు), రాచ ప్రోలు ఆలి కడకున్ = రాజవంశమునకు చెందిన స్త్రీ దగ్గరకు (సీత దగ్గరకు), ఏగి = వెళ్ళి, ఆ తెఱగు అంతయున్ = ఆ విషయమునంతను, ఎఱుగన్ = తెలియునట్లుగా, చెప్పన్ = చెప్పగా, ఆ మెలంతుక = ఆ స్త్రీ (సీత), తద్దయు = మిక్కిలి, ఉమ్మలించి = బాధపడి,

**తా :** అప్పుడు కొంతమంది రాక్షసస్త్రీలు సీత దగ్గరకు వెళ్ళి ఆ విషయమునంతను తెలియచెప్పగా ఆ సీత మిక్కిలి బాధపడి.

కం. **అక్కట! యుసురుల విందగు**
**నిక్కోతుల మిన్న కిప్పు డిట్టి దొసంగుల్**
**దెక్కలి దయ్యం బింతయు**
**నక్కటికము లేక యిట్లు హత్తించెనొకో?** **168**

అక్కట = అయ్యో!, ఉసురుల విందు అగు = నా ప్రాణములకు ఆనందము కలిగించిన, ఈ కోతుల మిన్నకు = ఈ హనుమకు, ఇప్పుడు = ఈ సమయమున, ఇట్టి = ఇంతటి, దొసంగుల్ = కష్టములను, తెక్కలి దయ్యంబు = పాడు దైవము, ఇంతయున్ = కొంచెమును, అక్కటికము లేక = దయలేక, ఇట్లు = ఈ విధముగా, హత్తించెను ఒకో = కలిగించెను కాబోలు.

**తా :** అయ్యో! నాకు ఆనందము కలిగించిన ఈ హనుమకు ఇప్పుడు ఇంతటి కష్టమును పాడుదైవము కొంచెము కూడ దయలేక ఇట్లు కలిగించెను కాబోలు.

తే.గీ. **అనుచుఁ జేదోయి మోడ్చి యో అంటరాని**
**వేల్పు! నీ సంగడీఁడగు విన్నుచూలి**

**కనుఁగుఁ గొడుకగు కోఁతి కన్నాకునందు**
**నుడుకుఁ జూపక చల్లనై యుండుమయ్య! 169**

అనుచున్ = అని పలుకుచూ, చేదోయి మోడ్చి = చేతులు జోడించి, ఓ అంటరాని వేల్ప = ముట్టుకోడానికి వీలుపడని దైవమా (అగ్ని), నీ సంగడీడు అగు = నీకు స్నేహితుడైన, విన్నుచూలికి అనుగు కొడుకు అగు = వాయువునకు ప్రియ పుత్రుడైన, కోతి కన్నాకునందున్ = వానర శ్రేష్ఠుని యందు, ఉడుకున్ చూపక = ఉష్ణమును చూపెట్టక, చల్లనై ఉండుము అయ్య = చల్లగా ఉండవయ్యా.

**తా :** అనుచు చేతులు జోడించి ఓ అగ్నీ! నీకు స్నేహితుడైన వాయువునకు ప్రియ పుత్రుడైన వానరశ్రేష్ఠునియందు ఉష్ణమును చూపక చల్లగా ఉండవయ్యా!

**ఆ.వె. అనుచు వేడుకొనిన హనుమంతునకుఁ గడు**
**నగ్గి చల్లనయ్యె నాతఁడంతఁ**
**గడఁకఁ బ్రాఁతమినుకు నొడువులు గొడఁగినఁ**
**గడిఁది మీఱ బమ్మకట్లు వీడె 170**

అనుచు , వేడుకొనిన = ప్రార్థించగా, హనుమంతునకు, అగ్గి = అగ్ని, కడున్ చల్లన అయ్యెన్ = మిక్కిలి చల్లగా అయ్యెను, అంతన్ = అంతట, ఆతడు = ఆ హనుమ, కడకన్ = పూనుకొని, ప్రాతమినుకు నొడువులు = వేద వాక్యములను, గొడగినన్ = లోన చదువుకొనగా, కడిది మీఱన్ = మిక్కిలి కఠినమైన, బమ్మకట్లు = బ్రహ్మాస్త్ర బంధములు, వీడె = విడిపోయెను.

**తా :** అని ప్రార్థింపగా హనుమంతునకు అగ్ని మిక్కిలి చల్లగా అయ్యెను. అంతట ఆ హనుమ పూనికతో వేదవాక్యములు లోన చదువుకొనగా కఠినమైన బ్రహ్మాస్త్ర బంధములు విడిపోయెను.

**కం. వీడినఁ దద్దయు నేడ్తెఱ**
**తోడన్మెయి పెంచి తులువ తొలివేలుపులం**
**గాడుపడఁ దఱిమి యార్చుడు**
**గాడుపుచూల్వీడు సొచ్చె గాటపు కినుకన్ 171**

వీడినన్ = బ్రహ్మాస్త్ర బంధములు వీడగా, తద్దయున్ = మిక్కిలి, ఏడ్తెఱ తోడన్ = పరాక్రమముతో, మెయి పెంచి = దేహమును పెంచి, తులువ తొలివేలుపులన్ = నీచులైన రాక్షసులను, కాడు పడన్ = కలతచెందేలా, తఱిమి = పరుగెత్తించి, గాడుపు చూలి = వాయుపుత్రుడు, గాటపు కినుకన్ = మిక్కిలి కోపముతో, ఆర్చుడు = సింహగర్జన చేస్తూ, వీడు చొచ్చె = నగరంలో ప్రవేశించెను.

**తా :** బ్రహ్మాస్త్రబంధములు వీడిపోగా మిక్కిలి పరాక్రమముతో దేహమును పెంచి నీచులైన రాక్షసులను కాటు పడేలా పరుగెత్తించి వాయుపుత్రుడు మిక్కిలి కోపముతో సింహగర్జన చేస్తూ నగరంలో ప్రవేశించెను.

**సీ. మేడలు రవులించి మాడువుల్ గాల్చి పెన్**
**రచ్చ కొట్టంబులఁ జిచ్చు నించి**

**చప్పరంబులు సూఁడి చవికెలు మసిచేసి**
**తత్తడి నెలవులు తగులవైచి**
**విడిముడి పట్టులు వ్రేలిమి గావించి**
**మల్లసాలలు బిట్టు మండఁజేసి**
**లో నగళ్ళెల్లఁ బెల్లుగ నగ్గి కెరసేసి**
**నెఱి మించు సరకులన్నియును మాడ్చి**

**తే.గీ.** **గట్టువిలుకాడు తిగప్రోళ్ళ గాల్చుతెఱఁగు**
**దోఁప రాకాసి వీడెల్ల దుమ్ము చేసి**
**కడలిఁ జిచ్చార్చుకొని నేలకాన్పు కడకు**
**మరలి తన చందమంతయు నరయఁ జెప్పి** **172**

మేడలు రవులించి = సౌధములు అగ్నిని పెట్టి, మాడువుల్ కాల్చి = హర్మ్యములు కాల్చి, పెన్ రచ్చ కొట్టంబులన్ = పెద్ద సభా భవనములను, చిచ్చు నించి = మంటలు పెంచి, చప్పరంబులు = పందిళ్లు, చూడి = కాల్చివేసి, చవికెలు = మంటపములను, మసిచేసి = బూడిదచేసి, తత్తడి నెలవులు = వాహన శాలలు, తగులవైచి = తగులపెట్టి, విడిముడి పట్టులు = ధనాగారములను, వ్రేలిమి కావించి = కాల్చివేసి, మల్లసాలలు = భోజనశాలలు, బిట్టు మండన్ చేసి = బాగా తగులపడేలా చేసి, లో నగళ్ళు ఎల్లన్ = లోని అంతిపురము లన్నిటిని, పెల్లుగన్ = అధికముగా, అగ్గికి ఎర చేసి = అగ్నికి ఆహుతిచేసి, నెఱి మించు = మిక్కిలి అందమైన, సరకులు అన్నియును = వస్తువులనన్నిటిని, మాడ్చి = కాల్చివైచి, గట్టు విలుకాడు = మేరుపర్వతం విల్లుగా కలవాడు శివుడు, తిగ ప్రోళ్ళన్ = త్రిపురములను, కాల్చు తెఱగు తోప = కాల్చిన విధము కనిపింపగా, రాకాసి వీడు ఎల్లన్ = లంకా నగరమునంతను, దుమ్ము చేసి = బూడిద చేసి, కడలిన్ = సముద్రమున, చిచ్చు ఆర్చుకొని = అగ్నిని చల్లార్చుకొని, నేలకాన్పు కడకు = సీత దగ్గరకు, మరలి = వెళ్ళి, తన చందము అంతయు = తన విషయము నంతను, అరయన్ చెప్పి = తెలియునట్లుగా చెప్పి,

**తా :** మేడలు రగిలించి,హర్మ్యములు కాల్చి,సభా భవనములకు చిచ్చుపెట్టి,చప్పరములు కాల్చి,మంటపములు మసిచేసి,వాహనశాలలు తగులపెట్టి,ధనాగారములను కాల్చి, భోజన శాలలు తగులపెట్టి,అంతఃపురములను అగ్నికి ఆహుతిచేసి,అందమైన వస్తువులన్నిటిని కాల్చివైచి, శివుడు త్రిపురములను కాల్చినవిధముగా లంకానగరమునంతను బూడిదచేసి సముద్రమున అగ్నిని చల్లార్చుకొని సీతను చేరి తన విషయమంతను వివరముగా తెల్పి.

**కం.** **ఇదె నీ రాయనిఁ దెచ్చెద**
**నెద నుమ్మలికంబు మాని యెలనాగరొ! నె**
**మ్మది నుండు మింకనని చే**
**యిదొయిన్ మొకిడిఁచి జొహారులిడి చనునెడలన్** **173**

ఎలనాగరొ = యువతీ (సీత), ఇదె = ఇప్పుడే, నీ రాయని తెచ్చెదన్ = నీ ప్రభువును తీసుకొని వస్తాను, ఎదన్ = మనసులో, ఉమ్మలికంబు మాని = బెంగపడక, ఇంకన్ = ఇక, నెమ్మది నుండుము = స్వస్థతతో ఉండుము, అని = అని పలుకుచూ, చేయి దొయిన్ = రెండు చేతులను, మొకిడిచి = ముకుళించి, జొహారులు ఇడి = నమస్కారములు పెట్టి, చనున్ ఎడలన్ = వెళ్ళు సమయమున,

**తా :** ఓ సీతా! ఇప్పుడే నీ ప్రభువును తెచ్చెదను. మనసులో బెంగపడక ఇక నెమ్మది నుండుము అని పలుకుతూ రెండు చేతులను జోడించి నమస్కరించి వెళ్ళు సమయమున.

**తే.గీ.** **వేగ లంకిణి యనెడు తొల్వేల్పు పడఁతి**
**త్రోవ కడ్డంబుగా వచ్చి తొడర దాని**
**నొక్క గ్రుద్దునఁ గెడపి లావొప్పఁ గడలి**
**మగుడఁ జంగున దాటి యజ్జగమగండు** **174**

ఆ జగమగండు = ఆ మహాయోధుడు, వేగ = శీఘ్రముగా, లంకిణి అనెడు = లంకిణి అని పిలువబడే, తొలివేల్పు పడతి = రాక్షస స్త్రీ, త్రోవకు అడ్డంబుగా వచ్చి = వెళుతున్న దారికి అడ్డంగా వచ్చి, తొడరన్ = ప్రయత్నించగా, దానిన్ = ఆ లంకిణిని, లావు ఒప్పన్ = పరాక్రమముతో, ఒక్క గ్రుద్దునన్ = ఒకే ఒక గ్రుద్దుతో, కెడపి = చంపి, కడలి = సముద్ర మును, మగుడన్ = తిరిగి, చంగున దాటి = ఒక్క గెంతులో దాటి,

**తా :** ఆ మహాయోధుడు శీఘ్రముగా వెళుతున్న దారికి అడ్డముగా వచ్చిన లంకిణిని ఒకే ఒక గ్రుద్దుతో చంపి సముద్రమును తిరిగి ఒక్క గెంతులో దాటి.

**తే.గీ.** **అచట నెలుఁగుల యెకిమీఁడు నంగదుండు**
**మొదలు గలిగిన తనవార లెదురు వచ్చి**
**కౌఁగిళులఁ గూర్పఁ దాఁ జన్న కర్జమెల్లఁ**
**దెల్లముగ వారి కెలమితోఁ దెలియఁ జెప్పె** **175**

అచటన్ = అక్కడ, ఎలుగుల ఎకిమీడున్ = ఎలుగుబంట్ల నాయకుడు (జాంబవంతుడు), అంగదుండు = అంగదుడు, మొదలు కలిగిన = మొదలుగా ఉన్న, తనవారలు ఎదురు వచ్చి, కౌగిళులన్ కూర్పన్ = కౌగలించుకోగా, తాన్ జన్న కర్జము ఎల్లన్ = తాను వెళ్ళిన పనినంతను, వారికి = అచటివారికి, ఎలమితోన్ = ప్రీతితో, తెల్లముగ = స్పష్టముగ, తెలియన్ చెప్పె = తెలిసేలా చెప్పెను.

**తా :** అక్కడ జాంబవంతుడు, అంగదుడు, మొదలైన తనవారు ఎదురువచ్చి కౌగలించుకొనగా తాను వెళ్ళిన పనినంతను వారికి ప్రీతితో స్పష్టముగా తెలియచెప్పెను.

**తే.గీ.** **వారుఁ దానును సతవారువముల జోదు**
**కొడుకు నిల్పిన పెనుతేనె కాన కరిగి**
**పండ్లుఁ గాయ లిగుళ్ళు దుంపలును దేని**
**యలుఁ దనివిదీరఁ జూఱగా నారగించి** **176**

వారున్ = వానరులును, తానును, సత వారువముల జోదు కొడుకు = ఏడు గుఱ్ఱముల యోధుని (సూర్యుడు) కొడుకు సుగ్రీవుడు, నిల్పిన = పెంచిన, పెను తేనె కానకు = ఎక్కువగా తేనెకల అడవికి (మధువనము), అరిగి = వెళ్ళి, పండ్లు, కాయలు, ఇగుళ్ళు = గుంజు, దుంపలును, తేనియలున్, తనివి తీర, చూఱగాన్ ఆరగించి = జుఱ్ఱుకొని భుజించి,

**తా :** వానరులును, తానును సుగ్రీవుడు నిల్పిన పెద్ద తేనె కానకు (మధువనపమునకు) వెళ్ళి పళ్ళు, కాయలు, గుంజు, దుంపలు, తేనెలు తనివితీర జుఱ్ఱుకొని ఆరగించి.

**కం.** **అచ్చోటఁ దరలి యందఱు**
**విచ్చలవిడి నరిగి రాచవెన్నెలతేనిన్**
**మచ్చికఁ బొడఁగని యడుగుల**
**కొచ్చెము గనరాని బత్తి నొరగిన పిదపన్** **177**

ఆ చోటన్ = ఆ ప్రదేశమునుండి, తరలి = బయలుదేరి, అందఱు = అందరును, విచ్చలవిడిన్ = స్వేచ్ఛగా, అరిగి = వెళ్ళి, రాచవెన్నెల ఱేనిన్ = రాజచంద్రుని, మచ్చికన్ = విశ్వాసముతో, పొడగని = చూచి, అడుగులకు = పాదములకు, ఒచ్చెము కనరాని = లోపము లేనట్టి, బత్తిన్ = భక్తితో, ఒరగిన పిదపన్ = నమస్కరించిన తదుపరి –

**తా :** అచటినుండి బయలుదేరి అందరూ స్వేచ్ఛగా వెళ్ళి రాముని మచ్చికతో చూచి పాదములకు భక్తితో నమస్కరించి ఆపైన –

**ఆ.వె.** **మొగిలి విప్పు సురటి ముద్దులపట్టి తా**
**నరిగి నేలకాన్పు నరసి వచ్చు**
**టెలమిఁ దెలిపి యాపె తలమానికము రాగ**
**వున కొసంగుటయు మివులఁ జెలఁగి** **178**

మొగిలి = మేఘములను, విప్పు = విడకొట్టు, సురటి = పంకా (వాయువు), ముద్దుల పట్టి = ప్రియ పుత్రుడు (హనుమంతుడు), తాను అరిగి = తాను వెళ్ళి, నేలకాన్పున్ = సీతను, అరసి వచ్చుట = చూచి వచ్చుటను, ఎలమిన్ = ప్రీతితో, తెలిపి = తెలియజేసి, ఆపె తలమానికము = ఆమె శిరోమణిని, రాగవునకు = రామునకు, మివుల = మిక్కిలి, చెలంగి = ఉత్సాహముతో, ఒసంగుటయు = ఇవ్వగా –

**తా :** హనుమంతుడు, తాను వెళ్ళి సీతను చూచి వచ్చుటను ప్రీతితో తెలిపి, ఆమె శిరోరత్నమును రామునకు ఉత్సాహముతో ఇవ్వగా –

**తే.గీ.** **అతనిఁ గౌఁగిటఁ గదియించి వెతలు డించి**
**పుడమి ఱేఁ డుల్లమున దద్దఁ బొంగుచుండె**
**ననుచు నారదుఁ డెఱిఁగింప నవలి కతయుఁ**
**దెలుపుమని పుట్టఁ బుట్టువు పలుకుటయును** **179**

అతనిన్ = ఆంజనేయుని, కౌగిటన్ = కౌగిలిలో, కదియించి = చేర్చుకొని, వెతలు = బెంగను, డించి = వదలుకొని, పుడమి ఱేడు = రామచంద్రుడు, ఉల్లమున = మనసులో, తద్దన్ = మిక్కిలి, పొంగుచుండెన్ = సంతోషించుచుండెను, అనుచు = అని, నారదుడు, ఎఱిగింపన్ = తెలియచెప్పగా, అవలి కతయున్ = తరువాతి కథను, తెలుపుము అని = చెప్పమని, పుట్టన్ పుట్టువు = వాల్మీకి, పలుకుటయును = అడుగుటయును –

తా : ఆంజనేయుని కౌగిలిలో చేర్చుకొని బెంగ వదలుకొని రాముడు మనసులో మిక్కిలి సంతోషించెనని నారదుడు తెలియచెప్పగా తరువాతి కథను చెప్పమని వాల్మీకి అడుగుటయును–

**ఆశ్వాసాంత పద్యములు :**

**చం నలువయు వెన్నుఁ డగ్గి చలినట్టును గట్టులసూడుఁ బ్రొద్దు రే**
**వెలుఁగును నీళ్ళదేవరయు విన్నును నేలయుఁ బైఁడిరాయఁడు**
**న్మలలును సంద్రము ల్మొద లనందగు నిజ్జగ మెల్ల నీవయై**
**వెలుఁగుచునుండు వేలుపుల వేలుప! ముమ్మొనవాలు దాలుపా! 180**

నలువయు = బ్రహ్మయును, వెన్నుడు = విష్ణువును, అగ్గి = అగ్నియును, చలినట్టును = వాయువును, గట్టుల సూడు = ఇంద్రుడును, ప్రొద్దు = సూర్యుడును, రేవెలుగును = చంద్రుడును, నీళ్ళదేవరయు = వరుణుడును, విన్నును = ఆకాశమును, నేలయున్ = భూమియును, పైడిరాయడు = కుబేరుడును, మలలును = పర్వతములును, సంద్రములు = సముద్రములును, మొదలు అనందగు = మొదలుగా చెప్పబడిన, ఈ జగము ఎల్ల = ఈ లోకమంతయును, నీవయై = నీవే అయి, వెలుగుచునుండు = ప్రకాశించుచుండు, వేలుపుల వేలుప = దేవదేవా! ముమ్మొనవాలు దాలుపా = త్రిశూల ధారీ!

**తా :** బ్రహ్మ, విష్ణువు, అగ్ని, వాయువు, ఇంద్రుడు, సూర్యుడు, చంద్రుడు, వరుణుడు, ఆకాశము, భూమి, కుబేరుడు, పర్వతములు, సముద్రములు మొదలుగా చెప్పబడిన ఈ లోకమంతయును నీవే అయి వెలుగుచుండు దేవదేవా! త్రిశూలాధారీ!

**కం. ఎనలేని గొనబుకాఁడా!**
**పెను మినుకుం దెగలు వొగడు పేరిమివాఁడా!**
**చెనఁటి పొలదిండ్ల సూడా!**
**కను వినుకల రాచసూడిగంబుల ఱేఁడా! 181**

ఎనలేని = సాటిలేని, గొనబుకాడా = అందమైనవాడా!, పెనుమినుకుం తెగలు = వేద సమూహములు, పొగడు పేరిమివాడా = స్తుతించే గొప్పతనమున్నవాడా!, చెనటి = దుర్మార్గులైన, పొలదిండ్ల సూడా = రాక్షసులకు శత్రువా!, కను వినుకల రాచ = కనులతో వినునవి (పాములు) రాజు (వాసుకి), సూడిగంబుల ఱేడా = కంకణములుగా కలవాడా!

**తా :** సాటిలేని అందగాడా! వేద సమూహములు స్తుతించే గొప్పవాడా! రాక్షసుల శత్రువా! పాములు కంకణములుగా కలవాడా!

**తోటకవృత్తము:**

**పెను బాముల పున్కల పేరులు ఱొ**
**మ్మున వ్రేలఁగఁ గేలను ముమ్మొనవాల్**
**గొనబారఁగ నౌదల గ్రొన్నెలయున్**
**మినువాఁకయుఁ గలిగిన మేల్బిరుదా! 182**

పెను పాముల = పెద్ద పాముల యొక్కయు, పున్కల = పుట్టెలయొక్కయు, పేరులు = దండలు, ఱొమ్మున = వక్షస్థలమున, వ్రేలగన్ = వ్రేలాడుచుండగా, కేలను = చేతియందు, ముమ్మొనవాల్ = త్రిశూలమును, గొనబారగన్ = అందము అతిశయింపగా, ఔదలన్ = శిరసుపై, క్రొన్నెల యున్ = చంద్రకళయును, మినువాకయు = ఆకాశగంగయును, కలిగిన, మేలు బిరుదా = గొప్ప వీరుడా!.

**తా :** పాములు, పుట్టెల దండలు ఱొమ్మున అందముగా అతిశయింపగా తలపై చంద్రకళ ఆకాశగంగ కలిగిన బిరుదుమగడా!

**గద్యము :**

**ఇది శ్రీమదుమారమణ కరుణాకటాక్ష నిరీక్షణ –**
**సంలబ్ధ సరస కవితా సామ్రాజ్య దురంధర ఘన యశోబంధుర**
**కౌండిన్య సగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర బుధజనవిధేయ తిమ్మయ**
**నామధేయ ప్రణీతంబైన యచ్చ తెలుఁగు రామాయణ మహాకావ్యము నందు**
**సుందర కాండము సర్వమేకాశ్వాసము**

**వ్యాఖ్యాతృ గద్యము :**

**ఇది బుధజన విధేయుండును, బులుసు వంశ సంభూతుండును,**
**కీ.శే. శేషమ్మ వేంకటరమణయ్య పుణ్యదంపతీ తనూజుండును,**
**గౌతమ గోత్రజుండునగు వేంకటసత్యనారాయణమూర్తి**
**ప్రణీతంబైన అచ్చ తెలుఁగు రామాయణమను మహాకావ్యమందు**
**సుందర కాండమునకు టీక, తాత్పర్యములు.**



# అచ్చతెలుఁగు రామాయణము

# యుద్ధ కాండము

**కం.** **సిరిగొఱలు వరుస తేరుల**
**దొరబిడ్డని పాలఁ గలిగి దురమున గెలుపుల్**
**బెరయించి యతనిచే వా**
**విరిఁ బూజలు గొన్న మేటి! వేల్పుల మిన్నా!** **1**

సిరి కొఱలు = సంపదలచే అతిశయించు, వరుసతేరుల దొరబిడ్డని పాలన్ = దశరథుని పుత్రుడైన రాముని పక్షాన, కలిగి = ఉండి, దురమునన్ = యుద్ధమునందు, గెలుపుల్ బెరయించి = గెలుపును కలుగజేసి, అతనిచేన్ = ఆ రామునిచే, వావిరిన్ = మిక్కిలిగా, పూజలు కొన్న = పూజలను స్వీకరించిన, మేటి = గొప్పవాడా! వేల్పుల మిన్నా = దేవతలలో శ్రేష్ఠుడా! (శివా)

**తా :** సంపదలచే అతిశయించు దశరథపుత్రుడైన రామునియందు దయకలిగి యుద్ధము నందు గెలుపును కలుగజేసి ఆ రామునిచే మిక్కిలిగా పూజలను స్వీకరించిన శివా!

**సీ.** **విను మబ్బొటియ కానుపునకుఁ గయ్యపుఁ దిండి**
**జడదారి యిట్లని నుడివె నట్టు**
**గాడుపు చూలి లంకకు నేఁగి గ్రమ్మఱఁ**
**బఱతెంచి తాఁ బంటపడఁతి నిసువుఁ**
**జూచుటయును రక్కసులరాయఁడున్న చం**
**దంబును మఱి వాని తమ్ముదోయి**
**తెఱఁగును బంట్ల యేడ్తెఱయును మూఁకల**
**పెల్లును బ్రెగ్గడ పిండు పెంపు**

**తే.గీ.** **ప్రోలి ఠీవియు నా రాచ బొబ్బమెకము**
**తోడ నెఱిఁగింపఁ గడఁక నా ప్రోడ తేఁడు**
**కొలఁది మీఱిన పోటరి కొమ్మ మెకపు**
**వెల్లువలఁ గూడి యప్పుడె వేగఁ దరలి** **2**

వినుము = విను, ఆ బొఱియ కానుపునకున్ = ఆ పుట్టనుండి పుట్టిన వాల్మీకికి, కయ్యపున్ తిండి = కలహములే ఆహారముగాకల, జడదారి = నారదుడు, ఇట్లని నుడివెన్ = ఈ ప్రకారముగా చెప్పెను, అట్టు = ఆ విధముగా, గాడుపు చూలి = వాయు నందనుడు, లంకకున్ ఏగి = లంకకు వెళ్ళి, క్రమ్మఱన్ = తిరిగి, పఱతెంచి = వచ్చి, తాన్ = తాను, పంట పడతి నిసువున్ = భూదేవి కుమార్తెను (సీతను), చూచుటయును, రక్కసులరాయడు = రావణుడు, ఉన్న చందంబును = ఉన్న విధమును, మఱి = ఇంకను, వాని తమ్ము దోయి = వాని ఇద్దరు తమ్ముల, తెఱగును = విషయమును, బంట్ల = వీరులయొక్క, ఏడ్తెఱయును = అతిశయమును, మూకల = సైన్యముయొక్క, పెల్లును = ఆధిక్యమును, ప్రెగ్గడ పిండు = మంత్రుల సమూహముయొక్క, పెంపు = గౌరవమును, ప్రోలి = పట్టణముయొక్క, ఠీవియున్= వైభవమును, ఆ రాచ బొబ్బమెకముతోడన్ = ఆ రాజ శార్దూలమగు రామునితో, ఎఱిగింపన్, కడకన్ = పూనుకొని, ఆ ప్రోడ = ఆ సమర్థుడైన, ఱేడు = రాముడు, కొలది మీఱిన = మిక్కిలి అధికమైన, పోటరి = పోరాటశక్తిగల, కొమ్మ మెకపు వెల్లువలన్ = వానర సైన్యముతో, కూడి = కలిసి, అప్పుడె = వెంటనే, వేగన్ = వేగముగా, తరలి = బయలుదేరి,

**తా :** విను, వాల్మీకికి నారదుడు ఈ ప్రకారముగా చెప్పెను 'ఆ విధముగా వాయునందనుడు లంకకు వెళ్ళి తిరిగి వచ్చి తాను సీతను చూచుటయును, రావణుడున్న విధమును, ఆతని ఇద్దరు తమ్ముల విషయమును, వీరుల అతిశయమును, సైన్యము ఆధిక్యతను, మంత్రుల గౌరవమును, నగర వైభవమును రామునికి వివరింపగా అంత రాముడు పోటరులైన వానర సైన్యముతో కూడి వేగముగా బయలుదేరి.

**తే.గీ.** **మీలు గప్పలుఁ దాఁబేళ్ళు గాలిదిండ్లు**
**మొసలు లెంద్రలు నెగడులు మొదలు గలుగు**
**నీరు ద్రిమ్మరి పదువులు నెఱయఁ బెఱయుఁ**
**బొనరు మున్నీటి సేరి యబ్బురము మీఱ** **3**

మీలు = చేపలు, కప్పలు, తాబేళ్ళు, గాలి తిండ్లు = పాములు, మొసలులు = మొసళ్ళు, ఎంద్రలు = పీతలు, నెగడులు = ఇతర జల జంతువులు, మొదలు కలుగు = మొదలుగా కలిగిన, నీటి త్రిమ్మరి పదువులు = నీటిలో సంచరించే జంతు సమూహములు, నెఱయన్ = పూర్తిగా, బెఱయున్ = కలిగి, పొనరు = ప్రకాశించు, మున్నీటి చేరి, అబ్బురము మీఱ = మిక్కిలి ఆశ్చర్యముగా –

**తా :** చేపలు, కప్పలు, తాబేళ్ళు, పాములు, మొసళ్ళు, పీతలు, ఇతర జంతువులు మొదలుగ కలిగిన నీటి జంతువులు కలిగిన సముద్రమును చేరి మిక్కిలి ఆశ్చర్యముగా –

**తే.గీ.** **అద్దరిని దండు విడియించి తద్దఁ జెలఁగు**
**చున్నచో నంత లంకలో నెన్నరాని**
**ఠీవిఁ బేరోలగంబుండి రావణుండు**
**గడఁక దైవార ననుఁగుఁ బ్రెగ్గడలఁ బలికె** **4**

ఆ దరిని = ఆ సముద్రపు ఒడ్డున, దండు విడియించి = సైన్యమును నిలిపి, తద్దన్ = మిక్కిలి, చెలగుచున్నచో = ఉత్సాహముతోనుండగా, అంత = అదే సమయమున, లంకలోన్ = లంకా నగరములో, ఎన్నరాని = వర్ణింప శక్యముగాని, ఠీవిన్ = వైభవముతో, పేరోలగంబుండి = సభను ఏర్పరచి, రావణుండు, కడక = పూనిక, దైవారన్ = ప్రకటమగునట్లుగా, అనుగున్ = అనుకూలురైన, ప్రెగ్గడలన్ = మంత్రులతో, పలికె = పలికెను.

**తా :** ఆ సముద్రపు ఒడ్డున సైన్యమును నిలిపి యుండగా అదే సమయమున లంకలో వర్ణింప శక్యముకాని వైభవముతో సభను ఏర్పరచి రావణుడు పూనిక ప్రకటమగునట్లుగా తన కనుకూలురైన మంత్రులతో పలికెను.

**ఉ. ప్రెగ్గడలార! నా పలుకుఁ బ్రేముడితోడ వినుండు వేల్పులన్**
**బెగ్గిలఁ ద్రోలి యక్కజపుఁ బేర్మి దలిర్పఁగ ముజ్జగంబులన్**
**గ్రమ్మఁగ ఠీవి నేలుచుఁ గరంబుఁ జెలంగుచునుంటిఁ గాని ము**
**న్నెగ్గొడవల్ గనుంగొన నొకించుక చేటొనఁగూడె నియ్యెడన్ 5**

ప్రెగ్గడలార = ఓ మంత్రులారా!, నా పలుకున్ = నా మాటను, ప్రేముడి తోడ = విశ్వాసముతో, వినుండు = వినండి, వేల్పులన్ = దేవతలను, బెగ్గిలన్ = భయపడునట్లుగా, త్రోలి = పారత్రోలి, అక్కజపు పేర్మిన్ = ఆశ్చర్యకరమైన పెంపుతో, తలిర్పగ = అతిశయింపగా, మూడు జగంబులన్ = మూడు లోకములను, గ్రమ్మగ = లొంగియుండగా, ఠీవిన్ ఏలుచున్ = వైభవముగా పరిపాలించుచు, కరంబు = మిక్కిలి, చెలంగుచును ఉంటిన్ కాని = విజృంభించుచున్నానే కాని, మున్ను = ఇంతకు పూర్వము, ఏ గొడవల్ = ఏ సమస్యలును, కనుంగొనను = చూడను, ఇయ్యెడన్ = ఈ సమయమున, ఒకించుక = కొంచెము, చేటు ఒనగూడె = కీడు సంభవించినది.

**తా :** మంత్రులారా! నామాటను విశ్వాసముతో వినండి. దేవతలను భయపడునట్లుగా పారద్రోలి ఆశ్చర్యకరమైన పెంపుతో అతిశయముగా మూడు లోకములు లొంగియుండగా వైభవముగా పాలించుచు విజృంభణతో ఉన్నానే కాని ఇంతవరకు ఏ సమస్యలను చూడలేదు. ఇప్పుడు కొంచెము చేటు సంభవించినది.

**ఆ.వె. ఒక్క కోఁతి సేరి స్రుక్కక పెక్కంద్ర**
**రక్కసులను బట్టి యుక్కడంచి**
**చనియె నింకనేమి యనఁబోలు? దఱి తాఱు**
**మాఱుగాఁ దొడంగె మదిఁ దలప 6**

ఒక్క కోతి = ఒకే ఒక్క కోతి, చేరి = వచ్చి, స్రుక్కక = వెనుదీయక, పెక్కంద్ర = పలువుర, రక్కసులను పట్టి, ఉక్కడగించి = ప్రాణములు తీసి, చనియెన్ = వెళ్ళెను. ఇంకను ఏమి అనన్ పోలు = ఇంక ఏమి అనడానికి వీలుంది? మదిన్ = మనసునందు, తలప = ఆలోచింపగా, తఱి = కాలము, తాఱు మాఱుగాన్ = వ్యత్యస్తముగా, కాన్ = అగుటకు, తొడంగె = ప్రారంభమయ్యెను.

**తా :** ఒక కోతి వచ్చి వెనుదీయక పలువుర రాక్షసులను చంపి వెళ్ళెను. ఇంక ఏమనడానికి వీలుంది? మనసున ఆలోచింపగా కాలము వ్యత్యస్తమగుట ప్రారంభమయ్యెను.

**తే.గీ.** **కడలి కోఁతుల కొక తోఁట కాల్వయయ్యెఁ**
**బెం పలరు లంక యొక పేద కొంపయయ్యెఁ**
**బొలసు మేపరు లొక చిరు పురువులైరి**
**యహహా! దయ్యంబు నిఁకనేమి యనఁగఁబోలు?** **7**

కోతులకు, కడలి = సముద్రము, ఒక = ఒక చిన్న, తోట కాల్వ అయ్యెన్ = పంటకాలువ అయిపోయెను, పెంపు అలరు = గొప్పగా ఉండేటటువంటి, లంక = లంకా పట్టణము, ఒక పేద కొంపయయ్యె = ఒక నిరుపేద కొంప అయిపోయెను, పొలసు మేపరులు = రాక్షసులు, ఒక చిరు పురువులు ఐరి = ఒక చిన్న పురుగులైపోయిరి, అహహ = అయ్యో! దయ్యంబున్ = దైవమును, ఇకన్ = ఇంక, ఏమి అనగన్ పోలు = ఏమండానికి తగును?

**తా :** కోతులకి సముద్రము ఒక పంటకాలువ అయిపోయినది. గొప్పగా ఉండే లంక ఒక నిరుపేద కొంప అయిపోయినది. రాక్షసులు ఒక చిన్న పురుగులైపోయిరి. అయ్యో! దైవాన్ని ఇంక ఏమనడానికుంది?

**తే.గీ.** **అక్కజంబైన తపసున కలరి మున్ను**
**నలువ కోరిక లొసఁగెడు నాఁడు మేయి**
**తాలుపుల నెల్ల గెల్చున ట్లోలి నడిగి**
**కోఁతులను మానుసుల గెల్వఁ గోరనైతి** **8**

మున్ను, అక్కజంబైన = అద్భుతమైన, తపసునకు = తపస్సునకు, అలరి = సంతసించి, నలువ = బ్రహ్మ, కోరికలు = వరములు, ఒసగెడు నాడు = ఇచ్చే సమయమున, మేయి తాలుపుల నెల్ల = శరీరధారు లందరిని, గెల్చునట్లు = జయించునట్లు, ఓలిన్ = వరుసగా (సిద్ధ,సాధ్య, ఖచర, కిన్నర, కింపురుష, గరుడ, పన్నగ, విద్యాధర, గంధర్వ, నిర్జరాదులను), అడిగి = కోరుకొని, కోతులను, మానుసులన్, గెల్వన్ = గెలుచునట్లు, కోరను ఐతి = కోరనైతిని.

**తా :** పూర్వము తపస్సునకు సంతసించి బ్రహ్మ వరములు ఇచ్చే సమయమున శరీరధారు లందరిని జయించునట్లు కోరుకొని కోతులను, మనుషులను గెలుచునట్లు కోరనైతిని.

**కం.** **అటు లగుటఁ జేసి యిపుడొ**
**క్కటఁ గోఁతులు మానుసులును గయ్యమునకు నె**
**క్కటి మగఁటిమితో వచ్చిరి**
**కటకట! యిఁక నెద్ది వెరవు క్రన్ననఁ జెపుఁడా!** **9**

అటులు అగుటన్ చేసి = అలా అవడం చేత, ఇపుడు = ఇప్పుడు, ఒక్కటన్ = కూటమిగా, కోతులు, మానుసులును, కయ్యమునకు = యుద్ధమునకు, నెక్కటి మగటిమితో = అసహాయ శూరత్వంతో, వచ్చిరి = వచ్చియున్నారు, కటకట = అయ్యయ్యో!, ఇకన్ = ఇంక, ఎద్ది వెరవు = ఏది ఉపాయము?, క్రన్ననన్ = శీఘ్రముగా, చెపుడా = చెప్పండి.

**తా :** అటులగుటచేత ఇప్పుడు కూటమిగా కోతులు, మనుషులు యుద్ధమునకు మగటిమితో వచ్చిరి. అయ్యయ్యో! ఇక ఉపాయమేది? తొందరగా చెప్పండి.

**మ.** **అనినన్ రక్కసి పెద్ద లిట్టులని రాహా! వేల్పురాసూడ! యెం**
**దును మున్నాడని బీదపల్కు లిపు డెంతో నెవ్వగం బల్కఁగాఁ**
**జనునే? పూని జగంబునెల్ల నెటి హెచ్చం గెల్చి గాటంపు టు**
**క్కునఁ జెన్నారెడు నీకు మానుసు లెలుంగుల్ గోఁతులుం బెద్దయే?** **10**

అనినన్ = అనగా, రక్కసి పెద్దలు = రాక్షస నాయకులు, ఇట్టులు అనిరి = ఈ రీతిగా పలికిరి, ఆహా = ఆశ్చర్యము, వేల్పు రా సూడ = దేవతల ప్రభువగు ఇంద్రుని శత్రువా!, ఎందును = ఎన్నడును, మున్ను = ఇంతకు పూర్వము, ఆడని = పలుకని, బీద పల్కులు = పేద అరుపులు, ఇపుడు, ఎంతో నెవ్వగన్ = ఎంతో మనః క్లేశముతో, పల్కగాన్ చనునే = పలుకుట తగునా?, పూని = ప్రయత్నించి, జగంబును ఎల్లన్ = లోకమునంతను, నెటి హెచ్చన్ = నీ వైభవము హెచ్చునట్లుగా, గెల్చి = జయించి, గాటంపు ఉక్కునన్ = గొప్ప శౌర్యముతో, చెన్నారెడు = శోభిల్లెడు, నీకు, మానుసులు, ఎలుంగుల్ = ఎలుగుబంట్లు, కోతులున్ = కోతులును, పెద్దయే = పెద్ద లెక్కా?

**తా :** అనిన రాక్షసనాయకులు 'ఆశ్చర్యము, ఇంద్ర శత్రువా! ఎన్నడును మున్ను పలుకని బీద పల్కులు ఇప్పుడు ఎంతో మనఃక్లేశముతో పలుకుట తగునా? పూని లోకాన్నంతని జయించి శౌర్యముతో శోభిల్లెడి నీకు మనుషులు, ఎలుగుబంట్లు, కోతులు పెద్ద లెక్కా?

**తే.గీ.** **చెల్లఁబో ఱేఁడ! నీ కిట్టి బల్లిదునకుఁ**
**గడిమి దిగఁద్రోచి తద్దయుఁ గన్న విన్న**
**వార లెల్లరు నగఁగ నివ్వరుసఁ గొఱంత**
**మాట వాక్రువ్వఁదగునె యుమ్మలికఁ బూని?** **11**

ఱేడ = రాజా!, చెల్లన్ పో = సరిపోయిందిలే, ఇట్టి = ఇటువంటి, బల్లిదునకున్ = సమర్థునికి, నీకు, కడిమి దిగన్ త్రోచి = ధైర్యమును విడిచిపెట్టి, తద్దయున్ = మిక్కిలి, కన్న విన్న వారు = చూచిన, వినిన వారు, ఎల్లరున్ = అందరును, నగగన్ = పరిహసించునట్లుగా, ఈ వరుసన్ = ఈ విధముగా, కొఱత మాట = బలహీనమగు మాట, ఉమ్మలిక పూని = వేదనను పొంది, వాక్రువ్వన్ = పలుకుట, తగునె = తగునా?

**తా :** రాజా! సరిపోయిందిలే! ఇటువంటి బలశాలికి నీకు ధైర్యమును విడిచిపెట్టి చూచిన వారందరు పరిహసించగా ఈ రీతిగా వేదనను పొంది కొఱతమాటలు పలుకుట తగునా?

**తే.గీ.** **జముని కంటెను జేజేల సామికంటె**
**జంటమోముల వేలుపుకంటె నీళ్ళ**
**ఱేనికంటెను లిబ్బుల ఱేనికంటె**
**మేటియే రాగవుఁడు నిన్ను మీటి పోర?** **12**

జముని కంటెను = యమునికంటే, జేజేల సామి కంటె = దేవతల ప్రభువగు ఇంద్రుని కంటె, జంటమోముల వేలుపు కంటె = రెండు ముఖములు కల అగ్ని కంటె, నీళ్ళ ఱేని కంటె = వరుణుని కంటె, లిబ్బుల ఱేని కంటె = కుబేరుని కంటె, రాగవుడు = రాముడు, నిన్ను పోర = నీతో యుద్ధము చేయుటకు, మేటియే = శ్రేష్ఠుడా యేమి?

**తా :** యముని కంటే, ఇద్రుని కంటే, అగ్ని కంటే, వరుణుని కంటే, కుబేరుని కంటే రాముడు నీతో యుద్ధము చేయుటకు శ్రేష్ఠుడా యేమి?

**ఉ. అంచ హుమాయి జోదు నలరారఁగఁ జేసి కడింది కోరిక**
**ల్గాంచి వెడంద రక్కసి కొలంబున కెల్లను మేలుబంతియై**
**మంచపుకోడు తాలుపరి మన్కి బిడారపు మెట్టు నెంతయున్**
**గొంచక యెత్తినట్టి నినుఁ గోఁతులు గీతులు గెల్వఁ జాలునే? 13**

అంచ హుమాయి జోదు = హంస వాహనపు వీరుడు (బ్రహ్మ), అలరారగన్ చేసి = సంతోషించు నట్లుగా చేసి, కడింది కోరికల్ = గొప్ప వరములను, కాంచి = పొంది, వెడంద = పెద్దదియగు, రక్కసి కొలంబునకు ఎల్లను = రాక్షస వంశానికంతకును, మేలుబంతియై = శ్రేష్ఠుడవై, మంచపుకోడు తాలుపరి = మంచపుకోడు (ఖట్వాంగము) ఆయుధముగా కల శివుని, మన్కి బిడారపు మెట్టున్ = నివాస స్థాన పర్వతమగు కైలాసమును, ఎంతయున్ = ఏమాత్రమును, కొంచక = సందేహించక, ఎత్తినట్టి = పైకి లేపినట్టి, నినున్ = నిన్ను, కోతులు గీతులు, గెల్వ జాలునే = జయించగలవా?

**తా :** బ్రహ్మను సంతోషపెట్టి గొప్పవరములు పొంది రాక్షసవంశ శ్రేష్ఠుడవై ఖట్వాంగము ఆయుధముగాకల శివుని కైలాసమును సందేహించక పైకి లేపినట్టి నిన్ను కోతులు గీతులు జయించగలవా?

**ఆ.వె. అదియుఁగాక మమ్ము నెదిరించి పోర జే**
**జేలకైన బలిమి సాలకుండు**
**మానుసులును జెట్టు మనికి వజీరులు**
**నెంతవారు కలన నెదిరి నిలువ? 14**

అదియున్ కాక = అంతే కాకుండా, మమ్మున్ = మమ్మల్ని, ఎదిరించి పోర = ఎదురొడ్డి యుద్ధము చేయుటకు, జేజేలకైన = దేవతలకైనను, బలిమి చాలక ఉండు = బలం సరిపోకుండా ఉంటుంది, మానుసులును = మనుషులును, చెట్టు మనికి వజీరులు = చెట్టే నివాసముగాకల వీరులు (కోతులు), కలన = యుద్ధమున, ఎదిరి నిలువ = ఎదిరించి నిలుచుటకు, ఎంతవారు = ఎంతటివారు?

**తా :** అంతే కాకుండా మమ్మల్ని ఎదురొడ్డి యుద్ధము చేయుటకు దేవతలకైనా బలం సరిపోదు. మనుషులను, కోతులను యుద్ధమున ఎదిరించి నిలుచుటకు ఎంత?

**ఉ. కొండలు పిండి సేతుమొ? మొగులెత్తెరు వొక్కట మ్రింగివైతుమో?**
**గండలరారఁ జిల్వ గమికానిఁ గలంతుమొ? యెల్ల వేలుపుం**
**బిండులఁ బట్టి కాటియలఁ బెట్టుదుమో? వెస మిత్తి గుండియల్**
**సెందుదుమో? జగంబులకుఁ జేటొదవింతుమొ? దీవిరాయడా! 15**

దీవి రాయడా = లంకాధిపతీ!, కొండలు పిండిచేతుమొ, మొగులు తెరువు = ఆకాశమును, ఒక్కట = ఒక్కసారిగా, మ్రింగివైతుమో?, గండు అలరారన్ = ఆధిక్యము ఒప్పునట్లుగా, చిల్వ గమికానిన్ = పాములు సమూహమునకు ప్రభువగు ఆదిశేషుని, కలంతుమొ = కలత పెట్టుదుమా?, ఎల్ల వేలుపుం పిండులన్ = దేవతా సమూహముల నన్నిటిని, కాఱియలు పెట్టుదుమో = కష్టాలు పెట్టుదుమా?, వెసన్ = శీఘ్రముగా, మిత్తి గుండియల్ = మృత్యువుయొక్క గుండెలను, చెందుదుమో = పగులగొట్టుదుమా? జగంబులకు, చేటు = కీడు, ఒదవింతుమొ = కలిగించుదుమా?

**తా :** లంకాధిపతీ! కొండల్ని పిండి చేయమా? ఆకాశమును మ్రింగివేయమా? ఆదిశేషుని కలతపెట్టమా? దేవ సమూహములను కష్టపెట్టమా? మృత్యువు గుండెలు పగులగొట్టమా? లోకములకు కీడు తలంచమా?

**కం.** **పంతమునఁ బొద్దు పస యుడి**
**గింతుమొ? సత మొసలిపట్లఁ గినుక నిగుడ నిం**
**కింతుమొ? జముని నడంతుమొ?**
**కొంతయుఁ గాదనక మాకుఁ గొబ్బునఁ జెపుమా!** **16**

పంతమునన్ = పట్టుదలతో, పొద్దు పస = సూర్యుని ప్రతాపమును, ఉడిగింతుమొ = తగ్గించమా?, మొసలి పట్లన్ = సముద్రములను, సత = ఏడింటిని, కినుక నిగుడన్ = మిక్కిలి కోపముతో, ఇంకింతుమొ = ఎండగట్టమా?, జముని = యముణ్ణి, అడంతుమొ = అణచివేయమా?, కొంతయున్ = ఏ మాత్రమును, కాదు అనక, మాకున్, గొబ్బునన్ = తొందరగా, చెపుమా = చెప్పుము.

**తా :** పట్టుదలతో సూర్యుని ప్రతాపమును తగ్గించమా? ఏడు సముద్రములను కోపంతో ఎండగట్టమా? యముణ్ణి అణచివేయమా? కాదనక మాకు తొందరగా చెప్పు.

**కం.** **అనునెడ విభీషణుఁడు మె**
**ల్లన నిరు చౌ వంచ యౌదలల రక్కసి రా**
**యనిఁ జూచి యిట్టులనియెం**
**దన పలుకుల వలఁతిదనము దనరారంగన్** **17**

అనున్ ఎడన్ = అను సమయమున, విభీషణుడు = రావణుని తమ్ముడు, మెల్లనన్ = నెమ్మదిగా, ఇరు చౌ వంచ = $2\times5$= పది, ఔదలల = తలలుకల, రక్కసి రాయనిన్ = రాక్షస రాజుని, చూచి = కాంచి, తన పలుకుల = తన మాటలయందు, వలతి తనము = నిపుణత్వము, తనరారంగన్ = ఒప్పునట్లుగా, ఇట్టులు అనియెన్ = ఈ విధముగా పలికెను.

**తా :** అనే సమయంలో విభీషణుడు నెమ్మదిగా పది తలల రావణుని కాంచి తన మాటలయందు నిపుణత్వము ఒప్పునట్లుగా ఇట్టులు పలికెను.

**తే.గీ.** **అన్న! యా పోటరుల మాట లాలకించి**
**వీటి కెల్లను జేటుఁ గావింపఁ బోకు**
**రాచ జేజేల తేఁడగు రాగవునకు**
**నెలఁత నొప్పించి సిరులెల్ల నిలుపుకొనుము** **18**

అన్న, ఆ పోటరుల = ఆ యుద్ధవీరుల, మాటల ఆలకించి = మాటలను విని, వీటికి ఎల్లను = లంకానగరానికంతను, చేటున్ = కీడును, కావింపన్ పోకు = చేయబోకు, రాచ జేజేల ఱేడు అగు = శ్రేష్ఠులైన క్షత్రియులకు ప్రభువగు, రాగవునకు = రామునకు, నెలతను ఒప్పించి = ఆతని స్త్రీని, ఒప్పించి = అప్పగించి, సిరులు ఎల్లన్ = సంపదల నన్నిటిని, నిలుపుకొనుము = నిలబెట్టు కొనుము.

**తా :** అన్నా! రావణా! ఆ యుద్ధవీరుల మాటలను విని లంకకు కీడును చేయబోకు. రాజ శ్రేష్ఠులకు ప్రభువగు రామునకు అతని స్త్రీని అప్పగించి సంపదలను నిలబెట్టుకొనుము.

**తే.గీ.** **మొదలి వెన్నుఁడు పంటల ముగుద గొడవ**
**లుడుపు కొఱకు కిర్ల గొంగ వంగడమునందు**
**రాముఁడై పుట్టె లిబ్బుల చామ సీత**
**యై పొడమె వేలుపులు గోఁతులైరి సుమ్ము** **19**

మొదలి వెన్నుడు = ఆదినారాయణుడు, పంటల ముగుద = భూదేవియొక్క, గొడవలు = బాధలు, ఉడుపు కొఱకు = తీర్చు కొఱకు, ఇర్ల గొంగ = చీకట్లకు శత్రువగు సూర్యుని, వంగడమునందు = వంశమునందు, రాముడై పుట్టె, లిబ్బుల చామ = సంపదల స్త్రీ లక్ష్మీదేవి, సీతయై, పొడమె = పుట్టెను, వేలుపులు, కోతులైరి సుమ్ము !

**తా :** ఆదినారాయణుడు భూదేవి బాధలు తీర్చుకొఱకు సూర్యవంశమునందు రాముడై పుట్టెను. లక్ష్మీదేవి సీతయై పుట్టెను. దేవతలు కోతులయ్యారుసుమా!

**కం.** **మలసూ దగ్గియు జముఁడును**
**బొలదిండియుఁ ద్రాడుదాలుపుం గాడ్పును జ**
**క్కుల యెకిమీడును లే గ్రొ**
**న్నెల తాల్పును గారు పోర నీ వెదిరింపన్** **20**

మలసూడు = పర్వతములకు శత్రువు ఇంద్రుడును, అగ్గియు = అగ్నియును, జముడును = యముడును, పొలతిండియున్ = మాంసాహారి (రాక్షసుడు) నైరృతియును, త్రాడు దాలుపున్ = వరుణుడును, గాడ్పును = వాయువును, జక్కుల యెకిమీడు = యక్ష ప్రభువగు కుబేరుడును, లే క్రొన్నెల తాల్పును = ఈశానుడును, కారు = కారుసుమా!, పోర = యుద్ధమున, నీవు ఎదిరింపన్ = నీవు ఎదుర్కొనుటకు?

**తా :** ఇంద్రుడు, అగ్ని, యముడు, నిరృతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు కారు సుమా! యుద్ధంలో నువ్వు ఎదుర్కొనటానికి?

**కం.** **కలికపు మానిసియని నీ**
**తలఁపున నిపు డల్ల నేలతాలుపు మిన్నన్**
**జులకఁగఁ జూచెద వతనిన్**
**గెలువఁగ నీవంటి వారికిం దరమగునే?** **21**

నీ తలపున = నీ భావనలో, ఇపుడు = ఈ సమయమున, అల్ల నేలతాలుపు మిన్నన్ = ఆ రాజ శ్రేష్ఠుని, కలికపు మానిసి అని = అల్పుడగు మనిషి యని, చులకగన్ చూచెదవు = తక్కువగా చూస్తున్నావు, అతనిన్, గెలువగ = గెలుచుట, నీవంటి వారికిన్, తరము అగునే = సాధ్యమగునా?
**తా :** నీ తలపులో ఇపుడు ఆ రాజశ్రేష్ఠుని అల్పమానవుడని చులకనగా చూస్తున్నావు. అతనిని గెలవడం నీవంటివారికి సాధ్యమవుతుందా?

**సీ.** **జడదారి వెనువెంటఁ జనుచుఁ దక్కరి సోఁకు**
**టెలనాగ నొక కోల బిలుకు మార్చె**
**నే బల్లిదులుఁ గేల నెత్త నోపని గట్టు**
**విలుకాని సింగాణి విఱిచి వైచె**
**బలురాచమిన్న పౌఁజుల బిట్టు సెలవిన**
**గండ్రగొడ్డలి తాల్పు గండడంచెఁ**
**బెను గానలో నేల బిత్తరి కానుపుఁ**
**గొని యేఁగు చెడు వేల్పుగొంగఁ జిదిమెఁ**

**తే.గీ.** **బూని చౌవంచ మఱ్ఱుల కోనలోన**
**ఖరుఁడు మొదలగు మేటి రక్కసులఁ గెడపె**
**నొడలి చూపుల యొడయని కొడుకుఁ గూల్చె**
**నహహ! రాముని మగతనం బరుదుగాదె?** **22**

జడదారి = విశ్వామిత్రుని, వెనువెంటన్ = అనుసరించి, చనుచున్ = వెళ్ళుచు, టక్కరి = మోసగత్తెయయిన, సోకు ఎలనాగన్ = రాక్షస స్త్రీని, ఒక కోలన్ = ఒక్క బాణముతో, పిలుకు మార్చెను = మదము నణచెను (చంపెను), ఏ బల్లిదులున్ = ఎంతటి బలవంతులైనను, కేలన్ = చేతితో, ఎత్తన్ ఓపని = ఎత్తలేకపోయిన, గట్టు విలుకాని = మేరుపర్వతము ధనుస్సుగ కల శివుని, సింగాణి = ధనుస్సును, విఱిచి వైచె = విరుగ కొట్టెను, బలు రాచ మిన్న = గొప్ప రాజ శ్రేష్ఠుల, పౌజుల = పంక్తులను, బిట్టు = శీఘ్రముగా, చెలవిన = సంహరించిన, గండ్ర గొడ్డలి తాల్పు = గండ్రగొడ్డలిని ధరించిన పరశురాముని, గండు అడంచె = పరాక్రమమును అణచివేసెను. పెను కానలో = గొప్ప అరణ్యములో, నేలబిత్తరి కానుపున్ = భూదేవి కూతురగు సీతాదేవిని, కొని యేగు = తీసుకొని వెళ్ళు, చెడు వేల్పుగొంగన్ = దుష్ట రాక్షసుని (విరాధుని), చిదిమెన్ = సంహరించెను, పూని = పూనుకొని, చౌవంచ మఱ్ఱుల కోనలోన = ఐదు మఱ్ఱి చెట్లున్న అడవిలోన (పంచవటిలో), ఖరుడు మొదలగు = ఖరుడు మొదలైన, మేటి రక్కసులన్ = వీరులైన రాక్షసులను, కెడపెన్ = చంపెను, ఒడలి చూపుల ఒడయని = ఒళ్ళంతా కన్నులున్న ప్రభువు (ఇంద్రుని), కొడుకున్ = కుమారుడగు వాలిని, కూల్చెన్ = సంహరించెను, అహహ = ఆహా!, రాముని మగతనంబు = రామునియొక్క పరాక్రమము, అరుదు కాదె = అపురూపము కదా!.

**తా :** విశ్వామిత్రుని వెంట వెళుతూ తాటకిని ఒక్క బాణంతో సంహరించెను. ఎంత బలవంతులైనా ఎత్తలేని శివధనుస్సును విఱుగకొట్టెను. రాజశ్రేష్ఠుల సంహరించిన పరశురాముని పరాక్రమమును అణచివేసెను. అడవిలో సీతనెత్తుకెళ్ళు విరాధుని చిదిమెను. పంచవటిలో ఖరాది రాక్షసులను చంపెను. ఇంద్రుని కొడుకగు వాలిని కూల్చెను. ఆహా! రాముని మగతనము అపురూపముకదా!

**తే.గీ.** **తగరు బలితపు గొండతోఁ దాఁకునట్టు**
**దోమ బలుహజ్జ మెకముతోఁ దొడరునట్లు**
**నీవు రా రిక్క ఱేనిపైఁ బోవు టెల్ల**
**వలదు జతగాని సూదు నా పలుకు వినుము** **23**

తగరు = గొఱ్ఱె పొట్టేలు, బలితపున్ = కఠినమైన, కొండతోన్, తాకునట్టు = మార్కొనునట్టు, దోమ, బలు హజ్జ మెకముతో = పెద్ద పాదములు కలది ఏనుగుతో), తొడరునట్లు = పోరునకు ప్రయత్నించు నట్లు, జత కాని = సమానముకాని వానితో సూదు = శత్రుత్వము కావున, నా పలుకు = నా మాటను, వినుము = అంగీకరించుము, నీవు = నీవు, రా రిక్క ఱేనిపైన్ = రాజ చంద్రుడగు రామునిమీదకు, పోవుట = వెళ్ళుట, ఎల్ల = పూర్తిగా, వలదు = వద్దు.

**తా :** గొఱ్ఱె కొండతో మార్కొనునట్టు, దోమ ఏనుగుతో పోర యత్నించునట్లు, సమానము కానివానితో శత్రుత్వము. నా మాట విను. నీవు రామునిమీదకు వెళ్ళుట పూర్తిగా వద్దు.

**ఆ.వె.** **ఒక్క కోఁతి సేరి యుక్కున నీదు ప్రో**
**లెల్లఁ గాల్చి మేటి యెఱచి దిండి**
**బంట్లఁ దునిమివైచుపట్ల నీ టాటోటు**
**తనపుఁ బెద్ద లెందుఁ జనిరి చెపుమ?** **24**

ఒక్క కోతి = ఒక్క వానరుడు, చేరి = లంకను చేరి, ఉక్కున = శౌర్యముతో, నీదు ప్రోలు ఎల్లన్ = నీ లంకానగరమునంతను, కాల్చి = తగులపెట్టి, మేటి = శ్రేష్ఠులైన, ఎఱచి తిండి బంట్లన్ = రాక్షస వీరులను, తునిమివైచు పట్లన్ = సంహరించు సమయమున, ఈ టాటోటుతనపున్ = ఈ కపట వర్తనము కలవారైన, పెద్దలు = ఇపుడు సలహాలు చెప్పే పెద్దవారు, ఎందున్ చనిరి చెపుమ = ఎక్కడికి పోయారో చెప్పు.

**తా :** ఒక్క వానరుడు లంకను చేరి శౌర్యముతో నీ లంకానగరమును తగులపెట్టి శ్రేష్ఠులైన రాక్షస వీరులను సంహరించునప్పుడు ఈ కపటవర్తనులు, ఇపుడు సలహాలు చెప్పే ఈ పెద్దలు ఎక్కడికి పోయారో చెప్పు.

**కం** **అనిన విని యతని నేమియు**
**నన నొల్లక సోఁకుటొడయఁ డలుకమెయిం గు**
**ప్పున లేచి కొలువు వీడ్కొని**
**తన లోనగరునకుఁ జనియెఁ దత్తరమెసఁగన్** **25**

అనినన్ = అనగా, విని = అంతయు విని, అతనిన్ = ఆ విభీషణుని, ఏమియున్ అనన్ ఒల్లక = ఏమనడానికి ఇష్టపడక, సోకు ఒడయడు = రాక్షస రాజు, అలుకమెయిం = కోపముతో, గుప్పున లేచి = ఒక్కసారిగా లేచి, కొలువు వీడ్కొని = సభను విడిచిపెట్టి, తన లోనగరునకున్ = తన అంతఃపురములోనికి, తత్తరము ఒసగన్ = తొందరపాటు కనబడగా, చనియెన్ = వెళ్ళిపోయెను.

**తా :** అనగా విని ఆ విభీషణుని ఏమనడానికి ఇష్టపడక రావణుడు కోపముతో ఒక్కసారిగా లేచి సభను విడిచిపెట్టి తన అంతఃపురములోనికి వెళ్ళిపోయెను.

**తే.గీ. అంత నమ్మఱునాఁ డెద సంతసంబు**
**గదుర నన్న కడకుఁ గుంభకర్ణుఁ డెమ్మెఁ**
**జనిన తోడనఁ జని విభీషణుఁడు బత్తి**
**నన్నలకు నిర్వురకు మ్రొక్కియున్న యెడల 26**

అంతన్ = అంతట, ఆ మఱునాడు = ఆ మరుసటి రోజున, ఎదన్ = మనసున, సంతసంబు కదురన్ = సంతోషము నిండగా, అన్న కడకున్ = అన్నగారైన రావణుని దగ్గరకు, కుంభకర్ణుడు, ఎమ్మెన్ చనిన = ప్రేమతో వెళ్ళిన, తోడనన్ చని = వెనుకనే వెళ్ళి, విభీషణుడు, బత్తిన్ = భక్తితో, అన్నలకున్ ఇర్వురకున్ = ఇద్దరు అన్నగార్లకు, మ్రొక్కియున్న ఎడల = నమస్కరించియున్న సమయమున –

**తా :** అంత ఆ మఱుచటి రోజున సంతోషంగా అన్నగారైన రావణుని దగ్గరకు కుంభకర్ణుడు ప్రీతితో వెళ్ళగా, విభీషణుడు వెనుకనే వెళ్ళి భక్తితో ఇద్దరు అన్నగార్లకు సమస్కరించగా –

**తే.గీ. వారిఁ దద్దయు నర్మిలి గారవించి**
**బంతి మోములదొర తన బంతిఁ గుడువఁ**
**బెట్టి వీడెంబులిడి యొక నట్టునందు**
**నెమ్మిఁ గూర్చున్నచోఁ బిన్న తమ్ముఁ డనియె 27**

బంతి మోముల దొర = రావణుడు, వారిన్ = సోదరు లిద్దరిని, తద్దయున్ = మిక్కిలి, అర్మిలి = ప్రేమతో, గారవించి = ఆహ్వానించి, తన బంతిన్ = తన సరసన, కుడువ పెట్టి = భోజనము పెట్టి, వీడెంబులు ఇడి = తాంబూలములిచ్చి, ఒక నట్టునందు = ఒక ప్రదేశమునందు, నెమ్మిన్ = సంతోషముగా, కూర్చున్నచోన్, పిన్న తమ్ముడు అనియె = చిన్న తమ్ముడు (విభీషణుడు) అనెను.

**తా :** రావణుడు సోదరు లిద్దరిని ప్రేమతో గౌరవించి తన సరసన భోజనము పెట్టి తాంబూలము లిచ్చి ఒక ప్రదేశమునందు సంతోషముగా కూర్చుండగా చిన్నతమ్ముడు విభీషణుడు అనెను

**కం. పెద్దవు నీ వెఱుగఁని పని**
**యెద్దియు లే దైన నొక్కఁ డేఁ దెల్పెద నీ**
**విద్దెసఁ గినుక యొనర్పక**
**గ్రద్దన రా వేల్పు ఱేని కలికిన్ విడుమా! 28**

పెద్దవు = మా కందరికి పెద్దవాడవు, నీవు ఎఱుగని పని = నీకు తెలియనట్టి విషయము, ఎద్దియు లేదు = ఏదియును ఉండదు, ఐనన్ = అయినప్పటికినీ, ఒక్కడు = ఒక్క విషయమును, ఏన్ = నేను, తెల్పెద = చెబుతాను, నీవు = నీవు, ఈ దెసన్ = ఈ దిక్కుగా, కినుక ఒనర్పక = కోపము చేయక, గ్రద్దనన్ = శీఘ్రముగా, రా వేల్పు తేని = రాజ శ్రేష్ఠుడగు రాముని, కలికిన్ = స్త్రీని (సీతాదేవిని), విడుమా = విడిచిపెట్టుము.

**తా :** మాకందరికి పెద్దవాడివి. నీకు తెలియని విషయమేదీ లేదు. ఒక్క విషయమును చెబుతాను. నువ్వు ఈ దిక్కుగా కోపం చేయక వెంటనే రాముని భార్యను విడిచిపెట్టుము.

**కం.** **పంతము మెఱయఁగ రాచ ప**
**డంతి న్విడలేక యక్కటా! యొకటఁ గొలం**
**బంతయుఁ జెఱుపఁగఁ జూచెద**
**వెంతయు మేల్గొనము పూన కేమియనఁ జనున్** **29**

పంతము మెఱయగ = మిక్కిలి పౌరుషముతో, రాచ పడంతిన్ = రాచస్త్రీని (సీతను), విడలేక = విడిచిపెట్టక, అక్కటా, ఎంతయు = కొంచెమైనను, మేలు గొనము = మంచి ఆలోచనను, పూనక = ఒప్పుకొనక, ఒకటన్ = మొత్తముగా, కొలంబంతయున్ = వంశమునంతను, చెఱుపగన్ = నాశనముచేయుటకు, చూచెదవు = చూస్తున్నావు, ఏమి అనన్ చనున్ = ఏమనాలో చెప్పు?.

**తా :** పంతం కోసం సీతను విడిచిపెట్టక అయ్యో! కొంచెంకూడా మంచిని ఒప్పుకోక మొత్తంగా వంశాన్నంతని నాశనం చేయడానికి చూస్తున్నావు. ఏమనాలో చెప్పు?

**ఆ.వె.** **తూడు దిండి మావు దొర వంగడంబునఁ**
**బుట్టి ప్రాఁత మిన్కు తిట్ట లరసి**
**పొలసుదిండి కొలపుఁ దలకట్టవై పెఱ**
**తెఱవఁ గొనుట నీకు నెఱతనంబె?** **30**

తూడు తిండి= తామరు తూడులు తిను (హంస), మావు దొర = వాహనముగా కలవాడు బ్రహ్మ యొక్క, వంగడంబునన్ = వంశమున, పుట్టి = జన్మించి, ప్రాత మిన్కు తిట్టలు = వేద రాశులను, అరసి = గ్రహించి, పొలసు తిండి కొలపున్ = రాక్షస వంశమునకు, తలకట్టవై = శిరోభూషణుడవై, పెఱ = ఇతరులయొక్క, తెఱవన్ = స్త్రీని, కొనుట = స్వీకరించుట, నీకు = నీకు, నెఱ తనంబె = నేర్పరితనమౌతుందా?

**తా :** బ్రహ్మవంశమున పుట్టి, వేదరాశులను గ్రహించి, రాక్షస వంశమునకు శిరోభూషణుడవై ఇతరుల స్త్రీని స్వీకరించుట నీకు నేర్పరితనమౌతుందా?

**కం.** **ఈడొదవని కయ్య మిటుల్**
**గూడదు నా విన్నపంబు గురుతుగ వినుమా!**
**కీడు తెఱంగులు మిగులం**
**జూడంబడుచున్న విపుడు సోఁకుడురాయా!** **31**

సోకుడురాయా = రాక్షస రాజా!, ఇటుల్ = ఈ రీతిగా, ఈడు ఒదవని = సమానము కాని, కయ్యము = కలహము, కూడదు = తగదు, నా విన్నపంబు = నాయొక్క విజ్ఞప్తిని, గురుతుగ = జ్ఞాపకముగా, వినుమా = వినవలసినది, కీడు తెఱంగులు = ప్రమాద సూచనలు, మిగులన్ = ఎక్కువగా, ఇపుడు = ఈ సమయమున, చూడంబడుచున్నవి = గోచరించుచున్నవి.

**తా :** రాక్షసరాజా! ఈ రీతిగా సమానము కాని కలహము కూడదు. నా విన్నపము జ్ఞాపకముంచుకో. ప్రమాద సూచనలు ఎక్కువగా ఇపుడు గోచరించుచున్నవి.

**తే.గీ.** **కడల యెకిమీంద్ర గెలిచిన గరువమూని**
**యిపుడు జన్నంపుఁ గాపరి నెదురఁ దివిరె**
**దహహ! అతని లావు గోరంతయైనఁ**
**దెలియరాదుగదా! నీకుఁ దలఁపునందు** **32**

కడల యెకిమీంద్రన్ = దిక్పాలకులను, గెలిచిన, గరువమూని = అహంకారముతో, ఇపుడు, జన్నంపు కాపరిన్ = యజ్ఞ రక్షకుడగు (విష్ణుని) రాముని, ఎదురన్ తివిరెదు = ఎదిరించడానికి ప్రయత్నిస్తున్నావు, అహహ = అయ్యో!, అతని = ఆ రామునియొక్క లావు = బలము, గోరంతయైనన్ = కొంచెమైనను, నీకున్ = నీకు, తలపునందు = బుద్ధియందు, తెలియరాదు కదా = తెలియుటలేదు కదా!,

**తా :** దిక్పాలకులను జయించిన గర్వంతో ఇప్పుడు రాముని ఎదిరించడానికి ప్రయత్నిస్తున్నావు. అయ్యో! ఆ రాముని బలం కొంచెమైనా నీకు తెలియుటలేదుకదా!

**ఆ.వె.** **పుడమి జేనితోడఁ దొడర నీ లావేమి?**
**ఖరునికంటె నల్ల గట్ల సూడు**
**కొడుకుకంటె గండ్ర గొడ్డలి తాలుపు**
**నేలవేల్పుకంటె నెఱయె చెపుమ?** **33**

పుడమి జేనితోడన్ = రామునితో, తొడరన్ = పోరుటకు, నీ లావు ఏమి = నీ శక్తి ఎటువంటిది?, ఖరుని కంటెన్, అల్ల = ఆ, గట్ల సూడు = పర్వతములకు శత్రువు ఇంద్రుడు, కొడుకు కంటె = కొడుకైన వాలి కంటె, గండ్ర గొడ్డలి తాలుపు = గండ్ర గొడ్డలిని ధరించిన, నేల వేల్పు కంటె = బ్రాహ్మణుడగు పరశురాముని కంటె, నెఱయె = గొప్పదా? చెపుమ = చెప్పుము.

**తా :** రామునితో పోరుటకు నీ శక్తి ఎటువంటిది? ఖరునికంటే, ఆ ఇంద్రుడు కొడుకు వాలికంటే, గండ్రగొడ్డలి ధరించిన పరుశురామునికంటే గొప్పదా చెప్పు.

**ఆ.వె.** **వేయునేల? వినుము వేగ నేల పొలంతి**
**పట్టిఁ గాన్కఁ బెట్టి బత్తి మీఱ**
**మ్రొక్కులొసఁగి రాచరిక్కల యెకిమీని**
**మఱుఁగుఁ జేరి చెడక మనుట మేలు** **34**

వేయునేల = వేయి మాటలెందుకు?, వినుము = విను, వేగ = శీఘ్రముగా, నేల పొలంతి పట్టిన్ = భూజాతయగు సీతను, బత్తి మీఱన్ = మిక్కిలి భక్తితో, కాన్క పెట్టి = కానుకగా సమర్పించి, మ్రొక్కులు ఒసగి = నమస్కరించి, రాచరిక్కల యెకిమీని = రాజచంద్రుడగు రాముని, మఱుగున్ చేరి = ఆశ్రయము పొంది, చెడక = నశింపక, మనుట = బ్రతుకుట, మేలు = మంచిది.

**తా :** వేయిమాటలెందులకు? విను, వెంటనే సీతను భక్తితో కానుకగా సమర్పించి నమస్కరించి రాముని ఆశ్రయము పొంది చెడక బ్రతుకుట మంచిది.

**తే.గీ.** **అనినఁ దద్దయుఁ గిన్కతో నవుడు గఱచి**
**యెఱచి మేపరి దొర కన్ను లెఱ్ఱఁ జేసి**
**కొలువు లోపలి వారెల్ల నలఁకుఁ బూని**
**జలదరింపంగ న వ్విభీషణునిఁ జూచి** **35**

అనినన్ = అనగా, తద్దయున్ = మిక్కిలి, కిన్కతోన్ = కోపముతో, అవుడు కరచి = పెదవి కొరుకుచు, ఎఱచి మేపరి దొర = రావణుడు, కన్నులు ఎఱ్ఱన్ చేసి = కన్నులు ఎఱ్ఱగా చేసుకొని, కొలువులోపలివారు ఎల్లన్ = సేవలోనున్న వారందరు, అలకున్ పూని = భీతిని పొంది, జలదరింపంగన్ = వణకగా, ఆ విభీషణుని చూచి,

**తా :** అనగా మిక్కిలి కోపముతో పెదవి కొరుకుచు రావణుడు కన్నులు ఎఱ్ఱగా చేసుకొని కొలువులో నున్నవారందరు భీతిని పొంది వణకగా ఆ విభీషణుని చూచి

**సీ.** **ఓరి! తమ్ముఁడవయ్యు నోడక దొంగచే**
**తికిఁ ద్రాళ్ళొసంగి నెట్టుకొని యింటి**
**వారల మేల్కొల్పు వడువునఁ బగవారిఁ**
**గూడుక నా మ్రోలఁ గొంకులేక**
**మాటికి నొక పేద మానిసి నెన్నుచుఁ**
**జీఁకున కెంతయుఁ జేవ యిడుచుఁ**
**గాని యోజలు దెల్పఁ గడిగితి విపుడు నీ**
**యెదలోని టక్కెల్ల నెఱుఁగఁబడియె**

**తే.గీ.** **అహహ! నీవంటి కూళను నుక్కడఁచి యింక**
**వంగడం బెల్లఁ బాగొనర్పంగఁ జను న**
**టంచు నడిదంబు వెతికి వ్రేయంగఁ జనిన**
**నడ్డుకొని సోఁకు దొరకుఁ బ్రహస్తుఁ డనియె** **36**

ఓరి, తమ్ముడవు అయ్యున్ = తమ్ముడివై యుండి, ఓడక = తగ్గక, దొంగచేతికిన్ = దొంగవాని చేతికి, త్రాళ్ళు ఒసంగి = పాశములనిచ్చి, నెట్టుకొని = పూనుకొని, ఇంటివారలన్ = ఇంటిలోని వారిని, మేల్కొల్పు వడువునన్ = నిద్ర లేపు విధమున, పగవారిన్ = శత్రువులను, కూడుక = జతకలిసి, నా మ్రోలన్ = నా దగ్గర, కొంకు లేక = సందేహించక, మాటికిన్ = మాటిమాటికి,

ఒక పేద మానిసిన్ = ఒక దరిద్రుణ్ణి, ఎన్నుచున్ = పొగడుచు, చీకునకు = బలహీనునికి, ఎంతయున్ = ఎక్కువగా, చేవ ఇడుచున్ = శక్తి నిచ్చుచు, కాని యోజలు తెల్పన్ = తగని ఉపదేశములిచ్చుటకు, కడగితివి = సిద్ధపడితివి, ఇపుడు = ఇప్పుడు, నీ ఎదలోని = నీ మనస్సులోని, టక్కు ఎల్ల = మాయయంతయు, ఎఱుగన్ పడియె = తెలియ వచ్చినది, అహహ = ఆహా!, నీవంటి కూళనున్ = నీవంటి దుర్మార్గుని, ఉక్కు అడచి = చంపి, ఇంక = ఇకమీదట, వంగడంబు ఎల్లన్ = రాక్షస వంశమునంతను, బాగు ఒనర్పంగన్ చనున్ = బాగు చేయుట తగును, అటంచున్ = అనుచు, అడిదంబు పెఱికి = కత్తి దూసి, వ్రేయంగ చనిన = వేటునకు వెళ్ళగా, ప్రహస్తుడు = సైన్యాధిపతియైన ప్రహస్తుడు, అడ్డుకొని = అడ్డుగా నిలబడి, సోకు దొరకున్ = రావణునకు, అనియె = అనెను.

**తా :** ఓరీ! తమ్ముడవయి యుండి సందేహింపక దొంగవాని చేతికి పాశములనిచ్చి ఇంటిలోని వారిని నిద్రలేపు విధముగా శత్రువులతో జతకలసి నా దగ్గర తగ్గక మాటిమాటికి ఒక దరిద్రుణ్ణి పొగడుతూ బలహీనుడికి ఎక్కువగా శక్తినిస్తూ తగని ఉపదేశము లివ్వడానికి సిద్ధపడితివి. ఇప్పుడు నీ మనసులోని మాయ అంతా తెలియవచ్చినది. ఆహా! నీవంటి దుర్మార్గుని చంపి ఇకమీదట రాక్షసవంశమునంతను బాగుచేయుట తగును. అనుచు కత్తి దూసి వేటునకు వెళ్ళగా ప్రహస్తుడు అడ్డుకొని రావణునకు అనెను.

**కం.** **ఒడయఁడ! తోఁబుట్టువు నిటు**
**లడిదముఁ గొని వ్రేయఁ బోయె దకటా! మది నె**
**క్కుడు కినుకఁ బూనుకొని యా**
**అడిఁ జెందుట నీకు మేలె్తెఱంగె? తలంపన్** **37**

ఒడయడ = రాజా!, తోబుట్టువును = సోదరుని, ఇటులు = ఈ విధముగా, అడిదము కొని = కత్తి పట్టుకొని, వ్రేయన్ పోయెదు = వేటు వేయడానికి వెళుతున్నావు, అకటా = అయ్యో!, మదిన్ = మనసునందు, ఎక్కుడు = ఎక్కువ, కినుకన్ పూనుకొని = కోపమును వహించి, ఆఅడి చెందుట = నిందపడుట, తలంపన్ = అలోచింపగా, నీకు మేలు తెఱంగె = నీకది శ్రేయోమార్గమా?

**తా :** రాజా! సోదరుని ఈ విధముగా కత్తి పట్టుకొని వేటువేయడానికి వెళుతున్నావు. అయ్యో! మనసునందు ఎక్కువ కోపమును వహించి నిందపడుట నీకు శ్రేయోమార్గమా?

**తే.గీ.** **ఇతని పలుకులు నీ చెవి కింపుగాక**
**యుండుఁ గాకేమి విననియట్లుండుటొప్పుఁ**
**గాక తెగఁజూడఁ దగునె? యిక్కడిఁది మగఁడు**
**లేని సిరులేల? మురువేల? లిబ్బులేల?** **38**

ఇతని పలుకులు = ఈ విభీషణుని మాటలు, నీ చెవికి = నీకు వినుటకు, ఇంపు కాక యుండున్ = ఇష్టముగా యుండక పోవచ్చును, కాక ఏమి = ఇష్టము కాకపోతే ఏమైంది? వినని అట్ల = వినబడని వానివలె, ఉండుట ఒప్పున్ = ఉండిపోవడం తగును, కాక = అలా కాదని, తెగన్ చూడన్ తగునె = చంపడానికి చూడ్డం తగినదేనా?, ఈ కడిది మగడు = ఈ శ్రేష్ఠుడైన వీరుడు,

లేని = లేనట్టి, సిరులు ఏల = సంపదలు ఎందుకు?, మురువు ఏల = గొప్పతనములు ఎందుకు?, లిబ్బులు ఏల = ధనములు ఎందుకు?.

**తా :** ఈ విభీషణుని మాటలు నీ చెవికి ఇంపు కాకున్న కాక ఏమి? వినబడని వానివలె ఉండిపోవడం తగును కాని చంపడానికి చూడడం తగినదేనా? ఈ వీరుడు లేకున్న ఈ సంపదలెందుకు? ఈ గొప్పతనాలెందుకు? ఈ ధనములెందుకు?

**కం.** **అని మరలించిన రక్కసి**
**మొనగాఁ డొక యింత డెందమున దాలిమిఁ గై**
**కొని యుండెఁ గుంభకర్ణుఁడు**
**దన మనికికిఁ జనియె నిదుర తమి మీఱంగన్** **39**

అని = అని చెప్పి, మరలించిన = వెనుకకు పంపగా, రక్కసి మొనగాడు = రావణుడు, ఒక ఇంత = కొంచెము, డెందమున = మనసున, తాలిమిన్ = సహనమును, కైకొని ఉండెన్ = పొంది ఉండెను, కుంభకర్ణుడు, నిదుర తమి = నిద్రపోవాలనే కోరిక, మీఱంగన్ = అధికము కాగా, తన మనికికిన్ = తన నివాసమునకు, చనియె = వెళ్ళెను.

**తా :** అని చెప్పి వెనుకకు పంపగా రావణుడు కొంచెం మనసులో సహనాన్ని పొంది ఉండిపోయాడు. కుంభకర్ణుడు నిద్రపోవాలనే కోరిక అధికమై తన నివాసమునకు వెళ్ళెను.

**తే.గీ.** **అపుడు సరమ మగం డెద నలుక నిగుడ**
**గట్ల మారుతు పగతునిఁ గాంచి పలికె**
**నహహా! యిపు డన్న! మదిలోన నడలు పూని**
**నీకు మేల్బుద్ధిఁ గఱపుట నేర మొదవె** **40**

అపుడు = అప్పుడు, సరమ మగండు = సరమ భర్తయగు విభీషణుడు, ఎదన్ = మనసున, అలుక నిగుడన్ = కోపము అధికముకాగా, గట్ల మారుతు పగతుని = పర్వతములకు శత్రువగు ఇంద్రుని శత్రువగు రావణుని, కాంచి = చూచి, పలికె = పలికెను, అహహ = ఆహా!, అన్న = అన్నా!, ఇపుడు = ఇప్పుడు, మదిలోన = మనస్సులో, అడలు పూని = భయమును పొంది, నీకు = నీకు, మేలు బుద్ధిన్ = మంచి బుద్ధిని, కఱపుట = బోధించుట, నేరము ఒదవె = నేరమైనది.

**తా :** అపుడు సరమ భర్తయగు విభీషణుడు మనసులో కోపాన్ని పెంచుకొని రావణుని చూచి పలికెను. ఆహహ! అన్నా! ఇప్పుడు మనసులో భయాన్ని పొంది నీకు మంచి బుద్ధిని బోధించుట నేరమైనది.

**తే.గీ.** **కనికరంబున నీ చేటు గాంచ నోడి**
**తొడరి మేల్బుద్ధిఁ జెప్పినఁ ద్రుంపఁ జూచె**
**దగ్గిఁ బడఁ బోవు పొట్టియ నమరఁ బట్టి**
**మనుపఁ బూన్వానిఁ గుట్టక మానఁ గలదె?** **41**

కనికరంబున = దయతో, నీ చేటున్ = నీ నాశనమును, కాంచన్ ఓడి = చూడలేక, తొడరి = పూనుకొని, మేల్బుద్ధిన్ = మంచి బుద్ధిని, చెప్పినన్ = చెప్పగా, త్రుంపన్ చూచెదు = చంపడానికి ప్రయత్నించితివి, అగ్గిన్ = అగ్నిలో, పడన్ పోవు = పడబోవుచున్న, పొట్టియన్ = తేలును, అమరన్ = చక్కగా, పట్టి = పట్టుకొని, మనుపన్ = రక్షింపగా, పూను వానిన్ = పూనుకొన్న వానిని, కుట్టక, మానన్ కలదె = మానకుండా ఉండగలదా?

**తా :** కరుణతో నీ నాశము చూడలేక మంచిబుద్ధిని చెప్పగా చంపడానికి ప్రయత్నించావు. అగ్నిలో పడుచున్న తేలును పట్టుకొని రక్షిస్తే అది పట్టుకొన్నవానిని కుట్టక మానుతుందా?

**కం.** **మల ద్రిమ్మరి గమితో రా**
**నెల సంద్రము దాఁటివచ్చి నీ కుత్తుక చా**
**ల్నెలపు నపుడైన నెదలోఁ**
**దలఁపుము నామాట నల్లద్రావుడు తేఁడా!** **42**

నల్లద్రావుడు తేడా = రక్తం త్రాగే రాక్షసులకు రాజా!, మల త్రిమ్మరి గమితోన్ = కొండలలో తిరిగే కోతుల సమూహముతో, రా నెల = రాజ చంద్రుడు రాముడు, సంద్రము దాటివచ్చి = సముద్రమును దాటివచ్చి, నీ కుత్తుక చాలు = నీ కంఠముల వరుసను, నెలపునపుడైన = నరకునపుడైన, ఎదలోన్ = మనసులో, నా మాటన్ = నా మాటను, తలపుము = తలచుకొనుము.

**తా :** రాక్షస రాజా! వానర సమూహంతో ఆ రామచంద్రుడు సముద్రము దాటివచ్చి నీ కుత్తుకలను నరకునపుడైన మనసులో నా మాటను తలచుకొనుము.

**కం.** **గట్టులవలె నీ కొడుకులుఁ**
**జుట్టలు మొనగాండ్రు రాచచుక్కల దొర పె**
**న్దట్టపు టలుగులఁ బెనకువ**
**పట్టునఁ బడునప్పుడైనఁ బరికింపు మెదన్** **43**

పెనకువ పట్టునన్ = యుద్ధరంగమునందు, రాచ చుక్కల దొర = రాజ చంద్రుడగు రాముని, పెను = గట్టివియైన, దట్టపు = సాంద్రమైన, అలుగులన్ = బాణములచేత, నీ కొడుకులున్, చుట్టలు = బంధువులును, మొనగాండ్రు = యోధులు, గట్టులవలె = కొండలవలె, పడునప్పుడు ఐనన్ = రాలిపోయేటప్పుడైనను, ఎదన్ = మనసున, పరికింపుము = తలచుకొనుము.

**తా :** యుద్ధరంగమునందు రాముని బాణములచేత నీ కొడుకులు, బంధువులు, యోధులు కొండలవలె రాలిపోయేటప్పుడైనా మనసున తలచుకొనుము.

**తే.గీ.** **మేర మీటిన బల్కొమ్మ మెకపు బంట్లు**
**మూఁగి నీ పూవుఁబోండ్ల క్రొమ్ముడులు వట్టి**
**యక్కజంబుగ నీడ్చు చున్నప్పుడైన**
**నీవు నా బుద్ధిఁ దలఁపున నిలుపుకొమ్ము** **44**

మేర మీఱిన = హద్దు మీరిన, బల్ కొమ్మ మెకపు బంట్లు = గొప్పవైన వానరములు, మూగి = చుట్టుముట్టి, నీ పూవుబోండ్ల క్రొమ్ముడులు పట్టి = నీ భార్యల కొప్పులను పట్టుకొని, అక్కజంబుగన్ = ఆశ్చర్యపడునట్లుగా, ఈడ్చుచు ఉన్నప్పుడు ఐన, నీవు = నీవు, నా బుద్ధిన్ = నా హితమును, తలపున = నీ మనసున, నిలుపుకొమ్ము = ఉంచుకొనుము.

**తా :** లెక్కలేని వానరములు చుట్టుముట్టి నీ భార్యల కొప్పులను పట్టుకొని అక్కజముగా ఈడ్చుకు వస్తున్నప్పుడైనా నీవు నా హితమును నీ మనసున నిలుపుకొమ్ము.

**తే.గీ.** **పుడమి పుట్టువుఁ గ్రమ్మర విడువలేక**
**మసలెదవుగాని యాపె రక్కసి కొలంబు**
**మ్రింగవచ్చిన మాఱట మిత్తియనుచు**
**నరయనేరవు నిన్నేమి యందునింక? 45**

పుడమి పుట్టువున్ = సీతాదేవిని, క్రమ్మరన్ = మళ్ళీ, విడువలేక, మసలెదవు కాని = విచారిస్తున్నావు కాని, ఆపె = ఆమె, రక్కసి కొలంబు = రాక్షస వంశమును, మ్రింగవచ్చిన = మింగుటకు వచ్చిన, మాఱట మిత్తి అనుచు = మారురూపముననున్న మృత్యువనుచు, అరయన్ ఏరవు = తెలిసికొన లేకున్నావు, ఇంక = ఇటువంటి, నిన్ను, ఏమి అందును?

**తా :** సీతాదేవిని విడిచిపెట్టలేక విచారిస్తున్నావు కాని ఆమె రాక్షస వంశమును మ్రింగ వచ్చిన మాఱట మిత్తియని తెలిసికొనలేకున్నావు. ఇటువంటి నిన్ను ఏమందును?

**సీ.** **అనుటయు నేయి సోఁకిన గాడ్పు చెలికాని**
**మాడ్కి నెంతేనియు మండిపడుచు**
**లేచి జేజేల సూ డేచిన క్రొవ్వునఁ**
**గెరలుచు నతని నుంకించి తాఁచు**
**టయు సొమ్మసిలి యబ్బలియుఁడు వే తెప్పిఱి**
**వినరాని నుడువులు వేనవేలు**
**గొదుగక యాడినఁ గొఱకొఱతోఁ గుండ**
**వీనుల బల్త్రొలి వేల్పు మిన్న**

**తే.గీ.** **యన్న దన మన్కిపట్టున కరిగె న వ్వి**
**భీషణుఁడు తల్లికడకేగి బిట్టు వగచి**
**యన్న చేసిన పనియెల్ల విన్నవించి**
**యాపె యానతిఁ గైకొని యపుడె కదలి 46**

అనుటయున్ = అనగానే, నేయి సోకిన = నేయి తగలగానే, గాడ్పు చెలికాని మాడ్కిన్ = గాలి చెలికాడగు అగ్ని వలె, ఎంతేనియు = మిక్కిలి, మండిపడుచు = కోపముతో రెచ్చిపోతూ, లేచి, జేజేల సూడు = దేవతల శత్రువగు రావణుడు, ఏచిన క్రొవ్వునన్ = అతిశయించిన మదముతో, కెరలుచు = విజృంభించుచు, అతనిన్ = ఆ విభీషణుని, ఉంకించి = ఎగిరి, తాచుటయున్ =

తన్నగా, ఆ బలియుడు = ఆ బలవంతుడైన విభీషణుడు, సొమ్మసిలి = స్పృహకోల్పోయి, వే = వెంటనే, తెప్పిలి = తేరుకొని, వినరాని నుడువులు = వినరాని మాటలు, వేనవేలు = వేలకొలది, కొదుగక = పెడమొగంతో, ఆడినన్ = పలుకగా, కుండవీనుల = కుంభములవంటి చెవులుకల, బల్ = బలవంతుడగు, తొలివేల్పు మిన్న = రాక్షసులలో శ్రేష్ఠుడగు కుంభకర్ణుని, అన్న = అన్నయగు రావణుడు, కొఱకొఱతోన్ = కోపముతో, తన మన్కి పట్టునకు = తన నివాసమునకు, అరిగెను = వెళ్ళెను, ఆ విభీషణుడు, తల్లికడకు ఏగి = తమ తల్లియైన కైకసి దగ్గరకు వెళ్ళి, బిట్టు వగచి = ఎక్కువగా దుఃఖించి, అన్న చేసిన పని ఎల్లన్ = రావణుడు అవమానించిన విధమునంతను, విన్నవించి = వివరించి, ఆపె ఆనతి గైకొని = ఆమె అనుమతి తీసుకొని, అపుడె = వెంటనే, కదలి = అచటినుండి బయలుదేరి,

**తా :** అనగానే నేయి తగిలిన అగ్నివలె మిక్కిలి మండిపడుతూ లేచి రావణుడు అతిశయించిన మదముతో ఆ విభీషణుని ఎగిరి తన్నగా, ఆ విభీషణుడు సొమ్మసిలి వెంటనే తేరుకొని వినరాని మాటలు వేనవేలు పలుకగా, రావణుడు కోపముతో తన నివాసమునకు వెళ్ళెను. ఆ విభీషణుడు తమ తల్లి కైకసి దగ్గరకు వెళ్ళి దుఃఖముతో రావణుడు అవమానించిన విధమును వివరించి ఆమె అనుమతితో వెంటనే కదలి.

**కం.** **నలువురు బంట్లును దానును**
**వలనుగఁ జని వేఁడి వెలుఁగు వంగడపుం జా**
**బిలిఁ గాంచి దవ్వులనె సా**
**గిలఁబడి యిట్లనియె మోడ్పుఁ గేల్గవతోడన్** **47**

నలువురు బంట్లును = నలుగురు వీరులును, తానును = తానును (విభీషణుడును), వలనుగన్ = చక్కగా, చని = వెళ్ళి, వేడి వెలుగు వంగడపున్ జాబిలిన్ = సూర్యవంశ ప్రకాశమానుడగు రాముని, కాంచి = చూచి, దవ్వులనె = దూరమునుండియే, మోడ్పున్ కేలు గవ తోడన్ = జోడించిన రెండు చేతులతో, సాగిల పడి = సాష్టాంగపడి, ఇట్లు అనియెన్ = ఇట్లు పలికెను.

**తా :** నలుగురు వీరులు, తాను చక్కగా వెళ్ళి రాముని చూచి దూరమునుండియే జోడించిన రెండు చేతులతో సాష్టాంగపడి ఇట్లు పలికెను.

**సీ.** **జగముల యెకిమీఁడ! జతలేని మొనగాఁడ!**
**కఱకు సోఁకుల సూడ! కావు కావు**
**జోగుల వెలియావ! సోయగంబుల ప్రోవ!**
**కనికరంబుల తావ! కావు కావు**
**మేటి వేల్పుల వేల్ప! మేల్గొనంబుల చాల్ప!**
**కడిఁది సింగిణి తాల్ప! కావు కావు**
**ప్రోడల తలకట్ట! పున్నియంబుల కొట్ట!**
**కయ్యంపుఁ బెను దిట్ట! కావు కావు**

**తే.గీ.** **వరుస తేరుల మన్నీని వంగడంబుఁ**
**గరము వెలయింపఁదగు నయ్య! కావు కావు**
**గట్టు ద్రిమ్మరి ఱేనిఁ జేపట్టి గొడవ**
**గములు వాపిన బలియుడ! కావు కావు** **48**

జగముల ఎకిమీడ = లోకాధిపతీ!, జతలేని మొనగాడ = సరిలేని వీరుడా!, కఱకు సోకుల సూడ = దుష్ట రాక్షస విరోధీ!, కావు కావు = రక్షించు రక్షించు, జోగుల వెలియావ = యోగిజనుల ఆరాధ్యుడా!, సోయగంబుల ప్రోవ = అందాల రాశీ!, కనికరంబుల తావ = కరుణా నిలయా!, మేటి వేల్పుల వేల్ప = దేవతా శ్రేష్ఠుడా!, మేల గొనంబుల చాల్ప = సుగుణాల పంక్తీ!, కడిది = గొప్పదియైన, సింగిణి తాల్ప = ధనుర్ధారీ! ప్రోడల తలకట్ట = ప్రౌఢ శేఖరా!, పున్నియంబుల కొట్ట = పుణ్యాశ్రయా!, కయ్యంపున్ పెను దిట్ట = రణ విశారదా!, వరుస తేరుల మన్నీని = దశరథ మహారాజు, వంగడంబున్ = వంశమును, కరము = మిక్కిలి, వెలయింప తగున్ = ప్రకాశింపచేయ తగిన, అయ్య = పూజ్యుడా!, గట్టు త్రిమ్మరి ఱేనిన్ = సుగ్రీవుని, చేపట్టి = దగ్గర చేర్చుకొని, గొడవ గములు = సమస్యలన్నిటిని, వాపిన = పోగొట్టిన, బలియుడ = బలవంతుడా!, కావు కావు = కాపాడు కాపాడు.

**తా :** లోకాధిపతీ! సరిలేని వీరుడా! దుష్ట రాక్షస విరోధీ! రక్షించు. యోగిజనారాధ్యా! అందాలరాశీ! కరుణానిలయా! రక్షించు. దేవతాశ్రేష్ఠుడా! సుగుణాల పంక్తీ! గొప్ప ధనుర్ధారీ! రక్షించు. ప్రౌఢ శేఖరా! పుణ్యాశ్రయా! రణ విశారదా! రక్షించు. దశరథ వంశ ప్రకాశమాన పూజ్యుడా! రక్షించు. సుగ్రీవుని చేపట్టి సమస్యల పోగొట్టిన వీరుడా! రక్షించు.

**కం.** **కావరపు రక్కసుఁడు చెడు**
**ద్రోవం బడఁ దన్ని వెడలఁ ద్రోయించుటచే**
**నీవే దరియని వచ్చితిఁ**
**గావుము నన్నిపుడు రాచ కలువల ఱేఁడా!** **49**

రాచ కలువలఱేడా = రాజ చంద్రమా!, కావరపు రక్కసుడు = పొగరెక్కిన రాక్షసుడు (రావణుడు), చెడు త్రోవన్ పడన్ = చెడు మార్గములో పడినవాడై, తన్ని = నన్ను తన్ని, వెడలన్ = బయటకు పోవునట్లు , త్రోయించుటచే = గెంటివేయుటచే, నీవే దరియని = నీవే దిక్కని, వచ్చితిన్, నన్ను = నన్ను, ఇపుడు = ఈ సమయమున, కావుము = రక్షింపుము.

**తా :** రాజచంద్రమా! పొగరెక్కిన రాక్షసుడు చెడుమార్గములో పడి నన్ను తన్ని బయటకు గెంటి వేయుటచే నీవే దిక్కని వచ్చితిని. నన్ను ఈ సమయంలో రక్షించు.

**ఆ.వె.** **అనుచు వేడుకొనిన విని రాగవుఁడు ప్రొద్దు**
**చూలి నెమ్మొగంబు చూచి పలికెఁ**
**గావు కావుమంచు నేవురు రక్కసు**
**లుఱక చేరవచ్చు చున్నవారు** **50**

అనుచున్ = అని పలుకుచూ, వేడుకొనిన = ప్రార్థింపగా, విని రాగవుడు, ప్రొద్దు చూలి = సుగ్రీవుని, నెఱి మొగము = అందమైన ముఖమును, చూచి పలికెన్, కావు కావుము అనుచు = రక్షించుమనుచు, ఏవురు రక్కసులు = ఐదుగురు రాక్షసులు, ఉఱక = పిలువకనే, చేరవచ్చుచున్నవారు = మనలో చేరుటకు వచ్చుచున్నారు.

**తా :** అని ప్రార్థింపగా విని రాముడు సుగ్రీవుని చూచి 'రక్షించుమనుచు ఐదుగురు రాక్షసులు పిలువకనే మనలో చేరుటకు వచ్చుచున్నారు.

**ఆ.వె.** **వారి చందమెల్ల నారసి రాఁదగు**
**వారిఁ బనుపు మిపుడె కోరి మఱువు**
**సేరుకొనెడి వారిఁ జేపట్టఁజనుగదా!**
**వెర వెఱుంగు మేటి దొరల కెల్ల** **51**

వారి = ఆ వచ్చినవారి, చందము ఎల్లన్ = విషయమునంతను, ఆరసి రాన్ = తెలిసికొని వచ్చుటకు, తగువారిన్ = సమర్థులను, ఇపుడె = వెంటనే, పనుపుము = పంపించుము, వెరవు = పద్ధతి, ఎఱుంగు = తెలిసిన, మేటి దొరలకు ఎల్ల = రాజ శ్రేష్ఠుల కెల్లను, కోరి = తమకు తాముగా, మఱువు సేరుకొనెడివారిన్ = శరణుకోరి వచ్చినవారిని, చేపట్టన్ = స్వీకరించుట, చనుకదా = తగునుకదా!

**తా :** ఆ వచ్చినవారి విషయం తెలిసికొనుటకు సమర్థులను ఇపుడే పంపించుము. పద్ధతి ప్రకారము రాజశ్రేష్ఠుల కందరకు తాముగా శరణుకోరి వచ్చినవారిని చేపట్టుతగునుకదా!'

**కం.** **అనవుడు కోఁతుల దొర చ**
**య్యన కొందఱు బంట్ల నటులె యనిపిన వారల్**
**చని రక్కసి రాయని త**
**మ్మునిఁ బొడఁగని మాటలాడి మురువు దలిర్పన్** **52**

అనవుడు = అని రాముడు పలుకగా, కోతుల దొర = సుగ్రీవుడు, చయ్యన = శీఘ్రముగా, కొందఱు బంట్లన్ = కొందరు వీరులను, అటులె = ఆ రీతిగానే, అనిపిన = పంపిన, వారల్ = ఆ పంపినవారు, చని = వెళ్ళి, రక్కసి రాయని తమ్మునిన్ = రావణుని తమ్ముడగు విభీషణుని, పొడగని = చేరి, మాటలాడి = సంభాషించి, మురువు తలిర్పన్ = సంతోషము ఏర్పడగా –

**తా :** అని రాముడు పలుకగా సుగ్రీవుడు వెంటనే కొందరు వీరులను ఆ రీతిగానే పంపిన వారు వెళ్ళి విభీషణుని చేరి మాటలాడి సంతోషము ఏర్పడగా –

**ఉ.** **క్రమ్మఱ వచ్చి యత్తెఱఁగుఁ గల్వల దాయ యనుంగుఁ బట్టితో**
**నిమ్ముగ విన్నవింప నతఁడెత్తుక ముందట నిల్చి కేలుఁ గెం**
**దమ్ముల దోయిలించుకొని తద్దయు నేర్పునఁ బల్కె రాచ మొ**
**త్తమ్ముల మిన్న! నీ విపుడు దప్పక నా నుడు లాలకింపుమా!** **53**

క్రమ్మఱ వచ్చి = తిరిగి వచ్చి, ఆ తెఱగున్ = ఆ విషయమును, కల్వల దాయ = కలువలకు శత్రువు (సూర్యుడు), అనుంగు పట్టితోన్ = ప్రియ పుత్రుడైన సుగ్రీవునితో, ఇమ్ముగ = చక్కగా,

విన్నవింపన్ = తెలియపరచగా, అతడు = ఆ సుగ్రీవుడు, ఎత్తుక = వారిని తీసుకొని, ముందట నిల్చి = ఆ రాముని ముందర నిలిచి, కేలు కెంపు తమ్ములన్ = ఎఱ్ఱని పద్మములవంటి చేతులను, దోయిలించుకొని = జోడించుకొని, తద్దయున్ = మిక్కిలి, నేర్పునన్ = నిపుణతతో, పల్కెన్ = పలికెను, రాచమొత్తముల మిన్న = రాజులందరిలో శ్రేష్ఠుడా!, ఇపుడు = ఇప్పుడు, నీవు = నీవు, తప్పక = నిశ్చయముగా, నా నుడులు = నా మాటలు, ఆలకింపుమా = వినుమా!.

**తా :** తిరిగి వచ్చి ఆ విషయమును సుగ్రీవునితో చక్కగా విన్నవించగా ఆ సుగ్రీవుడు వారిని తీసుకొని రాముని ముందు నిలిచి చేతులు జోడించి మిక్కిలి నేర్పుగా 'రాజశ్రేష్ఠుడా! ఇప్పుడు నీవు నిశ్చమయుగా నా మాటలు విను.

**తే.గీ.** **చాల్పు మోముల చెడుగు తొల్వేల్పు తేని**
**తమ్ముఁడు విభీషణుండనఁ దనరు నాతఁ**
**డన్నచే నొప్పివడి యిందు నిన్నుఁ గొలువఁ**
**గోరి యరుదెంచి నాఁడఁట గొంకులేక** **54**

చాల్పుమోముల = పంక్తి ముఖములుకల, చెడుగు = దుర్మార్గుడయిన, తొలివేల్పు తేని = రావణుని, తమ్ముడు = తమ్ముడైన, విభీషణుడు అన = విభీషణుడని, తనరున్ ఆతడు = ఒప్పువాడు, అన్నచే = తన అన్నగారిచే, నొప్పి పడి = బాధను పొంది, ఇందు = ఇక్కడ, నిన్నున్ కొలువన్ = నిన్ను సేవించుటకు, కోరి = ఇష్టపడి, కొంకులేక = సంకోచము లేక, అరుదెంచినాడు అట = వచ్చినాడట!

**తా :** రావణుని తమ్ముడు విభీషణుడు తన అన్నగారిచే నొప్పి పడి ఇక్కడ నిన్ను సేవించుటకు సంకోచము లేక వచ్చినాడట.

**తే.గీ.** **దాయ తోఁబుట్టువఁట వేల్పు దాయ కొలపుఁ**
**బెద్దయఁట మెయిదాలుపు పిండువులను**
**మెక్కు టక్కరియఁట వాఁడు మిమ్ముఁ గొలువ**
**వచ్చు తెఱఁగేమొ పరికింప వలయుజుండి!** **55**

దాయ తోబుట్టువట = శత్రువు తమ్ముడట, వేల్పు దాయ కొలపు = దేవతలకు శత్రువులైన రాక్షసవంశపు, పెద్దయట = పెద్దమనిషట, మెయి తాలుపు పిండువులను = శరీరధారులగు మానవ వానరాదులను, మెక్కు = తిను, టక్కరి అట = మోసగాడట, వాడు = అట్టివాడు, మిమ్మున్ = మిమ్ములను, గొలువ = సేవింపగా, వచ్చు తెఱగు ఏమొ = వచ్చిన పద్ధతి ఏదియో, పరికింప వలయుజుండి = పరిశీలించవలసినదే సుమా!

**తా :** శత్రువు తమ్ముడట, రాక్షస వంశ పెద్దమనిషట, మానవ, వానరాదులను తిను టక్కరియట, అట్టివాడు మిమ్ము సేవింపగా వచ్చిన పద్ధతి ఏదో పరికించాలిసుమా!'

**ఉ.** **అనునెడఁ గోన ద్రిమ్మరి గయాళులు గొందఱు డాసి పల్కి రో**
**గొనముల ప్రోకలార! యదిగోఁ! బగ చేతికి వచ్చినప్పుడే**
**పని సవరింపఁ జెల్లుఁ బెఱ పల్కు లిఁకేటికిఁ? బంపు వెట్టుఁ డ**
**చ్చెనటులఁ బట్టి కీటడచి చెచ్చెర వచ్చెద ముక్కు మీఱఁగన్** **56**

అనున్ ఎడన్ = అను సమయమున, కోన త్రిమ్మరి గయాళులు = వానర వీరులు, కొందఱు = కొంతమంది, డాసి = సమీపించి, పల్కిరి, ఓ గొనముల ప్రోకలార = ఓ సద్గుణముల రాసులారా!, అదిగో = అడుగో!, పగ = శత్రువు, చేతికి వచ్చినప్పుడే = చేతికి చిక్కినప్పుడే, పని సవరింపన్ చెల్లున్ = పని పూర్తిచేయుట తగినది, పెఱ పల్కులు ఇక ఏటికి = వేరు మాటలు ఇంక ఎందుకు?, పంపు పెట్టుడ = ఆజ్ఞాపించండి, ఉక్కు మీఱగన్ = మిక్కిలి శౌర్యముతో, ఆ చెనటులన్ = ఆ దుర్మార్గులను, పట్టి = పట్టుకొని, కీటు అడచి = దౌష్ట్యమును అణచివేసి, చెచ్చెర = శీఘ్రముగా, వచ్చెదము = తిరిగి వచ్చెదము.

**తా :** అనగా వానరవీరులు కొందరు 'ఓ సద్గుణరాసులారా! అడుగో శత్రువు. చేతికి చిక్కినప్పుడే పని పూర్తిచేసుకోవాలి. వేరుమాటలెందుకు? ఆజ్ఞాపించండి. శౌర్యముతో ఆ దుర్మార్గులను పట్టుకొని దౌష్ట్యమును అణచివేసి వెంటనే తిరిగివచ్చెదము.

**ఉ.** **కల్లల కెల్ల నిక్క లనఁగాఁదగు నంజుడు దిండి కూళ లి**
**ట్లెల్లఁ దెఱంగులం దవిలి యేడ్తెరఁ ద్రిమ్మరుచుండు వాండ్రు మీ**
**రుల్లమునందు నమ్మికొని యూరక చెల్మి యొనర్పఁ జూచుటల్**
**సెల్లదటన్న రా కొదమ సింగము వారలఁ జూచి యిట్లనున్** **57**

కల్లలకు = అసత్యములకు, ఎల్లన్ = అన్నిటికిని, ఇక్కలు = స్థానములు, అనగా తగు = అనుటకు తగిన, నంజుడు తిండి = మాంసాహారులగు కూళలు = రాక్షస దుర్మార్గులు, ఇట్లు = ఈ ప్రకారముగా, ఎల్లన్ తెఱంగులన్ = అన్ని మార్గములందును, తవిలి = పూనుకొని, ఏడ్తెరన్ = విజృంభణముగా, త్రిమ్మరుచుండువాండ్రు = సంచరించుచుందురు, మీరు, ఉల్లమునందు = మనసునందు, నమ్మికొని = విశ్వసించి, ఊరక = వ్యర్థముగా, చెల్మి ఒనర్పన్ = స్నేహము చేయుటకు, చూచుటల్ = ప్రయత్నించడం, చెల్లదు అట అన్న = కూడదని అనగా, రా కొదమ సింగము = ఆ రాజసింహమగు రామచంద్రుడు, వారలన్ చూచి = వారిని చూచి, ఇట్లు అనున్ = ఈ విధముగా పలికెను.

**తా :** కల్లలన్నిటికి స్థానమైన రాక్షస దుర్మార్గులు ఈ విధంగా అన్ని మార్గాల్లోను పూనుకొని సంచరిస్తూంటారు. మీరు విశ్వసించి వ్యర్థంగా స్నేహం చేయడానికి ప్రయత్నించడం చెల్లదు' అనగా రామచంద్రుడు వారిని చూచి ఈ రీతిగా పలికెను.

**ఆ.వె.** **వినుఁడు కొమ్మ మెకపు మొనగాఁడులార! లో**
**నళుకుఁ బూని కావు మనుచు మఱువు**
**దూఱినట్టి వారిఁ ద్రోచిపుచ్చుట నేల**
**తాల్పు జాబిలులకుఁ దగదు సుండి** **58**

కొమ్మ మెకపు మొనగాడులార = ఓ వానర వీరులారా!, వినుడు = వినండి, లోన్ అళుకున్ పూని = మనసులో భయపడి, కావుము అనుచు = రక్షించమని, మఱువు దూరినట్టి వారిన్ = శరణు కోరిన వారిని, త్రోచిపుచ్చుట = తిరస్కరించుట, నేలతాల్పు జాబిలులకు = రాజ చంద్రులకు, తగదు సుండి = తగదు సుమా!

**తా :** ఓ వానరవీరులారా! వినండి. మనసులో భయపడి రక్షించమని శరణుకోరిన వారిని తిరస్కరించడం రాజశ్రేష్ఠులకు తగినది కాదు.

**తే.గీ.** **వేలుపుల గొంగ సైదోఁడు వెనుక దూఱ**
**కావుమని వేడు కొనెడిచోఁ గడఁక నితని**
**మనుపు టక్కూళ పొలదిండి మన్నెగాని**
**పెనుపుఁ జేవయుఁ దేజుఁ గైకొనుట సుండి!** **59**

వేలుపుల గొంగ = దేవతల విరోధియగు రావణునియొక్క, సైదోడు = తమ్ముడు, వెనుక దూఱ = మన పక్షమున ప్రవేశించుటకు, కావుము అని = రక్షింపుమని, వేడు కొనెడిచోన్ = ప్రార్థింపగా, కడకన్ = పూనుకొని, ఇతని = ఈ విభీషణుని, మనుపుట = స్వీకరించుట, ఆ కూళ = ఆ నీచుడైన, పొలదిండి మన్నెగాని = రాక్షస రాజగు రావణుని, పెనుపున్ = ఆధిక్యమును, చేవయున్ = బలమును, తేజున్ = పరాక్రమమును, కైకొనుట సుండి = స్వీకరించుటే సుమా!

**తా :** రావణుని తమ్ముడు మన పక్షమున చేరుటకు రక్షింపుమని ప్రార్థింపగా పూనుకొని ఇతనిని స్వీకరించుట ఆ నీచుడైన రావణుని బలమును స్వీకరించుటేకదా!

**కం.** **కావున మీరా నెత్తురు**
**ద్రావుడు వంగడపుఁ గడలి తామరదాయన్**
**వేవేగఁ దెండు నేఁడ**
**ద్దీవికి దొరఁ జేసియునుతుఁ దిర మొప్పారన్** **60**

కావున = కాబట్టి, మీరు, ఆ నెత్తురు ద్రావుడు వంగడపున్ = ఆ రాక్షస వంశమనెడి, కడలి = సముద్రమునకు, తామర దాయన్ = పద్మములకు విరోధిని (చంద్రుని), వేవేగన్ = శీఘ్రముగా, తెండు = తీసుకొనిరండి, నేడ = ఈ రోజే, తిరమొప్పారాన్ = స్థిరత్వమునందు నట్లుగా, ఆ దీవికి = ఆ లంకకు, దొరన్ చేసి ఉనుతున్ = ప్రభువును చేసి ఉంచుతాను.

**తా :** కాబట్టి మీరు ఆ రాక్షస వంశమనెడు సంద్రమునకు చంద్రుడైనవానిని వెంటనే తీసుకొని రండి. ఈరోజే శాశ్వతముగా లంకకు రాజుసు చేసి ఉంచుతాను.

**కం.** **అనుటయు మలద్రిమ్మరి రా**
**యని పంపున బంట్లు కొందఱర్మిలిఁ జని గొ**
**బ్బున రక్కసి మిన్నం దో**
**డ్కొని తెచ్చిన వచ్చి యాతఁడు గడుం బత్తిన్** **61**

అనుటయు = అనగానే, మల ద్రిమ్మరి రాయని = కోతుల నాయకుడగు సుగ్రీవుని, పంపున = ఆజ్ఞతో, బంట్లు కొందరు = కొంతమంది సేవకులు, అర్మిలిన్ చని = ప్రీతితో వెళ్ళి, గొబ్బునన్ = శీఘ్రముగా, రక్కసి మిన్నన్ = రాక్షస శ్రేష్ఠుని, తోడ్కొని తెచ్చిన = తీసుకొని రాగా, అతడు = ఆ విభీషణుడు, వచ్చి, కడున్ బత్తిన్ = మిక్కిలి భక్తితో –

**తా :** అనగానే సుగ్రీవుని పంపున సేవకులు వెళ్ళి వెంటనే రాక్షస శ్రేష్ఠుని తీసుకొనిరాగా ఆ విభీషణుడు వచ్చి మిక్కిలి భక్తితో –

**తే.గీ.** **రాచ ముక్కంటి యడుగుల వ్రాలి పెక్కు**
**చందములఁ గొనియాడి యా సామి కిట్టు**
**లనియె నో వేల్ప! నలువ లోనైన వేల్పు**
**దొరలు గనలేని నీ హజ్జదోయిఁ గంటి** **62**

రాచ ముక్కంటి = రాజ పరమేశ్వరుని, అడుగుల వ్రాలి = పాదములపై పడి, పెక్కు చందములన్ = అనేక విధములుగా, కొనియాడి = స్తుతించి, ఆ సామికి = ఆ రామునికి, ఇట్టులు అనియెను, ఓ వేల్ప = ఓ దైవమా!, నలువ లోనైన = బ్రహ్మ మొదలైన, వేల్పు దొరలు = దేవతా శ్రేష్ఠులు, కనలేని = చూడలేని, నీ హజ్జదోయి = నీ పాదముల జంటను, కంటి = చూచితిని.

**తా :** రాజపరమేశ్వరుని పాదములపై పడి పలు విధములుగా స్తుతించి ఆ రామునితో 'ఓ దైవమా! బ్రహ్మ మొదలైన వేల్పు దొరలు చూడలేని నీ పాదములు కంటిని.

**కం.** **తులువలు కొందఱు ని న్మది**
**దలఁపరు నెఱ దంట లెల్లఁ దమి నీ యడుగుం**
**గలమునఁ బుట్టువు మున్నీ**
**రలరఁగ దరి ముట్టఁ గడతు రన్నిటి ఱేఁడా!** **63**

ఱేడా = ప్రభూ!, తులువలు = మూర్ఖులు, కొందఱు = కొంతమంది, నిను మది తలపరు = నిన్ను మనస్సులో భావింపరు, నెఱ = చక్కని, దంటలు ఎల్లన్ = సమర్థులందరును, తమి = కోరికతో, నీ అడుగుం కలమునన్ = నీ పాదమనే ఓడతో, పుట్టువు మున్నీరు = ఈ పుట్టుక (మానవ జన్మము) అనే సముద్రమును, అలరగ = సులభముగా, దరిముట్ట = ఒడ్డుకు చేరి, అన్నిటిన్ = సమస్తమును, కడతురు = దాటుదురు.

**తా :** ప్రభూ! మూర్ఖులు కొంతమంది నిన్ను మనసులో భావింపరు. సమర్థులందరూ కోరికతో నీ పాదమనే ఓడతో ఈ పుట్టుక అనే సముద్రమును సులభముగా ఒడ్డుకుచేరి సమస్తము దాటుదురు.

**వృషభగతి రగడ :**

**సిరియుఁ బంటవలంతియుం దమిఁ జేరి చేరిక నడుగు లొత్తఁగఁ**
**బొరిఁ బొరి న్వలి ముద్దుమోమునఁ బూప నవ్వులు మొలక లెత్తఁగఁ**
**జెలువెసంగఁ బయిం గడాని పసిండి దుప్పటి తళుకు లీనఁగఁ**
**దలను రతనపు బొమిడికము తొగదాయతో బలువాదుఁ బూనఁగ**
**వెడఁద తామర కెంపు ఱొమ్మున వేమఱుం గొనబారి వ్రేలఁగ**
**గుడుసు వాలును జిందము న్బెను గుదియ దమ్మియుఁ గ్రేలఁ గ్రాలఁగఁ**
**దొలు మొగు లైగ దెగడు నెమ్మెయి తోరపుం జిగి కడలఁ గప్పఁగ**
**వలపు గులుకుచు నొసలిపై నిడువాలుఁ గస్తురి రేక యొప్పఁగ**
**మొసలివానును బోఁగు రంగులు మురువుఁ జెక్కులపై మెలంగఁగఁ**
**బొసఁగఁ జేతులఁ బాఁప మేపుదు పులుగుక ల్మురువు ల్సెలంగఁగఁ**

**బాలసంద్రములోన నిద్దపు పడగఁ దాలుపు రాచ సెజ్జను**
**వేలుపుం జడదారి పాటలు వింఁచుఁ బండుకయుండి బొజ్జను**
**జగములన్నియు నినిచి నెమ్మిని సాఁకుచుండు కడింది వేలుప!**
**చిగురుఁగైదువు జోదుతో నెనఁ జేయఁ బోల్నెటి మేని తాలుప!**

సిరియున్ = లక్ష్మీదేవియును, పంటవలంతియున్ = భూదేవియును, తమిన్ = కోరికతో, చేరి = వచ్చి, చేరికన్ = ఒద్దికగా, అడుగులు ఒత్తగ, పొరి పొరిన్ = మాటిమాటికి, వలి = చల్లని, ముద్దుమోమునన్, పూప నవ్వులు = చిరు నవ్వులు, మొలకలు ఎత్తగన్ = చిగురించుచుండగా, చెలువు ఎసంగన్ = మిక్కిలి అందముగా, పయిన్ = పైన కప్పుకొన్న, కడాని పసిండి దుప్పటి = స్వచ్ఛమైన బంగారు వస్త్రము, తళుకులు ఈనగన్ = కాంతులను ప్రసరింపచేయగా, తలను = తలమీద, రతనపు బొమిడికము = రత్నాల కిరీటము, తొగ దాయితో = కలువల విరోధియగు సూర్యునితో, బలు = ఎక్కువగా, వాదున్ పూనగన్ = వాదులాటకు సిద్ధమవగా, వెడద = విశాలమైన, తామర కెంపు = పద్మరాగ మణి, ఠొమ్మున, వేమఱున్ = పలుమార్లు, గొనబారి = మిక్కిలి అందముగా, వ్రేలగ = వ్రేలాడుచుండగా, గుడుసు వాలును = సుదర్శన చక్రమును, చిందమున్ = పాంచజన్య శంఖమును, పెన్గుదియ = పెద్ద కౌమోదకి గదయును, తమ్మియున్ = పద్మమును, కేలన్ = చేతులయందు, క్రాలగన్ = ఒప్పుచుండగా, తొలు మొగుల్ తెగ = తొలకరి మేఘముల సమూహమును, తెగడు = తిరస్కరించు, నెఱి మెయి = అందమైన దేహముయొక్క, తోరపుం జిగి = అధికమైన కాంతి, కడలన్ = దిక్కులను, కప్పగ= కప్పివేయగా, వలపుకులుకుచు = ఆకర్షింపచేయుచు, నొసలిపై = నుదుటిపై, నిడువాలున్ = పొడవైన, కస్తురి రేక = కస్తురి తిలకము, ఒప్పగన్ = ప్రకాశింపగా, మొసలివానునుపోగు రంగులు = మకరకుండలముల కాంతులు, మురువున్ = అందమును, చెక్కులపైన్ = చెక్కిళ్ళయందు, మెలంగగ = వ్యాపింపగా, పొసగన్ = చక్కగా, చేతులన్ = చేతులయందు, పాప మేపుడు పులుగుకలు = పాములను భక్షించు గరుత్మంతుని పేర కల గరుడ పచ్చల, మురువుల్ = మురుగులు, చెలంగగ = అతిశయింపగా, పాల సంద్రములోనన్ = పాల సముద్రములో, నిద్దపు = మెత్తనైన, పడగ తాలుపు రాచ సెజ్జను = పడగలుకల పాముల రాజు ఆదిశేష పానుపుపై, వేలుపుం జడదారి = దేవముని నారదునియొక్క పాటలు = సంకీర్తనమును, వించున్ = వినుచు, పండుక ఉండి = శయనించి, బొజ్జను = కడుపులో, జగములు అన్నియున్ = లోకముల నన్నిటిని, ఇనిచి = ఉంచి, నెమ్మిని = ప్రీతితో, సాకుచుండు = పోషించుచుండు, కడింది వేలుప = సమర్ధుడవైన ఓ దేవా!, చిగురు కైదువు జోదుతో = మన్మధునితో, ఎనన్ చేయన్ పోలు = సాటి చేయదగిన, నెఱి = రమ్యమైన, మేని తాలుప = దేహమును ధరించినవాడా!,

**తా :** లక్ష్మీదేవి, భూదేవి ఒద్దికగా పాదము లొత్తుచుండగా, సుందర వదనమున చిరు నవ్వులు మొలకెత్తుచుండగా, పైనున్న పసిడి దుప్పటి కాంతులను ప్రసరించగా, తలపైన రత్నాల కిరీటము సూర్యునితో వాదుకు సిద్ధపడగా, పద్మరాగమణి ఠొమ్మున అందముగా వ్రేలాడుచుండగా, చక్రము, శంఖము, గద, పద్మము చేతులలో ఒప్పుచుండగా, మేఘముల బోలు దేహకాంతి దిక్కులను

కప్పివేయగా, ఆకర్షణీయమై నుదుట కస్తురి రేక ప్రకాశింపగా, మకర కుండలముల కాంతులు చక్కిళ్ళయందు వ్యాపింపగా, చేతులకు గరుడపచ్చల మురుగులు అతిశయింపగా, పాల సముద్రములో మెత్తని ఆదిశేష పానుపుపై నారదుని పాటలు వింటూ శయనించి, బొజ్జలో లోకాలనన్నిటిని ప్రీతితో పోషించుచుండు సమర్థుడవైన ఓ దేవా! మన్మథునితో సమానమైన రమ్య దేహము ధరించినవాడా!

**వృ.రగడ: పంట పైదలి కొఱకు జేజే ల్బలసి వేడినఁ జాల్పు తేరుల**
**దంటగీమునఁ బుట్టి సోకుఁడు తలిరుబోఁడి నడంచి పోరుల**
**హెచ్చు మీఱిన మంచి జబ్బల యెఱచి బోనపు బంటు దేఁటిచి**
**మెచ్చుగా జడదారి యొౌదలమిన్న జన్నము నిండఁ గూరిచి**
**చట్టుఁ దొయ్యలిఁ జేసి బూచుల సామి విల్దునుమాడి సౌరుల**
**తిట్టయగు చాల్పేరి నాడెపుఁ దెఱవఁ గైకొని రాచబారులఁ**
**గడిమిఁ దిగసతమాఱు లడఁచిన గంఁద్రగొడ్డలి తాల్పుఁ బైకొని**
**కడిఁది లా విదియంచు నెల్లరుఁ గాంచి మెచ్చఁగఁ గెల్పు సేకొని**
**యప్ప యానతిఁ బూని కానల కరిగి తపసుల వెఱపు దీఱిచి**
**సుప్పనాతిని ముక్కు సెవులును సొరిదిఁ గోసి గొఱంతఁ జేరిచి**
**ఖరుని పీఁచమడంచి కల్ల మెకంబు నొక్క వెడంద తూపున**
**మురియ లొనరిచి పక్కి తేనికి ముత్తి సతముగ నొసఁగి యేపున**
**వాలిఁ ద్రెళ్ళఁగ నేసి సతవార్వముల దేవరపట్టిఁ గూరిమి**
**నేలి దాటుల నరుగు మెకముల నేర్చి కూర్చుక వచ్చి పేరిమిఁ**
**బొలసు మేపతి తేని నడఁపగఁ బూని చెలఁగెడు రాచయేనుఁగ!**

పంటపైదలి కొఱకున్ = భూదేవి కొరకు, జేజేల్ = దేవతలు, బలసి = సమిష్టిగా, వేడినన్ = ప్రార్థింపగా, చాల్పు తేరుల దంట = శ్రేష్ఠుడైన పంక్తి రథుని (దశరథుని), గీమునన్ = ఇంటిలో, పుట్టి = జన్మించి, సోకుడు తలిరుబోడిన్ = రాక్షస స్త్రీయగు తాటకను, అడంచి = చంపి, పోరులన్ = యుద్ధములందు, హెచ్చు మీఱిన = మిక్కిలి గొప్పవాడైన, మంచి జబ్బల = మంచి హస్తములుకల, ఎఱచి బోనపు బంటున్ = మాంసాహారుడగు (రాక్షసుడగు) సుబాహుని, తేఁటిచి = సంహరించి, మెచ్చుగాన్ = కీర్తింపదగినట్లుగా, జడదారి యొౌదలమిన్న = మునిశ్రేష్ఠులలో మిన్నయైన విశ్వామిత్రునియొక్క, జన్నము = యజ్ఞమును, నిండన్ = పూర్తియగునట్లుగా, కూఱిచి = ఏర్పరచి, చట్టున్ = రాతిని, తొయ్యలిన్ చేసి = స్త్రీని చేసి, బూచుల సామి = భూతముల ప్రభువు (శివుడు) విల్ దునుమాడి = విల్లు విరిచి, సౌరుల తిట్టయగు = అందాల రాశియైన, చాలు పేరి = నాగటిచాలు (సీత) పేరుగాకల, తెఱవన్ = స్త్రీని, కైకొని = స్వీకరించి, రాచ బారులన్ = రాజ సమూహములను, కడిమి = పరాక్రమముతో, తిగ సత మాఱులు = $3\times7=21$ సార్లు, అడచిన = చంపిన, గంఁద్రగొడ్డలి తాల్పున్ = పరశురాముని, పైకొని = ఎదిరించి, కడిది

= గొప్ప, లావు ఇది అంచు = బలమిదియనుచు, ఎల్లరున్ కాంచి = అందరును చూసి, మెచ్చగన్ = మెచ్చుకొనగా, గెల్పు చేకొని = గెలుపును సాధించి, అప్ప యానతిన్ = తండ్రి ఆజ్ఞను, పూని = స్వీకరించి, కానలకు అరిగి = అరణ్యములకు వెళ్ళి, తపసుల వెఱపు = మునుల భీతిని, తీఱిచి = పోగొట్టి, చుప్పనాతిని = శూర్పణఖను, ముక్కు చెవులును కోసి, కొఱంతన్ = లోపమును, చేరిచి = కల్పించి, ఖరుని పీచము అడంచి = ఖరుని గర్వమును అణచివేసి (చంపి), కల్ల మెకంబును = మాయా మృగమును, ఒక్క వెడంద తూపున = ఒక్క గొప్ప బాణముతో, మురియలు ఒనరించి = ఖండించి, పక్కి ఱేనికి = జటాయువుకు, ముత్తి సతముగన్ ఒసగి = శాశ్వత ముక్తి నిచ్చి, ఏపున = సాహసముతో, వాలిన్ = వాలిని, త్రెళ్ళగన్ ఏసి = చచ్చేలా కొట్టి, సత వార్వముల దేవర పట్టిన్ = ఏడు గుఱ్ఱముల దేవుని కొడుకును (సూర్య పుత్రుడు సుగ్రీవుడు), కూరిమిన్ ఏలి = ప్రీతితో కాపాడి, దాటులన్ అరుగు మెకములన్ = దుముకుచు పోయే జంతువులు కోతులను, ఏర్చి కూర్చుక వచ్చి = ఎంచి కూడబెట్టుక వచ్చి, పేరిమిన్ = అతిశయముగా, పొలసు మేపఱి ఱేనిన్ = రావణుని, అడపగన్ = సంహరింపగా, పూని = తలచి, చెలగెడు = విజృంభించుచున్న, రాచ ఏనుగ = రాజశ్రేష్ఠుడా!

**తా :** భూదేవి కొఱకు దేవతలు ప్రార్థింపగా దశరథుని ఇంటిలో పుట్టి, తాటకిని చంపి, బలశాలియగు సుబాహుని సంహరించి, విశ్వామిత్రుని యజ్ఞము కాపాడి, రాతిని స్త్రీని చేసి, శివుని విల్లు విరిచి, అందాలరాశి సీతను పెండ్లాడి, రాజులను ముయ్యేడుమార్లు చంపిన పరశురాముని ఎదిరించి అందరూ మెచ్చుకొనగా గెలుపును సాధించి, తండ్రి ఆజ్ఞను అడవులకు వెళ్ళి మునుల భీతిని పోగొట్టి, శూర్పణఖ ముక్కులు చెవుల కోసి లోపము కల్పించి, ఖరుని గర్వమణచి, మాయ లేడిని ఒక్క బాణముతో ఖండించి, జటాయుకు ముక్తినొసగి, వాలిని చంపి సూర్యపుత్రుని సుగ్రీవుని కాపాడి, వానరులను కూడబెట్టుకొని రావణుని సంహరింపగా విజృంభించుచున్న రాజశ్రేష్ఠుడా!

**వృ.రగడ: ఎలసి నీ నెఱగొనము లన్నియు నెన్న నేరి తరంబు జానుగ**
**మీను తాఁబే ల్పంది మానిసిమెకము, గిడ్డయు నేలవేల్పును**
**గోనత్రిమ్మరి మూఁకఁగూరుచుకొన్న నీవును దాడితాల్పును**
**మ్రానిలోఁ బొడకట్టు దిట్టయు మావునెక్కు జగా మగండును**
**లోనుగాఁ బలు రూపులూని వెలుంగు దయ్యమ! వేల్పు పిండును**
**నిక్కువంబుగ నిన్నుఁ బేర్కొన నేరరని పెను మిన్ను లాడఁగఁ**
**జక్కఁగా మముబోటు లెట్టుగఁ జాలుదు ర్కొనియాడి చూడఁగఁ**

ఎలసి = పూనుకొని, నీ నెఱగొనములు అన్నియున్ = నీ గొప్పగుణముల నన్నిటిని, ఎన్నన్ = ఎంచుటకు, ఏరితరంబు = ఎవరితరము?, జానుగన్ = చక్కగా, మీను = మత్స్యావతారం, తాబేలు = కూర్మావతారం, పంది = వరాహావతారం, మానిసి మెకము = నరసింహావతారం, గిడ్డయు = వామనావతారం, నేలవేల్పును = పరశురామావతారం, కోనత్రిమ్మరి మూకన్ కూరుచుకొన్న = కోతిమూకను సమీకిరించుకొన్న, నీవును = రాముడును, దాడితాల్పును = గడ్డము ధరించియుండు

వాడు (బలరాముడు), మ్రానిలోన్ = వృక్షమునందు (బోధివృక్షం), పొడకట్టు దిట్టయు = కన్పించు సమర్థుడు (బుద్ధుడు), మావును ఎక్కు = గుఱ్ఱమునెక్కు, జగామగండును = గొప్ప వీరుడును (కల్కి), లోనుగాన్ = మొదలైన, పలు రూపులు ఊని = అనేక రూపాలను ధరించి, వెలుంగు = ప్రకాశించు, దయ్యమ = దైవమా!, వేల్పు పిండును = దేవతా సమూహమును, నిక్కువంబుగన్ = నిజముగా, నిన్నున్ పేర్కొన నేరరు అని = నిన్ను తెలుసుకొన చాలరని, పెను మిన్కులు = వేదములు, ఆడగన్ = పలుకుచుండగా, మముబోటులు = మావంటివారు, చక్కగా = అందముగా, కొనియాడి చూడగన్ = ప్రస్తుతించ ప్రయత్నించడానికి, ఎట్టుగన్ చాలుదురు = ఎలా సరిపోతారు?

**తా :** నీ గొప్ప గుణముల నన్నిటిని ఎంచుటకు ఎవరి తరము? మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, రామ, బలరామ, బుద్ధ, కల్కి మొదలైన పలురూపులు ధరించి ప్రకాశించు దైవమా! దేవతలు నిక్కముగా నిన్ను తెలుసుకొనజాలరని వేదములు పలుకుచుండగా మావంటివారు చక్కగా కొనియాడ చూడ ఎలా సరిపోతారు?

**వృ.రగడ: ప్రాంతమిన్కుకొన ల్గనుంగొని బల్మిఁ బుట్టువు కట్టు లూడిచి**
**రోఁత కాపురమునకు వేసరి రొక్కమెత్తి కడంక లూడిచి**
**చెలఁగి గాటపు తెలివి చిచ్చుఁ బఁ జెయ్వు కూటువులెల్ల వ్రేలిచి**
**యలరి లోపలి దాయలను వెస నాఱువుర మొదలంటఁ గూలిచి**
**కనుఁగొనంబడు నెల్ల జగమును గల్లయని డెందమున నెంచుచు**
**నెనసి దిటమగు లోని చూపున నెప్పుడుం దనుఁ దానె కాంచుచుఁ**
**దివిరి యెద్దియుఁ గోరఁబోవక తివ గొనమ్ములు సెందనీయక**
**తవిలి యెన్నడునేని నిమ్మెయి తాలుపులకును గీడు సేయక**

ప్రాత మిన్కు కొనల్ = వేదాంతములు, కనుంగొని = చూచి, బల్మిన్ = గట్టి ప్రయత్నముతో, పుట్టువు కట్టులు = జన్మ బంధములు, ఊడిచి = వదలిపెట్టి, రోత = రోతను కలిగించు, కాపురమునకు = సంసారమునకు, వేసరి = విసిగి, రొక్కము ఎత్తి = సంపదలను విడచి, కడంకలు = కోరికలు, ఊడిచి = విడిచిపెట్టి, చెలగి = కోరి, గాటపు = గొప్పదైన, తెలివి చిచ్చుఅన్ = జ్ఞానమనెడు అగ్నియందు, చెయ్వు కూటువులన్ ఎల్లన్ = కర్మ సమూహముల నన్నిటిని, వ్రేలిచి = హుతమొనర్చి, అలరి = సంతోషించి, లోపలి దాయలను = అంతఃశత్రువులను, ఆఱువురన్ = ఆరుగురిని (అరిషడ్వర్గము), వెసన్ = శీఘ్రముగా, మొదలంటన్ = పూర్తిగా, కూలిచి = నాశనము చేసి, కనుగొనంబడున్ = మనము చూచుచున్న, ఎల్ల జగముల = లోకము లన్నియును, కల్ల అని, డెందమునన్ ఎంచుచు = మనసున తలంచుచు, ఎనసి = పూనుకొని, దిటమగు = సమర్థమైన, లోని చూపున = అంతర్దృష్టితో, ఎప్పుడున్, తనున్ తానె = తనను తానే, కాంచుచున్ = దర్శించుచు, తివిరి = పూనుకొని, ఎద్దియున్ = ఏదియును, కోరన్ పోవక = కోరుకొనక, తివ గొనమ్ములు = మూడు గుణములును (సత్త్వరజస్తమోగుణములు), చెందనీయక = చెందనీయకుండ (గుణాతీత్వము పొంది), తవిలి =

చిక్కుకొని, ఎన్నడునేనిన్ = ఎప్పుడైనను, ఈ మెయి తాలుపులకును = ఈ శరీరధారులకు, కీడు = హాని, సేయక =చేయకుండగ,

**తా :** వేదాంతములు కనుగొని, జన్మ పరంపరను విడిచిపెట్టి, రోతను కలిగించు సంసారమునకు విసిగి, సంపదలను, కోరికలను విడిచిపెట్టి, జ్ఞానమనెడి అగ్నియందు కర్మ సమూహముల నన్నిటిని హుతమొనర్చి, అంతశ్శత్రువుల నారింటిని మొదలంట నాశనము చేసి, మనము చూచుచున్న లోకములన్నీ అసత్యమని మనసున తలంచుచు లోని చూపున తనను తానే ఎల్లప్పుడూ దర్శించుచూ, ఏదియును కోరక, త్రిగుణములను దరిచేరనీయక, ఎన్నడును ఈ శరీరధారులకు హాని చేయకుండగ–

**వృ.రగడ: పుడమిపైఁ దనయందు నెల్లెడఁ బున్నియపు చందములె వామిగ**
**నడర నడరెడు జోగి చేరువ నండఁబాయక యుండు సామిగ**
**కడలి పుడమియు నాకసంబును గట్లుఁ జెట్లును నీరు వాములు**
**గడలి వెన్నయు వేఁడి వేలుపు గాడ్పు నగ్గియు నెల్ల గామలుఁ**
**జిలువరాయఁడు ప్రొద్దుచూలియు జింకతాల్పును వేల్పుఁ బెద్దయు**
**వెలి హుమాయి వజీరుడుం గరివేల్పు నీవె యటంచుఁ దద్దయు**
**నెలమిఁ దలఁపున నిల్పి సారెకు నెంతు నర్మిలి నన్నుఁ బ్రోవుము**
**పలు దొసంగులఁ బాపి కూళల పాలఁ జిక్కఁగ నీక కావుము** 64

పుడమిపై = భూమి మీద, తనయందున్ = తనలోపలను, ఎల్లెడన్ = అన్నిచోట్లను, పున్నియపు చందములె = పుణ్యసాధన విధానములే, వామిగన్ = రాశిగా, అడరన్ = ఉండునట్లుగా, అడరెడు = ఒప్పునట్టి, జోగి = యోగులయొక్క, చేరువన్ = సమీపమున, అండన్ పాయక = తోడు విడువక, ఉండు = ఉండునట్టి, సామిగ = ప్రభువుగా, కడలి, పుడమియున్, ఆకసంబును, గట్లున్ = పర్వతములును, చెట్లును = వృక్షములును, నీరు వాములు = నదులు, కడలి వెన్నయు = చంద్రుడు, వేడి వేలుపు = సూర్యుడు, గాడ్పు = గాలి, అగ్గియు = అగ్నియును, ఎల్లన్ = సమస్తమైన, గామలున్ = పిపీలికాది జీవరాసులును, చిలువరాయడు = ఆదిశేషుడు, ప్రొద్దుచూలియు = యముడును, జింకతాల్పును = శంకరుడును, వేల్పు పెద్దయు = ఇంద్రుడును, వెలి హుమాయి వజీరుండు = తెల్లని హంస వాహనముగా కల బ్రహ్మయు, కరివేల్పు = విష్ణువు, నీవే అటంచున్ = నీవేయని, తద్దయున్ = మిక్కిలి, ఎలమిన్ = ప్రీతిని, తలపున నిల్పి = మనసున నిలుపుకొని, సారెకు = మాటిమాటికి, ఎంతున్ = స్మరింతును, అర్మిలి = ప్రీతితో, నన్నున్ బ్రోవుము = నన్ను రక్షింపుము, పలు దొసంగులన్ పాపి = నాయొక్క అనేక దోషములను పోగొట్టి, కూళల పాలన్ = నీచుల బారియందు, చిక్కగనీక = తగుల్కొనకుండగా, కావుము = రక్షింపుము.

**తా :** భూమిమీద, తనలోను అన్నిచోట్ల పుణ్యసాధన విధానములే రాశిగా ఉండునట్లుగా ఒప్పు యోగుల సమీపమున తోడు విడువక ఉండునట్టి ప్రభువుగా, సముద్రము, భూమి, ఆకాశము, పర్వతములు, వృక్షములు, నదులు, చంద్రుడు, సూర్యుడు, గాలి, అగ్ని సమస్తమైన జీవరాసులును, చంద్రుడు, యముడు, శంకరుడు, ఇంద్రుడు, బ్రహ్మ, వినాయకుడు నీవేయని మిక్కిలి ప్రీతిని

మనసున నిల్పుకొని మాటిమాటికి స్మరింతును. ప్రీతితో నన్ను రక్షింపుము. నాయొక్క అనేక దోషములను పోగొట్టి నీచుల బారి తగుల్కొనకుండగ కావుము.

**తే.గీ.** **అనుచుఁ బొగడినఁ దద్దయు నలరి రాచ**
**యంచ మున్నీటి నీరు దెప్పించి యపుడె**
**పైనిఁ జిలికించి దీవికి ఱేనిఁ జేసి**
**నతని నఱలేని నెయ్య మొప్పారఁ జూచి** **65**

అనుచున్, పొగడినన్, తద్దయున్ = మిక్కిలి, అలరి = సంతోషించి, రాచ అంచ = రాజహంస (రాముడు), మున్నీటి నీరు = సముద్రపు నీటిని, తెప్పించి, అపుడె = అప్పుడే (వెంటనే), పైనిన్ చిలికించి = మీదచల్లి, దీవికి = లంకకు, ఱేనిన్‌చేసి = రాజునుచేసి, అతనిన్ = ఆ విభీషణుని, అఱలేని = సంపూర్ణమైన, నెయ్యము ఒప్పారన్ = స్నేహభావ మొప్పారగా, చూచి = కాంచి.

**తా :** అని స్తుతింపగా మిక్కిలి సంతోషించి రాముడు సముద్రపు నీటిని తెప్పించి వెంటనే మీద చల్లి లంకకు రాజును చేసి ఆ విభీషణుని పూర్తిగా స్నేహభావ మొప్పారాగా చూచి.

**కం.** **పొలమేపరి వంగడపుం**
**దెలిడాలు మెకంబ! నెమ్మది న్మీ దీవిం**
**గల పెద్దల తెఱఁగును మూఁ**
**కల కొలఁదియు నేర్పరించి క్రన్ననఁ జెపుమా!** **66**

పొలమేపరి వంగడపుం = రాక్షస వంశమునందు, తెలిడాలు మెకంబ = సింహమైనవాడా!, నెఱి మదిన్ = నిండు మనసుతో, మీ దీవింగల = మీ లంకలోగల, పెద్దల = వీరులయొక్క, తెఱగును = విషయమును, మూకల కొలదియు = సైన్యముయొక్క సమర్ధతను, ఏర్పరించి = వివరముగా, క్రన్నన్ = శీఘ్రముగా, చెపుమా = చెప్పుము.

**తా :** రాక్షస వంశ సింహమా! నిండు మనసుతో మీ లంకలోగల వీరులయొక్క విషయమును, సైన్యముయొక్క సామర్థ్యమును వివరముగా తెలుపుము.

**తే.గీ.** **అనిన రాచూలి కతఁ డిట్టులనియెఁ దంద్రి!**
**తెలియ నాలింపు మిపుడు మా దీవిలోని**
**వేల్పుగొంగల తెఱఁగును జాల్పుతలల**
**రక్కసుని దిట మెఱిఁగింతు నిక్కువముగ** **67**

అనినన్ = అనగా, రాచూలికి = రామునికి, అతడు = ఆ విభీషణుడు, ఇట్టులు అనియె, తంద్రి = రామా!, తెలియన్ = వివరముగా, ఆలింపుము, ఇపుడు, మా దీవిలోని = మా లంకలోని, వేల్పు గొంగల = దేవతా విరోధుల (రాక్షసుల), తెఱగును = విధమును, చాల్పు తలల రక్కసుని దిటము = పంక్తి శిరస్కుని (రావణుని) బలమును, నిక్కువముగ = యదార్ధముగ, ఎఱిగింతు = తెలిపెదను,

**తా :** అనిన రామునికి అతడు ఇట్లు పలికెను 'రామా! వివరము వినుము. ఇప్పుడు మా లంకలోని రాక్షసుల విధమును, రావణుని బలమును యదార్థముగ తెలిపెదను.

**తే.గీ.** **నలువ నలరించి కొలఁది యొనర్పరాని**
**మెప్పు లెన్నేనిఁ జేకొని మేటి యగుచు**
**జగము లన్నియు గెలిచిన జగమగండు**
**రావణుం డొప్పు నెనలేని ఠీవితోడ** **68**

నలువన్ = బ్రహ్మదేవుని, అలరించి = సంతోషపెట్టి, కొలది ఒనర్పన్ రాని = ఇంత అని చెప్పడానికిరాని, మెప్పులు = వరములు, ఏన్నేని = ఎన్నియో, చేకొని = చేపట్టి, మేటి అగుచు = సమర్థుడగుచు, జగములు అన్నియు = లోకములన్నిటిని, గెలిచిన = జయించిన, జగమగండు = వీరాధివీరుడై, ఎనలేని ఠీవితోడ = సాటిలేని వైభవముతో, రావణుండు ఒప్పున్.

**తా :** బ్రహ్మను సంతోషపెట్టి చెప్పడానికి అందని వరములు ఎన్నియో చేకొని మేటియగుచు లోకములన్నిటిని జయించిన వీరాధివీరుడై సాటిలేని వైభవముతో రావణుడు ఒప్పుచున్నాడు.

**కం.** **జన్నంపుఁ దిండి దొరలన్**
**మున్నఱకం బాఱఁద్రోలి ముజ్జగములు చే**
**కొన్న నెఱ బిరుదు రావణు**
**కన్నం బలియుండు కుంభకర్ణుఁడు దనరున్** **69**

జన్నపు తిండి దొరలన్ = యజ్ఞ భాగములుకల దేవతలను, మున్నఱకన్ = సాహసముతో, పాఱద్రోలి = ఓడించి, ముజ్జగములు, చేకొన్న = స్వాధీనముచేసుకొన్న, నెఱ బిరుదు = గొప్ప బిరుదుకల, రావణుకన్నన్ = రావణునికంటెను, బలియుడు = బలవంతుడై, కుంభకర్ణుడు, తనరున్ = ఒప్పును.

**తా :** పరాక్రమముతో దేవతలను ఓడించి ముల్లోకములు చేకొన్న రావణుని కంటెను బలవంతుడై కుంభకర్ణుడు ఒప్పును.

**చం.** **తునుమఁగ రాని జోళ్ళు నొక తూరియు వమ్మయిపోని తూపులున్**
**మినునిసువున్ వడిం దెగడి మీఱెడి మావులు లొజ్జుగాని బ**
**ల్దొనలును దొడ్డ సింగిణులు దూకొని వెన్కకురాని బీరమున్**
**బొనరఁగ వేల్పుగొంగ తొలిబొట్టియ యింద్రజితుండు ఱంపిలున్** **70**

తునుమగ రాని = ఛేదించుటకు సాధ్యముకాని, జోళ్ళు = కవచములును, ఒకతూరియు = ఒక్కసారి కూడా, వమ్ము అయిపోవని = వ్యర్థముకాని, తూపులున్ = బాణములును, మినునిసువున్ = ఆకాశబాలుడగు సూర్యుని, వడిన్ = వేగమును, తెగడి = నిందించి, మీఱెడి = అతిశయించెడు, మావులు = గుఱ్ఱములును, లొజ్జు కాని = తరిగిపోని, బల్ = గొప్ప, దొనలును = అమ్ముల పొదులును, దొడ్డ = మంచి, సింగిణులు = ధనుస్సులును, తూకొని = భయమంది, వెన్కకురాని = మడమ త్రిప్పని, బీరమున్ = శౌర్యమును, పొనరగన్ = ప్రకాశింపగా, వేల్పుగొంగ = దేవతల శత్రువు (రావణుడు), తొలి బొట్టియ = పెద్దకొడుకు, ఇంద్రజితుండు, ఱంపిలున్ = విజృంభించును.

**తా :** ఛేదించుటకు శక్యముకాని కవచములును, ఒక్కసారి కూడా వ్యర్థముకాని బాణములును, సూర్యుని వేగమును మీరి అతిశయించెడు గుఱ్ఱములును, తరగని అమ్ముల పొదులును, మంచి ధనుస్సులును, మడమ త్రిప్పని శౌర్యమును ప్రకాశింపగా రావణుడు పెద్దకొడుకు ఇంద్రజిత్తు విజృంభించును.

**సీ.** **రాయండ! విను మతికాయుండు మొదలగు**
**వాలు మగ ల్పెక్కు వేలు రక్క**
**సుల తేని కొడుకు లజ్జోదు లొక్కొక్కఁడు**
**వేన వేల్నూరేసి వేల బంట్లఁ**
**గూడుక వ్రాలి బల్కోట లేడును గాచు**
**కొని యేమఱక వేఁడిమినిఁ జెలంగు**
**చుందు రాతనికి నెయ్యుఁడు దళవాయియు**
**నై ప్రహస్తుండను నట్టి జెట్టి**

**తే.గీ.** **బిరుదు రాణించు మఱియుఁ బెన్ దురములందు**
**వాసి మీఱిన ప్రోడ రాకాసి బంటు**
**లక్కజంబుగ లెక్కల కెక్కువగుచుఁ**
**గ్రిక్కిఱిసియుందు రెనలేని యుక్కు మెఱయ** **71**

రాయండ = ఓ ప్రభూ!, వినుము, అతికాయుండు మొదలగు, వాలు మగలు = యుద్ధ వీరులు, రక్కసుల తేని కొడుకులు, పెక్కు వేలు = అనేక వేలమంది కలరు, ఆ జోదులు = ఆ వీరులు, ఒక్కొక్కడు = ఒక్కొక్కడును, వేన వేల్ = పదిలక్షలు, నూరేసి వేల బంట్లన్ = లక్షమంది సైనికులతో, కూడుక = కూడి, వ్రాలి = ప్రవేశించి, బల్ కోటలు ఏడును = దట్టమైన ఏడు కోటలను, కాచుకొని = రక్షించుచు, ఏమఱక = ఏమరుపాటు లేక, వేడిమిని = శౌర్యముతో, చెలంగుచుందురు = విజృంభించుచుందురు, ఆతనికి = ఆ రావణునికి, నెయ్యుడు = స్నేహితుడు, దళవాయియునై = సైన్యాధిపతియై, ప్రహస్తుండు అనునట్టి = ప్రహస్తుడను పేరుకల, జెట్టి బిరుదు = వీరులలో శ్రేష్ఠుడుగ, రాణించున్ = పేరుగాంచును, మఱియున్ = ఇంకను, పెన్ దురములందు = గొప్ప యుద్ధములందు, వాసి మీఱిన ప్రోడ = కీర్తి పొందిన సమర్థులైన, రాకాసి బంటులు = రాక్షస సైనికులు, అక్కజంబుగ = ఆశ్చర్యకరముగ, లెక్కలకు ఎక్కువగుచు = లెక్కకు మీఱినవారగుచు, ఎనలేని ఉక్కు మెఱయ = సాటిలేని బలముతో ప్రకాశించుచు, క్రిక్కిఱిసి ఉందురు = దట్టముగా నుందురు.

**తా :** ఓ ప్రభూ! విను. అతికాయుడు మొదలగు వీరులు, రావణుని కొడుకులు అనేక వేలమంది కలరు. ఆ వీరులు ఒక్కొక్కడును లక్ష, పదిలక్షలు సైన్యములతో కూడి ఏమరుపాటు లేని శౌర్యముతో ఏడు కోటలను సంరక్షించుచుందురు. ఆ రావణునికి స్నేహితుడు, సైన్యాధిపతియై ప్రహస్తుడు వీరులలో శ్రేష్ఠుడుగా రాణించును. ఇంక పెను యుద్ధములందు కీర్తిగాంచిన రాక్షస వీరులు అక్కజముగ లెక్కకు మీఱినవారగుచు సరిలేని బలముతో ప్రకాశించుచుందురు.

**తే.గీ.** **అట్టి బల్మిని సోకురాయండు నీ ప**
**దంతిఁ జెఱఁ గొని యునిచె నేనెంత మంచి**
**బుద్ధిఁ జెప్పిన వినక యబ్బురపుఁ గినుకఁ**
**గెరలి వడిఁ దన్ని వెడల నూకించె నిందు** **72**

అట్టి, బల్మిని = బలముతో, సోకురాయండు = రావణుడు, నీ పడంతిన్ = నీ భార్యను (సీతను), చెఱన్ కొని = చెరపట్టి, ఉనిచెన్ = లంకానగరమున ఉంచెను, నేను, ఎంత మంచిబుద్ధిన్ చెప్పిన వినక, అబ్బురపున్ కినుకన్ = అపారమైన కోపముతో, కెరలి = విజృంభించి, వడిన్ = వెంటనే, తన్ని = కాలితో తన్ని, ఇందు వెడలన్ = ఇక్కడికి వచ్చునట్లు, నూకించెన్ = త్రోయించెను.

**తా :** అటువంటి బలముతో రావణుడు నీ భార్యను చెరపట్టి లంకా నగరమున ఉంచెను. నేను ఎంత మంచి చెప్పినా వినక కోపముతో తన్ని ఇక్కడికి వచ్చునట్లు త్రోయించెను.

**ఆ.వె.** **అనుడుఁ గినుక నిగుడ నప్పుడె యెకిమీఁడు**
**దండుతోడఁ గడలి దరియ నరిగి**
**కట్టఁగట్టఁ దివురు పట్టునఁ జెలఁగి య**
**న్నీరు కుప్ప వొంగి నింగి ముట్టె** **73**

అనుడు = అని తెలుపగా, కినుక = కోపము, నిగుడన్ = వ్యాపింపగా, అప్పుడె = వెంటనే, ఎకిమీడు = ప్రభువగు రాముడు, దండు తోడన్ = సైన్యముతో, కడలిన్ = సముద్రమును, తరియన్ = దాటుటకు, అరిగి = వెళ్ళి, కట్టగట్టన్ = సేతువు కట్టగా, తివురు పట్టునన్ = ప్రయత్నించు సమయమున, చెలగి = విజృంభించి, ఆ నీరుకుప్ప = ఆ సముద్రము, పొంగి = ఉవ్వెత్తుగా లేచి, నింగి ముట్టె = ఆకాశమును తాకెను.

**తా :** అనగా రాముడు కోపము రేకెత్తగా వెంటనే సైన్యముతో సముద్రమును దాటుటకు వెళ్ళి సేతువు కట్ట ప్రయత్నించగా ఆ సముద్రము ఉవ్వెత్తుగా లేచి ఆకాశమును ముట్టెను.

**కం.** **అటు లుప్పొంగినఁ గని నాఁ**
**గటిచా ల్పేరింటి వాలుఁగంటి మగఁడు మి**
**క్కుటమగు కొఱకొఱతోడన్**
**దటుకున విల్గొని లకోరిఁ దగఁ బూనుటయున్** **74**

అటులు = ఆ విధముగా, ఉప్పొంగినన్ = మిక్కిలి పొంగిన, కని = చూచి, నాగటిచాలు పేరింటి = నాగటిచాలు పేరుతోనున్న, వాలుగంటి మగడు = స్త్రీ (సీత) భర్త (రాముడు), మిక్కుటమగు = అధికమైన, కొఱకొఱతోడన్ = కోపముతో, తటుకున = శీఘ్రముగా, విలు కొని = ధనుస్సు తీసుకొని, లకోరిన్ = బాణమును, తగన్ = సమర్థముగా, పూనుటయున్ = గ్రహింపగా,

**తా :** ఆలా ఉప్పొంగిన చూచి రాముడు కోపముతో వెంటనే ధనుస్సు తీసుకొని బాణమును చక్కగా సంధించగా –

**కం. గడగడ వడకుచు మున్నీ**
**రడరెడు నెమ్మేను దాల్చి యన్నెఱ జేజే**
**యడుగులపై నొరగెం దన**
**యడు గసలును జిప్ప ప్రోవునై కనఁబడఁగన్ 75**

గడగడ వడకుచు, మున్నీరు = సముద్రుడు, అడరెడు = వణకుచున్న, నెమ్మేను తాల్చి = నిండు దేహమును ధరించి, తన = తనయొక్క, అడుగు = అడుగునవున్న, అసలును = బురదను, చిప్ప ప్రోవునై = ముత్యపుచిప్పల సమూహమును (తాబేళ్ళు, చేపలు మొ.వాని పై చిప్పలును), కనబడగన్, ఆ నెఱ జేజే = ఆ నిండైన దేవుని (రాముని), అడుగులపైన్ = పాదములపై, ఒరగెన్ = పడెను.

**తా :** గడగడ వడకుచు సముద్రుడు వణకుచున్న శరీరంతో తన అడుగునవున్న బురదను ముత్యపు చిప్పల సమూహమును కనబడుచుండగా ఆ రాముని పాదములపై పడెను.

**ఆ.వె. అట్టు లొరగి లేచి అ మ్మగరతనంబు**
**మ్రోల నిల్చి కేలు మోడ్చి పలికె**
**నప్ప! యింత కినుక యొప్పునే? మముబోఁటి**
**పలుచదనపు వారిపట్ల మీకు 76**

అట్టులు = ఆ విధముగా, ఒరగి = రాముని పాదములపై పడి, లేచి, ఆ మగ రతనంబు మ్రోల = ఆ పురుష శ్రేష్ఠుని చేరువన, నిల్చి, కేలు మోడ్చి = చేతులు జోడించి, పలికె = పలికెను, అప్ప = తండ్రీ!, మముబోటి = మావంటి, పలుచతనపు వారిపట్ల = అల్పులపట్ల, మీకు = మీవంటివారికి, ఇంక కినుక ఒప్పునే = ఇంతటి కోపము తగునా?

**తా :** ఆ విధముగా రాముని పాదములపై పడి లేచి నిల్చి చేతులు జోడించి 'ఓ తండ్రీ! మావంటి అల్పులపట్ల మీవంటి వారికి ఇంతటి కోపము తగునా?

**కం. సుడివడి యడలుచు బన్నము**
**లెడ సూపక పొడము వంత లెలయఁగఁ గడు లో**
**నుడుకుచు నుండెడివారల**
**యెడ దొరలకుఁ గినియఁ బోలునే యెకిమీడా? 77**

ఎకిమీడా = ప్రభూ!, సుడివడి = తిరుగుడు పడి (సుడిగుండములు పడి), అడలుచు = బాధనందుచు (చలించుచు), బన్నములు = కష్టములు (కెరటములు), ఎడ చూపక = పైకి కనిపించనీయక (ఖాళీవుంచక), పొడము వంతలు = కలుగుచున్న బాధలు (కలియుచున్న నదులు), ఎలయగన్ = ప్రవేశించగా, కడు = మిక్కిలి, లోన్ ఉడుకుచున్ = మనసులో సంతాప పడుచున్న (బడబాగ్నిచే ఉడికిపోతూ), ఉండెడివారల ఎడ = ఉండేవారి యందు, దొరలకు = ప్రభువులకు, కినియన్ పోలునే = కోపింప తగునా?

**తా :** ప్రభూ! తిరుగుడు పడి బాధించుచు కష్టములు, పైకి కనిపించకుండా కలుగుచున్న బాధలు ప్రవేశించగా మిక్కిలి మనసులో సంతాపపడుచున్న వారిపై కోపింప తగునా?

(ప్రభూ! సుడిగుండములు పడి చలించు కెరటములు, ఖాళీ లేక కలుస్తున్న నదులు ప్రవేశించగా, లోపల బడబాగ్నిచే ఉడికిపోతూ సంతాపపడుచున్న మాపై కోపింప తగునా?)

**కం.** **మల ద్రిమ్మరి మూఁకలతో**
**వలనుగ మీరిందు దరలి వచ్చుటఁ గని లో**
**నలరి చెలంగితిఁ గా కెదఁ**
**దలఁతునె మీ కొక్క కీడు తపసులవిందా! 78**

తపసులవిందా = మునులకు ఆనందము కలిగించువాడా!, మల త్రిమ్మరి మూకలతో = వానరులతో, వలనుగ = చక్కగా, మీరు, ఇందు = ఇక్కడికి, తరలి వచ్చుటన్ = బయలుదేరి వచ్చుటను, కని = తెలుసుకొని, లోన్ అలరి = మనసులో సంతోషించి, చెలంగితిన్ = ఉప్పొంగితిని, కాక = అంతేకాని, ఎదన్ = మనసులోనైనను, మీకు, ఒక్క కీడు = ఒక్కటైనా హానిని, తలతునె = తలుస్తానా?

**తా :** తపసుల విందా! వానరులతో చక్కగా మీరు ఇక్కడికి తరలి వచ్చుట కని మనసులో సంతోషించి ఉప్పొంగితిని అంతేకాని మనులోనైనా మీకు కీడు తలుస్తానా?

**సీ.** **కల్లరి జింక రక్కసి యుసురుల గొంగ!**
**కలువలదాయ వంగడపుఁ దొడవ!**
**చాల్పుబండుల మన్నుతాల్పు తొల్బిడ్డఁడ!**
**చెట్టు ద్రిమ్మరి ఱేండ్ల పట్టుగొమ్మ!**
**పొలదిండి పిండు చిల్వల పుల్గురాయఁడ!**
**చాలు పేరింటి ప్రోయాలి మగఁడ!**
**నేలక్రొన్ననబోఁడి నెయ్యంపు టల్లుఁడ!**
**చుట్టు చట్టలు మెట్టు మెట్టువాఁడ!**

**తే.గీ.** **కడిఁది జడదారి జన్నంపు కాపుకాఁడ!**
**యింక నెనరొప్ప మా తప్పు లెల్లఁ సైచి**
**గట్లు చెట్లును దెప్పించి కట్టగట్టి**
**వేగిరము దాఁటి చెడు తొలివేల్పుఁ బొదువు 79**

కల్లరి జింక రక్కసుని = మాయా మృగమైన మారీచుని, ఉసురుల గొంగ = ప్రాణములను హరించినవాడా!, కలువల దాయ వంగడపున్ = కలువలకు శత్రువగు సూర్యుని వంశమునకు, తొడవ = అలంకారమైనవాడా!, చాల్పు బండుల = పంక్తిరథుడను, మన్నుతాల్పు = భూమిని ధరించినవాడగు దశరథుని, తొలి బిడ్డడ = పెద్దకొడుకా!, చెట్టు త్రిమ్మరి ఱేండ్ల = వానర ప్రభువులకు, పట్టు కొమ్మ = ఆధారమైనవాడా!, పొల తిండి పిండు = రాక్షస సమూహములనెడు, చిల్వల = పాములకు, పుల్గురాయడ = గరుత్మంతుడా!, చాలు పేరింటి = సీతయను పేరుకల, ప్రోయాలి మగడ = ఇంతికి భర్తయైనవాడా!, నేల క్రొన్ననబోడి = భూదేవికి, నెయ్యంపు = ప్రియమైన,

అల్లుడ!, చుట్టు చట్టలు = శత్రువుల కవచములను, మెట్టు = మొత్తము, మెట్టువాడ = త్రొక్కువాడా!, కడిది = గొప్పవాడయిన, జడదారి = విశ్వామిత్రునియొక్క, జన్నంపు = యజ్ఞమునకు, కాపుకాడ = రక్షకుడైనవాడా!, ఇంక = ఇక, నెనరు ఒప్పన్ = ప్రీతి కలుగునట్లుగా, మా తప్పులు ఎల్లన్ సైచి = మా తప్పులన్నిటిని సహించి, గట్లు = రాళ్ళు, చెట్లును, తెప్పించి, కట్ట కట్టి = సేతువు కట్టి, వేగిరము = శీఘ్రముగా, దాటి = నన్ను దాటి వెళ్ళి, చెడు తొలివేల్పున్ = దుష్ట రాక్షసుని, పొదువు = ఆక్రమించుము.

**తా :** మాయా మృగమైన మారీచుని ప్రాణములను హరించినవాడా! సూర్య వంశమునకు అలంకారమైనవాడా! దశరథుని పెద్దకొడుకా! వానర వీరులకు ఆధారమైనవాడా! రాక్షసు లనెడు పాములకు గరుత్మంతుడా! సీతకు భర్తయైనవాడా! భూదేవికి ప్రియమైన అల్లుడా! శత్రువుల కవచములను త్రొక్కువాడా! విశ్వామిత్రుని యజ్ఞమునకు రక్షకుడైనవాడా! ఇక ప్రీతితో మా తప్పులను సైచి రాళ్ళు తెప్పించి సేతువు కట్టి వెంటనే నన్ను దాటి దుష్ట రాక్షసుని ఆక్రమింపుము.

**కం.** **అని చెప్పి యేళ్ళ రాయఁడు**
**మునుపటి రూపూనియుండె మురియుచు దొరయున్**
**దన ములికి దృశ్య గుల్మం**
**బను మడువుపయి న్నిగుడ్చి యట నింకించెన్** **80**

అని చెప్పి, ఏళ్ళరాయడు = నదులకు భర్త (సముద్రుడు), మునుపటి రూపు ఊని = తన తొలిరూపును పొంది, ఉండె = ఉండెను, దొరయున్ = రాముడును, మురియుచు = సంతోషించుచు, తన ములికి = తానెక్కుపెట్టిన బాణమును, దృశ్య గుల్మంబు అను, = దృశ్యగుల్మమను, మడువుపయిన్ = మడుగుమీద, నిగుడ్చి = ప్రయోగించి, అటన్ = ఆ ప్రదేశమును, ఇంకించెన్ = ఎండగట్టెను.

**తా :** అని చెప్పి సముద్రుడు తన తొలి రూపును పొంది ఉండెను. రాముడును మురియుచు తానెక్కుపెట్టిన బాణమును దృశ్యగుల్మమను మడుగుమీద ప్రయోగించి దానిని ఎండగట్టెను.

**ఆ.వె.** **అంత ప్రొద్దుచూలి యానతిఁ గడలకుఁ**
**దఋల మోర మెకపు దాఁటు లేఁగి**
**గట్లు చెట్లు దెచ్చి కడలిపై వైచిన**
**నవి మునింగిపోయె నబ్బురముగ** **81**

అంత = అంతట, ప్రొద్దుచూలి ఆనతిన్ = సూర్యపుత్రుని (సుగ్రీవుని) ఆజ్ఞతో, కడలకున్ = అన్నివైపులకు, తఋల మోర మెకపు దాటులు = వానర సమూహములు, ఏగి = వెళ్ళి, గట్లు = రాళ్ళు, చెట్లు, తెచ్చి, కడలిపై = సముద్రముపైన, వైచిన = వేయగా, అవి = ఆ వేసినవి, అబ్బురముగ = ఆశ్చర్యముగ, మునింగిపోయె = మునిగిపోయినవి.

**తా :** అంతట సుగ్రీవుని ఆజ్ఞను అన్నివైపులకు వానర సమూహములు వెళ్ళి రాళ్ళు, చెట్లు, తెచ్చి సముద్రముపైన వేయగా, ఆ వేసినవి ఆశ్చర్యముగా మునిగిపోయినవి.

**తే.గీ. మునిఁగిపోవుటఁ గని డెందమున నొకింత**
**సందియంబూనుచో రాచ చందమామ**
**కడకుఁ గ్రమ్మర వచ్చి జక్కరల తేఁడు**
**వెరవు దైవార నిట్లని విన్నవించె 82**

మునిగిపోవుటన్ = మునిగిపోగా, కని = చూచి, డెందమున = మనసులో, ఒకింత = కొంచెము, సందియంబు ఊనుచో = సముద్రుడు మోసము చేశాడని సందేహము కలుగగా, రాచ చందమామ కడకున్ = రాజ చంద్రుడగు రాముని చెంతకు, జక్కరల తేడు = నదుల ప్రభువు (సముద్రుడు), క్రమ్మర వచ్చి = తిరిగి వచ్చి, వెరవు దైవారన్ = ఉపాయము తెలియునట్లుగా, ఇట్లు అని = ఈవిధముగా, విన్నవించె = మనవి చేసెను.

**తా :** మునిగిపోగా చూచి మనసున సముద్రుడు మోసం చేశాడని సందేహ పడుచుండగా ఆ రాముని చెంతకు సముద్రుడు  తిరిగి వచ్చి ఉపాయమును ఇట్లని మనవిచేసెను.

**కం. ఎకిమీడా! విను రావణు**
**నకుఁ జెల్మి యొసంగ మేలొనర్చుచుఁ దనలో**
**నొక రెండు మేటి మీ లే**
**రికిఁ జిక్కక నిచ్చనిచ్చఁ దిమ్మరుచుండున్ 83**

ఎకిమీడా = ప్రభూ!, విను = వినుము, రావణునకున్, చెల్మి ఒసంగ = మిత్రత్వము చూపుటకు, మేలు ఒనర్చుచు = వానికి హితమును కూర్చుచు, తనలో = తనయందు (సముద్రములో), ఒక రెండు = ఒక్కరెండు, మేటి మీలు = గొప్పవగు చేపలు, ఏరికిన్ చిక్కకన్ = ఎవరికిని దొరకకుండా, ఇచ్చనిచ్చున్ = స్వేచ్ఛగా, తిమ్మరుచుండున్ = తిరుగుచుండును.

**తా :** ప్రభూ! విను. రావణునకు మిత్రత్వము చూపుటకు వానికి హితమును కూర్చుచు తనలో ఒక రెండు చేపలు ఎవరికి దొరకకుండా స్వేచ్ఛగా తిరుగుచుండును.

**కం. ఆ చేప లిపుడు మీరలు**
**వైచిన మల లెల్ల మ్రింగివైచెఁ జుమీ! యో**
**రాచల్వ తేఁడ! పదిలుఁడ**
**వై చెచ్చెర నడవఁ గట్టఁ బంపుము నలునిన్ 84**

ఇపుడు = ఇప్పుడు, ఆ చేపలు, మీరలు = మీరు, వైచిన = వేసిన, మలలు ఎల్లన్ = రాళ్ళను అన్నిటిని, మ్రింగివైచెన్ చుమీ = మ్రింగివేసినవి సుమా!, ఓ రా చల్వతేడ = ఓ రాజచంద్రమా!, పదిలుడవై = జాగరూకుడవై, చెచ్చెరన్ = వెంటనే, నడవన్ కట్టన్ = మార్గము కట్టుటకు, నలునిన్ = నలుని, పంపుము = పంపించుము.

**తా :** అవి రాళ్ళనన్నిటిని మింగివేసినవిసుమా! ఓ రాజచంద్రమా! జాగరూకుడవై వెంటనే సేతువు కట్టుటకు నీలుని పంపించుము.

**చం.** **అనవుడు నేలఱేఁడు వెఱఁగందుచు నప్పుడె కట్టఁగట్టఁ బె**
**ల్లున నలుఁ బూన్చి కోఁతుల నెలుంగులఁ గొండలు దెండటంచుఁ బం**
**పిన నొగి వార లందఱును బెల్లు గనంబడఁ గ్రేళ్ళు దాటుచున్**
**జని కడ లెల్లఁ గ్రమ్ముకొని చట్టులు బిట్టు పెకల్చి వ్రేల్మిడిన్** **85**

అనవుడు = తరువాత, నేలఱేడు = రాముడు, వెఱగు అందుచు = ఆశ్చర్యపడుచు, అప్పుడె = వెంటనే, కట్టన్ కట్టన్ = సేతువు కట్టుటకు, పెల్లునన్ = ఒక్కసారిగా, నలున్ పూన్చి = నలుని నియమించి, కోతులన్ ఎలుంగులన్ = కోతులను ఎలుగుబంట్లను, కొండలు తెండు అటంచు = బండలను తీసుకొని రమ్మని, పంపినన్ = పంపగా, ఒగి = వరుసగా, వారలు అందఱును = వారందరును, పెల్లు కనంబడన్ = ఆధిక్యము గోచరించునట్లుగా, క్రేళ్ళు దాటుచున్ = గంతులు వేయుచు, చని = వెళ్ళి, కడలు ఎల్లన్ = దిక్కులన్నిటియందును, క్రమ్ముకొని = వ్యాపించి, చట్టులు = రాళ్ళు, బిట్టు పెకల్చి = బలవంతముగా పెకలించి, వ్రేల్మిడిన్ = చిటికెలో (క్షణంలో),

**తా :** తరువాత రాముడు వెంటనే సేతువు కట్టుటకు నలుని నియమించి కోతులను, ఎలుగుబంట్లను కొండలను, బండలను తీసుకొని రమ్మని పంపగా వరుసగా వారందరు గొప్పగా గంతులు వేయుచు వెళ్ళి దిక్కులన్నిటిని వ్యాపించి క్షణంలో రాళ్ళు పెకలించి –

**తే.గీ.** **ప్రొద్దు నిసువును గాడుపు బొట్టియఁడును**
**వేల్పురాయని మనుమఁడు వెనుక చూపు**
**మెకపుఱేఁడును మొదలగు మేటి మగలు**
**గ్రొత్త లా గొప్ప పెనుగట్టు లెత్తుకొనిరి** **86**

ప్రొద్దు నిసువును = సూర్యుని కొడుకు సుగ్రీవుడును, గాడుపు బొట్టియడును = వాయు పుత్రుడగు హనుమయును, వేల్పురాయని మనుమడు = ఇంద్రుని కొడుకు వాలి, వాలి కొడుకు అంగదుడును (ఇంద్రుని మనుమడు), వెనుకచూపు మెకము ఱేడును = ఎలుగుబంట్ల స్వామి జాంబవంతుడును, మొదలగు = మొదలైన, మేటి మగలు = వీరవరులు, క్రొత్త లావు ఒప్పన్ =నూతనోత్సాహముతో, పెను గట్టులు = పెద్ద పెద్ద రాళ్ళను, ఎత్తుకొనిరి = మోసిరి.

**తా :** నూతనోత్సాహముతో సుగ్రీవుడు, హనుమ, అంగదుడు, జాంబవంతుడు మొదలైన వీరులు పెద్దపెద్ద రాళ్ళను మోసిరి.

**తే.గీ.** **మఱియుఁ దక్కిన మ్రాను ద్రిమ్మరి కడింది**
**మగలు తమతమ పేర్మికిఁ దగిన కొలఁది**
**గట్టు చెట్టును గొనివచ్చి కడలియందు**
**వైచుచుండిరి యెకిమీఁడు చూచి మెచ్చ** **87**

మఱియున్ = మరియును, తక్కిన = మిగిలిన, మ్రానుద్రిమ్మరి = వానరులలో, కడింది మగలు = మిక్కిలి బలవంతులు, తమ తమ = తమయొక్క, పేర్మికిన్ = బలమునకు, తగిన కొలది = తగినటువంటి, గట్టు చెట్టును = రాయిని, చెట్టును, కొనివచ్చి = తీసుకొనివచ్చి, ఎకిమీడు = రాముడు, చూచి మెచ్చ = చూచి మెచ్చుకునేలా, కడలియందు, వైచుచుండిరి = పడవేయుచుండిరి.

**తా :** మరియు మిగిలిన వానరులలో మిక్కిలి బలవంతులు తమ బలమునకు తగిన రాళ్ళను, చెట్లను తెచ్చి రాముడు మెచ్చుకునేలా సముద్రమున పడవేయుచుండిరి.

**తే.గీ.** **అత్తెఱంగున మలమన్కి మొత్తములు గ**
**డంక దైవారఁ జెట్లుఁ గొండలును దెచ్చి**
**వైవ నాలుగు నాళ్ళ కవ్వలఁతియైన**
**నలుఁడు గడలికి నిండార నడవఁ గట్టె** **88**

ఆ తెఱంగున = ఆ విధముగా, మల మన్కి మొత్తములు = వానర సమూహములు, కడంక = పట్టుదల, దైవారన్ = అతిశయించగా, చెట్లు, కొండలును, తెచ్చి, వైవ = పడవేయగా, నాలుగు, నాళ్ళకు = రోజులకు, ఆ వలతియైన = ఆ సమర్థుడైన, నలుడు = విశ్వకర్మ కొడుకు నలుడు, కడలికి = సముద్రమునకు, నిండార = పూర్తిగా, నడవన్ = మార్గమును, కట్టె = కట్టెను.

**తా :** ఆ విధముగా వానర సమూహములు పట్టుదలతో చెట్లు, కొండలు తెచ్చి పడవేయగా నాలుగు రోజులకు నలుడు సముద్రమునకు పూర్తిగా మార్గమును కట్టెను.

**ఉ.** **కట్టుట కుబ్బి రాచనెల గాములరాయని పట్టిఁ జూచి మీ**
**చెట్టు బిడారపుం దొరలఁ జెచ్చెర మూఁకల తోడఁ గూడి యి**
**క్కట్టపయి న్నెటి న్నడువఁగాఁ బనికొల్పుము పేర్మినా నతం**
**డట్టులె పౌజులం బిలిచి యానతి యిచ్చినఁ బొంగి వ్రేల్మిడిన్** **89**

రాచనెల = రాజచంద్రుడగు రామచంద్రుడు, కట్టుటకు ఉబ్బి = సేతువు కట్టుటకు పొంగిపోయి, గాముల రాయని పట్టిన్ = గ్రహముల కధిపతి యగు సూర్యుని పుత్రుని, చూచి = కనుగొని, మీ = మీయొక్క, చెట్టు బిడారపుం దొరలన్ = చెట్లే ఆవాసముగాకల వానర వీరులను, చెచ్చెరన్ = శీఘ్రముగా, మూకలతోడన్ = వారివారి సైన్యములతో, కూడి, ఈ కట్టపయిన్ = ఈ సేతువుమీదుగా, నెఱిన్ = చక్కగా, నడువన్ కాన్ = నడచునట్లుగా, పని కొల్పుము = ఆజ్ఞాపింపుము, పేర్మినాన్ = ప్రీతితో, అతండు = ఆ సుగ్రీవుడు, అట్టులె = ఆ విధముగానే, పౌజులం పిలిచి = సైన్యములను పిలిచి, ఆనతి ఇచ్చిన = ఆజ్ఞ యిడగా, పొంగి = ఉత్సాహముతో, వ్రేల్మిడిన్ = క్షణములో,

**తా :** సేతువు కట్టుటకు పొంగిపోయి రాముడు సుగ్రీవుని చూచి మీ వానర వీరులను సైన్యముతో ఈ సేతువుమీదుగా నడచునట్లుగా పనికొల్పుము. సుగ్రీవుడు ఆ విధముగానే సైన్యములను పిలిచి ఆజ్ఞ ఇచ్చిన ఉత్సాహముతో క్షణములో

**సీ.** **కోయని యార్చుచుఁ గుప్పించి దాటుచు**
**నేలలు వాడుచు నీల లిడుచు**
**మెఱములు వైచుచు మింటికి నెగయుచుఁ**
**జప్పటల్ సఱచుచు గుప్ప నడుచు**
**నొండొరుఁ గడచుచు నుఱువులు సూపుచుఁ**
**బాతర లాడుచుఁ బఱువు గొనుచు**

నీటిపై నుఱుకుచు నేటుగా నీఁదుచుఁ
క్రమ్మఱ నడవకు దొమ్మిఁ జనుచు

తే.గీ. పుడమి యీనిన వడువున నెడ యొకింత
లేక యేకడఁ జూచిన లెక్కసేయ
రాక తేఁకువ నక్కోఁతి మూఁక యెలమి
నడిచి బడిబడి మున్నీరు గడచు చుండె **90**

ఆ కోతిమూక = ఆ కోతుల సమూహము, ఎలమిన్ = సంతోషముతో, కోయని యార్చుచున్ = కోయని అరచుచు, కుప్పించి దాటుచున్ = ఊపిరి బిగపట్టి ఎగురుచు, ఏలలు పాడుచున్ = పాటలు పాడుచు, ఈల లిడుచు = ఈలలు వేయుచు, మెఱములు వైచుచు = పిల్లిమొగ్గలు వేయుచు, మింటికిన్ ఎగయుచున్ = ఆకాశమున కెగురుచు, చప్పటల్ చఱుచుచు = చప్పట్లు చరుస్తూ, గుప్ప నడచున్ = గుంపులుగా నడుస్తూ, ఒండొరున్ కడచుచున్ = ఒకరినొకరు దాటిపోవుచు, ఉఱువులు చూపుచున్ = (కోతిచేయు ధ్వనిని ఉఱువు అంటారు) ధ్వనులు చేయుచు, పాతరలు ఆడుచున్ = నాట్యము చేయుచు, పఱువు గొనుచు = పరుగులు పెడుతూ, నీటిపైన్ ఉఱుకుచు = నీటిలోకి దుముకుచు, నేటుగాన్ ఈదుచున్ = ధైర్యంగా ఈదులాడుచు, క్రమ్మఱ = తిరిగి, నడవకు = సేతువుకు, దొమ్మిన్ = సందడిగా, చనుచున్ = చేరుచూ, పుడమి ఈనిన వడువున = నేల ఈనిందా అనునట్లుగా, ఎడ ఒకింత లేక = కొంచెము కూడా ఖాళీలేకుండా, ఏకడన్ చూచిన = ఏవైపు చూచినా, లెక్క చేయ రాక = లెక్క పెట్టుటకు వీలుపడక, తేకువన్ = ధైర్యముతో, నడిచి, బడిబడిన్ = వేగముగా, మున్నీరు, గడచుచుండె = దాటుచుండిరి.

**తా :** ఆ వానరులు సంతోషముతో కోయని అరచుచు, కుప్పించుచు, ఏలలు పాడుచు, ఈలలు వేయుచు, పిల్లిమొగ్గలు వేయుచు, ఆకాశమున కెగురుచు, చప్పట్లు చరుస్తూ, గుంపులుగా నడుస్తూ, ఒకరినొకరు దాటిపోతూ, ఉఱువులు చేయుచూ, నాట్యము చేయుచు, పరుగులు పెడుతూ, నీటిలో దుముకుచు, ఈదులాడుచు, తిరిగి సేతువుకు సందడిగా చేరుచూ, నేల ఈనిన విధముగా కొంచెంకూడా ఖాళీలేకుండా ఏవైపుచూచినా లెక్కకు మీఱి ధైర్యముగా నడిచి వేగంగా సముద్రమును దాటుచుండిరి.

తే.గీ. అంతఁ గోతుల దొర తన చెంత రాఁగ
అంగదుని మీఁదఁ దమ్ముఁడు నాకసంబు
కూర్మి మనుమనిపైఁ దానుఁ బేర్మి నెక్కి
పుడమి కాపరి మేల్బంతి గడలి దాటె **91**

అంతన్ , కోతుల దొర = సుగ్రీవుడు, తన చెంత రాగ = తనను సమీపించగా, అంగదునిమీద తమ్ముడు, ఆకసంబు కూర్మి మనుమనిపైన్ తానున్ = (ఆకాశమునుండి పుట్టినది వాయువు, వాయువు కొడుకు ఆంజనేయుడు) హనుమపై తానును, పేర్మిన్ = ప్రీతితో, ఎక్కి, పుడమి కాపరి మేల్బంతి = రాజశ్రేష్ఠుడగు రాముడు, కడలి దాటె = సముద్రమును దాటెను.

**తా :** అంతట సుగ్రీవుడు తనను సమీపించగా అంగదుని మీద తమ్ముడు, వాయుపుత్రునిపై తానును ప్రీతితో ఎక్కి రాముడు సముద్రమును దాటెను.

**ఆ.వె.** **దాటి మున్నె పోయి దరి డిగ్గియున్న మూఁ**
**కలు విభీషణుండుఁ గలిసి కొలువ**
**వేగఁ దరలి దొర సువేలంబు చేరువ**
**పుడమిఁ జుట్టుముట్టి కడఁకనుండె** **92**

దాటి = సముద్రమును దాటి, మున్నె = ముందుగా, పోయి = వెళ్ళి, దరిన్ = ఒడ్డున, డిగ్గియున్న మూకలు = దిగియున్న సైన్యములు, విభీషణుండున్, కలిసి = కూడి, కొలువ = సేవింపగా, వేగన్ = శీఘ్రముగా, తరలి = బయలుదేరి, దొర = రాముడు, సువేలంబు చేరువ = సువేల పర్వత సమీపమున, పుడమిన్ = కల ప్రదేశము, చుట్టముట్టి = ఆక్రమించి, కడకన్ ఉండె = యుద్ధప్రయత్నముతో ఉండెను.

**తా :** దాటి ముందుగా వెళ్ళి ఒడ్డున దిగిన సైన్యములు, విభీషణుడును కలిసి కొలువ శీఘ్రముగా బయలుదేరి రాముడు సువేల పర్వతము చేరువనకల ప్రదేశమును ఆక్రమించి యుద్ధప్రయత్నములో ఉండెను.

**సీ.** **అటువలెనుండుట దిటముగ వేగుల**
**వారలవలన రావణుఁ డెఱింగి**
**కోటలు కొమ్మలు క్రొత్తదమ్ములు పెద్ద**
**గవకులు నరవళ్ళు గట్టి పఱచి**
**కొడుకుల దొరలఁ బ్రెగ్గడల బందుగుల నొం**
**టరులఁ దీర్పరుల దట్టముగఁ గూర్చి**
**లెక్క కెక్కువలగు రక్కసి మూఁకల**
**బరవసం బొనరించి పత్తెఱఁగుల**
**తే.గీ.** **హెచ్చరికఁ జేసి వీట నెల్లెడలఁ గాపు**
**లిడి దురంబున కేడ్తెఱఁ గడఁగుచుండె**
**నంత మూఁకలతో రాముఁ డచటఁ దరలి**
**లంకపైఁ బోరి కరిగె జలంబు మెఱయ** **93**

అటువలెన్ ఉండుట = ఆ విధముగా సన్నద్ధతను, దిటముగ = వివరంగా, వేగులవారల వలన = చారుల వలన, రావణుడు ఎఱింగి = రావణుడు తెలుసుకొని, కోటలు కొమ్మలు = కోట శిఖరములు, క్రొత్తదమ్ములు = బురుజులు, పెద్దగవకులు = కోటద్వారములు, అరవుళ్ళు = శిధిలమైన భాగములు, గట్టి పఱచి = గట్టి చేసుకుని, కొడుకుల = తన కుమారులను, దొరలన్ = సేనానాయకులను, ప్రెగ్గడలన్ = మంత్రులను, బందుగులన్ = బంధువులను, ఒంటరులన్ = అసహాయ శూరులను, తీర్పరుల = కార్యనిర్వాహకులను, దట్టముగ కూర్చి

= అధికముగా సమావేశపరచి, లెక్కకు ఎక్కువలగు = గణించుటకు అధికమైన, రక్కసి మూకలన్, పరవసం బొనరించి = ఉత్సాహ పరచి, పలు తెఱగుల = అనేక విధములుగా, హెచ్చరిక చేసి = జాగ్రత్తలు చెప్పి, వీటన్ ఎల్లెడలన్ = నగరమున అన్నిచోట్లను, కాపులు ఇడి = కాపలానుంచి, దురంబునకు = యుద్ధమునకు, ఏడ్తెఱన్ = బయలుదేరుటకు, గడంగుచుండెను = సిద్ధపడు చుండెను, అంత = అంతట, మూకలతో = సైన్యములతో, రాముడు, అచటనుండి = ఆ సువేల పర్వతమునుండి, తరలి = బయలుదేరి, లంకపైన్, చలంబు మెఱియ = పట్టుదల ప్రకాశింపగా, పోరికి అరిగె = యుద్ధమునకు వెళ్ళెను.

**తా :** ఆ సన్నద్ధతను రావణుడు చారులవలన విని కోట శిఖరములు, బురుజులు, కోట ద్వారములు, ఆహార పదార్థములు గట్టిచేసుకొని, తన కుమారులను, సేనా నాయకులను, మంత్రులను, బంధువులను, రక్షకులను, న్యాయ నిర్ణేతలను సమావేశపరచి రాక్షస సమూహములకు భరోస కల్పించి, అనేక విధములుగా జాగ్రత్తలు చెప్పి, నగరమున అన్నిచోట్లను కాపలానుంచి యుద్ధమునకు సిద్ధపడుచుండెను. అంతట సైన్యములతో రాముడు సువేల పర్వతమునుండి బయలుదేరి లంకపై యుద్ధమునకు వెళ్ళెను.

**ఆ.వె.** **అరిగి బంట్ల కెల్ల నానతి యిడ వారు**
**గట్లుఁ జెట్లుఁ బూని కడఁగి రనికి**
**విండ్లు కైదువులును వెసఁ బూని రాకాసి**
**దొరలు వారితోడఁ దొడరి రదరి** **94**

అరిగి = వెళ్ళి, బంట్లకు ఎల్లన్ = సైనికులందరికి, ఆనతి ఇడ = ఆజ్ఞాపింపగా, వారు = ఆ సైనికులు, గట్లున్ = రాళ్ళను, చెట్లున్ = చెట్లను, పూని = పట్టుకొని, అనికి = యుద్ధమునకు, కడగిరి = సిద్ధమైరి, రాకాసి దొరలు = రాక్షస వీరులు, విండ్లు = ధనుస్సులు, కైదువులును = ఆయుధములును, వెసన్ పూని = వేగముగా పట్టుకొని, వారితోడన్ = ఆ వానరులతో, అదరి = అతిశయించి పోరాడగా, తొడరిరి = సిద్ధపడిరి.

**తా :** వెళ్ళి సైనికులందరికి ఆనతి ఇడ, ఆ సైనికులు రాళ్ళను, చెట్లను పట్టుకొని యుద్ధమునకు సిద్ధమైరి. రాక్షసవీరులు ధనుస్సులు, కైదువులు పట్టుకొని వానరులతో పోరుకు సిద్ధపడిరి.

**తే.గీ.** **అపుడు కనికరముల గనియైన రాముఁ**
**డంగదుని డాయఁ బిల్చి నీ వగ్గరాసు**
**రక్కసుల ఱేని కడ కేఁగి యొక్కమాట**
**గట్టిగాఁ దెల్పి రమ్మని యిట్టులనియె** **95**

అపుడు, కనికరముల గనియైన = కరుణా నిధియైన, రాముడు, అంగదుని, డాయన్ పిల్చి = చేరువకు పిలిచి, నీవు, ఆ గరాసు = ఆ గర్వితుడైన, రక్కసుల ఱేనికడకు = రావణుని యొద్దకు, ఏగి = వెళ్ళి, ఒక్కమాట = ఒకే ఒక్క మాటను, గట్టిగాన్ = దృఢముగా, తెల్పి రమ్ము అని = చెప్పి రావలసినదని, ఇట్టులు అనియె = ఈ ప్రకారముగా తెలిపెను.

**తా :** అపుడు కరుణానిధియైన రాముడు అంగదుని పిలిచి నీవు ఆ గర్వితుడైన రావణుని యొద్దకు వెళ్ళి ఒకే ఒక్క మాటను గట్టిగా చెప్పి రావలసినదని తెలిపెను.

**కం.** **మ్రుచ్చుఁదనంబున సీతం**
**దెచ్చితి వికనైన మేలు తెఱఁగూనుక నీ**
**వ చ్చిగురుబోఁడిఁ గ్రమ్మర**
**నిచ్చి కొలంబెల్లఁ బ్రోది యిడుకొను మనుమీ! 96**

మ్రుచ్చుతనంబున = దొంగతనముగా, సీతం తెచ్చితివి = సీతను తెచ్చితివి, ఇకనైన = ఇప్పుడైననూ, మేలు తెఱగు ఊనుక = సన్మార్గమును పొంది, నీవు, ఆ చిగురుబోడిన్ = ఆ చిగురువంటి మృదు దేహముకల సీతను, క్రమ్మరన్ = తిరిగి, ఇచ్చి = సమర్పించి, కొలంబు ఎల్లన్ = వంశమునంతను, ప్రోది ఇదుకొనుము = రక్షించుకొనుము, అనుమీ = చెప్పుమా!

**తా :** దొంగతనముగా సీతను తెచ్చితివి. ఇప్పుడైనా సన్మార్గమును పొంది నీవు ఆ సీతను తిరిగి ఇచ్చి వంశమునంతను రక్షించుకొనుమని చెప్పుము.

**కం.** **మూఁకలు చుట్టలు కొడుకులుఁ**
**జాకుండు తెఱంగు గనుము సరగ నటంచున్**
**డాకొని యెఱిఁగింపు మటుల్**
**గాకుండిన దుర మొనర్పఁగా రమ్మనుమీ! 97**

మూకలు = సైన్యములు, చుట్టలు = బంధువులు, కొడుకులు, చావక ఉండు = చావకుండునట్టి, తెఱంగు = మార్గము, సరగన్ = తొందరగా, కనుము = చూడుము, అటంచున్, డాకొని = ఆ రావణుని చేరి, ఎఱిగింపుము = తెలియ చెప్పుము, అటుల్ కాకుండిన = అలా కాకపోయినట్లైతే, దురము = యుద్ధము, ఒనర్పగా = చేయుటకు, రమ్ము అనుమీ = రావలసినదని చెప్పుమా!

**తా :** సైన్యములు, బంధువులు, కొడుకులు చావకుండునట్టి మార్గము తొందరగా చూడుము అనుచు ఆ రావణుని చేరి తెలియచెప్పుము. అలా కానిచో యుద్ధమునకు రమ్మనుము.

**ఆ.వె.** **అనిన వేల్పు ఱేని మనుమఁడుల్లములోనఁ**
**బొంగి యపుడె తరలి నింగి నరిగి**
**పొలసుదిండి మిన్న కొలువున్న బలు హజా**
**రంబులోన నిలిచె దంబుమీఱ 98**

అనినన్ = అనగా, వేల్పు ఱేని మనుమడు = ఇంద్రుని మనుమడు అంగదుడు, ఉల్లములోన = మనసులో, పొంగి = ఆనందించి, అపుడె = వెంటనే, తరలి = బయలుదేరి, నింగిన్ అరిగి = ఆకాశమార్గమున వెళ్ళి, పొలసు తిండి మిన్న = రాక్షస శ్రేష్ఠుడైన రావణుడు, కొలువు ఉన్న = సభ తీరియున్న, బలు = గొప్పదియగు, హజారంబులోన = కొలువు కూటమునందు, దంబు మీఱ = మిక్కిలి ధైర్యముతో, నిలిచె = నిలబడెను.

**తా :** అనగా అంగదుడు ఉత్సాహముగా వెంటనే బయలుదేరి ఆకాశమార్గమున వెళ్ళి రావణుడు కొలువున్న కొలువు కూటమునందు ధైర్యముగా నిలబడెను.

**చం. నిలిచినఁ జూచి రక్కసులు నివ్వెఱ యూనుచు బొబ్బరించుచు**
**న్వెలవెలఁ బోవుచుం గడలు నింగియుఁ జూచుచు నౌర! మున్ను లా**
**వెలయఁగ లంకఁ గాల్చి తము నేఁచిన కోఁతియె నేఁడు గ్రమ్మఱం**
**గలనికి వచ్చెనంచును బికాపికలై పఱతెంచి రందఱున్ 99**

నిలిచినన్ = నిలబడగా, చూచి, రక్కసులు, నివ్వెఱ యూనుచు = మిక్కిలి ఆశ్చర్యపడుచు, బొబ్బరించుచున్ = అట్టహాసములు చేయుచు, వెలవెల పోవుచు = తెల్లపోవుచు, కడలు నింగియు చూచుచును = దిక్కులు, ఆకాశము చూచుచు, ఔర = ఎంత ఆశ్చర్యము!, మున్ను = ఇంతకు ముందు, లావు ఎలయగ = వాని శక్తి స్పష్టముకాగా, లంకన్ కాల్చి = లంకను కాల్చి, తమున్ ఏచిన = తమను బాధించిన, కోతియె = ఆ వానరమే, నేడు = ఇప్పుడు, క్రమ్మఱన్ = తిరిగి, కలనికి = పోరునకు, వచ్చెను అంచును = వచ్చెననుచు, అందఱున్ = ఆ సభలోని వారందరును, పికాపికలై = దిక్కుకొకర్త్రై, పఱతెంచిరి = పారిపోయిరి.

**తా :** నిలబడగా చూచి రాక్షసులు ఆశ్చర్యపడుచు, అట్టహాసములు చేయుచు తెల్లపోవుచు, దిక్కులు చూచుచు ఎంత ఆశ్చర్యము? ఇంతకుముందు వాని శక్తి స్పష్టము కాగా లంకను కాల్చి తమను బాధించిన ఆ వానరమే ఇప్పుడు తిరిగి పోరునకు వచ్చెననుచు అందరును పికాపికలై పారిపోయిరి.

**ఆ.వె. అట్లు పఱచు వారిఁ బొట్లముగా మర**
**లించి సోఁకు ఱేఁడు గొంచుగాని**
**కినుకతోడ నతనిఁ గనుగొని బొమముడు**
**లదర నిట్టు లనుచు నుదరి పలికె 100**

అట్లు = ఆ విధముగా, పఱచు వారిన్ = పారిపోవుచున్నవారిని, పొట్లముగా = సమూహముగా, మరలించి = వెనుకకు త్రిప్పి, సోకుఱేడు = రాక్షసరాజు రావణుడు, కొంచుగాని = అధికమైన, కినుకతోడ = కోపముతో, అతనిన్ = ఆ అంగదుని, కనుగొని, బొమముడులు = కనుబొమలు, అదరన్ = అదురుచుండగా, ఉదరి = అదిరిపడి, ఇట్టులు అనుచు పలికె = ఈ రీతిగా పలికెను.

**తా :** ఆ విధముగా పారిపోవుచున్న వారిని సమూహముగా వెనుకకు త్రిప్పి రావణుడు కోపముతో ఆ అంగదుని చూచి కనుబొమలు అదర ఈ రీతిగా పలికెను.

**ఉ. ఓరి వెడంగు మ్రాన్మనికి యొంటరికాన! తలంకమాలి యి**
**ట్లూరక బల్లిదంపు పొలయోరెపు మూఁకలలోని కెట్టుగాఁ**
**జేరితి? వెవ్వడంపె నినుఁ జేద్పడఁ జేయఁ దలంచి? యింక నీ**
**యూరును బేరుఁ జెప్పుకొను మున్నటులన్నియు నంతనయ్యెడిన్ 101**

ఓరి వెడంగు మాన్మనికి = ఓరి పిచ్చి వానరా!, ఒంటరికాన = ఒంటరివాడా!, తలంకమాలి = భయములేక, ఇట్లు = ఈ విధముగా, ఊరక = ఏమీ తోచక, బల్లిదంపు = బలవంతులైన, పొల యోరెపు మూకలలోనికి = రాక్షస సమూహములోనికి, ఎట్టుగాన్ = ఏ విధముగా, చేరితివి,

నినున్ = నిన్ను, చేటు పడన్ = నష్టపోయేటట్లుగా, చేయ తలంచి = చేయ తలచి, ఎవ్వడు అంపె = ఎవరు పంపేరు?, ఇంక = ఇక, నీ = నీయొక్క, ఊరును పేరున్, ఉన్నటులు = సత్యముగా, చెప్పుకొనుము, అంతన్ = ఆపైన, అన్నియు = అన్నియును, అయ్యెడిన్ = అవుతాయి.

**తా :** ఓరి పిచ్చి వానరా! ఒంటరివాడా! భయములేక ఈ విధంగా బలవంతులైన రాక్షస సమూహం లోకి ఏ విధంగా చేరేవు? నిన్ను నష్టపోయేట్టుగా చేయతలచి ఎవరు పంపేరు? ఇక నీ ఊరు పేరు ఉన్నట్టు చెప్పు. ఆపైన అన్నీ అవుతాయి.

**కం.** **మొన్న నొక కోఁతి యెక్కటి**
**మున్నరక న్వచ్చి తోఁక మొదలికి ముట్టన్**
**మిన్నక కాల్పించుక మఱి**
**సన్నక సన్నం దొలంగి చనియెం జుమ్మీ! 102**

మొన్నను = ఇంతకు పూర్వము, ఒక కోతి ఎక్కటి = ఒంటిరిగా ఒక కోతి, మున్నరకన్ = ధైర్యముతో, వచ్చి = వచ్చి, తోక మొదలికి ముట్టన్ = తోక చివరివరకు అంటుకునేలా, మిన్నక = ఊరక, కాల్పించుక = కాల్పించుకొని, మఱి = ఇంక, సన్నక సన్నం = అతి నీచముగా, తొలంగి = తప్పుకొని, చనియెం చుమీ = వెళ్ళింది సుమా!

**తా :** ఇంతకు పూర్వము ఒక కోతి ఒంటరిగా ధైర్యంగా వచ్చి తోక కాల్పించుకుని అతి నీచముగా తప్పుకొని వెళ్ళింది సుమా!

**కం.** **అమ్మాట నీవు సెవులఁ ది**
**రమ్ముగ విన్నావొ? లేదొ? రక్కసి బంటుల్**
**గ్రమ్ముకొని వానిఁ జేసిన**
**య మ్ములుచ పను ల్దలంప నచ్చెరువుగదా! 103**

ఆ మాట = ఆ విషయము, నీవు = నీవు, చెవులన్ = చెవులతో, తిరమ్ముగ = నిశ్చయముగా, విన్నావొ లేదొ = విన్నావో లేదో? రక్కసి బంటుల్ = రాక్షస వీరులు, క్రమ్ముకొని = చుట్టుముట్టి, వానిన్ = అపుడు వచ్చిన కోతిని, చేసిన = చేసినటువంటి, ఆ ములుచ పనుల్ = ఆ మూర్ఖపు పనులు, తలంపన్ = జ్ఞప్తికి తెచ్చుకొనగా, అచ్చెరువు కదా = ఆశ్చర్యమును కలిగించునుకదా!

**తా :** ఆ మాట నీవు చెవులతో నిశ్చయంగా విన్నావో? లేదో? రాక్షస వీరులు చుట్టుముట్టి ఆ కోతిని చేసిన ఆ మూర్ఖపుపనులు జ్ఞప్తికి తెచ్చుకొనగా ఆశ్చర్యం కలుగుతుందికదా!

**ఆ.వె.** **అనిన వానిఁ జూచి యంగదుఁ డిట్లని**
**పలికె నించుకైన నలుకు లేక**
**యోరి! బెరసు పొలసుటోరెంపు తేఁడ! నా**
**పలుకు వినుర! వింత తలఁపు మాని 104**

అనినన్ = అని పలుకగా, వానిన్ = ఆ రావణుని, చూచి, అంగదుడు, ఇంచుక ఐన = కొంచెమైనను, అలుకు లేక = భయము లేక, ఇట్లు అని పలికెన్ = ఇలాగని పలికెను, ఓరి, బెరసు = మూర్ఖుడవైన,

పొలసుటోరెంపు ఱేడ = రాక్షసరాజా!, వింత తలపు మాని = విచిత్రమైన ఆలోచనలు మాని, నా పలుకు వినుర = నా మాట వినరా?

**తా :** అనగా రావణుని చూచి అంగదుడు కొంచెమైనా భయంలేక ఇట్లు పలికెను 'ఓరి మూర్ఖ రాక్షసరాజా! విచిత్రమైన ఆలోచనలు మాని నామాట వినరా?

**కం.** **నిను బెక్కేడులు చెఱ నుని**
**చిన నయ్యర్జునుని వేయి చేతులు వరుసం**
**దునిమిన బలియునిఁ గడు ను**
**క్కున గెలిచిన నేలఱేని కూరిమి బంటున్** **105**

నినున్ = నిన్ను, పెక్కు ఏడులు = పలు వర్షములు, చెఱన్ = చెఱలో, ఉనిచిన = ఉంచిన, ఆ అర్జునుని = ఆ కార్తవీర్యార్జునుని, వేయి చేతులు, వరుసం = ఒక్కటొక్కటిగా, తునిమిన = నరికివేసిన, బలియునిన్ = బలవంతుడగు భార్గవరాముని, కదున్ = మిక్కిలి, ఉక్కున = శౌర్యముతో, గెలిచిన = జయించిన, నేల ఱేని = రాముని, కూరిమి, బంటున్ = సేవకుడను.

**తా :** నిన్ను పలు వర్షములు చెఱలో ఉంచిన ఆ కార్తవీర్యుని వేయి చేతులు ఒక్కటొక్కటిగా నరికివేసిన బలవంతుడగు భార్గవరాముని శౌర్యముతో జయించిన రాముని సేవకుడను.

**ఆ.వె.** **నిన్నుఁ దోఁకఁ జుట్టి మున్నీటఁ బలుమఱు**
**ముంచి కనికరంబు మించి మరల**
**విడిచినట్టి వాలి కొడుక నంగదుఁడను**
**వాఁడ ఱేఁడు వనుప వచ్చినాఁడ** **106**

నిన్నున్ = నిన్ను, తోకన్ చుట్టి = తోకకు చుట్టుకొని, మున్నీటన్ = సముద్రములో, పలుమఱు = అనేకమార్లు, ముంచి, కనికరంబు మించి = మిక్కిలి కరుణతో, మరల = తిరిగి, విడిచినట్టి = విడిచిపెట్టిన, వాలి కొడుకన్ = వాలి కొడుకునైన, అంగదుడు అనువాడ = అంగదుడను పేరు కలవాడను, ఱేడు = రాముడు, పనుప వచ్చినాడ = పంపగా వచ్చితిని.

**తా :** నిన్ను తోకకు చుట్టుకొని సముద్రములో అనేకమార్లు ముంచి మిక్కిలి కరుణతో తిరిగి విడచిపెట్టిన వాలి కొడకును అంగదుడను, రాముడు పంపగా వచ్చితిని.

**కం.** **మా రాయఁడు నను నీపైఁ**
**గూరిమిచే బుద్ధిఁ దెలుపుకొఱకై పనిచెన్**
**నేరుపరివగుచుఁ దద్దయుఁ**
**జేరిక వెలయంగ నతనిఁ జేరి బ్రదుకుమీ!** **107**

మా రాయదు = మా ప్రభువు రాముడు, నను = నన్ను, నీపైన్ = నీయందు, కూరిమిచే = ప్రేమచేత, బుద్ధిన్ తెలుపుకొఱకై = జ్ఞానము కలిగించుటకై, పనిచెన్ = పంపెను. నేరుపరివి అగుచున్ = బుద్ధిమంతుడవై, తద్దయున్ = మిక్కిలి, చేరిక వెలయంగ = స్నేహభావము ప్రకాశింపగా, అతనిన్ = ఆ రాముని, చేరి = చేరుకొని, బ్రదుకుమీ = బ్రతికిపోవలసినది.

**తా :** మా ప్రభువు రాముడు నన్ను నీయందు ప్రేమచే బుద్ధి గఱపుటకై పంపెను. బుద్ధిమంతుడవై స్నేహభావముతో ఆ రాముని చేరి బ్రదుకుమా!

**చం.** **మొఱకుఁదనంబు పూని జగము ల్వలు చందములం గలంచి యే**
**డ్తెఱఁ దెరగంటి ముద్దియలఁ దెచ్చి కడిందిగఁ బ్రోల నందఱన్**
**జెఱ నిడినట్లకాఁ దలఁచి చేటొనఁ గూడునటన్నమాట లో**
**నెఱుఁగక నేలకాన్పు నిటు లేటికిఁ దెచ్చితి వీవు వెంగలీ!** **108**

వెంగలీ = వెఱ్ఱివాడా!, ఈవు = నీవు, మొఱకు తనంబు = మూర్ఖత్వమును, పూని = వహించి, జగముల్ = లోకములను, పలు చందములన్ = అనేక రీతులుగా, కలంచి = బాధించి, ఏడ్తెఱన్ = అధికముగా, తెఱగంటి ముద్దియలన్ = దేవతా స్త్రీలను, తెచ్చి = తీసుకొనివచ్చి, కడిందిగన్ = బలవంతముగా, ప్రోలన్ = పట్టణమున, అందఱన్ = అందరిని, చెఱనిడిన అట్లకాన్ = కారాగృహమున నుంచినట్లుగా, దలచి = భావించి, చేటు ఒనగూడును = కీడు కలుగును, అటన్నమాట = అను విషయమును, లోన్ ఎఱుగక = మనసులో గుర్తింపక, నేలకాన్పున్ = సీతను, ఈవు = నీవు, ఇటులు = ఈ రీతిగా, ఏటికిన్ = ఇలా ఎందుకు, తెచ్చితివి = తీసుకువచ్చితివి?

**తా :** వెఱ్ఱివాడా! నువ్వు మూర్ఖత్వమును పూని లోకాల్ని అనేకరీతులుగా బాధించి దేవతా స్త్రీలను తెచ్చి బలవంతంగా చెఱనిడినట్లుగా భావించి కీడు కలుగుతుందని గుర్తింపక సీతను నీవు ఈ రీతిగా ఇలా ఎందుకు తీసుకువచ్చావు?

**తే.గీ.** **జగములకు నెల్లఁ దల్లియై పొగడు గన్న**
**మన్ను కాన్పును నీవును గన్న తల్లి**
**కైవడిని జూచుకొనవలెఁగాక యిట్లు**
**తమినిఁ జెఱపట్టి యునుచుట తగవె చెపుమ?** **109**

జగములకున్ ఎల్లన్, తల్లియై, పొగడు కన్న = స్తుతిని పొందిన, మన్ను కాన్పును = భూ పుత్రిని (సీతను), నీవును = నీవుకూడ, కన్నతల్లి కైవడిన్ = మాతృమూర్తినివలె, చూచుకొనవలెన్ కాక = చూచుకొనవలయునుకాని, ఇట్లు = ఈ రీతిగా, తమినిన్ = కోరికతో. చెఱపట్టి = బంధించి, ఉనుచుట = ఉంచుట, తగవె చెపుమ = న్యాయమా చెప్పు?

**తా :** లోకము లన్నింటికి తల్లిగ స్తుతులందిన సీతను నీవుకూడ కన్నతల్లి కైవడి చూచుకోవాలి కాని ఈ రీతిగా కోరి బంధించి ఉంచుట న్యాయమా చెప్పు?

**కం.** **ఏనుఁగులున్ గుఱ్ఱములున్**
**మానికములు మేలి కుందనపుఁ దొడవులు నా**
**ఱేనికిఁ బన్నుగ సీతం**
**గానుక యిడి బ్రతుకు మట్లు కాకున్న యెడన్** **110**

ఏనుగులున్, గుఱ్ఱములున్, మానికములు = మాణిక్యములును, మేలి = శ్రేష్ఠమైన, కుందనపున్ = బంగారపు, తొడవులున్ = ఆభరణములును, ఆ ఱేనికిన్ = ఆ రాజునకు (రామునకు), పన్నుగ

= కప్పముగా, సీతన్ కానుక ఇడి = సీతను కానుకగ యిచ్చి, బ్రతుకుము = జీవింపుము, అట్లు = ఆవిధముగా, కాకున్న ఎడన్ = కాని పక్షమున.

**తా :** ఏనుగులు, గుఱ్ఱములు, మాణిక్యములు, మేలిమి బంగరు ఆభరణములు ఆ రామునకు కప్పముగా సీతను కానుకగా ఇచ్చి బ్రతుకు అలా కాని పక్షమున.

**కం.** **నాడెంపుం బోటరివై**
**పేడెత్తక మొగిసి రాచబెబ్బులితోఁ బో**
**రాడుము వేలుపు లందఱుఁ**
**జూడఁగ నాలమున నిలిచి స్రుక్కని కడిమిన్** **111**

నాడెంపున్ = గొప్ప, పోటరివై = యోధుడవై, పేడెత్తక = తొలగక, మొగిసి = పూని, రాచ బెబ్బులితోన్ = రాచ పులితో, వేలుపులు అందఱున్ = దేవతలందరును, చూడగ = ఆనందముగా చూచుచుండగ, స్రుక్కని కడిమిన్ = వీగిపోని ధైర్యముతో, ఆలమున నిలిచి = సంగరమున నిలిచి, బోరాడుము = యుద్ధము చేయుము.

**తా :** గొప్ప యోధుడవై తొలగక పూని రాచపులితో దేవతలందరును చూడగ వీగిపోని ధైర్యముతో సంగరమున నిలిచి పోరాడుము.

**తే.గీ.** **ఇసుక ప్రోవులుఁ జుక్కలు నెన్నవచ్చుఁ**
**గాని మా ఱేని కడనున్న కోనమన్కి**
**బంట్ల లెక్కింపఁ బొసఁగ దబ్బలియు రింక**
**నిన్నుఁ గనుఁగొన్న బొందితో నిల్వనీరు** **112**

ఇసుక ప్రోవులున్ = ఇనుక రేణువులను, చుక్కలున్ = నక్షత్రములను, ఎన్నవచ్చు = లెక్క పెట్టవచ్చును, కాని, మా ఱేని కడనున్న = మా ప్రభువు దగ్గరనున్న, కోనమన్కి బంట్ల = వానర సైన్యమును, లెక్కింపన్ = లెక్కపెట్టుటకు, పొసగదు = కుదరదు, ఆ బలియురు = ఆ వీరులు, ఇంక = ఇకమీదట, నిన్నున్, కనుగొన్న = చూచినచో, బొందితో నిల్వనీరు = ప్రాణాలతో ఉండనివ్వరు.

**తా :** ఇసుక రేణువులను, నక్షత్రములను లెక్కపెట్టవచ్చును. కాని మా ప్రభువు దగ్గరున్న వానర సైన్యమును లెక్కపెట్టుటకు కుదరదు. ఆ వీరులు ఇక మీదట నిన్ను చూస్తే ప్రాణాలతో ఉండనివ్వరు.

**తే.గీ.** **మొన్న నీ లంకఁ గాలిచి చన్న కోఁతి**
**మిన్నయును నేను వారిలో సన్నగాంద్ర**
**మనుచు నిటువంటి కొఱగాని పనుల కనుపు**
**జుమ్ము మము నిర్వురను ఱేఁడు సోఁకు ఱేఁడ!** **113**

సోకుఱేడ = రాక్షసరాజా!, మొన్న, నీ లంక కాలిచి, చన్న = వెళ్ళిన, కోతి మిన్నయును = కోతి శ్రేష్ఠమును, నేను, వారిలో = ఆ వానరవీరులలో, సన్నగాంద్రము అనుచు = అల్పులమని

భావించి, ఱేడు = రాముడు, ఇటువంటి = ఇలాంటి, కొఱగాని పనులకు = పనికిరాని పనులకు, మము నిర్వురను = మా ఇద్దరిని, అనుపు జుమ్మీ = పంపుతాడు సుమా!

**తా :** రాక్షసరాజా! మొన్న నీ లంక కాల్చి వెళ్ళిన కోతి, నేను అల్పులమని భావించి రాముడు ఇలాంటి పనికిమాలిన పనులకు మా ఇద్దరిని పంపుతాడు సుమా!

**కం.** **వెంగలివై రా పొలఁతిం**
**దొంగిలి తెచ్చితివి చేటుత్రోవ నయో! నీ**
**వంగడ మద్దొర ములుకుల**
**యింగలమునఁ బడక మున్నె యిడుమిఁకనైనన్** **114**

వెంగలివై = వెఱ్ఱివాడవై, రా పొలతిన్ = రాముని స్త్రీని, చేటుత్రోవన్ = చెడు మార్గములో, దొంగిలి తెచ్చితివి = దొంగతనంగా తీసుకువచ్చావు, అయో = అయ్యో, నీ వంగడము = నీ వంశము, ఆ దొర ములుకులన్ = ఆ ప్రభువు బాణములను, ఇంగలమున = అగ్నిలో, పడక మున్నె = పడుటకు ముందుగానే, ఇకనైనన్ = ఇంకనైనా, ఇడుము = ఇచ్చివేయుము.

**తా :** వెంగలివై రాముని భార్యను చెడుమార్గంలో దొంగతనంగా తీసుకొచ్చావు. అయ్యో! నీ వంశం ఆ దొర బాణములనే అగ్నిలో పడక ముందే ఇకనైనా ఇచ్చివేయుము.

**కం.** **చెడుగుదనంబునఁ బలుమఱుఁ**
**గడయొడయలఁ దఱిమినట్లుగా దా ఱేనిం**
**దొడరి కడతేర వాతని**
**కడిమి యొకింతైన నీకుఁ గనరాదుగదా!** **115**

చెడుగుదనంబునన్ = మూర్ఖత్వముగా, పలుమఱున్ = పలుమార్లు, కడ ఒడయలన్ = దిక్పాలకులను, తఱిమినట్లుగాదు = పారద్రోలినట్లుగాదు, ఆ ఱేనిన్ = ఆ రాముని, తొడరి = ఎదిరించి, కడతేరవు = బ్రతకలేవు, ఆతని కడిమి = ఆతని శౌర్యము, ఒకింతైన = కొంచెమైనను, నీకున్, కనరాదుకదా!

**తా :** మూర్ఖత్వముగా పలుమార్లు దిక్పాలకులను పారద్రోలినట్లు కాదు. ఆ రాముని ఎదరించి బ్రతకలేవు. అతని శౌర్యము కొంచెమైనా నీకు కన్పించడంలేదుకదా!

**ఆ.వె.** **పునుక తాల్పు విల్లుఁ దునిమెఁ దాటకఁ జంపె**
**ఖరుని దేర్చె వాలిఁ గడవఁ బనిచెఁ**
**గల్ల జింకఁ జిదిమె గండ్రగొడ్డలి తాల్పు**
**గరువ మడఁచె నతని కడిమి యసదె?** **116**

పునుక తాల్పు = శివుని, విల్లు తునిమెన్ = విల్లు విఱిచెను, తాటకన్, చంపె, ఖరుని, తేర్చెన్ = సంహరించెను, వాలిన్, కడవన్ పనిచెన్ = సాగనంపెను, కల్ల జింకన్ = మాయామృగమును, చిదిమె = చంపెను, గండ్రగొడ్డలి తాల్పు = పరుశురాముని, గరువము = గర్వమును, అడచెన్ = అణచెను, అతని = ఆ రాముని, కడిమి = పరాక్రమము, అసదె = అల్పమా?

**తా :** శివుని విల్లు విఱిచెను. తాటకను చంపెను. ఖరుని తేర్చెను. వాలిని సాగనంపెను. మారీచుని చంపెను. పరశురాముని గర్వము నణచెను, ఆ రాముని శౌర్యము అల్పమా!

**తే.గీ. అనుడు నంజుడుదిండి రాయండు వాని**
**కిట్టులని పల్కె వినరోరి! చెట్టు మట్టు**
**మెకపు ముడికాఁడ! రాముని మేటితనము**
**సెప్పెదవు వేనవేలు నా చెంత నిలిచి 117**

అనుడు = అనగానే, నంజుడు తిండి రాయండు = రావణుడు, వానికి = ఆ అంగదునికి, ఇట్టులు అని = ఈ రీతిగా, పల్కె = పల్కెను, ఓరి = ఓరీ, చెట్టు మట్టు మెకపు ముడికాడ = వానర రాయబారీ! వినర = విను, రాముని మేటితనము = రామునియొక్క పరాక్రమమును, నా చెంత నిలిచి = నా దగ్గర నిలబడి, వేనవేలు = వేలకొలది, చెప్పెదవు = చెబుతున్నావు.

**తా :** అనగానే రావణుడు ఆ అంగదునికి ఈ రీతిగా పలికెను 'ఓరీ! వానర రాయబారీ! విను. రాముని శౌర్యమును నా దగ్గర చాలా చెబుతున్నావు.

**ఆ.వె. రాముఁడేమి వేల్పురాయని కంటెను**
**జముని కంటె నీళ్ళసామి కంటె**
**మఱియుఁ బేరుగలుగు నుఱియ రేద్రిమ్మరి**
**దొరలకంటె బల్లిదుండె చెపుమ? 118**

రాముడు = రాముడు, వేల్పురాయని కంటెను = ఇంద్రుని కంటే, జముని కంటె = యముని కంటే, నీళ్ళసామి కంటె = వరుణుని కంటే, మఱియున్ = అలాగే ఇంకా, పేరు కలుగు = ప్రసిద్ధులైన, ఉఱియ = దిట్టతనముగల, రేత్రిమ్మరి దొరలకంటె = రాక్షస వీరులకంటే, బల్లిదుండె = పరాక్రమవంతుడా?, చెపుమ = చెప్పుమా!,

**తా :** రాముడు ఇంద్రునికంటే, యమునికంటే, వరుణునికంటే అలాగే ఇంకా ప్రసిద్ధులైన నాశము చేయగల రాక్షస వీరులకంటే పరాక్రమవంతుడా? చెప్పు.

**చం. చివికిన విల్లు ద్రుంచుటయుఁ జేడియ నొంచుటయున్ నెసుళ్ళ నె**
**క్కువ చలమారఁ జంపుటయుఁ గోఁతిని జింకను గీటడంచుటల్**
**తవిలి వెడంగు ప్రాఁబుడమి దయ్యము గెల్చుటయుం దిటంబుగా**
**నివి యొక బంటు చెయ్వులని యెన్నెద వేమనియందు నిన్నిఁకన్? 119**

చివికిన = చివికిపోయిన, విల్లు, త్రుంచుటయు = విఱుచుటయును, చేడియన్ = స్త్రీని (తాటకను), ఒంచుటయున్ = సంహరించుటయును, నెసుళ్ళన్ = అసమర్థులను, ఎక్కువ చలమారన్ = మిక్కిలి అసూయతో, చంపుటయున్, కోతిని, జింకను, కీటు అడంచుటల్ = చంపుటయును, తవిలి = పూనుకొని, వెడంగు = వెఱ్ఱివాడైన, ప్రాత పుడమి దయ్యము = ముసలి బ్రాహ్మణుని, గెల్చుటయున్, దిటంబుగాన్ = ధైర్యముతో, ఇవి ఒక బంటు చెయ్వులని = ఇవన్నీ ఒక వీరుని సాహసములని, ఎన్నెదవు = చెప్పెదవు, ఏమనియందు నిన్ను ఇకన్ = ఇంక నిన్ను ఏమనాలి?

**తా :** చివికిన విల్లు విఱుచుటయు, స్త్రీని సంహరించుటయు, అసమర్థులను అసూయతో చంపడం, కోతిని, జింకను చంపుటయు, వెఱ్ఱివాడైన ముసలి బ్రాహ్మణుని గెలవడమున్ను ఇవన్నీ ఒక వీరుని సాహసములని చెబుతున్నావు. ఇంక నిన్ను ఏమనాలి?

**ఆ.వె.** **ఓరి కోఁచబంట! యొక్కించు కేనియు**
**మగతనంబు లేని పగతుఁ జేరి**
**కొలుచుచుండి వాలి కొడుకునంచిటువలెఁ**
**జెప్పుకొనఁగ నీకు సిగ్గుగాదె? 120**

ఓరి కోచబంట = ఓరీ పిరికి సైనికుడా!, ఒక్క ఇంచుక ఏనియు = ఏ కొంచెమైనను, మగతనంబు లేని = పరాక్రమములేని, పగతున్ చేరి = శత్రువును చేరి, కొలుచుచుండి = సేవించుచుండి, వాలి కొడుకునంచు, ఇటువలె = ఈ రీతిగా, చెప్పుకొనగ, నీకు సిగ్గు కాదె = నీకు సిగ్గులేదా?

**తా :** ఓరి పిరికి సైనికుడా! ఏ కొంచెం మగతనం లేని శత్రువును చేరి సేవించుచుండి వాలి కొడుకునని చెప్పుకోడానికి నీకు సిగ్గు లేదా?

**తే.గీ.** **కొలఁది మీఱిన మగఁటిమి గొఱలు వాలి**
**యెదుటఁ గొరలేక వడిఁ బొంచి యేసినట్టి**
**కూళ నొక బంటుగా నెన్ని కొలిచె దింకఁ**
**దొలఁగి చను కొల్వ మఱియెందు దొరలు లేరె? 121**

కొలది మీఱిన = శక్తికి మించిన, మగటిమిన్ = పౌరుషముతో, కొఱలు = ప్రకాశించు, వాలి ఎదుటన్, కొర లేక = సామర్థ్యము లేక, వడిన్ = శీఘ్రముగా, పొంచి = దాగి, ఏసినట్టి = బాణమును వేసినట్టి, కూళన్ = నీచుని, ఒక బంటుగాన్ = ఒక వీరునిగా, ఎన్ని = ఎంచి, కొలిచెదు = సేవించుచున్నావు. ఇంకన్ = ఇకనైనను, తొలగి చను = విడిచి వెళ్ళుము, కొల్వన్ = సేవించుటకు, మఱి ఎందు = మరెచ్చటను, దొరలు లేరె = ప్రభువులు లేరా?

**తా :** శక్తికిమించిన మగటిమితో వాలిముందు నిలబడలేక దాగి బాణము వేసిన నీచుని ఒక వీరునిగా ఎంచి సేవిస్తున్నావు. ఇకనైనా విడిచిపెట్టు. సేవించుటకు మరెక్కడా దొరలు లేరా?

**కం.** **జగములు వొగడఁగ నెగడిన**
**జగబంటని కొమరుఁడయ్యు జతనమునఁ గటా!**
**పగ దీరుపనోపవు నీ**
**మగతన మేమిటికి? దులువ మ్రాన్ ద్రిమ్మరిగా! 122**

తులువ మ్రాన్ త్రిమ్మరిగా = ఓ నీచమైన వానరా!, జగములు పొగడగ నెగడిన = లోకములన్నియు స్తుతింపగ గొప్పనందిన, జగబంటని = మహాయోధుని, కొమరుడు అయ్యు = కుమారుడవై యుండియు, కటా = అయ్యో!, జతనమునన్ = ప్రయత్నపూర్వకముగా, పగ తీరుపను ఓపవు = పగతీర్చుకోవాలి అనుకోవు, నీ మగతనము ఏమిటికి?

**తా :** ఓ నీచమైన వానరా! లోకములన్నీ స్తుతించిన మహాయోధుని కుమారుడవయ్యు అయ్యో! పగ తీర్చుకోవాలనుకోవు. నీ మగతనం ఏమిటికి?

సీ. అన్నయన్ గనికరం బెన్నక మీ తండ్రి
నడcగించి యతcడేలు పుడమి యెల్లc
దలcగక కైకొన్న తులువను చినతండ్రి
యని డెందమున నమ్మి యతని చెంత
మగరాచతనమూని తగుదునంచు మెలంగె
దకట! యించుకయైన నఱ దలcపక
పడుచువాcడవు నిన్నుc బొడcగన్న నా మది
గడితంపు టక్కటికంబు వొడమె

తే.గీ. నహహ! యిcకనైనc జెడిపోక యదనెఱింగి
మమ్ము గొలువుము సుగ్రీవుని మడపి నీకుc
గొండ ద్రిమ్మరి నాడొనcగూడc జేతు
నిపుడు వలసిన సొమ్మెల్ల నెలమి నిడుదు **123**

అన్నయన్ = అన్న అనే, కనికరంబు = దయ, ఎన్నక = ఎంచుకొనక, మీ తండ్రిన్ = మీ తండ్రి యగు వాలిని, అడగించి = చంపించి, అతడు = ఆ వాలి, ఏలు = పాలించు, పుడమి = రాజ్యము, ఎల్లన్ = అంతను, తలగక = సంకోచించక, కైకొన్న = స్వీకరించిన, తులువను = నీచుని, చినతండ్రియని, డెందమున = మనసులో, నమ్మి = విశ్వసించి, అతని చెంత, మగరాచతనము ఊని = మగతనము కలిగియును, తగుదునంచున్ = నేనున్నానంటూ, అకట = అయ్యో!, ఇంచుకయైనన్ = కొంచెమైనను, అఱ తలపక = తక్కువతనము భావింపక, మెలంగెదు = ప్రవర్తిస్తున్నావు, పడుచువాడవు, నిన్నున్ పొడగన్న = నిన్ను చూస్తూంటే, నా మది = నా మనస్సు, గడితంపు = మిక్కిలి, అక్కటికంబు = దయ, పొడమెన్ = కలుగుచున్నది. అహహ = అయ్యయ్యో!, ఇకనైన = ఇప్పుడైనా, చెడిపోక = పాడైపోక, అదను ఎఱింగి = అవకాశము తెలుసుకొని, మమ్ము, గొలువుము, సుగ్రీవుని మడపి = సుగ్రీవుని వధించి, నీకున్ = నీకు, కొండ త్రిమ్మరి నాడు = వానర రాజ్యమును (కిష్కింధను) ఒనగూడన్ చేతున్ = వచ్చేలా చేస్తాను, ఇపుడు = ప్రస్తుతము, ఎలమిన్ = ప్రీతితో, వలసిన సొమ్ము ఎల్లన్ = కావలసిన ద్రవ్యమునంతను, ఇడుదున్ = ఇచ్చెదను.

**తా :** అన్న అనే కనికరం లేక మీ తండ్రిని చంపించి ఆ వాలి రాజ్యాన్నంతను సంకోచం లేక స్వీకరించిన నీచుని చినతండ్రియని మనసులో నమ్మి అతని చెంత మగతనం ఉన్నా తగుదునంటూ కొంచెమైనా తక్కువతనం భావించక ప్రవర్తిస్తున్నావు. పడుచువాడవు. నిన్ను చూస్తుంటే నా మనస్సులో చాలా దయ కలుగుతోంది. ఇప్పుడైనా చెడిపోక అదనెఱిగి మమ్ము సేవించు. సుగ్రీవుని వధించి నీకు కిష్కింధ వచ్చేలా చేస్తాను. ప్రస్తుతం ప్రీతితో వలసిన సొమ్మును ఇస్తాను.

ఆ.వె. అనినc జుక్క పేరి నసబోcడి గూరిమి
కొమరుc డలిగి యోరి కూళకాన!

**కాని కఱద లింక మానురి! నీ పాలి**
**దయ్య ముఱక చెఱుపఁ దలఁచినాఁడు** **124**

అనినన్, చుక్కపేరి = నక్షత్రము పేరు కల, ననబోడి = స్త్రీ (తార), కూరిమి కొమరుడు = ప్రియ పుత్రుడు, అలిగి = కోపించి, ఓరి కూళకాన = ఓరీ నీచమైనవాడా!, కాని కఱదలు = పనికిమాలిన బుద్ధులు, ఇంక మానుర = ఇకనైనా మానరా!, నీ పాలి దయ్యము = నిన్ను ఆవేశించిన దయ్యం, ఉఱక = వ్యర్థముగా, చెఱుప తలచినాడు = పాడుచేయ తలచినాడు.

**తా :** అనగా తార ప్రియపుత్రుడు అంగదుడు కోపించి ఓరీ నీచుడా! పనికిమాలిన బుద్ధులు ఇకనైనా మానరా! నిన్ను ఆవేశించిన దెయ్యం నిన్ను పాడుచేయతలచినాడు.

**సీ.** **అని పల్కి క్రమ్మఱఁ జనఁ జూచుచో దీవి**
**తేఁడు జోదులఁ గన్గిఱపి యదల్చు**
**టయు వార లక్కోఁతి పయిరుల యెకిమీనిఁ**
**బొదవి పల్తెఱఁగులఁ బోర నాతఁ**
**డందఱ చిందఱ వందఱగా మోది**
**కొందఱఁ జిదిమి సోఁకుడుల సామి**
**గొలువున్న బలుమేడఁ గూలఁ దన్ని కడింది**
**నింగి నరిగి రాముని నెఱి యడుగు**

**తే.గీ.** **దామరలఁ జేరి చాలుపు తలల తులువ**
**తెఱఁ గెఱిఁగింప నీరైదు తేర్ల ఱేని**
**కొమరుఁ డెద నల్గి లంకపైఁ గొమ్మ మెకము**
**పౌఁజు నప్పుడె వడి లగ్గఁ బట్టఁబనిచె** **125**

అని పల్కి, క్రమ్మఱన్ = తిరిగి, చనన్ = వెళ్ళుటకు, చూచుచో = ప్రయత్నింపగా, దీవి ఱేడు = రావణుడు, జోదులన్ = భటులను, కన్ గిఱపి = కనుసైగతో, అదల్చుటయు = ఆజ్ఞాపించుటయు, వారలు = ఆ భటులు, ఆ కోతి పయిరుల ఎకిమీని = ఆ వానర చంద్రుడైన అంగదుని, పొదవి = చుట్టుముట్టి, పలు తెఱంగులన్ = పలు విధములుగా, పోరన్ = కలహింపగా, ఆతడు = ఆ అంగదుడు, అందఱన్ = అందరిని, చిందరవందరగా, మోది = బాది, కొందఱన్ = కొందరిని, చిదిమి = చంపి, సోకుడుల సామి = రావణుడు, కొలువున్న = కొలువుతీరిన, బలు మేడన్ = పెద్ద మేడను, కూలన్ దన్ని = కూలునట్లుగా తన్ని, కడిందిన్ = శౌర్యముతో, నింగిన్ అరిగి = ఆకాశమార్గమున వెళ్ళి, రాముని = రామునియొక్క, నెఱి = అందమైన, అడుగు తామరలన్ = పాదపద్మములను, చేరి = చేరుకొని, చాలుపు తలల తులువ తెఱగు = నీచుడైన రావణుని విధానమును, ఎఱిగింపన్, ఈరైదు తేర్ల ఱేని కొమరుడు = రాముడు, ఎదన్ అల్గి = మనసులో కోపించి, లంకపైన్ = లంకపైన, కొమ్మ మెకము పౌజున్ = వానర సైన్యమును, అప్పుడె = ఆ సమయముననే, వడి = శీఘ్రముగా, లగ్గన్ పట్టబనిచెన్ = కోట పట్టుకొనుడని పంపెను.

**తా :** అని పల్కి తిరిగి వెళ్ళుటకు ప్రయత్నింపగా రావణుడు భటులకు కనుసైగ చేయగా ఆ భటులు అంగదుని చుట్టుముట్టగా అంగదుడు అందరినీ చిందరవందరగా బాది, కొందరిని చంపి, రావణుడు కొలువుతీరిన పెద్ద మేడను కూలకొట్టి, శౌర్యముతో గగన మార్గమున వెళ్ళి రాముని పాదపద్మములను చేరి, నీచ రావణుని విధానమును ఎఱిగింపగా రాముడు వానర సైన్యమును వెంటనే కోట పట్టుకొనుడని పంపెను.

**కం.** **పనిచినఁ జని యొక్కుమ్మడిఁ**
**పెనఁకువ తమిఁ గోన మనికి బిందంబులు కే**
**వున నార్చి కోట లెక్కినఁ**
**గనుఁగొని రక్కసులు వారిఁ గదిసిరి కడఁకన్** **126**

పనిచినన్ = పంపగా, చని = వెళ్ళి, ఒక్కుమ్మడిన్ = ఒక్కగుంపుగా, పెనకువ తమిన్ = పోరాటమందు ఆసక్తితో, కోన మనికి బిందంబులు = వానర సమూహములు, కేవునన్ ఆర్చి = కెవ్వుమని అరచి, కోటలు ఎక్కిన, కనుగొని = చూచి, రక్కసులు = రాక్షసులు, వారిన్ = ఆ వానరులను, కడకన్ = పూనికతో, కదిసిరి = చేరిరి.

**తా :** వానరులను పంపగా వారు వెళ్ళి ఒక్క గుంపుగా పోరాటమందు ఆసక్తితో కెవ్వుమని అరచి కోటలు ఎక్కిన చూచి రాక్షసులు వారిని పూనికతో చేరిరి.

**చం.** **కదిసి వెడంద బల్లెములఁ గైదువలన్ జముదాళ్ళ వంకులన్**
**గుదియల నీఁటెలన్ సురెలఁ గోలల గొడ్డళులం బొరింబొరిన్**
**మెదడును బుక్క లెమ్ములును నెత్తురు నంజుదు క్రొవ్వు ప్రేవులున్**
**బ్రిదిలి కడిందిగాఁ బుడమిఁ బేర్కొన మోఁదిరి కోఁతి బంటులన్** **127**

కదిసి = చేరి, వెడంద = పెద్ద, బల్లెములన్, కైదువులన్ = వివిధములైన ఆయుధములతో, జముదాళ్ళ వంకులన్ = పొడవైన పిడిగల బాకులతో, గుదియలన్ = బడియలతో, ఈటెలన్, సురెలన్ = చురకత్తులతో, కోలలన్ = బాణములతో, గొడ్డళులన్ = గొడ్డళ్ళతో, పొరింపొరిన్ = తరచుగా, మెదడును, పుక్కలు = పుట్టెలును, ఎమ్ములును = ఎముకలును, నెత్తురు = రక్తమును, నంజుడు = మాంసమును, క్రొవ్వు = క్రొవ్వును, ప్రిదిలి = శరీరమునుండి జారి, కడిందిగాన్ = అధికముగా, పుడమిన్ = భూమియందు, పేర్కొన = పేరుకొనగా, కోతి బంటులన్ = వానర సైన్యమును, మోదిరి = బాదిరి.

**తా :** చేరి బల్లెములు, కైదువులు, బాకులు, బడియలు, ఈటెలు, చురకత్తులు, బాణములు, గొడ్డళ్ళతో ఎక్కువగా మెదడు, పుట్టెలు, ఎముకలు, నెత్తురు, మాంసము, క్రొవ్వు శరీరమునుండి జారి ఎక్కువగా భూమిపై పేరుకొనగా ఆ వానరసైన్యమును మోదిరి.

**ఉ.** **వారును గట్లఁ జెట్లఁ గొని వార్వము లేనుఁగు లందలంబులుం**
**దేరులు బొక్కసంబులును తేటగు కైదువులున్ సిడంబులున్**
**బేరగు కాళె లెల్లలును బిట్టుగఁ దుత్తుమురై పడం గడున్**
**బోరొనరించి రక్కజఁపు బెంపునఁ గూల్చిరి ప్రాఁతవేల్పులన్** **128**

వారును = ఆ వానరులును, గట్లు = రాళ్ళు, చెట్లు, కొని = తీసుకొని, వార్వములు = గుఱ్ఱములు, ఏనుగులు, అందలంబులు = పల్లకీలు, తేరులు = రథములు, బొక్కసంబులున్ = కోశాగారములను, తేటగు = పదునైన, కైదువులున్ = ఆయుధములును, సిడంబులున్ = ధ్వజములును, పేరగు = పెద్ద, కాళెలు ఎల్లలును = కాహళిల నన్నిటిని, బిట్టుగ = మిక్కిలిగ, తుత్తుమురై = ముక్కలు ముక్కలై, పడన్ = పడగా, కడున్ = గొప్పగా, పోరు ఒనరించిరి = యుద్ధము చేసిరి, అక్కజపు పెంపునన్ = ఆశ్చర్యకరమైన ఆధిక్యముతో, ప్రాత వేల్పులన్ = రాక్షసులను, కూల్చిరి = సంహరించిరి.

**తా :** ఆ వానరులును రాళ్ళు, చెట్లు తీసుకొని గుఱ్ఱములు, ఏనుగులు, పల్లకీలు, రథములు, కోశాగారములను, పెద్ద కాహళీల నన్నిటిని ముక్కముక్కలై పడగా గొప్పగా యుద్ధము చేసిరి. ఆశ్చర్యకరమైన ఆధిక్యముతో రాక్షసులను కూల్చిరి.

**సీ.** **అపు డింద్రజిత్తుతో నంగదుండును బ్రహ**
**స్తునితోడ సుగ్రీవుఁడును నికుంభు**
**తో నీలుఁడును గుంభుతో ధూమ్రుఁడును నంత**
**కునితోఁ బనసుఁడుఁ దపనునితోడ**
**నలుఁడును జంభుతో లలి వేగదర్శియు**
**సారణుతోడ వృషభుఁడు జంబు**
**మాలితో గాడుపుఁజూలియు మకరాక్షు**
**తోడుత జాంబవంతుఁడును ద్రిశిరు**

**తే.గీ.** **తోడ శరభుఁ డకంపను తోడఁ గుముదుఁ**
**డును మహోదరుతోడ నేటుగ సుషేణుఁ**
**డును విరూపాక్షు తోడ రాముని యనుంగు**
**తోడఁబుట్టువు నేడ్తెఱఁ దొడర మఱియు** **129**

లలి = క్రమముగా, నేటుగ = ధైర్యముగ, ఏడ్తెఱన్ =విజృంభించి, తొడర = కూడగా –

**తా :** అపుడు ఇంద్రజిత్తుతో అంగదుడును, ప్రహస్తునితో సుగ్రీవుడును, నికుంభునితో నీలుడును, కుంభునితో ధూమ్రుండును, అంతకునితో పనసుండును, తపనునితో నలుడును, జంభునితో వేగదర్శియు, సారణునితో వృషభుడును, జంబుమాలితో హనుమంతుడును, మకరాక్షునితో జాంబవంతుడును, త్రిశిరునితో శరభుడును, అకంపనునితో కుముదుడును, మహోదరునితో సుషేణుడును, విరూపాక్షునితో లక్ష్మణుడును యుద్ధము చేయుటకు సిద్ధపడిరి. మరియును

**తే.గీ.** **పేరుగల జోదు లొండొరుల్ దారసిల్లి**
**మిక్కుటంబగు నార్పులు మిన్ను ముట్ట**
**బిట్టు గనలుచుఁ దరలక పెనఁగఁ దొడఁగి**
**రయ్యెడలఁ గోఁతి దొరలు గయ్యంబునందు** **130**

పేరుగల జోదులు = ప్రసిద్ధులైన వీరులు, ఒండొరుల్ = ఒకరితో ఒకరు, తారసిల్లి = ఎదురుపడి, మిక్కుటంబగున్ = అధికమైన, ఆర్పులు, మిన్ను ముట్ట = ఆకాశము నంటగా, కయ్యంబునందున్ = పోరునందు, ఆ ఎడలన్ = ఆ సమయమున, కోతి దొరలు, బిట్టు = మిక్కిలిగా, కనలుచున్ = కోపించుచు, తరలక = వెనుకడు గేయక, పెనగన్ తొడగిరి = యుద్ధము చేయసాగిరి.

**తా :** ప్రసిద్ధులైన వీరులు ఒకరితో ఒకరు ఎదురుపడి అధికమైన అరుపులు ఆకాశము నంటగా పోరునందు వానర నాయకులు మిక్కిలి కోపించి తరలక యుద్ధముచేసిరి.

**చం.** **కఱచియుఁ గాళ్ళఁ దాఁచియును గట్టులు చెట్టులు బిట్టు వైచుచున్**
**జఱచియు గ్రుద్దియుం బిగువు సళ్ళక తోఁకలఁ జుట్టి కొట్టియున్**
**మఱిమఱి యాముటేనుఁగుల మావుల లొట్టియలం గడిందిగా**
**నుఱుమొనరించి హెచ్చరిక నూల్కొనఁ దేరులు పిండిసేయుచున్** **131**

కఱచియు = పళ్లతో కఱచియు, కాళ్ళన్ తాచియును, గట్టులు, చెట్టులు, బిట్టు = వేగముగా, వైచుచున్ = విసరుచు, చఱచియు, గ్రుద్దియున్, బిగువు సళ్ళక = జారిపోకుండగా, తోకలన్ చుట్టి = తోకలకు చుట్టి, కొట్టియున్, మఱిమఱిన్ = ఇంకను, ఆము ఏనుగులన్ = మదపుటేనుగులను, మావుల = గుఱ్ఱములను, లొట్టియలన్ = ఒంటెలను, కడిందిగా = ధైర్యముగా, నుఱుమొనరించి = పిండిపిండి చేసి, హెచ్చరిక నూల్కొనన్ = హెచ్చరికల నంగీకరించి, తేరులు = రథములను, పిండి చేయుచున్ = నుగ్గునుగ్గు చేయుచు,

**తా :** పళ్ళతో కఱచి, కాళ్ళతో తాచి, గట్టులు, చెట్టులు వేగముగా విసరుచు, చఱచి, గ్రుద్ది, జారి పోకుండగా తోకలకు చుట్టి కొట్టి, ఇంకా ఏనుగులను, గుఱ్ఱములను, ఒంటెలను ధైర్యంగా పిండిపిండిచేసి, హెచ్చరికల నంగీకరించి రథములను నుగ్గునుగ్గుచేయుచు

**కం.** **క్రమ్ముకొని సోఁకు జోదుల**
**నెమ్మేనులు పగిలి మెదడు నెత్తురు క్రొవ్వున్**
**దుమ్మునఁ గండలు దొరుగఁగ**
**నిమ్ములఁ జెలరేఁగి మోఁది రేచిన కడిమిన్** **132**

క్రమ్ముకొని = చుట్టుముట్టి, సోకు జోదుల = రాక్షస వీరుల, నెమ్మేనులు = అందమైన దేహములు, పగిలి = బ్రద్దలై, మెదడు నెత్తురు క్రొవ్వున్, కండలు = మాంసపు ఖండములు దుమ్మునన్ = మట్టిలో, తొరుగగన్ = పొరలాడుచుండగా, ఇమ్ములన్ = సంతోషముతో, చెలరేగి = రెచ్చిపోయి, ఏచిన కడిమిన్ = అధికమైన ధైర్యముతో, మోదిరి = కొట్టిరి.

**తా :** ఆక్రమించి రాక్షస వీరుల దేహములు బ్రద్దలై మెదడు, నెత్తురు, క్రొవ్వు, మాంసపు ఖండములు మట్టిలో పొరలాడుచుండగా సంతోషముతో రెచ్చిపోయి ధైర్యముగా మోదిరి.

**కం.** **మోఁదిన నప్పొలబోనపు**
**జోదులు వెండియును వాఁడి సురియల గుదెలం**
**గైదువుల నారసంబుల**
**బాదుకొని కలంచి యోటుపఱచిరి వారిన్** **133**

మోదినన్ = కొట్టగా, ఆ పొలబోనపు జోదులు = ఆ రాక్షస వీరులు, వెండియును = తిరిగి, వాడి సురియలన్ = పదునుగల కత్తులతోను, గుదెలన్ = బడియలతోను, కైదువులన్ = వివిధ ఆయుధములతోను, నారసంబులన్ = బాణములతోను, పాదుకొని = నిలబడి, కలంచి = కలచివేసి, వారిన్ = ఆ వానరులను, ఓటు పఱచిరి = ఓడించిరి.

**తా :** మోదగా ఆ రాక్షస వీరులు తిరిగి కత్తులతో, బడియలతో, కైదువులతో, బాణములతో నిలబడి కలచివేసి ఆ వానరులను ఓడించిరి

**తే.గీ.** **అత్తెఱంగున నిరువాగులందుఁ గలుగు**
**జోదులును బంట్లు దార్కొని స్రుక్కులేని**
**బలిమిఁ బోరొనరింపుచు గెలుపు తలఁపు**
**లంతకంతకు నగ్గలంబగుచు నిగుడ** **134**

ఆ తెఱంగున = ఆ విధముగా, ఇరువాగులందు = రెండు పక్షములందును, కలుగు జోదులును = ఉన్నటువంటి వీరులును, బంట్లు, తార్కొని = ఒకరినొకరు ఎదురుకొని, స్రుక్కులేని = వెనుదీయుట లేని, బలిమిన్ = శక్తితో, పోరు ఒనరింపుచు = యుద్ధముచేయుచు, గెలుపు తలపులు = విజయ సూచనలు, అంతకు అంతకున్, అగ్గలంబగుచు = అధికమగుచు, నిగుడ = వ్యాపింపగా –

**తా :** ఆ విధముగా రెండు పక్షములందున్న వీరులు, సైనికులు ఒకరినొకరు ఎదురుకొని వెనుదీయుట లేక శక్తితో పోరు ఒనరింపుచు గెలుపు తలపులు అంతకంతకు అధికమవగా –

**సీ.** **మోరలు బోరలు మూఁపులు వీఁపులు**
**గౌనులు వీనులు కాళ్ళు వ్రేళ్ళు**
**చేతులు వాతులు చెక్కులు ముక్కులు**
**ప్రక్కలు పిక్కలు బరులు దరులు**
**పొట్టలు చట్టలు బొమ్మలు దుమ్ములు**
**మోవులు ప్రేవులు మొలలు దలలు**
**గుండెలు గండలు గోళ్ళును కీళ్ళును**
**దొడలును మెడలుఁ దుత్తుమురుగాఁగ**

**తే.గీ.** **హత్తుకొని మొత్తులాడి పెన్నెత్తు రొలుకఁ**
**జూచువారల కెంతయు సొబగుమీఱ**
**బూరుగుల పోల్కిఁ బొలిచి రప్పోరునేల**
**బూచిగములును బందులుఁ బొదలియాడ** **135**

మోరలు = ముఖములు, బోరలు = కడుపులు, మూపులు = భుజములు, కౌనులు = నడుములు, వీనులు = చెవులు, బరులు = చిఱుడొక్కలు, దరులు = పార్శ్వభాగములు, చట్టలు = పిఱుదులు, బొమ్మలు = కనుబొమలు, దుమ్ములు = ఎముకలు, మోవులు = పెదవులు, మొలలు = కటిప్రదేశములు, కండలు, తొడలును, తుత్తుమురుగాగ = ముక్కలు ముక్కలగునట్లుగా, హత్తుకొని = బాహాబాహి,

మొత్తులాడి = బాదుకొని, పెన్నెత్తురు ఒలుక = పెద్దగా రక్తము కారగా, చూచువారలకు = చూసేవారికి, బూరుగుల పోల్కిన్ = బూరుగు వృక్షముల మాదిరిగా (ఈ చెట్టుపూలు ఎఱ్ఱగా ఉంటాయి), ఎంతయున్ = మిక్కిలి, సొబగు మీఱన్ = అందముగానుండగా, బూచిగములును = భూతములును, బందులున్ = గ్రద్దలును, పొదలియాడ = దట్టముగా వ్యాపించుచుండగా, ఆ పోరునేలన్ = ఆ యుద్ధభూమియందు, పొలిచిరి = ఒప్పిరి,

**తా :** ముఖములు, కడుపులు, భుజములు, నడుములు, చెవులు, చర్మములు, పొట్టపై ముడతలు, కవచములు, కనుబొమలు, ఎముకలు, పెదవులు, మొలలు, కండలు, తొడలు తుత్తుమురుగా దగ్గరపడి పోరాడి పెద్దగా రక్తము కారగా చూసేవారికి బూరుగు వృక్షముల మాదిరిగా మిక్కిలి అందముగా నుండగా భూతములును, గ్రద్దలును దట్టముగా వ్యాపించు చుండగా ఆ యుద్ధభూమియందు ఒప్పిరి.

**తే.గీ.** **అంతఁ బడమటి కడలి నీరాఱుమేను**
**లుండు దేవర క్రుంకిన నుబ్బి రేయి**
**ద్రిమ్మరులు సెట్టు ద్రిమ్మరి తెగలఁ బొదివి**
**పలు తెఱంగుల నొంప నబ్బలియు రలిగి** **136**

అంతన్, పడమటి కడలిన్ = పశ్చిమ సముద్రమున, ఈరాఱు మేనులుండు దేవర = ద్వాదశాదిత్యుడు, క్రుంకిన = అస్తమించగా, ఉబ్బి = సంబరపడి, రేయి త్రిమ్మరులు = రాక్షసులు, చెట్టు త్రిమ్మరి తెగలన్ = వానర సమూహమును, పొదివి = చుట్టుముట్టి, పలు తెఱంగుల = అనేక విధములుగా, నొంపన్ = బాధింపగా, ఆ బలియురు = ఆ బలవంతులు (వానరులు), అలిగి = కోపించి.

**తా :** అంతట పశ్చిమ సముద్రమున సూర్యుడు అస్తమించగా సంబరపడి రాక్షసులు వానర సమూహమును చుట్టుముట్టి పలు విధములుగా బాధింపగా ఆ వానరులు కోపించి.

**ఉ.** **కొందఱ నేలతోఁ జదియఁగొట్టుచుఁ గొందఱఁ గూల మట్టియుం**
**గొందఱ బొందుగల్ వగుల గ్రుద్దియుఁ గొందఱ నోళ్ళు వ్రచ్చియున్**
**గొందఱఁ దోఁక త్రాళ్ళిరియఁ గుత్తుకలం దగిలించి లాగియుం**
**జిందఱ వందరై పడఁగఁ జివ్వ కడన్మడియించి రంతటన్** **137**

అంతటన్ = అప్పుడు, చివ్వకడన్ = యుద్ధభూమియందు, కొందఱన్, నేలతోన్ = భూమిని అదిమిపట్టి, జదియన్ కొట్టుచు = నుజ్జునుజ్జుగ కొట్టుచు, కొందఱన్, కూల మట్టియున్ = చచ్చునట్లుగా నేలమీదవేసి త్రొక్కుచు, కొందఱన్, బొందుగల్ = కంఠనాళములు, పగుల = పగులునట్లుగా, గ్రుద్దియున్, కొందఱన్, నోళ్ళు, వ్రచ్చియున్ = బ్రద్దలుకొట్టుచు, కొందఱన్, తోకన్ = తోకతో, త్రాళ్ళు ఇరియన్ = బిగించిన త్రాడులవలె, కుత్తుకలన్ తగిలించి = మెడలకు బిగించి, లాగియున్ = లాగుచు, చిందరవందరై పడగన్ = చెల్లాచెదరుగా పడునట్లు, మడియించిరి = చంపిరి.

**తా :** యుద్ధభూమియందు కొందరిని భూమిని అదిమిపట్టి నుజ్జునుజ్జుగ కొట్టుచు, కొందరిని చచ్చేలా నేలమీద వేసి త్రొక్కుచు, కొందరిని కంఠనాళములు పగులునట్లుగా గ్రుద్దుచు, కొందరి నోళ్ళు బ్రద్దలుకొట్టుచు, కొందరిని తోకతో మెడలకు బిగించి లాగి చెల్లాచెదరుగా పడేసి చంపిరి.

**తే.గీ.** **అందుఁ బొలియక చిక్కియున్నట్టి సోఁకు**
**దొరలతోఁ గూడి యింద్రజితుండు దీవి**
**కరిగి గాడుపు సంగడీఁ డలర నొక్క**
**దండ వ్రేలిమి యొనరింప దానివలన** **138**

అందున్ = ఆ యుద్ధరంగమందు, పొలియక = చావక, చిక్కి ఉన్నట్టి = మిగిలియున్న, సోకుదొరలతోన్ కూడి = రాక్షస వీరులతో కలిసి, ఇంద్రజితుండు, దీవికి అరిగి = లంకలోనికి వెళ్ళి, గాడుపు సంగడీడు = వాయుదేవుని మిత్రుడు అగ్నిదేవుడు, అలరన్ = సంతసించునట్లుగా, ఒక్క దండ = ఒక ప్రక్కన, వ్రేలిమి ఒనరింప = హెూమము చేయగా, దానివలన = దానినుండి –

**తా :** అక్కడ చావక మిగిలిన రాక్షస వీరులతో కలిసి ఇంద్రజిత్తు లంకలోకి వెళ్ళి అగ్ని సంబరపడు నట్లుగా ఒక ప్రక్కన హెూమము చేయగా దానినుండి –

**కం.** **అక్కజపు విండ్లుఁ గైదువు**
**లెక్కుడు మెకములును దేరు లెల్లులు ములుకుల్**
**టెక్కెములు దొనలు బేరులు**
**జక్కి తెగలుఁ బొడముటయు వెసం గొని యనికిన్** **139**

అక్కజపు = ఆశ్చర్యకరమైన, విండ్లున్ = ధనుస్సులును, కైదువులు = ఆయుధములును, ఎక్కుడు మెకములును = ఏనుగులును, తేరులు = రథములును, ఎల్లులు = తీక్షణములైన, ములుకుల్ = బాణములును, టెక్కెములు = ధ్వజములును, దొనలు = అమ్ముల పొదులును, బేరులు = భేరీలును, జక్కి తెగలున్ = గుఱ్ఱముల దండులును, పొడముటయు = వచ్చుటయును, వెసం = శ్రీఘ్రముగా, కొని = తీసుకొని, అనికిన్ = యుద్ధమునకు –

**తా :** అక్కజపు ధనుస్సులు, కైదువులు, ఏనుగులు, రథములు, తీక్షణములైన బాణములు, ధ్వజములు, అమ్ముల పొదులు, భేరీలు, గుఱ్ఱపు దండులు రాగా వెంటనే యుద్ధానికి –

**తే.గీ.** **మరల నరుదెంచి మిన్నంటి మబ్బుతెగల**
**నడుమ నెవ్వారికినిఁ గనఁబడక యుండి**
**రాగవుని దండుపయి వాఁడు రవళి నంప**
**వాన గురియింప వారలోర్వక కలంగి** **140**

మరలన్ = తిరిగి, అరుదెంచి = వచ్చి, మిన్నంటి = ఆకాశమున కెగిరి, మబ్బుతెరల నడుమన్ = మేఘసమూహముల మధ్య, ఎవ్వారికిన్, కనబడక ఉండి, వాడు = ఆ ఇంద్రజిత్తు, రాగవుని దండుపయి = రాఘవుని సైన్యముమీద, రవళిన్ = పెద్ద ధ్వనితో, అంపవానన్ = బాణవర్షమును, కురియింపన్, వారలు = ఆ వానరులు, కలంగి = కలతచెంది, ఓర్వక = సహించలేక.

**తా :** తిరిగి వచ్చి ఆకాశమున కెగిరి మేఘముల మధ్య కనబడకుండగా ఆ ఇంద్రజిత్తు పెద్ద ధ్వనితో రాముని సైన్యముపై బాణవర్షమును కురిపింప ఆ వానరులు సహించలేక –

**ఆ.వె. పొదలఁ దూఱువారుఁ బుట్టల మాటున**
**నీఁగువారుఁ బరువులెత్తువారుఁ**
**ద్రెళ్ళువారు బొబ్బరించువారును నేలఁ**
**బొరలువారు నైరి సొంపు దరిగి 141**

పొదలన్ = పొదలయందు, దూఱువారు, పుట్టల మాటునన్, ఈగువారు = దాగుకొనువారు, పరువులెత్తువారు, త్రెళ్ళువారు = మరణించువారు, బొబ్బరించువారును = కేకలు పెట్టువారును, సొంపు తరిగి = అందమును పోగొట్టుకొని, నేలన్ పొరలువారున్, ఐరి = అయ్యిరి.

**తా :** పొదల్లో దూరువారు, పుట్టల చాటున దాగువారు, పరువులెత్తువారు, మరణించువారు, అరచువారు, సొంపు తరిగి నేలను పొరలాడువారును అయ్యిరి.

**తే.గీ. అట్టు లెదరులఁ గుందెదు చెట్టునట్టు**
**మెకపు బంటులఁ గని యడల్మీఱ రాచ**
**పచ్చగన్నుల మెకము రావణునితోడ**
**బుట్టువును డాయఁ బిల్చి తా నిట్టులనియె 142**

అట్టులు = ఆ విధముగా, ఎదరులన్ = కష్టములతో, కుందెదు = బాధపడెదు, చెట్టునట్టు మెకపు బంటులన్ = వానర వీరులను, కని, అడల్ మీఱ = మిక్కిలి బాధనుచెంది, రాచపచ్చ గన్నుల మెకము = రాజ సింహుడగు రాముడు, రావణుని తోడబుట్టువును = విభీషణుని, డాయన్ = చేరువకు, పిల్చి, తాన్ = తాను, ఇట్టులు అనియె = ఈ రీతిగా పలికెను.

**తా :** ఆ విధముగా కష్టములతో బాదపడెదు వానర వీరులను చూచి రాముడు రావణుని తోబుట్టువగు విభీషణుని పిలిచి పలికెను.

**కం. జగములు సెడిపోవు తఱిన్**
**మొగులు తెగల్ మింట దట్టముగఁ గ్రమ్మక వా**
**న గురియు చందమునం జి**
**ల్కు గముల్ గురిసెడి నిదేమి గోరము చెపుమా? 143**

జగమలు = లోకములు, చెడిపోవు తఱిన్ = నాశనమగు సమయమున, మొగులు తెగల్ = మేఘ సమూహములు, మింట = ఆకాశమున, దట్టముగన్, క్రమ్మక = క్రమ్ముకొని, వాన కురియు చందమునన్ = వాన కురిసే విధముగా, చిల్కుగముల్ = బాణసమూహములు, కురిసెడిని = కురియుచున్నవి, ఇది ఏమి గోరము చెపుమా = ఇదేం ఘోరమో చెప్పుము –

**తా :** లోకములు నశించు సమయమున మేఘ సమూహములు ఆకాశమున దట్టముగ క్రమ్ముకొని వర్షించే విధముగా బాణములు కురియుచున్నవి. ఇది ఏమి ఘోరము చెప్పు –

**ఉత్సాహ. అనిన నాతఁ డిట్టులనియె నయ్య! వినుము సోఁకు రా**
**యని యనుంగుఁ గొమరుఁ డగ్గి నలరఁ జేసి మేటి తే**
**ర్లను గడింది యేనుఁగులును, లొట్టియలును, మావులం**
**దొనలు విండ్లు నతని కతన దొరికినం జెలంగుచున్ 144**

అనినన్ = అనగా, ఆతడు = ఆ విభీషణుడు, ఇట్టులు అనియెన్ = ఇట్లు పలికెను, అయ్య = స్వామీ!, వినుము = విను, సోకురాయని యనుంగు కొమరుడు = రావణుని ప్రియ పుత్రుడు ఇంద్రజిత్తు, అగ్గిన్ అలర చేసి = అగ్నిని సంతుష్టుని చేసి, అతని కతన = ఆ అగ్నిదేవుని మూలమున, మేటి = గొప్ప, తేరులును = రథములును, కడింది = బలమైన, ఏనుగులను, లొట్టియలును = ఒంటెలను, మావులన్ = గుఱ్ఱములను, దొనలు = అమ్ముల పొదులు, విండ్లు = ధనుస్సులు, దొరికినన్ = లభించగా, చెలంగుచున్ = విజృంభించుచు.

**తా :** అనగా ఆ విభీషణుడు పలికెను 'స్వామీ! విను. రావణుని ప్రియపుత్రుడు ఇంద్రజిత్తు అగ్నిని సంతుష్టుని చేసి అతని వలన గొప్ప రథములను, ఏనుగులను, ఒంటెలను, గుఱ్ఱములను, అమ్ముల పొదులను, ధనుస్సులను లభించగా విజృంభించుచు.

**మత్తకోకిల. నీరు తాలుపు చాల్పులోపల నెమ్మిఁ దూటి మెఱుంగువాల్**
**నారసంబులు దండుపై జతనంబుగాఁ బఱగించు చే**
**వారికిం గనరాక యుక్కున వ్రాలి క్రాలుచునున్న వాఁ**
**డారయం గడు బల్లిదుం డితఁ డన్ని నేలల రాయఁడా! 145**

రాయడా = ప్రభూ!, నీరుతాలుపు = మేఘములయొక్క, చాల్పులోపల = సమూహములలో, నెమ్మిన్ = చక్కగా, దూటి, మెఱుంగువాల్ = తీక్షణమైన కత్తులవంటి, నారసంబులు = బాణములు, దండుపై = సైన్యముపై, జతనంబుగా = ప్రయత్నపూర్వకముగా, పఱగించుచు = ప్రయోగించుచు, ఏవారికిన్, కనరాక, ఉక్కున = శౌర్యముతో, వ్రాలి = ఉద్యమించి, క్రాలుచునున్నవాడు = ప్రకాశించుచున్నాడు, ఆరయన్ = పరిశీలింపగా, ఇతడు = ఈ ఇంద్రజిత్తు, అన్ని నేలల = సమస్త లోకములందును, కడున్ = మిక్కిలి, బల్లిదుండు.

**తా :** ప్రభూ! మేఘములలో దాగి కత్తులవంటి బాణములు సైన్యముపై ప్రయోగించుచు ఎవరికిని కనబడక శౌర్యముతో ఉద్యమించి ప్రకాశించుచున్నవాడు. ఈ ఇంద్రజిత్తు సమస్త లోకములందును చాల బలవంతుడు.

**పంచచామరము. అనం గొఱంత లేని కిన్క నక్కడింది జోదు గ్ర**
**న్ననం బెడంగు వింట వాలు నారసంబు లూని యే**
**పునం జెలంగి నింగి యెల్లఁ బొల్పరం గడంగి యే**
**సినన్ లకోరి యొక్కటైనఁ జెందదయ్యె వానిపైన్ 146**

అనన్ = అనగానే, కొఱంత లేని కిన్కన్ = అధికమైన కోపముతో, ఆ కడింది జోదు = ఆ యోధుడగు రాముడు, క్రన్ననన్ = వెంటనే, బెడంగు వింటన్ = ప్రసిద్ధమైన ధనుస్సునందు, వాలు = పదునైన, నారసంబులు = బాణములను, ఊని = ఎక్కుపెట్టి, ఏపునన్ = ఆధిక్యముతో, చెలంగి = విజృంభించి, నింగి ఎల్లన్ = ఆకాశమంతయును, పొల్పరన్ = నాశము చేయగా, కడంగి = పూనుకొని, ఏసినన్ = వేయగా, లకోరి = బాణము, ఒక్కటి ఐనన్, వానిపైన్, చెందదు అయ్యెన్ = పడదయ్యెను.

**తా :** పదునైన బాణములను ఎక్కుపెట్టి విజృంభించి ఆకాశమంతను నాశము చేయగా పూనుకొని వేయగా ఒక్క బాణముకూడా వానిపై పడదయ్యెను.

**తే.గీ. అందులకుఁ జాల సందియం బంది ఱేడు**
**వీనిఁ దెగటార్చి రండని వేగ గజుఁడు**
**వృషభుఁ డంగదుఁ డీఁద యర్మిలి నిసుంగు**
**నలుఁడు మొదలుగ బలియురఁ బిలిచి పనిచె 147**

అందులకున్ = తన బాణములు విఫలమగుటకు, చాల సందియంబంది = చాల సందేహించి, ఱేడు = రాముడు, వీనిన్ = ఈ ఇంద్రజిత్తును, తెగటార్చి = చంపి, రండని, వేగ, గజుడు, వృషభుడు, అంగదుడు, ఈద = వాయువుయొక్క అర్మిలి నిసుంగు = ప్రియ పుత్రుడు హనుమ, నలుడు, మొదలుగ = మొదలైన, బలియురన్ = వీరులను, పిలిచి, పనిచె = పంపెను.

**తా :** తన బాణములు విఫలమగుటకు సందేహపడి రాముడు ఈ ఇంద్రజిత్తును చంపి రండని వేగముగా గజుడు, వృషభుడు, అంగదుడు, ఆంజనేయుడు, నలుడు మొదలైన వీరులను పిలిచి పంపెను.

**కం. పనిచిన నబ్బిరుదు మగ**
**ల్వినుతెరువున నెగసి యుద్దవిడిఁ జనుచో న**
**చ్చెనఁటి తొలివేల్పు గడుఁ బె**
**ల్లునఁ బైపైఁ జికిలి వాల్ములుకులు నిగిడ్చెన్ 148**

పనిచినన్ = పంపగా, ఆ బిరుదుమగలు = ఆ వీరశ్రేష్ఠులు, విను తెరువునన్ = ఆకాశమార్గమున, ఎగసి = ఎగిరి, ఉద్దవిడిన్ = వేగముగా, చనుచో = వెళ్ళుచుండగా, ఆ చెనటి = ఆ దుష్టుడైన, తొలివేల్పు = రాక్షసుడు, కడున్ = మిక్కిలి, పెల్లునన్ = అధికముగా, పైపైన్ = వారిమీద, చికిలి = చక్కనైన, వాలు ములుకులు = వాడియైన బాణములు, నిగిడ్చెన్ = వ్యాపింపచేసెను.

**తా :** పంపగా ఆ వీర శ్రేష్ఠులు ఆకాశమార్గమున ఎగిరి వేగముగా వెళ్ళుచుండగా ఆ దుష్టుడైన రాక్షసుడు చాల అధికముగా వారిపైన వాడి బాణములు వేసెను.

**భుజంగప్రయాతము. నిగుడ్పం జొరన్లేక నేర్పేది యవ్వా**
**ల్మగల్ గ్రమ్మఱ న్వాలి మన్టేని మెట్టున్**
**జిగుళ్ళూఁతఁగా నిల్చి చేడ్పాటుల న్బి**
**ట్టుగాఁ గుందుచో సోఁకుడున్దుల్వ యాలోన్ 149**

నిగుడ్పన్ = వ్యాపింపచేయగా, చొరన్ లేక = ప్రవేశింపలేక, నేర్పు ఏది = నేర్పు పోగొట్టుకొని, ఆ వాల్మగల్ = ఆ వానరశ్రేష్ఠులు, క్రమ్మఱన్ = తిరిగి, మన్‌ఱేని మెట్టున్ = మనుజవిభుడగు రాముని పాదములను, వాలి = పడి, చిగుళ్ళు ఊతగాన్ = పాదాల కొనలు రక్షగా, నిల్చి, చేడ్పాటులన్ = అవమానములను, బిట్టుగాన్ = అధికముగా, కుందుచోన్ = బాధపడుచుండగా, సోకుడున్ తుల్వ = నీచుడైన రాక్షసుడు, ఆలోన్ = ఆ లోపల.

**తా :** వ్యాపింప చేయగా యుద్ధము చేయలేక నేర్పు పోగొట్టుకుని ఆ వానరశ్రేష్ఠులు తిరిగి రాముని పాదములను పడి ఆశలు చిగురింపగా నిల్చి అవమానముతో బాధపడుచుండగా ఆ నీచుడైన ఇంద్రజిత్తు ఆ లోపల –

**తోటకము.** **కొంచక నాల్కలు గోఁడుచు మంటల్**
**నించుచు నింగియు నేలయు నెల్లన్**
**ముంచుక బుస్సున ౙ్రోఁగుచు వాఁడిన్**
**మించిన పాముల మేల్చిలు కేసెన్** **150**

కొంచక = తగ్గక, నాల్కలు కోడుచు = నాలుకలు చాచుచు, మంటల్ నించుచు = విషాగ్నులు వ్యాపింపచేస్తూ, నింగియు నేలయు ఎల్లన్, ముంచుక = ఆక్రమించుకొని, బుస్సున, ౙ్రోగుచు = బుసలుకొట్టుచు, వాడిన్ మించిన = మిక్కిలి తీక్షణమైన, పాముల మేల్ చిలుకు = శ్రేష్ఠమైన నాగాస్త్రమును, ఏసెన్ = ప్రయోగించెను.

**తా :** తగ్గక నాలుకలు చాచుచు, మంటలు నింపుచు, నింగి, నేల అంతా ఆక్రమించుకొని బుస్సున బుసలుకొట్టుచు మిక్కిలి తీక్షణమైన నాగాస్త్రమును వేసెను.

**తే.గీ.** **ఏయుటయుఁ బాఁపగములు పెక్కేసియగుచుఁ**
**గ్రమ్మి రాముని నాతని తమ్ము గుఱ్ఱ**
**నెల్ల మూఁకల బిగఁబట్టి యిడినఁ బుడమి**
**త్రెళ్ళి యందఱు నొగి సొమ్మసిల్లి రపుడు** **151**

ఏయుటయున్ = వేయగా, పాపగములు = పాముల సమూహములు, పెక్కేసి యగుచున్ = అనేకములగుచు, క్రమ్మి = వ్యాపించి, రాముని, అతని తమ్ము గుఱ్ఱన్ = లక్ష్మణుని, ఎల్ల మూకలన్ = సైన్యమునంతను, బిగన్ పట్టి ఇడినన్ = గట్టిగా కట్టివేయబడినట్లు చేయగా, పుడమిన్ = నేలపై, త్రెళ్ళి = పడిపోయి, అపుడు = అప్పుడు, అందరు = అందరును, ఒగిన్ = క్రమముగా, సొమ్మసిల్లిరి = స్మృతికోల్పోయిరి.

**తా :** వేయగా పాములు అనేకములు వ్యాపించి రాముని, లక్ష్మణుని, సైన్యమునంతను గట్టిగా కట్టివేయబడినట్లుగా చేయగా నేలపై పడిపోయి అప్పుడు అందరూ సొమ్మసిలిరి.

**ఆ.వె.** **పగ యడంగునంచు మిగుల డెందములోన**
**నలరి వేల్పురాచ గెలుపుకాఁడు**
**ఠీవి నేఁగి గెలుపుఁ దెఱఁగెల్లఁ దండ్రికిఁ**
**దెలియఁజెప్పి యెలమి నెలయఁ జేసె** **152**

వేల్పురాచ గెలుపుకాడు = ఇంద్రుని గెలిచినవాడు (ఇంద్రజిత్తు), పగ = శత్రుత్వము, అడంగును అంచు = సమసిపోయెనని భావించి, అలరి = సంతోషించి, ఠీవిన్ = వైభవముతో, ఏగి, తండ్రికి = రావణునికి, గెలుపు తెఱగు ఎల్లన్ = గెలిచిన విధమునంతను, తెలియ చెప్పి = వివరముగా చెప్పి, ఎలమిన్ ఎలయన్ = మిక్కిలి సంతోషించునట్లుగా, చేసె = చేసెను.

**తా :** ఇంద్రజిత్తు శత్రుత్వము సమసిపోయెనని భావించి సంతోషించి వైభవముగా వెళ్ళి తండ్రికి గెలిచిన విధమును వివరముగా చెప్పి సంతోషింప చేసెను.

**తే.గీ. అంత నచ్చట రాముఁడు కొంతవడికిఁ**
**గన్నుఁగవ విచ్చి తోఁబుట్టువున్న తెఱఁగుఁ**
**జూచి తద్దయు వనటల స్రుక్కుచున్న**
**యెడల నా ఱేని చెంతకుఁ గడిఁది మీఱ** **153**

అంతన్ = ఆ తరువాత, అచ్చట = ఆ యుద్ధభూమిలో, రాముడు, కొంత వడికి = కొంత సేపటికి, కన్నుగవ విచ్చి = కన్నులు రెండును విప్పి, తోబుట్టువు ఉన్న తెఱగున్ = సోదరు దున్న స్థితిని, చూచి, తద్దయు = మిక్కిలి, వనటల స్రుక్కుచున్న యెడల = వేదనతో బాధ పడుచున్న సమయమున, ఆ ఱేని చెంతకున్ = ఆ రాముని దగ్గరకు, కడిది మీఱ = మిక్కిలి సాహసముతో –

**తా :** ఆ తరువాత యుద్ధభూమిలో రాముడు కొంతవడికి కన్నులు విప్పి సోదరుడున్న స్థితిని చూచి మిక్కిలి దుఃఖించుచుండగా ఆ రాముని చెంతకు మిక్కిలి శౌర్యముతో –

**సీ. విన్ను గేళాకూళి వెలఁది నీర్నినిచిన**
**పసిఁడి జారీ చెంబు పస పొసంగ**
**మే పూఁత వెలిబూది మిసిమియంటి వెలుంగు**
**నిద్దంపు టలఁతి జన్నిదము లమర**
**నునుగోళ్ళ తెలిచాయ నెనసి తళ్కులు గుల్కు**
**పటికంపు సరముల బాళి మీఱఁ**
**బూప తామర విందుఁ బోల్ప నీడై తగు**
**గడితంపు నిడుద కెంజడలు వఱల**

**తే.గీ. వాన కొన తటి మబ్బు చేర్వలను దెగడు**
**మేన నాడెంపు టిట్టి తోల్జా నెసంగ**
**నోర జగముల యెకిమీని పేరు సారె**
**గొణగుచును వచ్చె జగడంపుఁ గూటి తపసి** **154**

విన్ను కేళాకూళి = ఆకాశమను సరోవరమందలి, వెలది నీరు నినిచిన = స్వచ్ఛమైన నీటిని నింపిన, పసిడి జారీ చెంబు = బంగారు కమండలముయొక్క, పస పొసంగ = కాంతి ఒప్పుచుండగా, మే పూత = శరీర కాంతి, వెలిబూది = విభూతివంటి, మిసిమి అంటి = కాంతి కలిగి, వెలుంగు = మరింత ప్రకాశించుచు, నిద్దంపు = స్వచ్ఛమైన, అలతి = సన్ననైన, జన్నిదములు, అమర = కలుగగా, నునుగోళ్ళ = పదునైన గోళ్ళయొక్క, తెలిచాయ = తెల్లదనమును, ఎనసి = పొంది, తళ్కులు కుల్కు = కాంతులను విరజిమ్ము, పటికంపు సరముల = స్ఫటిక మాలలయొక్క, బాళి మీఱన్ = అందము అతిశయింపగా, పూప తామర విందున్ = ఉదయ సూర్యునితో, పోల్పన్ = పోల్చుటకు, ఈడై తగు = సరిపడునట్లున్న, గడితంపు = గొప్పవైన, నిడుద = పొడవైన, కెంపు

జడలు వఱల = ఎఱ్ఱని జడలు ఒప్పుచుండగా, వానకొన తఱిన్ = వర్షఋతువు చివర (శరత్కాల ప్రారంభం), మబ్బు చేర్వలను = మేఘ సమూహములను, తెగడు = తిరస్కరించు, మేన, నాడెంపు ఇఱ్ఱితోలు = చక్కని జింక చర్మము, జాను ఎసంగన్ = అందగించగా, ఓర = అహోరాత్రములు, జగముల ఎకిమీని పేరు = సమస్త లోకములకు ప్రభువైన శ్రీమన్నారాయణుని పేరు, సారె = మాటిమాటికి, గొణగుచును = జపించుచు, జగడంపు గూటి తపసి = నారదుడు, వచ్చె = వచ్చెను.

**తా :** ఆకాశమను సరోవరమందలి స్వచ్ఛమైన నీటిని నింపిన పసిడి జారీ చెంబు కాంతి ఒప్పుచుండగా, మే పూత విభూతి కాంతి తగిలి మరింత ప్రకాశించు సన్నని జందెములు కలుగగా, పదునైన గోళ్ళ తెల్లదనమును పొంది కాంతులను విరజిమ్ము స్ఫటికమాలల అందము అతిశయింపగా, ఉదయ సూర్యుని పోల్చదగిన ఎఱ్ఱని జడలు ఒప్పుచుండగా, శరత్కాల మేఘములను తిరస్కరించు శరీరమున జింక చర్మము అందగించగా, అహోరాత్రములతో కూడిన సమస్త లోకములకు ప్రభువైన ఆ శ్రీమన్నారాయణుని పేరు మాటిమాటికి జపించుచు నారదుడు వచ్చెను.

**తే.గీ.** **వచ్చి యవ్వేడి వేలుపు వంగడంపు**
**నేల మొలత్రాటి నిండు కుందేటి తాల్పు**
**మ్రోల నిల్చి కరంబు ప్రేముడి తలిర్ప**
**వెరవుతోఁ బల్కెఁ గేలు దామరలు మొగిచి** **155**

వచ్చి, ఆ వేడివేలుపు వంగడంపు = ఆ సూర్యవంశమునకు చెందిన, నేల మొలత్రాటి = నేల మొలత్రాడుగాకల సముద్రునకు, నిండు = పున్నమినాటి, కుందేటి తాల్పు = చంద్రుని వంటివాడైన రాముని, మ్రోల నిల్చి = చేరువకు వచ్చి, కరంబు = మిక్కిలి, ప్రేముడి తలిర్ప = ప్రీతి కనబడునట్లుగా, కేలు తామరలు మొగిచి = చేతులు జోడించి, వెరవుతో = ఉపాయముతో, పల్కె = పలికెను.

**తా :** వచ్చి ఆ సూర్యవంశముకు చెందిన, సముద్రునకు పున్నమినాటి చంద్రునివంటివాడైన రాముని చేరువకు వచ్చి మిక్కిలి ప్రీతితో చేతులు జోడించి ఉపాయముతో పలికెను.

**కమలవిలసిత.**

**జగములు యొడయఁడ! చదువులు మూఁడున్**
**దగిలిన కడఁకవొదల నిను జేజేల్**
**ముగురకు మొదలగు ముదుకఁడవంచున్**
**బొగడెడుఁగద గొనబుగఁ బలుమాఋన్** **156**

జగముల యొడయడ = లోకములకు ప్రభుడవగు ఓ రామా!, చదువులు మూడున్ = మూడు వేదములును, తగిలిన = ఆశ్రయించిన, నిను, జేజేల్, కడక పొదలన్ = మిక్కిలి ప్రయత్నముతో, ముగురకు = త్రిమూర్తులకును, మొదలగు = ప్రథముడవైన, ముదుకడవు అంచున్ = పెద్దవాడవనుచు, గొనబుగన్ = అందముగా, పలుమాఋన్, పొగడెడున్ కద = పొగడుతూ ఉంటారుకదా!

**తా :** లోకములకు ప్రభువా! మూడు వేదములును ఆశ్రయించిన నిన్ను దేవతలు త్రిమూర్తులకును ప్రథముడవైన పెద్దవాడవనుచు అందముగా అనేకమార్లు పొగడు తూంటారుకదా!

**స్వాగతము.**

**మేరలేని పలు మేనులుఁ బేరుల్**
**సారెఁ బూను నెఱజాణల మిన్నం**
**గోరి నిచ్చలును గొల్తురు నిన్నుం**
**దోరమైన మదితో జడదారుల్** **157**

మేరలేని = అంతములేని, పలు మేనులున్ = పలు శరీరములను, పేరుల్ = పేరులను, సారెన్ = మాటిమాటికి, పూను = వహించు, నెఱజాణల మిన్నన్ = నైపుణ్యము కలవారిలో శ్రేష్ఠుడవగు, నిన్నున్ = నిన్ను, జడదారుల్ = మునీశ్వరులు, తోరమైన = సుందరమైన, మదితో = మనస్సుతో, కొల్తురు = సేవింతురు.

**తా :** అంతము లేని పలు శరీరములను, పేరులను మాటిమాటికి వహించు నైపుణ్యము కలవారిలో శ్రేష్ఠుడవని నిన్ను మునీశ్వరులు సుందరమైన మనస్సుతో సేవిస్తారు.

స్రగ్విణి. **చీమలుం దోమలుం జెట్టులుం గట్టులుం**
**బాములుం బుల్గులుం బందులుం జేఁపలున్**
**గాములున్ వేల్పులుం గల్గు మే తాల్పులున్**
**వేమఱున్ బల్లిదా! నీవెకా నెన్నుదున్** **158**

బల్లిదా = బలవంతుడా!, చీమలున్, దోమలున్, చెట్టులున్, గట్టులున్ = పర్వతములును, పాములున్, పుల్గులున్ = పక్షులును, పందులున్ = జంతువులును, చేపలున్ = జలచరములును, గాములున్ = గ్రహములును, వేల్పులున్ = దేవతలును, కల్గు = కలిగినట్టి, మే తాల్పులున్ = శరీర ధారులన్నియును, నీవెకాన్ = నీ స్వరూపముగానే, వేమఱున్ = పలుమార్లు, ఎన్నుదున్ = తలంచెదను.

**తా :** బలవంతుడా! చీమలు, దోమలు, చెట్టులు, గట్టులు, పాములు, పక్షులు, జంతువులు, జలచరములు, గ్రహములు, దేవతలు కలిగినట్టి ప్రాణులన్నీ నీ స్వరూపముగానే తలంతును.

తే.గీ. **వాసి దయ్యము నీవె వెయ్యేసియైన**
**తలలు జేతులుం గన్ను లజ్జలును గలిగి**
**యలర లొడితెడు మగవాఁడ వగుచు నేల**
**యెల్ల నాఁగుదువని మిన్కు లెన్నుఁ గదవె** **159**

వాసి = ప్రసిద్ధికెక్కిన, దయ్యము నీవె = దైవము నీవే, వెయ్యేసియైన = వేలకొలది, తలలు, చేతులున్, కన్నులు, అజ్జలును = పాదములును, కలిగి = ఉండి, అలర = ఒప్పునట్లు, లొడితెడు = వామన రూపముకల, మగవాడవు అగుచు = పురుషుడవగుచు, నేల ఎల్లన్ = లోకమంతయు, అగుదువని = ఆక్రమింతువని, మిన్కులు = వేదములు, ఎన్నుగదవె = కీర్తించునుకదా!

**తా :** వాసి దైవము నీవే. వేలకొలది తలలు,చేతులు,కన్నులు,పాదములు కలిగి ఒప్పునట్లు వామన రూప పురుషుడవగుచు లోకమంతా ఆక్రమింతువని వేదములు కీర్తిస్తాయి.

**తే.గీ. తలఁప నివ్వరి ముంటి చందమున మిగులఁ**
**గొంచెమై కప్పు మొగులులో మించుఁదీవ**
**పోల్కి మెఱయుచుఁ బచ్చనై పొలుచు తేజు**
**నీవకద! నిక్కముగ మేటి నేలతేఁడ! 160**

మేటి నేలతేడ = గొప్ప ప్రభువా! తలప = ఆలోచింపగా, నివ్వరి ముంటి చందమున = నీవారధాన్యపు కొసనున్న ముల్లు మాదిరిగా, మిగులన్ = మిక్కిలి, కొంచెమై = స్వల్పభాగమై, కప్పు మొగులులో = నల్లని మేఘములో, మించు తీవ పోల్కి = మెఱుపుతీగవలె, మెఱయుచున్ = ప్రకాశించుచు, పచ్చనై పొలుచు = పచ్చని కాంతితో ప్రకాశించు, తేజు = గుఱ్ఱములుకల సూర్యుడవు, నిక్కముగ = సత్యముగ, నీవ కద = నీవేకదా!

**తా :** గొప్ప ప్రభువా! ఆలోచింపగా నీవార ధాన్యపు ముల్లు మాదిరిగా మిక్కిలి స్వల్పమై నల్లని మేఘములో మెఱుపు తీగవలె ప్రకాశించుచు పచ్చని కాంతితో ప్రకాశించు గుఱ్ఱములు కల సూర్యుడవు సత్యముగ నీవేకదా!

**దండకము :**

**అరిది బిరుదా! నీవు రాయంచ తేజీ వజీరుండవై చుట్టు వాల్దాల్పవై మెట్టు విల్వేల్పువై రీవితో ముజ్జగంబెల్లఁ బుట్టించుచుం బ్రోచుచున్ ద్రుంచుచున్ నీవె జాబిల్లివై ప్రొద్దువై యుద్దిగా రేపగళ్ళ న్నెఱిం జేయుచుం దుంత టెక్కెంబు రాయండవై పున్నియంబుల్ గొలల్ నిచ్చలుం బంచి మెక్కింపుచుం దూర్పునాడేలు మన్నీఁడవై వానచేఁ బంట లొందింపుచున్ జంట నెమ్మోములన్ దంటవై వంట కర్జంబు సాగించుచున్ వెండియున్ జేయఁగాఁగల్గు కర్జంబు లెన్నైనఁ బల్రూపులం బూని కావించుచున్ మాటికిన్ బూటకంబారఁ బేరాటలం బొల్తువంచోలి నీమాట ప్రాబాస వాల్మేటు లేర్పాటుగాఁ జాటఁగాఁ దేటగా వీనుల న్నాఁటి యేనాటికిం బాయదో సామి!**

నీ కీఁద లా వగ్గి నెమ్మోము రేరాయఁడుం బ్రొద్దుఁ గన్నుల్ మొగుల్త్రోవ నాడెంపు మే న్వేల్పుప్రో లఱ్ఱు క్రొందమ్మిపూనట్టు కుఱ్ఱుందు డెందంబు జేజే లుబ్బజంబుల్ నిరాబారులు న్వెంద్రుకల్ నల్వయా ల్నాల్క ప్రాఁబల్కుచాల్తల్లి కీల్గంటు ప్రాఁబల్కు లూర్పుంగముల్ సంద్రముల్ బొజ్జ మ న్నఱ్ఱకెందామర ల్వేల్పువెజ్జు ల్పిఱుందు ల్కడల్ వీనులైయొప్పు నీ చొప్పు గావింపఁగా నన్నియు న్నీవయైయుందు వొండెద్దియున్ నీవుగాకున్న దెచ్చోటులన్ లేదుగా పాదుగా బమ్మ గ్రుడ్డుంగముల్ నీమెయిన్ మేడిపండ్లంబలెన్ బ్రోవులైయుండుఁ బో తండ్రీ!

నీ వెప్పుడుం దుల్వలం గాల్పఁగా సాదులం బ్రోదిగావింపఁగాఁ గోరి వేవేల వేసంబు లెంతేనియు న్వేడబం బొప్పఁగా బూని రాణింతు వెట్లన్న మున్మీను మేనూని మున్నీరు సొత్తెంచి పెన్మిన్నుచా ల్తెక్కలిం జక్కజక్కాడి నెత్తమ్మిపూఁజూలి నుబ్బింపవా? ప్రాఁత జేజేలు జేజేలు దేజారఁగాఁ జేరి వేజాడలం జిడ్డు నీర్వామి వేత్రచ్చుచో మేటి తాఁబేటి మే యెత్తి మవ్వంపుఁ గవ్వంపు గట్టాని వేల్పుంగమిన్ గావవా? దేవరా! క్రొవ్వి మన్నంతయుం గొంచు బల్పాఁప రాయిక్కకుం బ్రాకు బంగారపుంగంటి రేద్రిమ్మరిం జన్నపుం బందివై చెంది వైళంబ వాల్గొమ్ములం గ్రుమ్మవా? గట్టిగా

**గన్న తొ ల్బొట్టెనిం బట్టి యిట్టట్టుగా బిట్టు దట్టింపుచుం జెట్టలం బెట్టు బల్గట్టు వారక్కసు న్వెక్కసంబైన పేరుక్కుతో నుక్కు గంబంబునం బుట్టి గిట్టింపవా? పొట్టివై నేల మూఁడజ్జలే వేఁడి వేగన్ జగంబాఁగి చాగంపు తొల్వేలుపుం గ్రిందికి న్మెట్టవా? మెండు నిండారఁగా జామదగ్న్యుండవై గండ్రగొడ్డంట ముయ్యేడు మార్లేచి గయ్యాళి రాపిండులం జెండుబెండాడవా? దేవరా! యిప్పు డిచ్చాలుపుంగుత్తుకల్గల్గు ప్రావేలుపుం గూలుపంగోరి యీరైదుబండ్లెక్కు రా కల్వసంగాతికిన్ గూనవై పుట్టియున్నాఁడ వీవెట్టులోఁ దెల్వి యొక్కింతయు న్లేక స్రుక్కంగ నింకేల? నీ జక్కియై యుక్కునం గేరు న ప్పక్కిరారిక్కతేనిం దలంపంగఁ గర్జంబు లెన్నేనియుం జక్కనై సాగుఁ బొమ్మంచు నెయ్యంబుతోఁ దెల్పి జేజే నిరాబారి యెందేనియుం బోవ రాచూలి తా నప్పు డా గూఁడుకాన్పుం దొరం గూర్మి డెందంబున న్నిల్పుడున్ 161**

అరిది బిరుదా = అపురూపమైన పరాక్రమముకలవాడా!, నీవు, రాయంచ తేజీ వజీరుండవై = హంస వాహనముగాకల బ్రహ్మదేవుడవై, చుట్టువాల్ తాల్పవై = చక్రాయుధము ధరించిన విష్ణువువై, మెట్టు విల్ వేల్పువై = మేరుపర్వతము విల్లుగాకల పరమేశ్వరుడవై, ఠీవితో = వైభవముతో, ముజ్జగంబు ఎల్లన్ = మూడులోకాల నన్నిటిని, పుట్టించుచున్, ప్రోచుచున్, త్రుంచుచున్, నీవె, జాబిల్లివై, ప్రొద్దవై = సూర్యుడవై, ఉద్దిగాన్ = సమముగా, రేయి పగళ్ళన్, నెఱిన్ చేయుచున్ = చక్కగా చేయుచు, దుంత టెక్కెంబురాయండవై = దున్నపోతు ధ్వజముగాకల యమధర్మరాజువై, పున్నియంబుల్ = పుణ్యములను, కొలల్ = పాపములను, నిచ్చలున్ = ఎల్లప్పుడును, పంచి = పంపకము చేసి, మెక్కింపుచున్ = జీవులచే అనుభవింపచేయుచు, తూర్పునాడు ఏలు = తూర్పుదిక్కును పాలించు, మన్నీడవై = ప్రభువైన ఇంద్రుడవై, వానచేన్ = వర్షముచేత, పంటలు ఒందించుచున్ = పంటలను లభింపచేయుచు, జంట నెమ్మోములన్ = రెండు దివ్య ముఖమ్ములతో, దంటవై = నేర్పరివైన అగ్నిహోత్రుడవై, వంట కర్జంబు = వంట కార్యక్రమమును, సాగించుచున్ = కొనసాగించుచు, వెండియున్ = ఇంకను, చేయగాన్ కల్గు = చేయకలిగిన, కర్జంబులు = కార్యములు, ఎన్నైనన్ = ఎన్ని ఐనప్పటికిని, పలు రూపులన్ = పలు ఆకారములను, పూని = ధరించి, కావింపుచున్ = ఆయా కార్యములను నెరవేర్చుచు, మాటికిన్ = మాటిమాటికి, బూటకంబు ఆరన్ = కపటము ప్రస్ఫుటమవగా, పేరాటలన్ = నామరూపములతో, పొల్తువు = ఒప్పుదువు, అంచున్ = అనుచూ, ఓలిన్ = క్రమముగా, నీమాట = నీ పలుకులు, ప్రాబాస వాల్మేటులు = వేదాధ్యయనమొనర్చిన పండితులు, ఏర్పాటుగాన్ = చక్కగా, చాటగాన్ = వ్యాప్తిచేయగా, తేటగాన్ = స్పష్టముగా, వీనులన్ = చెవులను, నాటి = నాటుకొని, ఏనాటికిన్ = ఎన్నటికిని, పాయదు = విడిచిపెట్టదు,

ఓ సామి = ఓ స్వామీ!, నీకు, ఈద = వాయువు, లావు = శక్తి, నెమ్మోము = అందమైన ముఖము, అగ్గి = అగ్ని, రేయిరాయడున్ = చంద్రుడును, ప్రొద్దు = సూర్యుడును, కన్నుల్, మొగులు త్రోవ = ఆకాశము, నాడెంపు = శ్రేష్ఠమైన, మేను = దేహము, వేల్పు ప్రోలు = దేవతల పట్టణము అమరావతి, అట్టు = కంఠము, క్రొత్త తామర పూనట్టు = విరిసిన తామరపూవు వాసస్థానముగా

కల, కుఱ్ఱందు = కుమారుడగు బ్రహ్మ, డెందంబు = హృదయము, జేజేల్ = దేవతలు, బుజంబుల్ = భుజములు, నిరాబారుల్ = మునీశ్వరులు, వెండ్రుకల్ = వెంట్రుకలు, నల్వయాలు = బ్రహ్మదేవుని భార్య సరస్వతీదేవి, నాల్క = నాలుక, ప్రాబల్కు చాలు తల్లి = వేద మాత, కీల్గంటు = జుట్టుముడి, ప్రాబల్కు ఉూర్పుంగముల్ = వేదముల ఉచ్ఛ్వాస నిశ్వాసములు, సంద్రముల్ = సముద్రములు, బొజ్జ = ఉదరము, మన్ను = భూమి, అజ్జ కెందామరల్ = పాదపద్మములు, వేల్పు వెజ్జులు = దేవ వైద్యులైన అశ్వినీ దేవతలు, పిఱుందుల్ = పిఱుదులున్న ప్రదేశము కడల్ = దిక్కులు, వీనులై ఒప్పు = చెవులుగా ఒప్పునట్టి, నీ చొప్పు = నీ విధానము, గాలింపగాన్ = పరిశీలింపగా, అన్నియున్ = సమస్తమును, నీవయై ఉందువు, ఒండు ఎద్దియున్ = ఇతరమైనది ఏదియును, నీవు కాకున్నది, ఎచ్చోటులన్, లేదుగా = లేదుకదా!, పాదుగాన్ = ఆధారముగా, బమ్మ గుడ్డం గముల్ = బ్రహ్మాండ సమూహములు, నీ మెయిన్ = నీ శరీరమునందు, మేడిపండ్లంబలెన్ = మేడిపండ్లవలె, ప్రోవులై = గుత్తులుగా, ఉండున్ పో = ఉంటాయికదా!

ఓ తండ్రీ!, నీవు ఎప్పుడున్, తుల్వలన్ = దుష్టులను, కాల్పగాన్ = నాశనముచేయుటకు, సాదులన్ = సత్పురుషులను, ప్రోదిగావింపగాన్ = రక్షించుటకును, కోరి, వేలవేల వేసంబులు = అనేకములైన అవతారములు, ఎంతేనియున్ = పూర్తిగా, వేడబంబు ఒప్పగా = మాయ ప్రకటమవగా, పూని = ధరించి, రాణింతువు = ప్రకాశింతువు, ఎట్లు అన్న = ఏ రీతిగా అంటే, మును = పూర్వము, మీను మేను ఉూని = మత్స్యావతారమును పొంది, మున్నీరు చొత్తెంచి = సముద్రమున ప్రవేశించి, పెన్మిన్కు చాలు = వేద సమూహమును, తెక్కలిన్ = దొంగిలించిన వంచకుని (సోమకాసురుడను రాక్షసుని), చక్కన్ చక్కాడి = చక్కగా సంహరించి, నెఱ తమ్మిచూలి = బ్రహ్మదేవుని, ఉబ్బింపవా = సంతోషపెట్టవా?, ప్రాత జేజేలు = రాక్షసులు, జేజేలు = దేవతలు, తేజారగాన్ = తమ శక్తికొలది, చేరి = కూడి, వేయి జాడలన్ = పలు విధములుగా, జిడ్డు నీర్వామిన్ = పాలసంద్రమును, వే = వేగముగా, త్రచ్చుచోన్ = చిలుకుచుండగా, మేటి తాబేటి మే ఎత్తి = గొప్ప తాబేలు దేహము ధరించి, మవ్వంపు = సుందరమైన, కవ్వంపు గట్టున్ ఉూని = కవ్వముగానున్న మంధర పర్వతమును మోసి, వేల్పుగమిన్ కావవా = దేవతల సమూహమును కాపాడవా?, దేవరా = ప్రభూ!, క్రొవ్వి = మదించి, మన్ను అంతయు = భూమినంతను, కొంచున్ = తీసుకొనిపోవుచు, బల్ = గొప్పవాడైన, పాపరాజు ఇక్కకున్ = నాగలోకమునకు, ప్రాకు = ప్రాకుచున్న, బంగారపుం కంటి రే త్రిమ్మరిన్ = హిరణ్యాక్షుని, జన్నపుం పందివై చెంది = యజ్ఞ వరాహమువై, వైళంబ = శీఘ్రముగా, కొమ్ములన్, క్రుమ్మవా = కుమ్మివేయవా?, గట్టిగాన్ = కఠినముగా, కన్న = కనిన, తొలు బొట్టెనిన్ = పెద్ద కొడుకుని (ప్రహ్లాదుని), పట్టి = పట్టుకొని, అట్టిట్టుగాన్ = ఇష్టమువచ్చినట్లుగా, బిట్టు దట్టింపుచున్ = మిక్కిలి బాధించుచు, చెట్టలన్ పెట్టు = ఆపదల పెట్టుచున్న, బల్ గట్టువా = ధూర్తుడైన, రక్కసున్ = హిరణ్యకశిపుని, వెక్కసంబైన = దుస్సహమైన, పేరు ఉక్కుతోన్ = అధికమైన బలముతో, ఉక్కు కంబంబునన్ పుట్టి, గిట్టింపవా = చంపలేదా?,

పొట్టివై = వామనుడవై, నేల = భూమిని, మూడజ్జలే వేడి = మూడడుగులే కోరి, వేగన్ = శీఘ్రముగా, జగంబు ఆగి = లోకము నాక్రమించి, చాగంపు = దానశీలుడైన, తొల్వేల్పున్ = బలిచక్రవర్తిని, క్రిందికిన్ = పాతాళమునకు, మెట్టవా = త్రొక్కలేదా?, మెండు నిండారగాన్ = మిక్కిలి ఆధిక్యముతో, జామదగ్న్యుడవై = పరశురాముడవై, గండ్ర గొడ్డంటన్, ముయ్యేడు మార్లు = 3×7=21సార్లు, ఏచి = పరాక్రమించి, గయ్యాళి రాపిండులన్ = క్రూరులైన రాజసమూహములను, చెండు బెండాడవా = సంహరింపవా?

దేవరా!, ఇప్పుడు, ఈ చాలుపుం కుత్తుకల్ కల్గు ప్రావేలుపున్ = రావణుని, కూలుపన్ కోరి = చంపదలచి, ఈరైదు బండ్లెక్కు రాకల్వసంగాతికిన్ = దశరథునికి, కూనవై పుట్టి ఉన్నాడవు = బిడ్డగా పుట్టి యున్నావు, ఈవు = నీవు, ఎట్టులోన్ = ఏరీతిగా, తెల్వియొక్కింతయున్ లేక = స్వస్వరూప జ్ఞానములేక, స్రుక్కంగన్ = బాధపడుచుండుట, ఇంకన్ ఏల = ఇంకా ఎందులకు? నీ జక్కియై = నీ వాహనమై, ఉక్కునన్ కేరు = బలముతో చెలరేగు, ఆ పక్కిరారిక్క ఱేనిన్ = ఆ పక్షిరాజగు గరుత్మంతుని, తలంపగన్ = తలచగానే, కర్జంబులు ఎన్నేనియున్ = పనులెన్నైనను, చక్కనై సాగున్ = చక్కగా జరిగిపోవును, పొమ్మంచున్ = అలా జరిపించుమనుచు, నెయ్యంబుతోన్ = ప్రియముతో, తెల్పి = చెప్పి, జేజే నిరాబారి = నారదుడు, ఎందేనియున్, పోవన్ = వెళ్ళిపోగా, రాచూలి = రాముడు, తాన్ = తాను, అప్పుడు, ఆ గూడుకాన్పుం దొరన్ = గరుత్మంతుని, కూర్మిన్ = ప్రేమతో, డెందంబునన్ = మనస్సునందు, నిల్పుడున్ = తలచగానే–

**తా :** అపురూపమైన పరాక్రమముకలవాడా! నీవు బ్రహ్మవై, విష్ణువై, పరమేశ్వరుడవై వైభవముగా మూడులోకాలను సృష్టి, స్థితి, లయములు చేయుచు, నీవే జాబిల్లివై, సూర్యుడవై సమముగా రేయింబగళ్ళు చేయుచు, యముడవై పుణ్యాపాపములను పంపకము చేసి జీవులచే అనుభవింప చేయుచు, ఇంద్రుడవై వానచే పంటలు లభింపచేయుచు, అగ్నివై వంటలు కొనసాగించుచు, ఇంకా చేయగలిగిన పనులు ఎన్నో పలు రూపులు ధరించి ఆయా కార్యములు నిర్వర్తించుచు మాటిమాటికి నీ మాయ తెలియగా నామరూపములతో ఒప్పుదువనుచు వేదాధ్యయనపరులు చాటగా చెవులను నాటుకొని ఎన్నటికీ పాయదు. ఓ స్వామీ! నీకు వాయువు శక్తి, అగ్ని ముఖము, చంద్రుడు,సూర్యుడు కన్నులు, ఆకాశము దేహము, అమరావతి కంఠము, బ్రహ్మ హృదయము, దేవతలు భుజములు, మునులు వెంట్రుకలు, సరస్వతి నాలుక, వేదమాత జుట్టుముడి, వేదములు ఉచ్ఛ్వాస నిశ్వాసములు, సముద్రములు ఉదరము, భూమి పాదపద్మములు, అశ్వినీదేవతలు పిరుదులు, దిక్కులు చెవులై ఒప్పునట్టి నీ విధానము పరిశీలింపగా సమస్తము నీవయై ఉందువు. నీవు కానిది ఏదియును లేదు. నీవే ఆధారముగా బ్రహ్మాండ సమూహములు నీ శరీరమునందు మేడిపండ్లవలె గుత్తులుగా ఉంటాయికదా!

ఓ తండ్రీ! నీవు దుష్టులను నాశముచేయుటకు, సత్పురుషులను రక్షించుటకు కోరి పలు అవతారములు పూర్తిగా మాయా ప్రకటనముగా ధరించి రాణింతువు. ఎట్లన్న పూర్వము మత్స్యావతారమెత్తి సముద్రమున ప్రవేశించి వేదములను దొంగిలించిన సోమకాసురుని సంహరించి

బ్రహ్మను సంతోషపెట్టితివి. రాక్షసులు, దేవతలు తమ శక్తికొద్దీ పాలసముద్రమును చిలుకుచుండగ కూర్మావతారమున మంధర పర్వతమును మోసి దేవతలను కాపాడితివి. ప్రభూ! మదించి భూమిని నాగలోకమనకు తీసుకొనిపోవుచున్న హిరణ్యాక్షుని వరాహావతారమున కుమ్మివేసితివి. కన్న కొడుకుని ఇష్టము వచ్చినట్లుగా బాధించుచున్న హిరణ్యకశిపుని ఉక్కుకంబమున పుట్టి చంపితివి. నేల మూడడుగులే కోరి లోకము నాక్రమించి దానశీలుడైన బలిచక్రవర్తిని వామనావతారమున పాతాళమునకు త్రొక్కితివి. ముయ్యేడుమార్లు రాజసమూహములను పరశురాముడవై సంహరించితివి.

దేవరా! ఇప్పుడు రావణుని చంపదలచి దశరథుని బిడ్డవైతివి. నీవు ఏల స్వస్వరూపజ్ఞానము లేక బాధపడుచుంటివి. నీ వాహనమైన గరుత్మంతుని తలచిన చాలు పనులెన్నైనను చక్కగా జరిగిపోవును. అలా జరిపించుము అని చెప్పి నారదుడు ఎందేని పోగా రాముడు అప్పుడు గరుత్మంతుని ప్రీతితో మనసున తలచగానే –

**చం.** **గడితపు ఱెక్కగాడ్పుల జగంబు లగడ్పడి తాఱుమాఱుగాఁ**
**గడలిగముల్ గడుం దొనఁకి కట్టడి కట్టలు దాఁటి పాఱఁగాఁ**
**బుడమి గలంగ వే దలల పూనెడు పాము దలంకి పాఱఁగాఁ**
**దడయక వచ్చె వేలుపుల దారికి పాములు వేఁటకాఁ డొగిన్** **162**

గడితపు = బలమైన, ఱెక్కగాడ్పుల = రెక్కల గాలిచేత, జగంబులు = లోకములు, అగడు పడి = కలతచెంది, తాఱుమాఱుగాన్ = అటు ఇటు మారగా, కడలి గముల్ = సముద్ర సమూహములు, కడున్ తొనకి = మిక్కిలి పొంగి, కట్టడి కట్టలు = చెలియలి కట్టలు, దాటి పాఱగాన్ = దాటి ప్రవహించగా, పుడమి = భూమి, కలంగ = చలింపగా, వే తలల పూనెడు పాము = ఆదిశేషుడు, తలంకి పాఱగాన్ = భయపడి పారిపోగా, పాముల వేటకాడు = గరుత్మంతుడు, ఒగిన్ = క్రమముగా, తడయక = ఆలసింపక, వేలుపుల దారికి = ఆకాశ మార్గమునకు, వచ్చె = వచ్చెను.

**తా :** బలమైన రెక్కల గాలిచేత లోకములు కలతచెంది తారుమారవగా, సముద్రములు పొంగి కట్టలు దాటి ప్రవహింపగా, భూమి చలింపగా, ఆదిశేషుడు భయపడి పారిపోగా గరుత్మంతుడు ఆలసింపక గగనమార్గమున వచ్చెను.

**కం.** **వచ్చినఁ బొడగాంచి పెనల్**
**విచ్చుకొని కడుం దలంకి విసదారి గముల్**
**విచ్చు న్మొగ్గయి కడలకు**
**విచ్చలవిడిఁ బఱచెఁ గట్లు వీడెం బజకున్** **163**

వచ్చినన్ = రాగా, విసదారి గముల్ = పాముల సమూహములు, పొడగాంచి = కనిపెట్టి, పెనల్ విచ్చుకొని = పెనవేసుకొనడం విడిచిపెట్టి, కడున్ తలకి = మిక్కిలి భయపడి, విచ్చున్ మొగ్గయి = విచ్చుకున్న మొగ్గరీతిగా, కడలకు = అన్ని దిక్కులకు, విచ్చలవిడిన్ = చెల్లాచెదరుగా, పఱచెన్ = పారిపోయెను, పజకున్ = సైన్యమునకు, కట్లు వీడెన్ = పాముల కట్లు విడిపోయెను.

**తా :** రాగా పాములు కనిపెట్టి పెనవేసుకొనుట విడిచిపెట్టి భయపడి విచ్చుకున్న మొగ్గ రీతిగా అన్ని దిక్కులకు చెల్లాచెదరుగా పారిపోయెను. సైన్యమునకు కట్లు విడిపోయెను.

**ఆ.వె. అపుడు పుల్గురాయఁ డర్మిలి పుడమికి**
**డిగ్గి నేలతేని డెంద మలరఁ**
**జేసి మరల వింటఁ జెచ్చెరఁ బఱతెంచె**
**నెలమితోడ మూఁకలెల్లఁ బొదలె** **164**

అపుడు = ఆ సమయమున, పుల్గురాయడు = గరుత్మంతుడు, అర్మిలి = అపేక్షతో, పుడమికి డిగ్గి = నేలకు దిగి, నేలతేని డెందము = రాముని మనస్సు, అలరన్ జేసి = ఆనందించునట్లుగా చేసి, మరల = తిరిగి, వింటన్ = ఆకాశమున, చెచ్చెరన్ = వేగముగా, పఱతెంచెన్ = వెడలిపోయెను. మూకలు ఎల్లన్ = సైన్యము లన్నియు, ఎడమితోడ = సంతోషముతో, పొదలె = విజృంభించెను.

**తా :** అపుడు గరుత్మంతుడు ఆపేక్షతో నేలకు దిగి రాముని మనసు ఆనందించునట్లుగా చేసి తిరిగి ఆకాశమున వేగముగా వెళ్ళిపోయెను. సైన్యములు సంతసమున విజృంభించెను.

**ఆ.వె. అంతఁ బొదుపుతిప్ప నెంతయుఁ గడకతోఁ**
**జక్కిదాయ పడగసామి యబ్బ**
**బొడముటయును బొంగి యడవి ద్రిమ్మరిజోదు**
**లార్పు లెసఁగ లంక కరిగి రనికి** **165**

అంతన్ = అంతట, పొదుపుతిప్పన్ = తూర్పు దిక్కున, ఎంతయున్ కడకతోన్ = మిక్కిలి పూనికతో, జక్కిదాయ పడగ సామి = దున్నపోతు టెక్కెముగాగల స్వామి (యముడు), అబ్బ = తండ్రి (సూర్యుడు), పొడముటయును = ఉదయించుటతో, పొంగి = రెచ్చిపోయి, అడవి త్రిమ్మరి జోదులు = వానరులు, ఆర్పులు ఎసగన్ = అరుపులతో విజృంభించుచు, అనికి = యుద్ధమునకు, లంకకు, అరిగిరి.

**తా :** అంతట తూర్పు దిక్కున సూర్యుడు ఉదయించుటతో రెచ్చిపోయి వానరులు అరుపులతో విజృంభించుచు యుద్ధమునకు లంకానగరమునకు వెళ్ళిరి.

**కం. అరిగినఁ గని వేగులవా**
**రరుదారఁగ దీవితేని యండకుఁ జని వా**
**విరి నత్తెఱఁ గెఱిగించిన**
**గరము వగం బొందె నతఁడు కళవళమొదవన్** **166**

అరిగినన్ = వెళ్ళగా, వేగులవారు = చారులు, అరుదారగ = ఆశ్చర్యంగ, కని = చూచి, దీవితేని అండకున్ = రావణుని చెంతకు, చని = వెళ్ళి, వావిరిన్ = వివరముగా, ఆ తెఱగు = ఆ విషయమును, ఎఱిగించిన = తెలుపగా, అతడు = ఆ రావణుడు, కరము = మిక్కిలి, కళవళమొదవన్ = కలవరపాటు కలుగగా, వగన్ = సంతాపమును, పొందెన్ = పొందెను.

**తా :** వెళ్ళగా చారులు ఆశ్చర్యంగ చూచి రావణుని చెంతకు వెళ్ళి వివరంగా ఆ సంగతి తెలుపగా ఆ రావణుడు కలవరపాటున సంతాపమును పొందెను.

**ఆ.వె.** **ప్రెగడ పిండు నెల్లఁ బిలిపించి వింటిరే?**
**యిట్టి కడిఁది మీర లింద్రజిత్తు**
**చేతి చిలువత్రాళ్ళఁ జెయువేది పొలిసిన**
**కోఁతి బంట్లు మరలఁ గూడి రనికి** **167**

ప్రెగడ పిండున్ ఎల్లన్ = మంత్రుల బృందమునంతను, పిలిపించి, ఇట్టి కడిది = ఇట్టి దుర్వార్తను, మీరలు = మీరు, వింటిరే = విన్నారా?, ఇంద్రజిత్తు చేతి = ఇంద్రజిత్తు చేతిలోని, చిలువ త్రాళ్ళన్ = సర్ప పాశములచే, చెయువు ఏది = చైతన్యము కోల్పోయి, పొలిసిన = మరణించిన, కోతి బంట్లు = వానర సైన్యము, మరలన్ = తిరిగి, అనికి = యుద్ధమునకు, కూడిరి = సన్నద్ధులైరి.

**తా :** మంత్రులను రప్పించి ఈ దుర్వార్తను మీరు విన్నారా? ఇంద్రజిత్తు చేతి సర్పపాశములచే చైతన్యము కోల్పోయి మరణించిన వానర సైన్యము తిరిగి యుద్ధమునకు సన్నద్ధులైరి.

**సీ.** **అని పల్కి ధూమ్రాక్షుఁడను వాని దురమున**
**కనిచిన నతఁడు లావదర మూఁక**
**లేనుఁగుల్ గుఱ్ఱము లెడపక తోడరా**
**నక్కజంబుగఁ బైఁడి యరదమెక్కి**
**అడవి ద్రిమ్మరులపై నడచిన నిరువాగు**
**వారును దార్కొని వాఁడి మీఱఁ**
**బోరాడు నెడ నేచి పొలదిండి బంటులు**
**కొండ ద్రిమ్మరి బంట్ల నండగొనక**

**తే.గీ.** **బల్లెములఁ గుమ్మి మావులఁ బఱపి నఱికి**
**యేనుఁగులఁ దోలి మట్టించి యినుప గుదెల**
**మోఁది నెఱకులు వాలుటమ్ములఁ బగిల్చి**
**బిట్టు నొప్పింప నజ్జగ జెట్టు లలిగి** **168**

అని పల్కి, ధూమ్రాక్షుడు అనువాని, దురమునకు = యుద్ధమునకు, అనిచిన = పంపిన, అతడు, లావు అదర = మిక్కిలి శక్తితో, మూకలు = సైన్యములు, ఏనుగుల్, గుఱ్ఱములు, ఎడపక = విడువక, తోడరాన్ = అనుసరించి రాగా, అక్కజంబుగన్ = ఆశ్చర్యకరముగా, పైడి అరదము ఎక్కి = బంగారు రథమునెక్కి, అడవి త్రిమ్మరులపై = వానరులపైకి, నడచినన్ = దండెత్తగా, ఇరువాగువారును = రెండు పక్షములవారును, తార్కొని = ఢీకొని, వాడిమీఱన్ = మిక్కిలి పరాక్రమ ముతో, పోరాడునెడన్ = పోరుచున్న సమయమున, పొలదిండి బంటులు = రాక్షస భటులు, ఏచి = విజృంభించి, అండ కొనక = వెనుతిరుగక, కొండ త్రిమ్మరి బంట్లన్ = వానర సైన్యమును, బల్లెములన్, కుమ్మి, మావులన్ = గుఱ్ఱములను, పఱపి = పరువెత్తించుచు, నఱికి = ముక్కలుచేసి, ఏనుగులన్, తోలి, మట్టించి = త్రొక్కించి, ఇనుప గుదెల = ఇనుప బండలతో, మోది = బాది, నెఱకులు = మర్మస్థానములను, వాలు అమ్ములన్ = పదునైన బాణములతో, పగిల్చి = పగులగొట్టి, బిట్టు = మిక్కిలి, నొప్పింప = బాధపెట్టగా, ఆ జగజెట్టులు = ఆ ప్రసిద్ధ వీరులు, అలిగి –

**తా :** అని పల్కి ధూమ్రాక్షుడను వానిని యుద్ధమునకు పంపిన అతడు సైన్యములు, ఏనుగులు, గుఱ్ఱములు అనుసరించగా బంగారు రథమునెక్కి వానరులపైకి దండెత్తగా రెండు పక్షములవారును ఢీకొని శౌర్యముతో పోరాడుచున్న సమయమున రాక్షస భటులు విజృంభించి వెనుకడుగేయక వానర సైన్యమును బల్లెములతో కుమ్మి, గుఱ్ఱములను పరుగెత్తించి నఱికి, ఏనుగులను తోలి త్రొక్కించి, ఇనుప బండలతో బాది, మర్మస్థానములు పదునైన బాణములతో పగులగొట్టి మిక్కిలి బాధపెట్టగా ఆ వీరులు కోపించి.

**లయగ్రాహి:**

**గట్టులును జట్టులును జెట్టులును బట్టుకొని నెట్టుకొని రక్కసులఁ జుట్టుకొని ఱొమ్ముల్**
**మట్టియును దోఁకలను గట్టియును మార్మెడలు పెట్టియును దట్టమగు గట్టి పగమీఱన్**
**బొట్టలును జట్టలును బిట్టు వగిలించి పలు చెట్టలను నొంచి జముపట్టునకుఁ బోవన్**
**బెట్టి కడు నేనుఁగుల లొట్టియల దట్టువల తెట్టువలఁ గొట్టుటయుఁ గట్టలుకతోడన్ 169**

గట్టులును = కొండలను, చట్టులను = బండరాళ్ళను, చెట్టులును, పట్టుకొని, నెట్టుకొని = పూనుకొని, రక్కసులన్ = రాక్షసులను, చుట్టుకొని = చుట్టుముట్టి, ఱొమ్ముల్ మట్టియును = ఱొమ్ములను తొక్కియును, తోకలను కట్టియును, మార్మెడలు పెట్టియును = పీకలు విరిచియును, దట్టమగు = తరుగని, గట్టి పగ మీఱన్ = దృఢమైన అధికమైన కోపముతో, పొట్టలను, చట్టలను = చర్మములను, బిట్టు పగిలించి = గట్టిగా పగులగొట్టి, పలు చెట్టలను = పలు చేతులను, నొంచి = బాధించి, జము పట్టునకున్ = యమ సదనమునకు, పోవన్ పెట్టి = పంపి, కడున్ = మిక్కిలిగా, ఏనుగుల, లొట్టియల = ఒంటెల, తట్టువలు = గుఱ్ఱములు, తెట్టువలన్ = సమూహములను, కడు అలుకతోడన్, కొట్టుటయున్ = చితకకొట్టగా –

**తా :** కొండలను, బండరాళ్ళను, చెట్లను పట్టుకొని రాక్షసులను చుట్టుముట్టి ఱొమ్ములను త్రొక్కియు, తోకలను కట్టియు, పీకలు విరిచియు, అధికమైన తరుగని కోపముతో పొట్టలు, చట్టలు, గట్టిగా పగులగొట్టి పలు చేతులను బాధించి యమసదనమునకు పంపి, ఏనుగులు, ఒంటెల గుఱ్ఱముల సమూహములను చితకకొట్టగా –

**కం.** **నలుపుగల తొవరు కన్నుల**
**పొలమేపరి కొమ్మ మెకపు పోటరుల పయిన్**
**జెలఁగి యరదంబు పఱపుచుఁ**
**జలముగ నెదిరించి యంపజడి నొనరించెన్ 170**

నలుపు కల = నల్లని శరీరముకల, తొవరు కన్నుల = ఎఱ్ఱని కన్నుల, పొల మేపరి = రాక్షసుడు (ధూమ్రాక్షుడు), కొమ్మ మెకపు పోటరుల పయిన్ = వానర యోధులపైన, చెలగి = విజృంభించి, అరదంబు పఱపుచు = రథమును పరుగెత్తించుచు, చలముగ = పట్టుదలగ, ఎదిరించి, అంపజడి = బాణవర్షమును, ఒనరించెన్ = కావించెను.

**తా :** నల్లని శరీరము, ఎఱ్ఱని కన్నులుకల ధూమ్రాక్షుడు వానర యోధులపైన విజృంభించి రథమును పరుగెత్తించుచు ఎదిరించి బాణవర్షమును కురిపించెను.

**కం. ఒనరింపఁ బిచ్చలింపక**
**మునుకొని యయ్యడవి మనికి మొనగాం డ్రతనిన్**
**జెనసి పెను గట్లుఁ జెట్లును**
**బెనుపొదవఁగ రువ్వుటయును బెగడక వాఁడున్ 171**

ఒనరింపన్ = కావించగా, పిచ్చలింపక = జడవక, మునుకొని = ముందుకురికి, ఆ అడవి మనికి మొనగాండ్రు = ఆ వానర వీరులు, అతనిన్ = ఆ ధూమ్రాక్షుని, చెనసి = ఎదిరించి, పెను = పెద్దదైన, గట్లున్ = కొండలను, చెట్లును, పెనుపొదవగన్ = బాగుగా ఆక్రమించునట్లుగా, రువ్వుటయును = విసరుటయును, బెగడక = భయపడక, వాడున్ = వాడునూ –

**తా :** కురిపింపగా జడవక ముందుకురికి ఆ వానర వీరులు ఆ ధూమ్రాక్షుని ఎదిరించి పెద్ద కొండలను, చెట్లను బాగుగా ఆక్రమించునట్లుగా విసరగా భయపడక వాడును –

**తే.గీ. తేరు వడిఁ జొన్పి యిఁకఁ గడతేరు దనుచు**
**వాఁడి తూపులు తఱచుగా వారిమీఁద**
**వేయుటయు స్రుక్కి కోల్తల సేయలేక**
**పఱవఁ జూచిన గని గాడ్పుపట్టి గినిసి 172**

తేరు = రథమును, వడిన్ = వేగముగా, చొన్పి = చొప్పింపచేసి, ఇకన్ = ఇంక, కడతేరుదు అనుచు = చావండి అని, వాడి = పదునైన, తూపులు = బాణములు, తఱచుగా = దట్టముగా, వారిమీద వేయుటయు, స్రుక్కి = లొంగి, కోల్తల = యుద్ధము, చేయలేక, పఱవన్ = పారిపోవుటకు, చూచిన = ప్రయత్నింపగా, కని = చూచి, గాడ్పుపట్టి = హనుమ, కినిసి = కోపించి –

**తా :** రథమును వేగముగా చొప్పింపచేసి ఇంక చావండి అని పదునైన బాణములు దట్టముగా వారిమీద వేయగా లొంగి యుద్ధము చేయలేక పారిపోవుటకు ప్రయత్నింపగా చూచి హనుమ కోపించి –

**తే.గీ. ఉఱువు మీఱఁగ మావి మ్రానొకటి పెఱికి**
**రక్కసుని వైవ బెదరక యుక్కుతునియ**
**బలిమిమైనది యొక దొడ్డ పాఱవాతి**
**తూపునఁ గడంగి నడుమనె తునియవైచె 173**

మావి మ్రాను ఒకటి = ఒక మామిడి చెట్టును, పెఱికి = పెకలించి, ఉరువు మీఱగన్ = మిక్కిలి శక్తితో, రక్కసుని = రాక్షసునిపైన, వైవ = వేయగా, బెదరక = వాడు బెదరక, ఉక్కుతునియ బలిమిమైనది = ఉక్కుముక్కవంటి బలముకలిగినది, ఒక దొడ్డ పాఱవాతి తూపునన్ = ఒక పెద్ద నోరుగల బాణమున, కడంగి = పూనుకొని, నడుమనె = మధ్యలోనే, తునియవైచె = ఖండించెను.

**తా :** ఒక మామిడి చెట్టును పెకలించి మిక్కిలి శక్తితో రాక్షసునిపైన వేయగా వాడు బెదరక ఉక్కుముక్కవంటి ఒక పెద్దనోరున్న బాణమున దానిని మధ్యలోనే ఖండించెను.

**ఆ.వె. వైచుటయును జింకవార్వపు జోదు బి**
**డ్డండు వెండియును గడంగి వాని**
**తేరు గడపువాఁడుఁ దేరును గుఱ్ఱముల్**
**చదియ నొక్క పెద్ద చట్టు వయిచె 174**

వైచుటయును = వేయగా, జింకవార్వపుజోదు బిడ్డండు = వాయుపుత్రుడు, వెండియును = తిరిగి, కడంగి = సిద్ధపడి, వాని తేరు కడపువాడున్ = వాడి సారథిని, తేరును, గుఱ్ఱముల్, చదియన్ = చదునగునట్లుగా, ఒక్క పెద్దచట్టు వయిచె = ఒక పెద్ద బండరాయిని విసిరెను.

**తా :** అట్లు ధూమ్రాక్షుడు వేయగా వాయుపుత్రుడు తిరిగి సిద్ధపడి వాడి సారథి, రథము, గుఱ్ఱములు చదునగునట్లుగా ఒక పెద్ద బండరాయిని విసిరెను.

**కం. అటుల నరదంబు వోయిన**
**దిటము సెడక పుడమి కుతికి దిగ్గన న య్యే**
**క్కటి జోదొక పెను బడియం**
**దటుకున నక్కోఁతి మిన్న తల నోయడిచెన్ 175**

అటులన్ = ఆ రీతిగా, అరదంబు పోయిన = రథము లేకపోగా, దిటము చెడక = ధైర్యము వీడక, ఆ ఎక్కటి జోదు = ఆ సాహసవంతుడు, పుడమికి ఉతికి = భూమిమీదకురికి, దిగ్గనన్ = శీఘ్రముగా, ఒక పెను బడియన్ = ఒక పెద్ద బడితెతో, తటుకున = తటాలున, ఆ కోతి మిన్న తల = ఆ ఆంజనేయుని తలను, నోయ అడిచెన్ = నొచ్చునట్లుగా కొట్టెను.

**తా :** ఆ రీతిగా రథము లేకపోగా ధైర్యము వీడక ఆ ధూమ్రాక్షుడు భూమిమీదకురికి వెంటనే ఒక పెద్ద బడితెతో తటాలున ఆ హనుమ తలపైన నొచ్చునట్లుగా కొట్టెను.

**తే.గీ. అందులకుఁ జాల నెదలోన నలుకఁబూని**
**జబ్బలుబ్బంగ నక్కోఁతి బెబ్బమెకము**
**కొండకొనతున్క వేగ నొక్కటి వగిల్చి**
**వాని తలమీఁద జదియంగ వైచి చంపె 176**

అందులకు = ఆ విధంగా కొట్టినందుకు, ఎదలోనన్ = మనసులో, చాలన్ = మిక్కిలి, అలుక పూని = కోపించి, జబ్బలు ఉబ్బంగన్ = భుజములుప్పొంగగా, ఆ కోతి బెబ్బమెకము = ఆ వానర సింహము, కొండకొనతున్క ఒక్కటిన్ = పర్వత శిఖరమును ఒకదానిని, వేగన్ = శీఘ్రముగా, పగిల్చి = పగులగొట్టి, వాని తలమీద = ఆ ధూమ్రాక్షుని తలమీద, చదియంగ = పగులునట్లుగా, వైచి = వేసి, చంపె = చంపెను.

**తా :** అందుకు మనసులో మిక్కిలి కోపించి భుజములుప్పొంగగా ఆ హనుమ పర్వత శిఖరము నొకదానిని శీఘ్రముగా పగులగొట్టి వాని తలమీద పగులునట్లుగా వేసి చంపెను.

**తే.గీ. అట్లు ధూమ్రాక్షుఁ దని నీల్గినట్టి తెఱఁగు**
**సోఁకురాయఁడు విని తద్ద సోలి తెలిసి**

**వడి నకంపనుఁ డనియెడు వానిఁ బిలిచి**
**యచ్చెనంటులఁ దునిమి రమ్మనుచుఁ బలికె** **177**

అట్లు = ఆ విధముగా, ధూమ్రాక్షుడు, అనిన్ = యుద్ధములో, ఈల్గినట్టి = చనిపోయినట్టి, తెఅగు = విషయము, సోకురాయడు = రావణుడు, విని, తద్ద = వెంటనే, సోలి = సొమ్మసిలి, తెలిసి = తేరుకొని, వడి = శీఘ్రముగా, అకంపనుడు అనియెడు, వాని పిలిచి, ఆ చెనంటులన్ = ఆ దుష్టులను, దునిమి రమ్ము అనుచున్ = చంపి రమ్మని, పలికె.

**తా :** ఆ విధముగా ధూమ్రాక్షుడు యుద్ధములో చనిపోయినట్టి విషయము రావణుడు విని వెంటనే సొమ్మసిలి తేరుకొని శీఘ్రముగా అకంపనుని పిలిచి ఆ దుష్టులను చంపి రమ్మని పలికెను.

**కం. పనిచిన నతఁ డెన్నిక మీ**
**ఱిన పౌజులఁగూడుకొని నెఱిన్ దురమునకున్**
**జన నచ్చెట్టున్ ద్రిమ్మరి**
**మొనగాఁడులు ఱాలవాన మొగిఁ గురియుటయున్** **178**

పనిచినన్ = పంపగా, అతడు = ఆ అకంపనుడు, ఎన్నిక మీఱిన = లెక్కకు మీఱిన, పౌజులన్ = సైన్యములను, కూడుకొని = కలుపుకొని, నెఱిన్ = చక్కగా, దురమునకున్ = యుద్ధమునకు, చనన్ = వెళ్ళగా, ఆ చెట్టున్ ద్రిమ్మరి మొనగాడులు = ఆ వానరవీరులు, ఱాలవాన = రాళ్ళవర్షము, మొగిన్ = క్రమముగా, కురియుటయున్ = వర్షింపగా –

**తా :** పంపగా ఆ అకంపనుడు లెక్కకు మీఱిన సైన్యములను కూడుకొని చక్కగా యుద్ధమునకు వెళ్ళగా ఆ వానరవీరులు రాళ్ళవర్షము కురిపింపగా –

**కం. మిక్కుటమగు కొఱకొఱ న**
**య్యుక్కివుఁ డరదంబు పఱపి యురువడిఁ దూపు**
**ల్పెక్కు నిగుడ్చుచు మూఁకల**
**నొక్కటఁ బురికొల్ప వార లుక్కుదలిర్పన్** **179**

మిక్కుటమగు = అధికమైన, కొఱకొఱన్ = కోపముతో, ఆ ఉక్కివుడు = ఆ కపటముకల అకంపనుడు, అరదంబు పఱపి = రథమును నడిపించి, ఉరువడిన్ = మిక్కిలి తొందరగా, తూపులు = బాణములు, పెక్కు నిగుడ్చుచు = అనేకములు వేయుచు, మూకలన్ = సైన్యములను, ఒక్కటన్ = సమైక్యముగా, పురికొల్పన్ = ప్రోత్సహింపగా, వారలు = ఆ సైన్యములు, ఉక్కు తలిర్పన్ = పరాక్రమము రేకెత్తగా–

**తా :** అధికమైన కోపముతో ఆ కపటి అకంపనుడు రథమును నడిపించి తొందరగా బాణములు అనేకములు వేయుచు సైన్యములను ప్రోత్సహించగా ఆ సైన్యములు శౌర్యముతో –

**సీ. తేరులు పఱపి యేద్దెఱఁ దూపు లదరించి**
**వడిగల మావుల వయిచి నఱికి**
**యాముటేనుఁగులఁ బాయక డీకొలిపి మ్రగ్గఁ**
**ద్రొక్కించి యినుప పెన్ దుడ్ల నడిచి**

వంకుల జముద్రాళ్ళ వాల్బల్లెములఁ గ్రుమ్మి
పయికొని పెద్ద యీటియలఁ బొడిచి
గండ్రగొడ్డండ్ల నుక్కఱ జెండు బెండాడి
మొనల కైదువల ఱొమ్ములు వగిల్చి

తే.గీ. మిగుల నొప్పింపఁ గనలి బ్రమ్మెకపు బిరుదు
లొక్కమొగి వాండ్రఁ బోనీక చిక్కఁబట్టి
పొడిచి యడచియుఁ దాఁచియుఁ బుడమివయిచి
మట్టి గ్రుద్దియుఁ గఱచియు మడపి రపుడు 180

తేరులు, పఱపి = పరుగెత్తించి, ఏడ్తెఱన్ = వేగముగా, తూపులు అదరించి = బాణములు ప్రయోగించి, వడిగల మావుల = వడిగల గుఱ్ఱములను, వయిచి = ఉపయోగించి, నఱికి, ఆముటేనుగులన్ = మదపుటేనుగులను, పాయక = విడిచిపెట్టక, డీకొలిపి = గుద్దించి, మ్రగ్గన్ = చనిపోవునట్లుగా, త్రొక్కించి, పెన్ ఇనుప దుడ్లన్ = పెద్ద ఇనుప దుడ్లతో, అడిచి = అణచివేసి, వంకులన్ = బాకులతోను, జము త్రాళ్ళన్ = పొడవైన పెద్ద కత్తులతో, వాలు బల్లెములన్ = వాడియైన బల్లెములతో, క్రుమ్మి = కుమ్మివేసి, పయికొని = ఆక్రమించి, పెద్ద ఈటియలన్ పొడిచి, గండ్రగొడ్డండ్లన్, ఉక్కఱన్ = మిక్కిలి శౌర్యముతో, చెండు బెండాడి = సంహరించి, మొనల కైదువల = పదునైన ఆయుధములతో, ఱొమ్ములు పగిల్చి = గుండెలు బ్రద్దలుకొట్టి, మిగుల = ఎక్కువగా, నొప్పింప = బాధపెట్టగా, కనలి = కోపించి, అపుడు, బ్రమ్మెకపు బిరుదులు = వానరులు, ఒక్కమొగిన్ = కలసికట్టుగా, వాండ్రన్ = ఆ రాక్షసులను, పోనీక = తప్పించుకుపోకుండా, చిక్కన్ పట్టి = బలముకొద్దీ పట్టుకొని, పొడిచి, అడచియున్ = బాదియును, తాచియున్ = తన్నియును, పుడమి వయిచి = నేలమీద పడేసి, మట్టి = త్రొక్కి, గ్రుద్దియున్ = గుద్దియును, కఱచియు = పండ్లతో పీకి, మడపిరి = చంపిరి.

**తా :** రథములు పరుగెత్తించి వేగముగా బాణములు ప్రయోగించి వడిగల గుఱ్ఱముల నుపయోగించి చంపి, ఏనుగులచే గ్రుద్దించి చచ్చేలా త్రొక్కించి, ఇనుప దుడ్లతో అణచివేసి, బాకులతో, పొడవైన కత్తులతో, బల్లెములతో కుమ్మివేసి ఆక్రమించి, ఈటెలతో పొడిచి, గొడ్డళ్ళతో సంహరించి, పదునైన ఆయుధములతో ఱొమ్ములు బ్రద్దలుకొట్టి బాధపెట్టగా కోపించి వానరులు కలసికట్టుగా ఆ రాక్షసులను తప్పించుకుపోకుండా బలముకొద్దీ పట్టుకొని పొడిచి, బాది, తన్ని, నేలమీద పడేసి త్రొక్కి, గుద్ది, కఱచి చంపిరి.

ఆ.వె. గండు మీఱ నయ్యకంపనుఁ డటిముటిఁ
దూపు లేసి కోఁతి దొరలఁ గలఁచి
కనుపుగొట్టుచున్నఁ గనుగొని జగముల
యుసురుకందు లోన నులుకు నిగుడ 181

ఆ అకంపనుడు, గండు మీఱన్ = మిక్కిలి శౌర్యముతో, అటిముటిన్ = సంభ్రమముతో, తూపులు ఏసి = బాణములు వేసి, కోతి దొరలన్, కలచి = కలతపెట్టి, కనుపుగొట్టుచున్నన్ = చంపుచుండగా, కనుగొని = చూచి, జగముల ఉసురు కందు = లోకానికి ప్రాణమునిచ్చు వాయువు కొడుకు హనుమ, లోనన్ = మనసులో, ఉలుకు నిగుడ = కోపము పెచ్చరిల్లగా –

**తా :** ఆ అకంపనుడు శౌర్యముతో సంభ్రమముతో బాణములు వేసి వానరులను కలతపెట్టి చంపుచుండగా చూచి హనుమ కోపము పెచ్చరిల్లగా –

**ఆ.వె.** **మోట మద్ది యొకటి మురిఁ బెకలించి య**
**మ్మేటి సోఁకు జోదు మీఁద వయిచి**
**సదమదంబు సేసి కొదుకక సింగపు**
**రొద యొనర్చె మూఁక లొదవి పొగడ** **182**

మోట = లావైన, మద్ది ఒకటి = ఒక మద్దిచెట్టును, మురిన్ = బలముగా, పెకలించి = పీకి, ఆ మేటి = ఆ వీరుడైన, సోకుజోదుమీద = రాక్షసుని మీద, వయిచి = విసరి, సదమదంబు చేసి = చంపి, కొదుకక = తగ్గక, మూకలు = సైన్యములు, ఒదవి పొగడ = చేరి స్తుతింపగా, సింగపు రొద ఒనర్చె = సింహగర్జనము చేసెను.

**తా :** మోట మద్దిచెట్టును బలముగా పెకలించి ఆ వీరుడైన రాక్షసునిమీద విసరి చంపి తగ్గక సైన్యములు చేరి స్తుతింపగా సింహగర్జనము చేసెను.

**కం.** **అంతట నప్పని యీరే**
**న్గొంతుకల గయాళి వేల్పుగొంగ విని మదిం**
**బంతము నిగుడఁగ నెంతయు**
**వంత మహాకాయు ననికి వడిఁ బుచ్చుటయున్** **183**

అంతట, ఆ పని = ఆ అకంపనుని మరణము, ఈరేన్గొంతుకల గయాళి = పది కంఠములుకల నీచుడు, వేల్పుగొంగ = దేవతల శత్రువగు రావణుడు, విని, మదిన్ = మనసులో, పంతము నిగుడగన్ = పంతము అధికముకాగా, ఎంతయు = మిక్కిలి, వంత = బాధతో, మహాకాయునిన్, వడిన్ = శీఘ్రముగా, అనికి = యుద్ధమునకు, పుచ్చుటయున్ = పంపగా –

**తా :** అంతట ఆ అకంపనుని మరణము రావణుడు విని మనసులో పంతమధికమై మిక్కిలి బాధతో మహాకాయుని శీఘ్రముగా యుద్ధమునకు పంపగా –

**సీ.** **బలుహజ్జ మెకపు దాఁటులు సిల్కు దట్టంపు**
**టాము నీరున నేల యసలు గొనఁగఁ**
**దత్తడి దెక్క గుద్దలి ప్రక్కలింతల**
**నెగసిన దుమ్ము మిన్నెల్లఁ గప్ప**
**మెండు మీఱెడు బండి కండుల యొఱపునఁ**
**జిలువల యెకిమీఁడు దలలు ముడువఁ**

**గాలరి పౌజు వెక్కసపు టార్పుల జంట**
**చవువంచ కదలును జెవుడు వడఁగఁ**

**తే.గీ.** **గఱకు టడిదంపు బెడిదంపు మెఱుఁగు గములు**
**మిగులఁ జూపఱ చూడ్కి మిర్మిట్లు గొలుపఁ**
**బొసఁగఁ బదినూర్ల తత్తడు ల్పూనినట్టి**
**పసిఁడి తేరెక్కి పోరికి బయలు వెడలె** **184**

బలు హజ్జ మెకపు దాటులు = పెద్ద పాదములుకల ఏనుగులయొక్క సమూహములు, చిల్కు = చిలుకుచున్న, దట్టంపు = అధికమైన, ఆము నీరున = మదజలముచే, నేల, అసలు కొనగన్ = బురదకాగా, తత్తడి డెక్క గుద్దలి = గుఱ్ఱపు డెక్కలనే పారలచే, వ్రక్కలింతలన్ = పెల్లగింపబడుటచే, ఎగసిన = పైకిలేచిన, దుమ్ము, మిన్ను ఎల్లన్ = ఆకాశమంతయును, కప్ప = కప్పివేయగా, మెండు మీఱెడు = మిక్కిలి గొప్పవైన, బండి కండుల ఒఱవునన్ = రథ చక్రముల బరువుచే, చిలువల ఎకిమీడు = ఆదిశేషుడు, తలలు ముదువన్ = పడగలను వంచగా, కాలరి పౌజు = కాల్బలము యొక్క, వెక్కసపు = సహింపలేని, ఆర్పుల = అరపులచే, జంటచవువంచ = పది దిక్కులును, చెవుడు పడగన్, కఱకు = పదునైన, అడిదంపు = కత్తియొక్క, బెడిదంపు = అధికమైన, మెఱుగుగములు = కాంతిసమూహములు, మిగుల నధికముగా = ఇంకను అధికముగా, చూపఱ = చూచువారి యొక్క, చూడ్కిన్ = చూపులను, మిఱుమిట్లు కొలుపన్ = కాంతివంతముచేయగా, పొసగన్ = తగునట్లు, పది నూఱ్ఱు = పదివందల, తత్తడుల్ = గుఱ్ఱములు, పూనినట్టి = కట్టినట్టి, పసిడి తేరు = బంగారు రథమును, ఎక్కి, పోరికి = యుద్ధమునకు, బయలువెడలెన్ = బయలుదేరెను.

**తా :** ఏనుగుల మదజలముచే నేల బురదకాగా, గుఱ్ఱపు డెక్కలనే పారలచే పెల్లగింపబడి పైకిలేచిన దుమ్ము ఆకాశమంతను కప్పివేయగా, రథ చక్రముల బరువుచే ఆదిశేషుడు పడగలను వంచగా, కాల్బలము అరుపులచే పది దిక్కులును చెవుడు పడగా, పదునైన కత్తుల కాంతి ఇంకను అధికముగా చూచువారి చూపులను మిఱుమిట్లు కొలుపగా తగునట్లు వేయి గుఱ్ఱములు పూన్చిన బంగారు రధమునెక్కి యుద్ధమునకు బయలుదేరెను.

**ఆ.వె.** **వెడలి కోఁతి తుటుము దొడరిన బిఱబిఱ**
**రెండు మొనలు బెరసి గండు మెఱయఁ**
**బోరుచున్న యెడలఁ బొలదిండి పోటరు**
**లడవి నెలవు బంట్లఁ గడిమి నలమి** **185**

వెడలి = వెళ్ళి, కోతి తుటుము = వానర సమూహము, తొడరినన్ = ఎదిరించగా, బిఱబిఱన్ = తొందరగా, రెండు మొనలు = ఇరు సైన్యములు, బెరసి = కలబడి, గండు మెఱయన్ = శౌర్యము ప్రకటితమవగా, పోరుచున్న ఎడలన్ = పోరాడుచున్న సమయమున, పొలదిండి పోటరులు = రాక్షస వీరులు, అడవి నెలవు బంట్లన్ = వానర వీరులను, కడిమిన్ అలమి = బలముతో చుట్టుముట్టి–

**తా :** వెళ్ళి వానర సమూహము ఎదిరించగా తొందరగా ఇరుసైన్యములు కలబడి శౌర్యముతో పోరాడుచుండగా రాక్షసవీరులు వానరవీరులను బలముతో చుట్టుముట్టి –

**చం. ములుకులఁ జిమ్మియుం గుదెల మోఁదియు నీఁటెలఁ గ్రుమ్మి కత్తులం**
**జెలవియు మావులం బఱపి చెండియు మోములు గాళ్ళు డొక్కలుం**
**దలలును జేతులుం దొడ లెద ల్మెదలున్ నడుముల్ పిఱుందులు**
**న్నలి యొనరించి క్రొమ్మెదడు నంజుడు నల్లయు నుర్ల జేసినన్ 186**

ములుకులన్ = బాణములను, చిమ్మియున్ = వేసియును, గుదెల = బండలతో, మోదియున్, ఈటెలన్, క్రుమ్మి, కత్తులన్, చెలవియు = నరికియు, మావులం = గుఱ్ఱములను, పఱపి = పరుగెత్తించి, చెండియు = ఖండించియు, మోములు, కాళ్ళు, డొక్కలున్, తలలును, చేతులున్, తొడలు, ఎదలు = ఱొమ్ములు, మెదలున్, నడుముల్, పిఱుందులున్, నలి యొనరించి = పిండి పిండి చేసి, క్రొత్తదైన, మెదడున్, నంజుడు = మాంసము, నల్లయున్ = రక్తమును, ఉర్ల చేసినన్ = ప్రవహింప చేయగా–

**తా :** బాణములను వేసి, బండలతో మోది, ఈటెల క్రుమ్మి, కత్తుల నరికి, గుఱ్ఱముల పరుగెత్తించి ఖండించి, మోములు, నడుములు, పిఱుదులు పిండిపిండి చేసి, మెదడు, మాంసము, రక్తము ప్రవహింపచేయగా –

**ఆ.వె. ఇవముసూడు కొలపు టెకిమీనిబంటు ల**
**క్కజపు మగతనంబు గడలుకొనఁగ**
**నార్చి తేని కెలమిఁ గూర్చుచుఁ దూఱి యా**
**సోఁకుమూఁక నెల్లఁ జుట్టుముట్టి 187**

ఇవము సూడు కొలపు = మంచుకు శత్రువు సూర్యుడు వంశపు, ఎకిమీని బంటులు = రాముని బంటులు, అక్కజపు = అద్భుతమైన, మగతనంబు = పరాక్రమము, గడలుకొనగన్ = అతిశయింపగా, ఆర్చి = గట్టిగా అరచి, తేనికి = రామునకు, ఎలమిన్ కూర్చుచు = సంతోషమును కలిగించుచు, దూఱి = శత్రుసైన్యములో దూరి, ఆ సోకు మూకన్ = ఆ రాక్షస సమూహమును, ఎల్లన్ = అంతటిని, చుట్టముట్టి = ఆక్రమించి –

**తా :** రాముని బంటులు అద్భుతమైన శౌర్యముతో గట్టిగా అరచి రామునకు సంతోషమును కలిగించుచు శత్రుసైన్యములో దూరి ఆ రాక్షస సమూహమును అంతటిని ఆక్రమించి –

**ఆ.వె. తేరితోడ తేరుఁ దేజితోఁ దేజి యే**
**నుంగుతోడ నేన్గుఁ ద్రుంగఁ గొట్టి**
**బంట్లఁ బల్తెఱఁగులఁ బరిమార్చివైచినఁ**
**జూచి దొడ్డ యొడలి సోఁకు డలిగి 188**

తేరితోడ తేరున్ = రథముతో రథాన్ని, తేజితో తేజి = గుఱ్ఱముతో గుఱ్ఱాన్ని, ఏనుంగుతోడన్ ఏన్గున్ = ఏనుగుతో ఏనుగును, త్రుంగకొట్టి = చావకొట్టి, బంట్లన్ = సైనికులను, పలు తెఱంగులన్ = పలువిధములుగా, పరిమార్చివైచిన = చంపివేయగా, చూచి, దొడ్డ యొడలి సోకుడు = మహా కాయుడు, అలిగి = కోపించి –

**తా :** రథముతో రథాన్ని, గుఱ్ఱముతో గుఱ్ఱాన్ని, ఏనుగుతో ఏనుగును చావకొట్టి సైనికులను పలువిధములుగా చంపివేయగా చూచి మహాకాయుడు కోపించి–

**చం. అరదము దోలి వింట గొనయంబు దవిల్చి మెఱుంగుటమ్ము ల**
**బ్బరముగఁ బూన్చి యయ్యుఱియబంటుల నిద్దపు మేనులెల్ల వా**
**విరి నలియంగ నేసి గొడివెల్ బెరయించిన సైఁపనోపక**
**బ్బిరుదుమగల్ వడిం బరువు వెట్టఁ దొడంగిన నంగదుం డొగిన్ 189**

అరదమున్ = రథమును, తోలి, వింట = ధనుస్సున, గొనయంబు = నారిని, తవిల్చి = తగిలించి, మెఱుంగు అమ్ములు = వాడిగల బాణములు, అబ్బరముగన్ = అమితంగా, పూన్చి = సంధించి, ఆ ఉఱియబంటుల = ఆ సమర్థులైన యోధులయొక్క, నిద్దపు మేనులు ఎల్ల = కాంతిగల దేహములు, వావిరి = అధికముగా, నలియంగన్ = నలిగిపోవునట్లుగా, ఏసి = కొట్టి, గొడివెల్ = బాధలను, బెరయించినన్ = కలిగింపగా, సైపన్ ఓపక = సహించలేక, ఆ బిరుదుమగల్ = ఆ గొప్ప వీరులు, వడిం = వేగముగా, పరువు పెట్టన్ తొడంగన్ = పరుగు పెట్ట ప్రయత్నించగా, అంగదుండు ఒగిన్ = అంగదుడు పూనుకొని –

**తా :** రథమును తోలి ధనుస్సున నారిని తగిలించి వాడిగల బాణములు అద్భుతముగా సంధించి యోధులయొక్క దేహములన్నియు నలిగిపోవునట్లుగా కొట్టి బాధలను కలిగింపగా సహించలేక ఆ వీరులు వేగముగా పరుగుపెట్ట ప్రయత్నించగా అంగదుడు పూనుకొని –

**కం. నిలుఁడు నిలుఁడనుచు వారలఁ**
**బొలుపుగఁ బెనఁకువకు మగుడఁ బురికొల్పుచు న**
**త్తులువ తొలివేల్పుఁ బైకొని**
**బలితపు ప్రానొకటి మీఁదఁ బడవైచుటయున్ 190**

నిలుడు నిలుడు అనుచు, వారలన్, పొలుపుగన్ = చక్కగా, పెనకువకున్ = యుద్ధమునకు, మగుడన్ = తిరిగి, పురికొల్పుచున్ = ప్రోత్సహించుచు, ఆ తులువ తొలివేల్పున్ = ఆ దుష్టుడైన రాక్షసుని, పైకొని = ఆక్రమించి, బలితపు = పెద్దదైన, ప్రాను ఒకటి = ఒక చెట్టును, మీదన్ = ఆ రాక్షసుని మీద, పడవైచుటయున్ = పడవేయగా –

**తా :** నిలుడు నిలుడు అనుచు వానరులను చక్కగా యుద్ధమునకు తిరిగి ప్రోత్సహించుచు ఆ తులువ రాక్షసుని ఆక్రమించి పెద్దదైన ఒక చెట్టును ఆ రాక్షసుని మీద పడవేయగా –

**కం. నొప్పివడి వాఁడు దద్దయు**
**నుప్పర మద్రువంగ నార్చి యొక వాలుం దూ**
**ప ప్పొలము ద్రిమ్మరి పయిన్**
**గప్పున నడరింప సొమ్మ గొనియుండు నెడన్ 191**

నొప్పివడి = నొప్పి కలిగి, వాడు = ఆ మహాకాయుడు, తద్దయున్ = వెంటనే, ఉప్పరము = ఆకాశము, అద్రువంగన్ = అదురునట్లుగా, ఆర్చి = అరచి, ఒక వాలుం దూపు = ఒక వాడియైన బాణము,

ఆ పొలము త్రిమ్మరి పయిన్ = ఆ అంగదునిపైన, గప్పునన్ = శీఘ్రముగా, అదరింప = ప్రయోగింపగా, సొమ్మకొనియుండునెడన్ = మూర్ఛపొందిన సమయమున.

**తా :** నొప్పి కలిగి ఆ మహాకాయుడు వెంటనే ఆకాశము అదురునట్లుగా అరచి ఒక వాడి బాణము ఆ అంగదునిపై ప్రయోగింపగా మూర్ఛపొందిన సమయమున –

**సీ.** **గుబ్బలి ద్రిమ్మరు ల్గొందఱు సెట్టులుఁ**
**బడుకులుఁ బూని యగ్గడుసు నల్ల**
**ద్రావుడు బిరుదుపైఁ బోవ నాతఁడు శత**
**వలి నైదు ములుకులం బనసు నేఁడు**
**తూపుల వృషభునిఁ దొమ్మిది చిల్కుల**
**నలి గవాక్షుని నూఱు నారసములఁ**
**గ్రోధను నీరైదు కోలలఁ బృథుని మూఁ**
**డమ్ముల గజుఁ బదియాఱు పదుల**

**తే.గీ.** **బలుల కోరులఁ దక్కిన పొలము మనికి**
**బంట్ల నొక్కొక్క చిలుకున బడలు వడఁగఁ**
**చేసి యార్చిన నంత జేజేల ఱేని**
**యనుఁగు మనుమఁడు డెప్పిఱి కినుకతోడ** **192**

గుబ్బలి త్రిమ్మరుల్ = వానరులు, కొందఱు, చెట్టులున్, పడుకులున్ = రాళ్ళను, పూని = తీసుకొని, ఆ గడుసు = ఆ కపటుడైన, నల్ల ద్రావుడు బిరుదుపైన్ = రాక్షస వీరుని మీదకు, పోవన్ = వెళ్లగా, అతడు = ఆ మహాకాయుడు, శతవలిన్ = శతవలిని (వానరవీరుని), ఐదు ములుకులన్, పనసున్, ఏడు తూపుల, వృషభుని, తొమ్మిది చిల్కుల = తొమ్మిది బాణములతోను, నలిన్ = అలాగే, గవాక్షుని, నూఱు నారసములన్ = నూరు బాణములతోను, క్రోధనున్, ఈరైదు కోలలన్ = పది బాణములతోను, పృథుని, మూడు అమ్ముల = మూడు బాణములతోను, గజున్, పదియాఱు పదుల = నూట అరువది, బలుల కోరులన్ = కఠినమైన బాణములతోను, తక్కిన = మిగిలిన, పొలము మనికి బంట్లన్ = వానర వీరులను, ఒక్కొక్కొ చిలుకున = ఒక్కొక్క బాణముతోను, బడలు పడంగన్ = బాధనొందునట్లుగా, చేసి, ఆర్చినన్ = గట్టిగా అరవగా, అంతన్ = అపుడు, జేజేల ఱేని = ఇంద్రుని, అనుగు మనుమడు = అంగదుడు, డెప్పఱి = అత్యధికమైన, కినుకతోడ = కోపముతో–

**తా :** వానరులు చెట్లు, రాళ్ళు తీసుకొని ఆ కపటి రాక్షసవీరునిమీదకు వెళ్ళగా ఆ మహాకాయుడు శతవలిని ఐదు బాణముల, పనసుని ఏడు తూపుల, వృషభుని తొమ్మిది చిల్కుల, గవాక్షుని నూఱు బాణముల, క్రోధనుని పది బాణముల, పృథుని మూడు బాణముల, గజును నూట అరువది బాణముల మిగిలిన వానరవీరులను ఒక్కొక్క బాణముతోను బాధించి గట్టిగా అరవగా అపుడు అంగదుడు మిక్కిలి కోపముతో –

**కం.** **మావిడి చెట్టొక్కటి పెన్**
**లావదరఁగఁ బెటికి యా చెనఁటి యరదమ్ముఁన్**
**మావులు విల్లును దుమురై**
**పోవఁగ వైచిన నతండు వొలివోని బిగిన్** **193**

మావిడి చెట్టు ఒక్కటి, పెన్ లావు అదరగన్ = గొప్ప శక్తి అతిశయింపగా, పెటికి = పీకి, ఆ చెనటి అరదమ్మున్ = ఆ నీచుని రథమును, మావులు = గుఱ్ఱములు, విల్లును, తుమురై పోవగ = ముక్కలై పోవునట్లు, వైచిన = వేయగా, అతండు = ఆ రాక్షసుడు, పొలివోని బిగిన్ = తగ్గని శౌర్యముతో–
**తా :** ఒక మామిడి చెట్టును గొప్ప శక్తితో పెటికి ఆ నీచుని రథము, గుఱ్ఱములు, విల్లు, ముక్కలై పోవునట్లు వేయగా ఆ రాక్షసుడు తగ్గని శౌర్యముతో –

**చం.** **పుడమికి దాఁటి బల్గుదియఁ బుచ్చుక నెవ్వడిఁ దారబోదపైఁ**
**గడగిన నాతఁడున్ గుదియఁ గైకొని పైకొనె నట్టు లిర్వురున్**
**జెడని కడంకతోఁ గొదమ సింగము లట్లు నెదిర్చి బోరలున్**
**దొడలును వీఁపులుం దలలు నొవ్వ గడిందిగ మోఁదులాడుచున్** **194**

పుడమికి = నేలకు, దాటి = దూకి, బల్ గుదియన్ పుచ్చుక = పెద్ద బడితెను తీసుకొని, నెవ్వడిన్ = మిక్కిలి వేగముతో, తారబోదపైన్ = తార కొడుకుపై, కడగినన్ = పరాక్రమించగా, ఆతడున్ = ఆ అంగదుడుకూడా, గుదియ కైకొని = బడితె తీసుకొని, పైకొనెన్ = తిరగబడెను, అట్టులు = ఆ రీతిగా, ఇర్వురున్ = ఇద్దరును, చెడని కడంకతోన్ = తగ్గని పౌరుషముతో, కొదమ సింగములు అట్లు = మత్తెక్కిన సింహములవలె, ఎదిర్చి = ఎదుర్కొని, బోరలున్ = కడుపులును, తొడలును, వీపులున్, తలలు, నొవ్వ = బాధచెందగా, కడిందిగ = బలముగా, మోదులాడుచున్ = బాదుకొనుచు,
**తా :** నేలకు దూకి పెద్ద బడితెను తీసుకొని వేగముగా తార కొడుకుపై పరాక్రమించగా ఆ అంగదుడు కూడా బడితె తీసుకొని తిరగబడెను. ఆ రీతిగా ఇద్దరును తగ్గని పౌరుషముతో కొదమ సింగములవలె కడుపులు, తొడలు, వీపులు, తలలు బాధచెందగా బాదుకొనుచు.

**సీ.** **విడుచుచుం బట్టుచుం బొడుచుచు నడఁచుచుఁ**
**దన్నుచు గ్రుద్దుచు దాఁటుకొనుచు**
**నెగయుచు మొగియుచు నేలఁ ద్రెళ్ళుచుఁ గ్రింద**
**మీఁదై పెనంగుచుఁ బాదుకొనుచు**
**నార్చుచుఁ బేర్వాడి యదలింపుచుఁ గడంక**
**నెఱపుచు బుజముల సఱచుకొనుచు**
**నీసడింపుచుఁ గన్ను లెఱ్ఱఁజేయుచు బుస**
**కొట్టుచుఁ పకపక బిట్టు నగుచు**

**తే.గీ.** **నెత్తురును దుమ్ము మేనుల హత్తుకొనఁగఁ**
**బెక్కు తెఱఁగులఁ బోరుచో నుక్కు మెఱసి**

**వాలి కుఱ్ఱఁడు పిడికిట వాని నెత్తి**
**బీటలుగ గ్రుద్ది పడవైచి బిలుకు మార్చె** **195**

మొగియుచు = సిద్ధమగుచు, నేల త్రెళ్ళుచు = నేలపై పడిపోతూ, కడంక నెఱపుచు = గట్టిగా పూను కొనుచు, వాలి కుఱ్ఱడు = అంగదుడు, బిలుకు మార్చె = చంపెను.

**తా :** అలా ఆ ఇరువురు ఒకరినొకరు విడుచుచు, పట్టుచు, పొడుచుచు, అడచుచు, తన్నుచు, గ్రుద్దుచు, దాటుకొనుచు, దూకుచు, సిద్ధమగుచు, నేలపై పడిపోతూ, క్రింద మీదపడి పొర్లుచు, నిలబడుచు, అరుచుచు, ప్రశంసలతో భయపెట్టుచు, గట్టిగా పూనుకొనుచు, జబ్బలు చఱచుకొనుచు, ఈసడించుకొనుచు, కనులెఱ్ఱచేయుచు, బుసకొట్టుచు, పకపక గట్టిగా నవ్వుతూ, రక్తము, దుమ్ము దేహముల హత్తుకొనగా పలు పద్ధతులలో పోరుచుండగా శౌర్యముతో అంగదుడు తన ముష్టిని పైకెత్తి ఆ రాక్షసుని తల పగులునట్లుగా గ్రుద్ది క్రిందపడవేసి చంపెను.

**కం.** **అత్తఱి నీల్గక చిక్కిన**
**నెత్తురు ద్రావుడుల వలన నెవ్వడిఁ జాల్పున్**
**గుత్తుకల రక్కసుఁడు విని**
**మెత్తం బాటూని తోన మిగల నడలుచున్** **196**

ఆ తఱిన్ = ఆ సమయమున, ఈల్గక = చావక, చిక్కిన = లభించిన, నెత్తురు ద్రావుడుల వలనన్ = రాక్షసులవలన, నెఱ వడి = పూర్తి సమాచారమును, చాల్పున్ కుత్తుకల రక్కసుడు = రావణుడు, విని, మెత్తంబాటు ఊని = చాల ఉదాసీనత వహించి, తోన = వెంటనే, మిగులన్ = ఎక్కువగా, అడలుచున్ = బాధపడుతూ –

**తా :** ఆ సమయమున చావక చిక్కిన రాక్షసులవలన పూర్తి సమాచారము రావణుడు విని చాల కలవరపడి వెంటనే మిక్కిలి బాధపడుతూ –

**కం.** **నేస్తంబు మెఱయ నపుడె ప్ర**
**హస్తుని రావించి బలియుఁడా! యిపు డెదలోఁ**
**గస్తి విడఁ బుడమి కానుపు**
**గేస్తుని గీటడఁచి రమ్మొగిని నీ వనుడున్** **197**

నేస్తంబు మెఱయన్ = మిక్కిలి స్నేహభావముతో, అపుడె = అప్పుడే, ప్రహస్తుని రావించి, బలియుడా = ఓ బలవంతుడా!, ఇపుడు, ఎదలోన్, కస్తి విడన్ = బాధ పోవునట్లుగా, పుడమికానుపు గేస్తుని = సీత ప్రియుని రాముని, కీటు అడచి = సంహరించి, ఒగిని = క్రమముగా, నీవు, రమ్ము, అనుడున్ –

**తా :** మిక్కిలి స్నేహభావముతో అప్పుడే ప్రహస్తుని రావించి ఓ బలవంతుడా! ఇపుడు ఎదలో బాధ పోవునట్లుగా రాముని సంహరించి నీవు రమ్ము అనగా –

**సీ.** **విను చూలి తేజీలఁ బెనయు మావులతోడ**
**మొగిలు చెన్నొరయు నేనుఁగులతోడ**

**గట్లతో నుద్దియై క్రాలు తేరులతోడ**
**బలిమి సూపెడు పోటు బంట్లతోడ**
**ముజ్జగంబు వడంక మ్రోఁగు బేరులతోడఁ**
**కొమరారు బిరుదు టెక్కెములతోడ**
**జొంపంపుఁ దెలి ముత్తియంపు టెల్లులతోడఁ**
**దులకించు చికిలి కైదువులతోడ**
**తే.గీ. మేలి రతనంపుఁ బని పల్లకీలతోడఁ**
**దోరమగు పైఁడి కాళెలతోడఁ దఱుల**
**మొకపు మెకములపై హెచ్చరికల వెడలె**
**నప్పు డిరుదెగ మూఁకలు ననికిఁ దొడరి 198**

వినుచాలి = సూర్యుని, తేజీలన్ = గుఱ్ఱములను, పెనయు = ఎదిరించు, మావులతోడ = గుఱ్ఱములతోను, మొగిలు = మేఘములయొక్క, చెన్ను ఒరయు = అందమును తగ్గించు, ఏనుగుల తోడ, గట్లతోన్ ఉద్దియై = పర్వతములతో సమానమై, క్రాలు = ఒప్పు, తేరులతోడ, బలిమి చూపెడు, పోటు బంట్లతోడ = వీర సైనికులతోను, ముజ్జగంబు = మూడు లోకములు, వడంక, మ్రోగు, బేరులతోడన్ = భేరీ ధ్వనులతోను, కొమరారు = సుందరముగానున్న, బిరుదు టెక్కెములతోడ = శౌర్య ధ్వజములతోను, జొంపంపు = గుత్తులుగానున్న, తెలి ముత్తియంపు ఎల్లులతోడన్ = తెల్లని ముత్యాల గొడుగులతోను, తులకించు = ప్రకాశిం చుచున్న, చికిలి కైదువులతోడ = పదునైన ఆయుధములతోను, మేలి రతనంపున్ పని, పల్లకీలతోడన్, తోరమగు = అచ్చమైన, పైడి కాళెల తోడన్ = బంగారు కాహళీలతోను, తఱుల మొకపు మెకములపై = వలీముఖములైన వానరులపై, హెచ్చరికల = హెచ్చరించుచు, వెడలెన్, అప్పుడు, ఇరుతెగ మూకలు, అనికి, తొడరి = సిద్ధపడి.

**తా :** సూర్యుని గుఱ్ఱములను ఎదిరించు గుఱ్ఱములతో, మేఘము అందమును తగ్గించు ఏనుగులతో, పర్వతములతో సమానమైన రథములతో, వీర సైనికులతో ముల్లోకములు వణకగా మ్రోగు భేరీ ధ్వనులతో, సుందరమైన శౌర్య ధ్వజములతో, తెల్లని ముత్యాల గొడుగులతో, పదునైన ఆయుధములతో, రత్నాల పల్లకీలతో, బంగారు కాహళీలతో వానరులపై పోరునకు హెచ్చరికలతో వెడలెను. అపుడు ఇరుతెగ మూకలు అనికి సిద్ధపడి.

**చం. చిలుకులగట్లఁ గైదువులఁ జెట్టుల ద్రుడ్ల నొడళ్ళు నజ్జుగాఁ**
**దలకొని మొత్తులాడి బెడిదమ్ముగ నెత్తురు లేఱులై చనం**
**జలమునఁ బోరుచో మల హజారపు జోదులు సోఁకుమూఁకలన్**
**బొలుపఱఁ జేసి యా జముని ప్రోలికిఁగా నలి యన్ప నత్తఱిన్ 199**

చిలుకుల = బాణములతో, గట్లన్ = కొండలను, కైదువులన్ = ఆయుధములతో, చెట్టులన్, ద్రుడ్లన్ = దుడ్డుకఱ్ఱలతో, ఒడళ్ళు = శరీరములును, నజ్జుగాన్ = నజ్జునజ్జుగా, తలకొని = పూనుకొని, మొత్తులాడి = ఒకరినొకరు బాదుకొని, బెడిదమ్ముగ = భయంకరముగా, నెత్తురులు = రక్తము,

ఏఱులై, చనన్ = ప్రవహించగా, చలమునన్ = పట్టుదలతో, పోరుచో = పోరుచుండగా, మల హజారపు జోదులు = కొండలు నివాసముగాకల వానరులు, సోకు మూకలన్ = రాక్షస సైన్యమును, పొలుపఱ చేసి = గర్వమునణచివేసి, ఆ జముని ప్రోలికిన్‌గా = ఆ యమ సదనమువైపు, నలి = వరుసగా, అన్ప = పంపగా, అత్తఱిన్ = ఆ సమయమున –

**తా :** బాణములతో కొండలను, కైదువులతో చెట్టులను, దుడ్డుకఱ్ఱలతో దేహములను నజ్జునజ్జుగా ఒకరినొకరు బాదుకొని భయంకరముగా రక్తము ఏఱులై ప్రవహించగా పట్టుదలగా పోరుచుండగా వానరులు రాక్షస సైన్యము గర్వము నణచివేసి ఆ యమ సదనమునకు వరుసగా పంపగా ఆ సమయమున–

**సీ.** **అలుకతోడఁ బ్రహస్తుఁ డమ్ముల జడిఁ గురి**
**యించి పౌఁజుల నెల్ల నొంచుచున్నఁ**
**గనుగొని నీలుఁ డక్కఱకు రక్కసు విల్లు**
**దేరును మావులఁ దేరు నడుపు**
**వానిని నొక తాడిమ్రానునఁ జదిపినఁ**
**బుడమికి దాఁటి యప్పొలసుదిండి**
**తూపుల నా బిరుదు నొసలు నొప్పింపఁ**
**గనలి యక్కోతి సింగంబుఁ బెద్ద**

**తే.గీ.** **పడుకొకటిఁ దెచ్చి నడునెత్తిఁ బగులవైచి**
**వానిఁ బోకార్చి నెమ్మది వఱల బూచి**
**గముల కామెత లొసఁగె నక్కస మెసంగ**
**రావణుఁడు దద్ద యొఱలి బీరమ్ము హెచ్చ** **200**

అలుకతోడన్ = కోపముతో, ప్రహస్తుడు, అమ్ముల జడిన్ = బాణ వర్షమును, కురియించి, పౌజులను ఎల్లన్ = సైన్యమునంతను, ఒంచుచున్న = లొంగదీసుకొనుచుండగా, కనుగొని = చూచి, నీలుడు, ఆ కఱకు రక్కసు = ఆ క్రూర రాక్షసుని, విల్లు, తేరును, మావులన్ = గుఱ్ఱములను, తేరు నడునువానిని, ఒక తాడి మ్రానునన్ = ఒక తాడి చెట్టుతో, చదిపిన = విరుగకొట్టగా, పుడమికి దాటి = నేలమీదకు ఉరికి, ఆ పొలసు తిండి = ఆ రాక్షసుడు, తూపులన్ = బాణములతో, ఆ బిరుదు = ఆ వీరుడైన నీలునియొక్క, నొసలు నొప్పింపన్ = నుదుటిని బాధింపగా, కనలి = కోపించి, ఆ కోతి సింగంబున్ = ఆ వానర శ్రేష్ఠుడు, పెద్ద పడుకు ఒకటి తెచ్చి = ఒక పెద్ద రాయిని తీసుకొనివచ్చి, నడునెత్తి = మాడు ప్రదేశమును, పగులవైచి = బ్రద్దలుకొట్టి, వానిన్ = ఆ ప్రహస్తుని, పోకార్చి = చంపి, నెమ్మది వఱల = స్వస్థచిత్తముతోనుండగా, బూచిగములకు = శవములను తిను పిశాచములకు, ఆమెతలు = విందులు, ఒసగెన్ = ఇచ్చెను, అక్కసము ఎసంగ = మిక్కిలి వ్యధతో, రావణుడు, తద్ద ఒఱలి = మిక్కిలి దుఃఖించి, బీరమ్ము హెచ్చున్ = పౌరుషము అతిశయింపగా –

**తా :** కోపముతో ప్రహస్తుడు బాణవర్షమును కురియించి సైన్యమునంతను లొంగతీసుకొను చుండగా చూచి నీలుడు ఆ క్రూర రాక్షసుని విల్లు, తేరు, గుఱ్ఱములు, సారథిని ఒక తాటిచెట్టుతో విరుగకొట్టగా వాడు నేలమీదకు ఉరికి బాణములతో ఆ నీలునియొక్క నుదుటిని కొట్టగా కోపించి ఆ నీలుడు పెద్దరాయిని తీసుకొని మాడు ప్రదేశమును బ్రద్దలుకొట్టి ఆ ప్రహస్తుని చంపి శవములను తిను పిశాచములకు విందు ఇచ్చెను. రావణుడు మిక్కిలి వ్యథతో దుఃఖించి పౌరుషము అతిశయింపగా –

**కం.** **పడవాళ్ళఁ బిలిచి మూఁకల**
**వడి దురమున కేఁగుదేరవలెనని నేమం**
**బడఱ నెఱిఁగింపుఁడని పది**
**కడ లద్రువఁగ బేరి వ్రేయఁగాఁ జేయుటయున్** **201**

పడవాళ్ళన్ = సైన్యాధిపతులను, పిలిచి, మూకల = సైన్యములను, వడి = వేగముగా, దురమునకు = యుద్ధమునకు, ఏగుదేరవలెనని = బయలుదేరవలెనని, నేమంబు అడఱ = గట్టి ఆజ్ఞను, ఎఱిగింపుడు = తెలియజేయుడు, అని, పది కడలు = పది దిక్కులును, అద్రువగ = అదురునట్లుగా, బేరి వ్రేయగాన్ చేయుటయున్ = రణభేరి వేయించుటయును –

**తా :** సైన్యాధిపతులను పిలిచి సైన్యములను వేగముగా యుద్ధమునకు బయలుదేరమని ఆజ్ఞను తెలియజేయుడని పది దిక్కులును అదరునట్లుగా రణభేరి వేయించుటయును –

**ఆ.వె.** **తేరు లందలములు దేజీలు నేనుఁగు**
**లొ్మదలు గలుగువాని ముఱి యెలర్ప**
**నెక్కి యక్కజముగ రక్కసి నెఱజోదు**
**లెలమిఁ చేరి మ్రోల నిలిచి రంత** **202**

తేరులు = రథములు, అందలములు = పల్లకీలు, తేజీలును = గుఱ్ఱములును, ఏనుగులు, మొదలు గలుగువాని = మొదలగువానిని, ముఱి యెలర్ప = సొగసుగా, ఎక్కి, అక్కజముగ = అద్భుతముగ, రక్కసి నెఱజోదులు = రాక్షస వీరులందరు, ఎలమిన్ చేరి = ప్రీతితో వచ్చి, మ్రోల నిలిచిరి = రావణుని చెంత నిలిచిరి, అంత –

**తా :** రథములు, పల్లకీలు, గుఱ్ఱములు, ఏనుగులు మొదలైన వాని నెక్కి అద్భుతముగ రాక్షస వీరులందరును ప్రీతితో వచ్చి రావణుని చెంత నిలిచిరి. అంత –

**సీ.** **వెలలేని రతనంపుఁ బలు దొడవులు వెట్టి**
**తోరంపు చికిలి కైదువులు గట్టి**
**పొసఁగ నొదలల హొన్నొ్మిడికంబులఁ బూని**
**డాకాల గండపెండెర మమర్చి**
**తళతళ మెఱయు పుత్తడి పుట్టములు దాల్చి**
**కేల ముమ్మొనవాలు గీలుకొలిపి**

**కమ్మ కస్తురి సిరిగందంబు మెయిఁబూసి**
**యెదవేల్పు ప్రాన్పూవుటెత్తులునిచి**

**తే.గీ. పసిడి బెత్తుల వాండ్రిరుదెసలఁ గ్రమ్మి**
**హెచ్చరికల బరాబరు లెనసి సేయ**
**పొడుపు గుబ్బలిపైఁ బ్రొద్దుగడఁక నెక్కు**
**కరణి నవ్వేలుపుల గొంగ యరదమెక్కి** **203**

వెలలేని = విలువైన, రతనంపున్ = రతనాల, పలు తొడవులు = పలు నగలు, పెట్టి = పెట్టుకొని, తోరంపు = మిక్కిలి, చికిలి = పదునైన, కైదువులు = ఆయుధములు, కట్టి = నడుముకు కట్టుకొని, పొసగన్ = ఒప్పునట్లుగా, ఔదలలన్ = పది తలలకు, హొన్ బొమిడికంబులన్ = బంగారు కిరీటములను, పూని = ధరించి, డాకాల = ఎడమకాలికి, గండపెండెరము, అమర్చి = ధరించి, తళతళ మెఱయు, పుత్తడి పుట్టములు = స్వర్ణ వస్త్రములు, తాల్చి = కట్టుకొని, కేల = చేత, మమ్మొనవాలు = త్రిశూలమును, కీలుకొలిపి = పట్టుకొని, కమ్మ కస్తురి = పరిమళ కస్తూరిని, సిరి గందంబు = శ్రీగంధమును, మెయి పూసి = దేహమునకు పూసుకొని, ఎద = గుండెలపై, వేల్పు ప్రాన్పూవు టెత్తులు = పారిజాత పూలగుత్తులు, ఉనిచి = ఉంచుకొని, పసిడి బెత్తులవాండ్రు = బంగరు బెత్తములవారు, ఇరుదెసలన్ = రెండువైపులా, క్రమ్మి = వ్యాపించి, హెచ్చరికల, బరాబరులు, చేయ = చేయగా, పొడుపు గుబ్బలిపైన్ = ఉదయాద్రిపైన, ప్రొద్దు = సూర్యుడు, కడకన్ = పూనికతో, ఎక్కు కరణి = ఎక్కు విధముగా, ఆ వేలుపుల గొంగ = ఆ దేవతల శత్రువు రావణుడు, అరదము ఎక్కి = రథమును ఎక్కి –

**తా :** విలువైన రతనాల నగలు పెట్టి, పదునైన ఆయుధములు నడుము కట్టి, పది తలలకు బంగారు కిరీటములు పెట్టి, ఎడమకాలికి గండపెండెరము అమర్చి, స్వర్ణ వస్త్రములు తాల్చి, చేత త్రిశూలము పట్టుకొని, పరిమళ కస్తూరి, శ్రీగంధమును దేహమునకు పూసుకొని, ఎదపై పారిజాత పూగుత్తుల నుంచుకొని, బంగరు బెత్తములవారు రెండువైపులా హెచ్చరికల బరాబరులు చేయగా ఉదయాద్రిపైన సూర్యుడు ఎక్కు విధముగా రావణుడు రథము ఎక్కి –

**సీ. జగముల దిగులు! నిచ్చలపు మేలిమిగట్టు!**
**కుజ్జు వేల్పుల తలగుండు గండ!**
**ప్రావేల్పు మన్నీఁడ! బమ్మదేవర మెప్పు!**
**నెలతాల్పు కొండఁబూనిన బలియుఁడ!**
**జేజేలదొర పాలి చిచ్చఱ పిడుగ! వె**
**గ్గలపు దురంబుల గెలుపుకాఁడ!**
**కడిఁది వాల్మగఁడ! బంగరు దీవి రాయఁడ!**
**టక్కరి యెకిమీండ్ర ముక్కుఁగొయ్య!**

**తే.గీ.** **గౌనబు టచ్చర ననఁబోండ్ల ననుపుకాఁడ!**
**కడమ యొదవని ఠీవుల నడరు ఱేఁడ!**
**గెలువు గెలువు మటంచు నగ్గించు బిరుదు**
**పద్దెములు బట్లు సదువుచు బలసి చనగ** **204**

జగముల దిగుల = లోకములకు దిగులయినవాడా!, నిచ్చలపు = నిశ్చలమైన, మేలిమి గట్ట = మేరుపర్వతమా!, కుఱ్ఱ వేల్పుల = దేవతల, తలగుండు గండ = బాధాకరమైన వీరుడా!, ప్రావేల్పు = రాక్షసుల, మన్నీడ = ప్రభువా!, బమ్మదేవర = బ్రహ్మదేవుని, మెప్ప = మెప్పు పొందినవాడా!, నెలతాల్పు కొండన్ = కైలాసమును, పూనిన = ఎత్తిన, బలియుడ = బలశాలీ!, జేజేల దొర పాలి = ఇంద్రుని పాలి, చిచ్చఱ పిడుగా!, వెగ్గలపు = అసాధ్యములైన, దురంబుల = యుద్ధములందు, గెలుపుకాడా!, కడిది = సమర్థమైన, వాలు మగడ = యుద్ధవీరుడా!, బంగరుదీవి రాయడ = లంకానగర నాయకా!, టక్కరి ఎకిమీంద్ర = దుర్మార్గులైన రాజులకు, ముక్కు కొయ్య = ఉగ్రదండ మైనవాడా!, గౌనబు = చక్కని, అచ్చర ననబోండ్ల = అప్సరస స్త్రీల, ననుపుకాడ = విటుడైనవాడా!, కడమ యొదవని = లోపము కలుగని, ఠీవులన్ = వైభవములతో, అడరు ఱేడ = ఒప్పునట్టి ప్రభువా! గెలువు గెలువుము అటంచున్, అగ్గించు = స్తుతించు, బిరుదు పద్దెములు = వీర వాక్యములు, బట్లు = వందులు, చదువుచు, బలసి చనగ = పరివేష్టించి నడువగా –

**తా :** లోకములకు దిగులయినవాడా! నిశ్చల మేరుపర్వతమా! దేవతల తలగొండు వీరా! రాక్షస ప్రభూ! బ్రహ్మ మెప్పు పొందినవాడా! కైలాసమెత్తిన బలశాలీ! ఇంద్రుని పాలి చిచ్చరపిడుగా! అసాధ్యములైన యుద్ధములందు గెలుపుకాడా! సమర్థమైన యుద్ధవీరుడా! లంకానగర నాయకా! దుర్మార్గులైన రాజులకు ఉగ్రదండమైనవాడా! అప్సరస్త్రీలకు విటుడైనవాడా! లోపములేని వైభవముతో ఒప్పునట్టి ప్రభువా! గెలువుమని స్తుతించు వీర వాక్యములు వందులు చదువుచు పరివేష్టించి నడువగా –

**సీ.** **భేరులు డోళ్ళు తప్పెటలు కాళెలు పిల్లఁ**
**గ్రోవులు తుడుములు ఠీవి మెఱయఁ**
**బడగలు ముత్యాల గొడుగులు జల్లులు**
**నాలవట్టములు సొంపారి మెఱయఁ**
**బసిఁడి పక్కెరల బాబాలు మానికపుఁ జౌ**
**డోలీల యేనుంగు లోలిఁ జెలఁగ**
**విచ్చుఁ గైదువులు బల్విండ్లు నీఁటియలూని**
**యార్చుచుఁ బోటు బంట్లగ్గలింపఁ**

**తే.గీ.** **బుడమి పరియలువాఱ నల్గడలు నద్రువఁ**
**బెను దుమారంబు మిన్నెల్ల బిట్టు గప్ప**

**జగములడగింపఁ గడగుడు జముని మాడ్కిఁ**
**బొంపు రాణింప వడి నాలమునకుఁ దరలె** **205**

బేరులు = భేరీలు, డోళ్ళు, తప్పెటలు, కాళెలు, పిల్లనగ్రోవులు, తుడుములు = ముడ్డువులు, దీవి మెఱయన్ = దర్జాగా, పడగలు = ధ్వజములును, ముత్యాల గొడుగులు, జల్లులు = కుచ్చులు, ఆలవట్టములు = వింజామరలు, సొంపారి మెఱయన్ = మిక్కిలి సొగసుగా ప్రకాశించు, పసిడి పక్కెరల = బంగారు గవుసెనల, బాబాలు = గుఱ్ఱములు, మానికపున్ = మాణిక్య, చౌడోలీల = అంబారీలతో, ఏనుంగులు, ఓలిన్ = వరుసగా, చెలగ = నడువగా, విచ్చున్ కైదువులు = సిద్ధము గానున్న ఆయుధములు, బలు విండ్లున్ = పెద్ద ధనుస్సులు, ఈటియలు ఊని = ఈటెలు ధరించి, అర్చుచున్ = అరచుచు, పోటు బంట్లు = వీర సైనికులు, అగ్గలింపన్ = అతిశయింపగా, పుడమి = భూమి, పరియలువాఱ = బీటలువారగా, నల్గడలు = నాలుగు దిక్కులు, అద్రువ = అదరగా, పెను దుమారంబు = పెద్ద గాలిదుమ్ము, మిన్ను ఎల్ల = ఆకాశమంతయు, బిట్టు = ఎక్కువగా, కప్ప = కప్పివేయగా, జగములు అడగింపన్ = లోకముల నశింపచేయ, కడగుడు = ప్రయత్నించు, జముని మాడ్కి = యమునివలె, పొంపు = ఆధిక్యము, రాణింప = ప్రకాశింపగా, వడి = వేగముగా, ఆలమునకు = యుద్ధమునకు, తరలె = వెళ్ళెను.

**తా :** భేరీలు, డోళ్ళు, తప్పెటలు, కాళెలు, పిల్లనగ్రోవులు, ముడ్డువులు, దర్జాగా ధ్వజములను, ముత్యాల గొడుగులు, కుచ్చులు, వింజామరలు, మిక్కిలి సొగసుగా ప్రకాశించు బంగారు గవుసెనల గుఱ్ఱములు, మాణిక్య అంబారీలతో ఏనుగులు వరుసగా నడువగా, సిద్ధముగా నున్న ఆయుధములు, పెద్ద ధనుస్సులు, ఈటెలు ధరించి అరచుచు వీర సైనికులు అతిశయింపగా భూమి బీటలు వారగా నాలుగు దిక్కులు అదరగా పెను దుమారం ఆకాశమంతా కప్పివేయగా లోకముల నశింపచేయడానికి యమునిలా ఆధిక్యము ప్రకాశిపంగా వేగముగా యుద్ధమునకు తరలెను.

**తే.గీ.** **తరలి రాచూలి దండుపైఁ దారసిల్లి**
**మూఁక నొండెడ విడియించి, వీఁకఁ దానె**
**యని యొనర్పఁగఁ దొడఁగిన నడవి గీము**
**బంట్లు ప్రాఁకులుఁ బడుకులుఁ బట్టుకొనుచు** **206**

తరలి = బయలుదేరి, రాచూలి దండుపైన్ = రాముని సైన్యముపైకి, తారసిల్లి = సమీపించి, మూకన్ = సైన్యమును, ఒండెడన్ = ఒక ప్రదేశమున, విడియించి = ఉండునట్లుచేసి, వీకన్ = సాహసముతో, తానె = తానొక్కడే, అని ఒనర్పగన్ = యుద్ధము చేయుటకు, తొడగిన = పూనుకొనిన, అడవి గీము బంట్లు = వానర వీరులు, ప్రాకులు = చెట్లు, పడుకులున్ = రాళ్ళను, పట్టుకొనుచు,

**తా :** బయలుదేరి రాముని సైన్యమును చేరి సైన్యమును ఒకచోట విడియించి సాహసముతో తానొక్కడే యుద్ధము చేయ పూనుకొనగా వానరవీరులు చెట్లు, రాళ్ళను పట్టుకొని.

**కం.** **దురమునకు మొనయుటయు నతఁ**
**డరుదుగ వాల్మొలుకు లేసి యందఱఁ గ్రొన్నె**

**త్తురు జొత్తిల్లం జేయుచు**
**నరదము వడిఁ జొన్పి తటిమి యార్చుచ రాగన్ 207**

దురమునకున్ = యుద్ధమునకు, మొనయుటయున్ = సిద్ధపడుటయును, అతడు = ఆ రావణుడు, అరుదుగ = ఆశ్చర్యముగ, వాలు ములుకులు ఏసి = వాడి బాణములను వేసి, అందఱ = ఆ వానరులందరి, క్రొన్నెత్తురు = వేడి రక్తముతో, జొత్తిల్లన్ చేయుచు = ఎఱుపును చేయుచు, అరదము = రథమును, వడిన్ = వేగముగా, చొన్పి = చొప్పించి, తటిమి = వానరులను తటిమి, అర్చుచ = అట్టహాసము చేయుచు, రాగన్ = రాగా –

**తా :** యుద్ధానికి సిద్ధపడగా రావణుడు వాడి బాణములు వేసి ఆ వానరుల వేడి రక్తంతో ఎఱుపు చేయుచు రథం వేగముగా చొప్పించి వానరులను తటిమి అరచుచు రాగా –

**చం. కనుగొని ప్రొద్దుకుఱ్ఱఁ డలుకన్ మల యొక్కటి రెండు చేతులం**
**గొని కడలన్నియుం బగులఁ గూఁకలు పెట్టుచు వానిమీఁద గు**
**ప్పిన నది నుగ్గుగాఁ బసిఁడి పింజలమర్చిన తూపు తిట్టలం**
**దునిమి పిసాళి రక్కసుఁడు తోడనె వేల్పులు పిచ్చలించఁగన్ 208**

కనుగొని = చూచి, ప్రొద్దు కుఱ్ఱడు = సుగ్రీవుడు, అలుకన్ = కోపముతో, మల ఒక్కటి = ఒక కొండను, రెండు చేతులన్ = రెండు చేతులతో, కొని = తీసుకొని, కడలు అన్నియున్ = దిక్కులన్నియును, పగుల = బ్రద్దలుకాగా, కూకలు పెట్టుచు = కేకలు వేయుచు, వానిమీద = ఆ రావణుని మీద, గుప్పిన = విసరిన, అది = ఆ కొండను, నుగ్గుగాన్ = పిండిగా, పసిడి పింజలు అమర్చిన = బంగారు పుంఖములమర్చిన, తూపు తిట్టలన్ = బాణ సమూహముచే, దునిమి = ఖండించి, పిసాళి రక్కసుడు = తేజోవంతుడగు రావణుడు, తోడనె = వెంటనే, వేల్పులు = దేవతలు, పిచ్చలించగన్ = భయపడునట్లుగా –

**తా :** చూచి సుగ్రీవుడు కోపముతో ఒక కొండను రెండు చేతులతో తీసుకొని దిక్కులన్నియు బ్రద్దలుకాగా కేకలు వేయుచు రావణునిమీద విసరిన ఆ కొండను పిండిగా బాణ సమూహముచే ఖండించి వెంటనే ఆ రావణుడు దేవతలు భయపడునట్లుగా –

**ఆ.వె. ట్రొమ్ము గాఁడిపాఱ నమ్ముల నేసిన**
**సొమ్మవోయి మేటి కొమ్మ మెకపు**
**బిరుదు రాగిజుట్టు పిట్టతాలుపు వాలుఁ**
**గోలఁ గొంచ గట్టువోలె వ్రాలె 209**

ట్రొమ్ము గాడిపాఱన్ = ట్రొమ్ము పగులునట్లుగా, అమ్ములన్ ఏసిన = బాణములను వేయగా, సొమ్మవోయి = సొమ్మసిల్లి, మేటి కొమ్మ మెకపు బిరుదు = గొప్ప వానర వీరుడైన సుగ్రీవుడు, రాగిజుట్టు పిట్ట తాలుపు = కోడిపుంచు ధ్వజముగాకల కుమారస్వామియొక్క, వాలు కోలన్ = వాడి బాణముచే, కొంచగట్టు = క్రౌంచపర్వతమువలె, వ్రాలె = పడిపోయెను.

**తా :** బొమ్మ పగులునట్లుగా బాణములను వేయగా సొమ్మసిల్లి సుగ్రీవుడు కుమారస్వామి యొక్క వాడి బాణముచే క్రౌంచపర్వతమువలె పడిపోయెను.

**సీ.** **వ్రాలినఁ జూచి గవయుఁడు గవాక్షుడు**
**జ్యోతిర్ముఖుఁడు సుదంష్ట్రుడు నలుండు**
**గజుఁడు వృషభుండు గనలుచు నొక్కటఁ**
**బెను మెట్టు లతనిపై మొనసివైవ**
**నడుమనే వాఁడవి వెడఁదవాతి లకోరి**
**గుంపునఁ దునిమి యేడ్గురి నొకొక్క**
**చిలుకునవడి సొమ్మసిలఁ జేసి తోడనే**
**మూఁకల నెల్ల జీకాకు పడఁగఁ**

**తే.గీ.** **దూఱనేసిన గాసిలి పారి వార**
**లురవడిని వ్రాలి రాముని మఱువు సేరి**
**బొబ్బరించిన నళుకెల్లఁ బోవఁ బలికి**
**యపుడు రాచూలి సరగ విల్లందుకొనుడు** **210**

వ్రాలినన్ = పడిపోగా, చూచి, కనలుచున్ = కోపించుచూ, ఒక్కటన్ = అందరూ ఒక్కటై, పెను మెట్టులు = పెద్ద కొండలను, అతనిపై మొనసి వైవ = ఆ రావణునిమీద పూనుకొని వేయగా, వాడు = ఆ రావణుడు, నడుమనే = మధ్యలోనే, అవి = ఆ కొండలను, వెడద వాతి లకోరి గుంపునన్ = పెద్ద అంచులుకల బాణసమూహముచే, తునిమి = ఖండించి, ఏడ్గురిన్ = ఆ పై ఏడుగురిని, ఒకొక్క చిలుకున = ఒక్కొక్క బాణముతో, వడి = శీఘ్రముగా, సొమ్మసిల చేసి, తోడనే = వెంటనే, మూకలన్ ఎల్ల = సైన్యముల నన్నిటిని, చీకాకు పడగన్ = కలతపడునట్లుగా, దూఱనేసినన్ = గుచ్చుకొనునట్లు వేయగా, గాసిలి = బాధపడి, పారి = ఎగిరి, వారలు = ఆ వానరులు, ఉరవడిని = వేగముగా, వ్రాలి = దిగి, రాముని, మఱువు చేరి = చాటున చేరి, బొబ్బరించినన్ = రోదనసేయగా, అళకు ఎల్లన్ = భయమునంతను, పోవన్ పలికి = పోవునట్లుగా పలికి, అపుడు, రాచూలి, సరగ = శ్రీఘ్రముగా, విల్లు అందుకొనుడు = ధనుస్సు అందుకొనగా –

**తా :** పడిపోగా చూచి కోపించుచూ అందరూ ఒక్కటై పెద్ద కొండలను ఆ రావణునిమీద వేయగా ఆ రావణుడు మధ్యలోనే ఆ కొండలను బాణసమూహముచే ఖండించి ఆ పై ఏడుగురిని ఒక్కొక్క బాణముతో శీఘ్రముగా సొమ్మసిల చేసి వెంటనే సైన్యములను చీకాకు పడగా గుచ్చుకొనునట్లు బాణములు వేయగా బాధపడి ఎగిరి ఆ వానరులు వేగముగా రాముని చాటున చేరి రోదన చేయగా రాముడు వారి భయము పోవునట్లుగ పలికి విల్లు నందుకొనగా –

**కం.** **అన్నకు మున్నుగ బలితపు**
**మున్నరకన్ లక్ష్మణుండు మొగిఁ దొలి జేజే**

**మిన్నపయి నడరుచోఁ గని**
**విన్ను మనుమఁ డతని ద్రోచి వెసఁ దా నెదిరెన్ 211**

అన్నకున్ = రామునకు, మున్నుగ = ముందుగా, బలితపు = అధికమైన, మున్నరకన్ = ధైర్యముతో, లక్ష్మణుండు, మొగిన్ = పూని, తొలి జేజే మిన్నపయిన్ = రావణునిపైకి, అడరుచోన్ = పూనుకొనగా, కని = చూచి, విన్ను మనుమదు = హనుమ, అతని ద్రోచి = అతను కాదని, వెసన్ = శీఘ్రముగా, తాను ఎదిరెన్ = తాను ఎదుర్కొనెను.

**తా :** రామునికంటె ముందుగా ధైర్యముతో లక్ష్మణుడు పూని రావణునిపైకి పూనుకొనగా చూచి సుగ్రీవుడు అతన్ని కాదని శీఘ్రముగా తాను ఎదుర్కొనెను.

**ఆ.వె. ఎదిరి తేరిమీఁద కెగసి నరచేత**
**వాఁడు వ్రేయ నొచ్చి వాఁడి సెడక**
**మరలి వాని నడఁచి మంటికి దాఁటిన**
**వేల్పుగొంగ సోలె వేల్పు లలర 212**

ఎదిరి తేరిమీదకు = శత్రువు రథముమీదకు, ఎగసి = ఎగిరి, వాడు = ఆ రావణుడు, అరచేత, వ్రేయ = కొట్టగా, నొచ్చి = బాధపడి, వాడి సెడక = పౌరుషము తగ్గక, మరలి = తిరిగి, వానిన్ అడచి = ఆ రావణుని కొట్టి, మంటికి = నేలమీదకు, దాటిన = దుమికిన, వేల్పులు అలర = దేవతలు సంతోషించునట్లుగ, వేల్పుగొంగ = రావణుడు, సోలె = సొమ్మసిలెను.

**తా :** రథముమీదకు ఎగిరి ఆ రావణుడు అరచేత కొట్టగా బాధపడి పౌరుషము తగ్గక తిరిగి ఆ రావణుని కొట్టి నేలమీదకు దిగిన, దేవతలు సంబరపడగా రావణుడు సొమ్మసిలెను.

**తే.గీ. సోలి మెల్లనఁ దెలిసి యా సోఁకుఱేఁడు**
**కోఁతి రాయనిఁ బిడికిట గ్రుద్దుటయును**
**బొలసు మేపరు లార్వ నపోటుకాఁడు**
**కడఁకఁ దిగద్రోచి చయ్యనఁ బుడమి వ్రాలె 213**

సోలి = సొమ్మసిలి, మెల్లన, తెలిసి, ఆ సోకుఱేడు = ఆ రావణుడు, కోతి రాయనిన్ = హనుమంతుని, పిడికిట = పిడికిలితో, గ్రుద్దుటయును, పొలసు మేపరులు = రాక్షసులు, ఆర్వ, ఆ పోటుకాడు = ఆ వీరుడగు హనుమ, కడకన్ దిగద్రోచి = ధైర్యము కోల్పోయి, చయ్యనన్ = శీఘ్రముగా, పుడమి వ్రాలె = నేలపై పడెను.

**తా :** సొమ్మసిలి మెల్లగా తెలిసి ఆ రావణుడు హనుమను పిడికిలితో గ్రుద్దుటయును దానితో రాక్షసులు అరవగా ఆ వీరుడగు హనుమ ధైర్యము కోల్పోయి నేలపై పడెను.

**తే.గీ. అంత నీలునిపైఁ బదియల్లి జోదు**
**తేరు వోనిచ్చి బలువాలు నారసములు**
**నినుప నవి యొడ్డుకొని వాని నెత్తి తొడవు**
**మానికము లూడ నవ్వాడి మగఁడు దాఁచె 214**

అంత = ఆ తరువాత, నీలునిపైన్ = నీలునిమీద, పదియట్లజోదు = పదికుత్తుకలుకల రావణుడు, తేరు పోనిచ్చి = రథమును పోనిచ్చి, బలు = కఠినములైన, వాలు = పదునైన, నారసములు = బాణములు, నినుపన్ = నిండింపగా, అవి ఒడ్డుకొని = వాటిని తట్టుకొని, ఆ వాడి మగడు = ఆ మహావీరుడైన నీలుడు, వాని నెత్తి తొడవు మానికములు = రావణుని కిరీటములందలి మాణిక్యములు, ఊడన్ = ఊడునట్లుగా, తాచెన్ = తన్నెను.

**తా :** ఆ పిమ్మట నీలునిపై రావణుడు రథమును పోనిచ్చి కఠినములైన బాణములను విసరగా వాటిని తట్టుకొని ఆ నీలుడు రావణుని కిరీటమునందలి మాణిక్యములు ఊడునట్లుగా తన్నెను.

**కం.** **తాఁచిన మో మెఱవారఁగఁ**
**జూచుచు నింగలపు ములికి సోకుఁడు మన్నీఁ**
**డా చెట్టుం ద్రిమ్మరిపై**
**వైచిన నొడలెల్లఁ గమరిపడి సొమ్మసిలెన్** **215**

తాచిన = తన్నగా, మో మెఱవారగన్ = ముఖము ఎఱ్ఱపడగా, చూచుచున్ = ఆ నీలుని చూచుచు, ఇంగలపు ములికి = ఆగ్నేయాస్త్రమును, సోకుడు మన్నీడు = రాక్షస ప్రభువు రావణుడు, ఆ చెట్టుం ద్రిమ్మరిపై = ఆ వానరునిపై, వైచినన్ = వేయగా, ఒడలు ఎల్లన్ = దేహమంతయు, కమరిపడి = కమిలిపోయి, సొమ్మసిలెన్.

**తా :** తన్నగా ముఖము ఎఱ్ఱపడగా ఆ నీలుని చూచుచు రావణుడు ఆగ్నేయాస్త్రమును ఆ వానరునిపై వేయగా దేహమంతయు కమిలిపోయి సొమ్మసిలెను.

**తే.గీ.** **అట్టు లాతఁడు పడిన బిట్టార్చుకొనుచుఁ**
**దేరు లక్ష్మణుపైఁ దోలి దీవిరాయఁ**
**డేడు బెడిదంపు వాల్తూపు లేయ నతఁడు**
**మెఱుఁగుటమ్ముల నవి దోన నఱికివైచె** **216**

అట్టులు, అతడు, పడిన, బిట్టు ఆర్చుకొనుచున్ = గట్టిగా అరచుకొనుచు, దీవిరాయడు = రావణుడు, తేరు, లక్ష్మణుపైన్, తోలి, ఏడు బెడిదంపు = ఏడు కఠినమైన, వాల్తూపులు = వాడియైన బాణములు, ఏయ = వేయగా, అతడు, మెఱుగు అమ్ములన్ = మెఱుపుతీగలవంటి బాణములతో, అవి = ఆ ఏడు బాణములను, తోన = వెంటనే, నఱికివైచె = ఖండించెను

**తా :** అలా నీలుడు పడిపోగా గట్టిగా అరచుకొనుచు రావణుడు తేరు లక్ష్మణునిపైకి తోలి ఏడు కఠినమైన బాణములు వేయగా లక్ష్మణుడు మెఱుపుతీగలవంటి బాణములతో ఆ ఏడు బాణములను వెంటనే ఖండించెను.

**కం.** **తఱచగుచుఁ బింజపింజయుఁ**
**గఱచుక మిడుగురులు సెదరఁ గడు మిడుతల చా**
**ల్తెఱఁగున నడరెడు చిలుకులు**
**గిరిగొనఁ బఱపుటయు వాఁడు గిజగిజపడుచున్** **217**

తఱచగుచున్ = దట్టమగుచు, పింజపింజయున్ = పుంఖానుపుంఖముగా, కఱచుక = ఒక బాణమును ఒకటి కరచుకొన్నట్లుగా, మిడుగురులు = నిప్పురవ్వలు, చెదరన్ = చెదరగా, కడు = అధికమైన మిడుతల చాలు తెఱగున = మిడుతల దండువలె, అడరెడు = ఒప్పునట్టి, చిలుకులు = బాణములు, గిరిగొనన్ = వ్యాపింపగా, పఱపుటయు = ప్రయోగించుటయును, వాడు = ఆ రావణుడు, గిజగిజపడుచున్ = గింజుకొనుచూ,

**తా :** అపుడు లక్ష్మణుడు వెంటవెంటనే పుంఖానుపుంఖముగా నిప్పురవ్వలు చెదరగా, మిడుతల దండులా బాణములు వేయగా ఆ రావణుడు గింజుకొనుచూ

**తే.గీ.** **మున్ను నెత్తమ్మిచూలి చేగొన్నయట్టి**
**సత్తియను తూపు నిగుడింప సరగ ఱొమ్ము**
**దూఱుటయు సొమ్మసిలి రాముతోడఁ బుట్టు**
**వొఱగెఁ బుడమికిఁ గోఁతులు వెఱచి పఱప** **218**

మున్ను, నెత్తమ్మి చూలి = బ్రహ్మదేవుని నుండి, చేగొన్నయట్టి = స్వీకరించినట్టి, సత్తియను తూపు = శక్తి అనే బాణమును, నిగుడింప = ప్రయోగింపగా, సరగ = వెంటనే, ఱొమ్ము దూఱుటయు = అది గుండెలలో గుచ్చుకొనుటయును, సొమ్మసిలి, కోతులు, వెఱచి = భయపడి, పఱవ = పారిపోగా, రాముతోడన్ పుట్టు = లక్ష్మణుడు, పుడమికి, ఒఱగె = పడిపోయెను.

**తా :** పూర్వము బ్రహ్మదేవునినుండి పొందిన శక్తి బాణమును ప్రయోగింపగా అది గుండెలలో గ్రుచ్చుకొని లక్ష్మణుడు సొమ్మసిలి నేల పడ వానరులు భయపడి పారిపోయిరి.

**కం.** **అత్తెఱఁగున సైదోడని**
**నత్తమిలినఁ జూచి రాముఁ డలుక నిగుడఁగా**
**నత్తొలివేలుపుఁ గలువల**
**మిత్తురు డాకొని కడంక మీఱఁగఁ బలికెన్** **219**

ఆ తెఱగున = ఆ విధముగా, సైదోడు = తమ్ముడు, అనిన్ = యుద్ధములో, అత్తమిల్లిన = పడిపోగా, చూచి, రాముడు అలుక, నిగుడగా = హెచ్చుగా, ఆ తొలివేలుపున్ కలువల మిత్తురు = ఆ రాక్షస వంశ చంద్రుని, డాకొని = సమీపించి, కడంక మీఱగన్ = మిక్కిలి ధైర్యముతో, పలికెన్.

**తా :** ఆ విధముగా తమ్ముడు యుద్ధములో పడిపోగా చూచి రాముడు కోపముతో రావణుని సమీపించి మిక్కిలి ధైర్యముగా పలికెను.

**ఆ.వె.** **ఓరి ఠవళికాడ! యోడక మిగుల నా**
**కెగ్గు సేసితింక నెందుఁ దూఱఁ**
**గలవు? నలువ వచ్చి కావఁబూనిన నిన్ను**
**జుడిఁగి పోవనీక మడఁపువాఁడ** **220**

ఓరి ఠవళికాడ = ఓరీ మోసగాడా!, ఓడక = వెనుదీయక, మిగుల = గొప్పగా, నాకు, ఎగ్గు చేసితి, ఇంక, ఎందున్, దూఱగలవు, నలువ వచ్చి, కావన్ పూనిన = రక్షించదలచిననూ, నిన్ను, జుడిగి = వెనుతిఱిగి, పోవనీక, మడపువాడ = సంహరించువాడను.

**తా :** ఓరి మోసగాడా! ఓడక గొప్పగా నాకు అపకారం చేసేవు. ఇంక ఇప్పుడు ఎక్కడికి పోతావు? బ్రహ్మదేవుడే వచ్చి కాపాడదలచినా వెనుతిఱిగి పోనీక సంహరిస్తాను.

**తే.గీ.** **అనినఁ దద్దయు నులికి యీరయిదు తలల**
**రక్కసుఁడు రాగవుని కప్డు జక్కియైన**
**గాలి కొమరునిపైఁ బెక్కు వాలు తూపు**
**లేసె – నేసినఁ గినిసి యావ్వాసిఱేఁడు** **221**

అనినన్ = అని పలుకగా, తద్దయున్ = మిక్కిలి, ఉలికి = బెదరి, ఈరయిదు తలల రక్కసుడు = రావణుడు, అప్డు = అప్పుడు, రాగవుని = రాముని, జక్కియైన = వాహనమైన, గాలి కొమరునిపైన్ = హనుమపై, బెక్కు వాలు తూపులు = పలు వాడి బాణములు, ఏసెన్ = వేసెను, ఏసినన్ = వేయగా, ఆ వాసి ఱేడు = ఆ ప్రసిద్ధుడగు రాముడు, కినిసి = కోపించి,

**తా :** అని పలుకగా మిక్కిలి బెదరి రావణుడు అప్పుడు రాముని వాహనమైన హనుమపై పలు వాడి బాణములు వేయగా ఆ రాముడు కోపించి.

**సీ.** **బలితంపు క్రొవ్వాఁడి ములుకులు సింగాణి**
**గూరిచి యరి సెవికొనకు లాగి**
**పొలదిండి ఱేని మావులు దేరుఁ గైదువు**
**లరదంబు సాగింపు నతఁడు సిడము**
**గత్తలంబును బ్రగ్గగా నేసి వెండియుఁ**
**బిడుగుల కెనయైన వెడఁద తూపుఁ**
**గొని ఱొమ్ము పగిలించి కొంకఁజేసి కడంక**
**నర చందమామ వాలమ్ము వఱపి**

**తే.గీ.** **బొమిడికంబులు పదియును బుడమిఁ గూల్చి**
**బన్న మొందింప బెగడి యప్పొలసుండు**
**వేఱొకని తేరిపైఁ బడి పాఱి తనదు**
**దీవి సొచ్చెను రాకాసి తెగలు నొగల** **222**

అతడు = ఆ రామచంద్రుడు, బలితంపు = కఠినమైన, క్రొవ్వాడి = మంచి పదునైన, ములుకులు = బాణములు, సింగాణి గూరిచి = వింటికి తగిలించి, అరి = వింటినారిని, చెవికొనకు లాగి, పొలదిండి ఱేని = రావణుని, మావులు = గుఱ్ఱములు, తేరున్, కైదువులు = ఆయుధములు, అరదంబు సాగింపున్ అతడు = సారథి, సిడము = ధ్వజము, కత్తలంబును = కవచమును, బ్రగ్గగాన్ = నశిపంగా, ఏసి = వేసి, వెండియు = ఇంకను, పిడుగులకు ఎనయైన = పిడుగులకు సాటియైన, వెడద తూపు = పెద్ద బాణమును, కొని = తీసుకొని, ఱొమ్ము పగిలించి = గుండెలు చీల్చి, కొంక చేసి = లొంగు నట్లుచేసి, కడంకన్ = సాహసముతో, అర చందమామ వాలమ్ము = అర్థ చంద్రాకారపు బాణమును, పఱపి = ప్రయోగించి, బొమిడికంబులు పదియును = పది కిరీటములను, పుడమి

కూల్చి = నేలను పడునట్లు చేసి, బన్నమొందింప = కష్టమును కలిగించగా, బెగడి = భయపడి, ఆ పాలసుండు = ఆ నీచుడు, వేఱొకని తేరిపైన్ పడి = మరియొకని రథమును ఎక్కి, పాఱి = పారిపోయి, రాకాసి తెగలు = రాక్షస సమూహములు, నొగల = విచారింపగా, తనదు దీవి చొచ్చెను = తన లంకానగరమున ప్రవేశించెను.

**తా :** ఆ రాముడు పదునైన బాణములు వింటికి తగిలించి వింటినారిని లాగి రావణుని గుఱ్ఱములు, తేరు, కైదువులు, సారథి, ధ్వజము, కవచము నశింపగా వేసి ఇంకా పిడుగులకు సమానమైన బాణమును తీసుకొని గుండెలు చీల్చి లొంగునట్లు చేసి, సాహసముతో అర్ధచంద్రాకారపు బాణమును ప్రయోగించి పది కిరీటములను నేలను పడవేయగా బెంగపడి ఆ నీచుడు మరియొక రథమును ఎక్కి పారిపోయి రాక్షస సమూహములు భయముతో విచారించగా లంకా నగరమును చేరెను.

**తే.గీ.** **అంత రాముఁడు తన మొనయందు సొమ్మ**
**సిలిన జోదుల మందులవలన మనుపు**
**కొని చెలఁగుచుండె వేల్పుల గొంగ యటులఁ**
**బాఱి చని దీవిఁ గొలువుండి పంతమెలయ** **223**

అంతన్ = అంతట, రాముడు, తన మొనయందు = తన పక్షమందు, సొమ్మసిలిన, జోదుల = వీరులను, మందులవలన, మనుపుకొని = బ్రతికించుకొని, చెలగుచుండె = సంతోషించు చుండెను, వేల్పుల గొంగ = రావణుడు, అటులన్ = ఆ రీతిగా, పాఱి, చని = వెళ్ళి, దీవిన్ = లంకలో, కొలువు ఉండి = సభచేసి, పంతము ఎలయ = పట్టుదల పెరుగగా –

**తా :** అంతట రాముడు తన పక్షమందు సొమ్మసిలిన వీరులను మందులవలన బ్రతికించుకొని సంతోషించుచుండెను. రావణుడు అలా పారిపోయి వెళ్ళి లంకలో సభచేసి పట్టుదలతో –

**కం.** **మానిసి దిండులఁ గనుగొని**
**పూనికతోఁ గడవ చెవుల పోటరి నిపుడే**
**వే నిదుర దెలిపి పోరికి**
**లేనెత్తుఁ డటంచు నర్మిలిం బనుచటయున్** **224**

మానిసి తిండులన్ = రాక్షసులను, కనుగొని = చూచి, పూనికతోన్ = ప్రయత్నముతో, కడవ చెవుల పోటరిన్ = కుంభకర్ణుని, ఇపుడే = ఇప్పుడే, వే = వేగముగా, నిదుర తెలిపి = నిద్ర లేపి, పోరికి = యుద్ధమునకు, లేనెత్తుడు = సిద్ధముచేయుడు, అటంచు = అనుచు, అర్మిలిన్ = అపేక్షతో, పనుచుటయున్ = పంపుటయును,

**తా :** రాక్షసులను చూచి కుంభకర్ణుని ఇపుడే వేగముగా నిద్రలేపి యుద్ధమునకు సిద్ధము చేయుడు అని అపేక్షతో పంపగా –

**కం.** **అఱిముఱి వారలు సని మే**
**నెఱుఁగక నిదురల నూర్పుటీదలు గొఱలం**
**గుఱువెట్టుచుఁ గొండవలెన్**
**వెఱఁగొప్పఁగ నున్న కుండవీనుల జోదున్** **225**

అటిముటిన్ = సంభ్రమముతో, వారలు = ఆ రాక్షసులు, చని = వెళ్ళి, మేను ఎఱుగక = ఒళ్ళు తెలియక, నిదురలన్ = నిద్రలతో, ఊర్పు ఈదలు = శ్వాసరీతులు, కొఱలన్ = వ్యాపింపగా, గుఱు పెట్టుచున్ = గురక పెట్టుచు, కొండవలెన్ = కొండలా, వెఱగు ఒప్పగన్ ఉన్న = భయముకలిగించు నట్లున్న, కుండవీనుల జోదున్ = కుంభకర్ణుని,

**తా :** తొందరగా ఆ రాక్షసులు వెళ్ళి ఒళ్ళుతెలియక నిద్రతో గుఱకపెట్టుచు కొండలా భయము కలిగించునట్లున్న కుంభకర్ణుని.

**కం.** **కనుఁగొని పలు దెఱఁగుల డా**
**కొని లేపఁగ నతఁడు గుదురుకొని పెన్మల లా**
**గునఁ దరలక యుండిన బో**
**రన బూరలు బేరులును గరంబు చెలంగన్** **226**

కనుగొని = చూచి, డాకొని = సమీపించి, పలు తెఱగుల = అనేక విధములుగా, లేపగన్ = లేపుటకు ప్రయత్నింపగా, అతడు = ఆ కుంభకర్ణుడు, కుదురుకొని = అమరుకొని, పెన్మల లాగున = పెద్ద కొండరీతిగా, తరలక ఉండిన = కదలక ఉండిన, బోరన = వెంటనే, బూరలు = కాహళులు, బేరులును = భేరీలును, కరంబు = మిక్కిలి, చెలంగన్ = విజృంభించి,

**తా :** చూచి సమీపించి పలు విధములుగా లేపినా ఆ కుంభకర్ణుడు పెద్ద కొండరీతిగా కదలకుండిన వెంటనే కాహళులు, భేరీలతో మిక్కిలి విజృంభించి –

**తే.గీ.** **గొల్లుగాఁ గూఁకలిడుచు గగ్గోలు సేసి**
**లేవకుండిన విసికి యా లెంక లినుప**
**ద్రుద్ల గుదియలఁ బిడికిళ్ళ రోకళులను**
**మొత్త బలితంపుఁ జెట్టు పైనెత్తి మఱియు** **227**

గొల్లుగాన్ = గోలగా, కూకలు ఇడుచు = కేకలు వేయుచు, గగ్గోలు చేసి = గందరగోళముచేసి, లేవకుండిన, విసికి, ఆ లెంకలు = ఆ సేవకులు, ఇనుప ద్రుద్ల = ఇనుప దుడ్డులతో, గుదియలతోన్ = బండలతోను, పిడికిళ్ళ, రోకళులను, మొత్త = బాదగా, బలితంపు = మంచి బలమైన, చెట్టు = వృక్షమును, పైన ఎత్తి = పైకి విసిరి, మఱియు = ఇంకను,

**తా :** గోలగా కేకలు వేసి గందరగోళం చేసినా లేవకుండిన విసిగి ఆ సేవకులు ఇనుప దుడ్డుల, బండల, పిడికిళ్ల, రోకళ్ళ బాదగా, మంచి బలమైన చెట్టును పైకి విసిరి ఇంకా –

**కం.** **కఱచియుఁ జఱచియుఁ గారుల**
**నిఱికియు గుఱ్ఱములు నాముటేనుంగులఁ బైఁ**
**బఱపియుఁ దాఁచియు మీసలు**
**వెఱకియు నూనియలఁ గాఁచి బిట్టు చిలికియున్** **228**

కఱచియున్ = పళ్ళతో పీకియును, చఱచియున్ = అరచేతులతో బాదియును, కారులన్ ఇఱికియు = పట్టకారుల ఇరికించి లాగియు, గుఱ్ఱములున్, ఆము ఏనుంగులన్ = మదించిన ఏనుగులను,

పైన్ పఱపియున్ = పైన ఎక్కి తొక్కించియు, తాచియు = తన్నియును, మీసలు పెఱికియు = మీసములు పట్టుకొని లాగియు, నూనియలన్ కాచి = నూనెలను మరిగించి, బిట్టు = ఎక్కువగా, చిలికియున్ = చిలుకరించియు,

**తా :** పళ్ళతో పీకి, అరచేతులతో చఱచి, పట్టకారుల ఇరికించి, గుఱ్ఱముల, ఏనుగుల పైన తొక్కించియు, తన్నియు, మీసములు పట్టుకొని లాగియు, నూనెలను మరగించి బాగా చిలుకరించియు.

**ఆ.వె. మేలుకొలుపుచున్న మెల్లనే యించుక**
**పొరలి చిన్న నల్లి పొడిచెనంచు**
**లేచి కూరుచుండి లెంకలఁ జూచి మీ**
**రేమి వచ్చినార లిచటి కనుడు 229**

మేలుకొలుపుచున్నన్ = లేపుచుండగా, మెల్లనె = మెల్లగా, ఏ ఇంచుక = ఏదో కొంచెము, పొరలి = దొర్లి, చిన్న నల్లి పొడిచెనంచు = ఏదో చిన్న నల్లి కుట్టిందన్నట్లుగా, లేచి కూరుచుండి = లేచి కూర్చుని, లెంకలన్ చూచి = సేవకులను చూచి, మీరు, ఇచటికి = ఇక్కడికి, ఏమి వచ్చినారలు = ఎందులకు వచ్చినారు, అనుడు = అని అడుగగా –

**తా :** లేపుచుండగా మెల్లగా ఏదో కొంచెము దొర్లి ఏదో చిన్న నల్లి కుట్టినదన్నట్లుగా లేచి కూర్చుని సేవకులను చూచి 'మీరు ఇక్కడికి ఎందుకు వచ్చారు' అని అడుగగా –

**కం. వారందఱు దరిఁజేరి జో**
**హారులు గావించి తేని యానతి యెల్లం**
**బేరిమిని దెలిపి సంతస**
**మారఁగ నమ్మేటి మగని కాఁకలి దీరన్ 230**

వారందఱు = ఆ రాక్షసులందరు, దరిన్ చేరి = సమీపమునకు వెళ్లి, జోహారులు కావించి = జయ జయధ్వనులు పలికి, తేని = రావణునియొక్క, ఆనతి ఎల్లన్ = ఆజ్ఞనంతయును, పేరిమిని = ఇష్టమగురీతిని, తెలిపి, సంతసమారగన్ = మిక్కిలి సంతోషముతో, ఆ మేటి మగనికి = ఆ శ్రేష్ఠుడైన వీరునికి, ఆకలి తీరన్ = ఆకలి తీరునట్లుగా –

**తా :** వారందరు దరిచేరి జోహారులు చేసి రావణుని ఆజ్ఞను తెలిపి సంతోషముతో ఆ వీరుని ఆకలి తీరునట్లుగా –

**తే.గీ. మేర మీఱిన గొఱియల మేఁకగముల**
**గొఱియ పోతుల నటికి ప్రోగులుగ నిడ్డ**
**వెగ్గలపుఁ బచ్చి నంజుళ్ళ వెట్టినీళ్ళు**
**దోరహత్తుగ నిడఁ గడుపార మెసఁగి 231**

మేర మీఱిన = లెక్కకు మీరిన, గొఱియల = గొఱ్ఱెలను, మేక గముల = మేకల మందలను, గొఱియ పోతుల = గొఱ్ఱె పొట్టేళ్ళను, నటికి, ప్రోగులుగన్, ఇడ్డ = ఉంచగా, వెగ్గలపున్ = అధికమైన, పచ్చి నంజుళ్ళ = పచ్చి మాంసపు నలుచలతో, వెట్టి నీళ్ళు = మద్యమును, తోరహత్తుగన్ = సమృద్ధిగా, ఇడన్, కడుపారన్ = కడుపు నిండుగా, మెసగి = తిని,

**తా :** లెక్కలేనన్ని గొఱ్ఱెలను, మేకల మందలను, గొఱ్ఱె పొట్టేళ్ళను నఱికి పోగులు పెట్టగా పచ్చిమాంసపు నంజుళ్ళతో మద్యమును సమృద్ధిగా ఇవ్వగా కడుపునిండా తిని.

**ఆ.వె.** **అపుడె తరలి యాతఁ డన్న కడకు వచ్చి**
**మ్రొక్కలిడినఁ జూచి పెక్కు చంద**
**ములఁ బొసంగ నాడి పొలదిండి రాయఁ డ**
**ప్పోటుగానిఁ గయ్యమునకుఁ బనిచె** **232**

అపుడె = ఆ సమయమునందే, తరలి = బయటుదేరి, ఆతడు = ఆ కుంభకర్ణుడు, అన్నకడకు వచ్చి, మ్రొక్కులు ఇడినన్ = నమస్కరించగా, చూచి, పెక్కు చందములన్ = పలు విధములుగా, పొసంగన్ ఆడి = తగురీతిగా పలికి, పొలదిండి రాయడు = రావణుడు, ఆ పోటుగానిన్ = ఆ వీరుని, కయ్యమునకున్ = యుద్ధమునకు, పనిచె = పంపెను.

**తా :** అపుడె బయలుదేరి ఆ కుంభకర్ణుడు అన్నకడకు వచ్చి నమస్కరించగా చూచి పలు విధములుగా పలికి రావణుడు ఆ వీరుని యుద్ధమునకు పంపెను.

**చం.** **పనిచిన జంగసాఁచి యొక పారియె కోటలు దాఁటి యేడ్తెఱం**
**జనుటయు వానిఁ జూచి పెను సత్తియొ మిత్తియొ వచ్చెనంచు మ్రా**
**న్మనికి వజీరు లెల్ల నిడుమ ల్బెరయ న్వడిఁ బాఱి బాగుగా**
**విను రతనంపు వంగడపు వెన్నెలరాయని మఱ్వు సేరినన్** **233**

పనిచిన = పంపగా, జంగచాచి = అంగ చాచి, ఒక పారియె = ఒక అంగలోనే, కోటలు దాటి, ఏడ్తెఱన్ = వేగముగా, చనుటయు = వెళ్ళగా, వానిన్ = ఆ కుంభకర్ణుని, చూచి, పెను సత్తియొ = పెద్ద శక్తియో, మిత్తియొ = మృత్యువో, వచ్చెను అంచు, మ్రాను మనికి వజీరులు = వానర వీరులు, ఎల్లన్ = అందరును, ఇడుమలు బెరయన్ = ఉపద్రవములు వ్యాపింపగా, వడిన్ = శీఘ్రముగా, పాఱి = పారిపోయి, బాగుగా, విను రతనంపు వంగడపు వెన్నెలరాయని = సూర్యవంశ చంద్రుడైన రామునియొక్క, మఱ్వు చేరినన్ = చాటున చేరగా –

**తా :** పంపగా ఒక అంగలోనే కోటలు దాటి వేగముగా వెళ్ళగా ఆ కుంభకర్ణుని చూచి పెద్ద శక్తియో, మృత్యువో వచ్చెనని వానరులు పారిపోయి రాముని చాటున చేరగా –

**తే.గీ.** **ఓడకు డటంచు నయ్యేకిమీఁడు వారి**
**మగుడఁ బోరికిఁ బురికొల్ప మగతనంబు**
**మెఱయఁ గెంగేల విలుగొని వఱలుచుండె**
**నప్పు డా రక్కసుఁడు నోల మాసగొనక** **234**

ఆ ఎకిమీడు = ఆ రాముడు, ఓడకుడు అటంచు = భయపడకుడని, వారిన్, మగుడన్ = తిరిగి, పోరికిన్ = యుద్ధమునకు, పురికొల్ప = ఉత్సాహపరచగా, మగతనంబు మెఱయన్ = పౌరుషము ప్రకటమగునట్లుగా, కెంగేల = ఎఱ్ఱని చేత, విలు కొని = వింటిని తీసుకొని, వఱలు చుండె = ఒప్పు చుండెను, అప్పుడు, ఆ రక్కసుడు = ఆ కుంభకర్ణుడు, ఓలము ఆస కొనక = ప్రాణములను లెక్కచేయక.

**తా :** ఆ రాముడు భయపడకుడని వారిని తిరిగి యుద్ధమునకు ఉత్సాహపరచుచు మగతనముతో చేతితో వింటిని తీసుకొని ఒప్పుచుండెను. అపుడు ఆ కుంభకర్ణుడు ప్రాణములను లెక్కచేయక.

**తే.గీ  కొదమ బెబ్బులి వే లేఁటి కదుపు మీఁద**
**దాడి వెడలు తెఱంగునఁ దఱుల మోర**
**మెకపు బంటులపైఁ బేర్మిమీఱ మొనల**
**వాలు ద్రిప్పుచు నదరిన వాంద్రు బెగడి  235**

కొదమ బెబ్బులి = మదించిన పులి, వే = వేగముగా, లేటి కదుపు మీద = లేళ్ళ మందమీద, దాడి వెడలు తెఱంగున, తఱుల మోర మెకపు బంటులపైన్ = వానర వీరులపై, పేర్మి మీఱ = ఉత్సాహముతో, మొనలు వాలు = వాడి మొనలుగల త్రిశూలమును, త్రిప్పుచు = గిరగిర త్రిప్పుచు, అదరిన = అతిశయించిన, వాంద్రు = ఆ వానరులు, బెగడి = భయపడి,

**తా :** కొదమ పులి వేగముగా లేళ్ళ మందమీద దాడి చేయు విధముగా వానర సైన్యముపై ఉత్సాహంతో త్రిశూలమును గిరగిర త్రిప్పుతూ అదరిన ఆ వానరులు భయపడి.

**కం.  బలుగాలిఁ దూలు మబ్బు తె**
**గల చాడ్పునఁ బఱచుచున్నఁ గనుగొని యోహో!**
**నిలుఁడు నిలుం డనుచు న్వే**
**ల్పుల దొర మనుమండు మరలఁ బురికొల్పుటయున్  236**

బలుగాలిన్ = పెనుగాలిచేత, తూలు = చెదిరిపోవు, మబ్బు తెగల చాడ్పున = మబ్బుల సమూహమువలె, పఱచుచున్న = పారిపోవుచున్న, కనుగొని = చూచి, ఓహో = ఆశ్చర్యము, నిలుడు నిలుండనుచున్, వేల్పులదొర మనుమండు = వాలి కొడుకు అంగదుడు, మరల = వెనుతిరుగునట్లు, పురికొల్పుటయున్ = ఉత్సాహపరచుటయును,

**తా :** పెనుగాలిచేత చెదరిపోవు మబ్బులవలె పారిపోతుండగా చూచి నిలుడు నిలుండని అంగదుడు వెనుతిరుగునట్లు పురికొల్పుటయును.

**మం.  అనికిం గోల్తలఁ జేయ వార్నడచుచో నక్కుంభకర్ణుండు డా**
**కొని కై ముమ్మొన కైదువ న్మెదడులన్ గ్రొవ్వుం గళాసంబుల**
**న్బునుకల్ నంజుడుఁ బ్రేవు లెమ్ములు నరంబు ల్గుండెలున్ బ్రోవులై**
**తనర న్నెత్తురు లేఱులై పఱవ ద్రుమందంజేసి పెల్లార్చుచున్  237**

అనికిన్ = యుద్ధమునకు, కోల్తలన్ చేయ = ఎదుట పడుటకు, వారు = వానరులు, నడచుచోన్ = నడచుచుండగా, ఆ కుంభకర్ణుడు, డాకొని = సమీపించి, కై ముమ్మొన కైదువన్ = చేతిలోని త్రిశూలముతో, మెదడులన్, క్రొవ్వున్, కళాసంబులన్ = చర్మములను, పునుకల్ = పుఱ్ఱెలను, నంజుడున్ = మాంసమును, ప్రేవులు, ఎమ్ములు = ఎముకలు, నరంబుల్ = నరములును, గుండెలున్, బ్రోవులై = గుట్టలుగా, తనర = ఒప్పుగా, నెత్తురు, ఏఱులై, పఱవ = ప్రవహించగా, ద్రుమందంచేసి = చంపి, పెల్లు ఆర్చుచున్ = పెద్దగా అరచుచు,

**తా :** యుద్ధమునకు ఎదుట పడుటకు వానరులు నడచుచుండగా ఆ కుంభకర్ణుడు చేతిలోని త్రిశూలముతో మెదడులు, క్రొవ్వు, చర్మములు, పుఱ్ఱెలు, మాంసము, ప్రేవులు, ఎముకలు, నరములు, గుండెలు గుట్టలుగా ఒప్పగా, నెత్తురు ఏఱులై ప్రవహించగా చంపి పెద్దగా అరచుచు-

**తే.గీ.** **ఒక్క వ్రేటున నూర్లు వే లోలిఁ గూల**
**వ్రేయుచును గాళ్ళఁ జమరుచు వాయిఁ దెఱచి**
**మ్రింగుచును గౌఁగిటను బిగియంగ నొత్తి**
**నలియఁ జేయుచుచున్న బిట్టలుక తోడ** **238**

ఒక్క వ్రేటునన్ = ఒక్క దెబ్బతో, నూర్లు, వేలు, ఓలిన్ = వరుసగా, కూల వ్రేయుచును, కాళ్ళన్ చమురుచు = కాళ్ళతో నలిపివేయుచు, వాయిన్ తెఱచి = నోరు తెరచి, మ్రింగుచును, కౌగిటను, బిగియంగన్ = బిగువుగా, ఒత్తి = నొక్కి, నలియన్ చేయుచున్న = నలిపి వేయుచున్న, బిట్టు అలుకతోడ = అధికమైన కోపముతో -

**తా :** ఒక్క దెబ్బతో నూర్లు, వేలు వరుసగా కూలవేయుచు, కాళ్ళతో నలిపివేయుచును, నోరు తెఱచి మ్రింగుచును, కౌగిట నొక్కి నలిపివేయుచున్న, మిక్కిలి కోపముతో -

**కం.** **చలినట్టు పట్టి బలు గు**
**బ్బలి యొక్కటిఁ దెచ్చి వానిపై వ్రేయుడు న**
**త్తులువ మొనవాలుచే న**
**బ్బలియుని యెద పొడిచి సొమ్మపాలుగఁ జేసెన్** **239**

చలినట్టు పట్టి = వాయుపుత్రుడు, బలు గుబ్బలి = పెద్ద కొండను, ఒక్కటి తెచ్చి, వానిపై, వ్రేయుడు = వేయగా, ఆ తులువ = ఆ నీచుడు, మొనవాలుచే = బల్లెముతో, ఆ బలియుని ఎదన్ = ఆ వీరుని గుండెపై, పొడిచి, సొమ్మపాలుగన్ చేసెన్ = సొమ్మసిలునట్లు చేసెను.

**తా :** వాయుపుత్రుడు పెద్ద కొండను తెచ్చి వానిపై వేయగా ఆ నీచుడు బల్లెముతో ఆ వీరుని గుండెపై పొడిచి సొమ్మసిలునట్లు చేసెను.

**సీ.** **అది చూచి నీలుండు గొదుకక యొక పెద్ద**
**మల వానిపై వ్రేయ నలిగి నూఱు**
**తునియలై పడ దాని దూకొని పిడికిట**
**నాతండు వొడిచిన నపుడె మఱి వృ**
**షభుఁడు గవాక్షుండు శరభుండు నలుఁడును**
**గంధమాదనుఁడును గడఁగి గొప్ప**
**పడుకులు మ్రాకులు నెడపక వైచి నొ**
**ప్పించినఁ దలఁక కబ్బిరుదుమగఁడు**

**తే.గీ.** **వారి నేవురి సొమ్మవోవంగఁ బొడిచి**
**చూడ్కి కగపడ్డ కోఁతుల జుఱుఁగనీక**

**మ్రింగఁ జాగినఁ దద్దయు మిడికి పవలు**
**సేయు వేలుపుఁ బట్టి యచ్చెనఁటిఁ బొదవి** **240**

అది చూచి, నీలుండు, కొదుకక = జంకక, ఒక పెద్ద మల, వానిపై వ్రేయన్, అలిగి = కోపించి, దాని దూకొని = దానిని గ్రహించి, ఆతండు = ఆ కుంభకర్ణుడు, నూఱు తునియలై పడ = నూరుముక్కలై పడగా, పిడికిటన్ = పిడికిలితో, పొడిచినన్ = పొడువగా, అపుడె = అంతలో, మఱి = ఇంకను, కడగి = పూనుకొని, గొప్ప పడుకులు = పెద్ద రాళ్ళు, మ్రాకులు = చెట్లు, ఎడపక = విడువక, వైచి = వేసి, నొప్పించిన = బాధింపగా, తలకక = చలింపక, ఆ బిరుదుమగడు = ఆ వీరశ్రేష్ఠుడు, వారిన్ ఏవురిన్ = వారి నైదుగురిని, సొమ్మవోవంగ = సొమ్మసిలునట్లుగా, పొడిచి, చూడ్కికి = కంటికి, అగపడ్డ, కోతుల, జుణుగనీక = తప్పించుకోనీక, మ్రింగన్, చాగినన్ = మొదలుపెట్టగా, తద్దయు = మిక్కిలి, మిడికి = పరితాపముతో, పవలు చేయు వేలుపు పట్టి = సూర్యుని కుమారుడు సుగ్రీవుడు, ఆ చెనటిన్ = ఆ మూర్ఖుని, పొదవి = ఆక్రమించి.

**తా :** అది చూచి నీలుడు జంకక ఒక పెద్ద రాయి వానిపై వేయగా కోపించి ఆ కుంభకర్ణుడు దానిని పిడికిలితో పొడిచి నూరు ముక్కలు చేసెను. ఇంకా మిగిలిన వానరులు పూనుకొని పెద్ద రాళ్ళు, చెట్లు వేసి బాధింపగా చలింపక ఆ వీరశ్రేష్ఠుడు వాని నైదుగురిని సొమ్మసిలునట్లుగా పొడిచి కంటికి కనబడ్డ కోతులనెల్ల తప్పించుకు పోనీక మ్రింగడం మొదలుపెట్టగా పరితాపముతో సుగ్రీవుడు ఆ మూర్ఖుని ఆక్రమించి.

**కం.** **గుబ్బలి కొమ్మొక్కటి గడు**
**నిబ్బరముగఁ బెఱికి యాతని న్వైచిన వాఁ**
**డుబ్బు సెడక మలద్రిమ్మరి**
**బెబ్బులిపయి మొనలవాలు పేర్మిన్ వైచెన్** **241**

గుబ్బలి కొమ్ము = పర్వత శిఖరమును, ఒక్కటి = ఒకదానిని, కడున్ = మిక్కిలి, నిబ్బరముగన్ = ధైర్యముతో, పెఱికి = పెకలించి, అతనిన్ = ఆ కుంభకర్ణుని, వైచిన = వేయగా, వాడు = వాడు, ఉబ్బు చెడక = గర్వము వీడక, మల త్రిమ్మరి బెబ్బులిపయి = వానర శ్రేష్ఠుడగు సుగ్రీవునిపై, మొనలవాలు = త్రిశూలమును, పేర్మిన్ = అతిశయముతో, వైచెన్ = వేసెను.

**తా :** ఒక పర్వత శిఖరమును పెకలించి ఆ కుంభకర్ణునిపై వేయగా వాడు గర్వము వీడక వానర శ్రేష్ఠుడగు సుగ్రీవునిపై త్రిశూలమును అతిశయముతో విసరెను.

**తే.గీ.** **వైవ గాడుపుకుఱ్ఱఁ డవ్వాలు నడుమఁ**
**బట్టుకొని కిన్క మ్రోఁకాలఁ బట్టి విఱిచె**
**నందులకుఁ జాల రక్కసుఁ డలిగి తమ్మి**
**నంటు కొమరుని సొమ్మగొనంగ నడఁచె** **242**

వైవన్ = వేయగా, గాడుపు కుఱ్ఱడు = వాయుపుత్రుడు హనుమ, ఆ వాలు = ఆ త్రిశూలమును, నడుమన్ = మధ్యలోనే, పట్టుకొని, కిన్క = కోపముతో, మ్రోకాలన్ పట్టి = మోకాలితో అణచిపెట్టి,

విఱిచెన్, అందులకున్ = దానికి, రక్కసుడు = రాక్షసుడు, చాల అలిగి = మిక్కిలి కోపించి, తమ్మినంటు కొమరుని = పద్మ ప్రియుడగు సూర్యుని పుత్రుని సుగ్రీవుని, సొమ్మగొనంగ = సొమ్మసిలేలా, అడచె = కొట్టెను.

**తా :** విసరగా హనుమ ఆ త్రిశూలమును మధ్యలోనే పట్టుకొని కోపముతో మోకాలితో అణచి విఱిచెను. దానికి రాక్షసుడు అలిగి సుగ్రీవుని సొమ్మసిలేలా కొట్టెను.

**ఆ.వె.** **అడిచి యతని మూఁపునందిదుకొని దీవి**
**కరుగుచున్న మంచి యత్తి కొమ్మ**
**మెకపు మిన్న దెలిసి మెల్లన వాని వీ**
**నులును ముక్కుఁ గొఱికి యెలమి నరిగె** **243**

అడిచి = కొట్టి, అతని మూపునందు ఇదుకొని = అతనిని భుజముపై వేసుకొని, దీవికి అరుగుచున్న = లంకకు పోవుచుండగా, మంచి, అత్తి = కంఠముకల, కొమ్మ మెకపు మిన్న = సుగ్రీవుడు, తెలిసి = తెప్పరిల్లి, మెల్లన, వాని, వీనులను = చెవులను, ముక్కున్ = ముక్కును, కొఱికి, ఎలమిన్ = సంతోషముతో, అరిగె = వెళ్ళిపోయెను.

**తా :** కొట్టి అతనిని భుజముపై వేసుకొని లంకకు పోవుచుండగా సుగ్రీవుడు తెప్పరిల్లి మెల్లగ వాని చెవులను, ముక్కును కొఱికి సంతోషముతో వెనుతిరిగి వెళ్ళిపోయెను.

**కం.** **అరిగినఁ గనుగొని రక్కసుఁ**
**డరుదందుచు మేను రోసి యప్పుడె యనికిన్**
**మరలి యొక యినుప ద్రుద్దునఁ**
**బరిగొని యక్కోన తెంకి బంట్లఁ జదుముచున్** **244**

అరిగినన్ = వెళ్ళిపోగా, కనుగొని = చూచి, రక్కసుడు = కుంభకర్ణుడు, అరుదందుచు = అబ్బురపడుచు, మేను రోసి = ప్రాణాలకు తెగించి, అప్పుడె = వెంటనే, అనికిన్ = యుద్ధమునకు, మరలి = వెనుతిరిగి, ఒక ఇనుప ద్రుద్దునన్, పరిగొని = ఆక్రమించుకొని, ఆ కోన తెంకి బంట్లన్ = ఆ వానరులను, చదుముచున్ = చంపుచు.

**తా :** వెళ్ళిపోగా చూచి కుంభకర్ణుడు అబ్బురపడి ప్రాణాలకు తెగించి వెంటనే యుద్ధమునకు వెనుతిరిగి ఒక ఇనుప దుడ్డును తీసుకొని ఆ వానరులను చంపుచు.

**సీ.** **కడకమై వే నారికెడపు బొండ్లములట్లు**
**బెట్టిదంబుగఁ దల ల్వీలుకొనుచుఁ**
**దులకించు నించుకోలల తెఱంగున సంత**
**సము మీఱఁ జేతులు నమలుకొనుచుఁ**
**దియ్యని క్రొవ్విరి తేనియ చాడ్పున**
**గొదగొని నెత్తురుల్ గ్రోలుకొనుచు**
**బలితంపు జున్ను బిళ్ళల చందమునఁ గ్రొవ్వు**
**మెదడును నోరూర మ్రింగుకొనుచు**

**తే.గీ.** **మొనసి తనవారుఁ బెఱవారునని తలఁపక**
**యబ్బురంబుగఁ దన కగ్గమైన వారి**
**నేచి కుత్తుక బొరియలో వైచికొనుచు**
**మాఱెచట లేని కడిమిఁ ద్రిమ్మరుచునుండె** **245**

కడకమై = ప్రయత్నముతో, వే = వేగముగా, నారికెడపు = కొబ్బరి, బొండములు అట్లు, బెట్టిదంబుగన్ = కఠినముగా, తలలు పీలుకొనుచున్ = తలలు చీల్చుకొనుచు, తులకించు = కుతూహలముతో, ఇంచుకోలల తెఱంగున = చెఱకు ముక్కల విధముగా, చేతులు = ఆ వానరుల చేతులను, సంతసము మీఱన్ = మిక్కిలి సంతోషముతో, నమలుకొనుచు = నమిలివేయుచు, తియ్యని, క్రొవ్విరి తేనియ చాడ్పున = క్రొత్తపూవుల తేనెవలె, గొదగొని = తొందరగా, నెత్తురుల్ గ్రోలుకొనుచు = రక్తము త్రాగుతూ, బలితంపు = పెద్ద, జున్నుబిళ్ళల చందమున = జున్నుముక్కల మాదిరిగా, క్రొవ్వు, మెదడును, నోరు ఊర = నోరు ఊరునట్లుగా, మ్రింగుకొనుచు = మ్రింగుచు, మొనసి = పూనుకొని, తనవారున్, పెఱవారున్, అని తలపక, అబ్బురంబుగన్, తనకు, అగ్గమైన వారిన్ = తనకు అడ్డువచ్చిన వారిని, ఏచి = నొప్పించి, కుత్తుక బొరియలో = నోటి కంతలో, వైచికొనుచు = వేసికొనుచు, మాఱు ఎచట లేని = ఎక్కడ తనకు ఎదురులేని, కడిమిన్ = సాహసముతో, త్రిమ్మరుచున్ ఉండె = తిరుగుచుండెను.

**తా :** వేగముగా కొబ్బరి బొండముల మాదిరిగా కఠినముగా తలలు చీల్చుకొనుచు, కుతూహలంగా చెఱకు ముక్కల విధముగా ఆ వానరుల చేతులను నమిలివేయుచు, తియ్యని పూల తేనెవలె రక్తమును త్రాగుతూ, పెద్ద జున్నుముక్కల మాదిరిగా క్రొవ్వు, మెదడు నోరూరునట్లుగా మ్రింగుచు, తనవారు పెఱవారు అని తలపక తనకు అడ్డువచ్చిన వారిని నోటిలో వేసికొనుచు తనకు ఎదురులేని సాహసముతో తిరుగుచుండెను.

**తే.గీ.** **అపుడు రాముఁడు వానిపై నదరి వింటి**
**నారి మొఱయించి కఱకు వాల్నారసములు**
**పెక్కు వఱపినఁ దలక కబ్బిరుదు గేల**
**ద్రుడ్డు త్రిప్పుచు రాచ చందురునిఁ దొడరె** **246**

అపుడు, రాముడు, వానిపైన్, అదరి = విజృంభించి, వింటి నారి, మొఱయించి = మ్రోగించి, కఱకు వాలు = మిక్కిలి వాడియైన, నారసములు = బాణములు, పెక్కు పరపిన = పలు ప్రయోగింపగా, తలకక = జంకక, ఆ బిరుదు = ఆ వీరుడు, కేల = చేతితో, ద్రుడ్డు త్రిప్పుచు, రాచ చందరునిన్ = రాజ చంద్రుడగు రాముని, దొడరె = ఎదుర్కొనెను.

**తా :** అపుడు రాముడు వానిపై విజృంభించి వింటి నారి మ్రోగించి మిక్కిలి వాడియైన బాణములు ప్రయోగింపగా జంకక ఆ వీరుడు చేతితో దుడ్డు త్రిప్పుచు రాముని ఎదుర్కొనెను.

**చం.** **తొడరిన వెండియుం గినుకతో నెకిమీఁదు మెఱుంగు టమ్ముల**
**గ్గడుసరి సోకు మిన్న మెయిగాఁడఁగ నేసిన నొచ్చియుం జలం**

**బడరఁగ నాతఁడెత్తుకొని యార్చుచు రాఁ గని గాడ్పు తూపు నె**
**వ్వడిఁ బఱగించి చేయిఁ దెగవైచెఁ గడిందిగ రాముఁ డత్తటిన్ 247**

తొడరినన్ = మార్కొనగా, ఎకిమీడు = రాముడు, వెండియుం = మరల, కినుకతో = కోపముతో, మెఱుంగు అమ్ములు = వాడియైన బాణములు, ఆ గడుసరి సోకు మిన్న = ఆ కుంభకర్ణునియొక్క మెయి గాడగన్ = శరీరమున నాటుకొనునట్లు, ఏసినన్ = వేయగా, నొచ్చియుం = బాధపడియును, చలంబు అదరగన్ = కోపము అతిశయింపగా, ఆతడు = ఆ కుంభకర్ణుడు, ఎత్తుకొని ఆర్చుచు = చేయి పైకెత్తుకొని అరచుచు, రాన్ = రాగా, కని = చూచి, గాడ్పు తూపు = వాయవ్యాస్త్రమును, నెవ్వడిన్ = మిక్కిలి శీఘ్రముగా, పఱగించి = ప్రయోగించి, చేయిన్ = పైకెత్తిన చేతిని, రాముడు, ఆ తటిన్ = ఆ సమయమున, కడిందిగన్ = ప్రయత్నముతో, తెగవైచెన్ = నరికివైచెను.

**తా :** ఎదుర్కొనగా రాముడు మరల వాడి బాణములు ఆ కుంభకర్ణుని శరీరమున నాటు కొనునట్లు వేయగా బాధపడి కోపము అతిశయింపగా వాడు చేయి పైకెత్తుకొని ఆరచుచు రాగా వాయవ్యాస్త్రమును ప్రయోగించి పైకెత్తిన చేతిని రాముడు నఱికివైచెను.

**సీ. తెగవ్రేయ వాఁ డెదఁ బొగిలి రెండవ చేత**
**నొక మ్రాను గొనివచ్చుచున్నఁ జూచి**
**రాచూలి వేలుపు రా చిల్కు నిగిడించి**
**యా చెయ్యి తెగవైచి యపుడె సాము**
**నెల ముల్కి దోయి నిచ్చలముగాఁ బఱఁగించి**
**కాళ్ళు రెండును ద్రుంచి కలువదాయ**
**కూన తూపేసి బల్గుబ్బలి చివరతో**
**దినుసైన యప్పొలదిండి మేలు**

**తే.గీ. బంతి యొాదల పుడమిపైఁ బడఁగ నేసె**
**నేయుటయు రక్కసులు గొందరేఁగి వరుస**
**కుత్తుకల రేయి ద్రిమ్మరి కత్తెఱంగు**
**గదిసి వినిపింప గుండియల్ సెదరి యతఁడు 248**

తెగవ్రేయన్ = చేతిని నరికివేయగా, వాడు = ఆ కుంభకర్ణుడు, ఎదన్ పొగిలి = హృదయమునందు సంతప్తుడై, రెండవ చేతన్, ఒక మ్రాను = ఒక చెట్టును, కొనివచ్చుచున్న = తీసుకొని వస్తున్న, చూచి, రాచూలి = రాముడు, వేలుపు రా చిల్కు = ఐంద్రాస్త్రమును, నిగిడించి = ప్రయోగించి, ఆ చెయ్యి = ఆ చెట్టు తెచ్చిన చెయ్యిని, తెగవైచి = ఖండించి, అపుడె = అప్పుడే, సాము నెల ముల్కి = అర్ధాచంద్రాకారపు బాణముల, దోయి = జంటను, నిచ్చలముగాన్ = చలింపకుండ, పఱగించి = ప్రయోగించి, కాళ్ళు రెండును = రెండు కాళ్ళను, త్రుంచి = ఖండించి, కలువదాయ కూన = కలువల శత్రువు సూర్యుని బిడ్డ యముని పేరునకల, తూపు = బాణమును (యామ్యాస్త్రమును), ఏసి = ప్రయోగించి, బలు గుబ్బలి చివరతో = పెద్ద కొండ శిఖరముతో, దినుసైన = సమానమైన,

ఆ పొలదిండి మేలుబంతి = ఆ కుంభకర్ణునియొక్క, ఔదల = తలను, పుడమిపై = నేలపై, పడగన్ ఏసెన్ = పడునట్లుగ వేసెను, ఏయుటయు = తెగవేయగా, రక్కసులు కొందరు = కొంతమంది రాక్షసులు, ఏగి = వెళ్ళి, వరుస కుత్తుకల రేయి త్రిమ్మరికి = రావణునకు, ఆ తెఱంగు = ఆ విషయమును, కదిసి వినిపింప = చేరి వినిపించగా, గుండియల్ చెదరి = గుండెలు చెదిరిపోయి, అతడు = ఆ రావణుడు.

**తా :** చేతిని నఱికివేయగా ఆ కుంభకర్ణుడు హృదయమునందు సంతప్తుడై రెండవ చేతితో ఒక చెట్టును తీసుకు వస్తుండగా చూచి రాముడు ఐంద్రాస్త్రమును వేసి ఆ చెయ్యిని ఖండించి రెండు అర్ధచంద్రాకారపు బాణములను వేసి రెండు కాళ్లను ఖండించి యామ్యాస్త్రమున ఆ కుంభకర్ణుని తలను నేలపై పడవేసెను. అపుడు కొంతమంది రాక్షసులు వెళ్ళి రావణునకు ఆ విషయమును వినిపింపగా గుండె చెదరి ఆ రావణుడు.

**తే.గీ.** **పలు తెఱంగుల సైదోడు బంటుతనము**
**లెన్నుకొని నేలఁబొరలుచు నేడ్చి యేడ్చి**
**సొమ్మసిలి కొంతవడికి దిటమ్ము మెఱయఁ**
**దెలిసి కూర్చుండి తద్దయుఁ జల మెలర్ప** **249**

పలు తెఱంగుల = అనేక విధములుగా, సైదోడు బంటుతనములు = కుంభకర్ణునియొక్క శౌర్య విశేషములు, ఎన్నుకొని = ఎంచుకొని, నేల పొరలుచు, ఏడ్చి ఏడ్చి, సొమ్మసిలి, కొంతవడికి = కొంత సేపటికి, దిటమ్ము = ధైర్యము, మెఱయన్ = ప్రకాశింపగా, తెలిసి, కూర్చుండి, తద్దయున్ = మిక్కిలి, చలము ఎలర్ప = కోపము అతిశయింపగా –

**తా :** పలు విధములుగా కుంభకర్ణుని శౌర్యవిశేషములు ఎంచుకొని నేల పొరలుచు ఏడ్చి ఏడ్చి సొమ్మసిలి కొంతసేపటికి ధైర్యము తెచ్చుకొని కూర్చుండి కోపము అతిశయింపగా –

**సీ.** **దేవాంతకుండును ద్రిశిరుండు నతికాయుఁ**
**దును నరాంతకుఁడు నాఁ దనరు కూర్మి**
**పట్లకుఁ దగ మహాపార్శ్వ మహోదరుఁ**
**దోడిడి యనికిఁ బోఁ ద్రోలుటయును**
**వార లాఱుగురును మేర మీఱిన మూఁక**
**తోఁ జని కోఁతులఁ దొడరు నెడల**
**నిరు దెఱంగుల దండు బెరసి యుక్కున వ్రేటు**
**లాడుచోఁ జెలరేఁగి యడవి ద్రిమ్మ**

**తే.గీ.** **రులు గడిందిగ రేద్రిమ్మరులను జుట్టి**
**ముట్టి పలు చందములఁ బడఁగొట్టి దక్కి**
**నంపు రాయని వీడున కంపి వైవఁ**
**జూచి యమ్మేటి రాకాసి జోదు లలిగి** **250**

నాన్ తనరు = అనగా ఒప్పునట్టి, కూర్మి పట్లకు = ప్రియమైన కుమారులకు, తగ = తగునట్లుగా, తోడు ఇడి = సాయమిచ్చి, అనికిన్ = యుద్ధమునకు, పోన్ త్రోలుటయును = వెళ్ళునట్లు చేయుటయును, వారలు ఆఱుగురును, మేర మీఱిన మూకతోన్ = లెక్కకు మీరిన సైన్యముతో, చని = వెళ్ళి, కోతులన్ = వానరులను, తొడరున్ ఎడలన్ = మార్కొను సమయమున, ఇరు తెఱంగుల దండు = ఇరుపక్షముల సైన్యము, బెరసి = ఢీకొని, ఉక్కున = పౌరుషముతో, వ్రేటులు ఆడుచో = కొట్టుకొనుచుండగా, చెలరేగి = విజృంభించి, అడవి త్రిమ్మరులు = వానరులు, కడిందిగ = సాహసముగ, రేఁత్రిమ్మరులను = రాక్షసులను, చుట్టుముట్టి = ఆక్రమించి, పలు చందముల = అనేక విధములుగా, పడగొట్టి, దక్కినంపు రాయని వీడునకు = యమ సదనమునకు, అంపి వైవన్ = పంపివేయగా, చూచి, ఆ మేటి రాకాసి జోదులు = ఆ గొప్ప రాక్షస వీరులు, అలిగి = కోపించి –

**తా :** దేవాంతకుడు, త్రిశిరుడు, అతికాయుడు, నరాంతకుడు అను తన కుమారులకు మహాపార్శ్వుడు, మహోదరుడు అను వీరులను తోడిచ్చి యుద్ధమునకు పంపెను. వారు అరుగురు సైన్యముతో వెళ్ళి వానరులను మార్కొనగా, ఇరుపక్షముల సైన్యము ఢీకొని పౌరుషముతో కొట్టుకొనుచుండగా విజృంభించి వానరులు రాక్షసులను చుట్టుముట్టి పలు విధములుగా పడగొట్టి యమసదనమునకు పంపగా ఆ రాక్షసవీరులు కోపించి –

**తే.గీ.** **కైదువుల ద్రుడ్లఁ దూపుల కడఁగి నఱికి**
**మోఁది గ్రుచ్చియుఁ బలుచందములఁ గలంగఁ**
**జేసి మూఁకలఁ జీకాకు సేయుచున్నఁ**
**గాంచి యత్తఱి నెనలేని కడిమితోడ** **251**

కైదువుల = ఆయుధములతో, ద్రుడ్లన్ = దుడ్డులతో, తూపుల = బాణములతో, కడగి = పూనుకొని, నఱికి, మోది, గ్రుచ్చియున్, పలు చందములన్ = పలు విధములుగా, కలంగన్ చేసి = కలత చెందునట్లుగా చేసి, మూకలన్ = సైన్యములను, చీకాకు చేయుచున్న, కాంచి = చూచి, ఆ తఱిన్ = ఆ సమయమున, ఎనలేని = సాటిలేని, కడిమితోడ = ధైర్యముతో –

**తా :** కైదువులతో, దుడ్డులతో, బాణములతో పూనుకొని ఖండించి, బాది, గ్రుచ్చి పలు విధములుగా కలతచెందించగా అలా సైన్యములను చీకాకు చేయుటను చూచి ఆ తఱిని సాటిలేని ధైర్యముతో–

**సీ.** **తెమ్మెర కుఱ్ఱఁడు త్రిశిరు దేవాంతకు**
**నతికాయునిని దార యనుఁగు కొమరుఁ**
**డును మహోదరు నీలుఁడును వృషభుఁడు మహా**
**పార్శ్వుని దొడరి గుబ్బలులఁ జెట్లఁ**
**బడుకులఁ దఱచుగాఁ బై వ్రేయ వాండ్రవి**
**తప్పించుకొని బంటుతనము వెలయ**
**ద్రుడ్ల నీఁటియలఁ గైదువులఁ దూపుల సురి**
**యల జముదాడుల నక్కడింది**

**తే.గీ.** **చెట్టు ద్రిమ్మరి జోదుల బిట్టు నొప్పి**
**వెట్టుటయు వార లా సోఁకు జెట్టి మగల**
**దిట్టలై పట్టుకొని పడగొట్టి జముని**
**పట్టనకుఁ బంపి రిరువాగు పజలు వొగడ** **252**

తెమ్మెర కుఱ్ఱడు = వాయు పుత్రుడు హనుమ, త్రిశిరుని, దేవాంతకుని, అతికాయునిని, తార అనుంగు కొమరుడును = అంగదుడును, మహోదరుని, నీలుడును, మహాపార్శ్వుని, వృషభుడు, తొడరి = యత్నించి, గుబ్బలులున్ = కొండలును, చెట్లున్, పడుకులున్ = రాళ్ళను, తఱచుగాన్ = ఎక్కువగా, పై వ్రేయ = పైన విసరగా, వాండ్రు = ఆ రాక్షసులు, అవి తప్పించుకొని, బంటుతనము వెలయ = శౌర్యము ప్రకాశింపగా, ద్రుడ్లన్ = దుడ్డులతోను, ఈటియలన్ = ఈటెలతోను, కైదువులన్ = ఆయుధములతోను, తూపుల = బాణములతోను, చురియల = చురకత్తులతోను, జముదాడుల = విచ్చుకత్తులతోను, ఆ కడింది = ఆ ధైర్యశాలురగు, చెట్టు త్రిమ్మరి జోదుల = వానర వీరులను, బిట్టు = అధికముగా, నొప్పి పెట్టుటయు = బాధించుటయును, వారలు = ఆ వానరులు, ఆ సోకు జెట్టిమగల = ఆ రాక్షస వీరుల, దిట్టలై = సమర్థులై, పట్టుకొని, పడగొట్టి, ఇరువాగు పజలు పొగడ = రెండు పక్షములు ప్రజలు పొగడగా, జముని పట్టనకు = యమ లోకమునకు, పంపిరి.

**తా :** వాయుపుత్రుడు హనుమ త్రిశిరుని, దేవాంతకుని, అంగదుడు అతికాయుని, నీలుడు మహోదరుని, వృషభుడు మహాపార్శ్వుని యత్నించి కొండలను, చెట్లను, రాళ్ళను, ఎక్కువగా విసరగా ఆ రాక్షసులు అవి తప్పించుకొని దుడ్డులతోను, ఈటెలతోను, కైదువులతోను, బాణములతోను, చురకత్తులతోను, విచ్చుకత్తులతోను ఆ వానరవీరులను బాధించగా ఆ వానరులు ఆ రాక్షసవీరులను పడగొట్టి రెండు పక్షముల ప్రజలు పొగడగా చంపిరి.

**తే.గీ.** **అప్పు డతికాయుఁ డలుకతోఁ దిప్ప ద్రిమ్మ**
**రులఁ బటాపంచలుగఁ దోలి బలిమి మీఱ**
**బంతి తేరుల యెకిమీని పట్టిఁ దటియ**
**నరద మొగిఁ జొన్పి యతని కిట్లనుచుఁ బలికె** **253**

అప్పుడు, అతికాయుడు, అలుకతో = కోపముతో, తిప్ప త్రిమ్మరులన్ = వానరులను, పటాపంచలుగన్ = చెల్లాచెదరగునట్లుగా, తోలి, బలిమి మీఱన్ = మిక్కిలి పరాక్రమముతో, బంతి తేరుల ఎకిమీని పట్టిన్ = రాముని, తటియన్ = చేరువగా, అరదము = రథమును, ఒగిన్ చొన్పి = క్రమముగా పోనిచ్చి, అతనికి = ఆ రామునికి, ఇట్లు అనుచు పలికె,

**తా :** అప్పుడు అతికాయుడు కోపముతో వానరులను చెల్లాచెదరగునట్లుగా తోలి పరాక్రమముతో రాముని చేర రథమును పోనిచ్చి పలికెను.

**ఆ.వె.** **రాచబిరుద! వేల్పురాయనికైన నన్**
**గదిసి పోర నలవిగాక యుండుఁ**
**గోఁతి మూఁకఁ గూర్చుకొని వచ్చి నీ బోఁటి**
**సన్నగాఁడు లెదురఁ జాలుటెట్లు?** **254**

రాచబిరుద = రాజశ్రేష్ఠుడా!, వేల్పురాయనికి ఐన = ఇంద్రునకైనను, నన్ కదిసి పోరన్ = నన్నెదిరించి పోరుటకు, అలవి కాక ఉండు = సాధ్యము కాకుండును, కోతి మూక కూర్చుకొని, వచ్చి, నీబోటి సన్నగాడులు = నీవంటి అల్పులు, ఎదురన్ = ఎదిరించుటకు, చాలుట ఎట్లు = ఎలా సరిపోతారు?.

**తా :** రాజశ్రేష్ఠా! ఇంద్రునకైనను నన్నెదిరించి పోరుటకు సాధ్యము కాదు. కోతిమూకతో వచ్చిన నీవంటి అల్పులు నన్నెదిరించుటకు ఎట్లు సరిపోదురు?

**సీ.** **చివికిన ప్రాఁత విల్సీల్చుటయును బొల**
**దిండి క్రొన్ననబోఁడిఁ జెండుటయును**
**లేడి నేయుటయుఁ జెల్మి యొనర్పఁ జేరిన**
**చెవి ముక్కు సెవులును జిదుముటయును,**
**ఊతికి నుసురులు రావించుటయు డాఁగి**
**కోఁతి నొక్కమ్మునఁ గూల్చుటయును**
**ముదిమిచే లావెల్లఁ గొదపడ్డ ఖరుని ద్రుం**
**పుటయు నీళ్ళకు నడ్డువోయుటయును**

**తే.గీ.** **మగతనంబులుగాఁగ నీమదిఁ దలంచు**
**కొని కరంబును చిక్కు మిక్కుటపు సూడు**
**దెచ్చుకొంటివిగద! చెడు తెఱఁగు పూని**
**యకట! నీ కింక నెందుఁ బోనగుఁ జెనంటి!** **255**

చివికిన = చీకిపోయిన, ప్రాత విల్ చీల్చుటయును = పాత విల్లు విరచుటయును, పొలదిండి క్రొన్ననబోడి = రాక్షస స్త్రీని, చెండుటయును = చంపుటయును, లేడిన్ ఏయుటయున్, చెల్మి ఒనర్ప చేరిన = స్నేహము చేయుటకు రాగా, చెవి ముక్కు చెవులును, చిదుముటయును = కోసి వేయుటయు, ఊతికిన్, ఉసురులు = ప్రాణములు, రావించుటయు, డాగి = దాగి, కోతిని = వాలిని, ఒక అమ్మున, కూల్చుటయును, ముదిమిచే, లావు ఎల్ల = బలమునంతను, కొదవడ్డ = కోల్పోయిన, ఖరుని, ద్రుంపుటయు = చంపుటయును, నీళ్ళకున్, అడ్డువోయు టయును = సేతు నిర్మాణమును, మగతనంబులు కాగ = పరాక్రమములుగా, నీమది తలంచుకొని, కరంబును = మిక్కిలి, చిక్కు = ప్రమాదమును, మిక్కుటపు సూడు = అధికమైన శత్రుత్వమును, తెచ్చుకొంటివి కద, చెఱు తెఅగు పూని = చెడ్డ మార్గముననుసరించి, అకట = అయ్యో!, చెనంటి = మూర్ఖుడా!, నీకు ఇంక ఎందున్, పోనగున్ = పోవ శక్యమగును.

**తా :** చీకిపోయిన పాతవిల్లు విఱుచుట, రాక్షస స్త్రీని చంపుట, లేడిని వేయుట, స్నేహము కోరవచ్చిన స్త్రీ ముక్కు, చెవులు కోయుట, ఊతికి ఉసురులు పోయుట, దాగి వాలిని కూల్చుట, ముసలి ఖరుని చంపుట, సేతు నిర్మాణము పరాక్రమములుగా తలంచుకొని మాతో శత్రుత్వమును తెచ్చుకొంటివి. మూర్ఖుడవై చెడ్డమార్గము ననుసరించిన నీకు ఇపుడిక ఎందుపోవ శక్యమగును?

**తే.గీ. బలిమి భరతుఁడు మును ప్రోలు వెడలఁ ద్రోయ**
**నడవులకుఁ జేరి యాలిఁ గోల్పడితి విందుఁ**
**గాయ గసరులు దిని బ్రదుకక గయాళి**
**పొలసుదిండులతోఁ బగఁ బూనఁ జనునె? 256**

బలిమి = బలవంతముగా, భరతుడు, మును, ప్రోలు వెడలన్ ద్రోయన్ = పట్టణమునుండి బయటకు గెంటివేయగా, అడవులకున్, చేరి, ఆలిన్ కోల్పడితి = భార్యను కోల్పోయితివి, ఇందున్ = ఇక్కడ, కాయ కసరులు, తిని, బ్రతుకక, గయాళి = వీరులైన, పొలసు తిండులతో = రాక్షసులతో, పగన్ = శత్రుత్వమును, పూనన్ చనునె = పూనుట తగునా?

**తా :** బలవంతముగా భరతుడు నగరమునుండి బయటకు గెంటివేయగా అడవులకు చేరి భార్యను కోల్పోయితివి. ఇక్కడ కాయకసరులు తిని బ్రతుకక వీరులైన రాక్షసులతో శత్రుత్వమును పూనుట తగునా?

**ఆ.వె. నలువకైనఁ గన్గొనఁగ రాక టక్కరి**
**వగుచు జోగి తెగలయందె డాఁగి**
**కొలము గొనము రూపు గలుగకయుండు నీ**
**కిట్టి రాచచిన్నె లేల యిపుడు? 257**

నలువకైనన్ = బ్రహ్మకయినను, కన్గొనగ రాక = కన్పింపక, టక్కరివి అగుచు = మోసగాడి వగుచు, జోగి తెగలయందె = మునుల మధ్యయందే, డాగి = దాగుకొని, కొలము = కులము, గొనము = గుణము, రూపు = ఆకారము, కలుకగయుండు = లేనట్టి, నీకు ఇట్టి = నీకు ఈ విధమైన, రాచచిన్నెలు = క్షత్రియ శౌర్యములు, ఇపుడు ఏల = ఇప్పుడెందుకు?

**తా :** బ్రహ్మకైనా కన్పింపక మోసగాడివై మునుల మధ్యయందే దాగి కులము, గుణము, ఆకారము లేని నీకు ఈ విధమైన క్షత్రియ శౌర్యములు ఇప్పుడు ఎందులకు?

**కం. మా తండ్రి కతన మానిసి**
**వైతివిగా కూరుఁ బేరు నంతకుమును నీ**
**కేతటిఁ గలదు జగంబున?**
**నీ తెఱఁ గెవ్వం డెఱుంగు? నిక్కము సెపుమా! 258**

మా తండ్రికతన = మా తండ్రికారణముగా, మానిసివి ఐతివిగాక = మనుజునిగా గుర్తింపు పొందేవు కాని, ఊరున్ పేరున్, అంతకుమును = అంతకుముందు, నీకు, ఏ తటిన్ = ఏ సమయంలో, కలదు జగంబున = లోకంలో ఉంది?, నీ తెఱగు = నీ పద్ధతి, ఎవ్వండు ఎఱుంగు = ఎవ్వడు తెలుసుకొనగలడు?, నిక్కము = సత్యమును, చెపుమా = చెప్పుమా!

**తా :** మా తండ్రి కారణంగా మనుజునిగా గుర్తింపు పొందేవు కాని అంతకుముందు నీకు ఊరు, పేరు ఏ లోకంలో ఉంది? నీ పద్ధతి ఎవడికి తెలుసు? నిజం చెప్పు.

**కం. నీ వారమనుచు నమ్మిక**
**తో వాలెము గొలుచువారి దొసఁగుల పాలం**
**బోవిడిచి నిరాబారులఁ**
**గావించు చెనంటి వీవెకద పరికింపన్ 259**

నీ వారము అనుచు = నీ భక్తులమనుచు, నమ్మికతో = విశ్వాసముతో, వాలెము = ఎల్లప్పుడును, కొలుచువారి = సేవించువారి, దొసగుల పాలన్ పోవిడిచి = దోషముల విషయమున విడిచిపెట్టి, నిరాబారులన్ = జడదారులను, కావించు = చేసేటటువంటి, చెనంటివి = నీచుడవు, పరికింపన్ = పరిశీలింపగా, ఈవెకద = నీవేకదా!

**తా :** నీ భక్తులమని విశ్వాసముతో ఎల్లప్పుడు సేవించేవారి దోషములను విడిచిపెట్టి జడదారులను చేసేటటువంటి నీచుడవు పరిశీలిస్తే నువ్వేకదా!

**సీ. కడలి సొచ్చినఁ గొండ యడుగున డాఁగిన**
**నేలలోఁ దూఱిన నెఱియుఁ గడచి**
**వేసమూనినఁ దక్కు వెలయఁ జే సాపినఁ**
**బుడమి యెల్లను డిగ్గ విడిచి చనిన**
**నడవులఁ జేరిన విడువక నాఁగలిఁ**
**బట్టిన మ్రాని లోపల నిఱికినఁ**
**దట్టువ నెక్కినఁ దద్దయు వీఁగిన**
**మఱియుఁ బల్రూపుల వఱలుచున్నఁ**

**తే.గీ. దలఁపు నీయందె నిలిపి నిచ్చలును వెదకు**
**చుందుఁగాక జుణింగి నిన్నెందునైనఁ**
**బోవనిత్తునె? వినుము నా పొంతనింక**
**సాగనేరవు సుమ్ము నీ యాగడములు 260**

కడలి = సముద్రమును, చొచ్చినన్ = ప్రవేశించినను (మత్స్యావతారం), కొండ అడుగున, డాగిన = దాగుకొనినను (కూర్మావతారము), నేలలో = భూమియందు, దూఱిన = ప్రవేశించినను (వరాహావతారము), నెఱియున్ కడచి = అతితెలివిని ప్రదర్శించి, వేసము ఊనినన్ = వేషం వేసినా (నరసింహావతారము), టక్కు వెలయన్ = వంచన స్పష్టమగునట్లుగా, చే చాపినన్ = చేయి చాపినను (వామనావతారము), పుడమి ఎల్లను = భూమి అంతయును, డిగ్గ విడిచి = వదలి పెట్టి, చనినన్ = వెళ్ళిపోయినను (పరశురామావతారము), అడవులన్ చేరిన = అరణ్యములందు ప్రవేశించినను (రామావతారము), విడువక = వదలక, నాగలిన్ పట్టినన్ = హలమును ధరించినను (బలరామావతారము), మ్రాని లోపలన్ ఇఱికినన్ = చెట్టు లోపల ఇరుక్కొనినను (బుద్ధావతారము), తట్టువన్ = గుఱ్ఱమును, ఎక్కినన్ = అధిరోహించినను (కల్కి అవతారము), తద్దయు = మిక్కిలి, వీగిన = ఉత్సాహముతో, మఱియున్ = ఇంకను, బల్రూపుల = అనేక రూపములతో, వఱలుచున్నన్

= వర్తించుచున్నను, తలపు నీయందె = భావమును నీయందే, నిలిపి = ఉంచి, నిచ్చలును = నిత్యమును, వెదకుచుందున్ కాక = వెదకుతూంటాను కాని, జుణింగి = తప్పించుకొని, నిన్నెందునైన = నిన్ను ఎక్కడికైనను, పోవనిత్తునె = పోనిత్తునా? వినుము, ఇంక, నా పొంతన్ = నా దగ్గర, నీ ఆగడములు = నీ దుర్మార్గములు, సాగనేరవు సుమ్ము = సాగవుసుమా!

**తా :** సముద్రమున ప్రవేశించినా, పర్వతము క్రింద దాగినా, భూమిలో ప్రవేశించినా, అతితెలివి ప్రదర్శించి వేషం వేసినా, వంచనతో చెయి చాపినా, భూమి వదలి వెళ్ళిపోయినా, అడవుల్లో ప్రవేశించినా, నాగలి పట్టినా, చెట్టులోపల ఇరుక్కొన్నా, గుల్మము నధిరోహించినా,ఇంక ను అనేక రూపములలో వర్తించినా తలపు నీయందే నిలిపి నిత్యము వెదుకుతూంటాను కాని నిన్ను ఎక్కడికైనా పోనిత్తునా? విను. ఇంక నా దగ్గర నీ దుర్మార్గములు సాగవుసుమా!

**తే.గీ.** **అనిన రాముఁడు వానిపై నలిగి యోరి!**
**పాలసుఁడ! కాన కూరక బవరమునకుఁ**
**దొడరుదువుగాక కడు రిత్త నుడువులేల?**
**యనుచు విల్గొన లక్ష్మణుం డడ్డు దగిలి** **261**

అనినన్, రాముడు, వానిపైన్, అలిగి, ఓరి!, పాలసుడ = దుర్మార్గుడా!, కానక = గర్వముచే కళ్ళు కనిపించక, ఊరక = వ్యర్థముగా, బవరమునకు = యుద్ధమునకు, తొడరుదువు కాక = సిద్ధపడుతున్నావు కాని, కడు = ఎక్కువగా, రిత్త = వ్యర్థమైన, నుడువులు ఏల = మాటలు ఎందులకు?, అనుచు, విల్ గొన = విల్లు చేపట్టగా, లక్ష్మణుండు, అడ్డు తగిలి = అడ్డుపడి.

**తా :** అనగా రాముడు వానిపై అలిగి 'ఓరి! దుర్మార్గుడా! గర్వముచే కళ్ళు కనిపించక వ్యర్థముగా యుద్ధమునకు సిద్ధపడుతున్నావు కాని వ్యర్థమైన మాటలు ఎందులకు?' అని విల్లు చేపట్టగా లక్ష్మణుడు అడ్డుతగిలి.

**కం.** **ఆ సోఁకు జోదుఁ బైకొని**
**రోసంబున వింటినారి మ్రోయించి కడున్**
**వాసి లకోరులు బడిబడి**
**నేసి కలంచుటయు వాఁడు హెచ్చగు కినుకన్** **262**

ఆ సోకుజోదున్ = ఆ రాక్షస యోధుని, పైకొని = పైన పడి, రోసంబున = కోపముతో, వింటి నారి, మ్రోయించి, కడున్ = మిక్కిలి, వాసి = ప్రసిద్ధమైన, లకోరులు = బాణములను, బడిబడి = వెంటవెంటనే, ఏసి = వేసి, కలంచుటయు = కలతనొందించుటయును, వాడు = ఆ రాక్షసుడు, హెచ్చగు కినుకన్ = అధికమైన కోపముతో –

**తా :** ఆ రాక్షస యోధుని పైన పడి కోపముతో వింటినారి మ్రోయించి మంచి బాణములను వెంటవెంటనే వేసి కలతపెట్టగా వాడు కోపముతో –

**తే.గీ.** **పెక్కు నెఱ తూపులా రాచబిరుదు మీఁద**
**వ్రేయ నతఁడవి యర తొగవిందు ములికి**

**గములఁ దునుమాడి వైచిన గనలి రక్క**
**సుండు వెండియుఁ గఱుకు తూపొండు సిమ్మె 263**

పెక్కు నెఱ తూపులు = పలు వాడి బాణములు, ఆ రాచబిరుదు మీద = ఆ రాజశ్రేష్ఠుడగు లక్ష్మణుని మీద, వ్రేయ = వేయగా, అతడు = ఆ లక్ష్మణుడు, అవి = వానిని, అర తొగవిందు ములికిగములన్ = అర్ధచంద్రాకారపు బాణసమూహముతో, దునుమాడి వైచినన్ = విరుగకొట్టి పడవేయగా, కనలి = కోపించి, రక్కసుండు = రాక్షసుడు, వెండియున్ = తిరిగి, కఱుకు తూపు = కఠినమైన బాణము, ఒండు సిమ్మె = ఒకటి విసరెను.

**తా :** పలు వాడి బాణములు ఆ లక్ష్మణునిమీద వేయగా ఆ లక్ష్మణుడు వానిని అర్ధచంద్రాకార బాణములతో విరుగకొట్టగా కోపించి ఆ రాక్షసుడు తిరిగి కఠినమైన బాణములు విసరెను.

**సీ. చిమ్మిన నక్కోల యిమ్ములఁ జని పెను**
**ఱొమ్ము గాడుటయు రా తమ్మిదాయ**
**తమ్ముఁ డొకించుక సొమ్మవోయి కరంబు**
**నుమ్మలించుచు లేచి యమ్మెఱుంగు**
**టమ్ము గ్రొన్నెత్తురు ల్నెమ్మెయిఁ బొరిఁబొరిఁ**
**గ్రమ్మగఁ బెటికి బీరమ్ము మెఱయఁ**
**దెమ్మెర చెలి చిల్కు నెమ్మది నా రేయి**
**ద్రిమ్మరి బొబ్బ మెకమ్ముపైఁ ది**

**తే.గీ. రమ్ముగా నేయ వాఁడు గన్బొమ్మలదరి**
**ముమ్మరపు టల్కతోఁ జిల్వ సొమ్ము ములికి**
**గ్రమ్మఱ నిగుడ్ప నత్తూపు లెమ్మె నాక**
**సమ్మునందంటి పెనఁగె జగమ్ము బెగడ 264**

చిమ్మినన్ = విసరగా, ఆ కోల = ఆ బాణము, ఇమ్ములన్ = చక్కగా, చని = వెళ్ళి, పెను ఱొమ్ము = విశాలమైన ఱొమ్మున, గాడుటయు = గుచ్చుకొనుటయు, రాతమ్మి దాయ (పద్మమునకు శత్రువు) తమ్ముడు = రాజ చంద్రుని తమ్ముడు (లక్ష్మణుడు), ఒకించుక = కొంచెముగ, సొమ్మవోయి = సొమ్మసిల్లి, కరంబు = మిక్కిలి, ఉమ్మలించుచు = బాధ నొందుచు, లేచి, ఆ మెఱుంగు అమ్ము = ఆ రాక్షసుడు ప్రయోగించిన వాడియైన బాణమున, క్రొన్నెత్తురులు = వేడి రక్తము, నెమ్మెయిన్ = దేహమంతయు, పొరిపొరి = క్రమముగా, క్రమ్మగ = వ్యాపింపగా, పెటికి = పీకివైచి, బీరమ్ము మెఱయ = పరాక్రమము అతిశయింపగా, తెమ్మెర చెలి చిల్కు = ఆగ్నేయాస్త్రమును, నెమ్మదిన్ = నిండు మనసుతో, ఆ రేయి త్రిమ్మరి బొబ్బ మెకమ్ముపై = ఆ రాక్షస సింహముపై (అతికాయునిపై), తిరమ్ముగాన్ ఏయ = సూటిగా వేయగా, వాడు = ఆ అతికాయుడు, కన్బొమ్మలు అదరి, ముమ్మరపు = తీవ్రమైన, అల్కతోన్ = కోపముతో, చిల్వ సొమ్ము ములికి = నాగుల సొమ్మైన నాగాస్త్రమును, క్రమ్మఱ నిగుడ్పన్ = శీఘ్రముగా ప్రయోగింపగా, ఆ తూపులు = ఆ బాణములు, ఎమ్మెన్ =

సుందరముగా, అకసమ్మునందు అంటి = ఆకాశమున తగుల్కొని, జగమ్ము బెగడ = లోకము భయమందగా, పెనగె = పోరాడినవి.

**తా :** విసరగా, ఆ బాణములు వెళ్ళి విశాలమైన ఱొమ్మున గుచ్చుకొనగా లక్ష్మణుడు కొంచెము సొమ్మసిలి బాధతో లేచి ఆ రాక్షసుని బాణమున వేడి రక్తము దేహమంతా వ్యాపింపగా పీకివైచి పరాక్రమముతో వాయవ్యాస్త్రమును అతికాయునిపై సూటిగా వేయగా, ఆ అతికాయుడు కోపముతో నాగాస్త్రమును ప్రయోగించగా ఆ బాణములు ఆకాశమున తగుల్కొని లోకము భయమందగా పోరాడినవి.

**తే.గీ.** **అత్తెఱంగునఁ బెనఁగి యా యమ్ముదోయి**
**బూదియై రాలుటయు సోఁకు జోదు గుదియ**
**తాల్పు తూపేసె నేసిన దాని నపుడె**
**రా కొమరుఁ డీఁద తూపేసి క్రమ్మఱించె** **265**

ఆ తెఱంగునన్ = ఆ విధముగా, ఆ అమ్ముదోయి = ఆ బాణముల జంట, పెనగి = పోరాడి, బూదియై = బూడిదయై, రాలుటయు, సోకు జోదు = రాక్షసుడు, గుదియతాల్పు తూపు = వారుణాస్త్రమును, ఏసె = వేసెను, ఏసిన = వేయగా, దానిని, అపుడె = వెంటనే, రాకొమరుడు = లక్ష్మణుడు, ఈద తూపు ఏసి = వాయవ్యాస్త్రమును వేసి, దానిన్ = దానిని, అపుడె = అప్పుడే, క్రమ్మఱించె = మరలించెను.

**తా :** ఆ విధముగా రెండు బాణములు పోరాడి బూడిదై రాలగా రాక్షసుడు వారుణాస్త్రమును వేసెను. వేయగా దానిని వెంటనే లక్ష్మణుడు వాయవ్యాస్త్రమున దానిని మరలించెను.

**కం.** **మఱియుఁ జలంబున నిరువురు**
**గుఱియొప్పగఁ బెక్కు వాలుగోలలు బైపై**
**బఱపుచు నేడ్తెరఁ బోరెడు**
**తఱి నెదలోఁ గినిసి రాము తమ్ముఁడు గడిమిన్** **266**

మఱియు = ఇంకను, చలంబున = పౌరుషముతో, ఇరువురు = ఆ లక్ష్మణ,అతికాయులు, గుఱియొప్పగన్ = లక్ష్యము చేసుకొని, పెక్కు వాలుగోలలు = పెక్కు బాణములు, పైపై పఱపుచు = ఒకరిమీద కొకరు వేసుకొనుచు, ఏడ్తెరన్ = అతిశయముతో, పోరెడు తఱి = పోరాడుచుండగా, ఎదలో = మనసున, కినిసి = కోపించి, రాము తమ్ముడు = లక్ష్మణుడు, కడిమిన్ = పరాక్రమముతో –

**తా :** ఇంకనూ పౌరుషముతో ఆ లక్ష్మణ, అతికాయులు లక్ష్యము చేసుకొని పలు బాణములు పైపై ఒకరిపై ఒకరు వేసుకొనుచు అతిశయముతో పోరాడుచుండగా మదిలో కోపించి లక్ష్మణుడు పరాక్రమముతో –

**సీ.** **నలువ తూపరివోసి బలిమిమై నద్దోస**
**కారి రక్కసు మేలిగాని మీఁద**
**నేసిన నది మంట లెగయుచు మిడుఁగురుల్**
**సెదర నొక్కుమ్మడిఁ గదియవచ్చు**

**చన్నఁ గన్గొని వాఁడు గ్రన్ననం దూలంగ**
**ద్రుడ్డుల బటువు కైదువుల నడిద**
**ముల మరల్చినఁ బోక మొనసి నాడెంపు బొ**
**మిడికముతోఁ గూడఁ బుడమిఁ బడఁగ**

**తే.గీ. వాని తలఁ ద్రుంచెఁ ద్రుంచినఁ గోన మనికి**
**బిరుదు లందఱు బొబ్బలు పెట్టుకొనుచుఁ**
**జెలఁగి యాడిరి మింట జేజేలు రాచ**
**పట్టిఁ దద్దయు నగ్గించి పల్కి రంత** **267**

నలువ తూపు = బ్రహ్మాస్త్రమును, అరివోసి = సంధించి, బలిమిమైన్ = శక్తికొద్దీ, ఆ దోసకారి రక్కసు మేలిగాని మీదన్ = ఆ పాపపు రాక్షసులలో శ్రేష్ఠుడైన అతికాయుని మీద, ఏసిన = వేయగా, అది = ఆ బ్రహ్మాస్త్రము, మంటలు ఎగయుచు, మిడుగురుల్ చెదర = నిప్పు కణములు చెదరగా, ఒక్కుమ్మడిన్ = ఒక్కసారిగా, కదియవచ్చుచున్నన్ = చేరువగుచుండగా, కన్గొని = చూచి, వాడు = ఆ అతికాయుడు, క్రన్ననన్ = తొందరగా, తూలంగన్ = ఆ అస్త్రము పడిపోవుటకు, ద్రుడ్డులన్ = పెద్దపెద్ద బండలను, పటువు = నేర్పరియై, కైదువులన్ = ఆయుధములను, అడిదముల = కత్తులతోను, మరల్చినన్ = మరలింప చూచినను, పోక = మరలక, మొనసి = పూనుకొని, నాడెంపు = శ్రేష్ఠమైన, బొమిడికముతోన్ కూడన్ = కిరీటముతో సహా, పుడమిన్ పడగ = నేలపై పడగా, వాని = ఆ అతికాయునియొక్క, తలన్ = తలను, త్రుంచెన్ = ఖండించెను, త్రుంచిన = అలా ఖండించగా, కోన మనికి బిరుదులు = వానరులు, అందరు, బొబ్బలు పెట్టుకొనుచు, చెలగి = విజృంభించి, ఆడిరి, మింట = ఆకసమున, జేజేలు = దేవతలు, రాచపట్టిన్ = లక్ష్మణుని, తద్దయు = మిక్కిలి, అగ్గించి పల్కిరి = స్తుతించిరి, అంత = ఆ పైన –

**తా :** బ్రహ్మాస్త్రము సంధించి శక్తికొద్దీ ఆ దోషకారిమీద వేయగా, అది మంటలు ఎగయుచు చేరువగుచుండగా చూచి అతికాయుడు పెద్ద పెద్ద బండలను, కైదువలను, అడిదములను మరలింప చూచినను మరలక కిరీటము నేలపై పడగా ఆ అతికాయుని తలను ఖండించెను. అలా ఖండించగా వానరులు బొబ్బలు పెట్టుకొనుచు ఆడిరి, ఆకసమున దేవతలు లక్ష్మణుని స్తుతించిరి. ఆపైన –

**తే.గీ. కలనఁ బొలియక చిక్కిన పొలసుదిండి**
**బంట్లు గొందఱు నెవ్వడిఁ బఱచి దీవి**
**ఱేని కత్తెఱఁ గెఱిఁగింప మానరాని**
**వ్రంతఁ గొడుకులఁ దలఁచి లో వగచుచుండె** **268**

కలనన్ = యుద్ధమున, పొలియక = చావక, చిక్కిన = మిగిలిన, పొలసుతిండి బంట్లు = రాక్షస సైనికులు, కొందఱు, నెవ్వడిన్ = శీఘ్రముగా, పఱచి = పరుగిడి, దీవి ఱేనికి = రావణునకు, అత్తెఱగు = ఆ విషయమును, ఎఱిగింప = తెలుపగా, మానరాని వ్రంతన్ = ఆగని దుఃఖముతో,

కొడుకులన్ తలచి = కొడుకులను తలచుకొని, లో వగచుచుండె = తనలో దుఃఖించుచుండెను.

**తా :** యుద్ధమున చావక మిగిలిన రాక్షస సైనికులు వెంటనే పరుగిడి రావణునకు ఆ విషయమును తెలుపగా ఆగని దుఃఖముతో కొడుకులను తలచుకొని లో వగచుచుండెను.

**ఆ.వె.** **అప్పు డింద్రజితుఁడు నబ్బ డెందములోన**
**వగపు మాంచి యగ్గివలన బమ్మ**
**తూపుఁ గాంచి సరగ దురమున కరుదెంచి**
**చదలనంటి కోఁతి పదుపుఁ గూల్చి** **269**

అప్పుడు, ఇంద్రజితుండున్, అబ్బ డెందములోన = తండ్రి మనసులోని, వగపు మాంచి = బాధను పోగొట్టి, అగ్గివలన = హోమమునుండి, బమ్మ తూపున్ = బ్రహ్మాస్త్రమును, కాంచి = పొంది, సరగ = వెంటనే, దురమునకు = యుద్ధమునకు, అరుదెంచి = వచ్చి, చదలనంటి = ఆకాశమున దాగి, కోతి పదువున్ కూల్చి = వానర సమూహమును సంహరించి.

**తా :** అపుడు ఇంద్రజిత్తు తండ్రి మనసులోని బాధను తెలుసుకొని హోమమునుండి బ్రహ్మాస్త్రమును పొంది వెంటనే యుద్ధమునకు వచ్చి ఆకాశమున దాగి వానరులను సంహరించి.

**కం.** **బలు ములుకు లేసి కాళ్ళుం**
**దలలుం జేతులును దొడలు నడుములుఁ బెను తి**
**ట్టలుగాఁ దున్ముచుఁ బలువురఁ**
**బొలియించి కడింది లావు పొడమఁగ మఱియున్** **270**

బలు ములుకులు = సమర్థములైన బాణములను, ఏసి = ప్రయోగించి, కాళ్ళున్, తలలున్, చేతులును, తొడలు, నడుములున్, పెను తిట్టలుగాన్ = పెద్ద ప్రోగులుగా, తున్ముచున్ = ఖండించుచు, పలువురన్ = చాలమందిని, పొలియించి = చంపి, కడింది = పరాక్రమము, లావు = శక్తి, పొడమగ = కలుగగా, మఱియున్ = ఇంకను –

**తా :** సమర్థములైన బాణములు వేసి కాళ్ళు, తలలు, చేతులు, తొడలు, నడుములు పెద్ద పోగులుగా ఖండించుచు చాలమందిని చంపి పరాక్రమము, శక్తి కలుగగా ఇంకను –

**సీ.** **క్రొవ్వాడి చికిలి ముల్కులు వింటఁ దొడిగి జ్యో**
**తిర్ముఖు నారింట ద్వివిదు మూఁట**
**నెలుఁగులదొరఁ బదియేనింట నలుని నీ**
**రైదింట వేల్పురాయని మనుమనిఁ**
**బ్రొద్దుచూలిని వృషభుని నీలు గజు ముప్ప**
**దేసింటఁ బనసుని నెనిమిదింట**
**మైందు నేడిట గంధమాదను రెండు తొ**
**మ్మిదులఁ దక్కిన కొమ్మ మెకపు బంట్ల**

**తే.గీ.** **నెల్ల నొండొంట నేలపైఁ ద్రెళ్ళనేసి**
**నలువ తూపున రాచ జాబిలులఁ దద్దఁ**
**సొమ్మఁగొనఁ జేసి బిట్టార్చి నెమ్మితోడ**
**లంక కరుదెంచి తండ్రి కెలమి యొనర్చె** **271**

క్రొత్త వాడి = కొత్త పదునుగల, చికిలి ముల్కులు = వాడియైన బాణములు, వింటన్ తొడిగి = సంధించి, ఎలుగుల దొరన్ = జాంబవంతుని, ఈరైదింటన్ = పదితోను, వేల్పురాయని మనుమని = అంగదుని, ప్రొద్దు చూలిని = సుగ్రీవుని, కొమ్మ మెకపు బంట్ల = వానర వీరులను, ఎల్లన్ = అందరిని, ఒండు ఒంట = ఒక్కొక్క బాణముతో, నేలపైన్, త్రెళ్ళన్ ఏసి = పడగొట్టి, నలువ తూపున = బ్రహ్మాస్త్రముతో, రాచ జాబిలులన్ = రాజచంద్రులను, తద్దన్ = పూర్తిగా, సొమ్మగొన చేసి = సొమ్మసిల్లేలా చేసి, బిట్టు ఆర్చి = సింహనాదముచేసి, నెమ్మితోడ = సంతోషముతో, లంకకు అరుదెంచి = లంకకు వచ్చి, తండ్రికి, ఎలమి ఒనర్చె = సంతసము కలిగించెను.

**తా :** పదునుగల బాణములు సంధించి జ్యోతిర్ముఖుని ఆరు బాణములతోను, ద్వివిదుని మూడు శరములతో, జాంబవంతుని పదునైదు బాణములతో, నలుని పదిబాణములతోను, అంగదుని, సుగ్రీవుని, వృషభుని, నీలుని, గజుని ఒక్కొక్కరిని ముప్పదేసి బాణములతోను, పనసుని ఎనిమిది అమ్ములతోను, మైందుని ఏడు తూపులతోను, గంధమాదనుని పదు నెనిమిది కోలలతోను, మిగిలిన వానర వీరులను అందరిని ఒక్కొక్కరిని ఒక్కొక్క బాణముతో నేలపై పడగొట్టి బ్రహ్మాస్త్రమును ప్రయోగించి రామలక్ష్మణులను సొమ్మసిల చేసి సింహనాదము చేసి సంతోషముతో లంకకు వచ్చి తండ్రికి సంతసము కలిగించెను.

**తే.గీ.** **అప్పు డెలుఁగులరాయని యానతిఁ గొని**
**గాడ్పు కొమరుండు మందుల గట్టు తెచ్చి**
**కోఁతి మూకల మనిపె రాకొదమ సింగ**
**ములును వేజాముగా సొమ్మ దెలిసిరంత** **272**

అప్పుడు, ఎలుగుల రాయని = జాంబవంతుని, ఆనతిన్ గొని = మాటను తీసుకొని, గాడ్పు కొమరుండు = హనుమ, మందుల గట్టు తెచ్చి = సంజీవి పర్వతమును తెచ్చి, కోతి మూకల, మనిపె = బ్రతికించెను. రాకొదమ సింగములును = రామ లక్ష్మణులును, వేజాముగా = వేకువ సమయముగా, సొమ్మ తెలిసిరి = స్పృహలోనికి వచ్చిరి, అంత –

**తా :** అపుడు జాంబవంతుని మాటను తీసుకొని హనుమ సంజీవి పర్వతము తెచ్చి కోతి మూకలను బ్రతికించెను. రామలక్ష్మణులును వేకువ సమయముగా స్పృహలోనికి వచ్చిరి.

**కం.** **చెయువులసాకిరి కుట్టిఁడు**
**సెయిదోయి మొగిడ్చి రాచసింగముతోడన్**
**దయివారు వేడ్క నిట్టుల**
**నియె మలద్రిమ్మరి కొలంపు నెల లలరారన్** **273**

చెయువులసాకిరి కుట్టుడు = కర్మసాక్షి సూర్యుని కుమారుడు (సుగ్రీవుడు), చెయిదోయి = రెండు చేతులను, మొగిడ్చి = జోడించి, రాచసింగముతోడన్ = రామునితో, దయివారు వేడ్కన్ = మిక్కిలి వేడుకతో, మల త్రిమ్మరి కొలంపు నెలలు = వానర వంశ స్థానీయులు, అలరారన్ = అక్కడ ఉండగా, ఇట్టులు అనియె = ఇట్లు పలికెను,

**తా :** సుగ్రీవుడు రెండు చేతులను జోడించి మిక్కిలి వేడుకతో వానరులు అక్కడ వుండగా రామునితో ఇట్లు పలికెను

**చం.** **ఒడయడ! నాదు విన్నపము లొప్పుగ నిప్పు డెదం దలంపుమీ!**
**తడయక కుంభకర్ణుఁడు మొదల్గల నాడెపు జోదులందఱున్**
**మడియుటఁ జేసి రావణుఁడు మార్కొని యింక దురంబొనర్పఁగా**
**వెడలఁడు లంకఁ గాల్చుటకు వే ననుపందగుఁ గోఁతి మూఁకలన్ 274**

ఒడయడ = ప్రభూ!, నాదు విన్నపములు = నా మనవిని, ఒప్పుగన్ = చక్కగా, ఇప్పుడు, ఎదన్, తడయక = ఆలసింపక, తలంపుమీ!, కుంభకర్ణుడు, మొదలు కల, నాడెపు జోదులు అందఱున్, మడియుట చేసి = చనిపోవుటచే, రావణుడు, ఇంక, మార్కొని = ఎదిరించి, దురంబు ఒనర్పగా = యుద్ధము చేయుటకు, వెడలడు = బయలుదేరడు, (కావున) లంకన్ కాల్చుటకు, వే = శీఘ్రముగా, కోతి మూకలన్, అనుపందగున్ = పంపుట తగినది,

**తా :** ప్రభూ! నా మనవిని చక్కగా ఇప్పుడు మనసున తలంపుమా! కుంభకర్ణుడు మొదలైన వీరులు అందఱును చనిపోవుటచే రావణుడు ఇంక ఎదిరించి యుద్ధముచేయుటకు బయలుదేరును కావున లంకను కాల్చుటకు కోతిమూకలను పంపుట తగినది.

**ఆ.వె.** **అనిన నట్ల సేయుమని రాముఁ డానతి**
**యిడిన వేఁడి వేల్పు కొడుకు ప్రొద్దు**
**క్రుంకనిచ్చి యెల్ల కొమ్మ మెకంబులఁ**
**గడిఁది మీఱ లంకఁ గాల్పఁ బనిచె 275**

అనినన్ = అనగా, అట్ల చేయుము అని = అలాగే చేయమని, రాముడు ఆనతి ఇడిన, వేడి వేల్పు కొడుకు = సుగ్రీవుడు, ప్రొద్దు క్రుంకనిచ్చి = రాత్రి పడనిచ్చి, ఎల్ల కొమ్మ మెకంబులన్ = వానరులందరను, కడిది మీఱన్ = మిక్కిలి ధైర్యముతో, లంక కాల్పన్, పనిచె = పంపెను.

**తా :** అనగా అలాగే చేయుమని రాముడు ఆనతిచ్చిన సుగ్రీవుడు రాత్రి పడనిచ్చి వానరు లందరను సాహసముతో లంకను కాల్చ పంపెను.

**ఉ.** **అంచిన వార లొక్క మొగి నార్పుల నెల్ల కడ ల్వడంకఁగాఁ**
**గొంచక చేతులం గొఱవి కోలలు పట్టుక యేఁగి వే పటా**
**పంచలుగాఁగఁ బెన్గవని పట్టులఁ గావలియున్న వాంద్రఁ బో**
**డంచి కలంచి ప్రో లటు గడంకఁ దలిర్పఁగఁ జొచ్చి వేడిమిన్ 276**

అంచినన్ = పంపగా, వారలు, ఒక్క మొగిన్, ఆర్పులన్, ఎల్ల కడలు = అన్ని దిక్కులు, వడంకగాన్, కొంచక = సందేహించక, చేతులన్, కొఱవి కోలలు పట్టుక = కాగడాలు పట్టుకొని, ఏగి = వెళ్ళి, వే = వేగముగా, పటాపంచలు కాగన్, పెను గవని పట్టులన్ = కోట సింహద్వారములయందు, కావలి ఉన్నవాం(డన్, పో = పారిపోయేట ట్లుగా, డంచి = దంచి, కలంచి = బాధించి, ప్రోలు = లంకా నగరమును, అటు = ఆ విధముగా, కడంకన్ తలిర్పగన్ = ప్రయత్నము ఫలించునట్లుగా, వేడిమిన్ = కాగడాలతో, చొచ్చి = ప్రవేశించి,

**తా :** పంపగా ఆ వానరులు ఒక్క సారిగా అరుపులు అన్ని దిక్కులు అదరగా సందేహించక చేతులతో కాగడాలు పట్టుకొని వెళ్ళి పటాపంచలు కాగా గవనులను కావలివాం(డను పారిపోయేట్లుగా దంచి బాధించి లంకానగరమును ప్రవేశించి.

**కం.** **అగపడ్డ రేయి ద్రిమ్మరి**
**తెగలం బోనీక పట్టి తెగటార్చుచు ము**
**జ్జగములకుం దిగులొదవఁగ**
**నొగి నెక్కుడు మెకపు గొంగ యులివు లొసగుచున్** **277**

అగపడ్డ, రేయి త్రిమ్మరి తెగలన్ = రాక్షస సమూహములను, పోనీక = తప్పించుకోనీక, తెగటార్చుచు = చంపుచు, ముజ్జగములకున్ = మూడు లోకములకు, దిగులు ఒదవగన్ = భయము కలుగునట్లుగా, ఒగిన్ = వరుసగా, ఎక్కుడు మెకపు గొంగ ఉలివులు = ఏనుగునకు శత్రువు సింహము గర్జనలు (సింహనాదములు), ఒసగుచున్ = చేయుచు,

**తా :** కంటపడిన రాక్షసులను తప్పించుకుపోనీక చంపుచు మూడు లోకములకు భయము కలుగునట్లుగా వరుసగా సింహనాదములు చేయుచూ!

**తే.గీ.** **వాడవాడలఁ గ్రమ్ముక మేడలందు**
**మొసలలయందు నుగ్రాణములను మిద్దె**
**టిండ్లఁ జవికలయం దెల్ల నింగలంపు**
**కొఱవు లడరించి వెస రవుల్ కొల్పుటయును** **278**

వాడవాడలన్, క్రమ్ముక = ప్రవేశించి, మేడలందు, మొసలలయందు = మొగసాలలయందు, ఉగ్రాణములను = కోష్ఠములందు, మిద్దె ఇండ్లన్ = మిద్దెలయందు, చవికలయందు = మంటపము లందు, ఎల్లన్ = అంతటను, ఇంగలంపు కొఱవులు = కాగడాలు, అడరించి = ముట్టించి, వెసన్ = శీఘ్రముగా, రవుల్ కొల్పుటయును = జ్వాలలు రగిలించుటయును,

**తా :** వాడవాడలను ప్రవేశించి మేడలందు, మొగసాలలందు, కోష్ఠములందు, మిద్దెలందు, మంటపము లందు, అంతటను కాగడాలు ముట్టించి శీఘ్రముగా జ్వాలలు రగిలించగా –

**కం.** **పొగయును మంటలు సదలున**
**కెగయఁగ మిడుఁగురులు సెదర నేడ్తెర నపుడా**
**దుగ మొగముల వే ల్పొగు**
**బ్బుగ దరికొని కాల్పఁ దొడఁగెఁ బ్రోలెల్లెడలన్** **279**

పొగయును, మంటలు, చదలునకు = ఆకసమునకు, ఎగయగ = వ్యాపింపగా, మిడుగురులు = నిప్పురవ్వలు, చెదర = చెదరగా, ఏడ్తెరన్ = అతిశయముతో, అపుడు, ఆ దుగమొగముల వేల్పు = ఆ అగ్ని, ఆగుబ్బగ = అధికముగా, దరికొని = వ్యాపించి, ప్రోలు ఎల్లెడలన్ = నగరములో అంతటను, కాల్పన్ తొడగెన్ = కాల్చసాగెను.

**తా :** పొగ, మంటలు ఆకాశమునకు వ్యాపింపగా నిప్పురవ్వలు చెదరగా అతిశయముతో అపుడు ఆ అగ్ని అధికముగా వ్యాపించి నగరమునంతటను కాల్చసాగెను.

**సీ. కొలుచులు మానికంబులు మంచిగందము**
**లోకలుఁ జమురులుఁ గుందనంబు**
**వెండియుఁ గైదువు పిండులు పల్లకీ**
**లందలంబులు పైఁడి చందువాలు**
**గద్దియ లుయ్యెల ల్మిద్దియ ల్మేడలు**
**చప్పరంబులు మొగసాల లిండ్లు**
**తలుపులు గవని కట్టులు తెలె ల్చెంబులు**
**పక్కెర ల్తొడవులు నక్కునెలవు**
**తే.గీ. లేనుఁగుల పట్లు మొదలగు నెల్లవియును**
**మొగిసి సతనాలుకలు సాఁచి రగులఁ గొనుచు**
**దంటమోముల దేవర దనివి దీఱ**
**బుగులుకొని మెక్కెఁ దద్ద యబ్బురముగాఁగ** **280**

కొలుచులు = ధాన్యములును, మానికంబులు = మాణిక్యములును, మంచిగందములు, కోకలు, చమురులున్, కుందనంబు = బంగారమును, వెండియున్,కైదువు పిండులు = ఆయుధసమూహములును, పల్లకీలు, అందలంబులు = మేనాలు, పైడి చందువాలున్ = బంగారు మేలుకట్టులును, గద్దియల్ = సింహాసనములును, ఉయ్యెలల్, మిద్దియల్, మేడలు, చప్పరంబులు = గుడారములును, మొగసాలల ఇండ్లు = మండువా ఇళ్ళును, తలుపులు, గవని కట్టులు = ద్వారబంధములును, తెలెలు = భోజన పాత్రలు, చెంబులు, పక్కెరలు = కవచములు, తొడవులు = నగలు, నక్కు నెలవులు = రహస్య ప్రదేశములు, ఏనుగుల పట్లు = ఏనుగుల శాలలు, మొదలగున్ ఎల్లవియును, మొగిసి = పూనుకొని, సత నాలుకులు సాచి = సప్త జిహ్వాలు చాచి, రగుల కొనుచు = విజృంభించుచు, దంటమోముల దేవర = రెండు ముఖములుకల అగ్నిదేవుడు, తనివి తీఱ = తృప్తిగా, బుగులుకొని = వ్యాపించి, తద్దయు = మిక్కిలి, అబ్బురము కాగన్ = అద్భుతముగా, మెక్కెన్ = భుజించెను.

**తా :** కొలుచులు, మాణిక్యములు, మంచిగంధములు, వస్త్రములు, చమురులు, బంగారము, వెండి, కైదువులు, పల్లకీలు, మేనాలు, బంగరు మేలుకట్టులు, సింహాసనములు, ఉయ్యాలలు, మిద్దెలు, మేడలు, గుడారములు, మండువా ఇళ్ళు, తలుపులు, ద్వార బంధములు, భోజనపాత్రలు, చెంబులు, కవచములు, నగలు, రహస్య ప్రదేశములు, ఏనుగుశాలలు మొదలైనవన్నిటిని పూనుకొని అగ్ని సప్త జిహ్వాలు చాచి తృప్తిగా భుజించెను.

**సీ.** **అప్పుడు గడలేని యలజడిబడి తలల్**
**విడియాడ వడిఁ బర్వులిడెడువారుఁ**
**గూనల ముదుసళ్ళఁ గానక నెమకుచు**
**నగ్గి కగ్గంబయి గ్రమ్మగ్గువార**
**లిఁక నేమి సేయుద మెక్కడ కేఁగుద**
**మని చాల వగపుతో నడలువారు**
**ముంగిళ్ళ సందుల మూలలఁ గొందుల**
**నెడలేక మంటల నెనయువారు**

**తే.గీ.** **పొగలు సెగలును దమ్ము వే పొదవికొనిన**
**దట్టమగు చిచ్చు లోపలఁ దెట్టువలుగఁ**
**ద్రెళ్ళువారును రావణుఁ దిట్టువారు**
**నగుచు రక్కసు లిడుముల నడలి రొకట** **281**

అప్పుడు, కడలేని = అంతములేని, అలజడి పడి = కలతను పొంది, తలల్ విడియాడ = జుట్టు ముడులు విడిపోగా, వడిన్ = తొందరగా, పర్వులు ఇడెడువారును, కూనల = పిల్లలను, ముదుసళ్ళన్ = వృద్ధులను, కానక = కనబడక, నెమకుచు = వెదకుచు, అగ్గికి = అగ్నికి, అగ్గంబయి = చిక్కుకొని, గ్రమ్మగ్గువారలు = మాడిపోవువారు, ఇకన్ ఏమి చేయుదము, ఎక్కడకు ఏగుదము, అని చాల వగపుతో = చాల దుఃఖముతో, అడలువారు = ఆక్రోశించువారు, ముంగిళ్ళ, సందుల, మూలలన్, గొందులన్, ఎడలేక = అంతటను, మంటలన్ ఎనయువారు = మంటల బాధనందు వారు, పొగలు సెగలును, తమ్ము = తమను, వే పొవవికొనిన = వేగముగా చుట్టుముట్టగా, దట్టమగు, చిచ్చు లోపలన్ = మంటలలో, తెట్టువలుగన్ = గుంపులుగా, త్రెళ్ళువారును = మరణించువారును, రావణు తిట్టువారును, అగుచు, రక్కసులు, ఒకట = ఒక్కసారిగా, ఇడుముల = కష్టములతో, అడలిరి = దుఃఖించిరి.

**తా :** అపుడు అంతులేని కలతను పొంది జుట్టుముడులు విడిపోగా తొందరగా పర్వులు పెట్టెడివారు, పిల్లలను, వృద్ధులను కానక వెదకుచు అగ్నికి చిక్కి మాడిపోవువారు, ఇక ఏం చేస్తాం? ఎక్కడి కెళతాం? అని దుఃఖముతో ఆక్రోశించువారు, సందులు గొందులు అంతట మంటల బాధనందువారు, పొగలు, సెగలు చుట్టుముట్టగా మంటలలో గుంపులుగా మరణించువారు, రావణుని తిట్టువారు అగుచు రాక్షసులు ఒక్కసారిగా కష్టముల పాలై దుఃఖించిరి.

**ఆ.వె.** **అట్లు ప్రోలు గాల్చి యడవి ద్రిమ్మరు లెల్లఁ**
**గోట గవఁకులందుఁ గూడి సోఁకు**
**మగని నెచటఁ గన్న మడియించుచున్నచో**
**జంట పది బుజముల బంటు గినిసి** **282**

అట్లు, ప్రోలు కాల్చి = లంకానగరమును కాల్చి, అడవి త్రిమ్మరులు = వానరులు, ఎల్లన్ = అందరును, కోట గవకులందున్ = కోట ద్వారములందు, కూడి = చేరి, సోకు మగని = రాక్షసుని, ఎచట కన్న, మడియించు చున్నచో = చంపుచుండగా, జంట పది బుజముల బంటు = ఇరవై భుజములుకల రావణుడు, కినిసి = కోపించి –

**తా :** ఆ రీతిగా లంకను కాల్చి వానరులు అందరును కోట ద్వారములందు గుమికూడి యెదుట కనబడిన రాక్షసుని చంపుచుండగా రావణుడు కోపించి –

**తే.గీ.** **కుంభకర్ణుని కొడుకులఁ గుంభుఁడును ని**
**కుంభుఁడను వాండ్ర బిలిచి యా కోఁతి పదువుఁ**
**దునిమిరండని పనుప నత్తులువ తొంటి**
**వేల్పుఁ గొమరులు మగఁటిమి విప్పు మీఱ** **283**

కుంభకర్ణుని కొడుకులన్, కుంభుడును, నికుంభుడు అనువాండ్ర, పిలిచి, ఆ కోతి పదువున్ = ఆ వానర సమూహమును, దునిమి రండు అని, పనుప = పంపగా, ఆ తులువ తొంటివేల్పు కొమరులు = ఆ మూర్ఖ రాక్షస కుమారులు, మగటిమి = పౌరుషము, విప్పు మీఱ = మిక్కిలి పెరగగా –

**తా :** కుంభకర్ణుని కొడుకులను కుంభుడు, నికుంభులను పిలిచి ఆ వానరసమూహమును దునిమిరండని పంపగా ఆ మూర్ఖ రాక్షస కుమారులు పౌరుషముతో –

**కం.** **మీసలు దువ్వుచు నుడుగని**
**రోసంబునఁ దేరు లెక్కి ప్రోడలయిన రా**
**కాసి వజీరుల కొందఱ**
**బాసటగొని నల్దెఱఁగుల పౌజులు గొలువన్** **284**

మీసలు దువ్వుచు = మీసాలు దువ్వుతూ, ఉడుగని రోసంబున = తగ్గని కోపముతో, తేరులు ఎక్కి = రథముల నెక్కి, ప్రోడలయిన = వీరులయిన, రాకాసి వజీరుల కొందఱ = రాక్షస యోధులను కొందరిని, బాసట కొని = తోడుగా నుంచుకొని, నలు తెఱగుల = నాల్గు వైపుల, పౌజులు = సైన్యములు, కొలువన్ = సేవింపగా –

**తా :** మీసాలు దువ్వుతూ తగ్గని కోపముతో రథములెక్కి వీరులయిన రాక్షస యోధులు కొందరిని తోడుగానుంచుకొని నాల్గువైపుల సైన్యములు సేవింపగా –

**కం.** **ఓలిమెయిఁ దెల్లడాలు మె**
**కా లిఱ్ఱులమీఁద నడరు కైవడి నపుడే**
**యాలమునకుఁ జనుటయుఁ దొలి**
**వేలుపు లా కోఁతి గముల వెసఁ గని కినుకన్** **285**

ఓలి = క్రమముగా, మెయి తెల్లడాలు మెకాలు = సింహములు, ఇఱ్ఱులమీదన్ = లేళ్ళమీద, అడరు = దూకు, కైవడి = విధముగా, అపుడే = అప్పుడే, ఆలమునకు = యుద్ధమునకు, చనుటయున్

= వెళ్ళుటయును, తొలి వేలుపులు = రాక్షసులు, ఆ కోతి గముల = ఆ వానర సమూహమును, వెసన్ = తొందరగా, కని = చూచి, కినుకన్ = కోపముతో, –

**తా :** క్రమముగా సింహములు లేళ్ళమీద దూకు విధముగా అప్పుడే యుద్ధమునకు వెళ్ళుటయును, రాక్షసులు ఆ వానర సమూహమును చూచి కోపముతో –

**ఆ.వె.** **ఓరి కోఁతికూళలార! కాఱడవులఁ**
**దూఱి కాయ గసరు లేఱుక తిని**
**బ్రదుకలేక రాచగుదియతోఁ బొత్తూని**
**పొలసుదిండ్ల నెదిరిపోరఁ దగునె?** **286**

ఓరి కోతికూళలార = ఓ నీచ వానరులార!, కాఱడవులన్, దూరి, కాయ కసరులు ఏఱుక తిని, బ్రదుకలేక, రాచగుదియతోన్ = రాచ దుడ్డుతో, పొత్తు ఊని = స్నేహముచేసి, పొలసుదిండ్లన్ = రాక్షసులను, ఎదిరి = ఎదిరించి, పోరన్ తగునె = పోరతగునా?

**తా :** ఓ నీచ కోతులారా! కీకారణ్యములో దూరి కాయకసరులు ఏఱుక తిని బ్రతుకలేక రాచదుడ్డు (రాముని)తో స్నేహముచేసి రాక్షసులను ఎదిరించి పోరతగునా?

**ఆ.వె.** **ఆలి నప్పగించి యంతటఁ బోక మి**
**మ్మప్పగింపఁ దెచ్చె నఱ దలంచి**
**రాచవాని నమ్మరాదనుమాట మీ**
**రెఱుఁగరైతి రింక నేమి గలదు?** **287**

ఆలిని అప్పగించి, అంతటన్, పోక, మిమ్ము, అప్పగింపన్, అఱ తలంచి = కీడును భావించి, తెచ్చెను, రాచవానిన్ = రాజపురుషుని, నమ్మరాదు అను మాట, మీరు, ఎఱుగరైతిరి, ఇంకన్ = ఇకపైన, ఏమి కలదు = మీకు ఏముంటుంది? (సంహరిస్తామని అర్థం)

**తా :** ఆలిని అప్పగించి అంతట పోక మిమ్ము అప్పగింప కీడును భావించి తెచ్చెను. రాజపురుషుని నమ్మరాదు అనుమాట మీరు ఎఱుగరైతిరి. ఇంక మీకు ఏముంటుంది?

**సీ.** **చివచివ నెగబ్రాఁక చిఱుత మ్రాఁకులు గావు**
**పొగరు టేనుఁగుగున్న తెగలుగాని**
**కూడి యాడుకొనంగ లేడి కూనలు గావు**
**వడిగల మేటి తత్తడులుగాని**
**చెలఁగి గంతులిడంగఁ బొలము గట్టులు గావు**
**తలరు పుత్తడి యరదములుగాని**
**యుఱికి దాఁటులు గొన నూటవాగులు గావు**
**కఱకు నంజుడు దిండిగములుగాని**

**తే.గీ.** **పొదలి యాలింపఁ బులుఁగు నుగ్రొదలు గావు**
**కడిఁది సింగాణి బెడఁగు చప్పుడులుగాని**

**కోఁతు లెచ్చట? జగడంపుఁ జేఁత లెచటఁ?**
**బగ్గె లటు వెట్టి తిన్నంగఁ బాఱి చనుఁడు** **288**

చివచివ ఎగబ్రాక = గబగబ పైకి ప్రాకుటకు, చిఱుత మ్రాకులు కావు = చిన్న చెట్లు కావు, పొగరు = మదముతోనున్న, ఏనుగు గున్న, తెగలు కాని = సమూహములేకాని, కూడి ఆడుకొనంగ = కలిసి ఆడుకోడానికి, లేడి కూనలు కావు, వడి కల = వేగముకల, మేటి = శ్రేష్ఠమైన, తత్తడులు కాని = గుఱ్ఱములేకాని, చెలగి = స్వేచ్ఛగా, గంతులు ఇడగన్, పొలము గట్టులు కావు, తలరు = ఒప్పునట్టి, పుత్తడి = బంగారపు, అరదములు కాని = రథములేకాని, ఉఱికి = దుమికి, దాటులు కొన = దాటిపోవుటకు, ఊటవాగులు కావు = ఊటకాలువలు కావు, కఱకు = కఠినమైన, నంజుడు తిండి గములు కాని = రాక్షస సమూహములుకాని, పొదలి = సంతసించి, ఆలింపన్ = వినుటకు, పులుగు నును రొదలు కావు = పక్షుల మధుర ధ్వనులుకావు, కడిది = దిట్టమైన, సింగాణి = ధనుస్సులయొక్క, బెడగు చప్పుడులుకాని = భయమును కలిగించే ధ్వనులేకాని, కోతులు ఎచ్చట? జగడంపు చేతలు ఎచట?, పగ్గెలు = ప్రజ్ఞలు, అటు పెట్టి = ప్రక్కన పెట్టి, తిన్నంగన్ = తిన్నగా, పాఱి చనుడు = పారిపొండి.

**తా :** గబగబ పైకి ప్రాకుటకు చిన్న చెట్లు కావు, మదముతోనున్న ఏనుగు గున్నలే కాని కలిసి ఆడుకోడానికి లేడికూనలు కావు, వేగముకల శ్రేష్ఠమైన గుఱ్ఱములే కాని స్వేచ్ఛగా గంతులేయడానికి పొలము గట్టులు కావు. బంగారు రథములే కాని దుమికి దాటిపోయే ఊటకాలువలు కావు, కఱకు రాక్షససమూహములు కాని సంతసించి వినడానికి పక్షుల మధుర ధ్వనులు కావు, కడిది సింగాణి చప్పుడులు కాని కోతు లెక్కడ? పోరు లెక్కడ? ప్రజ్ఞలు ప్రక్కన పెట్టి తిన్నగా పారిపొండి.

**సీ.** **అని పల్కి కేవున నార్చి యొక్కుమ్మడిఁ**
**గదలి యొండొరు మీరి పొదఁడు పొదఁడు**
**బలిమిమైఁ బొదువుఁడు పట్టుఁడు కొట్టుఁ డం**
**చేడ్తెఱఁ దొదరి య య్యెఱచిదిండ్లు**
**సబిడీల సంకుల జముదాళ్ళతోఁ జేవ**
**ద్రుడ్డుల బటువు కైదువుల నడిద**
**ముల బల్లెముల నీఁటియల సెల గత్తుల**
**గుదియలఁ దూపుల గొడ్డళులను**

**తే.గీ.** **జెండు బెండాడి కండలు గుండియలును**
**గ్రొవ్వు నెత్తురు మెదడు ప్రేగులు నరమ్ము**
**లెమ్ములును నేలఁ బొరలంగఁ గొమ్మ మెకపు**
**పిండు నొంచిరి జేజేలు బెగడి పఱవ** **289**

అని పల్కి, కేవునన్ ఆర్చి = కెవ్వుమని అరిచి, ఒక్కుమ్మడిన్ = ఒక్కసారిగా, కదలి, ఒండొరు మీరి = ఒకరినొకరు మించి, పొదదు పొదదు = పదండి పదండి, బలిమిమైన్ = ధైర్యముతో, పొదువుడు = ఆక్రమించండి, పట్టుడు, కొట్టుడు, అంచు, ఏడ్తెఱన్ = అతిశయముతో, తొడరి = పూనుకొని, ఆ ఎఱచి తిండ్లు = ఆ రాక్షసులు, సబిడీల = ఆయుధములతో, సంకుల = శంఖములతో, జముదాళ్ళతో = పొడవైన కత్తులతో, చేవ ద్రుద్దుల = చేవ దుద్దుకఱ్ఱలతో, బటువు కైదువులన్ = గుండ్రని ఆయుధములతో, అడిదముల = కత్తులతో, బల్లెములన్, ఈటియల = ఈటెలతో, సెలకత్తుల = పుళ్ళు చేసే కత్తులతో, గుదియలన్ = దుడ్డులతో, తూపుల = బాణములతో, గొడ్డళులను, చెండు బెండాడి = ముక్కలుచెక్కలుచేసి, కండలు, గుండియలును = గుండెలును, క్రొవ్వు, నెత్తురు, మెదడు, ప్రేగులు, నరములు, ఎమ్ములును = ఎముకలును, నేలన్ పొరలంగన్ = నేలపై పొరలాడగా, జేజేలు = దేవతలు, బెగడి = భయపడి, పఱవ = పరుగెత్తగా, కొమ్మ మెకపు పిండును = వానర సమూహమును, ఒంచిరి = లొంగతీసుకొనిరి.

**తా :** అని పల్కి కెవ్వుమని అరిచి ఒక్కసారిగా కదలి ఒకరినొకరు మించి పదండి పదండి ధైర్యముతో ఆక్రమించండి. పట్టండి. కొట్టండి. అని అతిశయముతో పూనుకొని ఆ రాక్షసులు కైదువులతో, కత్తులతో, బల్లెములతో, ఈటెలతో, సెలకత్తులతో, దుడ్డులతో, బాణములతో, గొడ్డళ్ళతో ముక్కలుచెక్కలుచేసి కండలు, గుండెలు, క్రొవ్వు, నెత్తురు, మెదడు, ప్రేగులు, నరములు, ఎముకలు నేలపై పొరలాడగా దేవతలు భయపడి పరుగెత్తగా వానర సమూహమును లొంగతీసుకొనిరి.

**ఉ.** **అప్పుడు తిప్ప ద్రిమ్మరి గయాళులు సెట్టులు గట్లుఁ జట్టులున్**
**గుప్పలుగాఁగ రువ్వియును గ్రుద్దియుఁ దాఁచియు గోళ్ళ వ్రచ్చియున్**
**దెప్పరమైన యిక్కలఁ గడిందిగ రక్కసి బంట్ల నొక్కనిన్**
**దప్పి చనంగనీక గుదెతాలుపు ప్రోలికిఁ ద్రోలి రోలిగన్** **290**

అప్పుడు, తిప్ప త్రిమ్మరి గయాళులు = వానర శ్రేష్ఠులు, చెట్టులు, గట్లు = కొండలు, చట్టులన్ = రాళ్ళను, కుప్పలు కాగ, రువ్వియును, గ్రుద్ధియున్, తాచియు = తన్నియును, గోళ్ళ వ్రచ్చియున్ = గోళ్ళతో రక్కియును, దెప్పరమైన = కష్టములకు, ఇక్కలన్ = స్థానమైనవారినిగా, కడిందిగ = బలముగా, రక్కసి బంట్లన్ = రాక్షస వీరులను, ఒక్కనిన్ = ఒక్కరిని కూడా, తప్పి చనంగనీక = తప్పుకొని వెళ్లనీక, గుదె తాలుపు ప్రోలికి = యముని నగరమునకు (సంయమనీ పురము), ఓలిగన్ = వరుసగా, త్రోలిరి = పంపిరి.

**తా :** అప్పుడు వానర వీరులు చెట్లు, కొండలు, రాళ్ళు కుప్పలుగా రువ్వి, గ్రుద్ది, తన్ని, గోళ్ళతో రక్కి కష్టములకు స్థానీయులుగా రాక్షసులను ఒక్కరినికూడా తప్పించుకుపోనీక యముని నగరమునకు వరుసగా త్రోలిరి.

**కం.** **మఱియుఁ బ్రజంఘునిఁ గ్రోధను**
**నుఱుమాడె న్వాలి కొడుకు నూల్కొని కడిమిన్**

**వెఱ వొప్ప శోణితాక్షునిఁ**
**బఱిమార్చెన్ ద్వివిదుఁ డెల్ల పౌజులు వొగడన్ 291**

మఱియున్, ప్రజంఘునిన్, క్రోధనున్, వాలి కొడుకు = అంగదుడు, నూల్కొని = పూను కొని, కడిమిన్ = సాహసముతో, ఉఱుమాడెన్ = సంహరించెను, శోణితాక్షునిన్, వెఱవు ఒప్పన్ = ఉపాయముతో, ఎల్ల పౌజులు పొగడన్, ద్వివిదుడు, పఱిమార్చెన్ = సంహరించెను.

**తా :** ఇంకా ప్రజంఘుని, క్రోధనుని అంగదుడు పూనుకొని సాహసముతో సంహరించెను. శోణితాక్షుని ఉపాయముతో సైన్యములు పొగడగా ద్వివిదుడు పరిమార్చెను.

**ఆ.వె. అట్టు లదరుచున్న చెట్టు ద్రిమ్మరులపైఁ**
**గినిసి కుంభుఁ డనికి మొనసి పెద్ద**
**కొండవంటి వింట గొనయ మెక్కించి న**
**ల్గడలు నద్రువ బొబ్బయిడి కడంగి 292**

అట్టుల = ఆ విధముగా, అదరుచున్న = విజృంభించుచున్న, చెట్టు త్రిమ్మరులపైన్ = వానరులపై, కినిసి = కోపించి, కుంభుడు, అనికి = యుద్ధమునకు, మొనసి = పూనుకొని, పెద్ద కొండవంటి వింట, గొనయము ఎక్కించి = నారి తొడిగి, నల్గడలున్ = నాలుగు దిక్కులును, అద్రువన్ = అదరునట్లుగా, బొబ్బయిడి = అరచి, కడంగి = సిద్ధపడి,

**తా :** ఆ విధముగా విజృంభించుచున్న వానరులపై కోపించి కుంభుడు యుద్ధమునకు పూనుకొని పెద్ద కొండవంటి వింట నారి తొడిగి నాల్గు దిక్కులు అదరునట్లుగా అరచి –

**కం. గాలి కవణంపు మేపుదు**
**చాలుపులం బోలి తరకసంబున నొఱపూ**
**న్మేలి యపరంజి పింజల**
**వాలారుం దూపులుఱక వామిగ నేసెన్ 293**

గాలి కవణంపు మేపుడు = గాలిని ఆహారముగా మేసే పాములయొక్క, చాలుపులం పోలి = సమూహములను పోలి, తరకసంబునన్ = అమ్ముల పొదినుండి, ఒఱపూను = కాంతులను చిమ్మే, మేలి = శ్రేష్ఠమైన, అపరంజి = బంగారు, పింజలన్ = పుంఖములుకల, వాలారున్ = వాడియైన, తూపులు = బాణములు, ఉఱక = వేగముగా, వామిగన్ = రాసిగా, ఏసెన్ = ప్రయోగించెను.

**తా :** పాముల సమూహమును పోలిన అమ్ములపొదినుండి బంగరు పింజల వాడి బాణములు వేగముగా రాసిగా వేసెను.

**కం. ఏయుటయుఁ గనుఁగొని ద్వివిదుఁడు**
**పాయని రోసమున నొక్క పడు కావేల్పుం**
**దాయ పయిం బడవైచుట**
**కై యెత్తిన వాఁడు దోనె యది తునుమాడెన్ 294**

ఏయుటయున్ = వేయగా, కనుగొని = చూచి, ద్వివిదుడు, పాయని రోసమునన్ = తొలగని కోపముతో, నొక్క పడుకు = ఒక రాయి, ఆ వేల్పుం దాయ పయిం = ఆ రాక్షసునిపై, పడవైచుటకై = పడవేయుటకై, ఎత్తిన = ఎత్తగా, వాడు = ఆ కుంభుడు, తోనె = శీఘ్రముగా, అది = ఆ రాతిని, తనుమాడెన్ = ముక్కలు చేసెను.

**తా :** వేయగా చూచి ద్వివిదుడు తొలగని కోపముతో ఒక రాయి ఆ రాక్షసునిపై పడవేయడానికి ఎత్తగా ఆ కుంభుడు శీఘ్రముగా ఆ రాయిని ముక్కలు చేసెను.

**కం.** **తునుమాడి యొక్క నెఱ తూ**
**పున నాతని బోరయుచ్చిపో నేసినఁ గ్ర**
**న్నన నేల నొఱఁగె నటు లొర**
**గిన తోఁబుట్టువును జూచి కినుక తలిర్పన్** **295**

తునుమాడి = ముక్కలుచేసి, ఒక్క నెఱ తూపున = ఒక వాడి బాణముతో, ఆతని బోర ఉచ్చిపోన్ = ఆ ద్వివిదుని పొట్ట చీలునట్లుగా, ఏసినన్ = వేయగా, క్రన్నన = వెంటనే, నేలన్ ఒఱగెన్ = నేల పడిపోయెను, అటులు, ఒరగిన, తోబుట్టువును, చూచి, కినుక తలిర్పన్ = మిక్కిలి కోపముతో –

**తా :** ముక్కలుచేసి ఒక వాడి బాణముతో అతని పొట్ట చీలునట్లుగా వేయగా వెంటనే నేలపై పడిపోయెను. అలా ఒరగిన తోబుట్టువును చూచి కోపముతో –

**తే.గీ.** **మైందుఁ దురువడి నొక పెద్దమ్రాఁకు పెఱికి**
**పొలసు మేపరి నేయ నప్పోటుకాఁడు**
**నెయ్యి సోఁకిన గాడుపు నెయ్యునట్లు**
**మండి యొక కోల నాతనిఁ బండఁ బెట్టె** **296**

మైందుడు, ఉరువడిన్ = వేగముగా, ఒక పెద్ద మ్రాకు పెఱికి, పొలసు మేపరిని ఏయ = రాక్షసునిపై వేయగా, ఆ పోటుకాడు = ఆ వీరుడు, నెయ్యి సోకిన, గాడుపు నెయ్యుని అట్లు = అగ్నివలె, మండి, ఒక కోల = ఒక బాణముతో, ఆతనిన్ = ఆ మైందుని, పండన్ పెట్టె = స్పృహ తప్పించెను.

**తా :** మైందుడు వేగముగా ఒక పెద్ద చెట్టును పెఱికి రాక్షసునిపై వేయగా ఆ వీరుడు నెయ్యి సోకిన అగ్నివలె మండి ఒక బాణముతో ఆ మైందుని స్పృహ తప్పించెను.

**కం.** **మామల పాటు గనుంగొని**
**తా మదిలోఁ గుంది గట్ల దాయ కొమరుఁ డెం**
**తో మగఁటిమి నెదురుడు వాఁ**
**డామెసఁగం బలు ములుకుల నాతని నొంచెన్** **297**

మామల పాటు = మేనమామల దుస్థితి, కనుంగొని = చూచి, గట్లదాయ మనుమడు = ఇంద్రుని మనుమడు అంగదుడు, తా మదిలో = తాను మనస్సులో, కుంది = బాధపడి, ఎంతో మగటిమిన్ = ఎంతో పౌరుషముతో, ఎదురుడు = ఎదిరింపగా, వాడు = ఆ కుంభుడు, ఆము = మదము, ఎసగన్ = అతిశయింపగా, బలు = కఠినమైన, ములుకులన్ = బాణములతో, అతనిన్ = ఆ అంగదుని, నొంచెన్ = బాధించెను.

**తా :** మేనమామల స్థితిని చూచి అంగదుడు బాధపడి పౌరుషముతో ఎదిరింపగా ఆ కుంభుడు మదము అతిశయింపగా కఠినమైన బాణములతో ఆ అంగదుని బాధించెను.

**తే.గీ.** **అంతఁ గొందఱు కోఁతి బంట్లత్తెఱంగు**
**రాము కడకేఁగి తెలుప నా రాచమిన్న**
**మోర తెల్పు మెకఁపు ఱేఁడు మొదలు గల్గు**
**బల్లిదుల నేర్చి పోరికిఁ బనుపుటయును** **298**

అంతన్, కొందఱు, కోతి బంట్లు, ఆ తెఱంగు = ఆ విషయమును, రాము కడకు ఏగి = రామునియొద్దకు వెళ్ళి, తెలుపన్ = చెప్పగా, ఆ రాచమిన్న = ఆ రాజశ్రేష్ఠుడు, మోర తెల్పు మెకపు ఱేడు = జాంబవంతుడు, మొదలు కల్గు = మొదలైన, బల్లిదులన్ = బలవంతులను, ఏర్చి = ఎంచి, పోరికి = యుద్ధమునకు, పనుపుటయును = పంపగా –

**తా :** అంత కోతి బంట్లు ఆ విషయమును రామునికి చెప్పగా ఆ రాజశ్రేష్ఠుడు జాంబవంతుడు మొదలైన బలవంతులను ఎంచి పోరుకు పంపగా –

**కం.** **మ్రాఁకులుఁ బడుకులుఁ గైకొని**
**వీఁకం జని వారు మిగుల వెఱఁగొప్పఁ గడుం**
**గూఁక లొసంగుచు నతనిన్**
**దాఁకిన నబ్బిరుదు మగఁడు దరలని కడిమిన్** **299**

మ్రాకులు = చెట్లు, పడుకులు = రాళ్ళు, కైకొని = తీసుకొని, వీకం చని = ఉత్సాహముతో వెళ్ళి, వారు, మిగుల వెఱగొప్పన్ = మిక్కిలి ఆశ్చర్యకరముగా, కడున్ = గట్టిగా, కూకలు ఒసంగుచు = కేకలు వేయుచు, అతనిన్ = ఆ కుంభుని, తాకినన్ = ఎదిరించగా, ఆ బిరుదు మగడు = ఆ వీరుడు, తరలిన = తగ్గని, కడిమిన్ = ధైర్యముతో –

**తా :** చెట్లు, రాళ్ళు తీసుకొని ఉత్సాహముతో వెళ్ళి వారు ఆశ్చర్యముగా గట్టిగా కేకలు వేయుచు ఆ కుంభుని ఎదరించగా ఆ వీరుడు తరగని ధైర్యముతో –

**తే.గీ.** **వారి నందఱ బెడిదంపు వాఁడి నార**
**సముల నోనేసి తఱిమిన జగముకన్ను**
**కొమరుఁ డా కుంభకర్ణుని కొడుకుఁ దొడరి**
**మలలుఁ జెట్టులుఁ బడుకులుఁ జెలఁగి వైచె** **300**

వారిని అందఱన్, బెడిదంపు = కఠినమైన, వాడి, నారసములన్ = బాణములతో, నోనేసి = తీవ్రముగా కొట్టి, తఱిమిన, జగము కన్ను కొమరుడు = సుగ్రీవుడు, ఆ కుంభకర్ణుని కొడుకున్ = ఆ కుంభుని, తొడరి = ఎదుర్కొని, మలలు, చెట్టులు, పడుకులు, చెలగి వైచె,

**తా :** వాళ్ళనందఱిని కఠినమైన వాడి బాణములతో తీవ్రముగా కొట్టి తఱిమిన సుగ్రీవుడు ఆ కుంభుని ఎదుర్కొని కొండలు, చెట్లు, రాళ్ళు రెచ్చిపోయి వేసెను.

**తే.గీ. వైచుటయు వాఁడు నడుమన వాని నెల్లఁ**
**దునిమి వేండ్రంపు మొన వాఁడి తూపుగములు**
**కోఁతి రాయనిపైఁ బెల్లు గురియ నతఁడు**
**వాని సింగాణి ముఱియలుగా నొనర్ప 301**

వైచుటయు = వేయగా, వాడు నడుమన వానిని ఎల్లన్, దునిమి = ఖండించి, వేండ్రంపు = తీక్షణమైన, మొనవాడి = పదునైన మొనలుకల, తూపు గములు = బాణ సమూహములు, కోతి రాయనిపైన్ = సుగ్రీవునిపై, పెల్లు కురియన్ = అధికముగా కురిపించగా, అతడు = ఆ సుగ్రీవుడు, వాని = ఆ కుంభుని, సింగాణి = వింటిని, ముఱియలుగాన్ = ముక్కలుగా, ఒనర్ప = చేయగా –

**తా :** వేయగా వాడు నడుమన వానినన్నిటిని ఖండించి తీక్షణమైన వాడి బాణములు సుగ్రీవునిపై కురిపించగా ఆ సుగ్రీవుడు ఆ కుంభుని వింటిని ముక్కలుగా చేయగా –

**సీ. అందుల కలిగి వాఁ డరదంబు డిగి వడిఁ**
**బఱతెంచి సుగ్రీవుఁ బట్టుకొనిన**
**నిరువురు నపు డాము టేనుఁగు గున్నల**
**పోలికఁ దార్కొని పొంపుగదుర**
**నడుగుల తాఁకునఁ బుడమి గ్రక్కదల నా**
**ర్పులఁ దమ్మికానుపు గ్రుడ్లు వగుల**
**గడితంపు దుమ్మునఁ గడలిపట్టు గలఁగ**
**నూర్పుల మొగులుజా లొదిగి పఱవఁ**

**తే.గీ. బలు తెఱంగులఁ బోరుచోఁ గలువదాయ**
**పట్టి యా రక్కసునిఁ జిక్కపట్టి ఔమ్ము**
**మట్టి పిడికిటఁ బొడిచిన నిట్టు నట్టుఁ**
**గదల నేరక యుసురులు వదలి చనియె 302**

అందులకు = ధనుస్సు విరిచినందుకు, అలిగి = కోపించి, వాడు = ఆ కుంభుడు, అరదంబు డిగి = రథమును దిగి, వడిన్ = శీఘ్రముగా, పఱతెంచి = వచ్చి, సుగ్రీవున్, పట్టుకొనిన, ఇరువురును, అపుడు, ఆము = మదించిన, ఏనుగు గున్నల పోలికన్, తార్కొని = ఢీకొని, పొంపు గదురన్ = ఆధిక్యమొప్పగా, అడుగుల తాకునన్ = పాద ఘట్టనలచే, పుడమి = భూమి, క్రక్కదలన్ = మిక్కిలి చలింపగా, ఆర్పులన్ = అరుపులచేత, తమ్మికానుపు గ్రుడ్లు = బ్రహ్మాండములు, పగులన్ = బ్రద్దలుకాగా, గడితంపు దుమ్మునన్ = అధికమైన ధూళిచేత, కడలిపట్టు = సముద్ర ప్రదేశము, కలగన్ = కలతచెందగా, ఊర్పులన్ = నిట్టూర్పులచే, మొగులుజాలు = మేఘముల వరుసలు, ఒదిగి = ముడుచుకొని, పఱవన్ = పరువెత్తగా, పలుతెఱంగులన్ = అనేక రీతులుగా, పోరుచోన్ = పోరుచుండగా, కలువదాయ పట్టి = సుగ్రీవుడు, రక్కసుని = కుంభుని, చిక్కపట్టి = గట్టిగా బంధించి, ఔమ్ము మట్టి = ఔమ్మును త్రొక్కిపట్టి, పిడికిటన్, పొడిచినన్, ఇట్టు అట్టు = ఇటునటు, కదలనేరక = కదలలేక, ఉసురులు = ప్రాణములు, వదలి చనియెన్ = విడిచి చనిపోయెను.

**తా :** అందులకు కోపించి ఆ కుంభుడు రథము దిగి వచ్చి సుగ్రీవుని పట్టుకొనిన, ఇరువురును అపుడు మదించిన ఏనుగు గున్నలవలె ఢీకొని ఆధిక్యతకోసం పాదఘట్టనలచే భూమి చలింపగా, అరుపులచే బ్రహ్మాండములు బ్రద్దలుకాగా, అధికమైన ధూళిచే సముద్రము కలతచెందగా, నిట్టూర్పులచే మేఘములు ముడుచుకొని పరుగెత్తగా, పలువిధముల పోరాడుచుండగా సుగ్రీవుడు కుంభుని చిక్కపట్టి ఱొమ్మును త్రొక్కిపట్టి పిడికిలితో పొడువగా ఇటు అటు కదలలేక వాడు ప్రాణములు విడిచి చనిపోయెను.

**కం.** **అంత నికుంభుం డెంతయుఁ**
**బంతంబున నినుపకట్ల బల్గుదియ కడున్**
**వింతగఁ ద్రిప్పుకొనుచు హను**
**మంతు నెదిరి యతని బోర మసలక మోఁదెన్** **303**

అంత = అంతట, నికుంభుడు, ఎంతయున్, పంతంబునన్, ఇనుపకట్ల = ఇనుపకట్లు వేసియున్న, బల్గుదియ = పెద్ద దుడ్డును, కడున్ వింతగన్ = మిక్కిలి ఆశ్చర్యకరముగా, త్రిప్పుకొనుచున్ = గిరగిర త్రిప్పుకొనుచు, హనుమంతున్, ఎదిరి = ఎదిరించి, అతని, బోరన్ = పొట్టపై, మసలక = ఆలసింపక, మోదెన్ = బాదెను.

**తా :** అంతట నికుంభుడు ఎంతో పంతంతో ఇనుపకట్లు వేసియున్న పెద్ద దుడ్డును గిరగిర త్రిప్పుకొనుచు హనుమంతుని ఎదిరించి అతని పొట్టపై మసలక బాదెను.

**ఆ.వె.** **మోఁదుటయును గాడ్పు గాదిలి కుఱ్ఱని**
**యక్కుసోఁకి గుదియ ముక్కలయ్యె**
**నపుడు సోఁకుబంటు నలమి పట్టుక నల్లఁ**
**గ్రక్కఁ బొడిచె నదరి యుక్కు జోదు** **304**

మోదుటయును, గాడ్పు గాదిలి కుఱ్ఱని = హనుమంతుని, అక్కు సోకి = ఱొమ్మును తాకి, గుదియ ముక్కలయ్యెన్, అపుడు, సోకుబంటున్ = నికుంభుని, అలమి పట్టుక = బిగించి పట్టుకొని, నల్లన్ క్రక్కన్ = నెత్తురు కక్కునట్లుగా, అదరి = అతిశయించి, ఉక్కుజోదు = ఉక్కువంటి వీరుడు హనుమ, పొడిచెన్ = పొడిచెను.

**తా :** బాదగా హనుమంతుని ఱొమ్ము తాకి ఆ గుదియ ముక్కలయ్యెను. అపుడు నికుంభుని బిగించి పట్టుకొని నెత్తురు కక్కునట్లుగా హనుమ గట్టిగా పొడిచెను.

**చం.** **పొడిచిన మొగ్గి యప్పొలసుబోనపు మేటిమగండు బీర మే**
**ర్పడ వడి లేచి కోఁతిదొర పట్టుక బిట్టు గలంప నాతఁడ**
**గ్గడుసరి రక్కసుం బొదివి కాలును గేలుఁ గదల్పనీక బ**
**ల్విడిఁ బడఁద్రోచి త్రొక్కి సరవిన్ దలఁద్రుంచెఁ జలంబెలర్పగన్** **305**

పొడిచినన్, మొగ్గి = దూకి, ఆ పొలసుబోనపు మేటిమగడు = ఆ రాక్షస గొప్ప వీరుడు, బీరము ఏర్పడన్ = వీరత్వముప్పొంగగా, వడి = శీఘ్రముగా, లేచి, కోతిదొర = హనుమను, పట్టుక =

పట్టుకొని, బిట్టు కలంపన్ = మిక్కిలి బాధింపగా, ఆతడు = ఆ హనుమ, ఆ గడుసరి రక్కసున్ = ఆ తెలివైన రాక్షసుని, పొదివి = ఆక్రమించి, కాలును, కేలున్ = చేతిని, కదల్పనీక = కదలకుండ చేసి, బల్విడిన్ = బలవంతముగా, పడత్రోచి = పడునట్లుగా చేసి, త్రొక్కి, సరవిన్ = వేగముగా, చలంబు ఎలర్పగన్ = అధికమైన కోపముతో, తలన్, త్రుంచెన్.

**తా :** పొడిచిన దూకి ఆ రాక్షస వీరుడు శౌర్యముతో శీఘ్రముగా పైకిలేచి హనుమను పట్టుకొని మిక్కిలి బాధింపగా ఆ హనుమ ఆ గడుసరి రాక్షసుని ఆక్రమించి కాళ్ళు, చేతులు కదలకుండా చేసి బలవంతముగా పడత్రోచి త్రొక్కి వేగముగా తలను త్రుంచెను.

**కం.** **అయ్యెడఁ గొందఱు రక్కసు**
**లొయ్యనఁ బఱతెంచి సోఁకుటొడయని గని య**
**క్కయ్యంపుఁ దెఱఁగుఁ జెప్పిన**
**నయ్యేకిమీఁ డుఱక యడలి యాఱని కినుకన్** **306**

అయ్యెడన్ = ఆ సమయమున, కొందఱు, రక్కసులు, ఒయ్యనన్ = తిన్నగా, పఱతెంచి = వచ్చి, సోకు ఒడయని కని = రావణుని కాంచి, ఆ కయ్యపున్ తెఱగున్ = ఆ కలహ పరిణామమును, చెప్పిన = చెప్పగా, ఆ ఎకిమీఁడు = ఆ రావణుడు, ఉఱక = వ్యర్థముగా, అడలి = దుఃఖించి, ఆఱని కినుకన్ = ఉపశమింపని కోపముతో –

**తా :** ఆ సమయమున కొందఱు రాక్షసులు తిన్నగా వచ్చి రావణుని కాంచి ఆ కలహ పరిణామమును చెప్పగా ఆ రావణుడు వ్యర్థముగా దుఃఖించి ఆఱని కోపముతో –

**తే.గీ.** **ఖరుని కొడుకైన మకరాక్షుఁ గదియఁ బిలిచి**
**నీవు నీ మూఁకతోఁ గూడి తీవినేఁగి**
**నేడు రాచూలులను గోన నెలవు బంట్లఁ**
**జెనసి వైళంబ రూపఱఁ జేసి రమ్ము** **307**

ఖరుని కొడుకు ఐన, మకరాక్షున్, కదియన్ పిలిచి = చేరువకు పిలిచి, నీవు, నీ మూకతో కూడి, నేడు = ఇప్పుడు, తీవిన్ఏగి = దర్పముతోవెళ్ళి, రాచూలులను = రాచబిడ్డలను, కోననెలవు బంట్లన్ = వానరులను, చెనసి = ఎదిరించి, వైళంబ = శీఘ్రముగా, రూపఱన్ చేసి = చంపి, రమ్ము.

**తా :** ఖరుని కొడుకు మకరాక్షుని పిలిచి 'నీవు నీ మూకతో కూడి ఇప్పుడు తీవిగా వెళ్ళి రాచబిడ్డలను, వానరులను ఎదిరించి శీఘ్రముగా రూపుమాపి రమ్ము'

**కం.** **అని పనిచిన మూఁకలతోఁ**
**బనివిని యజ్జోదు కోఁతి పౌజులపై డా**
**కొని కినుక నిగుడఁ దూపుల**
**బెను జడి యొనరింప వారుఁ బెంపలరారన్** **308**

అని పనిచినన్ = అని చెప్పి పంపగా, మూకలతోన్ = సైన్యములతో, ఆ జోదు = ఆ వీరుడగు మకరాక్షుడు, పని విని = రావణుని ఆజ్ఞ విని, కోతి పౌజులపై = వానర సైన్యముపై, డాకొని =

దండెత్తి, కినుక నిగడన్ = కోపము వ్యాపింపగా, తూపుల పెనుజడి = పెద్ద బాణ వర్షమును, ఒనరింప = చేయగా, వారు = ఆ వానరులు, పెంపలరారన్ = ఆధిక్యముతో ఒప్పి.

**తా :** అని పంపిన సైన్యములతో ఆ వీరుడు రావణుని ఆజ్ఞను విని వానరసైన్యముపై దండెత్తి కోపముతో బాణ వర్షమును చేయగా వారును ఆధిక్యముతో ఒప్పి.

**తే.గీ.** **కొలఁది మీఱిన ప్రాఁకులు మలలు రాలుఁ**
**బూని యడఁచిన రక్కస పోటరులును**
**గైదువులు విండ్లుఁ గైకొని కదిసి రట్టు**
**లిరుతెఱంగుల మూఁకలు నెలమి బెరసి** **309**

కొలది మీఱిన = పెద్దవిగ అతిశయించిన, ప్రాకులు = చెట్లు, మలలు = కొండలు, రాలున్ = రాళ్ళును, పూని = పట్టుకొని, అడచిన = అణగ కొట్టగా, రక్కస పోటరులును = రాక్షస వీరులును, కైదువులు = ఆయుధములు, విండ్లున్ = ధనుస్సులను, కైకొని = తీసుకొని, కదిసిరి = దండెత్తిరి, అట్టులు = ఆ విధముగా, ఇరు తెఱంగుల మూకలు, ఎలమి బెరసి = వికాసము వ్యాపించి.

**తా :** మిక్కిలి పెద్ద చెట్లు, కొండలు, రాళ్ళు పట్టుకొని అణగకొట్టగా ఆ రాక్షసవీరులును కైదువులు, విండ్లు తీసుకొని దండెత్తిరి. ఆ విధముగా ఇరుతెగలు సేనలు వ్యాపించి.

**కం.** **మేనులు నలినలి గాఁగం**
**బీనుఁగు పెంటలుగఁ గడిమిఁ బెనఁగెడునెడ న**
**క్కోన బిడారపు బంటులు**
**మానక రాకాసి తెగల మడియించుటయున్** **310**

మేనులు = శరీరములు, నలినలి కాగన్, పీనుగు పెంటలుగన్, కడిమి = దిట్టతనముతో, పెనగెడున్ ఎడన్ = పోరు సమయమున, ఆ కోన బిడారపు బంటులు = ఆ వానర వీరులు, మానక = విడువక, రాకాసి తెగల = రాక్షస సమూహములను, మడియించుటయున్ = చంపుటయును.

**తా :** శరీరములు నలినలిగ పీనుగు పెంటలు కాగా పోరు సమయమున ఆ వానర వీరులు విడువక రాక్షస సమూహములను చంపుటయును.

**సీ.** **కన్నుల నిప్పుకల్ గ్రమ్ముచు మువ్వన్నె**
**మెకమిల్లుఁ గదియు పోలికల మొసలి**
**కన్నుల రాకాసి మిన్న కోన మెకంపు**
**గుంపులఁ దార్కొని యంపవానఁ**
**గురిసి యీఁటెల గ్రుచ్చి గుదియల మోఁది య**
**డిదముల గొడ్డండ్లఁ జదియ నటికి**
**సురియలఁ బొడిచి నజ్జుగ నొడళ్ళెల్లను**
**జెండాడి చీకాకుచేసి కలఁచి**

**తే.గీ.** **బారిసమరిన నిలువక పాఱి వార**
**లివము మేపరి కొలము జక్కవలసూడు**
**మరువు సేరిరి సేరిన నుఱక మొఱకు**
**రక్కసుఁడు దోనె యరిగి సీరాముఁ దొడరి** **311**

కన్నులన్, నిప్పుకల్ = నిప్పురవ్వలు, క్రమ్ముచు = నింపుచు, మువ్వన్నె మెకము = పెద్దపులి, ఇఱ్ఱున్ = లేళ్ళను, కదియు పోలికల = వేటాడు పద్ధతిలో, మొసలి కన్నుల రాకాసి మిన్న = మకరాక్షుడను వీరుడు, కోన మెకంపు గుంపులన్ = వానర సమూహములను, తార్కొని = ఎదిరించి, అంపవాన = బాణవర్షము, కురిసి = వర్షించి, ఈటెల గ్రుచ్చి, గుదియల మోది, అడిదముల = కత్తుల, గొడ్డండ్లన్ = గొడ్డళ్ళతో, చదియ నఱికి = నలిపి ఖండించి, సురియలన్ = చురకత్తులతో, పొడిచి, నజ్జుగన్, ఒడళ్ళెల్లను = దేహములన్నియు, చెండాడి = ఖండించి, చీకాకు చేసి, కలచి = కలగుండుపరచి, బారిసమరిన = సంహరింపగా, నిలువక = నిలబడలేక, పాఱి = పారిపోయి, వారలు = ఆ వానరులు, ఇవము మేపరి కొలము = మంచును హరించువాడు సూర్యుడు (సూర్య వంశమున), జక్కవల సూడు = చక్రవాకములకు శత్రువు చంద్రుడు (రాముడు), మరువు చేరిరి = చాటున చేరిరి, చేరిన = చేరగా, ఉఱక = లక్ష్యపెట్టక, మొఱకు రక్కసుడు = మూర్ఖ రాక్షసుడు, తోనె = వెంటనే, అరిగి = వెళ్ళి, సీరామున్ తొడరి = రాముని ఎదిరించి –

**తా :** కన్నుల నిప్పులు రాల్చుచు పులి లేళ్ళను వేటాడు పద్ధతిలో మకరాక్షుడు వానర సమూహములను ఎదిరించి బాణవర్షము కురిపించి, ఈటెల గ్రుచ్చి, గుదియల మోది, కత్తుల, గొడ్డళ్ళతో ఖండించి, చురకత్తులతో పొడిచి, నజ్జుగ దేహములన్నియును ఖండించి చీకాకు చేసి సంహరింపగా నిలబడలేక పారిపోయి ఆ వానరులు రాముని చాటున చేరిరి. చేరగా లక్ష్యపెట్టక మూర్ఖ రాక్షసుడు వెంటనే వెళ్ళి ఆ రాముని ఎదిరించి –

**కం.** **నెఱజోదు వనుచు నినుఁ బ**
**ల్మఱు బిరుదులు సెప్పుకొంద్రు మఱి నేఁడెందున్**
**బఱవక నిల్చి దురంబున**
**గుఱుతుగ నీ లావు సూపుకొను మెకిమీఁడా!** **312**

ఎకిమీడా = ఓ శూరుడా!, నెఱజోదువు అనుచు = గొప్ప వీరుడవని, పల్మఱు = పలు మార్లు, నినున్ = నిన్ను, బిరుదులు చెప్పుకొంద్రు = వీరులు చెప్పుకొందురు, మఱి, నేడు, ఎందున్, పఱవక = పారిపోక, దురంబున = యుద్ధమున, నిల్చి = నిలబడి, గుఱుతుగ = సాక్ష్యముగా, నీ లావు = నీశక్తిని, చూపుకొనుము,

**తా :** ఓ శూరుడా! నిన్ను గొప్పవీరుడవని పలుమార్లు వీరులు చెప్పుకొందురు. మఱి నేడు పారిపోక యుద్ధమున నిలబడి గుఱుతుగ నీ శక్తిని చూపుము.

**కం.** **కుఱుకుఱు దొలివేల్పులఁ గొం**
**దఱఁ గూలిచి నిక్కెదేమొ తాటోట? నినుం**

**బిఱుతీక పట్టుకొని రూ**
**పఱం జేసెదం దండ్రి నాంటి పగదీఱంగన్ 313**

కుఱకుఱ = అల్పులైన, తొలివేల్పులన్ = రాక్షసులను, కొందఱన్, తాటోట = మోసముతో, కూలిచి = చంపి, నిక్కెదేమొ = గర్వపడుతున్నావేమో? నినున్ = నిన్ను, పెఱుతీక = వెనుతిరుగక, పట్టుకొని = బంధించి, తండ్రినాటి = నా తండ్రి ఖరుని చంపిన నాటి, పగ తీరంగన్ = పగ తీరునట్లుగా, రూపఱన్ చేసెదన్ = రూపులేకుండ చేసెదను.

**తా :** అల్పులైన రాక్షసులను కొందఱిని మోసముతో చంపి గర్వపడుతున్నావేమో? నిన్ను వెనుతిరుగక బంధించి నా తండ్రి ఖరుని చంపిన నాటి పగ తీరగా రూపు పోగొట్టెదను.

**సీ. టక్కరివై పొంచి నిక్కుచు నొకకోలం**
**గూలవ్రేయంగ నల్ల వాలిగాండు**
**మగంటిమి సూపి నెమ్మది గెల్పు చేకొన**
**వేఱిండి ముది నేలవేల్పుగాండు**
**దప్పునం బొడచూపి తటుకునం బుడమిపైం**
**ద్రెళ్ళింప రాకాసి తెఱవంగాండు**
**వెఱపొకింతయు లేక తఱిమి పీంచ మడంపం**
**బోటెఱుంగని జింకపోతుగాండు**
**తే.గీ. ఖరుండుగాండు విరాధుండుగాండు వట్టి**
**నోరుమాలిన యా కబంధుండుగాండు**
**వీండు మకరాక్షుం డిపుడు నీ వాండి యెల్ల**
**మలపి పొలుపఱం జేయు వాల్మగండు సుమ్ము 314**

టక్కరివై = మోసగాడివై, పొంచి = దాగి, నిక్కుచున్ = గర్వించుచు, ఒక కోలన్ = ఒక బాణముతో, కూల వ్రేయగన్ = చంపుటకు, అల్ల వాలి కాదు = వీడు ఆ వాలి కాదు, మగటిమి చూపి = పరాక్రమమును చూపి, నెమ్మది = మెల్లగా, గెల్పు చేకొన = విజయము పొందుటకు, వేఱిడి = వెఱ్ఱివాడైన, ముది = ముసలివాడైన, నేలవేల్పు కాదు = వీడు బ్రాహ్మణుడగు పరశురాముడు కాదు, దప్పునన్ = ఒక్కసారిగా, పొడచూపి = కనిపించి, తటుకునన్ = వెంటనే, పుడమిపైన్ = భూమిపై, త్రెళ్ళింప = పడవేయుటకు, రాకాసి తెఱవ కాదు = రాక్షస స్త్రీయగు తాటకి కాదు. వెఱపు ఒకింతయు లేక = కొంచెముకూడ భయపడక, తఱిమి = వెంటాడి, పీచ మడంపన్ = సంహరించుటకు, పోటు ఎఱుంగని = యుద్ధము తెలియని, జింకపోతు కాదు = లేడి రూపు మారీచుడు కాదు, వట్టి నోరుమాలిన = వట్టి నోరులేని, ఆ కబంధుండు కాదు, వీడు మకరాక్షుడు, ఇపుడు నీ వాడి ఎల్ల = నీ శౌర్యమునంతను, మలపి = పోగొట్టి, పొలుపఱ చేయు = చంపగల, వాల్మగడు సుమ్ము = మహావీరుడు సుమా!

**తా :** టక్కరివై దాగి గర్వించి ఒక్క బాణముతో చంపుటకు వీడు ఆ వాలి కాదు. మగటిమి చూపి గెల్చుటకు నేను ముసలి బ్రాహ్మణుడను కాను. ఒక్కసారిగ కనిపించి పడవేయుటకు తాటకిని

కాను, భయపడక వెంట తగిలి సంహరించుటకు లేడిని కాను, వట్టి తలలేని ఆ కబంధుడనుకాను వీడు మకరాక్షుడు. ఇపుడు నీ శౌర్యమును పోగొట్టి చంపగల మహావీరుడనుసుమా!

**ఆ.వె.** **అనుచుఁ బెక్కు తూపు లడరించి వెండియుఁ**
**గొలఁది మించు వాఁడి ములుకు లేయ**
**రాగవుండు పులుఁగు రాయఁడు ముక్కున**
**బాఁపగములఁ దునుము పగిదిఁ దునిమె** **315**

అనుచున్, పెక్కు తూపులు, అడరించి = ప్రయోగించి, వెండియున్ = మరల, కొలది మించు = అధిక శక్తివంతమైన, వాడి ములుకులు ఏయ = పదునైన బాణములను వేయగా, రాగవుండు = రాముడు, పులుగు రాయడు = గరుత్మంతుడు, ముక్కున = తన ముక్కుతో, పాపగములన్ = పాముల సమూహములను, దునుము పగిది = ఖండించు మాదిరిగా, దునిమె = ఆ బాణములను ఖండించెను.

**తా :** అని పెక్కు బాణములు ప్రయోగించి మరల అధిక శక్తివంతమైన వాడి బాణములు వేయగా రాముడు గరుత్మంతుడు తన ముక్కుతో పాములను దునుము మాదిరిగా వానిని ఖండించెను.

**కం.** **తునిమిన నత్తొలివేలుపు**
**మొనగాఁ డగ్గలపుఁ గిన్క ములుకుల పెను మం**
**చొనరింప రాచ తామర**
**యను గమ్మ్మం జేయిగముల నది విరియించెన్** **316**

తునిమినన్ = అలా ఖండించగా, ఆ తొలివేలుపు మొనగాడు = ఆ మకరాక్షుడను వీరుడు, అగ్గలపున్ = అధికమైన, కిన్క = కోపముతో, ములుకుల = బాణములతో, పెను = అధికమైన, మంచు ఒనరింపన్ = మంచును కల్పింపగా, రాచ తామర యనుగు = రాజ సూర్యుడు, అమ్మున్ చేయిగముల = బాణ కిరణ సమూహములచే, అది = ఆ మంచును, విరియించెన్ = పోగొట్టెను.

**తా :** అలా ఖండించగా ఆ మకరాక్షుడు కోపముతో బాణములతో పెను మంచును కురిపింపగా రాజసూర్యుడు బాణ కిరణ సమూహముచే ఆ మంచును విరియించెను.

**సీ.** **విరియించి యొక దొడ్డ వెడఁద చిల్కున వాని**
**సింగాణిఁ దునియలు చేసి యైదు**
**తూపుల నరదంబు తోలువాని నడంచి**
**యన్నియె ములుకుల నబ్బురముగఁ**
**దేరును మావులఁ దెగటార్చి మఱియును**
**నెఱిఁగీలు నోనేయ నేయి దొరయు**
**నగ్గి చాద్పున మండి యరదంబు డిగి వాఁడు**
**మొక్కలంబుగ దాసి మొనలవాలు**

**తే.గీ.** **వైవ నది నేలతాల్పుఁ గల్వల యనుంగు**
**మూఁడు నెఱ నారసముల వమ్ముగ నొనర్చె**
**నంత రక్కసుఁ డెకిమీని నలమి పట్టి**
**బిగి యెలర్పఁగఁ బిడికిట బిట్టు పొడిచె** **317**

విరియించి = మంచును పోగొట్టి, ఒక దొడ్డ వెడద చిల్కున = ఒక పెద్ద విశాలమైన బాణముచే, వాని సింగాణిన్ = వాని ధనుస్సును, తునియలు చేసి = ముక్కలు చేసి, ఐదు తూపుల = ఐదు బాణములతో, అరదంబు తోలువానిన్ = సారధిని, అడంచి = చంపి, అన్నియె ములుకుల = అంతే బాణములతో, అబ్బురముగన్ = అద్భుతముగ, తేరును = రథమును, మావులన్ = గుఱ్ఱములను, తెగటార్చి = నాశముచేసి, మఱియును, నెఱిన్ = చక్కగా, కీలు నోన్ ఏయ = మర్మములు నొచ్చునట్లుగా వేయగా, నేయి దొరయు = నేయి తగిలిన, అగ్గి చాడ్పునన్ = అగ్నివలె, మండి, అరదంబు = రథమును, డిగి = దిగి, వాడు = ఆ మకరాక్షుడు, మొక్కలంబుగన్ = ధైర్యముతో, డాసి = చేరి, మొనలవాలు = త్రిశూలమును, వైవ = విసరగా, అది = ఆ త్రిశూలమును, నేలతాల్పున్ = రాజులయందు, కల్వల అనుంగు = చంద్రుడగు రాముడు, మూడు నెఱ నారసముల = మూడు చక్కని బాణములతో, వమ్ముగన్ ఒనర్చెన్ = పనికిరాకుండ చేసెను, అంత = అంతట, రక్కసుడు = రాక్షసుడు, ఎకిమీనిన్ = రాముని, అలమి పట్టి = పొదివి పట్టుకొని, బిగి ఎలర్పగన్ = బిగింపు అతిశయింపగా, పిడికిటన్ = పిడికిలితో, బిట్టు పొడిచె = గట్టిగా పొడిచెను.

**తా :** విరియించి ఒక పెద్ద బాణముచే వాని వింటిని ముక్కలు చేసి, ఐదు బాణములతో సారధిని చంపి, అంతే బాణములతో అద్భుతముగ రథమును, గుఱ్ఱములను చంపి, మర్మములు నొచ్చునట్లుగా వేయగా నేయి తగిలిన అగ్నిలా మండి వాడు రథమును దిగి ధైర్యముతో చేరి త్రిశూలమును విసరగా రాముడు మూడు బాణములతో పనికిరాకుండ చేసెను. అంతట రాక్షసుడు రాముని పొదివి పట్టుకొని పిడికిలితో గట్టిగా పొడిచెను.

**కం.** **పొడిచినఁ దద్దయు గొఱకొఱ**
**యడరఁగ రా చందమామ యగ్గి ములికి నె**
**వ్వడిఁ బూని యేయఁ బుడమిన్**
**బడి యత్తొలివేల్పు మేలుబంతి యడంగెన్** **318**

పొడిచినన్, తద్దయు = మిక్కిలి, కొఱకొఱ = కోపము, అడరగ = వ్యాపింపగా, రా చందమామ = రాచ చంద్రుడు, అగ్గి ములికి = ఆగ్నేయాస్త్రమును, పూని = పూనుకొని, నెవ్వడిన్ = మిక్కిలి వేగముగా, ఏయన్ = వేయగా, పుడమిన్ పడి = నేలపై పడి, ఆ తొలివేల్పు మేలుబంతి = ఆ రాక్షస శ్రేష్ఠుడు, అడంగెన్ = మరణించెను.

**తా :** పొడిచిన మిక్కిలి కోపము వ్యాపింపగా రాముడు ఆగ్నేయాస్త్రము వేయగా ఆ రాక్షసుడు నేలపై పడి వెంటనే మరణించెను.

**కం.** **కలన మకరాక్షుఁ డట్టుల**
**నిలిగిన చందంబు సోఁకు టేలికతోడన్**
**బొలదిండులు గొందఱు సని**
**తెలిపినఁ గడు నడలి యతఁడు దిటమున నంతన్** **319**

కలన = యుద్ధమున, మకరాక్షుడు, అట్టుల = ఆ రీతిగా, నిలిగిన = మరణించిన, చందంబు = విధమును, సోకు ఏలికతోడన్ = రావణునితో, పొల తిండులు = రాక్షసులు, కొందఱు = కొంతమంది, చని = వెళ్ళి, తెలిపినన్ = చెప్పగా, కడున్ అడలి = మిక్కిలి బాధపడి, అతడు = ఆ రావణుడు, దిటమున = ధైర్యముతో, అంతన్ = అంతట,

తా : యుద్ధమున మకరాక్షుడు మరణించిన విధమును రాక్షసులు రావణునితో వెళ్ళి చెప్పగా అతడు మిక్కిలి బాధపడి ధైర్యముతో అంతట.

**తే.గీ.** **వేల్పు రా గెల్పుకాని రావించి యిందుఁ**
**బేరుగల జోదు లందఱుఁ బోరఁ గూలి**
**రింక నీ వేఁగి దురమున నెల్ల కోఁతి**
**దొరల రాచూలులను జంపి సరగ రమ్ము** **320**

వేల్పురా = ఇంద్రుని, గెల్పుకాని = గెలిచినవానిని (ఇంద్రజిత్తుని), రావించి = రప్పించి, ఇందున్ = మన పక్షమున, పేరుగల జోదులు = పేరున్న వీరులు, అందఱున్ = అందరును, పోరన్ = యుద్ధమున, కూలిరి = మరణించిరి, ఇంక = ఇక, నీవు, ఏగి = వెళ్ళి, దురమున = యుద్ధమున, నెల్ల కోతి దొరల = వానరులందరను, రా చూలులను = రాకుమారులను, చంపి, సరగ = శీఘ్రముగా, రమ్ము.

**తా :** ఇంద్రజిత్తుని రప్పించి మన పక్షమున పేరుగల వీరులు అందఱును మరణించిరి. ఇంక నీవు ఏగి యుద్ధమున వానరులను, ఆ రాకుమారులను చంపి వెంటనే రమ్ము.

**కం.** **అని పలికి నెయ్యమున న**
**క్కునఁ జేరిచి యనికి వీడుకొల్పిన నతఁ డా**
**తనికిన్ మ్రొక్కియు మిహి కుం**
**దనపుం దేరెక్కి యుక్కు దళుకొత్తంగన్** **321**

అని పలికి, నెయ్యమున = ప్రేమతో, అక్కునన్ = కౌగిట, చేరిచి = చేర్చుకొని, అనికి వీడుకొల్పినన్ = యుద్ధమునకు పంపగా, అతడు = ఆ ఇంద్రజిత్తు, ఆతనికిన్ = ఆ రావణునకు, మ్రొక్కియు = నమస్కరించి, మిహి = శ్రేష్ఠమైన, కుందనపున్ తేరు = బంగారు రథమును, ఎక్కి, ఉక్కు తళుకొత్తంగన్ = పరాక్రమము ప్రకాశింపగా –

**తా :** అని పలికి ప్రేమతో కౌగిట చేర్చుకొని పంపగా అతడు ఆ రావణునికి నమస్కరించి మంచి బంగారు రథమును ఎక్కి పరాక్రమము ప్రకాశింపగా –

సీ. కేల్గల మెకముల గీపెట్టుటలును మా
వుల సకిలింత లగ్గలపుఁ దేర్ల
రొదలు కాలరుల యార్పులు వాయిదంబుల
మ్రోఁతలు నొక్కటై ముజ్జగంబు
బెగడింప నలుగుల బెడిదంపు మెఱుఁగులు
విను ద్రిమ్మరుల చూడ్కి వెనుక కొత్త
బలు దుమారము సంద్రముల నెల్ల నింకింపఁ
బడగ గాడ్పులు మబ్బుఁ బాఱఁ దఱుమఁ

తే.గీ. దేజదర నేఁగి యొక చెంతఁ దేరు డిగ్గి
పొలసు మేపరి గములు తన్బొదివి చుట్టు
దట్టముగఁ గాచుకొనఁగ నెంతయుఁ గడంక
నచటఁ దిగమూల లేర్పడ నరుగు సలిపి 322

కేలు కల మెకముల = ఏనుగుల యొక్క, గీపెట్టుటలును = ఘీంకారములును, మావుల = గుఱ్ఱముల, సకిలింతలు, అగ్గలపున్ = అధికమైన, తేర్ల = రథములయొక్క, రొదలు = ధ్వనులు, కాలరుల = కాల్బలము యొక్క, ఆర్పులు, వాయిదంబుల, మ్రోతలును, ఒక్కటై = ఏకమై, ముజ్జగంబు = మూడు లోకములను, బెగడింపన్ = భయపెట్టగా, అలుగుల = ఆయుధములయొక్క, బెడిదంపు = భయంకరమైన, మెఱుగులు = కాంతులు, విను త్రిమ్మరుల = దేవతలయొక్క, చూడ్కి = చూపులను, వెనుకకు ఒత్త = వెనక్కి మరలించుచుండగా, బలు దుమారము = అధికమైన ధూళి, సంద్రములను ఎల్లన్ = సముద్రముల నన్నిటిని, ఇంకింపన్, పడగ = పతాకాల, గాడ్పులు = గాలులు, మబ్బున్ = మేఘమును, పాఱన్ = చెదరిపోవునట్లుగా, తఱుమన్ = తరిమివేయగా, తేజు అదరన్ = శౌర్యము దీపింపగా, ఏగి = వెళ్ళి, ఒక చెంత = ఒక చోట, తేరు డిగ్గి = రథమును దిగి, పొలసు మేపరి గములు = రాక్షస సమూహములు, తను = తనను, పొదివి = పట్టుకొని, చుట్టు = చుట్టును, దట్టముగన్ = సాంద్రముగ, కాచుకొనగ = రక్షించుచుండగా, ఎంతయున్ = మిక్కిలి, కడంకన్ = పూనికతో, అచటన్ = అక్కడ, తిగమూలలు = మూడు మూలలు, ఏర్పడన్ = ఏర్పడునట్లు, అరుగు సలిపి = వేదిక నేర్పరచి.

**తా :** ఏనుగుల ఘీంకారములు, గుఱ్ఱముల సకిలింపులు, రథముల ధ్వనులు, కాల్బలము అరుపులు, వాయిద్యముల మ్రోతలు ఏకమై మూడు లోకములను భయపెట్టగా ఆయుధముల భయంకరమైన కాంతులు దేవతలయొక్క చూపులను వెనుకకు మరలించగా, అధికమైన ధూళి సముద్రముల నన్నిటిని ఇంకింపగా, గాలులు మేఘమును చెదరిపోవునట్లు తరిమి వేయగా శౌర్యము దీపింపగా వెళ్ళి ఒకచోట రథమును దిగి రాక్షసులు తనను చుట్టుముట్టి రక్షించుచుండగా అక్కడ మూడు మూలలు ఏర్పడునట్లు వేదిక నేర్పరచి

సీ. కడిఁదిగాఁ బెతరుల పుడమి నగ్గి రవుల్చి
తొవరుఁ బుట్టములఁ గెంబువులఁ దాల్చి

**కుదురొప్పఁ బురియపైఁ గూర్చుండి మానిసి**
**నెత్తురు నంజుడు నేయి నువ్వు**
**లావాలు పాలు మేలగు తాఁడి పుడకలు**
**నెలమి నాలవ తొలిపలుకు నుడువు**
**లోలిమై గొడఁగుచు వ్రేలుచుటయు నందుఁ**
**గల్లరి సత్తి యొకర్తు వొడమి**

**తే.గీ.** **పని గొలుపుమంచు నిలిచినఁ గని చెలంగి**
**దానితోఁ గూడ రిక్కల దారి కేఁగి**
**కారుమబ్బులు జడివాన గడఁగి కురియు**
**పగిది నంపర కోఁతులపైనిఁ గురిసె** **323**

కడిదిగాన్ = కఠినమైన, పెతరుల పుడమిన్ = పితరుల భూమి స్మశానమున, అగ్గి రవుల్చి = నిప్పు రాజేసి, తొవరున్ = ఎఱ్ఱనైన, పుట్టములు = వస్త్రములు, కెంపు పువులన్ = ఎఱ్ఱని పూవులను, తాల్చి = ధరించి, కుదురొప్పన్ = స్థిరముగా కుదిరిన, పురియపై = పుట్టెమీద, కూర్చుండి, మానిసి నెత్తురు, నంజుడు = మాంసమును, నేయి, నువ్వులు, ఆవాలు, పాలు, మేలగు = శ్రేష్ఠమైన, తాడి పుడకలున్, ఎలమిన్ = చక్కగా, నాలవ తొలిపలుకు నుడువులు = అధర్వ వేదమునందలి మంత్రములు, ఓలిమై = స్వరసహితముగా, గొడగుచు = లోన పఠించుచు, వ్రేలుచుటయును = అగ్నిహోత్రమును వేల్వగా, అందున్ = ఆ హోమాగ్నియందు, కల్లరి = దుష్టురాలైన, సత్తి = శక్తి, ఒకర్తు = ఒకామె, పొడమి = పుట్టి, పని గొలుపుమంచు = పనియందు నియోగింపుమని పలుకుచు, నిలిచినన్ = ఎదుట నిలబడగా, కని = చూచి, చెలంగి = విజృంభించి, దానితోన్ కూడ = ఆ శక్తితో కూడ, రిక్కల దారికి ఏగి = ఆకాశమార్గమునకు వెళ్ళి, కారుమబ్బులు = నల్లని మేఘములు, జడివాన, కడగి = పూని, కురియుపగిదిన్ = కురియునట్లు, అంపఱన్ = బాణసమూహములను, కోతులపైనిన్ = వానర యోధులమీద, కురిసెన్ = కురిపించెను.

**తా :** స్మశానమున నిప్పు రాజేసి ఎఱ్ఱని వస్త్రములు, ఎఱ్ఱని పూవులు ధరించి స్థిరముగా పుట్టెమీద కూర్చుండి మనిషి నెత్తురు, మాంసము, నెయ్యి, నువ్వులు, ఆవాలు, పాలు, తాడి పుడకలు, చక్కగా అధర్వ వేదమంత్రములు స్వరయుక్తముగా లోన పఠించుచు అగ్నిహోత్రమును వేల్చగా, ఆ హోమాగ్నియందు దుష్ట శక్తి ఒకర్తు పుట్టి పని నియోగింపు మని పలుకుచు ఎదుట నిలబడగా చూచి చెలగి ఆ శక్తితో కూడ ఆకాశమార్గమునకు వెళ్ళి కారుమబ్బులు, జడివాన కురియునట్లు బాణములను ఆ కోతులపై కురిపించెను.

**చం.** **కురిసినఁ బ్రోవులై పుడమిఁ గూలెడువారు గొఱంత లేని పో**
**టరితనమేది యీఱముల డాఁగెడువారు నొడళ్ళు వ్రస్సి నె**
**త్తురుల మునుంగువా రసము దూలి పొరింబొరిఁ బాఱువారు వా**
**విరిఁ బలవించువారునయి వేఁగిరి తద్దయుఁ గొండ ద్రిమ్మరుల్** **324**

కురిసినన్ = కురియగా, ప్రోవులై = కుప్పలై, పుడమిన్ = భూమియందు, కూలెడువారు, కొఱంతలేని = ఏమియు తక్కువకాని, పోటరితనము = యోధత్వము, ఏది = పోగొట్టుకొని ఈఱములన్ = పొదలయందు, డాగెడువారున్ = దాగెడువారును, ఒడళ్ళు = శరీరములు, వ్రస్సి = తెగి, నెత్తురులన్ = రక్తములందు, మునుంగువారు = మునిగిపోవువారు, అసము = కీర్తి, తూలి = చలించి, పొరింబొరిన్ = వేగముగా, పాఱువారు, = పారిపోవువారును, వావిరిన్ = అధికముగా, పలవించువారునయి = పలవరించువారునయి, తద్దయున్ = మిక్కిలిగా, కొండ ద్రిమ్మరుల్ = వానరులు, వేగిరి = బాధపడిరి.

**తా :** కురియగా కుప్పలై భూమిని కూలెడువారు, కొఱతలేని పోటరితనము పోగొట్టుకొని పొదలలో దాగెడువారు, శరీరములు తెగి నెత్తురున మునుగువారు, కీర్తి తూలి వేగముగా పారిపోవువారు, ఎక్కువగా పలవరించువారునయి వానరులు మిక్కిలి బాధపడిరి.

**కం.** **మిడుతల గడితము తొలకరి**
**పిడుగుల బెడిదంబు చిలువ పిండుల వడియున్**
**జడివాన పెల్లు నడరఁగఁ**
**కడు బడలఁగఁ జేసెఁ గోఁతిగమి నత్తూపుల్** **325**

మిడుతల, గడితము = సాంద్రత, తొలకరి, పిడుగుల, బెడిదంబు = కాఠిన్యము, చిలువ పిండుల = పాముల సమూహముయొక్క, వడియున్ = వేగమును, జడివాన, పెల్లును = ఆధిక్యమును, అడరగన్ = వ్యాపింపగా, కోతిగమిన్ = వానర సమూహమును, ఆ తూపుల్ = ఆ బాణములు, కడున్ = మిక్కిలి, బడలగన్ చేసెన్ = బాధపడునట్లు చేసెను.

**తా :** మిడుతల దండులా, తొలకరి పిడుగుల కాఠిన్యముతో, పాముల సమూహము వేగముతో జడివాన వ్యాపింపగా వానరులను ఆ బాణములు మిక్కిలి బాధించెను.

**తే.గీ.** **అపుడు పనసుండు నీలుండు నంగదుండు**
**గజుఁడు నలుఁడు గవాక్షుండు గాడ్పుకొడుకు**
**గంధమాదనుఁ డెలుఁగుల గామిడియును**
**మొదలుగల జెట్టి మగలు నెమ్మదిఁ జెలంగి** **326**

గాడ్పు కొడుకు = హనుమ, ఎలుగుల గామిడియును = ఎలుగులలో శ్రేష్ఠుడగు జాంబవంతుడును, నెమ్మదిన్ = నెమ్మదిగా, చెలంగి = విజృంభించి,

**తా :** అప్పుడు పనసుడు, నీలుడు, అంగదుడు, గజుడు, నలుడు, గవాక్షుడు, హనుమ, గంధమాదనుడు, జాంబవంతుడు మొదలైన వీరులు నెమ్మదిగా విజృంభించి.

**తే.గీ.** **మలలు ప్రాఁకులుఁ బడుకులు బలిమిఁ బెటికి**
**నింగి యెల్లను గప్పికొనంగవైచి**
**గారడపు రక్కసుని నెందుఁ గానకుండి**
**రంత వాఁడవి సరగ వ్రయ్యలుగఁ జేసి** **327**

మలలు = కొండలు, మ్రాకులున్ = చెట్లును, పడుకులు = రాళ్ళు, బలిమిన్ = శక్తికొద్దీ, పెఱికి = పెకలించి, నింగి ఎల్లను = ఆకాశమంతయును, కప్పికొనంగ = కప్పివేయునట్లుగా, వైచి = వేసి, గారడపు రక్కసుని = వంచకుడైన ఇంద్రజిత్తుని, ఎందున్ = ఎచ్చటను, కానకుండిరి = చూడలేకపోయిరి, అంత = అంతట, వాడు = ఆ ఇంద్రజిత్తు, సరగ = వేగముగా, అవి = వానరులు ప్రయోగించిన వాటిని, వ్రయ్యలుగ చేసి = ముక్కలుగ చేసి.

**తా :** కొండలు, చెట్లు, రాళ్ళు శక్తికొద్దీ పెకలించి నింగియెల్ల కప్పివేయునట్లుగా వేసి వంచకుడైన ఇంద్రజిత్తును ఎచ్చటను చూడలేకపోయిరి. అంతట ఆ ఇంద్రజిత్తు వేగముగా వానరులు ప్రయోగించిన వాటిని ముక్కలుగ చేసి.

**కం.** **వారల మీఁదను బెడిదపు**
**నారసములు పెక్కు పఱపి నజ్జుగఁ జేయన్**
**బీరము సెడి రాచకొలపుఁ**
**బైరుల యెకిమీని మఱువుపట్టి తలఁకుచున్** **328**

వారల మీదను = ఆ వానరులమీద, బెడిదపు = కఠినమైన, నారసములు = బాణములు, పెక్కు పఱపి = పెక్కు వేసి, నజ్జుగ చేయన్ = నలినలి చేయగా, బీరము చెడి = ధైర్యము కోల్పోయి, రాచకొలపున్ = రాజవంశమునకు, పైరుల ఎకిమీనిన్ = పైరులను రక్షించువాడు చంద్రుడు (రాముడు), మఱువు పట్టి = చాటునకు చేరి, తలకుచున్ = భయముతో –

**తా :** ఆ వానరులమీద కఠినమైన బాణములు పెక్కు వేసి నలినలిచేయగా ధైర్యము కోల్పోయి రాముని చాటున చేరి భయముతో –

**తే.గీ.** **అపుడు రాముఁడు సోఁకు దయ్యంబువలనఁ**
**బొలసు మేపరి తెఱఁగెల్లఁ దెలిసి కొండ**
**నత్తమిలు మేటి దేవర యమ్ముఁ దొడిగి**
**యేయుటయు సత్తి రూపఱిపోయె మింట** **329**

అపుడు, రాముడు, సోకు దయ్యంబువలనన్ = విభీషణునివలన, పొలసు మేపరి తెఱగెల్లన్ = ఇంద్రజిత్తు విషయమునంతను, తెలిసి = తెలుసుకొని, కొండన్ అత్తమిలు మేటి దేవర = పశ్చిమ కొండపై అస్తమించువాడు సూర్యుని, అమ్మున్ = బాణమును, దొడిగి = సంధించి, ఏయుటయు = ప్రయోగించుటయును, సత్తి = ఆ క్షుద్రశక్తి, మింట = ఆకాశమునందే, రూపఱిపోయె = నశించిపోయెను.

**తా :** అపుడు రాముడు విభీషణునివలన ఇంద్రజిత్తు విషయమునంతను తెలుసుకొని ఆదిత్యాస్త్రమును సంధించి ప్రయోగించగా ఆ క్షుద్రశక్తి ఆకాశమునందే నశించెను.

**ఆ.వె.** **పోవ దడవు స్రుక్కి రావణు తొలిపట్టి**
**తేరితోడఁ బుడమిఁ ద్రెళ్ళి నిబ్బ**
**రంబు పాదుకొల్పి రాచూలి బంటులఁ**
**గనుపుఁగొట్టుకొనుచుఁ గడఁగి మఱియు** **330**

పోవన్ = క్షుద్రశక్తి పోగా, తడవు = చాలసేపు, స్రుక్కి = బాధపడి, రావణు తొలి పట్టి = రావణుని పెద్దకొడుకు, తేరితోడన్ = రథముతోకూడ, పుడమిన్ ద్రెళ్ళి = నేలపై పడి, నిబ్బరంబు పొదుకొల్పి = ధైర్యము తెచ్చుకొని, రాచూలి బంటులన్ = వానరులను, కనుపున్ కొట్టుకొనుచున్ = ఖాళీయగునట్టు కొట్టుకొనుచు, కడగి = పూనుకొని, మఱియు = ఇంకను.

**తా :** క్షుద్రశక్తిపోగా చాలసేపు బాధపడి ఇంద్రజిత్తు రథముతో కూడా నేలపై దిగి ధైర్యము తెచ్చుకొని వానరులను పూనుకొని ఖాళీయగునట్లు కొట్టుకొనుచు ఇంకను.

**తే.గీ.** **గంధమాదను మైందుని గవయు ద్వివిదు**
**నలుని నీలుని శతవలిఁ గలఁచె రెండు**
**తొమ్ముదులు నేఁడు పంద్రెండు బమ్మ లెక్క**
**తొమ్మిదియు నైదు మూఁడును దూపులేసి** **331**

రెండు తొమ్ముదులున్ = 18 బాణములతో, గంధమాదను, ఏడు = ఏడు బాణములతో, మైందుని, పంద్రెండు = 12 బాణములతో, గవయుని, బమ్మ లెక్క = నవ బ్రహ్మలు 9 బాణములతో, ద్వివిదుని, తొమ్మిదియున్ = 9 బాణములతో, నలుని, ఐదు = 5 బాణములతో, నీలుని, మూడును తూపులు = మూడు బాణములతో, శతవలిని, ఏసి = ప్రయోగించి, కలచె = బాధించెను.

**తా :** 18 బాణములతో గంధమాదనుని, 7 బాణములతో మైందుని, 12 బాణములతో ద్వివిదుని, 9 బాణములతో నలుని, 5 బాణములతో నీలుని, 3 బాణములతో శతవలిని కొట్టి బాధించెను.

**సీ.** **అత్తఱి వానిపై నంగదుం డొక పెను**
**పడుకును కేసరి కడిమి ఫ్రూను**
**సంపాతి తాడియు శరభుఁడు దిన్నయు**
**నలుఁడు మట్టియు నెలుంగుల యొడయఁడు**
**కోఁతులదొరయు బల్ కొండలు దక్కిన**
**బంటు లెల్లను జెట్లు పడుకుగములు**
**తొలివేల్పు తేని సైదోడు ద్రుడ్డును లక్ష్మ**
**ణుఁడు మూఁడు తూపులు నూఱు నార**

**తే.గీ.** **సములు రాముఁడు నడరింప సరగ వాని**
**విల్లు నురుముగఁ జేయ నా బల్లిదుండు**
**వారి నందఱఁ బెక్కు క్రొవ్వాడి ములుకి**
**మొత్తముల చేతఁ దద్దయు మొక్క పఱచి** **332**

ఆ తఱిన్ = ఆ సమయమందు, వానిపైన్ = ఆ ఇంద్రజిత్తుమీద, అంగదుండు, ఒక పెన్ పడుకును = ఒక పెద్ద బండరాయిని, కేసరి, కడిమి మ్రాను = కడిమి చెట్టును, సంపాతి, తాడియు = తాడిచెట్టును, శరభుడు = దిన్న వృక్షమును, నలుడు, మట్టియున్ = మట్టి చెట్టును, ఎలుంగుల ఒడయడు = జాంబవంతుడు, కోతుల దొరయు = సుగ్రీవుడును, బల్ కొండలు = పెద్ద కొండలు,

తక్కిన బంటులు ఎల్లను, చెట్లు పడుకుగములు = చెట్లు రాళ్ళ సమూహములు, తొలివేల్పు తేని సైదోడు = రావణుని తమ్ముడు విభీషణుడు, ద్రుద్దును = దుద్దును, లక్ష్మణుడు, మూడు తూపులును, నూఱు నారసములు = 100 బాణములు, రాముడు, అడరింప = ప్రయోగింపగా, సరగ = శీఘ్రముగా, వాని విల్లు = ఆ ఇంద్రజిత్తు ధనుస్సును, ఉరుముగ చేయన్ = ముక్కలు చేయగా, ఆ బల్లిదుండు = ఆ బలశాలి, వారి నందఱన్, పెక్కు క్రొవ్వాడి ములుకి మొత్తములచేతన్ = పలు వాడియైన బాణసమూహముచేత, తద్దయు = మిక్కిలి, మొక్కపఱచి = చీకాకు పఱచి,

**తా :** ఆ సమయమున ఆ ఇంద్రజిత్తుమీద అంగదుడు ఒక పెద్ద బండరాయిని, కేసరి కడిమి చెట్టును, సంపాతి తాడిచెట్టును, శరభుడు దిన్న వృక్షమును, నలుడు మఱ్ఱి చెట్టును, జాంబవంతుడు, సుగ్రీవుడు పెద్ద కొండలును, సైనికులందరూ చెట్లు, రాళ్ళను, విభీషణుడు దుద్దును, లక్ష్మణుడు మూడు బాణములను, రాముడు వంద బాణములను ప్రయోగింపగా వెంటనే ఆ ఇంద్రజిత్తు విల్లును ముక్కలు చేయగా ఆ బలశాలి వారి నందఱిని పలు వాడియైన బాణములచే చీకాకు పఱచి

**కం.** **మరలి నికుంభిళకుం జని**
**తిరముగ నందంటరాని దేవర యలరన్**
**విరివిగ వ్రేలిమి యొక్కటి**
**కర మరుదుగ నేమమూని కావించు తఱిన్ 333**

మరలి = తిరిగి, నికుంభిళకున్, చని = వెళ్ళి, తిరముగన్ = నిశ్చలముగా, అందు = అక్కడ, అంటరాని దేవర = ముట్టుకొనుటకు వీలుపడనివాడు అగ్నిహోత్రుడు, అలరన్ = సంతసింపగా, విరివిగ = ఎక్కువగా, వ్రేలిమి ఒక్కటి = ఒకానొక హోమమును, కరము అరుదుగ = మిక్కిలి అరుదైన, నేమము ఊని = నియమమును పూని, కావించు తఱిన్ = చేయు సమయమున.

**తా :** తిరిగి నికుంభిళకు వెళ్ళి నిశ్చలముగా అక్కడ అగ్నిహోత్రుడు సంతసింపగా ఎక్కువగా ఒక హోమమును మిక్కిలి అరుదైన నియమముతో చేయు సమయమున.

**తే.గీ.** **ముజ్జగంబుల నప్పొగ ముంచుకొనినఁ**
**గనుఁగొని విభీషణుఁడు రాచకలువఱేనిఁ**
**జేరి దేవర! విను మింద్రజిత్తుఁ డిపుడు**
**వ్రేల్మి నొక్కటి నెమ్మిఁ గావింపఁ దొడఁగె 334**

మూడు జగంబులన్, ఆ పొగ, ముంచుకొనిన, కనుగొని, విభీషణుడు, రాచకలువఱేని = రాజచంద్రుని రాముని, చేరి, దేవర = ప్రభూ!, వినుము, ఇంద్రజిత్తుడు, ఇపుడు, వ్రేల్మిన్ ఒక్కటిన్ = ఒకానొక హోమమును, నెమ్మిన్ = ప్రీతితో, కావింపన్ తొడగె = చేయుటకు ప్రారంభించెను.

**తా :** మూడు లోకాలు ఆ పొగ ముంచుకొనిన చూచి విభీషణుడు రాముని చేరి 'ప్రభూ! విను. ఇంద్రజిత్తు ఇపుడు ఒకానొక హోమమును ప్రీతితో చేయుటకు ప్రారంభించెను.

**కం.** **అది నిండెనేని వానిం**
**బదపడి ముక్కంటియైన బవరంబున నె**
**మ్మది గెలువఁ జాలకుండెదు**
**నది గావున వ్రేల్మి సెరుప నంపుము మూఁకన్** **335**

అది నిండెనేని = అది పూర్తియైనచో, వానిన్, పదపడి = తరువాత, ముక్కంటియైన = పరమశివుడైనను, బవరంబునన్ = యుద్ధమునందు, నెమ్మది = ఓర్పుగా, గెలువన్ = గెలుచుటకు, చాలకుండెదున్ = సరిపోకుందురు, కావున = అందుచేత, అది వ్రేల్మి = ఆ హోమమును, చెరుప = ఆపుటకు, మూకన్ = సైన్యమును, అంపుము = పంపుము.

**తా :** అది పూర్తియైనచో వానిని తరువాత ముక్కంటియైనా యుద్ధమునందు గెలుచుటకు సరిపోకుందురు. కావున ఆ హోమమును ఆపుటకు సైన్యమును పంపుము'.

**తే.గీ.** **అనుచుఁ దెల్పిన రాగవుం డపుడె కూర్మి**
**తోడఁబుట్టువుఁ బౌజులతోడఁ గూర్చి**
**వానిఁ దెగటార్చి రమ్మని వాలుతూపు**
**గములఁ బెక్కిడి యనిచినఁ గదలి యరిగి** **336**

అనుచున్, తెల్పిన, రాగవుండు, అపుడె, కూర్మి = ప్రీతితో, తోడబుట్టువు = లక్ష్మణుని, పౌజులతోడన్ = సైన్యముతో, కూర్చి = కలిపి, వానిన్ = ఆ ఇంద్రజిత్తుని, తెగటార్చి = సంహరించి, రమ్మని, వాలుతూపుగములన్ = వాడియైన బాణ సమూహములను, పెక్కు ఇడి = చాల ఇచ్చి, అనిచినన్ = పంపగా, కదలి అరిగి = బయలుదేరి వెళ్ళి.

**తా :** అని తెల్పిన రాముడు వెంటనే లక్ష్మణుని సైన్యముతో కూర్చి ఆ ఇంద్రజిత్తుని సంహరించి రమ్మని వాడి బాణముల నిచ్చి పంపగా బయలుదేరి వెళ్ళి.

**తే.గీ.** **రక్కసుఁడు వ్రేల్మి యొనరించు చక్కి దరియు**
**నెడల నచ్చటఁ గాపున్న యెఱచిదిండి**
**మూఁక లాకోన ద్రిమ్మరి మూఁకతోడ**
**నెదురుకొనుటయు నిరువాగు గదిసి యపుడు** **337**

రక్కసుడు = ఆ ఇంద్రజిత్తు, వ్రేల్మి యొనరించు = హోమముచేయు, చక్కి = ప్రదేశము, దరియునెడల = సమీపించు సమయాన, అచ్చట = అక్కడ, కాపున్న = కాపలాగా ఉన్న, ఎఱచి తిండి మూకలు = రాక్షస సైన్యములు, ఆ కోన ద్రిమ్మరి మూకతోడ = ఆ వానర సైన్యముతో, ఎదురుకొనుటయు, ఇరువాగు = రెండు పక్షములు, కదిసి = ఎదరుపడి, అపుడు = అప్పుడు –

**తా :** ఆ ఇంద్రజిత్తు హోమము చేయు ప్రదేశము సమీపించు సమయాన అక్కడ కాపున్న రాక్షస సైన్యములు ఆ వానర సైన్యముతో ఎదుర్కొనగా రెండు పక్షములు అపుడు –

**కం.** **పెల్లుగ నడఁచుచుఁ బొడుచుచుఁ**
**గొల్లఁగఁ గూఁకలిడుకొనుచు గుదియల సురెలన్**

**బల్లెములఁ జెట్లఁ బదుకుల**
**నల్ల పొరలిపాఱఁ బోరొనర్చిరి కడిమిన్ 338**

పెల్లుగన్ = అధికముగా, అడచుచున్ = ఒకరినొకరు అణచికొనుచు, పొడుచుచు = పొడుచు కొనుచు, కొల్లగన్ = అధికముగా, కూకలు ఇడుకొనుచు = కేకలు పెట్టుకొనుచు, గుదియల = దుడ్డులతో, సురెలన్ = కత్తులతో, బల్లెముల, చెట్ల, పదుకుల = రాళ్లతో, నల్ల = రక్తము, పొరలి పాఱ = పొంగి ప్రవహించగా, కడిమిన్ = శౌర్యముతో, పోరు ఒనర్చిరి = పోరాడిరి.

**తా :** ఎక్కువగా ఒకరినొకరు అణచుకొనుచూ, పొడుచుచూ, కేకలు పెట్టుకొనుచూ, దుడ్డులతో, కత్తులతో, బల్లెములతో, చెట్లతో, రాళ్ళతో రక్తము పొంగి ప్రవహించగా శౌర్యముతో పోరాడిరి.

**కం. అత్తఱి గుబ్బలి ద్రిమ్మరి**
**మొత్తంబులు సోఁకుమూఁక మొనలను నెల్లన్**
**దుత్తుమురు సేసి మగఁటిమి**
**హత్తుకొనంగ జమువీటి కనిచెన్ వేగన్ 339**

ఆ తఱిన్ = ఆ సమయమున, గుబ్బలి త్రిమ్మరి మొత్తంబులు = వానర సమూహములు, సోకుమూక = రాక్షస సైన్యముయొక్క, మొనలను = ఆయుధములను, ఎల్లన్ = అన్నిటిని, తుత్తుమురు చేసి = నాశనము చేసి, మగటిమి హత్తుకొనంగ = పౌరుషము వెల్లడియగునట్లు, జమువీటికి = యమసదనమునకు, వేగన్ = తొందరగా, అనిచెన్ = పంపించెను.

**తా :** అపుడు వానర సమూహములు రాక్షస సైన్యముయొక్క ఆయుధములనన్నిటిని నాశనము చేసి మగటిమితో తొందరగా వారిని యమసదనమునకు పంపించిరి.

**ఆ.వె. అనిచి సోఁకుఱేని యనుఁగు మే పుట్టువుఁ**
**పొదివికొనిన వాడు నుదరి లేచి**
**వ్రేల్మి పోవఁబెట్టి వ్రేల్మిడిఁ దేరెక్కి**
**కడిఁది మగతనంబె గడలుకొనగ 340**

అనిచి = పంపి, సోకుఱేని యనుగు మే పుట్టువున్‌పన = రావణుని తనూజుడగు ఇంద్రజిత్తును, పొదివికొనిన = చుట్టుముట్టగా, వాడు, ఉదరి = అదరిపడి, లేచి, వ్రేల్మి పోవబెట్టి = హోమమును విడచిపెట్టి, వ్రేల్మిడిన్ = తక్షణము, తేరు ఎక్కి = రథమునెక్కి, కడిది = మిక్కిలి, మగతనంబె = పౌరుషమే, గడలుకొనగ = వ్యాప్తిచెందగా –

**తా :** పంపి ఇంద్రజిత్తును చుట్టుముట్టగా వాడు అదరిపడి లేచి హోమమును విడచిపెట్టి తక్షణము రథమునెక్కి మిక్కిలి పౌరుషము గడలుకొనగా –

**సీ. ప్రోల్కఁ గూల్పఁ గడంగు పునుక దాలుపు మాడ్కి**
**జగమడంపఁగఁ బూను జముని కరణి**
**నుసిరిక ప్రూనుపై దొరలెడు పిడుగు ల**
**ట్లడవిపైఁ బేర్చు కారగ్గి పగిది**

**జింకలపై దాడిసేయు బొబ్బిలి పోల్కి**
**ననదోఁట బెరయు పెన్గాడ్పు నోజఁ**
**దమ్మికొలను సొచ్చు కొమ్ముటేనుఁగు తీవిఁ**
**బాములఁ దోల్పక్కి సామి జాడఁ**

**తే.గీ.** **కోఁతి మూఁకల మీఁద దాకొని కడంకఁ**
**గుత్తుకలు ద్రెంచి చేతులు గోసి తొడలు**
**నఱికి చట్టలు చీరి కండలు పెకల్చి**
**బొజ్జలు వగిల్చి మేనులు నజ్జు సేసి** **341**

ప్రోల్చన్ = త్రిపురములను, కూల్పన్ = కూల్చుటకు, కడంగు = పూనుకొను, పునుక తాలుపు మాడ్కి = శివునివలె, జగము అడంపగ = లోకము నాశనముచేయ, పూను = సిద్ధపడు, జముని కరణి = యమునివలె, ఉసిరిక మ్రానిపై = ఉసిరిచెట్టుమీద, దొరలెడు = దొర్లే, పిడుగులు అట్లు, అడవిపైన్, పేర్చు = వ్యాపించు, కారగ్గి పగిది = కారుచిచ్చువలె, జింకలపై, దాడిచేయు, బొబ్బిలి పోల్కి = పెద్దపులివలె, నన తోటలన్ = లేత తోటలను, పెరయు = విరిచివేయు, పెన్గాడ్పున్ ఓజన్ = పెనుగాలివలె, తమ్మికొలను = పద్మ సరోవరము, చొచ్చు = ప్రవేశించు, కొమ్ము ఏనుగు తీవిన్ = మదపుటేనుగువలె, పాముల తోలు = పాములను పరుగెత్తించు, పక్కిసామి జాడన్ = గరుత్మంతునివలె, కోతి మూకల మీద, దాకొని = దండెత్తి, కడంకన్ = పూనికతో, కుత్తుకలు = కంఠములు, త్రెంచి = నరికి, చేతులు, కోసి, తొడలు, నఱికి, చట్టలు = చర్మములు, చీరి, కండలు, పెకల్చి, బొజ్జలు = పొట్టలు, పగిల్చి, మేనులు = దేహములు, నజ్జు చేసి = ముద్దచేసి,

**తా :** త్రిపురములను కూల్చుటకు బయలుదేరు శివునివలె, లోకము నాశనము చేయ సిద్ధపడు యమునివలె, ఉసిరిచెట్టుపై పడే పిడుగులులా, అడవిలో వ్యాపించు కార్చిచ్చువలె, జింకలపై దాడిచేయు పెద్దపులివలె, లేత తోటలను విఱిచివేయు పెనుగాలివలె, పద్మ సరోవరము ప్రవేశించు మదపుటేనుగువలె, పాములను పరుగెత్తించు గరుత్మంతునివలె, కోతిమూకలమీద దండెత్తి పూనికతో కంఠములు నఱికి, చేతులు కోసి, తొడలు నఱికి, చర్మములు చీరి, కండలు పెకల్చి, పొట్టలు పగిల్చి, దేహములు ముద్దచేసి.

**ఆ.వె.** **పాఱఁ దఱిమి రాచపట్టిపై నరదంబు**
**వఱపి తఱచుమీఱఁ గఱకు నార**
**సముల తూమ్ముగాఁడి చన నేయుటయు నాతఁ**
**డలుకతోడ వాని నడ్డగించి** **342**

పాఱన్ తఱిమి = పరుగెత్తించి, రాచపట్టిపై = లక్ష్మణునిపై, అరదంబు = రథమును, పఱపి = నడపి, తఱచుమీఱన్ = మిక్కిలి సాంద్రముగా, కఱకు నారసముల = వాడియైన బాణములతో, తూమ్ముగాడి చనన్ = తూమ్ము పగులునట్లుగా, ఏయుటయున్ = వేయుటయును, ఆతడు = ఆ లక్ష్మణుడు, అలుకతోడ = కోపముతో, వానిన్ అడ్డగించి = వాని నెదుర్కొని,

**తా :** పరుగెత్తించి లక్ష్మణునిపై రథమును నడపి మిక్కిలి సాంద్రముగా వాడి బాణములతో తొమ్ము పగులునట్లుగా వేయుటయును అతడు కోపముతో వాని నెదుర్కొని

**తే.గీ.** **వేడివేల్పున కెనయగు వాఁడి ముల్కి**
**యొకటి సింగాణిఁ గూర్చి యేయుడుఁ గడంక**
**మీఱ నది వాని పెన్ బోర దూఱి చనిన**
**నల్లతోఁ దోఁగి కడు సొమ్మసిల్లి తెలిసి** **343**

వేడి వేల్పునకు = సూర్యునకు, ఎనయగు = సాటియైన, వాడి ముల్కి = పదునైన బాణము, ఒకటి, సింగాణిన్గూర్చి = వింటికి సంధించి, ఏయుడు = వేయగా, కడంక మీఱన్ = మిక్కిలి ప్రయత్నముతో, అది = ఆ బాణము, వాని పెన్బోర దూఱి = వాని పెద్దపొట్టలో దూరి, చనిన = వెళ్లగా, నల్లతో = రక్తముతో, దోగి = మునిగి, కడు = పూర్తిగా, సొమ్మసిల్లి = మూర్ఛపోయి, తెలిసి = తెలివితెచ్చుకొని.

**తా :** సూర్యునకు సాటియైన వాడి బాణము ఒకటి వింటికి సంధించి వేయగా, ఆ బాణము వాని పెద్ద పొట్టలో దూరి వెళ్ళగా రక్తముతో మునిగి పూర్తిగా సొమ్మసిలి లేచి.

**మ.** **కెరలంబారెడు కిన్కఁ గన్గవ కడున్ గెంపారఁ గెంపారు న**
**బ్బురపుం బీరముతో వెడంద నెఱ తూపుల్ సింగిణిం గూర్చి వా**
**విరి నార్పుల్ నిగుడంగ రాకొమరుపై వే చిమ్మి నొప్పింప న**
**ద్దొరయున్ గ్రమ్మఱ వానినొంచె బలువాల్తూపు ల్మెయింగ్రుచ్చుచున్** **344**

కెరలంబారెడు = పొంగుచున్న, కిన్కన్ = కోపముతో, కన్గవ = కనుల జంట, కెంపారన్ = ఎఱ్ఱపడగా, కెంపారున్ = అతిశయించుచున్న, అబ్బురపున్ = అద్భుతమైన, బీరముతో = శౌర్యముతో, వెడంద = విశాలమైన, నెఱ = వాడియైన, తూపుల్ = బాణములు, సింగిణిం కూర్చి = ధనుస్సున సంధించి, వావిరిన్ = మిక్కిలిగా, ఆర్పుల్ = అరుపులు, నిగుడంగ = వ్యాపింపగా, రాకొమరుపై = లక్ష్మణునిపై, వే చిమ్మి = వేగముగా వేసి, నొప్పింప = బాధింపగా, ఆ దొరయున్ = ఆ లక్ష్మణుడును, క్రమ్మఱ = తిరిగి, పలు వాలు తూపులు = పలు వాడియైన బాణములు, వాని = ఆ ఇంద్రజిత్తుయొక్క, మెయిం గ్రుచ్చుచున్ = దేహమున నాటుచు, నొంచెన్ = బాధించెను.

**తా :** పొంగుచున్న కోపముతో కనులజంట ఎఱ్ఱపడగా అద్భుతమైన శౌర్యముతో వాడి బాణములు ధనుస్సున సంధించి గట్టిగా అరచుచు లక్ష్మణునిపై వేగముగా వేసి బాధింపగా ఆ లక్ష్మణుడు తిరిగి పలు వాడి బాణములు ఆ ఇంద్రజిత్తు దేహమున నాటుచు బాధించెను.

**కం.** **చేవయు బీరముఁ దేజును**
**లావును కొఱకొఱయు నిచ్చలంపుఁ జలంబున్**
**తేవయు నెనగా నిరువురుఁ**
**గావించిరి పోరు వేల్పుగము లగ్గింపన్** **345**

చేవయు = శక్తియును, బీరమున్ = పరాక్రమమును, తేజును = తేజస్సును, లావును = బలమును, కొఱకొఱయు = కోపమును, నిచ్చలంపున్ = నిశ్చలమైన, చలంబున్ = పట్టుదలయు, తేవయున్

= తీరును, ఎనగాన్ = సరిపడునట్లుగా, ఇరువురు = ఆ ఇరువురును, వేల్పగమలు అగ్గింపన్ = దేవతల సమూహములు ప్రశంసింపగా, పోరు కావించిరి.

**తా :** శక్తి, వీరత్వము, తేజస్సు, బలము, కోపము, నిశ్చలమైన పట్టుదల, తీరు సరిపడునట్లుగా ఆ ఇరువురును దేవతలు ప్రశంసింపగా పోరాడిరి.

**మ.** **తొలి జేజే గమికాఁడు సిమ్ము మొన వాల్తూపు ల్వడిన్ రాచ రే**
**వెలుఁగున్ వ్రచ్చు నతండు వ్రేయు ములుకుల్ వే వ్రచ్చు రే ద్రిమ్మరిన్**
**జులక న్రక్కసుఁ డేయు చిల్కు లెడ ద్రుంచున్ రాముతోఁబుట్టు వా**
**బలియుం డేయు మెఱుంగుటమ్ము లస మొప్పం ద్రుంచు వాఁడుమ్మడిన్ 346**

తొలిజేజేగమికాడు = ఇంద్రజిత్తు, చిమ్ము = విసరుచున్న, మొన = తీక్షణమైన, వాల్తూపులు = వాడి బాణములు, వడిన్ = వేగముగా, రాచ రేవెలుగున్ = రాజచంద్రుని, వ్రచ్చున్ = భేదించును, అతండు వ్రేయు, ములుకుల్ = బాణములు, రే త్రిమ్మరిన్ = ఆ రాక్షసుని, వే = వెంటనే, వ్రచ్చు = భేదించును, రక్కసుడు ఏయు = రాక్షసుడు వేసే, చిల్కులు = బాణములు, రాము తోబుట్టువు = లక్ష్మణుడు, ఎడన్ = దూరమునందే, చులకన్ = తేలికగా, త్రుంచున్ = ఖండించును, ఆ బలియుండు = ఆ బలశాలి, ఏయు = వేయు, మెఱుంగు అమ్ములు = కాంతిమంతములైన బాణములు, అసము = కీర్తి, ఒప్పన్ = ప్రకాశింపగా, వాడు = ఇంద్రజిత్తు, ఉమ్మడిన్ = ఏకకాలమున, త్రుంచున్ = ఖండించును.

**తా :** ఇంద్రజిత్తు విసరుచున్న పదునైన బాణములు వేగముగా లక్ష్మణుని భేదించును. ఆ లక్ష్మణుడు వేయు బాణములు ఇంద్రజితున్తు వెంటనే భేదించును. ఇంద్రజిత్తు వేసే బాణములను లక్ష్మణుడు దూరమునందే తేలికగా ఖండించును. లక్ష్మణుడు వేసే బాణము లను ఇంద్రజిత్తు ఏకకాలమున ఖండించును.

**తే.గీ.** **నిలుచుటయు వంగుటయు దొనఁ జిలుకు దివిచి**
**తొడుగుటయు నేయుటయుఁ గనఁబడఁగ రాక**
**చూపఱకు నెల్ల నచ్చెరువై పరగఁగ**
**విండ్ల మ్రోఁతల నార్పుల విన్ను వగుల 347**

దొనన్ చిలుకు తివిచి = అమ్ములపొదినుండి బాణమును లాగి, విన్ను = ఆకాశము, పగుల = పగులగా –

**తా :** నిలుచుట, వంగుట, అమ్ములపొదినుండి బాణమును తీసి తొడుగుట, వేయుట, కంటికి కనిపింపక, చూచువారి కాశ్చర్యము కల్పించుచు, వింటి మ్రోతలు, అరుపులు ధ్వనులకు ఆకాశము బ్రద్దలుకాగా –

**ఆ.వె.** **కడలి యాకసంబు పుడమియుఁ దఱచుగ**
**నంపవెల్లి పొదువఁ బొంపు మీఱి**

**యంధకుండు కొండయల్లుఁడు దార్కొని**
**యదరునట్లు వ్రేటులాడు నెడల** **348**

కడలి = సముద్రము, ఆకసంబు, పుడమియున్, తఱచుగ = సాంద్రముగ, అంపవెల్లి = బాణ ప్రవాహము, పొదువన్ = చుట్టుముట్టగా, పొంపు మీఱి = మిక్కిలి ఆధిక్యముతో, అంధకుండు = అంధకాసురుడును, కొండ అల్లుడు = హిమవంతుని అల్లుడు (శివుడు), తార్కొని = ఎదుటపడి, అదరునట్లు = పోరాడునట్లు, వ్రేటులు ఆడున్ ఎడల = కొట్టుకొను సమయమున,

**తా :** సముద్రమును, ఆకాశమును, భూమిని దట్టముగా బాణ ప్రవాహము చుట్టుముట్టగా ఆధిక్యముతో అంధకాసురుడును, పరమశివుడును పోరాడునట్టు కొట్టుకొను సమయమున–

**మ.** **కదిలెన్ బంటవలంతి మిన్నదిరెఁ జుక్కల్ రాలె జేజేగముల్**
**సెదరెన్ సంద్రము లింకె ముజ్జగములుం బిట్టూఁగె నేనుంగు లె**
**న్మిదియున్ మ్రొగ్గెఁ గడల్వడంకె నెలయు న్మిన్మానికంబుం గడం**
**క దిగం ద్రావిరి పాఁపరాయఁడు దలంగంబారె నప్పోరునన్** **349**

ఆ పోరునన్ = ఆ యుద్ధమున, పంటవలంతి = భూదేవి, కదిలెన్ = చలించెను, మిన్ను = ఆకాశము, అదిరెన్ = కంపించెను, చుక్కల్ = నక్షత్రములు, రాలె = రాలెను, జేజేగముల్ = దేవతల సమూహము, చెదరెన్ = చెదిరిపోయెను, సంద్రములు = సముద్రములు, ఇంకె = ఇంకెను, ముజ్జగములు = మూడు లోకములు, బిట్టు ఊగె = బాగ ఊగులాడెను, ఏనుంగులు ఎన్మిదియున్ = ఎనిమిది ఏనుగులును, మ్రొగ్గెన్ = వ్రాలిపోయెను, కడలు = దిక్కులు, వడంకె = వణకెను, నెలయు = చంద్రుడును, మిను మానికంబున్ = సూర్యుడును, కడంకన్ = సంచారములను, దిగద్రావిరి = విడిచిపెట్టిరి, పాపరాయడు = ఆదిశేషుడు, తలగన్ పారెన్ = తొలగి పారిపోయెను.

**తా :** ఆ యుద్ధమున భూదేవి చలించెను. ఆకాశము కంపించెను. చుక్కలు రాలెను. దేవతలు చెదరిపోయిరి. సముద్రములు ఇంకెను. మూడులోకములు ఊగులాడెను. ఎనిమిది ఏనుగులు వ్రాలిపోయెను. దిక్కులు వణకెను. చంద్రుడు, సూర్యుడు సంచారములు విడిచిపెట్టిరి. ఆదిశేషుడు తొలగి పారిపోయెను.

**మ.** **అపుడా నంజుడు దిండి రాచకొమరుం డబ్రంపు బీరంబు దే**
**టపడన్ వేఁడి వెలుంగు వంగడపు ప్రోడ న్దాకి పెల్లార్చి వే**
**లుపు మూఁక ల్బెగడొంది పర్వులిడ వాల్తూపు ల్మెయిన్నింప గా**
**టపు రోసంబున నక్కడింది దొరబిడ్డం డుక్కు రాణింపఁగన్** **350**

అపుడు, ఆ నంజుడు తిండి = ఆ రాక్షస, రాచకొమరుండు = రాజకుమారుడు (ఇంద్రజిత్తు), అబ్రంపు = ఆశ్చర్యకరమైన, బీరంబు = ధైర్యము, తేటపడన్ = కన్పింపగా, వేడి వెలుంగు వంగడపు ప్రోడన్ = సూర్యవంశపు వీరుని, (లక్ష్మణుని), తాకి = ఎదుర్కొని, పెల్లార్చి = పెద్దగ కేకపెట్టి, వేలుపు మూకలు = దేవతాసమూహములు, బెగడొంది = భయపడి, పర్వులు ఇడ = పరుగుపెట్టగా, వాల్తూపుల్ = వాడియైన బాణములు, మెయిన్ నింప = దేహమంతయు నింపగా, గాటపు

రోసంబున = అధికమైన కోపముతో, ఆ కడింది దొరబిడ్డండు = ఆ సాహసముకల రాజకుమారుడు, ఉక్కు రాణింపగన్ = శౌర్యము ప్రకాశింపగా –

**తా :** అపుడు ఆ ఇంద్రజిత్తు ధైర్యముతో లక్ష్మణుని ఎదుర్కొని పెద్దగ కేకపెట్టి దేవతా సమూహములు భయపడి పరుగు పెట్టగా, వాడి బాణములు దేహమంతయు నింపగా మిక్కిలి కోపముతో ఆ లక్ష్మణుడును శౌర్యము ప్రకాశిపంగా –

**సీ.** **అరచందమామ తూపదరించి విలు ద్రుంచి**
**యొకకోల యెద నెత్తురురల నేసి**
**తీవంచ ములుకుల మావుల నొప్పించి**
**యైదు చిల్కుల సిడం బవయ నేసి**
**మఱియొక్క యమ్మున గుఱిమీర నరదంబు**
**దోల్వాని తలఁద్రుంచి తొడరి బొబ్బ**
**యిడుటయు వాఁడు నేర్పడరారఁ దానె తే**
**ర్నడపుకొంచుఁ గడఁగి వెడద నార**

**తే.గీ.** **సమ్ము లాతని మెయిగ్రుచ్చి సరవి నొక్క**
**వాఁడి తూపు విభీషణు గాఁడ నేసి**
**గాలి కొమరునిఁ బెక్కింటఁ దూల పుచ్చి**
**నలువ గ్రుడ్డు పనఁటులు పగులఁగ నార్చె** **351**

అర చందమామ = అర్ధచంద్రాకారముకల, తూపు = బాణమును, అదరించి = ప్రయోగించి, విలుద్రుంచి = వింటిని ఖండించి, ఒక కోల = ఒక బాణముతో, ఎదన్ = ఆ ఇంద్రజిత్తు ఱొమ్మున, నెత్తురు ఉరలన్ = రక్తము ప్రవహింపగా, ఏసి = వేసి, తీవంచ ములుకుల = నాలుగు బాణములతో, మావుల నొప్పించి = గుఱ్ఱములను బాధించి, ఐదు చిలుకులన్, సిడంబు = ధ్వజమును, అవయన్ ఏసి = పడునట్లు వేసి, మఱి ఒక్క అమ్మున = మరియొక బాణముతో, గుఱి మీరన్ = సరిగా గురిచూసి, అరదంబు తోల్వాని = సారథియొక్క, తలద్రుంచి = తల నఱికి, తొడరి = విజృంభించి, బొబ్బ ఇడుటయు = అట్టహాసము చేయుటయు, వాడు = ఆ ఇంద్రజిత్తు, నేర్పు అడరారన్ = నైపుణ్యము ఒప్పగా, తానె = స్వయముగా, తేరు నడపుకొంచున్, కడగి = పూని, వెడద నారసమ్ములు = పెద్ద బాణములు, ఆతని మెయి = ఆ లక్ష్మణుని శరీరమున, గ్రుచ్చి = నాటి, సరవిన్ = వేగముగా, ఒక్క వాడి తూపు, విభీషణు, గాడన్ ఏసి = నాటునట్లుగా కొట్టి, గాలి కొమరునిన్ = హనుమంతుని, పెక్కింటన్ = పలు బాణములతో, తూల పుచ్చి = సోలిపోవునట్లుచేసి, నలువ గ్రుడ్డు పనటులు = బ్రహ్మాండములు, పగులగ = పగులునట్లుగా, ఆర్చె = అరచెను.

**తా :** అర్ధచంద్రాకారపు బాణమును ప్రయోగించి ఇంద్రజిత్తు వింటిని ఖండించి, వేరొక బాణము అతని ఱొమ్మున నెత్తురు ప్రవహింపగా వేసి, నాలుగు బాణములతో గుఱ్ఱములను బాధించి, ఐదు బాణములతో ధ్వజమును పడగొట్టి, మరియొక బాణము సరిగా గురి చూచి సారథి తల

నటికి విజృంభించి అట్టహాసము చేయగా ఆ ఇంద్రజిత్తు నేర్పుతో తానే స్వయముగ రథమును నడుపుకొనుచు వెడద బాణములు ఆ లక్ష్మణుని శరీరమున గ్రుచ్చి, ఒక బాణమున విభీషణుని నాటునట్లుగా కొట్టి, హనుమంతుని పలు బాణములతో సోలిపోవునట్లుచేసి బ్రహ్మాండములు పగులునట్లుగా అరచెను.

**కం.** **ఆర్చినఁ గని రాకొమరుఁడు**
**పేర్చిన కోపమున నైదు పెనుదూపు లరిం**
**గూర్చి తొలివేల్పు బోరయ**
**యేర్చి నిగుడ్చుటయు నాతఁ డేపరి సోలెన్** **352**

ఆర్చినన్ = అరవగా, కని, రాకొమరుడు = లక్ష్మణుడు, పేర్చిన = అతిశయించిన, కోపమునన్, ఐదు పెనుతూపులు, అరిన్ కూర్చి = నారిని సంధించి, తొలివేల్పు = రాక్షసుని, బోరయ = వక్షస్థల మున, ఏర్చి = విజృంభించి, నిగుడ్చుటయు = ప్రయోగింపగా, అతడు = ఇంద్రజిత్తు, ఏపు అరి = ఆధిక్యము నశించి, సోలెన్ = సొమ్మసిలెను.

**తా :** అరవగా చూచి లక్ష్మణుడు కోపముతో ఐదు పెను బాణములు నారిని సంధించి ఇంద్రజిత్తు వక్షస్థలమున ప్రయోగింపగా ఇంద్రజిత్తు ఆధిక్యము నశించి సొమ్మసిలెను.

**ఆ.వె.** **సోలి యపుడె తెలిసి సోఁకు జోదెంతయు**
**నులికి గాడ్పు దిండి ములికి వైవ**
**రాచమిన్న పుల్గు రా తూపు పఱగించి**
**తోనఁ జెలఁగి దానిఁ దుమురుచేసె** **353**

సోలి = సొమ్మసిలి, అపుడె = వెంటనే, తెలిసి, సోకు జోదు = ఇంద్రజిత్తు, ఎంతయు = మిక్కిలి, ఉలికి = జంకి, గాడ్పు తిండి ములికి = నాగాస్త్రమును, వైవ = వేయగా, రాచమిన్న = లక్ష్మణుడు, పుల్గు రా తూపు = గారుడాస్త్రమును, పఱగించి = ప్రయోగించి, తోనన్ = వెంటనే, చెలగి = చెలరేగి, దానిన్ = ఆ నాగాస్త్రమును, తుమురు చేసె = ముక్కలు చేసెను.

**తా :** సొమ్మసిలి వెంటనే తెలిసి ఇంద్రజిత్తు మిక్కిలి జంకి నాగాస్త్రమును వేయగా లక్ష్మణుడు వెంటనే చెలరేగి గారుడాస్త్రమును ప్రయోగించి దానిని నాశనము చేసెను.

**కం.** **వేలుపుల గొంగ వలదెస**
**యేలిక తూపేయ రాచయేనుఁగు సత తే**
**జీల వజీర్మేపుట్టువు**
**కోల వడిం బఱపి యా లకోరియుఁ ద్రుంచెన్** **354**

వేలుపుల గొంగ = దేవతల శత్రువగు ఇంద్రజిత్తు, వల దెస ఏలిక తూపు = దక్షిణ దిక్కుకు అధిపతియగు యమాస్త్రమును, ఏయ = వేయగా, రాచ ఏనుగు = లక్ష్మణుడు, సత తేజీల వజీరు = ఏడు గుఱ్ఱాల వీరుడు సూర్యునియొక్క, మే పుట్టువు = కొడుకు యమునియొక్క, కోల = యమాస్త్రమును, వడిన్ = శీఘ్రముగా, పఱపి = ప్రయోగించి, ఆ లకోరియు = ఆ ఇంద్రజిత్తు వేసిన అస్త్రమును, త్రుంచెన్ = ఖండించెను.

**తా :** ఇంద్రజిత్తు యమాస్త్రమును వేయగా లక్ష్మణుడు కూడా యమాస్త్రమునే ప్రయోగించి ఆ ఇంద్రజిత్తు వేసిన యమాస్త్రమును ఖండించెను.

**తే.గీ.** **అత్తెఱంగున నిరువురు హత్తి గెలుపు**
**తలఁపు లంతంత నెక్కువై తనరి కడిమిఁ**
**బోరుచో నేలతాలుపు బొబ్బమెకము**
**మేటి రాకాసి యేనుఁగు మీఁదఁ గినిసి** **355**

ఆ తెఱంగునన్ = ఆ విధముగా, ఇరువురు, హత్తి = హత్తుకొని, గెలుపు తలపుల = జయించాలనే కోరికతో, అంతంతన్ = అంతకంతకు, ఎక్కువై, తనరి = ఒప్పి, కడిమిన్ = పరాక్రమముతో, పోరుచో = పోరాడుచుండగా, నేలతాలుపు బొబ్బమెకము = లక్ష్మణుడను సింహము, మేటి రాకాసి ఏనుగు మీద = ఇంద్రజిత్తను ఏనుగుమీద, కినిసి = కోపించి,

**తా :** ఆ విధముగా ఇరువురును హత్తుకొని గెలుపు కోరికతో అంతకంతకు ఎక్కువై ఒప్పి శౌర్యముతో పోరాడుచుండగా లక్ష్మణుడను సింహము ఇంద్రజిత్తను ఏనుగుపై కోపించి.

**సీ.** **మలదాయఁ యొసగిన బలితంపు వాల్తూపు**
**వెస దొన వెడలించి వింటఁ దొడిగి**
**తగ నిండఁ దిగిచి యేడ్తెర నల్లద్రావుడు**
**తలకట్టుపయిఁ జూడ్కి నిలిపి రాముఁ**
**డెపుడును గడుఁ బున్నియపుఁ గొటారంబేని**
**యతని దేవేరి సీతమ గడింది**
**గరితయయేని జగంబుల కిది మేలు**
**పనియేని నిమ్ముల్కి పఱచి చెనఁటి**

**తే.గీ.** **పొలసు మేపరి గమికానిఁ బొలియఁ జేయుఁ**
**గాతయని వైవ నది బిట్టు గ్రాలుకొనుచు**
**వేయు చీఁకటిగొంగల వెలుఁగు గలిగి**
**నెమ్మిఁ జని వాని తలద్రుంచి నేలఁగూల్చె** **356**

మల దాయ = పర్వతములకు శత్రువు (ఇంద్రుడు), ఒసగిన = ఇచ్చిన, బలితంపు = కఠినమైన, వాల్ తూపు = వాడి బాణము, వెస = వేగముగా, దొన వెడలించి = అమ్ములపొదినుండి తీసి, వింటన్ తొడగి = సంధించి, తగ = తగునట్లుగా, నిండన్ తిగిచి = పూర్తిగా నారి లాగి, ఏడ్తెరన్ = వెంటనే, నల్లద్రావుడు తలకట్టుపయిన్ = ఇంద్రజిత్తు తలకు సూటిగా, చూడ్కి నిలిపి = దృష్టి నిలిపి, రాముడు, ఎపుడును, కడున్, పున్నియంపున్ = పుణ్యముల, కొటారంబు ఏని = స్థానమైనచో, అతని దేవేరి, సీతమ, కడింది = గొప్ప, గరితయ ఏని = స్త్రీయే యైనచో, జగంబులకు = లోకములకు, ఇది = ఇంద్రజిత్తును సంహరించుట, మేలు పనియేని = మంచిపనియైనచో, ఈ ముల్కి = ఈ బాణము, పఱచి = వెళ్ళి, చెనటి = దుర్మార్గుడైన, పొలసు మేపరి గమికానిన్ =

ఇంద్రజిత్తును, పొలియన్ చేయున్ గాత = చంపుగాక, అని వైవ = అని వేయగా, అది = ఆ బాణము, బిట్టు = ఎక్కువగా, క్రాలుకొనుచు = ప్రకాశించుచు, వేయు చీకటి గొంగల = వేయి సూర్యులయొక్క, వెలుగు కలిగి = కాంతి కలిగి, నెమ్మిన్ = చక్కగా, చని = వెళ్ళి, వాని తలన్ = ఇంద్రజిత్తు తలను, త్రుంచి = ఖండించి, నేలన్ కూల్చెన్ = నేలను పడవేసెను.

**తా :** ఇంద్రుడిచ్చిన వాడి బాణము అమ్ములపొదినుండి తీసి వింటిని సంధించి నారి లాగి ఇంద్రజిత్తు తలకు సూటిగా దృష్టి నిలిపి 'రాముడు పుణ్యాత్ముడైనచో, అతని భార్య సీత పతివ్రతయైనచో, లోకములకు ఇంద్రజిత్తును చంపుట మంచిపనియైనచో ఈ బాణము వెళ్ళి దుర్మార్గుడైన ఇంద్రజిత్తును చంపుగాక' అని వేయగా, ఆ బాణము వేయి సూర్యుల కాంతులీనుచు చక్కగా వెళ్ళి ఇంద్రజిత్తు తలను ఖండించి నేలను పడవేసెను.

**తే.గీ.** **అపుడు రాచూలిపయి వేల్పు లలరువాన**
**గురిసి యగ్గించి బేరులు కరము మొరయఁ**
**జేసి రచ్చర లాడిరి చెలఁగి మింట**
**దెసలు పదియును దద్దయుఁ దేజు గాంచె** **357**

అపుడు, రాచూలిపయిన్ = లక్ష్మణునిపై, వేల్పులు = దేవతలు, అలరుల వాన = పుష్ప వర్షము, కురిసి = కురియించి, అగ్గించి = ప్రశంసించి, బేరులు = భేరీలు, కరము = మిక్కిలిగా, మొరయ చేసిరి = ధ్వనింప చేసిరి, చెలగి = విజృంభించి, మింట = ఆకాశమున, అచ్చరలు = అప్సరసలు, ఆడిరి, దెసలు పదియును = పది దిక్కులును, తద్దయు = మిక్కిలి, తేజు కాంచె = కాంతినొందెను.

**తా :** అపుడు లక్ష్మణునిపై దేవతలు పుష్పవృష్టి కురియించి, ప్రశంసించి, భేరీలు ధ్వనింప చేసిరి. ఆకాశమున అప్సరసలు ఆడిరి. పది దిక్కులును కాంతివంతములయ్యెను.

**కం.** **ఆ లక్ష్మణుఁడును రాముని**
**పాలికి వడి నేఁగి మ్రొక్కి బవరము చందం**
**బోలి నెఱిఁగింప నద్దొర**
**వేలాగుల నతని మెచ్చి వేడ్కలఁ బొదలెన్** **358**

ఆ లక్ష్మణుడును, రాముని, పాలికి = సన్నిధికి, వడిన్ ఏగి = శీఘ్రముగా వెళ్ళి, మ్రొక్కి = నమస్కరించి, బవరము చందంబు = యుద్ధము జరిగిన విధము, ఓలిన్ ఎఱిగింపన్ = క్రమమును తెలుపగా, ఆ దొర = ఆ రాముడు, వేలాగుల = వేయి విధములుగా, అతనిన్ = ఆ లక్ష్మణుని, మెచ్చి = మెచ్చుకొని, వేడ్కలన్ పొదలెన్ = సంతోషముతో ఒప్పెను.

**తా :** ఆ లక్ష్మణుడును శీఘ్రముగా రాముని సన్నిధికి వెళ్ళి నమస్కరించి యుద్ధము జరిగిన విధమును తెలుపగా ఆ రాముడు లక్ష్మణుని మెచ్చుకొని సంతోషముతోనుండెను.

**తే.గీ.** **అంత నక్కడ దీవిరాయనికిఁ గొంద**
**ఱఱచి మేపరి పోటరు లింద్రజిత్తుఁ**
**డీల్గి చనిన తెఱంగెల్ల నెఱుఁగఁ జేయ**
**నాతఁ డమ్మాట విని గుండెలవిసి చెదర** **359**

అంతన్, అక్కడ, దీవిరాయనికి = రావణునికి, కొందఱు, ఎఱచి మేపరి పోటరులు = రాక్షస భటులు, ఇంద్రజిత్తు, ఈల్గి చనిన = చనిపోయిన, తెఱంగెల్ల = విధమునంతను, ఎఱుగన్ చేయన్ = తెలుపగా, ఆతడు = ఆ రావణుడు, ఆ మాట విని, గుండెలు, అవిసి చెదర = పగిలి చెదరగా –

**తా :** అంత అక్కడ రావణునికి కొందరు రాక్షస భటులు ఇంద్రజిత్తు చనిపోయిన సంగతి తెలుపగా ఆ రావణుడు ఆ మాటవిని గుండెలు పగిలి చెదరగా –

**తే.గీ.** **పిడుగు వడ్డ తెఱంగునఁ బుడమిఁ ద్రెళ్ళి**
**సొమ్మగొని కొంతవడికి లో నుమ్మలికల**
**వెచ్చ నూర్చుచుఁ దెప్పిఱి వెల్లివిరియ**
**వేఁడి కన్నీరు గొనగోళ్ళ దోఁడుకొనుచు** **360**

పిడుగు పడ్డ తెఱంగునన్, పుడమిన్ త్రెళ్ళి = నేలపై పడి, సొమ్మగొని = సొమ్మసిల్లి, కొంత వడికి = కొంతసేపటికి, లోని ఉమ్మలికల = లోని తాపము చేత, వెచ్చన్ ఊర్చుచు = వేడినిట్టూర్పులు విడుచుచు, తెప్పిఱి = తెప్పరిల్లి, వేడి కన్నీరు, వెల్లివిరియ = ప్రవహింపగా, కొనగోళ్ళ, తోడుకొనుచు = తొలగించుచు –

**తా :** పిడుగు పడ్డ రీతిగా నేలపై పడి సొమ్మసిలి కొంతసేపటికి లోని తాపముచేత వేడి నిట్టూర్పులు విడుచుచు తెప్పరిల్లి వేడి కన్నీరు ప్రవహింపగా కొనగోళ్ళ తుడుచుకొనుచు –

**ఆ.వె.** **మిక్కుటంపు జాలిఁ బెక్కు తెఱంగుల**
**వెక్కివెక్కి యేడ్చి స్రుక్కి సొక్కి**
**పొలసు దిండి తీర్పరులు బుజ్జగింప న**
**తండు గొంత దిట మెదం గుదిర్చి** **361**

మిక్కుటంపు జాలిన్ = అధికమైన జాలితో, పెక్కు తెఱంగుల = పలు విధములుగా, వెక్కివెక్కి = ఆపకుండా, ఏడ్చి, స్రుక్కి సొక్కి = బాధపడి వివశతనంది, పొలసు తిండి తీర్పరులు = రాక్షస పెద్దలు, బుజ్జగింప = ఊరడించగా, అతండు = ఆ రావణుడు, కొంత దిటము = కొంత ధైర్యము, ఎదం కుదిర్చి = మనసునందు కుదుటపరచి,

**తా :** మిక్కిలి జాలితో వలు విధములుగా వెక్కివెక్కి ఏడ్చి స్రుక్కి సొక్కి రాక్షస పెద్దలు ఊరడించగా ఆ రావణుడు కొంత ధైర్యము మనసున కుదుటపరచుకొని.

**కం.** **తేరులు చేగల మెకములు**
**వారువములు కాలరులును వావిరి గొలువన్**
**బేరులు బూరలు గాళెలు**
**బోరు కలఁగ నపుడె తరలి పోరికిఁ జనియెన్** **362**

తేరులు, చేగల మెకములు = ఏనుగులు, వారువములు = గుఱ్ఱములు, కాలరులును = కాల్బలమును, (చతురంగ బలములు) వావిరి = క్రమముగా, కొలువన్ = సేవింపగా, బేరులు = భేరీలు, బూరలు = బూరాలు, కాళెలు = కాహళులును, బోరు కలగన్ = భోరుమని మ్రోగుచుండగా, అపుడె = వెంటనే, తరలి = బయలుదేరి, పోరికిన్ = యుద్ధమునకు, చనియెన్ = వెళ్ళెను.

**తా :** రథములు, ఏనుగులు, గుఱ్ఱములు, కాల్బలమును సేవింపగా భేరీలు, బూరలు, కాహళులు భోరుమని మ్రోగుచుండగా వెంటనే పోరునకు బయలుదేరి వెళ్ళెను.

**కం.** **చని రాయని మూఁకలఁ బై**
**కొని మెకముల ఱేఁడు లేడిగుంపులపై డా**
**కొని బారిసమరు తెఱఁగునఁ**
**మునుకొని పోనీక పొదివి మోఁదఁ దొడంగెన్** **363**

చని = వెళ్ళి, రాయని మూకలన్ = రాముని సైన్యమును, పైకొని = ఆక్రమించి, మెకముల ఱేడు = సింహము, లేడి గుంపులపై, డాకొని = విజృంభించి, బారిసమరు తెఱగునన్ = హింసించు విధముగా, మునుకొని = ముందుపడి, పోనీక = తప్పించుకు పోనీక, పొదివి = పట్టుకొని, మోదన్ = బాదుటకు, తొడంగెన్ = మొదలిడెను.

**తా :** వెళ్ళి రాముని సైన్యమును ఆక్రమించి సింహము లేడిమందపై విజృంభించి హింసించు విధముగా ముందుపడి తప్పించుకు పోనీక పట్టుకొని బాదుటకు మొదలిడెను.

**వ.** **మఱియు నెరయ విరియుచుం గెరలి పొరలు నబ్బురంపు కొఱకొఱలం గొఱలి యొఱల వఱలు కఱకు చుఱుకుటడిదంబులు వెఱికి యుఱికి నఱికి నెఱకు లుఱక చుఱుకలరం గిఱికొల్పుచు, గెలుపు బలుపు లిగురొత్త హత్తి మొత్తంబులఁ గ్రొత్త సెలగత్తి మొత్తంబులం దుత్తుమురుగా మొత్తి నెత్తురులం జొత్తిలం జేయుచుఁ బాయని పేరమ్మున గ్రుమ్మి క్రొమ్మెఱుంగు టమ్ము లుమ్మడి ఱొమ్ము లురులం జిమ్మి యిమ్ముల సొమ్మగొన నొనర్చుచుఁ బేర్చి యార్చి బల్గోన యేర్చు కార్చిచ్చు వడువున నడరి తొడలు మెడలు నడుములుం బొడుములుగ బెడిదంపు టినుప బడియలఁ బడలువడ నడుచుచు, నిండారు గండు మెండుకొన నండగొనక దిండుకల గండ్రగొడ్డండ్ల గుండెల కండలు గొండలుగఁ జెండు బెండాడుచు, మిటారంపు కటారులం బటాలు పటాలనఁ దుటారంబడర నడిచి హుటాహుటిం బటాపంచలుగఁ దఱుముచు మేటి పోటరితనంబు వాటిల సూటిగ నీఁటియలు నాటుకొల్పి యుసురు లెడల మీటుచుఁ బట్టగు చుట్టువాల్పెట్టులం బొట్టలుఁ జట్టలు బిట్టు వగిల్చి యిట్టట్టు సేయుచు వీఁకం దోకొని బాఁకులఁ జేగ రోఁకలి తాఁకులఁ గాఁక తీఱఁ జదిపి ప్రోకలువెట్టుచు వంకుల గొంకులేని బింకంబు లింకించుచు బల్లెంబుల నుల్లంబులు జల్లని యొల్లంబోవ మొల్లంబగు పెల్లు సూసి త్రెళ్ళింపుచు సురియల గొఱియలంబలె నిఱియ నెఱియఁ బఱియలుగఁ గ్రుమ్ముచు మారి మసంగిన తెఱంగునం బారిసమరి యెక్కడం దానయై యొక్కొక్క మెఱుంగుటమ్మునఁ బెక్కండ్ర నుక్కడంచి వేఱువేఱ గంధమాదను నైదు కోలల, ద్వివిదు నాఱు నారసంబుల, వినతు నేఁడు చిలుకుల, మైందునిఁ జౌవంచ గిట్టల, గజు నెనిమిది కోలలఁ, గుముదు నైదమ్ముల, శరభు నెనిమిదేను తూపుల, నంగదు నెనిమిది బల్లెంబుల, హనుమంతు నిరువది గఱి కట్టియల, గవాక్షుం బది ములుకుల నొప్పించి ననిచిన ములుమోదుగల చందంబు నొందించె, నందుఁ గాళ్ళు తెగి త్రెళ్ళువారును, బొట్ట లురలి గిట్టు వారును, దొడలు విరిగి యడలువారును, జేతులు నలిగి బీతులుగొనువారును, జబ్బలు వడి**

**బొబ్బరించువారును, గుత్తుకలు దెగి యత్తమిల్లువారును, ఱొమ్ములు నొచ్చి సొమ్మసిలువారును, బఱులు వ్రస్సి యొఱలువారును, నడుములు వోయి యిడుమలఁ గుడుచువారును, విఱిఁగి సురుగువారును, వ్రేఁగి లోఁగువారును, గంది కుందువారును, వ్రాలి కూలువారును, వెఱచి పఱచువారునునై పలు దొసంగుల నెసంగుచుండి రప్పుడు – 364**

మఱియు = ఇంకను, నెరయ = వ్యాపించి, విరియుచున్ = ఉప్పొంగుచు, కెరలి = విజృంభించి, పొరలున్ = పైకి పొంగుచున్న, అబ్బురంపు = ఆశ్చర్యకరమగు, కొఱకొఱలన్ = కోపముతో, కొఱలి = ప్రకాశించి, ఒఱలన్ = కత్తుల గవుసెనలో, వఱలు = ఒప్పుచున్న, కఱకు = కఠినమైన, చుఱుకు = వాడిగల, అడిదంబులు = కత్తులు, పెఱికి = ఒఱనుండి లాగి, ఉఱికి = దుముకి, నఱికి, నెఱకులు = మర్మములు, ఉఱక = మిక్కిలి, చుఱుకు = బాధ, అలరన్ = కలుగునట్లుగా, గిఱికొల్పుచున్ = చుట్టుకొనజేయుచు.

గెలుపు బలుపులు, ఇగురొత్తన్ = చిగురింపగా, హత్తి మొత్తంబులన్ = ఏనుగుల సమూహములను, క్రొత్త = వాడియైన, సెల = బాణము, కత్తి, మొత్తంబులన్, తుత్తుమురుగాన్ = ముక్కలు ముక్కలుగా, మొత్తి, నెత్తురులన్, జొత్తిలం చేయుచున్ = ఎఱ్ఱబార చేయుచు.

పాయని పేరు అమ్మునన్ = వదలని పెద్ద బాణముతో (బల్లెముతో), క్రుమ్మి, క్రొత్త మెఱుంగు అమ్ములు, ఉమ్మడి = ఒక్కసారిగా, ఱొమ్ములు, ఉరలన్ = పగులునట్లుగా, చిమ్మి = విసరి, ఇమ్ములన్ = ఆ స్థానములందే, సొమ్మగొనన్ = సొమ్మసిలునట్లు, ఒనర్చుచు = చేయుచు,

పేర్చి = అతిశయించి, ఆర్చి = అరిచి, బల్ కోన = పెద్ద అడవిని, ఏర్చు = కాల్చివేయు, కార్చిచ్చు వడువునన్ = కార్చిచ్చు వలె, అదరి = విజృంభించి, తొడలు, మెడలు, నడుములున్, పొడుములుగ = పిండి అగునట్లుగ, బెడిదంపు = కఠినమైన, ఇనుప బడియల, పడలువడన్ = కుప్పలుపడునట్లుగ, అడుచుచు = అణచివేయుచు.

నిండారు = పరిపూర్ణమైన, గండు = పౌరుషము, మెండుకొనన్ = అధికముకాగా, అండగొనక = సహాయముకోరక, దిండుకల = పొడవాటి కఱ్ఱకల, గండ్రగొడ్డండ్ల, గుండెలు, కండలు = మాంస ఖండములు, కొండలుగన్ = గుట్టలుగా, చెండు బెండాడుచు = ఖండించుచు, మిటారంపు = అతిశయమైన, కటారులన్ = కత్తులతో, పటాలు పటాలనన్, తుటారంబు అదరన్ = దిట్టతనము అతిశయింపగా, అడిచి = అణచివేసి, హుటాహుటిన్, పటాపంచలుగన్ = కనిపించకుండా, తఱుముచు.

పోటరి తనంబు = యుద్ధ నైపుణ్యము, పాటిలన్ = కలుగగా, సూటిగన్ = గురిగా, ఈటియలు = బల్లెములు, నాటుకొల్పి = పొడిచి, ఉసురులు, ఎడల మీటుచున్ = పోగొట్టుచు, పట్టగు = బలమైన, చుట్టువాలు = కొడవళ్ళ, పెట్టులన్ = దెబ్బలచే, పొట్టలు, చట్టలు, బిట్టు పగిల్చి = బాగా పగులగొట్టి, ఇట్టట్టు చేయుచు = కలతపెట్టుచు, వీకన్ = ఉత్సాహముతో, తోకొని = గ్రహించి, బాకులన్, చేగ రోకలి = బలమైన రోకళ్ళ, తాకులన్ = దెబ్బలతో, కాక తీఱన్ = కోపము తీరునట్లుగా, చదిపి = చంపి, ప్రోకలు పెట్టుచు = పోగులు పెడుతూ.

వంకలన్ = వంకి కత్తులతో, కొంకు లేని = భయము లేని, బింకంబులు = పౌరుషములు, ఇంకించుచు = లేకుండచేయుచు, బల్లెంబులన్, ఉల్లంబులు = గుండెలు, జల్లని, యొల్లంబోవ = ధైర్యమును కోల్పోవగా, మొల్లంబగు = అందమగు, పెల్లు = ఆధిక్యమును, చూపి, త్రెళ్ళింపుచు = చంపుచు, సురియలన్ = చుఱకత్తులతో, గొఱియలం బలె = గొఱ్ఱెలనువలె, ఇఱియ = నలిగి, నెఱియన్ = పగులునట్లు, పఱియలుగన్ = చీలికలుగా, క్రుమ్ముచు = పొడుచుచు,

మారి మసంగిన తెఱంగున = క్షుద్రశక్తి చంపిన విధముగా, బారిసమరి = నాశము చేయుచు, పెక్కంద్ర = వానరులను, చౌవంచ గిట్టలన్ = ఐదు బాణములతోను, ఎనిమిదేను తూపులన్ = 13 బాణములతో, గఱి కట్టియలన్ = రెక్కలుగల బాణములతో, ననిచిన = పూచిన, ములుమోదుగుల = ములుమోదుగు వృక్షముల, చందంబునన్ = విధముగా, ఒందించెన్ = పొందించెను. (ములుమోదుగపూలు ఎఱ్ఱగా నుండును, రక్తపుధారలతో వానరుల దేహములన్నియు అట్లున్నవని అర్థము). అందున్ = ఆ సేనలయందు, త్రెళ్ళువారును = మరణించువారును, అడలువారును = ఏడ్చువారును, అత్తమిల్లువారును = చచ్చువారును, బఱులు = పార్శ్వభాగములు, వ్రస్సి = తెగిపోయి, ఒఱలువారును = పడపోవువారును, సురుగువారును = తప్పించుకొనిపోవు వారును, వ్రేగి = భారమును పొంది, లోగువారును = అణగిపోవువారును, కంది = తపించి, దొసంగులన్ = ఆపదలతో, ఎసంగుచుండిరి = బాధపడుచుండిరి, అప్పుడు –

**తా :** ఇంకను వ్యాపించి ఉప్పొంగుచు విజృంభించి పైకి పొంగుచున్న కోపముతో ఒఱలలోని వాడి కత్తులు లాగి దుమికి నఱికి మర్మములు బాధచెంది చుట్టుకొనునట్లుచేయుచు గెలుపు బలుపులు చిగురించగా ఏనుగులను వాడి బాణములు, కత్తులతో ముక్కలు ముక్కలుగ కొట్టి రక్తముతో వారి దేహములు ఎఱ్ఱబారచేయుచు, బల్లెముతో క్రుమ్మి, వాడి బాణములు ఒక్కసారిగా ఱొమ్ములు పగులునట్లుగా విసరి అక్కడే సొమ్మసిలునట్లు చేసి సింహనాదము చేయుచు

గట్టిగా అరచి అడవిని కాల్చివేయు కార్చిచ్చువలె విజృంభించి వానరుల తొడలు, మెడలు, నడుములు నుజ్జునుజ్జగునట్లు బలమైన ఇనుపదుడ్డుతో అలసిపోయేలా అణచి వేయుచూ అధికమైన పరిపూర్ణ పౌరుషముతో ఒంటరిగా పొడుగు కామకల గండ్రగొడ్డళ్ళతో గుండెలు, కండలు గుట్టలుగా ఖండించుచు, బలమైన ఆయుధములతో పటాలుపటాలుమని ధైర్యము అతిశయింపగా అణచివేసి మంచి వేగముతో కనిపించకుండ తఱిమివేయుచు యుద్ధనైపుణ్యముతో సూటిగా బల్లెములతో పొడిచి ఉసురులు పోగొట్టుచు, బలమైన కొడవళ్ళ దెబ్బలచే పొట్టలు, చట్టలు బాగా పగులగొట్టి తలక్రిందులు చేయుచు, బాకులు, రోకళ్ళు ఉత్సాహముతో తీసుకొని కోపము తీరునట్లుగా చంపి పోగులు పెడుతూ వంకి కత్తులతో వానరుల పౌరుషము లేకుండ చేసి, బల్లెములతో గుండెలు ఝల్లని ధైర్యము కోల్పోవునట్లుగా ఆధిక్యమును చూపి చంపుచు, చురకత్తులతో గొఱ్ఱెలనువలె నలిగి పగులునట్లు చీలికలుగా పొడుచుచు –

క్షుద్రశక్తి చంపిన విధముగా నాశముచేయుచు ఎక్కడ చూచిన తానయై ఒక్కొక్క బాణమున వానరులను పెక్కుమందిని చంపి వేఱువేఱుగ 5 బాణములతో గంధమాదనుని, 6 బాణములతో ద్వివిదుని, 7 బాణములతో వినతుని, 5 బాణములతో మైందుని, 8 బాణములతో గజుని, 5 బాణములతో కుముదుని, 13 బాణములతో శరభుని, 8 బాణములతో అంగదుని, 20 ఱెక్కల బాణములతో హనుమంతుని, 10 బాణములతో గవాక్షుని బాధించి పూచిన మోదుగు వృక్షముల మాదిరిగ చేసెను. ఆ వానర సేనలయందు కాళ్ళు తెగి మరణించువారును, పొట్టలు పగిలి చచ్చువారును, తొడలు విరిగి పెద్దగా ఏడ్చువారును, చేతులు నలిగి భయపడువారును, భుజములు తెగిపడి ఏడ్పుబొబ్బలు పెట్టువారును, గొంతులు తెగి చచ్చువారును, ఱొమ్ముకు తగిలి సొమ్మసిలువారును, పార్శ్వభాగములు తెగి వంగిపోవువారును, నడుము విరిగి బాధపడు వారును, నేల వ్రాలి మరణించువారును, భయముతో పారిపోవువారునై అనేక బాధలతో బాధపడుచుండిరి, అప్పుడు –

**కం.** **వెలుఁగుల రాయని కొడు కొక**
**మలఁగొని యమ్మేటి సోఁకు మన్నియపై ని**
**మ్ములఁ జనుచో నెఱ మగఁటిమి**
**యలర విరూపాక్షుఁ డతని కడ్డము దాఁకెన్** **365**

వెలుగులరాయని కొడుకు = సుగ్రీవుడు, ఒక మల కొని, ఆ మేటి సోకు మన్నియ పైన్ = ఆ శూరుడైన రావణునిపై, ఇమ్ములన్ = కోరికగా, చనుచోన్ = వెళ్ళుచుండగా, విరూపాక్షుండు, నెఱ మగటిమి = పూర్తి పౌరుషము, అలరన్ = ఒప్పగా, అడ్డము తాకెన్ = అడ్డుపడెను.

**తా :** సుగ్రీవుడు ఒక కొండ తీసుకొని ఆ శూరుడైన రావణునిపైకి వెళ్ళుచుండగా విరూపాక్షుడు పౌరుషముతో అడ్డుపడి ఎదుర్కొనెను.

**తే.గీ.** **తాఁకి కెడిదంపు ములుకులు దఱచు నింప**
**నక్కడిఁది జోదు దా నవి లెక్కఁ గొనక**
**వాని తేరును మావులఁ బో నడంచి**
**యడరుటయు వాఁడు జంగునఁ బుడమి కుఱికి** **366**

తాకి = ఎదుర్కొని, తఱచు = దట్టముగా, ఆ కడిది జోదు = ఆ ధైర్యముకల సుగ్రీవుడు, మావులన్ = గుఱ్ఱములను, అడరుటయును = విజృంభించుటయును, వాడు = ఆ విరూపాక్షుడు, చంగునన్ = ఒక్కసారిగా –

**తా :** ఎదుర్కొని కఠినములైన బాణములు సాంద్రముగా నింపివేయగా, ఆ సుగ్రీవుడు వానిని లెక్కచేయక వాని రథమును, గుఱ్ఱములను నశించునట్లు అణచివేయగా విరూపాక్షుడు చెంగున రథమునుండి పుడమికి దూకి.

**ఆ.వె.** **కోఁతి ఱేనిఁ బొదివికొన నపు డిరువురుఁ**
**జెనసి బిట్టు పోరు సేయుచున్న**

**తొగలదాయ కందు దూఱి యా రక్కసు**
**బోర యవియఁ బొడిచి పొలియఁ జేసె** **367**

కోతిఱేనిన్ = సుగ్రీవుని, పొదివికొనన్ = గట్టిగా పట్టుకొనగా, చెనసి = ఎదుర్కొని, తొగలదాయ కందు = సుగ్రీవుడు, దూఱి = చొరబడి, బోర అవియ = ఱొమ్ము పగులునట్లుగా, పొలియన్ చేసె = చంపెను.

**తా :** వానర ప్రభువైన సుగ్రీవుని గట్టిగా పట్టుకొనగా అపు డిద్దరును భీకరముగా పోరుచుండగా సుగ్రీవుడు ఆ విరూపాక్షుని ఱొమ్మును పొడిచి చంపివేసెను.

**ఆ.వె.** **వానితోడఁబుట్టు వైన యున్మత్తుఁ డ**
**క్కొమ్మ మెగపు మిన్నఁ గ్రమ్మి పెక్కు**
**చందముల దురంబు సలిపిన నాతఁ డ**
**ద్దోసకారి నటులె తునిమివైచె** **368**

వాని తోడపుట్టువు ఐన, ఉన్మత్తుడు, ఆ కొమ్మ మెగపు మిన్నన్ = ఆ సుగ్రీవుని, క్రమ్మి = ఆక్రమించి, దురంబు = యుద్ధమును, ఆ దోసకారిన్ = ఆ దుష్టుని, తునిమివైచె = చంపెను.

**తా :** వాని తోడపుట్టువైన ఉన్మత్తుడు ఆ సుగ్రీవుని ఆక్రమించి అనేక రీతుల యుద్ధము చేయగా సుగ్రీవుడు ఆ ఉన్మత్తుని విరుపాక్షుని వలెనే చంపెను.

**కం.** **వైచిన తెఱఁగు సుపార్శ్వుఁడు**
**సూచి కడుం గినిసి కోఁతి జోదులపైఁ బెన్**
**బూచివలెఁ దొడర నంగదుఁ**
**డేచిన బీరమున వాని నెదిరించి వడిన్** **369**

వైచిన = చంపిన, తెఱగు = విధమును, పెన్ బూచివలె = దయ్యము మాదిరిగా, తొడరన్ = ఉద్యమింపగా, ఏచిన = అతిశయించిన, బీరమునన్ = పరాక్రమముతో –

**తా :** చంపిన విధమును సుపార్శ్వుడు చూచి మిక్కిలి కోపించి వానర యోధులపై పెద్ద దెయ్యము మాదిరిగా పడగా అంగదుడు రెచ్చిన శౌర్యముతో శీఘ్రముగా వాని నెదిరించి

**సీ.** **కొండ యొక్కటి వైచి గుఱ్ఱముల్ దేరును**
**నుఱుముగాఁ జేసిన నుఱక వాఁడు**
**పది తూపు లంగదుపై నేసి మూఁడింట**
**వేఁడి వేలుపు కుఱ్ఱ వాఁడి సెఱచి**
**మొగి గవాక్షుని నైదు ములుకుల నొప్పించి**
**యార్చిన వేల్పురాయని మనుమఁడు**
**గినుకతో నొక ద్రుద్దుగొని వాని ఱొమ్ము ప**
**గిల్చిన సోలి వేగిరమె తెలిసి**

**తే.గీ.** **వాఁడు గ్రమ్మఱ గొట్టుడు వాలి కొడుకు**
**బోర వ్రేసిన నులికి యప్పోటుకాఁడు**
**పొలసు మేపరిఁ బిడికిటఁ బూని పొడువ**
**నల్లఁ గ్రక్కుచు నేలపైఁ ద్రెళ్ళి యీల్గె** **370**

నుఱుముగాన్ = పిండిపిండిగా, ఉఱక = తేలికగా, వాడు = సుపార్శ్వుడు, వేడి వేలపు కుఱ్ఱ = సుగ్రీవుడు, మొగి = పూని, నొప్పించి = బాధించి, ఆర్చిన = అరవగా, వేల్పురాయని మనుమడు = అంగదుడు, కినుకతో = కోపముతో, సోలి = సొమ్మసిలి, వేగిరమె = వెంటనే, క్రమ్మఱ = తిరిగి, బోఱ వ్రేసిన = ఱొమ్మును కొట్టగా, ఉలికి = చలించి, ఆ పోటుకాడు = ఆ వీరుడగు అంగదుడు, పొలసు మేపరిన్ = సుపార్శ్వుని, నల్ల క్రక్కుచు = రక్తము కక్కుకుంటూ, నేలపై త్రెళ్ళి = భూమిమీద పడి, ఈల్గె = చచ్చెను.

**తా :** ఒక కొండను విసరి రథాశ్వములను, రథమును పిండిపిండిచేయగా తేలికగా వాడు 10 బాణములు అంగదునిపై ప్రయోగించి, 3 బాణములతో సుగ్రీవుని తీక్షణతను అరికట్టి, గవాక్షుని 5 బాణములతో నొప్పించి ఒక్క కేక పెట్టెను. అపుడు అంగదుడు కోపముతో ఒక దుడ్డును తీసుకొని అతని వక్షస్థలమును పగులగొట్టెను. అంతట వాడు మరల అంగదుని కొట్టెను. అపుడు అంగదుడు సుపార్శ్వుని వక్షస్థలమును పిడికిటితో పొడువగా వాడు రక్తము క్రక్కుకొనుచూ నేలపడి మరణించెను.

**తే.గీ.** **అట్లు మొనగాండ్రు ముగురు నీఱగుటఁ జూచి**
**యక్కజంబుగ రావణుఁ డడవి మనికి**
**మెకపు బంటులపైఁ బగమీఱఁ దేరు**
**పఱపి తఱిమిన వారలు వెఱచి పఱచి** **371**

నీఱగుట = చనిపోవుట, అక్కజంబుగ = ఆశ్చర్యకరముగా, అడవి మనికి మెకపు బంటులపైన్ = వానరులపై, పగ మీఱన్ = మిక్కిలి కోపముతో, తేరు పఱపి = రథమును నడిపించి, వెఱచి = భయపడి, పఱచి = పారిపోయి,

**తా :** అలా ముగ్గురు వీరులు చనిపోవుట చూచి రావణుడు వానర వీరులమీద మిక్కిలి కోపముతో రథము నడపి తఱిమివేయగా వారు భయపడి పారిపోయి.

**కం.** **ఒడయని దరిఁ జేరిన నతఁ**
**డడరెడు నెయ్యమున వారి యళుకుడుపుచు నె**
**వ్వడి విలు గైకొని యా నం**
**జుడు మేపరి కొలపు మేటిజోదు నెదిర్చెన్** **372**

ఒడయని దరిన్ = రాముని చెంతకు, అడరెడు = అతిశయించిన, నెయ్యమున = ప్రీతితో, అళుకు ఉడుపుచు = భయమును పోగొట్టుచు, నెవ్వడి = శీఘ్రముగా, కైకొని = తీసుకొని, ఆ నంజుడు మేపరి కొలపు మేటిజోదున్ = ఆ రాక్షస కులపు మేటి వీరుడైన రావణుని, ఎదిర్చెన్ = ఎదిరించెను.

**తా :** రాముని చెంతకు చేరగా రాముడు మిక్కిలి ప్రీతితో వారి భయమును పోగొట్టి వెంటనే వింటినందుకొని రావణుని ఎదిరించెను.

**కం. ఎదిరించి కడలు బుడమియుఁ**
**జదలుఁ బొదువునట్టు లంప జడి నించుటయున్**
**బెదరక వాఁడును వేఁడిమి**
**గదురఁగ మొనవాఁడి తూపుగములు నిగిడ్చెన్ 373**

ఎదిరించి = ఎదుర్కొని, కడలు = దిక్కులును, పుడమియున్, చదలున్ = ఆకాశమును, పొదవు నట్టులు = ఆక్రమించునట్లుగా, అంప జడి = బాణవర్షము, నించుటయున్ = నింపుటయును, వాడును = రావణుడును, బెదరక = భయపడక, వేడిమి కదురగ = తీక్ష్ణత వ్యాపింపగా, మొనవాడి = చివర పదునుకల, తూపుగములు = బాణ సమూహములు, నిగిడ్చెన్ = పరపెను.

**తా :** ఎదుర్కొని దిక్కులు,నేల,ఆకాశము ఆక్రమించునట్లుగా దట్టముగా బాణవర్షము కురిపింపగా రావణుడు భయపడక కోపముతో పదునైన బాణములను సంధించెను.

**కం. మంటలు మిణుగురు లెగయఁగ**
**మంటంగల పజకు బీతు మాటికి నిడుచున్**
**మింటం బర్వెను రాముని**
**వింటం బరగించు వాఁడి వెడఁదల కోరుల్ 374**

మిణుగురులు = నిప్పుకణికలు, పజకు = ప్రజలకు, బీతు = భయము, మాటికిన్ ఇడుచున్ = మాటిమాటికి కలిగించుచు, రాముని వింటన్, పరగించు = ప్రయోగించు, వాడి వెడద కోరుల్ = పదునైన వెడల్పైన బాణములు, మింటన్ పర్వెను = ఆకాశమున వ్యాపించెను.

**తా :** మంటలు, నిప్పురవ్వలు వ్యాపింపగా ప్రజలకు మాటిమాటికి భయమును కల్పించుచు రాముడు ప్రయోగించు వాడి బాణములు ఆకాశమున వ్యాపించెను.

**కం. రక్కసుల ఱేని తూపులఁ**
**జక్కాడున్ రాగవుండు సరగున మరలన్**
**జక్కాడు రాము తూపుల**
**రక్కసి గమికాఁడు నబ్బురం బలరారన్ 375**

రక్కసుల ఱేని = రావణుని, తూపులన్ = బాణములను, రాగవుండు = రాముడు, చక్కాడున్ = నాశనము చేయును, సరగున = వెంటనే, మరలన్ = తిరిగి, రాము తూపుల = రాముని బాణములను, అబ్బురంబు అలరారన్ = ఆశ్చర్యము కలుగునట్లుగా, రక్కసి గమికాడు = రావణుడు, జక్కాడు = నాశనము చేయును.

**తా :** రావణుని బాణములను రాముడు నాశనము చేయును. వెంటనే తిరిగి రాముని బాణములను ఆశ్చర్యకరముగా రావణుడు నాశనము చేయును.

**మ. విలునేర్పుల్ బవరంబు వేడ్కలు గడున్ విప్పారు బీరంబులున్**
**బలుము ల్గింకలు గెల్పు కోర్కులసము ల్పంతంబులుం జోకమై**
**దలరన్ బంటవలంతి యల్లుఁడును బ్రాఁదయ్యంపు మేల్బంతియున్**
**బలు చందంబులఁ బోరి రచ్చెరువు దోపం బేర్మితో నత్తటిన్ 376**

పంటవలంతి అల్లుడును = రాముడును, ప్రాత దయ్యంబు మేల్బంతియున్ = పూర్వ దేవతలు అంటే రాక్షసుల శ్రేష్ఠుడు రావణుడును, విలు నేర్పుల్ = అస్త్రవిద్యా నైపుణ్యములు, బవరంబు వేడ్కలు = యుద్ధోత్సాహమును, కడున్ = మిక్కిలి, విప్పారు = వికసించు, బీరంబులున్ = పరాక్రమములును, బలుముల్ = బలములును, కింకలు = కోపములును, గెల్పు కోర్కుల = జయ కాంక్షలును, అసముల్ = కీర్తులును, పంతంబులున్ = పట్టుదలలును, జోకమై తలరన్ = సమానముకాగా, పలు చందంబులన్, అచ్చెరువు, తోపన్, పేర్మితో = కాంక్షతో, అత్తటిన్, పోరిరి.
**తా :** రాముడును, రావణుడును అస్త్రవిద్యా నైపుణ్యములు, యుద్ధోత్సాహమును మిక్కిలి వికసించు పరాక్రమములును, బలములును, కోపములును, విజయకాంక్షలును, కీర్తులును, పంతంబులును సమానముకాగా పలువిధముల ఆశ్చర్యకరముగా కాంక్షతో పోరాడిరి.

**కం. చేవురు కొండల పవిదిం**
**బూవుల బూరుగుల చందమున నెత్తురు ల**
**న్వావిరిఁ దోఁగి పెనంగిరి**
**రావణుఁడును రాగవుఁడు దిరంబగు కడిమిన్ 377**

చేవురు = జేగురు, కొండల పవిదిన్ = కొండల మాదిరిగా, పూవుల బూరుగుల = బూరుగుచెట్ల పూవుల, చందమున = విధమున, నెత్తురులన్, వావిరిన్ తోగి = అధికముగా మునిగి, రావణుడును, రాగవుడు, తిరంబగు = స్థిరమైన, కడిమిన్ = సాహసముతో, పెనంగిరి = యుద్ధము చేసిరి.
**తా :** జేగురు కొండల మాదిరిగా, బూరుగుచెట్ల పూవుల విధముగా రక్తమునందు మునిగి రావణుడును, రాముడును స్థిరమైన పౌరుషముతో పెనగులాడిరి.

**తే.గీ. అట్లు నెఱజోదు లిర్వురు నదరి పెక్కు**
**కడిఁది తూపులఁ బోరాడు నెడల సోఁకు**
**మిన్న రాకాసి ములికి యా మన్నుఁజేని**
**పై నిగిడ్చిన నది తద్ద పఱపుమీఱి 378**

అట్లు, నెఱజోదులు ఇర్వురున్ = సొగసైన యోధు లిద్దరును, అదరి = విజృంభించి, పెక్కు కడిది తూపులన్ = పలు బలమైన బాణములతో, పోరాడు నెడలన్ = యుద్ధము చేయుచుండగా, సోకు మిన్న = రావణుడు, రాకాసి ములికి = రాక్షస బాణమును, ఆ మన్ను జేనిపై = ఆ రామునిపై, నిగిడ్చిన = ప్రయోగించగా, అది = ఆ బాణము, తద్ద = మిక్కిలి, పఱపు మీఱి = విరివి పెరిగి,

తా : అట్లు సొగసైన యోధు లిద్దరును విజృంభించి పలు కడిది తూపులతో పోరాడుచుండగా రావణుడు రాక్షసబాణమును ఆ రామునిపై ప్రయోగించగా అది మిక్కిలి విరివిగా పెరిగి.

**చం. ఎలుఁగు మొగంబు లున్మఱియు నేనుఁగు మోములు దున్న మోములున్**
**జిలువ మొగంబులుం గొదమ సింగపు మోములు జాగిలంపు మో**
**ములు పసిదిండి పెన్మెకపు మోములు పుల్గు మొగంబులు న్మొద**
**ల్గల పలు మోము లూని పయిఁ గ్రమ్మినఁ గన్గొని నేలతేఁ డొగిన్ 379**

పసి తిండి = గోవులను తిను, పెను మెకపు మోములు = పెద్దపులి ముఖములును, పుల్గు మొగంబులున్ = పక్షి ముఖములును, మొదలు కల, పలు మోములు, ఊని = పొంది, పయిన్ క్రమ్మినన్ = మీదకు దుముకగా, కన్గొని = చూచి, ఒగిన్ = క్రమముగా, –

**తా :** ఎలుగుబంటి, ఏనుగు, పాము, దున్నపోతు, సింహము, వేటకుక్కలు, పెద్దపులి, పక్షి మొదలైనవాటి ముఖములుకల పలు రీతుల ముఖములను పొంది వ్యాపింపగా చూచి రాముడు క్రమముగా –

**కం. చిచ్చుఱ తూపరిఁ గూరిచి**
**క్రచ్చుఱ రక్కసుని బూటకపు ముల్కి గడున్**
**జెచ్చెర నడఁగఁగ నేసెన్**
**హెచ్చరికల జదల వేల్పు లెల్లం బొగడన్ 380**

చిచ్చుఱ తూపు = ఆగ్నేయాస్త్రమును, అరిన్ కూరిచి = నారికి తగిలించి, క్రచ్చుఱ = వెంటనే, రక్కసుని = రావణుని, బూటకపు ముల్కిన్ = మాయ బాణమును, కడున్ చెచ్చెరన్ = అంతకంటె వేగముగా, అడగగన్ = అణచివేయగా, హెచ్చరికల = జయజయ ధ్వానములతో, చదల వేల్పులు ఎల్లన్ = ఆకాశమందలి దేవతలందరు, పొగడన్ = స్తుతింపగా, ఏసెన్ = వేసెను.

**తా :** ఆగ్నేయాస్త్రమును నారికి తగిలించి జయజయధ్వానములతో దేవతలు స్తుతింపగా వెంటనే రావణుని మాయ బాణమును అంతకంటె వేగముగా అణచివేయగా వేసెను.

**తే.గీ. మయుఁడు దబ్బఱమీఱ నేమమునఁ జేసి**
**యిడిన ముల్కిఁ గడఁక నీ రేను తలల**
**తోడి వేలుపు సిమ్మినఁ దోన వేల్పు**
**గాణ తూపేసి దొర దానిఁ గ్రమ్మఱించె 381**

ఈరు ఏను తలలతోడి = పది తలలతో నొప్పు, వేలుపు = రావణుడు, మయుడు = రాక్షస శిల్పి (రావణుని మామగారు), దబ్బర మీఱన్ = మిక్కిలి అతిశయముతో, నేమమునన్ = నియమముతో, చేసి ఇడిన = చేసి ఇచ్చిన, ముల్కిన్ = బాణమును, కడకన్ = పూనికతో, చిమ్మినన్ = విసరగా, తోన = వెంటనే, దొర = రాముడు, వేల్పుగాణ తూపు = గాంధ ర్వాస్త్రమును, ఏసి = వేసి, దానిన్ క్రమ్మఱించె = ఆ బాణమును వెనుకకు త్రిప్పెను.

**తా :** రావణుడు మయుడు నియమముతో చేసి ఇచ్చిన బాణమును పూనికతో విసరగా వెంటనే రాముడు గాంధర్వాస్త్రమును వేసి దానిని వెనుకకు త్రిప్పెను.

**కం.** **వెండియు మిడుఁగురు లుమియుచు**
**మండెడు వాల్తూపుగముల మానిసి ఱేఁడున్**
**దండి పొలదిండి రాయఁడు**
**నండఁగొనక పోరుచుండి రక్కజమొదవన్** **382**

వెండియు = మరల, మిడుగురులు = అగ్నికణములు, ఉమియుచు = క్రక్కుచు, మండెడు = జ్వాలలెగయు, వాలు తూపుగములన్ = వాడియగు బాణసమూహముతో, మానిసి ఱేడున్ = రాముడును, దండి = శౌర్యవంతుడగు, పొలదిండి రాయడు = రావణుడు, అండన్ కొనక = సహాయమాసించక, ఆశ్చర్యమొదవన్ = ఆశ్చర్యకరముగా, పోరుచుండిరి = యుద్ధముచేయుచుండిరి.

**తా :** మరల అగ్నికణములు క్రక్కుచు జ్వాలలెగయు వాడి బాణములతో రాముడును శౌర్యవంతుడగు రావణుడును సహాయమాసించక ఆశ్చర్యకరముగా పోరాడుచుండిరి.

**ఆ.వె.** **అపుడు పడుకునుండి యరుదెంచు సింగపుఁ**
**గొదమవోలెఁ జెలఁగి కొమ్మ మెకపుఁ**
**బౌఁజు నడుమనుండి పఱతెంచి లక్ష్మణుఁ**
**డరుదు మీఱ సోఁకు దొరను దాఁకి** **383**

అపుడు, పడుకునుండి = గుహనుండి, అరుదెంచు = వచ్చుచున్న, సింగపు కొదమవోలెన్ = సింహపు పిల్లవలె, చెలగి = విజృంభించి, కొమ్మ మెకపున్ పౌజు = వానర సైన్యము, నడుమనుండి = మధ్యలోనుండి, పఱతెంచి = వచ్చి, లక్ష్మణుడు, అరుదు మీఱ = మిక్కిలి ఆశ్చర్యకరముగా, సోకుదొరన్ = రావణుని, తాకి = మార్కొని –

**తా :** అపుడు గుహనుండి బయటకువచ్చు సింహపుకొదమవలె విజృంభించి వానర సైన్యము మధ్యలోనుండి లక్ష్మణుడు అశ్చర్యకరముగా రావణుని మార్కొని –

**ఆ.వె.** **తేరు గడపువాని దిగ్గన నొక కోలఁ**
**ద్రెళ్ళ నేసి యొంట విల్లు దునిమి**
**పడగ యొంట నేలఁబడ నేసి యైదు పె**
**న్గోల లతని యెదను గ్రుచ్చి యార్చె** **384**

తేరు కడపు వానిన్ = సారథిని, దిగ్గన = శీఘ్రముగా, ఒక కోలన్, త్రెళ్ళన్ ఏసి = చంపి, ఒంటన్ = ఒక బాణముతో, విల్లు దునిమి, ఒంటన్, పడగ = ధ్వజమును, నేల పడన్ ఏసి, ఐదు పెను కోలల = ఐదు పెద్ద బాణములతో, అతని = ఆ రావణుని, ఎదను, గ్రుచ్చి, ఆర్చె = అరిచెను.

**తా :** సారథిని శీఘ్రముగా ఒక బాణముతో చంపి, ఒక బాణముతో విల్లు దునిమి, మరొకటితో ధ్వజమును నేల పడవేసి, 5 బాణములతో రావణుని ఎద గ్రుచ్చి అరచెను

**వ. విభీషణుండును బెడిదంపు ద్రుద్దున నరదపు మావుల నుఱుము చేసిన నప్పొలదిండి యొడయండు కొండపైనుండి కుప్పించు కొదమ సింగంబు తెఱంగునఁ బుడమి కుతికి మిక్కుటంపుం గినుక నవ్విభీషణునిపై మయుండిచ్చిన సత్తి నిగుడించిన 385**

బెడిదంపు = కఠినమైన, నుఱుము = పొడిపొడిగా, ఆ పొలదిండి ఒడయడు = ఆ రావణుడు, కుప్పించు = లంఘించు, కొదమ సింగంబు తెఱంగునన్ = సింహపు పిల్లవలె, మిక్కుటపున్ = అధికమైన, మయుండు ఇచ్చిన, సత్తి = శక్తి ఆయుధమును, నిగుడించినన్ = ప్రయోగించగా,

**తా :** విభీషణుడు కఠినమైన దుడ్డుతో రథము గుఱ్ఱములను పొడిపొడిగా చేసిన రావణుడు కొండపైనుండి దుముకు కొదమ సింహమువలె నేల కుతికి మిక్కిలి కోపముతో ఆ విభీషణునిపై మయుడిచ్చిన శక్తిని ప్రయోగించిన –

**తే.గీ. అది జగంబుల నేర్చుచు నదరు నగ్గి**
**కరణి మంటలు మిణుఁగురు ల్గడలు కొనఁగ**
**వచ్చుచో మర్వు సేరిన వాని మనుచు**
**కొనుటె తగవని లక్ష్మణుఁ డనువు మీఱ 386**

అది = ఆ శక్తి, జగంబులన్ ఏర్చుచు = లోకములను దగ్ధము చేయుచు, అదరు = వ్యాపించి, అగ్గి కరణి = అగ్నివలె, మంటలు, మిణుగురులు = అగ్నికణములు, కడలుకొనగన్ = వ్యాపించగా, వచ్చుచో = వచ్చుచుండగా, మర్వుచేరినవానిన్ = తమచాటున చేరినవానిని(విభీషణుని), మనుచు కొనుటె తగవని = రక్షించుకొనుటే ధర్మమని, లక్ష్మణుడు, అనువుమీఱ = మిక్కిలి ఉపాయముతో–

**తా :** ఆ శక్తి లోకములను దగ్ధము చేయుచు వ్యాపించి అగ్నివలె మంటలు, అగ్ని కణములు వ్యాపించగా వచ్చుచుండగా తమ చాటున చేరినవారిని రక్షించుకొనుటే ధర్మమని లక్ష్మణుడు మిక్కిలి ఉపాయముతో –

**తే.గీ. తన వెనుక కవ్విభీషణుఁ దలఁగ దిగిచి**
**తూఱి యా సత్తిపైఁ బెక్కుఁ దూపు లేయ**
**సరకుగొన కది నిగిడి యబ్బిరుదు మగని**
**ఱొమ్ము గాఁడినఁ ద్రెళ్ళి వే సొమ్మసిల్లె 387**

తన వెనుకకు, ఆ విభీషణున్, తలగ దిగిచి = తొలగునట్లుగా లాగి, తూఱి = పూని, ఆ సత్తిపైన్, పెక్కు తూపులు ఏయ, సరకు కొనక = లక్ష్యము చేయక, అది = ఆ మయుని శక్తి, నిగిడి = వ్యాపించి, ఆ బిరుదుమగని = ఆ లక్ష్మణుని, ఱొమ్ము గాడినన్ = ఱొమ్మున నాటగా, త్రెళ్ళి = క్రిందపడి, వే = శీఘ్రముగా, సొమ్మసిల్లె.

**తా :** తన వెనుకకు ఆ విభీషణుని లాగి పూని ఆ శక్తిపై పలు బాణములు వేయగా అది లక్ష్యము చేయక వ్యాపించి ఆ లక్ష్మణుని ఱొమ్మున నాటగా ఆతడు క్రిందపడి సొమ్మసిలెను.

**కం. అప్పుడు రావణుఁ డెంతయు**
**నుప్పొంగుచు తేని మీఁద నుఱవడి బెరయన్**

**నిప్పులు గ్రక్కెడు తూపులు**
**గుప్పించి కలంప మిగులఁ గొఱకొఱ నతఁడున్** **388**

అప్పుడు, రావణుడు, ఎంతయున్ = మిక్కిలి, ఉప్పొంగుచు = పొంగిపోతూ, తేనిమీద = రామునిమీద, ఉఱవడి = వేగముగా, పెరయన్ = వ్యాపింపగా, నిప్పులు క్రక్కెడు తూపులు, కుప్పించి = ప్రయోగించి, కలంప = కలతపెట్టగా, మిగులన్ = ఎక్కువగా, కొఱకొఱన్ = కోపముతో –

**తా :** అప్పుడు రావణుడు మిక్కిలి పొంగిపోతూ రామునిమీద వేగముగా వ్యాపించి నిప్పులు కక్కే బాణములు ప్రయోగించి కలతపెట్టగా మిగుల కోపముతో –

**తే.గీ.** **వేఁడి సూపెడు కఱకు క్రొవ్వాఁడి తూపు**
**గములు దద్దయు నెఱఁకులు గాడనేసి**
**విరుల మోదుగు తెఱఁగు గావించుటయును**
**విఱిగి రక్కసి దొర కురుల్వీడి చెదర** **389**

వేడి చూపెడు = తీక్షణతను వ్యాపించు, కఱకు క్రొవ్వాడి తూపుగములు = కఠినమైన మిక్కిలివాడియైన బాణసమూహములు, తద్దయున్ = అధికముగా, నెఱకులు = మర్మ ప్రదేశములు, గాడన్ ఏసి = నాటునట్లుగా ప్రయోగించి, విరుల మోదుగు తెఱగు = పూచిన మోదుగుచెట్టువలె, కావించుటయును, విఱిగి = ఓడిపోయి, రక్కసిదొర = రావణుడు, కురుల్వీడి చెదర = జుట్టుముడి విడిపోయి చెదిరిపోగా–

**తా :** తీక్షణమైన కఠిన వాడి బాణములు అధికముగా మర్మ ప్రదేశములు నాటునట్లుగా ప్రయోగించి పూచిన మోదుగుచెట్టువలె కావించగా ఓడి రావణుడు జుట్టుముడి చెదరగా –

**కం.** **కడలేని వెఱపు మదిలోఁ**
**గడలుకొనం బ్రాఁత వేల్పుగములు గలంగన్**
**వడిఁ బాఱి లంకఁ జొచ్చెను**
**గడు రాముని రూపుఁ దలఁచి కళవళ పడుచున్** **390**

కడలేని వెఱపు = అంతులేని భయము, మదిలోన్, కడలుకొనన్ = వ్యాపింపగా, ప్రాత వేల్పుగములు = రాక్షస సమూహములు, కలంగన్ = కలతచెందగా, వడిన్ = తొందరగా, పాఱి = పరుగెత్తి, రాముని రూపు తలచి, కడు = మిక్కిలి, కళవళ పడుచున్ = బాధనందుచు, లంకన్ చొచ్చెను = లంకానగరంలో ప్రవేశించెను.

**తా :** అంతులేని భయము మదిలో వ్యాపింపగా, రాక్షసులు కలతచెందగా తొందరగా పరుగెత్తి రాముని రూపు తలచి కళవళపడుచూ పరుగెత్తి లంకానగరమును ప్రవేశించెను.

**తే.గీ.** **అంత నచ్చట రాచూలి వంత వెరయఁ**
**దోడఁబుట్టువు గాఁడిన తూపుఁ బెఱికి**
**వైచి క్రొవ్వేఁడి కన్నీరు వరదవాఱఁ**
**బలు తెఱంగుల నిట్లని పలువరించె** **391**

అంతన్, అచ్చట = ఆ యుద్ధరంగమందు, రాచూలి = రామునియొక్క, వంత వెరయన్ = చింత వ్యాపింపగా, తోడపుట్టువు = లక్ష్మణునికి, గాడిన = నాటిన, తూపున్ = బాణమును, పెఱికివైచి = పీకి, క్రొవ్వేడి కన్నీరు = బాగావేడియైన కన్నీరు, వరదపాఱన్ = వరదలా ప్రవహించగా, పలు తెఱంగుల = పలువిధములుగా, ఇట్లు అని = ఈ రీతిగా, పలువరించె = తలచుకొని పలవరించెను.

**తా :** అంతట ఆ యుద్ధరంగమందు రాముడు చింత వ్యాపింపగా లక్ష్మణునికి నాటిన బాణమును పీకి వేడి కన్నీరు వరదలై పాఱగా పలువిధముల నీ రీతి పలవరించెను.

**కం.** **అహహా! సయిదోడ! నీ విటు**
**రహి సెడి యాలంపుఁ బుడమి వ్రాలి కడున్ లోఁ**
**గి హుళుక్కి నిదురఁ బోయెదు**
**తహతహ డెందంబులోన దళమయ్యేఁగదే!** **392**

అహహా = అయ్యో!, సయిదోడ = తమ్ముడా!, నీవు ఇటు, రహి చెడి = కాంతి కోల్పడి, ఆలంపున్ పుడమి = యుద్ధభూమియందు, వ్రాలి = పడి, కడున్ = బాగా, లోగి = లోకువయయి, హుళుక్కి నిదురన్ పోయెదు = అసత్యపు నిదురపోవుచుంటివి, డెందంబులోన = మనసులో, తహతహ = ఆదుర్దా, దళమయ్యేన్ కదే = అధికమైనది కదా!

**తా :** అయ్యో! తమ్ముడా! నువ్వు ఇలా కాంతి కోల్పోయి యుద్ధభూమిలో పడి మిక్కిలి లోకువయయి అసత్యపు నిదురపోవుచుంటివి. నా మనసులో ఆదుర్దా అధికమైనదికదా!

**కం.** **అడవులఁ బదునాల్గేడులు**
**గొడివెల కొడిగట్టి సాఁకు కొంటివి మమ్మా**
**బడలిక నిపు డిజ్జగడపు**
**పుడమిం బవళించి నిదురవోయితొ తండ్రీ!** **393**

తండ్రీ = నాయనా!, పదునాల్గు ఏడులు, అడవులన్, కొడివెలకు = కష్టములకు, ఒడికట్టి = సిద్ధపడి, మమ్మ = మమ్ములను, సాకు కొంటివి = రక్షించితివి, ఆ బడలికన్ = ఆ శ్రమను, ఇపుడు = ఇప్పుడు, ఈ జగడపు పుడమిన్ = ఈ యుద్ధభూమియందు, పవళించి = పండుకొని, నిదుర పోయితొ = నిదురించావా?

**తా :** నాయనా! పదునాల్గు ఏడులు అడవులలో కష్టములకు సిద్ధపడి మమ్ములను రక్షించితివి. ఆ బడలికకు ఇపుడు ఈ యుద్ధభూమియందు పవళించి నిదురించావా!

**తే.గీ.** **అప్ప పనుపున నడవుల కరుగునప్పు**
**డప్పగించె సుమిత్ర నెయ్యమున మాకుఁ**
**జెల్లఁబో! యిందు నిను డించి యెల్లి యరిగి**
**యప్పడంతుక కిఁక నేమి చెప్పువాఁడ?** **394**

అప్ప పనుపున = తండ్రి ఆజ్ఞతో, అడవులకు, అరుగునప్పుడు, సుమిత్ర, నెయ్యమున = ప్రీతితో, మాకున్, అప్పగించె, చెల్లన్ పో = చెల్లిపోయెనా? ఇందు నిను డించి = ఇక్కడ నిన్నువదలి, ఎల్లి

= రేపు, అరిగి, ఆ పడంతుకకు = ఆ సుమిత్రకు, ఇకన్ = ఇంక, ఏమి చెప్పువాడ = ఏమి చెప్పగలను?

**తా :** తండ్రి ఆజ్ఞతో అడవులకు అరుగునప్పుడు సుమిత్ర ప్రీతితో మాకు అప్పగించెను. చెల్లిపోయెనా? ఇక్కడ నిన్ను వదలి రేపు వెళ్ళి ఆ సుమిత్రకు ఇంక ఏమి చెప్పగలను?

**కం.** **పేదటిక ముదుపు నవలా**
**గాదిలి సైదోడుతోడఁ గనుగొన నెపుడున్**
**మాదిరియగు నీ నెమ్మొగ**
**మీ దెస సొంపెడలియుంట కెటులోర్వనగున్** **395**

పేదరికము ఉడుపు = పేదరికమును పోగొట్టు, నవలా = స్త్రీ (లక్ష్మీదేవి), గాదిలి సైదోడుతోడన్ = చంద్రునితో, కనుగొనన్ = చూడగా, ఎపుడున్ = ఎప్పుడును, నీ నెమ్మొగము = నీ చక్కని ముఖము, మాదిరి అగు = సమానమగును, ఈ దెస = ఈ విధముగా, సొంపు = సొగసు, ఎడలి = పోగొట్టుకుని, ఉంటకు = ఉండుటకు, ఎటులు = ఎలా, ఓర్వనగున్ = సహింపనగును.

**తా :** లక్ష్మీదేవి సోదరుడగు చంద్రునితో సమానమగు నీ చక్కని ముఖము చూడగా ఈ విధముగా సొగసు పోగొట్టుకుని ఉండుట ఎలా సహింపనగును?

**ఆ.వె.** **అబ్బపాటుఁ గాంచి యడవుల కరుదెంచి**
**తెఱవఁ గోలుపోయి తిరుగుచున్న**
**నిట్టి కీడు సెందె కట్టడి దయ్యంబు**
**నకట! యింక నేమియనఁగఁ బోలు?** **396**

అబ్బ పాటున్ కాంచి = తండ్రి పరిస్థితిని చూచి, అడవులకు అరుదెంచి = అడవులకు వచ్చి, తెఱవన్ కోలుపోయి = భార్యను పోగొట్టుకుని, తిరుగుచున్న (నాకు), ఇట్టి కీడు చెందె = ఇట్టి ఆపద కలిగినది, అకట = అయ్యో!, కట్టడి దయ్యంబున్ = కఠినాత్ముడైన దైవమును, ఇంక ఏమి అనగ పోలు = ఇంక ఏమనడానికి తగును?

**తా :** తండ్రి పరిస్థితిని చూచి అడవులకు వచ్చి భార్యను పోగొట్టుకుని తిరుగుచున్న నాకు ఇట్టి ఆపద కలిగినది. అయ్యో! కఠినాత్ముడైన దైవమును ఇంక ఏమనతగును?

**ఆ.వె.** **నేల యేలుకొనెడు జోలి యదేటికి?**
**నేలచూలిమీఁద నేల యాస?**
**మేల్గొనంబు లూని మెలఁగు ముద్దుల రాచ**
**కూన! యింక నీవు లేని యెడల?** **397**

ముద్దుల రాచకూన = ప్రియమైన రాచబిడ్డా!, మేలు గొనంబులు = ఉత్తమ గుణములు, ఊని = కలిగి, మెలగు = సంచరించు, నీవు లేనియెడలన్ = నీవు లేకపోయినచో, ఇంక = ఇకమీద, నేల ఏలుకొనెడు = రాజ్యమును పాలించు, జోలి = సంబంధము, అది ఏటికి = అది ఎందులకు? నేలచూలి మీదన్ = సీతాదేవిమీద, ఆస ఏల = ఆశ ఎందులకు?

**తా :** ప్రియమైన రాచబిడ్డా! ఉత్తమ గుణములు కలిగి సంచరించు నీవు లేకపోయినచో ఇంక రాజ్యమును పాలించు సంబంధము ఎందులకు? సీతపై ఆశ ఎందులకు?

**కం. అని పలికి యంతకంతకుఁ**
**బెనఁగొను నుమ్మలికతోడ బిట్టడలుచు న**
**వ్విను రతనపు వంగడపుం**
**బెనురాయఁడు నేల వ్రాలి పెంపడగంగన్ 398**

అని పలికి, అంతకంతకు, పెనగొను = పెనవేసుకొనుచున్న, ఉమ్మలికతోడ = బాధతో, బిట్టు అడలుచు = మిక్కిలి దుఃఖించుచు, ఆ విను రతనపు వంగడపుం పెనురాయడు = సూర్యవంశపు పెద్ద ప్రభువు రాముడు, నేల వ్రాలి = భూమిమీదపడి, పెంపు అడగంగన్ = అతిశయము కోల్పోగా,–

**తా :** అని పలికి అంతకంతకు పెనవేసుకొనుచున్న బాధతో మిక్కిలి దుఃఖించుచు ఆ రాముడు భూమిమీద పడి అతిశయము కోల్పోయి –

**ఉ. దాయను గెల్చుటింకఁ గలదా?యను రాచకొలంపు కల్వవిం**
**దా! యను నాడెమైన బిరుదా! యను రక్కసి కార్మొగుళ్ళ యీఁ**
**దా! యను బీరమూన వలదా! యను బిల్చిన నాలకింపరా**
**దా! యను బన్నమొందితిగదా! యను నీకును నంగదా యనున్ 399**

దాయను = శత్రువును, గెల్చుట ఇంక కలదా? అను, రాచకొలంపు = రాచకులానికి, కల్వవిందా అను = చంద్రుడా అనును, నాడెమైన = శ్రేష్ఠమైన, బిరుదా అను = వీరుడా అనును, రక్కసి = రాక్షసులను, కార్మొగుళ్ళ = కారు మేఘములకు, ఈదా అను = ప్రభంజనమా అనును, బీరము ఊన వలదా అను = పరాక్రమము వహించవద్దా అనును, పిల్చినన్, ఆలకింపరాదా అను = వినరాదా అనును, బన్నము ఒందితిగదా అను = కష్టము కలిగెనుకదా అనును, నీకును = నీకు, అంగదా = కోపమా, అనున్ = అనును.

**తా :** ఇంక శత్రువును జయించుట కలదా? రాజవంశ చంద్రుడా! నాడెమైన వీరుడా! రాక్షసులను కారుమేఘములకు ప్రభంజనమా! పరాక్రమము వహించవద్దా! పిలిచిన ఆలకింపరాదా! కష్టము కలిగెనుకదా! నీకు కోపమా! అని పలువిధములుగా పలుకును.

**ఉ. డాయ నదేల రావు బెగడా? యను నెక్కటి చివ్వ గెల్చు కాఁ**
**డా! యను ముద్దు రాకొమరుఁడా! యను మేలి గొనంబు లూను ప్రో**
**డా! యను సోయగంపు మరుఁడా! యను నెన్నికఁ గన్న నేల తేఁ**
**డా! యను మేటి జెట్టి మగఁడా! యను బల్కుర తమ్ముఁడా! యనున్ 400**

డాయన్ = చేరువకు, అదేల రావు = ఎందుకు రాకున్నావు?, బెగడా = భయమా?, ఎక్కటి = ఒంటరిగా, చివ్వ = యుద్ధము, గెల్చుకాడా = గెలువ కలిగినవాడా!, మేలి గొనంబులు ఊను = మంచి గుణములుకల, ప్రోడా = సమర్థుడా! సోయగంపు = అందమైన, మరుడా = మన్మధుడా! ఎన్నిక కన్న = ప్రసిద్ధమైన, నేల తేడా = రాజా!, మేటి జెట్టి మగడా = గొప్ప వీరశ్రేష్ఠుడా!,

**తా :** చేర ఏల రావు? భయమా? ఒంటరిగా యుద్ధము గెల్వగలిగినవాడా! మంచి గుణములుకల సమర్థుడా! అందమైన మన్మథుడా! ప్రసిద్ధ రాజా! గొప్ప వీరుడా! అనును. పలుకరా తమ్ముడా అనును.

**తే.గీ.** **అనుచు నొఱలెడు దొరఁ గన్గొని సుషేణుఁ**
**డిట్టులని పల్కె నక్కటా! యెపుడు నిబ్బ**
**రంపు గుబ్బలి వనఁదగి పెంపుఁ గన్న**
**నీకు నడలంగఁ బాడియే? నేలతేఁడ!** **401**

అనుచున్, ఒఱలెడు = దొరలుచున్న, దొరన్ = ప్రభువును, కన్గొని = చూచి, సుషేణుడు(తార తండ్రి), ఇట్టులు అని పల్కెను, అక్కటా = అయ్యో!, ఎపుడు, నిబ్బరంపు = స్థైర్యముకల, గుబ్బలివి = కొండలాంటివాడివి, అనదగి = అనుటకు తగినవాడవై, పెంపు కన్న = ఆధిక్యమును పొందిన, నీకున్, అడలంగన్ = దుఃఖించుట, పాడియే = న్యాయమా?

**తా :** అనుచు దొరలుచున్న రాముని చూచి సుషేణుడు ఇట్లు పలికెను 'అయ్యో! ఎప్పుడూ స్థైర్యముకల కొండలాంటివాడివి అనుటకు తగిన ఆధిక్యమును పొందిన నీకు దుఃఖించుట న్యాయమా?

**ఆ.వె.** **ఇంత వ్రంతఁ గుందనేల? నీ తమ్ముని**
**యొడల నిప్పు డుసురు లున్న వెన్న**
**గాడ్పుచూలిఁ బనిచి క్రన్ననఁ దెప్పింపు**
**మద నెఱింగి మందు లెదఁ జెలంగి** **402**

ఇంత = ఇంత , వ్రంతన్ = మనోవ్యధచే, కుందనేల = బాధపడనేల?, నీ తమ్ముని ఒడలన్ = నీ తమ్ముని దేహమున, ఎన్నన్ = ఆలోచింపగా, ఇప్పుడు, ఉసురులు = ప్రాణములు, ఉన్నవి, గాడ్పుచూలిన్ = హనుమంతుని, అనిచి = పంపి, క్రన్ననన్ = శ్రీఘ్రముగా, అదను ఎఱింగి = సమయము విలువ తెలిసి, మందులు, ఎదన్ చెలంగి = మనసున విశ్వసించి, తెప్పింపుము,

**తా :** ఇంత మనోవ్యధచే కుందనేల? నీ తమ్ముని దేహమున ప్రాణములు ఉన్నవి. హనుమంతుని పంపి వెంటనే అదనెఱింగి మనసున విశ్వసించి మందులు తెప్పింపుము.'

**సీ.** **అని హనుమంతుఁ గన్గొని మేల్బిరుద! నీవు**
**గ్రన్నన నీయుప్పుకడలి దాఁటి**
**చేసిన కడఁకతో జెల్లు దీవియు జిడ్డు**
**కడలియుఁ గడచి రొక్కపు టొడయని**
**కడఁ జని ద్రోణమన్ గట్టును జాబిలి**
**గుబ్బలియును హత్తి కోర్కినందు**
**సావర్ణ్యకరణియు సంధానకరణియు**
**సంజీవకరణి విశల్యకరణి**

**తే.గీ.** **యనఁగఁ బరగి నల్దెఱఁగుల నలరు మందు**
**లరసి దొరకించుకొని తమ్మియనుఁగు తూర్పు**
**మలను బొడమక తొల్తనె మరలి వచ్చి**
**లక్ష్మణుని మన్చి యసముఁ దెల్లముగఁ గనుము** **403**

అని, హనుమంతున్, కన్గొని = చూచి, మేల్బిరుద = గొప్ప వీరుడా!, క్రన్ననన్ = వేగముగా, ఈ ఉప్పు కడలి దాటి = ఈ సముద్రాన్ని దాటి, ఊసిన కడకతో = పెరిగిన పట్టుదలతో, తెల్లు దీవియు = శరద్వీపమును, జిడ్డు కడలియు = పాలసముద్రమును, కడచి = దాటి, తొక్కపు ఒడయని కడన్ చని = కుబేరుని ఉత్తర దిక్కునకు వెళ్ళి, ద్రోణము అను గట్టును, జాబిలి గుబ్బలియును, హత్తి = ఎక్కి, కోర్కిన్ = కావాలని, అందు = ఆ పర్వతములందు, నలు తెఱంగులన్ = నాలుగు వైపులా, అలరు = ఉండునట్టి, మందులు, అరసి = పరిశీలించి, దొరకించుకొని, తమ్మి అనుగు = సూర్యుడు, తూర్పుమలను = ఉదయపర్వతమున, పొడమక తొల్తనె = ఉదయించక ముందే, మరలి వచ్చి = తిరిగి వచ్చి, లక్ష్మణుని మన్చి = లక్ష్మణుని బ్రతికించి, తెల్లముగ = స్పష్టమైన, యసమున్ = కీర్తిని, కనుము = పొందుము.

**తా :** అని హనుమను చూచి 'గొప్ప వీరుడా! వేగముగా ఈ సముద్రమును దాటి పట్టుదలతో శరద్వీపమును, పాలసముద్రమును దాటి ఉత్తర దిక్కునకు వెళ్ళి ద్రోణము అను కొండను, జాబిలి గుబ్బలియును ఎక్కి కావాలని ఆ పర్వతములందు నాలుగువైపులా ఉండునట్టి మందులు పరిశీలించి దొరకించుకొని సూర్యుడు ఉదయించకముందే తిరిగి వచ్చి లక్ష్మణుని బ్రతికించి కీర్తిని పొందుము'.

**తే.గీ.** **అని సుషేణుఁడు తెల్పిన నలరి గాడ్పు**
**కొమరుఁ దక్కర్జమున కియ్యకొనెడు నెడల**
**నేలతేఁడును నతని నెన్నెనరు మీఱ**
**బుజ్జగించుచుఁ బయనంబుఁ బూన్చి పలికె** **404**

అని, తెల్పిన = తెలుపగా, గాడ్పు కొమరుడు = హనుమ, అలరి = సంతోషించి, ఆ కర్జమునకు = ఆ పనికి, ఇయ్యకొనెడున్ ఎడలన్ = అంగీకరించు సమయమున, నేలతేడును = రాముడును, నెనరు నెనరు మీఱ = మిక్కిలి ప్రేమతో, బుజ్జగించుచున్ = బ్రతిమాలుచు, పయనంబున్ పూన్చి = ప్రయాణమునకు సిద్ధపరచి, పలికె = పలికెను.

**తా :** అని తెలుపగా హనుమ సంతోషించి ఆ పనికి అంగీకరించు సమయమున రాముడును మిక్కిలి ప్రేమతో బ్రతిమాలుచు ప్రయాణమునకు సిద్ధపరచి పలికెను.

**కం.** **రమ్మా! పయ్యరకుఱ్ఱడ!**
**పొమ్మా! వెసఁ దూముపేరఁ బొలుపగు మలకున్**
**దెమ్మా! మందుల లక్ష్మణు**
**నిమ్మా! క్రమ్మఱ జగంబు లెన్నఁగ మాకున్** **405**

పయ్యెర కుఱ్ఱడ = వాయుపుత్రా!, రమ్మా = బయలుదేరుటకు రమ్ము, వెసన్ = శీఘ్రముగా, తూము పేరన్ = ద్రోణమను పేరుతో, పొలుపగు = ఒప్పునట్టి, మలకున్ = పర్వతమునకు, పొమ్మా = పొమ్ము, మందుల, తెమ్మా!, జగంబులు ఎన్నగ = లోకములు స్తుతింపగా, మాకున్ = మాకు, క్రమ్మఱ = తిరిగి, లక్ష్మణున్ = లక్ష్మణుని, ఇమ్మా = ఇమ్ము.

**తా :** వాయుపుత్రా! బయలుదేరుటకు రమ్ము. వెంటనే ద్రోణ పర్వతమునకు పొమ్ము. మందులు తెమ్ము. లోకములు స్తుతింపగా మాకు తిరిగి లక్ష్మణుని ఇమ్ము.

**కం.** **విను మనుమఁడ వినుమనుమఁడ**
**వనఁదనరిన నీకు నెందు నడ్డము కలదే?**
**యని కౌఁగిట నిడుకొని దీ**
**వెన లెన్నేనియు నొసంగి వీడ్కొలుపుటయున్** **406**

అనుమడ = హనుమ, వినుము, విను మనుమడవు = ఆకాశమునకు మనుమడివి, అనన్ దనరిన = అనుటకు ఒప్పిన, నీకు, ఎందున్ = ఎచ్చటను, అడ్డము కలదే?, అని, కౌగిటన్ ఇడుకొని, దీవెనలు ఎన్నేనియున్, ఒసంగి = ఇచ్చి, వీడ్కొలుపుటయున్ = పంపుటయును.

**తా :** హనుమా! వినుము. నింగి మనుమడవు అనుటకు ఒప్పిన నీకు ఎచ్చటను అడ్డము కలదే?' అని కౌగిట ఇడుకొని దీవెనలు ఎన్నేని ఒసంగి పంపుటయును

**తే.గీ.** **ఏలికకు మ్రొక్కి గాడుపు నెదఁ దలంచి**
**కడిమి నాతండు వడి నుప్పుకడలి దాఁటి**
**కోన లేఱులు దీవులు గుబ్బలులును**
**వరుసఁ గడచును వ్రేల్మిడి నరుగు నెడల** **407**

అతడు, ఏలికకు మ్రొక్కి, గాడుపున్ = వాయుదేవుని, ఎద తలంచి = మనసులో తలచుకొని, కడిమిన్ = సాహసముతో, వడిన్ = శీఘ్రముగా, ఉప్పుకడలి దాటి, కోనలు = అడవులు, ఏఱులు = నదులు, దీవులు = ద్వీపములు, గుబ్బలులును = కొండలను, వరుసన్ = క్రమముగా, గడచుచు = దాటుచు, వ్రేల్మిడిన్ = చిటికలో, అరుగునెడల = వెళ్ళుచున్న సమయమున –

**తా :** హనుమ రామునకు మ్రొక్కి, వాయుదేవుని మనసులో తలచుకొని సాహసముతో వెంటనే సముద్రము దాటి అడవులు, నదులు, ద్వీపములు, కొండలు క్రమముగా దాటుచు చిటికలో వెళ్ళుచున్న సమయమున –

**ఆ.వె.** **త్రోవ నొండుచోట రావణు పంపునఁ**
**గాలనేమి యనెడు కడిఁది రక్క**
**సుండు నుక్కుమీఁఱ జోగిరూపుని పె**
**న్విసపుఁదోఁట యొకటి నిలిపియందు** **408**

త్రోవన్ = మార్గమునందు, ఒండుచోటన్ = ఒకచోట, రావణు పంపున = రావణుడు పంపగా, కాలనేమి అనెడు, కడిది రక్కసుండు = క్రూర రాక్షసుడు, ఉక్కు మీఱ = బలగర్వంతో, జోగిరూపు

ఊని = సాధు రూపమున, పెన్ = గొప్పదియగు, విసపు తోట = విషభరితమగు తోటను, ఒకటి, నిలిపి = కల్పించి, అందు = ఆ తోటలో –

**తా :** మార్గమందు ఒకచోట రావణుడు పంపగా కాలనేమి అనెడు క్రూర రాక్షసుడు బలగర్వంతో సాధురూపమున గొప్ప విషభరితమగు తోటను ఒకటి కల్పించి ఆ తోటలో –

**తే.గీ.** **జడలు రుదురుక్కపేరులుఁ జాఁల బూని**
**బూది మెయిఁ బూసి పులితోలు మీఁదఁ గూరు**
**చుండి ముక్కును గన్నులు నొనర మూసి**
**కొని యుళక్కిగ నేమేమొ గొడగుచుండె** **409**

జడలు, రుదురుక్క పేరులు = రుద్రాక్షమాలలు, చాల పూని = ఎక్కువగా ధరించి, బూది = విభూతి, మెయిన్ పూసి = ఒంటికి పూనుకొని, పులితోలు మీద కూరుచుండి, ముక్కును, కన్నులున్, ఒనర = బాగుగా, మూసికొని, ఉళక్కిగ = ఉత్తినే, ఏమేమొ = ఏదేదియో, గొడగుచుండె = గొణుగుచుండెను.

తా : జడలు, రుద్రాక్షమాలలు విరివిగా ధరించి బూది ఒంటికి పూసుకొని పులితోలుమీద కూర్చుండి ముక్కు, కన్నులు బాగుగా మూసికొని ఉత్తినే ఏదేదియో గొణుగుకొనుచుండెను.

**కం.** **అటులున్న రవలికానిన్**
**దటుకునఁ బొడఁగాంచి సోఁకు దయ్యము కంది**
**చ్చట దోఁటయుఁ దపసియు నుం**
**డుటమును గన్గొనము నేఁ డెటు ల్పొదవెనొకో?** **410**

అటులు = ఆ విధముగా, ఉన్న = ఉన్నటువంటి, రవళి కానిన్ = మోసగానిని, తటుకున = ఒక్కసారిగా, పొడగాంచి = చూచి, సోకు దయ్యము = దేహము తాకు దైవము (వాయువు), కందు = కుమారుడు (హనుమ), ఇచ్చట = ఇక్కడ, తోటయున్, తపసియున్, ఉండుటమును = ఉండటాన్ని, కన్గొనము = కాంచము, నేడు = ఇప్పుడు, ఎటులు పొదవెనొకో = ఎలా వచ్చిందోకదా!

తా : ఆ విధముగా ఉన్నటువంటి మోసగానిని ఒక్కసారిగా చూచి హనుమ ఇక్కడ తోట, తపసి ఉండటము చూచినది లేదు. ఇపుడు ఎలా వచ్చిందోకదా!

**ఆ.వె.** **తెరువు దప్పెనేమొ? వెరవున నిజ్జడ**
**దారి ఱేని వలన దారిఁ దెలిసి**
**నరుగవలయు నంచు నతని పజ్జకుఁ జని**
**యెలమిఁ గేలుఁ దామరలు మొగిడ్చి** **411**

తెరువు = మార్గము, తప్పెనేమొ = తప్పిందేమో?, వెరవునన్ = ఉపాయముతో, ఈ జడదారి ఱేనివలన = ఈ సాధువు వలన, దారిన్ తెలిసి = దారి తెలుసుకొని, అరుగవలయును, అంచు, అతని పజ్జకు = కాలనేమి దగ్గరకు, చని = వెళ్ళి, ఎలమిన్ = వినయముతో, కేలు తామరలు = పద్మముల వంటి చేతులను, మొగిడ్చి = జోడించి.

**తా :** మార్గము తప్పిందేమో? ఉపాయముతో ఈ జడదారి వలన దారి తెలుసుకొని వెళ్ళాలి అంటూ కాలనేమి దగ్గరకు చని వినయముతో చేతులు జోడించి.

**కం.** **తన యిరవుఁ బేరు నరిగెడు**
**పనియును నెఱిఁగించి దప్పి వాయఁగ నీర్వేఁ**
**డిన నా టక్కరి జోగియుఁ**
**దన జారీలోని నీళ్ళు ద్రావుమటన్నన్** **412**

తన = తనయొక్క, ఇరవున్ = నివాసమును, పేరున్, అరిగెడు పనియును, ఎఱిగించి = చెప్పి, డప్పి వాయంగ = దాహము పోవునట్లుగ, నీరు, వేడినన్ = అడుగగా, ఆ టక్కరి జోగియు = ఆ మాయ యోగియును, తన జారీలోని నీళ్ళు, త్రావుము, అటన్నన్ = అనగా –

**తా :** తన నివాసమును, పేరును, వెళ్ళే పనిని తెలిపి దాహము పోవునట్లుగ నీరు వేడగా ఆ టక్కరి జోగి తన జారీలోని నీళ్ళు త్రావుమనగా –

**తే.గీ.** **అలఁతి నీళ్ళివి సాల వియ్యండ నిపుడు**
**గొలను నిలనుండెనేనిఁ గన్గొనఁగఁ జేసి**
**సేద దీఱిన తఱిఁ ద్రోవ సెప్పుమయ్య!**
**పుడమివేలుప! నెయ్యంబు వొదల ననుడు** **413**

పుడమి వేలుప = బ్రాహ్మణుడా! అలతి నీళ్ళు ఇవి = ఇవి కొద్ది నీళ్ళు, చాలవు, ఈ యండన్ = ఈ సమీపమున, ఇపుడు, కొలను, ఇలన్ ఉండెనేనిన్ = ఈ ప్రదేశమున ఉన్నచో, కన్గొనగ చేసి = చూపెట్టి, సేద తీఱిన = బడలిక తీరగా,తఱిన్ త్రోవ = సమీప మార్గమును, నెయ్యంబు పొదల = స్నేహభావముతో, చెప్పుమయ్య = చెప్పవయ్యా, అనుడు.

**తా :** 'బ్రాహ్మణుడా! ఇవి కొద్ది నీళ్ళు. చాలవు. ఈ చేరువన కొలను ఉన్నచో చూపెట్టి బడలిక తీరగా సమీప మార్గమును స్నేహభావముతో చెప్పవయ్య' అనగా –

**ఉ.** **దబ్బఱ జోగి డెందమునఁ దద్దయు నుబ్బుచుఁ బల్కెఁ గోఁతి రా**
**బొబ్బ మెకంబ! రాగవుఁడు పూనిన కర్జము మాకు వాలెము**
**న్నిబ్బర మొప్పఁ జేయనగు నీ కిపు డిచ్చెద నెల్ల మందులుం**
**గొబ్బునఁ గొమ్ము వేసరుచుఁ గొండల వెంబడి నేఁగ నేటికిన్** **414**

దబ్బఱ జోగి = మాయ సాధువు, డెందమున = మనసులో, తద్దయు = మిక్కిలి, ఉబ్బుచున్ = పొంగిపోతూ, పల్కెన్ = పలికెను, కోతి రా బొబ్బ మెకంబ = వానరరాజసింహమా!, రాగవుడు పూనిన కర్జము = రాముడు తలచిన కార్యము, మాకు, వాలెమున్ = తప్పక, నిబ్బరమొప్పన్ = వెనుకంజవేయక, చేయనగు = చేయతగినది, ఇపుడు = ఇప్పుడు, నీకు, ఎల్ల మందులున్ ఇచ్చెద, గొబ్బునన్ = శీఘ్రముగా, కొమ్ము = తీసుకొనుము, వేసరుచు = కష్టపడుచు, కొండలవెంబడిన్ = కొండల వెంట, ఏగన్ ఏటికిన్ = వెళ్ళుట ఎందులకు?

**తా :** మాయ సాధువు మనసులో పొంగిపోతూ 'వానర రాజ సింహమా! రాముడు తలచిన కార్యము మాకు తప్పక చేయదగినది. ఇప్పుడు నీకు అన్ని మందులు ఇచ్చెదను. తీసుకో. కష్టపడి కొండలవెంట వెళ్ళడం ఎందుకు?

**కం.** **అదె కొలను తూర్పు దెసఁ జె**
**న్నొదవెడు నట కేఁగి దూప యుడుగఁగఁ దెలి నీ**
**రు దగం గ్రోలిటు రమ్మా!**
**పదపడి కర్జంబు లెల్ల బాగగు ననుడున్** **415**

అదె = అదిగో, తూర్పు దెసన్ = తూర్పు దిక్కున, కొలను, చెన్నొదవెడున్ = చక్కగా నున్నది, అటకు ఏగి = అక్కడకు వెళ్ళి, దూప ఉడుగగన్ = దాహము తీరునట్లుగ, తెలి నీరు = స్వచ్ఛమయిన నీరు, క్రోలి = త్రాగి, ఇటు రమ్మా = ఇక్కడకు రమ్ము, పదపడి = తరువాతి, కర్జంబులు ఎల్ల = పనులన్నియును, బాగు అగున్, అనుడున్ = అనగా –

**తా :** అదిగో తూర్పుదిక్కున చక్కగా కొలను ఉన్నది. అక్కడకు వెళ్ళి దాహము తీరగా నీరు త్రాగి ఇక్కడికి రమ్ము. తరువాతి పనులన్నియును చక్కబడును అనగా –

**తే.గీ.** **సంతసంబంది యక్కోఁతి చందమామ**
**వైళ మేతెంచి యా చెలువంపుఁ గొలను**
**సొచ్చి నీరానుచోఁ దమి హెచ్చ నొక్క**
**మొసలి పఱతెంచి యతనిఁ బొంపెసఁగఁ బట్టె** **416**

సంతసంబంది, ఆ కోతి చందమామ = ఆ వానర చంద్రుడు, వైళమ = వేగముగా, ఏతెంచి = వచ్చి, ఆ చెలువంపున్ గొలను = ఆ చక్కని కొలనులో, చొచ్చి = ప్రవేశించి, నీరానుచోన్ = నీరు త్రాగుచుండగా, తమి హెచ్చన్ = మిక్కిలి ఆసక్తితో, ఒక్క మొసలి పఱతెంచి, అతనిన్ = ఆ హనుమను, పొంపు ఎసగన్ = చక్కగా కుదురునట్లుగా, పట్టె = పట్టుకొనెను.

**తా :** సంతోషించి ఆ హనుమ వేగముగా వచ్చి ఆ కొలనులో ప్రవేశించి నీరు త్రాగుచుండగా ఒక మొసలి వచ్చి అతనిని కుదురునట్లుగా పట్టుకొనెను.

**తే.గీ.** **పట్టుటయు జంకు లేక యా జెట్టిమగఁడు**
**నఱుజు రూపూని కుత్తుక బొటియఁ జొచ్చి**
**లోనఁ దద్దయు మెయి వెంచి దాని పొట్ట**
**పఱియ లొనరించి దిగ్గన బయలు వెడలె** **417**

పట్టుటయు = పట్టుకొనగా, జంకు లేక = భయపడక, ఆ జెట్టి మగడు = ఆ వీరుడు, అఱుజు రూపు ఊని = సూక్ష్మాకారమును పొంది, కుత్తుక బొటియన్ చొచ్చి = దాని కంఠనాళమున ప్రవేశించి, లోనన్ = పొట్టలో, తద్దయు = పెద్దదిగా, మెయి పెంచి = దేహమును పెంచి, దాని పొట్ట, పఱియలు ఒనరించి = చీలికలు చేసి, దిగ్గన = ఒక్కసారిగా, బయలు వెడలె.

**తా :** పట్టుకొనగా భయపడక ఆ వీరుడు సూక్ష్మరూపమును పొంది దాని కంఠనాళమున ప్రవేశించి పొట్టలో పెద్దదిగా దేహమును పెంచి దాని పొట్ట చీలికలు చేసి ఒక్కసారిగా బయటకు వచ్చెను.

**ఆ.వె.** **అపుడు మొసలి వేల్పుటతివయై తన తొంటి**
**కతయు నచటనున్న కల్ల తపసి**
**తెఱఁగు నతనితోడ నెఱిఁగించి పసిఁడి తే**
**రెక్కి వేల్పుప్రోలి కేఁగెనంత** **418**

అపుడు, మొసలి, వేల్పు అతివయై = దేవకాంతయై, తన తొంటి కతయున్ = తన పూర్వజన్మ కథను, అచటన్ ఉన్న = అక్కడవున్న, కల్ల తపసి = దొంగ సాధువు, తెఱగు = విషయమును, అతనితోడ = ఆ హనుమకు, ఎఱిగించి = తెలిపి, పసిడి తేరు = బంగారు రథమును, ఎక్కి, వేల్పు ప్రోలికి = స్వర్గమునకు, ఏగెను = వెళ్ళెను, అంత = ఆ తరువాత –

**తా :** అపుడు మొసలి దేవకాంతయై తన పూర్వజన్మ కథను, అక్కడవున్న దొంగసాధువు విషయమును ఆ హనుమకు ఎఱిగించి బంగారు రథముపై స్వర్గమునకు వెళ్ళెను. తరువాత –

**కం.** **కరువలి కొమరుఁడు మది న**
**బ్బరమందుచుఁ గల్ల దపసి పజ్జకు జనినన్**
**గరమరుదంచు వాఁడున్**
**వెరవొప్పఁగఁ గొమ్మమెకపు నెఱ కిట్లనియెన్** **419**

కరువలి కొమరుడు = హనుమ, మదిన్ అబ్బరమందుచున్ = మనసులో ఆశ్చర్యపడుచు, కల్లతపసి పజ్జకు = మాయయోగి దగ్గరకు, చనినన్ = వెళ్లగా, కరము = మిక్కిలి, అరుదంచుచు = ఆశ్చర్యపడుచు, వాడున్ = ఆ కాలనేమియు, వెరవు ఒప్పగాన్ = ఉపాయము భాసింపగా, కొమ్మ మెకపు నెఱకు = వానర బుద్ధిశాలికి, ఇట్లు అనియెన్ = ఇట్లు పలికెను.

**తా :** వాయుపుత్రుడు హనుమ మనసులో ఆశ్చర్యపడుచు కల్ల తపసి చెంతకు వెళ్ళగా వాడును ఆశ్చర్యపడుచు ఉపాయము భాసింపగా బుద్ధిశాలియైన హనుమకు ఇట్లు పలికెను.

**ఆ.వె.** **బ్రదుకు మందు లెల్లఁ గొదుకక యొసఁగెద**
**నిప్పు డొజ్జ పూజనిమ్ము మాకుఁ**
**గోఁతి ఱేఁడ! యనినఁ గొఱకొఱ నతఁడిదె**
**కొమ్ము పూజ యనుచు ఱొమ్ము గ్రుద్దె** **420**

కోతి ఱేడ, బ్రదుకు మందులు, ఎల్లన్, కొదుకక ఒసగెదన్ = లోపము లేకుండగ ఇచ్చెదను, ఇప్పుడు, ఒజ్జ పూజన్ = గురుదక్షిణ, మాకున్ = మాకు, ఇమ్ము, అనినన్, కొఱకొఱ = కోపముతో, అతడు = ఆ హనుమ, ఇదె = ఇదిగో, కొమ్ము పూజ అనుచు = తీసుకో దక్షిణ అంటూ, ఱొమ్ము గ్రుద్దె = కాలనేమి ఱొమ్ముపై గ్రుద్దెను.

**తా :** 'వానర శ్రేష్ఠా! బ్రతకడానికి మందులు అన్నీ లోపము లేకుండగా ఇచ్చెదను. ఇప్పుడు గురుదక్షిణ మాకు ఇమ్ము' అనిన కోపముతో ఆ హనుమ 'ఇదిగో తీసుకో దక్షిణ' అంటూ కాలనేమి ఱొమ్ముపై గ్రుద్దెను.

**తే.గీ.** **గ్రుద్దుటయు వాఁడు వాల్గొని తద్దఁ గినుకఁ**
**దన్ను వ్రేసిన యక్కోఁతి మిన్న సోఁకు**
**బిరుదుఁ బడఁ దన్ని యఱచేత బిట్టు సఱచి**
**స్రుక్కఁ జేసిన వాఁడొక పక్కి యగుచు** **421**

గ్రుద్దుటయు, వాడు = ఆ కాలనేమి, వాలు గొని = కత్తి తీసుకొని, తద్దన్ కినుకన్ = మిక్కిలి కోపముతో, తన్ను = తనను, వ్రేసిన = కొట్టగా, ఆ కోతి మిన్న = ఆ వానర శ్రేష్ఠుడు, సోకు బిరుదున్ = రాక్షస వీరుని, పడన్ = నేల పడునట్లుగా, తన్ని, అఱచేత = అరచేతితో, బిట్టు = గట్టిగా, చఱచి = కొట్టి, స్రుక్కన్ చేసిన = బాధింపగా, వాడు = ఆ కాలనేమి, ఒక పక్కి అగుచు = ఒక పక్షి రూపుడై –

**తా :** గ్రుద్దుటయు వాడు కత్తి తీసుకొని కోపముతో తనను కొట్టగా ఆ హనుమ రాక్షసుని నేలపడునట్లుగా తన్ని అరచేతితో గట్టిగా కొట్టి బాధింపగా ఆ కాలనేమి పక్షి రూపుడై –

**కం.** **ముక్కునఁ జీరియు గోళ్ళన్**
**రక్కియు నొప్పింప నడవి నట్టు వజీరుం**
**డక్కూళ గ్రద్ద గ్రుద్దియు**
**ఱెక్కలు దునుమాడియు న్నెఱినిఁ గుందించెన్** **422**

ముక్కునన్ = ముక్కుతో, చీరియు, గోళ్ళన్ = గోళ్ళతో, రక్కియున్ = గీరియును, నొప్పింపన్ = బాధింపగా, అడవి నట్టు వజీరుండు = అరణ్య వాసుడగు హనుమంతుడు, ఆ కూళ గ్రద్దన్ = ఆ నీచమైన గ్రద్దను, గ్రుద్దియు, ఱెక్కలు తునుమాడియున్ = రెక్కలు విరిచివైచియు, నెఱినిన్ = పూర్తిగా, కుందించెన్ = క్రుంగదీసెను.

**తా :** ముక్కుతో చీరియు, గోళ్ళతో రక్కియు నొప్పింపగా హనుమ ఆ నీచమైన గ్రద్దను గ్రుద్ది రెక్కలు విరిచి పూర్తిగా క్రుంగదీసెను.

**ఆ.వె.** **అంత వాఁడు సింగమై యార్చి కోఱల**
**గ్రుచ్చి గోళ్ల వ్రచ్చి కోఁతి ఱేని**
**బిట్టు నొంప నతఁడు పిడికిట వొడిచి పె**
**ల్లుడుప నచ్చెనంటి యుక్కు దక్కి** **423**

అంత = అంతట, ఆర్చి = అరిచి, కోఱల = దంష్ట్రలతో, కోతి ఱేని = హనుమను, బిట్టు నొంపన్ = మిక్కిలి బాధింపగా, పెల్లు ఉడుప = ఆధిక్యమును పోగొట్టగా, ఆ చెనంటి = ఆ మూర్ఖుడగు కాలనేమి, ఉక్కు తక్కి = బలము తగ్గి –

**తా :** అంతట వాడు సింహరూపమును ధరించి అరిచి దంష్ట్రలతో హనుమను మిక్కిలి బాధింపగా అతడు పిడికిలితో పొడిచి ఆధిక్యమును నశింపచేయగా బలహీనుడై –

**తే.గీ.** **వేఁడి వేలుపు కుఱ్ఱఁడై వేగవచ్చి**
**గాడ్పు కొమరుఁడ! యిపుడు లక్ష్మణుఁడు బ్రదికె**

**మందులకుఁ బోవ వలవదు మరలి రమ్ము**
**తేని యానతి యిదియని పూని పలికె** **424**

వేడి వేలుపు కుఱ్ఱడై = సుగ్రీవుడై, వేగ వచ్చి = శీఘ్రముగా వచ్చి, గాడ్పు కొమరుడ = ఓ ఆంజనేయుడా!, తేని యానతి = ప్రభవగు రాముని ఆజ్ఞ.

**తా :** సుగ్రీవుని రూపమున వేగముగా వచ్చి 'హనుమా! ఇపుడు లక్ష్మణుడు బ్రతికెను. మందులకు వెళ్ళవద్దు. తిరిగి రమ్ము. రాముని ఆజ్ఞ ఇది' అని పలికెను.

**సీ.** **పలికిన విని జడల్గల కోఁతి మిన్న మే**
**పుట్టు విచ్చుటి కిప్డు ప్రొద్దు కొమరుఁ**
**డేటికి వచ్చు? నం చెదనెంచి కాకుంటఁ**
**దెలిసి యుక్కదర నప్పొలసుదిండి**
**బోర బల్పిడికిటఁ బొడిచిన నెత్తురుల్**
**గ్రక్కుచుఁ గూలి వాఁ డక్కజంబు**
**గా శతశృంగుఁడై కఱకుటమ్ములు పెక్కు**
**నిగుడింపఁ దోఁక నన్నియు నడంచి**
**తే.గీ.** **కోఁతిరాయఁడు సఱచియు గ్రుద్ది కఱచి**
**తాఁచి చీఱియుఁ బుడమిపై వైచి త్రొక్కి**
**పొగరుటేనుఁగు నెత్తమ్మి పువ్వుఁ ద్రెంచు**
**చందమున వాని తల ద్రుంచి సరగఁ జనియె** **425**

జడల్గల కోతి మిన్న = కేసరి అనే వానర శ్రేష్ఠుని, మే పుట్టువు = కొడుకగు హనుమ, ప్రొద్దు కొమరుడు = సుగ్రీవుడు, ఏటికి వచ్చు =ఎందుకు వచ్చును, కాకుంటన్ తెలిసి = కాకపోవుట తెలుసుకొని, ఉక్కు అదర = మిక్కిలి బలముగా, బోర = పొట్టను, బల్ పిడికిటన్ = గట్టి పిడికిలితో, అక్కజంబుగా = ఆశ్చర్యముగా, శతశృంగుడై = శతశృంగ పర్వతమువలె నిశ్చలుడై, పొగరు ఏనుగు = మదించిన ఏనుగు, సరగన్ = శీఘ్రముగా –

**తా :** హనుమ సుగ్రీవుడు ఎందుకు వచ్చునని మనసున భావించి, కాకపోవుట తెలిసి ఆ రాక్షసుని పొట్టను బలముగా గట్టి పిడికిలితో పొడువగా రక్తము క్రక్కుకొనుచు వాడు క్రిందపడి ఆశ్చర్యముగా నూరు తలలు కలవాడై అనేక కఠినములైన బాణములు వేయగా వానినన్నిటిని హనుమ తోకతో కొట్టి నాశము చేయుచు అఱచేతితో చరచి, గ్రుద్ది, కఱచి, తన్ని, శరీరమును చీలికలు చేసి, నేలమీద పడవైచి త్రొక్కిపట్టి మదించిన ఏనుగు వికసించిన తామరుపూవును తెగగొట్టినట్లు వాని శిరమును త్రుంచి వేగముగా ముందుకు సాగెను.

**కం.** **చని ద్రోణము గన్గొని చ**
**య్యన మందులు వేదుకొనిన నది యించుకయుం**
**దను సరకు గొనక యుండినఁ**
**గినుక నతఁడు మలయె పెల్లగించెన్ గడిమిన్** **426**

చని, ద్రోణము = ద్రోణ పర్వతమును, కన్గొని, చయ్యన = వెంటనే, సరకుగొనక = లెక్కచేయక, అతడు, కడిమిన్ = పౌరుషముతో, మలయె పెల్లగించెన్ = పర్వతమునే పెకలించెను.

**తా :** వెళ్ళి ద్రోణపర్వతమును చూచి వెంటనే లెక్కచేయక హనుమ పౌరుషముతో పర్వతమునే పెకలించెను.

**ఆ.వె.** **పెల్లగించి గట్టు పెంపారఁ దెచ్చుచు**
**నున్న యెడల నచట మున్ను గాచి**
**యున్న వారువంపుటొడలి జేజేలు పె**
**క్కంద్రు దాఁకుటయును వాండ్రఁ జిదిమి** **427**

పెల్లగించి = పెకలించి, గట్టు = పర్వతమును, పెంపారన్ = మిక్కిలి అతిశయముతో, తెచ్చుచున్న ఎడలన్ = తెచ్చుచున్న సమయమున, అచట = అక్కడ, మున్ను = మొదటినుండియు, కాచియున్న = రక్షణగాయున్న, వారువంపు ఒడలి జేజేలు = గుఱ్ఱములవంటి దేహములుకల దేవతలు (కిన్నరులు), తాకుటయును = ఎదిరించుటయును, వాండ్రన్ చిదిమి = వాళ్ళను నలగకొట్టి.

**తా :** పెకలించి పర్వతమును అతిశయముతో తెచ్చుచున్న సమయమున అక్కడ మొదటినుండియు రక్షణగానున్న కిన్నరులు ఎదిరించగా వారిని చితకకొట్టి.

**కం.** **తెమ్మెర వడి నిబ్బలియుఁడు**
**గ్రమ్మఱి వచ్చునెడ నుప్పుకడలి కడను బీ**
**ర మ్మొదవ మాల్యవంతుఁడు**
**నెమ్మదిఁ దార్కొనిన లావు నిగుడ నతండున్** **428**

తెమ్మెర వడిన్ = వాయువేగముతో, ఈ బలియుడు = ఈ హనుమ, క్రమ్మఱి వచ్చునెడన్ = తిరిగివచ్చు సమయమున, ఉప్పుకడలి కడను = లవణ సముద్రం దగ్గర, బీరమ్ము ఒదవ = శౌర్యమును ప్రదర్శించుచూ, మాల్యవంతుడు, నెమ్మదిన్ = విశ్వాసముతో, తార్కొనిన = ఎదిరించిన, లావు నిగుడన్ = మిక్కిలి శక్తితో, అతండున్ = ఆ హనుమంతుడును,.

**తా :** వాయువేగముతో ఈ హనుమ తిరిగివచ్చు సమయమున లవణ సముద్రము దగ్గఱ శౌర్యమును ప్రదర్శించుచు మాల్యవంతుడు విశ్వాసముతో ఎదిరించిన మిక్కిలి శక్తితో హనుమంతుడు.

**ఆ.వె.** **ఒడలు వెంచి తుంగ మడువు సొచ్చి కలంచు**
**నాముటేన్గు పోల్కి నదరి మూఁకఁ**
**జిదిమివైచి వానిఁ జిలువ జగంబున**
**కనిచి కడలి దాఁటి యలవు మెఱయ** **429**

తుంగ మడువు = తుంగ గడ్డికల చెఱువు, చొచ్చి = ప్రవేశించి, కలంచు = కలచివేయు, ఆము ఏన్గు పోల్కి = మదించిన ఏనుగువలె, అదరి = అతిశయించి, మూకన్ చిదిమివైచి = సైన్యమును నాశనముచేసి, వానిన్ = ఆ మాల్యవంతుని, చిలువ జగంబునకు = పాతాళలోకమునకు, అనిచి = పంపి, అలవు మెఱయ = బలము ప్రకాశింపగా –

**తా :** తుంగ చెఱువులో ప్రవేశించి కలచివేయు మదపుటేనుగువలె హనుమ అతిశయించి మాల్యవంతుని సైన్యమును నాశనముచేసి, వానిని పాతాళలోకమునకు పంపి శౌర్యముతో –

**ఆ.వె.** **ఆకసమున వచ్చు నప్పు డమ్మందుల**
**మల వెలుంగు ప్రొద్దు వెలుఁగటంచు**
**నుదరి చూచి రాముఁ డొఱలుచు సింగిణిఁ**
**దూపుఁ గూర్చి యేయఁ దొడరుటయును** **430**

ఆ మందులమల వెలుంగు = ఆ ద్రోణపర్వతముయొక్క కాంతి, ప్రొద్దు వెలుగు అటంచు = సూర్యోదయమని, ఉదరి = అదరిపడి, ఒఱలుచు = విలపించుచు, సింగిణిన్ = ధనుస్సున, తూపున్ = బాణమును, కూర్చి, ఏయ, తొడరుటయును = సిద్ధపడుటయును –

**తా :** ఆ ద్రోణపర్వతపు కాంతి సూర్యోదయమని అదరిపడి విలపించుచు రాముడు ధనుస్సున బాణమును కూర్చి వేయడానికి సిద్ధపడగా –

**తే.గీ.** **ప్రొద్దుకొమరుఁ డెలుంగుల పెద్ద సోఁకు**
**మిన్నయును వచ్చి ఱేఁడ! విన్విన్ను మనుమఁ**
**డెలమిఁ గొనివచ్చు మందుల వెలుఁగు గాని**
**యది జగము విందు వెలుఁగు గాదనుచుఁ దెలిపి** **431**

ప్రొద్దు కొమరుడు = సుగ్రీవుడు, ఎలుంగుల పెద్ద = జాంబవంతుడు, సోకుమిన్నయును = విభీషణుడును, ఱేడ = ప్రభూ!, విను, విన్ను మనుమడు = ఆకాశమున పుట్టిన వాయువు కుమారుడు హనుమ, ఎలమిన్ = ప్రీతితో, జగము విందు వెలుగు = సూర్యుని కాంతి –

**తా :** సుగ్రీవుడు, జాంబవంతుడు, విభీషణుడును వచ్చి 'ప్రభూ! విను, హనుమ ప్రీతితో తెచ్చు మందుల కాంతియే కాని అది సూర్యుని కాంతి కాదు' అని తెలిపి –

**ఆ.వె.** **క్రమ్మరించి రంతఁ గ్రన్నన మందుల**
**గట్టు తెచ్చి నిలిపి గాలిచూలి**
**గేలు మోడ్చియున్న నేలతాలుపు మిన్న**
**గారవమున నతనిఁ గౌఁగలించె** **432**

క్రమ్మరించిరి = మరలించిరి, అంతన్, క్రన్ననన్ = శీఘ్రముగా, మందుల గట్టు = ద్రోణపర్వతము, గాలిచూలి = హనుమ, కేలుమోడ్చి యున్న = చేతులుజోడించి యుండగా, నేలతాలుపు మిన్న = రాజశ్రేష్ఠుడు రాముడు, గారవమున = ప్రేమతో –

**తా :** మరలించిరి. అంతట శీఘ్రముగా హనుమ ద్రోణపర్వతమును తెచ్చి నిలిపి చేతులు జోడించగా రాముడు ప్రేమతో అతనిని కౌగలించుకొనెను.

**సీ.** **అప్పుడా రాచూలి యానతిఁ గాంచి సు**
**షేణుఁ డమ్మెట్టుపైఁ జేరి మందు**
**లారసి కొనితెచ్చి నేరుపుతోఁ బఱ**
**గింప లక్ష్మణుఁ డబ్బురంపుఁ దేజు**

గదుర గొబ్బున లేచె గాడుపుఁ బట్టియుఁ
క్రమ్మఱ నబ్బలు గట్టు మొదలి
పట్టున నిడివచ్చి పంటవలంతి తే
నికి మ్రొక్కులిడిన మన్నించి యతఁడు

తే.గీ. దమ్ముఁడును దాను నెమ్మితోఁ గొమ్మమెకపు
మొత్తములఁ గూడి పోరికి మొనయుచుండె
నంత నత్తెఱంగంతయు నాలకించి
దీవిరాయడు దద్దయు దిగులుపూని 433

అప్పుడు, రాచూలి = రాముని, ఆనతి కాంచి = ఆజ్ఞను పొంది, ఆ మెట్టుపై = ఆ కొండపై, మందులు ఆరసి = మందులను చూచి, కొనితెచ్చి = తీసుకొనివచ్చి, పఱగింపన్ = ప్రయోగింపగా, అబ్బురంపున్ తేజు కదుర = ఆశ్చర్యకరమైన తేజస్సు కలిగినవాడుగా, గొబ్బున లేచె = శీఘ్రముగా లేచెను, గాడుపు పట్టియు = హనుమయును, క్రమ్మఱ = తిరిగి, ఆ బలు గట్టు = ఆ గొప్ప కొండను, మొదలి పట్టున = మొదటవున్న చోటనే, ఇడి = ఉంచి, పంటవలంతి తేనికి = భూపాలకునికి రామునికి, మ్రొక్కులు ఇడిన = నమస్కరించిన, మన్నించి = గౌరవించి, కొమ్మ మెకపు మొత్తములన్ = వానర సమూహముతో, పోరికి మొనయుచుండె = యుద్ధమునకు సిద్ధపడుచుండెను. ఆ తెఱగు అంతయు = ఆ విషయము నంతను, ఆలకించి = విని, దీవిరాయడు = లంకాద్వీప పాలకుడు రావణుడు, తద్దయు = మిక్కిలి, దిగులుపూని = దిగులుపొంది.

**తా :** అప్పుడు రాముని ఆజ్ఞను పొంది సుషేణుడు ఆ కొండపై మందులను చూచి తీసుకొని వచ్చి ప్రయోగింపగా అబ్బురమైన తేజస్సుతో లక్ష్మణుడు వెంటనే లేచెను. హనుమ మరల ఆ కొండను మొదటవున్నచోటనే ఉంచి వచ్చి రామునికి నమస్కరించిన రాముడు గౌరవించి వానర సమూహముతో యుద్ధమునకు సిద్ధపడుచుండెను. ఆ సంగతిని విని రావణుడు మిక్కిలి దిగులుపొంది

కం. మగఁటిమి దిగఁ ద్రోచి కడున్
వగచుచు వెస నొజ్జ చేరువకుఁ జని చేతు
ల్మోగిచి తన గొడవలన్నియు
నగపఱచిన నాతఁడిట్టులని వాక్రుచ్చెన్ 434

మగటిమిన్ = పౌరుషమును, దిగద్రోచి = వదలిపెట్టి, కడున్ వగచుచు = బాగా బాధపడుచు, వెస = తొందరగా, ఒజ్జ చేరువకు = గురువు (శుక్రాచార్యులు) దగ్గరకు, అగపఱచినన్ = విశదపరుపగా, ఆతడు = ఆ శుక్రాచార్యులు, వాక్రుచ్చెన్ = చెప్పెను.

**తా :** పౌరుషమును వదలిపెట్టి బాగా బాధపడుతూ తొందరగా గురువగు శుక్రాచార్యుని దగ్గరకు వెళ్ళి చేతులు జోడించి తన బాధలను విశదపరచగా ఆ శుక్రుడు చెప్పెను.

**తే.గీ.** **రక్కసుల ఱేఁడ! నీ కిటుల్ మ్రొక్కనేల?**
**దురములోపల మార్తురఁ దొడరి గెలుచు**
**జాడ లెన్నేని గల వెద జంకుమాలి**
**చెఱుపు దొరలని వ్రేలిమి సేయుమొకటి** **435**

రక్కసుల ఱేడ, నీకు ఇటుల్ మ్రొక్కను ఏల = నీకు ఈవిధంగా నమస్కరింప పనియేమి?, దురము లోపల = యుద్ధములో, మార్తురన్ = శత్రువులను, తొడరి = పూని, గెలుచు జాడలు = విజయం పొందే ఛాయలు, ఎన్నేని = ఎన్నియైనను, కలవు, ఎద జంకుమాలి = మనసులో శంకమాని, చెఱుపు దొరలని = కీడు కలగని, వ్రేలిమి = హోమము, చేయుము ఒకటి = ఒకటి చేయుము.

**తా :** 'రావణా! నీకు ఈ విధంగా మ్రొక్కాల్సిన పనేమిటి? యుద్ధములో శత్రువులను జయించు జాడలెన్నేని కలవు. మదిలో శంకమాని కీడు కలుగని హోమమొకటి చేయుము.

**కం.** **అది నిండెనేని? నిన్నని౯**
**గదియంగా వెఱచు బేసికన్నుల దొరయుం**
**గొదుగక నీవా వ్రేలిమిఁ**
**బదిలముగ నొనర్చు మెల్ల పనులుం జాగున్** **436**

అది నిండెనేని = ఆ హోమము పూర్తియైనచో, నిన్ను, అనిన్ = యుద్ధమున, కదియంగా = సమీపించుటకు, బేసికన్నుల దొరయుం = శివుడును, వెఱచున్ = భయపడును, కొదుగక = సందేహించక, ఆ వ్రేలిమి = ఆ హోమమును, పదిలముగన్ = భద్రముగ, ఒనర్చుము = చేయుము, ఎల్ల పనులున్ = అన్ని పనులును, చాగున్ = జరుగును.

**తా :** ఆ హోమము పూర్తియైనచో నిన్ను యుద్ధమున సమీపించుటకు శివుడును భయ పడును. సందేహించక ఆ హోమమును పదిలముగ చేయుము. అన్నిపనులు జరుగును'.

**ఆ.వె.** **అనుచు దాని చందమంతయు నెఱిఁగించి**
**సుక్కురుండు పనుప సోఁకు ఱేఁడు**
**మరల దీవి కరిగి మఱి మీఱి కోటలు**
**గట్టి సేసి మూఁకఁ గాపు పెట్టె** **437**

సుక్కురుండు = శుక్రాచార్యులు, దాని చందమంతయు = ఆ హోమ విధానమునంతను, ఎఱిగించి, పనుప = పంపగా, సోకుఱేడు = రావణుడు, మఱి మీఱి = మిక్కిలి అధికముగా, మూకన్ = సైన్యమును, కాపు పెట్టె = కాపాలా ఉంచెను.

**తా :** అని శుక్రాచార్యులు ఆ హోమ విధానమునంతను తెలిపి పంపగా రావణుడు మరల లంకకు వెళ్ళి మిక్కిలి అధికముగా కోటలు గట్టిపఱచి, సైన్యము కాపుంచెను.

**సీ.** **అపుడె మేటి వజీరుఁడగు మించు నాల్క ర**
**క్కసునిఁ బిల్చి కరంబు గారవించి**

**బలియుండ! నీవు నీ పౌఁజులఁ దరలక**
**నగరు గావుమటంచుఁ దగులు పఱచి**
**నీటఁ గ్రుంకులు వెట్టి నేమంబుతోఁ గావి**
**కోకలు గందంబుఁ గ్రొవ్విరులును**
**బూని పాఁప జగంబు బొఱియ సొచ్చి వెడంద**
**తీనియ నలరించి దానియందు**

**తే.గీ. నగ్గి రవులించి యావాలు గుగ్గిలంబు**
**జీడిపుడకలు కానుగ చిగురు లగరు**
**నేయి తేనియఁ గల్లు పా ల్నెత్తురులును**
**గఱికపోఁచలు పూ ల్వెంద్రుకలును మఱియు** **438**

అపుడె, మేటి వజీరుడు అగు = గొప్ప వీరుడైన, మించు నాల్క రక్కసునిన్ = మెఱుపుతీగవంటి నాలుకకల రాక్షసుని (స్తనితజిహ్వుని), పిల్చి, కరంబు గారవించి = మిక్కిలి గౌరవించి, బలియుండ = వీరుడా!, తరలక = యుద్ధమునకు రాకుండగా, నగరు కావుము = లంకా నగరమును, కావుము అటంచు = కాపు కాయుమనుచు, తగులు పఱచి = బాధ్యతను అప్పగించి, నీటన్ క్రుంకులు పెట్టి = స్నానము చేసి, నేమంబుతో = నియమముతో, కావి కోకలు = ఎఱుపు వస్త్రములు, గందంబు = గంధము, క్రొవ్విరులును = విచ్చిన పువ్వులను, పూని = ధరించి, పాప జగంబు బొఱియ = పాముల లోకము (పాతాళము) పోవు కలగున, చొచ్చి = ప్రవేశించి, వెడంద తీనియ నలరించి = పెద్ద వేదిక నేర్పరచుకొని, అగ్గి రవులించి = అగ్నిని ప్రజ్వలింపచేసి, ఆవాలు, గుగ్గిలము, జీడి పుల్లలు, కానుగ చిగురులు = కానుగ చిగుళ్ళు, అగరు = సాంబ్రాణి, (క్షుద్ర పూజ).

**తా :** అప్పుడే గొప్ప వీరుడైన స్తనితజిహ్వుని పిలిచి గౌరవించి 'వీరుడా! నీవు యుద్ధమునకు రాకుండగ నీ సైన్యముతో లంకను కాపు కాయుమ'నుచు బాధ్యతను అప్పగించి, స్నానము చేసి నియమముతో కాషాయ వస్త్రములు, గంధము, పువ్వులు ధరించి పాతాళ మార్గమును ప్రవేశించి పెద్ద వేదిక నేర్పరచుకొని అగ్ని రగిలించి ఆవాలు, గుగ్గిలము, జీడి పుల్లలు, కానుగ చిగుళ్ళు, సాంబ్రాణి, నేయి, తేనె, కల్లు, పాలు, నెత్తురు, గఱికపోచలు, పూలు, వెంట్రుకలును ఇంకను

**కం. ఎలుఁగులు కాకులు గ్రద్దలు**
**చిలువలు తాఁబేళ్ళు మీలు జింకలు రాపు**
**ల్గులు గొఱియలు మొసళులు మేఁ**
**కలు పందులు తేళ్ళు మొదలుగాఁ వేల్చునెడన్** **439**

చిలువలు = పాములు, మీలు = చేపలు, రా పుల్గులు = రాబందులు, గొఱియలు = గొఱ్ఱెలు, వేల్చున్ ఎడన్ = హోమము చేయుచుండగా –

**తా :** ఎలుగుబంట్లు, కాకులు, గ్రద్దలు, పాములు, తాబేళ్ళు, చేపలు, జింకలు, రాబందులు, గొఱ్ఱెలు, మొసళ్ళు, మేకలు, పందులు, తేళ్ళు మొదలైనవి హోమము చేయుచుండగా –

**కం. అప్పొగ జగముల నెల్లం**
**గప్పినఁ గని కడవ చెవుల గామిడి సైదో**
**డప్పుడె రాముని క త్తెఱఁ**
**గొప్పఁగ విన్నప మొనర్ప నొడయఁడు వేగన్ 440**

ఆ పొగ, కడవ చెవుల గామిడి సైదోడు = కుంభకర్ణునకు ప్రియ సోదరుడు విభీషణుడు, అప్పుడె = ఆ సమయముననే, అత్తెఱగు = ఆ విషయమును, ఒప్పగ = వివరముగా, విన్నపము ఒనర్ప = విన్నవించగా, ఒడయడు = రాముడు, వేగన్ = వేగముగా –

**తా :** ఆ పొగ లోకము లన్నిటిని కప్పగా చూచి విభీషణుడు అప్పుడె ఆ విషయము వివరంగా రామునకు విన్నవించగా రాముడు వెంటనే –

**కం. అక్కజపు కోఁతి జోదులఁ**
**బెక్కంద్రం బిలిచి మీరు బిఱబిఱఁ జని యా**
**రక్కసుని వ్రేల్మి మానిచి**
**గ్రక్కున రండనుచు సెలవు గావించుటయున్ 441**

అక్కజపు = అద్భుత శక్తిమంతులైన, కోతి జోదులన్ = వానర వీరులను, పెక్కంద్రన్ పిలిచి = ఎక్కువమందిని పిలిచి, వ్రేల్మి మానిచి = హెూమము మానిపించి, గ్రక్కున రండు అనుచు = వేగముగా తిరిగి రండని, సెలవు కావించుటయున్ = ఆజ్ఞాపించుటయును,

**తా :** అద్భుత శక్తిమంతులైన వానర వీరులను పెక్కుమందిని పిలిచి మీరు వేగముగా పోయి ఆ రాక్షసుని హెూమము మానిపించి తిరిగి రండని ఆజ్ఞాపించగా –

**కం. అవ్వాఁడి మగలుఁ దద్దయు**
**నెవ్వడిఁ గొని లంకఁ జొచ్చి నెమ్మి నలరుచుం**
**గ్రొవ్వఱ రక్కసి మూఁకల**
**దవ్వుగఁ బోఁ దఱిమి చంపి తరలని కడిమిన్ 442**

ఆ వాడి మగలున్ = ఆ పరాక్రమ శీలురు, తద్దయు = మిక్కిలి, నెవ్వడిన్ కొని = నెరవేర్చు వేగముగా, లంకన్ చొచ్చి = లంకలో ప్రవేశించి, నెమ్మిన్ = సంబరముగ, అలరుచున్ = ఒప్పుచు, క్రొవ్వు అఱ = వాళ్ళ పొగరు తగ్గునట్లుగా, రక్కసి మూకల = రాక్షస సైన్యమును, దవ్వగన్ = దూరముగా, పోన్ తఱిమి = పోయేలా తరిమివేసి, చంపి = దొరికినవారిని చంపి, తరలని కడిమిన్ = సడలని పరాక్రమముతో –

**తా :** ఆ పరాక్రమ శీలురు మిక్కిలి పనిని నెరవేర్చు వేగముతో లంకను ప్రవేశించి సంబరముగ రాక్షసుల పొగరు తగ్గునట్లుగా దూరముగా తఱిమివేసి, దొరికినవారిని చంపి సడలని పరాక్రమముతో –

**చం. తలుపులు గీములున్ విఱుగఁ దన్ని కొటారులు నుగ్గు సేసి మే**
**డలు పడఁద్రోచి గేస్తుల నడంచి వెలందుకల న్మసళ్ళఁ గం**

**దుల వెతలం గలంచి పువుఁ దోఁటలు గాళొనరించి యెంతయుం**
**జలము దలిర్పఁ బ్రోలు పలు చందములం జెడఁ గొట్టుపట్టులన్ 443**

తలుపులు, గీములున్ = గృహములను, విఱుగన్ తన్ని = విరుగునట్లు తన్ని, కొటారులు = ధాన్యాద్యాగారములను, నుగ్గు చేసి = పిండి చేసి, గేస్తుల = గృహస్థులను, అడంచి = అణచివేసి, వెలందుకలన్ = స్త్రీలను, ముసళ్ళన్ = వృద్ధులను, కందుల = పిల్లలను, వెతలన్ కలంచి = కష్టపెటి కలచివేసి, పువు తోటలు = పూలతోటలు, కాళు ఒనరించి = నాశనము చేసి, ఎంతయున్ = మిక్కిలి, చలము తలిర్పన్ = పట్టుదలతో, ప్రోలు = లంకానగరమును, పలుచందములన్ = అనేక విధములుగా, చెడన్ కొట్టు పట్టులన్ = పాడుచేయు సమయములందు,

**తా :** తలుపులు, గృహములు విఱుగ తన్ని గాదెలు పిండిచేసి, మేడలు పడద్రోసి, గృహస్థుల నణచి, స్త్రీలను, వృద్ధులను, పిల్లలను బాధలుపెట్టి, పూలవనములు పాడుచేసి మిక్కిలి పట్టుదలతో లంకను పలు విధములుగా చెడకొట్టు సమయమున –

**తే.గీ. ఎలమితోడ విభీషణు నింతియైన**
**సరమ దొలివేల్పు తేఁడున్న జాడ వారి**
**కలరఁ జేసన్న నెఱిఁగింప నంగదుండు**
**సరగఁ బఱతెంచి వాఁడున్న యిరవు గాంచి 444**

ఎలమితోడ = ప్రీతితో, విభీషణుని ఇంతియైన సరమ = విభీషణుని భార్యయైన సరమ, తొలివేల్పు తేడు = రావణుడు, ఉన్న జాడ = ఉన్న చోటు, వారికి = ఆ వానరులకు, అలరన్ = బాగుగా, చేసన్నన్ = చే సంజ్ఞతో, సరగన్ = వేగముగా, పఱతెంచి = వచ్చి, వాడు = ఆ రావణుడు, ఉన్న ఇరవు కాంచి = ఉన్న చోటును చూచి –

**తా :** ప్రీతితో విభీషణుని భార్య సరమ రావణుడు ఉన్న చోటు ఆ వానరులకు చే సంజ్ఞతో తెలుపగా అంగదుడు వేగముగా వచ్చి రావణుడున్న ప్రదేశమును చూచి –

**కం. తమవారిం బిలిచిన వై**
**ళమ చని వారందఱుం బొలసు మేపరి క**
**ల్గు మొగం దాపిన పెను ఱా**
**యి మొగిం బడఁ దన్ని లోని కేఁగి కడంకన్ 445**

తమవారిన్ పిలిచిన = తమవారిని పిలువగా, వైళమ = వేగముగా, చని వారందఱున్ = వెళ్ళి వారందరును, పొలసు మేపరి = రావణుడు, కల్గు మొగన్ = పాతాళమునకుపోవు మార్గమును, తాపిన = అడ్డుగా పెట్టిన, పెను ఱాయి = పెద్ద రాయిని, మొగిన్ = పూని, బడన్ తన్ని = పడునట్లుగా తన్ని, లోనికి ఏగి = లోపల ప్రవేశించి, కడంకన్ = పౌరుషముతో –

**తా :** తమవారిని పిలువగా వేగముగా వెళ్ళి వారందరును రావణుడు పాతాళమార్గమునకు అడ్డుగా పెట్టిన పెద్ద ఱాయిని తన్ని పడగొట్టి లోపల ప్రవేశించి పౌరుషముతో –

**తే.గీ. వేలుపుల గొంగ యునిచిన వ్రేల్మి సరుకు**
**లెల్ల యొకపారె యగ్గిలోఁ జల్లివైచి**
**వానిఁ బొడిచియు నడఁచియుఁ బూని మీస**
**లూడఁ బెఱికియుఁ గదలకయున్నఁ గినిసి 446**

వేలుపుల గొంగ = రావణుడు, ఉనిచిన = ఉంచిన, వ్రేల్మి సరుకులు = హోమ ద్రవ్యములు, ఎల్ల = అన్నిటిని, ఒకపారె = ఒక్కసారే, అగ్గిలోన్ = హోమకుండములో, చల్లివైచి = చల్లేసి, వానిన్ = ఆ రావణుని, అడచియు = కొట్టియు, పూని = పట్టుకొని, కినిసి = కోపించి –

**తా :** రావణుడు ఉంచిన హోమద్రవ్యములు అన్నిటిని ఒక్కసారిగా హోమకుండములో చల్లివైచి ఆ రావణుని పొడిచియు, కొట్టియు, మీసములూడబెరికియు కదలకున్న కోపించి –

**కం. తడయక యంగదుఁ డపుడా**
**గడుసరి తొలివేల్పు లోనగరు దూఱి చలం**
**బడరఁగ మందోదరి క్రొ**
**మ్ముడి పట్టుక తెచ్చి వాని ముందఱ నిలిపెన్ 447**

అపుడు = ఆ సమయమున, తడయక = ఆలస్యము చేయక, అంగదుడు, ఆ గడుసరి = ఆ మోస గాడైన, తొలివేల్పు = రావణుని, లోనగరు = అంతిపురమును, దూఱి = ప్రవేశించి, చలంబు అడరగ = పట్టుదల ప్రేరేపింపగా, మందోదరిన్, క్రొమ్ముడి = కొప్పును, పట్టుక తెచ్చి = పట్టుకొని తీసుకొనివచ్చి, వాని ముందఱ = ఆ రావణుని ఎదుట, నిలిపెన్ = నిలబెట్టెను.

**తా :** ఆ సమయమున ఆలసించక అంగదుడు ఆ గడుసరి రావణుని అంతిపురము దూరి పంతముతో రావణుని భార్య మందోదరిని కొప్పును పట్టుకొని తెచ్చి ముందర నిలబెట్టెను.

**చం. నిలిపిన నప్పొలంతి మగనిం దగఁ గన్గొని నాన యల్క యు**
**మ్మలికము బీతు నుల్లమున మాటికిఁ బేర్కొనఁ బల్కె నయ్యయో!**
**పొలకవణంపు వంగడపుఁ బున్నమ వెన్నెలఱేఁడ! నీ చెలిం**
**బలువలు కొప్పువట్టి పలుబాములఁ బెట్టఁగఁ జూడఁ బాడియే 448**

నిలిపినన్ = నిలబెట్టగా, ఆ పొలంతి = ఆ మందోదరి, మగనిన్ = భర్తను, తగన్ కన్గొని = తరచి చూచి, నాన = సిగ్గు, అల్క = కోపమును, ఉమ్మలికము = బాధ, బీతున్ = భయమును, ఉల్లమున = మనసున, మాటికిన్ = తఱచుగా, పేర్కొనన్ = కనబడునట్లుగా, పల్కెన్ =పలికెను, అయ్యయో, పొలకవణంపు వంగడపున్ = మాంసము తిను వంశమునకు, పున్నమ వెన్నెల ఱేడ = పున్నమి చంద్రుడా!, నీ చెలిన్ = నీ భార్యను, పలువలు = నీచులు, కొప్పు పట్టి = కొప్పు పట్టుకొని, పలు బాములన్ = అనేక కష్టములను, పాడియే = న్యాయమా?

**తా :** నిలిపిన ఆ మందోదరి భర్తను చూచి సిగ్గు, కోపము, బాధ, భయము మనసున తఱచుగా కనబడునట్లుగా 'అయ్యయ్యో! రాక్షస వంశ పున్నమి చంద్రుడా! నీ భార్యను నీచులు కొప్పు పట్టుకొని అనేక కష్టములు పెట్టగా చూచుచుండట తగునా?

**కం. ఆలమునఁ బగరఁ గెలువఁగఁ**
**జాలక మగతనము దూలి చయ్యన నెంతో**
**తాలిమిఁ గైకొని యహహా!**
**వ్రేలిమిఁ గావింప నెట్టి వెర వొదవెనొకో? 449**

ఆలమునన్ = యుద్ధమునందు, పగరన్ = శత్రువులను, గెలువగ చాలక = గెలువలేక, మగతనము తూలి = పౌరుషము లేక, చయ్యనన్ = శీఘ్రముగా, ఎంతో తాలిమిన్ = ఎంతో ఓర్పుతో, కైకొని = స్వీకరించి, అహహా = అయ్యో!, వ్రేలిమిన్ = హోమమును, కావింపన్ = చేయుటకు, ఎట్టి వెరవు = ఎలాంటి సమయము, ఒదవెనొకో = కుదిరినదో కదా!

**తా :** యుద్ధమున శత్రువులను గెలువలేక, మగతనము తూలి, ఎంతో ఓరిమిని స్వీకరించి అయ్యో! హోమమును చేయుటకు ఎట్టి సమయము కుదిరినదోకదా!

**కం. నా కొమరుఁ డింద్రజిత్తుఁడు**
**లేకుండుటఁ జేటు వాటిలెం గాక యతం**
**డీ కరణి చూచుచుండునె?**
**డాకొని పగతు ల్గలంపఁ దక్కరియగుచున్ 450**

నా కొమరుడు, ఇంద్రజిత్తుడు, లేకుండుటన్, చేటువాటిలెన్ కాక = ఆపదకలిగినది కాని, అతండు = ఆ ఇంద్రజిత్తు, పగతులు = శత్రువులు, ఈ కరణిన్ = ఈ విధముగా, డాకొని = ఎదిర్చి, కలంపన్ = కలత చెందించుచుండగా, టక్కరియగుచున్ = మోసగాడగుచూ, చూచుచుండునె?

**తా :** నా కొడుకు ఇంద్రజిత్తు లేకపోవడం వలన ఈ కష్టం కలిగింది కాని శత్రువులు ఈ విధముగా ఎదిర్చి కలతచెందించుచుండగా అతడు మోసగాడిగా ఊరుకుంటాడా?

**తే.గీ. అడవి నొడయనిఁ గికురించి పుడమి కాన్పుఁ**
**దెచ్చుటకు మాఱుగాఁ గోన ద్రిమ్మరులు సె**
**లంగి యిటు లేపుచున్నఁ దలంక వకట!**
**సిగ్గు బీరంబుమాలిన చెనఁటి వీవు 451**

అడవిన్, ఒడయినిన్ = రాముని, కికురించి = మోసగించి, పుడమి కాన్పున్ = సీతను, తెచ్చుటకు మాఱుగాన్ = తెచ్చినందులకు ప్రతీకారముగా, కోన త్రిమ్మరులు = వానరులు, చెలంగి = విజృంభించి, ఇటులు = ఈ విధముగా, ఏపుచున్నన్ = బాధపెట్టుచున్నను, తలంకవు = చలించవు, అకట = అయ్యో!, సిగ్గు, బీరంబు = పరాక్రమము, మాలిన = లేనట్టి, చెనటివి ఈవు = జడుడవు నువ్వు..

**తా :** అడవిలో రాముని మోసగించి సీతను తెచ్చిన దానికి ప్రతీకారముగా వానరులు విజృంభించి ఈ రీతిగా బాధపెడుతున్నా చలించవు. నువ్వు శౌర్యములేని దుర్మార్గుడవైతివి.

**తే.గీ. కుడిచి కూర్చుండి క్రొవ్వునఁ బుడమిఁ జేని**
**పడఁతిఁ దెచ్చుట నిట్టి చేడ్పాటు వొదవె**
**నింక నీ వ్రేల్మిలన్నియు నింకఁ బెట్టి**
**యతని బెడిదంపు బలు తూపు టగ్గిఁ బడుము 452**

కుడిచి కూర్చుండి = తిని కూర్చుని, క్రొవ్వునన్ = పొగరుతో, పుడమి తేని పడతిన్ = సీతను, తెచ్చుటన్ = తెచ్చుటవలన, ఇట్టి చేద్పాటు పొదవె = ఇట్టి కీడు కలిగినది, ఇంక, నీ వ్రేల్మలు అన్నియు = నీ హెూమములన్నియు, ఇంకన్ పెట్టి = ఎండపెట్టి, అతని = ఆ రామునియొక్క, బెడిదంపు = కఠినమైన, బలు తూపు అగ్గిన్ = గొప్ప బాణాగ్నిలో, పడుము.

**తా :** తిని కూర్చుని పొగరుతో సీతను తెచ్చుటవలన ఇట్టి కీడు కలిగినది. ఇంక నీ హెూమములన్నీ ఎండపెట్టి ఆ రాముని కఠినమైన బాణాగ్నిలో పడుము.

**కం.** **అనవుడు నానయుఁ గిన్కయుఁ**
**బెనగొనఁగా లేచి సోఁకు పెద్ద వెసన్ వా**
**ల్గొని యంగదు వ్రేసి నెలం**
**తను విడిపించుకొని నగరునకుఁ బోఁబనిచెన్** **453**

అనవుడు = అనిన పిమ్మట, నానయున్ = సిగ్గును, కిన్కయున్ = కోపమును, పెనగొనగా = పెనవేసికొనగా, లేచి = హెూమముమాని లేచి, సోకు పెద్ద = రావణుడు, వెసన్ = వెంటనే, వాలు కొని = కత్తిని తీసుకొని, అంగదు వ్రేసి = అంగదుని కొట్టి, నెలంతను = భార్యను, విడిపించుకొని, నగరునకు = అంతిపురమునకు, పోన్ పనిచెన్ = పంపించెను.

**తా :** అనిన పిమ్మట సిగ్గును, కోపమును పెనగొనగా లేచి రావణుడు వెంటనే కత్తి తీసుకొని అంగదుని కొట్టి భార్యను విడిపించుకొని నగరునకు పంపించెను.

**తే.గీ.** **అప్పు డా వ్రేటుచేఁ దార యనుఁగు కొడుకు**
**సొమ్మఁగొని నేల వ్రాలినఁ జూచి గాడ్పు**
**నిసుఁగు రావణు తలలఁ గ్రొన్నెత్తు రురులఁ**
**బోర బెడిదంపుఁ బిడికిలిఁ బూని పొడిచె** **454**

అప్పుడు, ఆ వ్రేటుచేన్ = ఆ దెబ్బచేత, తార అనుగు కొడుకు = తార ముద్దుబిడ్డ అంగదుడు, సొమ్మగొని = సొమ్మసిలి, నేల వ్రాలినన్ = నేలపై పడిపోగా, చూచి, గాడ్పు నిసుగు = హనుమ, రావణు తలలన్, క్రొన్నెత్తురు = వేడినెత్తురు, ఉరులన్ = పొరలగా, పోర = పోరాటమున, బెడిదంపున్ = గట్టిదైన, పిడికిలిన్ = పిడికిలితో, పూని = పూనుకొని, పొడిచె.

**తా :** అప్పుడు ఆ దెబ్బచేత అంగదుడు సొమ్మసిలి నేలపై పడిపోగా చూచి హనుమ రావణుని తలలను వేడి నెత్తురు పొరలగా గట్టిదైన పిడికిలితో పూనుకొని పొడిచెను.

**తే.గీ.** **అంతలోపలఁ దెప్పిరి యంగదుండు**
**రక్కసునిఁ గేల నడిచిన స్రుక్కి వాఁడు**
**నిడుద ద్రుడ్డున తనను గుందించి వాఁడి**
**యడిదమున సోఁకు దయ్యము కొడుకు నేసి** **455**

అంతలోపలన్, అంగదుడు, తెప్పిరి = తెలివొంది, రక్కసునిన్, కేలన్ అడిచిన = చేతితో అణచివేయగా, స్రుక్కి = తగ్గి, వాడు = ఆ రావణుడు, నిడుద ద్రుడ్డున = పెద్ద దుడ్డుకఱ్ఱతో, తనను = అంగదుని,

కుందించి = బాధించి, వాడి అడిదమున = పదునైన కత్తితో, సోకు దయ్యము = స్పర్శ తెలుపునది వాయువు, కొడుకున్ = కొడుకును హనుమను, ఏసి = కొట్టి,.

**తా :** అంత లోపల అంగదుడు తెలివొంది రావణుని చేతితో అణచివేయగా తగ్గి వాడు పెద్ద దుడ్డుకట్టతో అంగదుని బాధించి పదునైన కత్తితో హనుమను కొట్టి.

**తే.గీ.** **ఇనుపబడియను నలునిఁ జేయీఁటె ద్వివిదు**
**సత్తి శతవలి నేసియుఁ గత్తి గజునిఁ**
**గుఱుచ రోఁకట నీలుని మఱియుఁ బెక్కఁ**
**గైదువుల నెల్ల నెఱ మొనగాండ్ర నొంచె** **456**

ఇనుప బడియను = ఇనుప దుడ్డుతో, నలునిన్, చే ఈటెన్ = బల్లెముతో, ద్వివిదున్, సత్తి = శక్తితో, శతవలిన్, ఏసియున్ = కొట్టి, కత్తి = కత్తితో, గజునిన్, కురుచ రోకట = చిన్న రోకలితో, నీలుని, మఱియు = ఇంకను, పెక్కు కైదువులన్ = పలు ఆయుధములతో, ఎల్ల నెఱ మొనగాండ్రన్ = పేరున్న వీరులనందరను, ఒంచె = ఒంచెను.

**తా :** ఇనుప దుడ్డుతో నలుని, బల్లెముతో ద్వివిదుని, సత్తిచే శతవలిని కొట్టి, కత్తితో గజుని, చిన్న రోకలితో నీలుని ఇంకను పెక్కు ఆయుధములతో వీరులందరిని బాధించెను.

**తే.గీ.** **వారు దాఁచియు గ్రుద్దియుఁ జీరి యడఁచి**
**కఱచి మోఁదియు వానిఁ బొంపఱగఁ జేసి**
**మరలి బొబ్బలు వెట్టుచు మాఱులేని**
**బీర మొప్పారఁ దమ వీడు సేరి రపుడు** **457**

వారు, తాచియు = తన్నియును, గ్రుద్దియు, చీరి = గోళ్ళతో రక్కి, అడచి = కొట్టి, కఱచి, మోదియు = బాదియును, వానిన్, పొంపు అఱగన్ = పరాక్రమము తగ్గునట్లుగా, చేసి, మరలి బొబ్బలు పెట్టుచు, మాఱులేని = తిరుగులేని, బీరము = పౌరుషము, ఒప్పారన్ = అతిశయింపగా, తమ వీడు = తమ నివేశన స్థలములను, అపుడు చేరిరి.

**తా :** వారు తన్ని, గ్రుద్ది, రక్కి, కొట్టి, కఱచి, బాదియును రావణుని పౌరుషము తగ్గునట్లుగా చేసి, తిరిగి అరచుచు తిరుగులేని పరాక్రమముతో అపుడు తమ వాసస్థలములు చేరిరి.

**కం.** **గాలి నిసుఁ గెలమితో రా**
**చూలిం బొడగాంచి మిగుల జోత లొసఁగి తొ**
**ల్వేలుపు వ్రేలిమి సెఱిచిన**
**జోలి యెఱింగించి మదినిఁ జొక్కన్ జేసెన్** **458**

గాలి నిసుగు = ఆంజనేయుడు, ఎలమితోన్ = సంతోషముతో, రాచూలిం = రాముని, పొడగాంచి = చేరి, మిగుల = వినయముగా, జోతలు ఒసగి = నమస్కరించి, తొలి వేలుపు = రావణునియొక్క, వ్రేలిమి = హోమము, చెఱిచిన జోలి = పాడుచేసిన విషయమును, ఎఱింగించి, మదినిన్, చొక్కన్ చేసెన్ = ఆనందింప చేసెను.

**తా :** ఆంజనేయుడు సంతోషముతో రాముని చేరి వినయముగా నమస్కరించి రావణుని హోమము చెఱిచిన విధము తెలిపి మదిని ఆనందింప చేసెను.

**కం.** **రక్కసి ఱేఁడుం దద్దయు**
**స్రుక్కుచు లోనగరు సొచ్చి సొలయుచు వగలన్**
**బొక్కెడు తన చెలిఁ గనుగొని**
**యెక్కుడు చేడ్పాటు దోఁప నిట్లని పలికెన్** **459**

రక్కసి ఱేడున్ = రావణుడును, తద్దయు = అధికముగా, స్రుక్కుచు = బాధపడుచు, లోనగరు చొచ్చి = అంతిపురమును ప్రవేశించి, సొలయుచు = దుఃఖించుచు, వగలన్ = బాధలతో, పొక్కెడు = దుఃఖించుచున్న, తన చెలిన్ = తన భార్యయైన మందోదరిని, కనుగొని = చూచి, ఎక్కుడు చేడ్పాటు తోపన్ = ఆమె ఏడుపు ఎక్కువ కీడును శంకింప చేయగా, ఇట్లని పలికెన్.

**తా :** రావణుడును మిక్కిలి బాధపడుచు లోనగరు చేరి దుఃఖించుచు బాధలతో ఎక్కిడుచున్న తన భార్యను చూచి ఆమె ఏడుపు కీడును శంకింపచేయగా ఇట్లని పలికెను

**తే.గీ.** **మగువ! నీ కిట్టు వగలచేఁ బొగల దగునె?**
**జమిలి నాల్కల తొడవుల సామి యిపుడు**
**కనికరము దప్పెఁ గాఁబోలుఁ గాక కోఁతు**
**లెఱచిదిండుల గెలుచుట యెందుఁ గలదె?** **460**

మగువ!, నీకు ఇట్టు వగలచేన్ పొగలన్ తగునె?, జమిలి నాల్కల తొడవుల సామి = రెండు నాల్కలు కల పాములు ఆభరణములుగా కల పరమశివుడు, ఇపుడు కనికరము తప్పె కాబోలు, కాక కోతులు, ఎఱచి తిండుల = రాక్షసులను, గెలుచుట ఎందు కలదె?

**తా :** 'ఓ మగువా! నువ్వు ఇలా బాధలతో దుఃఖించడం తగునా! పరమశివుడు దయ తప్పింది కాబోలు, కాకపోతే కోతులు రాక్షసులను గెలవడం ఎప్పుడైనా ఉందా?

**తే.గీ.** **ఆలమున నేఁడు గట్టిగా నేల ఱేనిఁ**
**గూల్చి పగయెల్ల నుడుపుదు గొంకులేక**
**కాక యాతని చేఁ గీడు గలిగెనేనిఁ**
**జిచ్చుఁ జొరు మీవు సెచ్చెర సీతఁ జంపి** **461**

ఆలమున = యుద్ధమున, నేడు, గట్టిగా = నిశ్చయముగా, నేల ఱేనిన్ = రాముని, కూల్చి, పగ ఎల్లన్, కొంకులేక = సందేహము లేకుండగా, ఉడుపుదు = పోగొట్టుదును, కాక = అలా జరుగక, ఆతని చేన్ కీడు కలిగెనేని, చెచ్చెర = వెంటనే, సీతన్ చంపి, ఈవు = నీవు, చిచ్చున్ = అగ్నిని, చొరుము = ప్రవేశింపుము.

**తా :** యుద్ధమున నేడు నిశ్చయముగా రాముని కూల్చి సందేహం లేకుండా పగ తీరుస్తాను. కాక అతనిచేతనే కీడు సంభవించిన వెంటనే సీతను చంపి నువ్వు అగ్నిని ప్రవేశింపుము'.

**కం. అనుటయు మందోదరి తన**
**పెనిమిటి కిట్లనియె తేఁడ! పెనుకువలో రా**
**ముని గెలుతు ననెడు తలపులు**
**సనఁబోవిఁక నొండు మంచి జాడ వెదకుమా! 462**

అనుటయు, మందోదరి తన పెనిమిటికి ఇట్లనియె తేడ!, పెనకువలో = యుద్ధములో, రాముని గెలుతును అనెడు, తలపులున్ = ఆలోచనలు, చనన్ పోవు = జరుగవు, ఇకన్ = ఇంక, ఒండు = ఒక, మంచి జాడ వెదకుమా!

**తా :** అనగా మందోదరి తన భర్తకు 'రాజా! యుద్ధములో రాముని గెలుస్తాననే తలపులు జరుగవు. ఇక మరొక మంచి మార్గము వెదకుము.

**కం. పరికింప నట్ల జేజే**
**దొరలం గెలిచిన కడంకతోఁ దివిరెదు హా!**
**దురమున నీ కా రాచూ**
**లుర తోడ న్మాఱుకొని గెలువరాదుసుమీ! 463**

పరికింపన్ = ఆలోచింపగా, జేజే దొరలన్ = దిక్పాలకులను, గెలిచిన, కడంకతోన్ = పూనికతో, అట్ల = ఇపుడుకూడా ఆ విధముగానే, తివిరెదు = ప్రయత్నిస్తున్నావు. హా!, తురమున = యుద్ధమున, నీకు ఆ రాచూలురతోడన్, మాఱుకొని = ఎదిరించి, గెలువరాదుసుమీ = గెలుపురాదుసుమా!

**తా :** ఆలోచింపగా దిక్పాలకులను గెలిచిన పూనికతో ఇపుడు కూడా ఆ విధంగానే ప్రయత్నిస్తున్నావు. యుద్ధంలో నీకు ఆ రాజకుమారులతో ఎదిరించి గెలుపురాదుసుమా!

**ఆవె. వినుము తెలియ మొదట వెన్నుఁ డిజ్జగ మెల్లఁ**
**బ్రోచుకొఱకుఁ బెక్కు రూపులూని**
**తిరుగుచుండు నట్టి దేవర యా రాచ**
**మానికంబుగాఁడె? మదిఁ దలంప 464**

తెలియ వినుము = తెలిసేట్లుగా విను, మొదట, వెన్నుడు = విష్ణువు, ఈ జగము ఎల్లన్ = ఈ లోకమునంతను, ప్రోచుకొఱకు = రక్షించుట కొరకు, పెక్కు రూపులు ఊని = అనేక అవతారములెత్తి తిరుగుచుండును. అట్టి దేవర ఆ రాచమానికంబు కాడె? మది తలంప.

**తా :** తెలిసేలా విను. మొదట విష్ణువు ఈ లోకాన్నంతను రక్షించడంకోసం అనేక అవతారములెత్తి సంచరిస్తూంటాడు. మదిని భావింపగా ఆ దైవమే ఆ రాముడు కాడా?

**సీ. మీను మేనూని ప్రామిన్కు తెక్కలికానిఁ**
**జెండిన బలియుఁ డితండె కాఁడె?**
**తాఁబేటి మే యెత్తి తరిగొండ వీఁపునఁ**
**దాల్చిన మేటి యీతండె కాఁడె?**
**బలుకొమ్ము పందియై పసిఁడికన్నుల పొల**
**దిండిఁ జీరిన వే ల్పితండె కాఁడె?**

**మానిసి సింగమై పూని బత్తుని వెతల్**
**తలఁగఁ ద్రోచిన వాఁ డితండె కాఁడె?**

**తే.గీ. వడుగగుచు నేల మూడజ్జలడిగి బలిని**
**దఱిమివైచిన దిట్ట యీతండె కాఁడె?**
**గం(డగొడ్డలి దాలిచి కడఁగి రాచ**
**పిండు నడిచిన ప్రోడ యీతండె కాఁడె? 465**

మీను మేను ఊని = మత్స్యావతారము దాల్చి, ప్రామిన్కు = వేదములను, తెక్కలికానిన్ = దొంగిలించిన సోమకాసురుని, చెండిన = చంపిన, బలియుండు ఇతండె కాడె? తాబేటి మే ఎత్తి = కూర్మావతారము ఎత్తి, తరి కొండన్ = అమృతము చిలకడానికి కవ్వమైన మంథర పర్వతమును, వీపున తాల్చిన మేటి ఈతండె కాడె? బలు = గొప్పదైన, కొమ్ము పందియై = ఆదివరాహమయి, పసిడికన్నుల పొలదిండిన్ = హిరణ్యాక్షుని, చీరిన = చంపిన, వేల్పు ఇతండె కాడె? మానిసి సింగమై = నరసింహావతారమై, పూని, బత్తుని వెతల్ = భక్తుని కష్టములను, తలగ ద్రోచిన = పోగొట్టిన, వాడు ఇతండె కాడె? వడుగు అగుచు = వామనావతారుడై, నేల, మూడు అజ్జలు = మూడు అడుగులు, అడిగి, బలిని, తఱిమివైచిన = భూమినుండి పాతాళమునకు తఱిమివేసిన, దిట్ట ఈతండె కాడె? గం(డగొడ్లలి దాలిచి = పరశురామావతారుడై, కడగి = పూనుకొని, రాచపిండున్ = రాజ సమూహమును, అడిచిన = సంహరించిన, ప్రోడ = సమర్థుడు, ఈతండె కాడె?

**తా :** మత్స్యావతారమున వేదములు దొంగిలించిన సోమకాసురుని చంపిన బలవంతుడితడే!, కూర్మావతారమున మంథర పర్వతమును వీపున మోసినదితడే! వరాహావతారమున హిరణ్యాక్షుని చంపినదితడే! నరసింహావతారమున భక్తుని కష్టములను పోగొట్టినదితడే! వామనావతారమున మూడడుగులడిగి బలిని పాతాళమునకు తఱిమిన దిట్టయితడే! పరశురాముడై రాజసమూహమును సంహరించిన సమర్థుడూ యితడే!

**కం. విను మిపుడు నిన్నుఁ దునుమగఁ**
**బనివడి యీరైదు తేర్ల బల్లిదునకు లా**
**వెనయంగ రాముఁడై యే**
**పునఁ బొడమిన వాఁడితండు పొలదిండిదొరా! 466**

పొలతిండి దొరా = రాక్షస రాజా!, వినుము ఇపుడు, నిన్నున్ దునుమగన్ = నిన్ను చంపుటకు, పనివడి = సిద్ధపడి, ఈరైదు తేర్ల బల్లిదునకు = దశరథునకు, లావు ఎనయంగ = శక్తి అతిశయింపగా, రాముడై, ఏపున = పరాక్రమముతో, పొడమినవాడు = పుట్టినవాడు, ఇతండు.

**తా :** రాక్షసరాజా! విను, ఇప్పుడు నిన్ను చంపుటకు సిద్ధపడి దశరథునకు శక్తియుతుడై రాముడై శౌర్యముతో పుట్టినవాడితడు.

**కం. కావునఁ గొంకక నీవా**
**దేవర దేవేరి నొసఁగి తెలివి నడవికిన్**

**వే వెలువడు ముసురులతోఁ**
**జేవ దిగంద్రోచి తపసి సింగమ వగుచున్** **467**

కావునన్, కొంకక = సందేహించక, నీవు, ఆ దేవేరిన్ = ఆ సీతను, ఒసగి = ఇచ్చి, చేవన్ దిగంద్రోచి = పౌరుషమును విడిచిపెట్టి, తపసి సింగమవు అగుచున్ = మునిశ్రేష్ఠుడవగుచు, ఉసురులతో = ప్రాణములతో, తెలివిన్ = జ్ఞానవంతుడవై, అడవికిన్ = అరణ్యమునకు, వే వెలువడుము = తొందరగా బయటపడుము.

**తా :** కావున సందేహించక నువ్వు ఆ సీతను ఇచ్చి తెలివిగా పౌరుషాన్ని ప్రక్కనపెట్టి ముని శ్రేష్ఠుడవవుతూ ప్రాణాలతో అడవికి వెంటనే వెళ్ళుము.

**ఆ.వె.** **మొదలిసిరియు పంటముగుద గాదిలిపట్టి**
**యగుచుఁ బొడమె నట్టి జగము తాయిఁ**
**దెచ్చి యింత కీడు దెచ్చితి వింక న**
**మ్మగువ నడుగుకొనుము మనుపుమనుచు** **468**

మొదలి సిరియు = ఆదిలక్ష్మియును, పంటముగుద = భూదేవికి, గాదిలిపట్టియగుచున్ = ప్రియ పుత్రికయగుచు, పొడమెను = పుట్టెను, అట్టి = అటువంటి, జగము తాయిన్ = జగన్మాతను, తెచ్చి ఇంత కీడు తెచ్చితివి, ఇంకన్, ఆ మగువన్ = ఆ సీతాదేవినే, మనుపుము అనుచు = బ్రతికించుమని, అడుగుకొనుము.

**తా :** ఆదిలక్ష్మియును (సీత) భూదేవికి ప్రియపుత్రికగ జన్మించెను. అట్టి జగన్మాతను తెచ్చి ఇంత కీడు తెచ్చితివి. ఇంక ఆ సీతాదేవినే బ్రతికించుమని వేడుకొనుము.

**ఉ.** **కాలికిఁ గేలు సాఁచి యుడిగంబున మ్రొక్కుము రాచమిన్న యి**
**ల్లాలికి నాడెమైన జవరాలికి, దోసపు నీరుదాల్పు పెన్**
**గాలికి, జోగికూటువ నిగారపు డెందపుఁదమ్మి జంట ము**
**క్కాలికి మేర మీఱెడు జగంబుల మేలికి నేలచూలికిన్** **469**

రాచమిన్న ఇల్లాలికి = రాముని భార్యకి, నాడెమైన జవరాలికి = పతివ్రతకి, దోసపు = పాపములనెడి, నీరుతాల్పు = మేఘములకు, పెన్ గాలికి = పెనుగాలియైన దానికి, జోగి కూటువ = యోగిబృందపు, నిగారపు = ప్రకాశించు, డెందపున్ తమ్మి = హృదయపద్మములకు, జంటముక్కాలికి = తుమ్మెదయైన దానికి, మేరమీఱెడు = హద్దులు లేని, జగంబుల మేలికి = లోక శ్రేష్ఠురాలైన దానికి, నేలచూలికిన్ = సీతాదేవికి, కాలికిన్ = కాళ్ళకు, కేలు చాచి = చేతులు చాచి, ఉడిగంబున = దాస్యభావముతో, మ్రొక్కుము = నమస్కరించుము.

**తా :** రాముని భార్యకి, పతివ్రతకి, పాపములనే మేఘములకు పెనుగాలియైనదానికి, యోగిబృందపు హృదయపద్మములకు తుమ్మెదయైనదానికి, మేరమీఱిన లోక శ్రేష్ఠురాలైన దానికి, సీతాదేవికి కాళ్ళకు చేతులు చాచి దాస్యభావముతో నమస్కరింపుము.

**ఆ.వె.** **దీవితేఁడ! మయుడు సావును ముదిమియుఁ**
**గలుగకుండునట్లుగా నొనర్చె**

**నట్టు లగుటఁజేసి యకట! నీతో సొద**
**సేరఁబోల దేమిసేయుదాన?** **470**

దీవిఱేడ = లంకాధిపతీ!, మయుడు = మా తండ్రి, చావును ముదిమియు కలుగకుండున్ అట్లుగా ఒనర్చెన్, అట్టులు అగుటన్ చేసి = ఆ కారణమున, అకట!, నీతో సొద = నీతో చితిమంటను, చేరన్ పోలదు = చేరుట కుదరదు, ఏమి చేయుదాన?

**తా :** లంకాధిపతీ! మా తండ్రి మయుడు చావు, ముదిమి కలుగకుండునట్లుగా ఒనర్చెను. అట్లగుటచేసి అకట! నీతో అగ్నిని చేరుట కుదరదు. ఏమి చేయుదాన?'

**తే.గీ.** **అనుడు గారాబురాణి నూరార్చుకొనుచు**
**రావణుఁడు పల్కెఁ గటకటా! పూవుబోఁడి!**
**తోడఁబుట్టులఁ గొడుకుల దొరల బంట్లఁ**
**బోరిలోఁ ద్రోచి యిఁక నెమ్మిఁ గోరఁజనునె?** **471**

అనుడు = అనగా, గారాబురాణిన్ = ప్రియపత్నిని, ఊరార్చుకొనుచు = ఊరడించుచు, రావణుడు పల్కెన్, కటకటా = అయ్యో!, పూవుబోడి = పూవువలె మృదువైన దేహము కలదానా!, తోడబుట్టులన్ = సోదరులను, కొడుకుల, దొరల = వీరులను, బంట్లన్, పోరిలో త్రోచి = యుద్ధరంగమునకు పంపి, ఇకన్ = ఇంక, నెమ్మిన్ = నా క్షేమమును, కోరచనునె = కోరుట తగునా?

**తా :** అనగా పత్నిని ఊరడించుచు రావణుడు 'అయ్యో! పూవుబోడి! సోదరులను, కొడుకులను, వీరులను,సైనికులను యుద్ధమునకు పంపి ఇంక నా క్షేమమును కోరుటతగునా?

**కం.** **మలగొంగ మొదలుగల వే**
**ల్పుల నందఱ బాఱ దఱిమి లోఁగని కడిమిన్**
**దలరు కొడు కింద్రజిత్తుడు**
**వొలిసినచో రాచఠీవి పొలుపేమిటికన్** **472**

మలగొంగ = పర్వతములశత్రువు ఇంద్రుడు, మొదలుకల = మొదలైన, వేల్పులను అందఱ, పాఱ తఱిమి = తరిమికొట్టి, లోగని కడిమిన్ = లొంగని పరాక్రమముతో, తలరు = ఒప్పునట్టి, కొడుకు ఇంద్రజిత్తుడు, పొలిసినచోన్ = మరణింపగా, రాచఠీవి పొలుపు = రాచవైభవపు గొప్ప, ఏమిటికిన్ = ఎందుకు?

**తా :** ఇంద్రుడు మొదలైన దేవతలనందరిని తఱిమికొట్టి లొంగని పరాక్రమముతో ఒప్పు కొడుకు ఇంద్రజిత్తు మరణించగా రాజవైభవపు గొప్ప ఎందుకు?

**కం.** **విడువక తపసుల నెల్లం**
**గడు గలచితి మున్ను చలము గదురగ నిపుడా**
**జడదారులలో దూఱిన**
**బడతీ! కనుగొన్నవారు పకపక నగరే?** **473**

పడతీ = ఓ మందోదరీ!, చలము కదురగన్ = పట్టుపట్టి, మున్ను = ఇంతకు ముందు, విడువక తపసులను ఎల్లన్ కడు, కలచితి = బాధించితిని, ఇపుడు, ఆ జడదారులలో దూఱిన = ఆ

మునీశ్వరులతో కూడిన, కనుగొన్నవారు = చూచినవారు, పకపక, నగరే?

**తా :** ఓ మందోదరీ! పట్టుపట్టి ఇంతకుముందు విడువక మునులనెల్లను మిక్కిలి బాధించితిని. ఇపుడు నేను ఆ మునీశ్వరులలో దూఱితే చూచినవారు పకపక నవ్వరా?

**సీ. జముదాడి నుడుగక జముదాడి యుడిపించి**
**గుదియ నేఱులతేనిఁ గుదియఁ బెట్టి**
**వింటగాడుపు సొంపు వింట నంటఁగఁ జేసి**
**గండ్రగొడ్డట నగ్గి గండడంచి**
**మొనల కైదువు బూచి మొనలవానిఁ గలంచి**
**తులువ కత్తిని సోఁకుఁ దులువనొంచి**
**వంకిలిబ్బిదొర లా వంకిలి నొందించి**
**కొంగవాలునఁ గట్లగొంగ గెలిచి**

**తే.గీ. ఎందునెనలేని కడిమిఁ జెన్నొంది జగము**
**లెల్ల బలితంపు ఠీవుల నేలుచుండు**
**నట్టి యే నొక మానిసి నకట! యెట్లు**
**గావుమని వేడుకొనువాఁడ దీవఁబోఁడి! 474**

తీవబోడి = తీగవంటి దేహముదానా!, జము దాడి = యమునితో యుద్ధమున, ఉడుగక = వెనుకడుగు వేయక, జముదాడిన్ = పొడవైన కత్తులతో పోరి, ఉడిపించి = అణచి, ఏఱుల ఱేనిన్ = వరుణుని, గుదియన్ = గదతో, కుదియన్ పెట్టి = క్రుంగదీసి, గాడుపు = గాలియొక్క, సొంపు = సొగసును, వింటన్ = ధనుస్సుతో, వింటన్ అంటగ చేసి = ఆకాశమునకు హత్తుకునేలా చేసి, గండ్రగొడ్డటన్, అగ్గి = అగ్నిదేవుని, గండు = పరాక్రమమును, అడంచి = తొలగించి, మొనల కైదువు = త్రిశూలముతో, బూచిమొనలవానిన్ = భూతములు సైన్యముగాకల ఈశానుని, కలంచి = కలతపెట్టి, తులువకత్తిని = వంపుకత్తితో (చంద్రహాసం), సోకుతులువన్ = దుష్ట రాక్షసుడగు నైరృతిని, ఒంచి = లొంగదీసి, వంకి = కొంకికత్తితో, లిబ్బిదొర = కుబేరుని, లావు = బలమును, అంకిలినొందిచి = నిరోధించి, కొంగవాలునన్ = చర్మకారునికత్తితో, గట్లగొంగన్ = పర్వతముల శత్రువగు ఇంద్రుని, గెలిచి, ఎందున్ ఎనలేని = సాటిలేని, కడిమిన్ = ధైర్యముతో, చెన్నొంది = అతిశయించి, జగములు ఎల్లన్ = లోకములనన్నిటిని, బలితంపు ఠీవులన్ = తేజోవైభవముతో, ఏలుచుండునట్టి = పరిపాలించుచుండునట్టి, ఏను = నేను, ఒక మానిసిని = ఒక మానవుణ్ణి, అకట = అయ్యో!, కావుమని = రక్షింపుమని, ఎట్లు వేడుకొనువాడ = ఎట్లు ప్రాధేయపడగలను?

**తా :** ఓ మందోదరీ! యమునితో యుద్ధమున వెనుకడుగేయక పెద్ద కత్తులతో పోరి ఓడించి, వరుణుని గదతో క్రుంగదీసి, గాలి సొగసును ధనుస్సుతో ఆకాశమునకు హత్తు కునేలా చేసి, గండ్రగొడ్డలితో అగ్ని పరాక్రమము నణచి, త్రిశూలముతో ఈశానుని కలత పెట్టి, తులువ కత్తితో నైరృతిని లొంగదీసి, బాకుతో కుబేరుని బలమును కలతచెందించి, వంకరకత్తితో ఇంద్రుని

గెల్చి ఎక్కడా భయమెరుగని ధైర్యముతో అతిశయించి లోకముల నన్నిటిని తేజోవైభవముతో ఏలుచుండునట్టి నేను ఒక మానిసిని అయ్యో! రక్షింపుమని ఎట్లు ప్రాధేయపడగలను?

**ఆ.వె. ఇంత చెప్పనేల? యెఱుఁగుదు రాముఁడు**
**మొదలి వెన్నుఁ డగుట ముగుద! యెపుడుఁ**
**జెడని మేలుఁగోరి కడఁగితి నతనితో**
**జగడమునకు నింక వగవవలదు 475**

ఇంత చెప్పనేల = ఇంతగా చెప్పుట ఎందులకు?, ముగుద = ఓ కాంతా!, రాముడు, మొదలి వెన్నుడగుట = ఆది విష్ణువు అని, ఎఱుగుదు, ఎపుడున్ చెడని = శాశ్వతముగా నిలిచే, మేలున్ = హితమును (మోక్షమును), కోరి, అతనితోన్, జగడమునకు = యుద్ధమునకు, కడగితి = సిద్ధపడితిని, ఇంక, వగవవలదు = దు:ఖింపవలదు.

**తా :** ఇంత చెప్పనేల? ఓ కాంతా! రాముడు ఆదివిష్ణువని ఎఱుగుదును. శాశ్వతముగా నిలిచే మోక్షమును కోరి అతనితో యుద్ధమునకు సిద్ధపడితిని. ఇంక దుఃఖింపవలదు.

**తే.గీ. ఇంతి! యా మీఁద మేల్చిన్నె లెడలి నీవు**
**దమ్మి చెలికాఁడు లేని నెత్తమ్మివోలె**
**గలువరాయనిఁ బాసిన కలువవోలె**
**నుండుమనుటయు సిబ్బితి నూరకుండె 476**

ఇంతి = ఓ మందోదరీ!, ఆ మీద = నా అనంతరము, మేలు చిన్నె = శుభ చిహ్నములు, ఎడలి = పోయి, నీవు, తమ్మి చెలికాడు లేని = సూర్యుడు లేని, నెత్తమ్మివోలె = పద్మమువలె, కలువరాయనిన్ = చంద్రుని, బాసిన = విడిచిన, కలువవోలె = కలువవలె, ఉండుమనుటయు, సిబ్బితిన్ = మందోదరి సిగ్గుతో, ఊరకుండె.

**తా :** ఓ మందోదరీ! నా అనంతరము శుభచిహ్నములు పోయి నీవు సూర్యుడు లేని పద్మమువలె, చంద్రుని బాసిన కలువవలె ఉండుమనగా మందోదరి సిగ్గుతో ఊరకుండెను.

**సీ. అంతట సోఁకుఱేఁ డసమున మోసల**
**కేతెంచి జోదుల నెల్లఁ బిలిచి**
**పది దెస లద్రువంగ బయనంపు బేరి వ్రే**
**యించి మేల్రవణంబు లెలమిఁ దాల్చి**
**కరవాలు మొదలగు కైదువల్గొని పది**
**యాఱు కుండలు జంట నూఱువేల**
**నూఱులగంటలు నూఱుపదుల్మేలి**
**తత్తడు లెల్లుతో ల్మత్తళమ్ము**

**తే.గీ. తిగ సిడంబులు గల పైడిఁతేరుఁ గడఁక**
**నెక్కి యెల్లులు జిల్లు లెల్లెడల మెఱయ**

**నరదము ల్మావు లేనుఁగు ల్బిరుదు మగలు**
**గ్రమ్ముకొని రాఁగఁ బోరికిఁ గదలి చనియె** **477**

అంతట, సోకుఱేడు = రాక్షసరాజు, అసమునన్ = దర్పముతో, మోసలకు ఏతెంచి = మొగసాలకు వచ్చి, జోదులను ఎల్లన్ పిలిచి, పది దెసలు, అద్రువంగన్ = అదరునట్లుగ, పయనంపు బేరి = ప్రయాణ భేరీని, వ్రేయించి = వేయించి, మేలు రవణంబులు = మేలగు భూషణములు, ఎలమిన్ = ప్రీతితో, తాల్చి = ధరించి, కరవాలు మొదలగు, కైదువలు = ఆయుధములు, కొని, పదియాఱు కుండలు = 16 కలశములు, జంట నూఱువేల నూరుల గంటలు = రెండు కోట్ల గంటలు, నూఱు పదుల్ = వేయి, మేలి తత్తడులు = మేలుజాతి గుఱ్ఱములు, ఎల్గు తోలు కత్తళమ్ము = ఎలుగుబంటి చర్మముతో చేయబడిన కవచము, తిగ సిడంబులు కల = మూడుపతాకలు కల, పైడి తేరు = బంగరు రథమును, కడకన్ = పూనికతో, ఎక్కి, ఎల్లులు = ఛత్రములు, జల్లులు = చామరములు, ఎల్లెడలన్ = అన్ని దిక్కులయందు, మెఱయన్ = ప్రకాశింపగా, అరదములు = రథములు, మావులు = గుఱ్ఱములు, ఏనుగుల్ = ఏనుగులు, బిరుదు మగలు = వీర శ్రేష్ఠులు, క్రమ్ముకొని = ఆశ్రయించి, రాగన్ = వచ్చుచుండగా, పోరికిన్, కదలి చనియె = బయలుదేరెను.

**తా :** అంతట రావణుడు దర్పముతో మొగసాలకు వచ్చి యోధులనందఱను పిలిచి పది దిక్కులు అదరునట్లుగా ప్రయాణ భేరీ వేయించి, మేలగు భూషణములు ప్రీతితో ధరించి, కత్తి మొదలగు ఆయుధములు తీసుకొని, 16 కలశములు, రెండు కోట్ల గంటలు, వేయి గుఱ్ఱములు, ఎలుగు చర్మముతో చేసిన కవచము, మూడు పతాకలుకల బంగారు రథము ఎక్కి ఛత్రములు, చామరములు అన్ని దిక్కులా ప్రకాశింపగా రథములు, గుఱ్ఱములు, ఏనుగులు, వీర శ్రేష్ఠులు క్రమ్ముకొని రాగా యుద్ధమునకు బయలుదేరెను.

**ఆ.వె.** **అపుడు ఖడ్గరోముఁ డగ్నివర్ణుఁడు సర్ప**
**రోముఁడును గడింది యామతోడ**
**వెలుఁగుచున్నయట్టి వృశ్చికరోముండు**
**దరలి రతనిఁ గూడి కఱకు మీఱ** **478**

అపుడు ఖడ్గరోముడు, అగ్నివర్ణుడు, సర్పరోముడును, కడింది = మిక్కిలి, ఆముతోడన్ = మదముతో, వెలుగుచున్నయట్టి = ఒప్పుచున్నటువంటి, వృశ్చికరోముడు, కఱకు మీఱన్ = మిక్కిలి క్రూరత్వముతో, అతని గూడి తరలిరి.

**తా :** అపుడు ఖడ్గరోముడు, అగ్నివర్ణుడు, సర్పరోముడును, మిక్కిలి మదముతో ఒప్పుచున్న టువంటి వృశ్చికరోముడు మిక్కిలి క్రూరత్వముతో అతని గూడి తరలిరి.

**కం.** **అటులేఁగిన తొలివేలుపు**
**తుటుములఁ బొడఁగాంచి కోఁతిదొర లందఱు మి**
**క్కుటమగు బీరముతో నొ**
**క్కొటఁ దొడరిరి చెట్లుఁ బట్లుఁ గొండలుఁ గొనుచున్** **479**

అటులు ఏగిన = ఆ విధంగా యుద్ధభూమికి వెళ్ళగా, తొలివేలుపు తుటుములన్ = రాక్షస సమూహములను, పొడగాంచి = చూచి, కోతి దొరలు అందఱు, మిక్కుటమగు = అధికమైన, బీరముతో = పరాక్రమముతో, ఒక్కొటన్ = అందరూ ఒక్కసారిగా, చెట్లు, పట్లున్ = రాళ్ళను, కొండలున్, కొనుచున్ = తీసుకొనుచు, తొడరిరి = సిద్ధపడిరి.

**తా :** ఆ విధముగా యుద్ధభూమికి వెళ్ళగా రాక్షస సమూహములను చూచి వానరులందఱు అధికమైన పరాక్రమముతో ఒక్కసారిగా చెట్లు, రాళ్ళు, కొండలు తీసుకొనుచు సిద్ధపడిరి.

**సీ. మొదటి జేజేబంటు లుదుట మీఱఁగ వారిఁ**
**బొదివి చే యీఁటెలఁ బొడిచి ద్రుడ్ల**
**మోఁది వంకులఁ గ్రుమ్మి ములుకుల నొంచి బ**
**ల్లెములఁ గూలిచి యడిదముల నఱికి**
**గుదియల సురియల గొడ్డండ్ల సబిడీల**
**సుడి కైదువులఁ దెంపు సడలఁజేసి**
**మావులఁ దోలి నెమ్మది జెండుబెండాడి**
**బలు హజ్జ మెకములఁ బఱపి తఱిమి**

**తే.గీ. నెత్తురుల హత్తుకొల్పిన నెరయఁ గినిసి**
**కోన ద్రిమ్మరి బిరుదు లక్కూళరేయి**
**ద్రిమ్మరులఁ జుట్టుముట్టి చలమ్ము మెఱయ**
**మలలు ద్రాఁకులుఁ బడుకులుఁ జెలగి వైచి** **480**

మొదటి జేజే బంటులు = రాక్షస వీరులు, ఉదుట మీఱగ = మిక్కిలి ఔద్ధత్యముతో, వారిన్ పొదివి = ఆ వానరులను ఆక్రమించి, చే ఈటెలన్ = బల్లెములతో, పొడిచి, ద్రుడ్ల = దుడ్డులతో, మోది = బాది, వంకులన్ = బాకులతో, క్రుమ్మి = పొడిచి, ములుకులన్ = బాణములతో, నొంచి = బాధించి, బల్లెములన్, కూలిచి = చంపి, అడిదములన్ = కత్తులతో, నఱికి, గుదియలన్ = గదలతో, సురియలన్ = చురకత్తులతో, గొడ్డండ్లన్, సబిడీలన్ = ఈటెలతో, సుడి కైదువులన్ = చక్రములతో, తెంపు సడలచేసి = ధైర్యమును పోగొట్టి, మావులన్ = గుఱ్ఱములను, తోలి = వానరులపైకి తోలి, నెమ్మది = ఉత్సాహముతో, చెండుబెండాడి = ఖండ ఖండములుగా చేసి, బలు హజ్జ మెకములన్ = పెద్ద పాదములుగల ఏనుగులను, పఱపి = నడపి, తఱిమి = వానరులను తఱిమికొట్టి, నెత్తురుల = రక్తధారలు, హత్తుకొల్పిన = వ్యాపింప చేసిన, నెరయన్ = మిక్కిలి, కినిసి = కోపించి, కోన ద్రిమ్మరి బిరుదులు = వానర వీరులు, ఆ కూళ రేయి ద్రిమ్మరులన్ = ఆ నీచులైన రాక్షసులను, చుట్టుముట్టి = ఆక్రమించి, చలమ్ము మెఱయన్ = మిక్కిలి పట్టుదలతో, మలలు = కొండలు, ద్రాకులున్ = చెట్లు, పడుకులున్ = రాళ్ళను, చెలగి = రెచ్చిపోయి, వైచి = వేసి.

**తా :** రాక్షసులు మిక్కిలి ఔద్ధత్యముతో ఆ వానరుల నాక్రమించి ఈటెలతో పొడిచి, దుడ్డులతో బాది, బాకులతో పొడిచి, బాణములతో బాధించి, బల్లెములతో చంపి, కత్తులతో నఱికి, గదలతో,

సురియలతో, గొడ్డళ్ళతో, సబిడీలతో, చక్రములతో ధైర్యమును పోగొట్టి, గుఱ్ఱములను వానరులపైకి తోలి ఉత్సాహంతో చెండుబెండాడి, ఏనుగులను నడపి వానరులను తఱిమికొట్టి రక్తధారలు వ్యాపింపచేసిన మిక్కిలి కోపించిన వానర వీరులు ఆ నీచులైన రాక్షసులను ఆక్రమించి పట్టుదలతో కొండలు, చెట్లు, రాళ్ళతో రెచ్చిపోయి వేసి –

**కం.** **చఱచియు గ్రుద్దియుఁ దాచియుఁ**
**గఱచియుఁ జీరియుఁ గడిందిగాఁ దోఁకల ను**
**క్కఱ మోఁదియు మట్టియు నం**
**దఱఁ బుడమిం గూల్చి రంపు దళుకొత్తంగన్** **481**

చఱచియు, గ్రుద్దియు, తాచియు = తన్నియును, కఱచియు, చీరియు = రక్కియును, కడిందిగా = గట్టిగా, తోకలన్, ఉక్కు అఱన్ = రాక్షసులగర్వము తగ్గునట్లుగా, మోదియున్, మట్టియున్ = కాళ్ళతో త్రొక్కియును, అంపుతళుకొత్తంగన్ = సంబరము వెల్లడియగునట్లుగా, అందఱన్ పుడమిం కూల్చిరి.

**తా :** చఱచియు, గ్రుద్దియు, తాచియు, కఱచియు, చీరియు, తోకలతో రాక్షసుల గర్వము తగ్గునట్లుగా గట్టిగా మోదియు, కాళ్ళతో తొక్కియును సంబరముగా అందఱిని నేలకూల్చిరి.

**సీ.** **తలలు తాఁబేళ్ళు చేతులు గాడ్పు మేపరు**
**లెముకలు మీలు గుఱ్ఱములు తరఁగ**
**లరదము ల్కలములు నరము లెఱ్ఱలు వెంట్రు**
**కలు నాఁచుదీవ ప్రేవులు నెగళ్ళు**
**మొండెముల్ మొసళులు కండలు కప్పలు**
**మెద దస లేనుంగు పదవుదీవు**
**లెల్లులు నురువులు నల్ల నీళ్ళు గయాళి**
**బూచుల యార్పు లబ్బురపు రొదలు**
**తే.గీ.** **గాఁగ మున్నీటి కుద్దియై కలను పుడమి**
**దద్దఁ గన్పట్టె నపు డడిదంబు వెంట్రు**
**కల పొలసుదిండి తలకట్టు గాలిచూలి**
**పైఁ గడఁగిన నజ్జగబంటు గినిసి** **482**

తలలు–తాబేళ్ళు, చేతులు–గాడ్పుమేపరులు = పాములు, ఎముకలు–మీలు = చేపలు, గుఱ్ఱములు –తరగలు = కెరటములు, అరదములు–కలములు = ఓడలు, నరములు–ఎఱ్ఱలు = వానపాములు, వెంట్రుకలు–నాచు తీవ = నాచుతీగలు, ప్రేవులు–నెగళ్ళు = జలజంతువులు, మొండెముల్ – మొసళులు, కండలు–కప్పలు, మెదడు–అసలు = బురద, ఏనుంగు పదవు = ఏనుగుల గుంపులు, దీవులు = ద్వీపములు, ఎల్లులు = ఛత్రములు, నురువులు = నురుగులు, నల్ల = రక్తము, నీళ్ళు, గయాళి బూచుల = దుష్ట భూతముల, ఆర్పులు = అరుపులు, అబ్బురపు రొదలు గాగ =

ఆశ్చర్యకరమైన ధ్వనులు కాగా, మున్నీటికి ఉద్దియై = సముద్రమునకు సాటియైనదై, కలను పుడమి = యుద్ధభూమి, తద్దన్ = మిక్కిలిగా, కన్పట్టెన్ = కనబడెను, అపుడు, అడిదంబు వెంద్రుకల పొలసుదిండి తలకట్టు = ఖడ్గరోముడను రాక్షస వీరుడు, గాలిచూలిపైన్ = హనుమంతునిపైకి, కడగిన = పరాక్రమించగా, ఆ జగబంటు = ఆ లోక వీరుడు, కినిసి = కోపించి.

**తా :** యుద్ధభూమి సముద్రమునకు సాటియై తలలు తాబేళ్ళుగ, చేతులు పాములుగ, ఎముకలు చేపలుగ, గుఱ్ఱములు తరగలుగ, రథములు ఓడలుగ, నరములు వానపాములుగ, వెంట్రుకలు నాచుతీగలుగ, ప్రేవులు జలజంతువులుగ, మొండెములు మొసళ్ళుగ, కండలు కప్పలుగ, మెదడు బురదగ, ఏనుగులు ద్వీపములుగ, ఛత్రములు నురుగులుగ, రక్తము నీళ్ళుగ, పిశాచముల కేకలు సముద్ర ఘోషగా కనబడెను. అపుడు ఖడ్గరోముడను రాక్షసుడు ఆంజనేయునిపై తిరుగబడి విక్రమింప హనుమ కోపించి.

**తే.గీ.** **వానిపైఁ బేర్మి నుఱికిన వాఁడి యలుగు**
**వెంట్రుకలు గాఁడుటయు నల్ల వెల్లి విరియ**
**సొమ్మగొని కొంతసేపున కుమ్మలిక ద**
**నర్పఁ దెప్పరి యతఁడు పెన్లావు మెఱయ** **483**

వానిపైన్, పేర్మిన్ = మిక్కిలి కోపముతో, ఉఱికిన, వాడి = ఆ ఖడ్గరోముని, అలుగు వెంట్రుకలు = కత్తులవంటి వెంట్రుకలు, గాడుటయు = శరీరమును చీల్చుటయు, నల్ల వెల్లివిరియ = రక్తము ప్రవహింపగా, సొమ్మగొని = సొమ్మసిలి, కొంతసేపునకు, తెప్పరి = తెప్పరిల్లి, ఉమ్మలిక తనర్ప = బాధ కలిగి, అతడు, పెను లావు మెఱయ = మిక్కిలి శక్తి ప్రకాశింపగా –

**తా :** వానిపై కోపముతో ఉఱికిన, ఆ ఖడ్గరోముని కత్తులవంటి వెంట్రుకలు శరీరమును చీల్చగా రక్తము ప్రవహించి సొమ్మసిలి కొంతసేపునకు తెప్పరిల్లి బాధకలిగి హనుమ మిక్కిలి శక్తి ప్రకాశింపగా–

**ఆ.వె.** **కొండ యొకటి బెఱికి గొబ్బున వానిపై**
**వ్రేయ నది కడింది వెలయ బెక్కు**
**తునియలగుచు రాలె దులువ తొల్వేలుపు**
**మేలు బంతి కఱకు మేను సోకి** **484**

కొండ ఒకటి, పెఱికి = పీకి, గొబ్బున = శీఘ్రముగా, వానిపై వ్రేయన్, అది = ఆ కొండ, కడింది వెలయన్ = కష్టము కలిగించగా, తులువ = నీచుడైన, తొలి వేలుపు మేలు బంతి = రాక్షసులలో శ్రేష్ఠుని, కఱకు మేను = కఠినమైన శరీరము, సోకి = తాకి, పెక్కు తునియలు అగుచు రాలె.

**తా :** కొండ ఒకటి పెఱికి శీఘ్రముగా ఆ ఖడ్గరోమునిపై వేయగా అది కష్టము కలిగింపగా నీచుడైన ఆ నీచుని శరీరమును తాకి పెక్కు తునియలై రాలెను.

**కం.** **అమ్మల వమ్మయి చనుట ది**
**రమ్ముగ బొడగాంచి కోతిరాయడు గడిమిం**
**గ్రమ్మఱ నొక గట్టొ రే**
**ద్రిమ్మరి పై నేసి జముని తెంకికి బనిచెన్** **485**

ఆ మల = ఆ కొండ, వమ్మయి చనుట = వ్యర్థమయి పోవుట, తిరమ్ముగ = నిశ్చయముగా, పొడగాంచి = చూచి, కోతిరాయడు = హనుమంతుడు, కడిమిన్ = సాహసముతో, క్రమ్మఱన్ = మరల, ఒక గట్టు = ఒక కొండను, ఆ రే త్రిమ్మరి పైన్ = ఆ రాక్షసునిపై, ఏసి = వేసి, జముని తెంకికి = యమాలయమునకు, పనిచెన్ = పంపెను.

**తా :** ఆ కొండ వ్యర్థమయిపోవుట నిశ్చయముగా చూచి హనుమ సాహసముతో మరల ఒక కొండను ఆ రాక్షసునిపై వేసి యమాలయమునకు పంపెను.

**కం.** **విసదారి వెంట్రుకల ర**
**క్కసుఁ డస మెలయంగఁ గోఁతి గములఁ దఱుమఁగా**
**వెసగాంచి వాలి గాదిలి**
**నిసుఁ గాతనిఁ దాఁకి కేల నెవ్వడి ననిచెన్** **486**

విసదారి వెంట్రుకల రక్కసుడు = సర్పరోముడు, అసము = ఉద్ధతి, ఎలయంగన్ = అతిశయింపగా, కోతి గములన్ = కోతి గుంపులను, తఱుమగా, వెస = వెంటనే, కాంచి = చూచి, వాలి గాదిలి నిసుగు = అంగదుడు, ఆతని తాకి = ఆతని నెదిరించి, కేల = చేతితో, నెవ్వడిన్ = మిక్కిలి గట్టిగా, అనిచెన్ = కొట్టెను.

**తా :** సర్పరోముడు ఉద్ధతి అతిశయింపగా కోతిగుంపులను తఱుమగా వెంటనే కాంచి అంగదుడు అతని నెదిరించి చేతితో మిక్కిలి గట్టిగా కొట్టెను.

**తే.గీ.** **అడచుటయు వాఁడు వెంద్రుక పడగ దాల్పు**
**చాల్పు నెమ్మోము బొఱియ విసపు గడింది**
**యింగలపుమంట లాకసం బెల్లఁ బొదువ**
**నదరి కడునార్చి యతని బిట్టడల నేసె** **487**

అడచుటయున్ = కొట్టగా, వాడు వెంద్రుక పడగ తాల్పు = ఆ సర్పరోముడు, చాల్పు నెమ్మోము = వరుస తలలు కలిగిన, బొఱియ విసపు = ఆదిశేషుని వలె, కడింది = మిక్కిలి, ఇంగలపు మంటలు = అగ్నిజ్వాలలు, ఆకసంబు ఎల్లన్ = ఆకాశమంతయు, పొదువన్ = వ్యాపింపగా, అదరి = అతిశయించి, కడున్ ఆర్చి = గట్టిగా అరచి, అతని = ఆ అంగదుని, బిట్టు = మిక్కిలి, అడల చేసె = భయపెట్టెను.

**తా :** కొట్టగా ఆ సర్పరోముడు ఆదిశేషునివలె అగ్నిజ్వాలలు ఆకాశమంతయు వ్యాపింపగా అతిశయించి గట్టిగా అరచి ఆ అంగదుని మిక్కిలి భయపెట్టెను.

**కం.** **అది సైరింపక యంగదుఁ**
**డెదఁ గొఱకొఱ నిగుడవాని నేచిన బలిమిన్**
**బొదివి నడునెత్తిఁ బిడికిట**
**నొదుఁగక పఱియలుగఁబొడిచి యుసురులఁ బాపెన్** **488**

అది సైరింపక = దానిని సహించక, అంగదుడు, ఎదన్ = మనమున, కొఱకొఱ నిగుడ = కోపము వ్యాపింపగా, వానిని = ఆ సర్పరోముని, ఏచిన = అధికమైన, బలిమిన్ = శక్తితో, పొదివి =

ఆక్రమించి, నడునెత్తిన్, పిడికిటన్, ఒదుగక = తగ్గక, పఱియలుగ = ముక్కలగునట్లుగ, పొడిచి, ఉసురుల బాపెన్ = ప్రాణములు తీసెను.

**తా :** దానిని సహింపక అంగదుడు మనమున కోపము వ్యాపింపగా ఆ సర్పరోముని అధికమైన శక్తితో ఆక్రమించి నడునెత్తి ముక్కలగునట్లుగ పిడికిట పొడిచి చంపెను.

**ఆ.వె. నీలు దంత గఱకు తేలు వెంద్రుకల రా**
**కాసి బంటు బొదివి కడిమి నొక్క**
**కడిమి పెఱికివైచి మడిపె జేజేలు మి**
**న్నున జెలంగి కనుగొనుచు బొగడగ 489**

అంతన్, నీలుడు, కఱకు = కఠినమైన, తేలు వెంద్రుకల రాకాసి బంటున్ = వృశ్చికరోముడను రాక్షసవీరుని, పొదివి = ఆక్రమించి, కడిమిన్ = ధైర్యముతో, ఒక్క కడిమిన్ = ఒక కడిమిచెట్టును, పెఱికివైచి = పెకలించి, మిన్ననన్ = ఆకాశమున, జేజేలు = దేవతలు, కనుగొనుచు = చూచుచు, చెలంగి = విజృంభించి, పొగడగ, మడిపె = చంపెను.

**తా :** అంత నీలుడు కఠినమైన వృశ్చికరోముని ఆక్రమించి ధైర్యముతో ఒక కడమిచెట్టును పెకలించి ఆకాశమున దేవతలు చూచుచు విజృంభించి పొగడగ చంపెను.

**కం. అపు డగ్గి వన్నె తొలి వే**
**లుపు దన నెమ్మేని మంటలు గడిందిగ గా**
**డుపు తండ్రిఁ బొదువఁ గోఁతి ప**
**దుపుపై నరదంబు నెమ్మితోఁ బఱపుటయున్ 490**

అపుడు, అగ్గివన్నె తొలివేలుపు = అగ్నివర్ణుడను రాక్షసుడు, తన నెమ్మేని = తన దేహమంతయు, మంటలు = అగ్నిజ్వాలలు, కడిందిగ = దట్టముగా, గాదుపు తండ్రి పొదువ = ఆకసమున వ్యాపింపగా, కోతి పదువుపై = వానర సమూహముపై, నెమ్మితోన్ = సంతోషముతో, అరదంబు = రథమును, పఱపుటయున్ = నడపుటయును.

**తా :** అపుడు అగ్నివర్ణుడు తన దేహమంతయు అగ్నిజ్వాలలు దట్టముగా ఆకాశమున వ్యాపింపగా వానరసమూహముపై సంతోషముగ రథమును నడుపుటయును.

**తే.గీ. కొదమ పసిదిండి మెకము గన్గొన్న బుడుత**
**లేడి గమివోలెఁ బికపికలాడుకొనుచు**
**విఱిగి యమ్మూఁక రాముని వెనుకఁ జేరు**
**కొనినఁ గన్గొని యాతఁ డచ్చెనఁటి నెదిరె 491**

కొదమ పసిదిండి మెకము = పులి పిల్లను, కన్గొన్న = చూచిన, బుడుత లేడిగమివోలె = లేడిపిల్లల గుంపువలె, పికపికలు ఆడుకొనుచు = పికపికమని అఱచుచు, విఱిగి = చెదరిపోయి, ఆ మూక = ఆ వానరమూక, రాముని వెనుకన్ చేరుకొనినన్ కన్గొని, ఆతడు = ఆ రాముడు, ఆ చెనటిన్ = ఆ నీచుని, ఎదిరె = ఎదుర్కొనెను.

**తా :** పులి పిల్లను చూచిన లేడిపిల్లల గుంపువలె పికపికలాడుచు చెదరిపోయి ఆ వానర మూక రాముని వెనుకను చేరుకొనిన చూచి రాముడు ఆ నీచుని ఎదుర్కొనెను.

**కం.** **ఎదిరిన వా డరదము వడి**
**గదియంగాఁ ద్రోలి తూపుగము లద్దొరపై**
**గుదులుకొన నేసి వేడిమి**
**వెదచల్లిన నల్గి రాచవెన్నెలతేడున్** **492**

ఎదిరిన = ఎదిరించిన, వాడు = ఆ అగ్నివర్ణుడు, అరదము, వడి = వేగముగా, కదియంగా = రాముని చేరుటకు, త్రోలి = నడపి, తూపు గములు = బాణ సమూహములు, ఆ దొరపై = ఆ రామునిపై, కుదులుకొనన్ = అధికముగా, ఏసి = వేసి, వేడిమి వెదచల్లినన్ = తీక్షణతను ప్రకాశింపచేయగా, అల్గి = కోపించి, రాచవెన్నెలతేడున్ = రాజచంద్రుడును.

**తా :** ఎదుర్కొనిన వాడు రథము వేగముగా రాముని చేరుటకు త్రోలి బాణములు ఆ రామునిపై అధికముగా వేసి తీక్షణత చూపగా రాముడు కోపించి

**మ.** **ఒక క్రొవ్వాఁడి లకోరి సింగిణి నసం బొప్పారఁ గీల్కొల్పి వా**
**ని కయిం గ్రాలెడు విల్లు ద్రుంచి కడిమిన్ వేఱ్వాలు సేకొన్న వే**
**ఱొక బల్లెంబునఁ జెండి ద్రుద్దుగొని పై నుంకించి యేతెంచుచో**
**సెకలీ న్ముల్కి యొకందు వ్రేసి తల ద్రుంచె న్వేల్పు లగ్గింపఁగన్** **493**

ఒక క్రొవ్వాడి = కొత్తగా పదునుపెట్టబడిన, లకోరి = బాణమును, సింగిణిన్ = వింటిని, అసంబు ఒప్పార = ఔద్ధత్యము ప్రకాశింపగా, కీల్కొల్పి = సంధించి, వాని కయిం గ్రాలెడు = వాని చేతిలో ఒప్పుచున్న, విల్లు త్రుంచి, కడిమిన్ = శౌర్యముతో, వేఱు వాలు చేకొన్న = వాడు మరియొక ఆయుధమును తీసుకొనగా, వేఱొక బల్లెంబున = వేరొక బాణముతో, చెండి = ఖండించి, ద్రుద్దుగొని = వాడు ఒక దుడ్డును తీసుకొని, పైన ఉంకించి = పైకి దుముకి, ఏతెంచుచో = వచ్చుచుండగా, సెకలు ఈను = అగ్నిసెగలను పుట్టించు, ముల్కి ఒకందు = ఒక బాణమును, వ్రేసి, వేల్పులు, అగ్గింపగన్ = పొగడగా, తల త్రుంచె = తల ఖండించెను.

**తా :** ఒక వాడియైన బాణమును వింటిని ఔద్ధత్యము ప్రకాశింపగా సంధించి వాని చేతిలోని విల్లు త్రుంచి, వాడు మరియొక ఆయుధమును తీసుకొనగా వేరొక బాణముతో ఖండించి, వాడు దుడ్డును తీసుకొని పైకి దుముకి వచ్చుచుండగా అగ్ని సెగలను పుట్టించు ఒక బాణమును వేసి దేవతలు పొగడగా తల ఖండించెను.

**ఉ.** **ఆ తఱి దీవిఱేఁడు జగమంతయుఁ గాల్పఁ గడంగుచున్న చిం**
**బోతు హుమాయిజోదు నెనఁబోలుచుఁ గన్నుల నిప్పులొల్కఁగా**
**వే తన తేరు రాచననవిల్తుని పజ్జకు డాయఁదోలి యా**
**రాతి కుసు ర్లొసంగిన దొరంగని బింకమెలర్ప నిట్లనున్** **494**

ఆ తఱి = ఆ సమయమున, దీవి ఱేడు = రావణుడు, జగము అంతయు, కాల్పన్, కడంగుచున్న = పూనుకొనుచున్న, చింబోతు హుమాయి జోదున్ = దున్నపోతు వాహనముగాకల వీరుడు

యమునకు, ఎనబోలుచు = సరియగుచు, కన్నుల నిప్పులు, ఒల్కగా = రాలగా, వే = శీఘ్రముగా, తన తేరు, రాచననవిల్తుని పజ్జకు = రాజ మన్మథుని చెంతకు, డాయన్ = చేరునట్లు, తోలి, ఆ రాతికి ఉసుర్లు ఒసంగిన = ఆ రాతికి ప్రాణము పోసిన (అహల్య), దొరన్ = రాముని, కని = చూచి, బింకము ఎలర్పగన్ = మిక్కిలి గర్వముతో, ఇట్లు అనున్.

**తా :** ఆ సమయమున రావణుడు లోకమంతా కాల్చివేయడానికి పూనుకొనుచున్న యమునకు సాటియగుచు కన్నుల నిప్పులు రాలగా వెంటనే తన రథమును రాముని చెంతకు తోలి రాతికి ప్రాణము పోసిన రాముని చూచి మిక్కిలి గర్వముతో ఇట్లనెను.

**ఆ.వె.** **మన్నుతేఁడ! కొంద అన్నువ నంజుదు**
**దిండి బంట్లఁ బోరఁ జెండినాడ**
**నంచు నిక్కె దిపు డొకించుక నా లావె**
**ఱుంగ నేర వెట్టి వెంగలివొకొ?** **495**

మన్నుతేడ = భూమిపాలా!, కొందరు అన్నువ = అల్పులైన, నంజుదుతిండి బంట్లన్ = రాక్షసులను, బోరన్ = యుద్ధమున, చెండినాడనంచు = చంపినానని, ఇపుడు, నిక్కెదు = గర్వపడెదవు, ఒకించుక = కొంచెముకూడా, నా లావు = నా శక్తి, ఎఱుంగనేరవు = తెలియకున్నావు, ఎట్టి వెంగలివి ఒకొ = ఎంత వెఱ్ఱివాడవోకదా!

**తా :** ఓ రామా! అల్పులైన రాక్షసులను యుద్ధమున చంపినానని ఇప్పుడు గర్వపడుతున్నావు. కొంచెంకూడా నా శక్తి తెలియకున్నావు. ఎంత వెఱ్ఱివాడవోకదా!

**చం.** **కలఁచితి వేల్పుఱేని నుడిగంబులఁ బూన్చితి నగ్గి నజ్జమున్**
**గెలిచితి సోఁకుపెద్ద నడఁగించితి వల్లియత్రాడుఁ దాల్పుఁ జి**
**క్కుల బెరయించితిన్ జదలు కుఱ్ఱనిఁ గొట్టితిఁ జాగకాని బూ**
**చులదొరఁ దోలితిన్ మిగుల సొంపున నేలితి ముజ్జగంబులన్** **496**

వేల్పుఱేనిన్, కలచితి = కలతపెట్టాను, అగ్గిన్ = అగ్నిదేవుని, ఆ జమున్ = ఆ యముని, ఉడిగంబుల పూన్చితిన్ = నా దాస్యమునకు వినియోగించితిని, సోకుపెద్దన్ = నైరృతిని, గెలిచితిన్, వల్లియత్రాడు దాల్పున్ = పాశము ధరించిన వరుణుని, అడగించితిన్ = అణచి వేసితిని, చదలు కుఱ్ఱని = వాయుదేవుని, చిక్కులన్ = కష్టములతో, బెరయించి తిన్ = బాధ పెట్టితిని, చాగకానిన్ = కుబేరుని, కొట్టితిన్, బూచులదొరన్ = ఈశానుని, తోలితిన్, మూడు జగంబులన్, మిగుల = మిక్కిలి, సొంపునన్ = అందముగా, ఏలితిన్.

**తా :** ఇంద్రుని కలతపెట్టాను. అగ్నిదేవుని, యముని దాస్యమునకు వినియోగించితిని. నైరృతిని గెలిచితిని. పాశము ధరించిన వరుణుని అణచివేసితిని. వాయుదేవుని కష్టపెట్టితిని. కుబేరుని కొట్టితిని. ఈశానుని తోలితిని. మూడులోకములను అందముగా ఏలితిని.

**తే.గీ.** **ఎల్ల జేజేలఁ గూడి జాబిల్లి తాల్పు**
**గొలుపు కూర్చుండు నవ్వెండి కొండఁ గేలఁ**

**బూలచెండు తెఱంగునఁ బూని చాల**
**మెప్పులందితి నిఁక నొండు సెప్పనేల? 497**

ఎల్ల జేజేలన్ కూడి, జాబిల్లి తాల్పు = పరమ శివుడు, కొలువు కూర్చుండు, ఆ వెండి కొండన్, కేలన్ = చేతితో, పూల చెండు తెఱంగునన్, పూని = పట్టుకొని, చాల మెప్పులు అందితిని, ఇకన్ ఒండు చెప్పను ఏల?

**తా :** ఎల్ల దేవతలను కూడి పరమ శివుడు కొలువు కూర్చుండు ఆ వెండికొండను చేతితో పూలచెండు మాదిరిగా పట్టుకొని చాల మెప్పులు పొందితిని. ఇంకా చెప్పడమెందుకు?

**తే.గీ. ఆలమున నేడు నిన్నుఁ జక్కాడి బూచి**
**గముల కాఁమెత బెట్టెదఁ గాక జుడిగి**
**పోవనిత్తునె? యనుడు నప్పొలసుదిండిఁ**
**జూచి యసదుగ నవ్వి రాచూలి పలికె 498**

నేడు = ఈనాడు, ఆలమున = యుద్ధమున, నిన్ను చక్కాడి = నిన్ను సంహరించి, బూచిగములకు = భూతములకు, ఆమెత పెట్టెదగాక = కానుకగా నిచ్చెదనుకాని, జుడిగి పోవనిత్తునె = తప్పించుకొని పోనిత్తునా?, అనుడు = అనగా, ఆ పొలసుతిండి చూచి = ఆ రావణుని చూచి, అసదుగ నవ్వి = మందహాసముచేసి, రాచూలి పలికె = రాముడు పలికెను.

**తా :** ఈనాడు యుద్ధమున నిన్ను సంహరించి భూతములకు కానుకగా ఇచ్చెదను కాని తప్పించుకొని పోనిత్తునా? అనగా ఆ రావణుని చూసి చిఱునవ్వుతో రాముడు పలికెను.

**ఆ.వె. పెక్కు నోళ్ళ నుఱక పెక్కుఁ దెఱంగుల**
**నఱచె దిట్టి వట్టి కొఱకులేల?**
**మగతనంబు నెరపి జగడం బొనర్పుము**
**సోఁకుఱేడ! యెందు స్రుక్కి చనక 499**

సోకుఱేడ = రావణా!, పెక్కునోళ్ళన్ = పలు నోళ్ళతో, ఉఱక = ఊరక, పెక్కు తెఱంగుల = పలు విధములుగా, అఱచెదు = అరుస్తున్నావు, ఇట్టి వట్టి కొఱకులు ఏల = ఇలాంటి ఉత్తి పనికిమాలిన మాటలు ఎందులకు?, మగతనంబు = పరాక్రమము, నెరపి = చూపించి, ఎందు స్రుక్కి చనక = ఎక్కడ దాగి పారిపోక, జగడంబు ఒనర్పుము = యుద్ధము చేయుము.

**తా :** రావణా! పదినోళ్ళతో ఊరక పలు విధములుగా అరుస్తున్నావు. ఇలాంటి ఉత్తి పనికిమాలిన మాటలు ఎందులకు? పరాక్రమము చూపించి ఎక్కడను దాగి పారిపోక యుద్ధము చేయుము.

**ఆ.వె. నీ కడింది లావు నే నెఱుంగనె వాలి**
**తోఁకఁ జుట్టి కడలిఁ ద్రోయుటయును**
**జెఱనుబెట్టి వేయి చేతుల యెకిమీఁడు**
**విడుచుటయును జగము వెల్లివిరిసె 500**

నీ కడింది లావు = నీ శౌర్యము, బలము, నేను ఎఱుంగనె, వాలి తోక చుట్టి, కడలి ద్రోయుటయును, చెఱను పెట్టి, వేయి చేతుల ఎకిమీడు = కార్తవీర్యార్జునుడు, విడుచుటయును, జగము వెల్లివిరిసె = లోకమంతయు ప్రకాశించినవి.

**తా :** నీ శౌర్యము, బలము నేను ఎఱుగనా? వాలి తోకకు చుట్టి సముద్రమున ద్రోయుట, కార్తవీర్యార్జునుడు చెఱను పెట్టి విడిచిపెట్టుటయు లోకమంతటా ప్రకాశించినవి.

**కం.** **అబ్బటువు వాలు తాల్పును**
**గుబ్బలి విలుకాడు నంచగుఱ్ఱపు జోదున్**
**గొబ్బున నడ్డము వచ్చిన**
**నిబ్బరముగఁ బోర నేఁడు నిను దెగటార్తున్** **501**

ఆ బటువు వాలు తాల్పును = ఆ వజ్రాయుధమును ధరించిన ఇంద్రుడును, గుబ్బలి విలుకాడును = మేరు పర్వతము విల్లుగా ధరించిన త్రిపురాసుర సంహారకుడు శివుడును, అంచగుఱ్ఱపు జోదున్ = హంస వాహనముగాకల బ్రహ్మయు, గొబ్బునన్ = శీఘ్రముగా, అడ్డము వచ్చినన్ = నిన్ను రక్షింప అడ్డువచ్చినను, నిబ్బరముగ = నిలబడి, పోరన్ = యుద్ధమునందు, నేడు = ఈనాడు, నిన్ను తెగటార్తున్.

**తా :** ఆ వజ్రాయుధమును ధరించిన ఇంద్రుడును, మేరుపర్వతమును విల్లుగా ధరించిన శివుడును, హంస వాహనముగాకల బ్రహ్మయును శీఘ్రముగా నిన్ను రక్షింప అడ్డువచ్చి నప్పటికీ నిలబడి పోరి ఈనాడు నిన్ను సంహరిస్తాను.

**ఆ.వె.** **అనుచుఁ గఱకు తూపు లదరంట నేసిన**
**నులికి వాఁడు వాఁడి ములికి గములు**
**మన్నుఁతేని మీఁద నెన్నేనిఁ బఱపి యీ**
**రైదు కడలు నద్రువ నార్చి మఱియు** **502**

అనుచున్, కఱకు తూపులు = కఠినమైన బాణములు, అదరంటన్ = దేహమున దిగునట్లు, ఏసిన, వాడు = ఆ రావణుడు, ఉలికి = ఉలిక్కిపడి, వాడి ములికి గములు = పదునైన బాణలను, మన్నుఁతేని మీదన్ = రాముని పైన, ఎన్నేని = ఎన్నియో, పఱపి = ప్రయోగించి, ఈరైదు కడలు = దశదిశలు, అద్రువన్ ఆర్చి = అదరునట్లుగా అరచి, మఱియు –

**తా :** అనుచు రాముడు కఠినమైన బాణములు వాని దేహమున దిగునట్లు వేయగా వాడు ఉలిక్కిపడి పదునైన బాణములు రామునిపైన ఎన్నో వేసి దశదిశలు అదర అఱచి ఇంకా –

**శా.** **జేజేగొంగ పసిండి పింజల పసన్ జెన్నొందు వాల్తూపులా**
**రాజాబిల్లి పయి న్నిగుడ్ప నతడున్ రాకాసి మేల్బంతిపైఁ**
**దేజారం బెడిదంపు నారసము లెంతేని న్వడిన్వైచి మే**
**న్గాజుంబూసకు సందులేక కదియ న్గాయంబులన్ జేసినన్** **503**

జేజేగొంగ = రావణుడు, పసిండి పింజల వసన్ = బంగారు పుంఖముల వైభవముచే, చెన్నొందు = అందగించు, వాలు తూపులు = వాడి బాణములు, ఆ రా జాబిల్లిపయిన్ = ఆ రామునిపై, నిగుడ్పన్ = ప్రయోగింపగా, అతడున్, రాకాసి మేల్బంతిపైన్ = రావణునిపై, తేజారన్ = పరాక్రమముతో, బెడిదంపు = కఠినములైన, నారసములు = బాణములు, ఎంతేనిన్ = ఎన్నియైనను, వడిన్ వైచి = వేగముగా వేసి, మేన్ = రావణుని దేహమునందు, గాజుం పూసకు సందులేక = గాజుపూస నుంచుటకయినను చోటులేకుండా, కదియన్ = పూర్తిగా, గాయంబులన్ చేసినన్.

**తా :** రావణుడు బంగారు పుంఖములుకల వాడి బాణములు ఆ రామునిపై వేయగా రాముడును శౌర్యముతో కఠినములైన బాణములు ఎన్నో వేగముగా వేసి రావణుని దేహమున గాజుపూస నుంచుటకు కూడ చోటు లేకుండా పూర్తిగా గాయములు చేసెను.

**కం.** **మదిఁ గొఱగొఱ నిగుడఁగ న**
**ప్పది మొగముల జోదుఱేనిపై మాఱ్ములుకుల్**
**చదలద్రువ నేసి విరి వా**
**రిదము తెఱంగొందఁ జేసి వ్రేల్మిడినొంచెన్** **504**

మదిన్ = మనసునందు, కొఱకొఱ = కోపము, నిగుడగన్ = అధికముకాగా, ఆ పది మొగముల జోదు = రావణుడు, ఱేనిపై = రామునిపై, మాఱ్ములుకుల్ = ఎదురు బాణములను, చదలు అద్రువ = ఆకాశము అదరునట్లుగా, ఏసి = వేసి, విరి వారిదము = పూవులతో కూడిన భద్రవృక్షము, తెఱంగొందన్ = తీరుగానుండగా, చేసి = కావించి, వ్రేల్మిడి = అధికముగా, నొంచెన్ = బాధించెను.

**తా :** మనసున కోపము అధికముకాగా రావణుడు రామునిపై ఆకాశము అదరునట్లుగా ఎదురు బాణములను వేసి పూవులతో కూడిన భద్రవృక్షము తీరుగా నుండునట్లు కావించి అధికముగా బాధించెను.

**తే.గీ.** **అందులకు నుల్కి యా రాచచందమామ**
**నారి మొఱయించి బల్మి యొప్పార నంప**
**వాన లా రేయిద్రిమ్మరి మేనిమీఁదఁ**
**గురిసి నెఱకుల నొప్పించి కొంకఁ జేసె** **505**

అందులకున్ = రావణుని బాణములకు, ఉల్కి = ఉలిక్కిపడి, యా రాచచందమామ = ఆ రాముడు, నారి మొఱయించి = నారిని మ్రోయించి, బల్మి ఒప్పారన్ = తనబలము ప్రకటితమగునట్లుగా, అంపవానలు = బాణవర్షములను, ఆ రేయిత్రిమ్మరి మేనిమీద = ఆ రావణుని దేహముమీద, కురిసి = వేసి, నెఱకులన్ = ప్రక్కటెముకలను, నొప్పించి = నొప్పికలిగించి, కొంకచేసె = లొంగదీసెను.

**తా :** రావణుని బాణములకు ఉలిక్కిపడి ఆ రాముడు నారిని మ్రోయించి తన బలము ప్రకటితమగునట్లుగా బాణ వర్షములను ఆ రావణునిపై కురిపించి ప్రక్కటెముకలు నొప్పించి లొంగదీసెను.

**కం.** **పొలదిండి ఱేఁడు సిమ్మెడు**
**చిలుకులు రాగవుఁడు నడుమఁ జెండాడున్ రా**

**నెల వఱపెడు బెడిదపుఁ దూ**
**పుల వెంటనె రక్కసుండు పొలుపఱఁ చేయున్** **506**

పొలతిండి ఱేడు = రావణుడు, చిమ్మెడు చిలుకులు = వేసిన బాణములు, రాగవుడు నడుమన్, చెండాడున్ = ఖండిచును, రా నెల = రాజ చంద్రుడు రాముడు, పఱపెడు = వేసిన, బెడిదపు తూపుల = కఠినమైన బాణములను, రక్కసుండు = రావణుడు, వెంటనె, పొలుపఱ చేయున్ = వ్యర్థము చేయును.

**తా :** రావణుడు వేసిన బాణములు రాముడు నడుమనే ఖండించును. రాముడు వేసిన బాణములను రావణుడు వెంటనే వ్యర్థము చేయును.

**తే.గీ.** **నల్లద్రావుడు జోదేయు నారసములు**
**చిలువరూపుల విసపు టగ్గులు నిగిడ్చి**
**కొనుచుఁ బఱతెంచి ఱేని మిక్కుటపుఁ బుల్గు**
**రాచ తూపులచేఁ దూలి వ్రాలుచుండు** **507**

నల్లద్రావుడు జోదు = రావణుడు, ఏయు = వేయుచున్న, నారసములు = బాణములు, చిలువ రూపుల = నాగాస్త్రములుగా, విసపు అగ్గులు = విషాగ్నులను, నిగిడ్చికొనుచు = వెదజల్లుచు, పఱతెంచి = వచ్చి, ఱేని = రామునియొక్క, మిక్కుటపున్ = అధికమైన, పుల్గు రాచ తూపులచే = గరుడాస్త్రములచే, తూలి = ఓడి, వ్రాలుచుండున్ = పడిపోవుచుండెను.

**తా :** రావణుడు వేయు బాణములు నాగాస్త్రములుగా విషాగ్నులను వెదజల్లుచు వచ్చి రాముని గారుడాస్త్రములచే ఓడి పడిపోవుచుండెను

**కం.** **బలములు గెలుపు తలంపులు**
**నలుకలుఁ బంతములుఁ దలఁప నంతంతకు మి**
**క్కిలిగాఁ బోరఁ దొడంగిరి**
**తొలివేలుపు ఱేఁడు రాచతొగనెచ్చెలియున్** **508**

తొలివేలుపు ఱేడు = రావణుడు, రాచ తొగనెచ్చెలియున్ = రాజచంద్రుడును, బలములు = శక్తి సామర్థ్యములును, గెలుపు తలంపులు = విజయకాంక్షయును, అలుకలు = కోపములును, పంతములు = పట్టుదలలును, తలపన్ = ఆలోచింపగా, అంతంతకున్ = అంతకంతకు, మిక్కిలిగాన్ = అధికముకాగా, పోరన్ తొడగిరి = పోరాడ జొచ్చిరి.

**తా :** రావణుడు రాముడును శక్తిసామర్థ్యములును, విజయకాంక్షయును, కోపములును, పట్టుదలలును ఆలోచింపగా అంతకంతకు అధికముకాగా పోరాడజొచ్చిరి.

**తే.గీ.** **అపుడు జన్నంపుతిండి రాయని పనుపునఁ**
**దేరుఁ గొనివచ్చి మాతలి తీవి ఱేని**
**డాయ దరి నిల్ప నాతఁడు దానిమీద**
**ప్రొద్దు తూరుపుమల యెక్కు పోల్కి నెక్కి** **509**

అపుడు, జన్నంపుతిండిరాయని = యజ్ఞభాగములను తిను ఇంద్రుని, పనుపున = ఆదేశముగా, తేరున్ = రథమును, కొనివచ్చి = తీసుకొని వచ్చి, మాతలి, రీవి = వైభవముగా, ఱేని డాయ = రాముని సమీపించి, దరి నిల్ప = ప్రక్కన నిలబెట్టగా, ఆతడు = రాముడు, దానిమీద = ఆ రథము మీద, ప్రొద్దు = సూర్యుడు, తూరుపుమల ఎక్కు పోల్కి = ఉదయపర్వతము ఎక్కు విధముగా, ఎక్కి.

**తా :** అపుడు యజ్ఞభాగములను తిను ఇంద్రుని పంపున రథమును కొనివచ్చి మాతలి వైభవముగా రాముని చేరి చెంత నిల్పగా రాముడు ఆ రథముమీద సూర్యుడు ఉదయ పర్వతము ఎక్కు విధముగా ఎక్కి.

**తే.గీ.** **అందు వెలుఁగొందు విల్లును బొందలంబు**
**దరకసంబులుఁ గైదువుల్ దాల్చి యరిది**
**తేజు వెలయంగ సోఁకు కుందేటి తాల్పు**
**నెదురుకొనె వేల్పుమూఁకలు చదల బెగడ** **510**

అందు = ఆ ఇంద్రుని రథమునందు, వెలుగొందు = ప్రకాశించు, విల్లును, బొందలంబు = కవచము, తరకసంబులున్ = అమ్ముల పొదులును, కైదువుల్ = ఇతర ఆయుధములు, తాల్చి = పొంది, అరిది తేజు వెలయంగ = అపురూపమైన తేజస్సుతో వెలుగొందగా, చదల = దిక్కులందున్న, వేల్పుమూకలు = దేవతా సమూహములు, బెగడ = భీతిల్లగా, సోకు కుందేటి తాల్పున్ = రాక్షసచంద్రుని (రావణుని), ఎదురుకొనె = ఎదిరించెను.

**తా :** ఆ ఇంద్రుని రథమునందు ప్రకాశించు విల్లును, కవచము, అమ్ములపొదులును, ఇతర ఆయుధములను పొంది అపురూపమైన తేజస్సుతో వెలుగొందగా దిక్కులందున్న దేవతలు భీతిల్లగా రావణుని ఎదుర్కొనెను.

**కం.** **గుబ్బలి గుబ్బలియుం బలు**
**బొబ్బమెకము బొబ్బమెకము పులియు న్బులియున్**
**గిబ్బయు గిబ్బయుఁ దద్దయు**
**నబ్బురముగఁ దొడరు కరణి నదరి రిరువురున్** **511**

ఇరువురున్ = ఆ రామ రావణు లిరువురును, గుబ్బలి = పర్వతము, బొబ్బ మెకము = సింహము, గిబ్బ = ఆబోతు, తద్దయు = మిక్కిలి, అబ్బురముగన్ = ఆశ్చర్యకరముగా, తొడరు కరణిన్ = ఎదిరించు విధముగా, అదరిరి = విజృంభించిరి.

**తా :** రామ రావణు లిద్దరును పర్వతము పర్వతముతోను, సింహము సింహముతోను, పులి పులితోను, ఆబోతు ఆబోతుతోను పోరాడు రీతిని ఆశ్చర్యకరముగా విజృంభించిరి.

**తే.గీ.** **అరదముల మ్రోఁత లదలపు టార్పు లరుల**
**చప్పుడులు నొక్క యుమ్మడిఁ జదలఁ బొదలఁ**
**గఱకు మొనవాఁడి చిలుకులు వఱపి నెఱఁకు**
**లుచ్చిపో నేయుచుండిరి పెచ్చు పెరిఁగి** **512**

అరదముల మ్రోతలు = రథముల ధ్వనులు, అదలపు ఆర్పులు = అదలించుచు అరుపులు, అరుల చప్పుడులు = వింటినారి చప్పుడులు, ఒక్క ఉమ్మడిన్ = ఒక్కుమ్మడిగా, చదలన్ = దిక్కులను, పొదలన్ = వ్యాపింపగా, కఱకు = కఠినములైన, మొనవాడి చిలుకులు = పదునైన బాణములు, పఱపి = విరివిగా, నెఱకులు = మర్మస్థానములు, ఉచ్చిపోన్ = పగిలిపోవునట్లుగా, పెచ్చు పెరిగి = రెచ్చిపోయి, ఏయుచుండిరి = వేయుచుండిరి.

**తా :** రథముల ధ్వనులు, అదలించుచు అరపులు, వింటినారి చప్పుడులు ఒక్కుమ్మడిగా దిక్కులను వ్యాపింపగా కఠినములైన పదునైన బాణములు విరివిగా మర్మస్థానములు పగిలిపోవునట్లుగా రెచ్చిపోయి వేయుచుండిరి.

**కం. గుఱిఁ దప్పక కడుదవ్వుగఁ**
**బఱచుచుఁ జప్పుడులఁ జదలు వగిలించి మిడుం**
**గుఱు లుమియుచుఁ బడు మిడుతల**
**తఱచూనె న్వారి బల్లిదపు టంపగముల్ 513**

వారి = ఆ రామ రావణుల, బల్లిదపు = కఠినములైన, అంపగముల్ = బాణసమూహములు, గుఱిన్ తప్పక = గుఱి తప్పకుండా, కడున్ దవ్వుగన్ = చాల దూరముగా, పఱచుచున్ = ప్రయోగించుచూ, చప్పుడులన్ = వాని ధ్వనులతో, చదలు పగిలించి = దిక్కులు పగిలించి, మిడుంగుఱులు = నిప్పుకణములు, ఉమియుచు = క్రక్కుచు, పడు = పడిపోవు, మిడుతల తఱచు = మిడుతల పద్ధతిని, ఊనెన్ = పొందెను.

**తా :** ఆ రామ, రావణుల కఠినములైన బాణములు గుఱి తప్పకుండా చాల దూరముగా ప్రయోగించుచూ, వాని ధ్వనులతో దిక్కులు పగిలించి నిప్పుకణములు క్రక్కుచు పడిపోవు మిడుతల రీతిని పొందెను.

**తే.గీ. దొనలఁ దూపులు గొనుటయుఁ దొడరి నారి**
**లాగుటయు నేయుటయు గుఱు ల్నాఁటుటయును**
**గనఁబడకయుండు నట్లుఁగాఁ బెనఁగి రెఱచి**
**దిండి రాయఁడు నెకిమీఁడు గండెసంగ 514**

ఎఱచి తిండిరాయడు = రావణుడును, ఎకిమీడు = రాముడును, గండు ఎసంగన్ = పరాక్రమము అతిశయింపగా, దొనలన్ తూపులు కొనుటయున్ = అమ్ములపొదినుండి బాణములు తీసుకొనుట యును, తొడరి = పూనుకొని, నారి లాగుటయును, ఏయుటయును, గుఱుల్ నాటుటయును = లక్ష్యము ఛేదించుటయును, కనబడక ఉండునట్లుగాన్ = కంటికి కనబడనంత వేగముగా, పెనగిరి.

**తా :** రావణుడును, రాముడును శౌర్యముతో అమ్ములపొదినుండి బాణములు తీయుట, నారి లాగుట, వేయుట, లక్ష్యము ఛేదించుట కంటికి కనబడనంత వేగముగా పోరిరి.

**కం. కుడియెడమల సింగిణు లిం**
**పడరఁగఁ గైకొనుచు వెరవులారఁగ నసము**
**ల్గడలుకొనఁ బోరొనర్చిరి**
**సడలని బింకముల నక్కజం బెలయంగన్ 515**

కుడి ఎడమల = రెండు ప్రక్కల, సింగిణులు = ధనుస్సులు, ఇంపు అడరగ = శోభిల్లగా, కైకొనుచు = చేత తీసుకొనుచు, వెరవులు ఆరగన్ = ఉపాయములొప్పగా, అసములు = దర్పములు, కడలుకొనన్ = దిక్కులవ్యాపింపగా, సడలని బింకములన్ = తగ్గని పట్టుదలలతో, అక్కజంబు ఎలయంగన్ = అద్భుత మనిపించురీతిగా, పోరు ఒనర్చిరి.

**తా :** రెండు ప్రక్కల ధనుస్సులు శోభిల్లగా చేతుల తీసుకొనుచు ఉపాయములొప్పగా దర్పములు దిక్కుల వ్యాపింపగా తరుగని పట్టుదలలతో అద్భుతరీతిని పోరాడిరి.

**ఆ.వె.** **పదియు నూఱు వేయి పదివేలు నూఱువే**
**ల్మొదలుగాఁగఁ బెక్కు ములుకు లేసి**
**తొడలు మెడలు కాళ్ళు నడుములు బోరలు**
**నలియ వ్రేటులాడి రలుకుమాలి** **516**

మొదలుగాగ = మొదలుకొని, పెక్కు ములుకులు ఏసి = పలు బాణములు వేసి, బోరలు = రొమ్ములు, నలియ = నలుగునట్లుగా, అలుకు మాలి = జంకులేక, వ్రేటులాడిరి = పోరాడిరి.

**తా :** క్రమముగా పది, నూఱు, వేయి, పదివేలు మొదలుగా పెంచుతూ బాణములు వేసి తొడలు, మెడలు, కాళ్ళు, నడుములు, బోరలు నలుగునట్లుగా జంకులేక పోరాడిరి.

**తే.గీ.** **గాటముగఁ బింజ పింజయుఁ గాఁడి పాఱఁ**
**దొడరి యిరువురు నడరించు తూపుగములు**
**కడలు పదియును సంద్రము లెడము లేక**
**కప్పుకొని యుండె నింకేమి సెప్పవలయు?** **517**

గాటముగన్ = గాఢముగా, పింజ పింజయు = ఒకదాని వెనుక ఒకటి, కాడిపాఱన్ = క్రమ్ముకొనగా, తొడరి = పూనుకొని, ఇరువురన్ = రామ రావణులిద్దరును, అడరించు = ప్రయోగించు, తూపుగములు = బాణముల సమూహములు, కడలు పదియును = పది దిక్కులును, సంద్రములు = సముద్రములును, ఎడములేక = కొంచెముకూడా సందు లేకుండా, కప్పుకొని = ఆక్రమించి, ఉండెన్ = ఉండెను, ఇంకేమి = ఇంక ఏమని, చెప్పవలయు, –

**తా :** గాఢముగా దూదిపింజవలె బాణములను పగులగొట్టుచుండగా పూనుకొని రామ రావణు లిద్దరును ప్రయోగించు బాణములు పది దిక్కులను, సముద్రములును కొంచెము కూడా సందు లేకుండా ఆక్రమించి ఉండెను. ఇక ఏమి చెప్పవలయును?

**తే.గీ.** **విల్లు తెఱగంటి విల్గాఁగ వింటి మ్రోఁత**
**లుఱుములుగఁ గల్గు మెఱుఁగులు మెఱుఁగు దీవి**
**యలుగ నెఱ రాచ తొలిమబ్బు పొలసుదిండి**
**కొండపై నంపజడివానఁ గురియుచుండె** **518**

విల్లు = ధనుస్సు, తెఱగంటి విల్గా = ఇంద్ర ధనుస్సుగ, వింటి మ్రోతలు = ధనుస్సు ధ్వనులు, ఉఱుములుగ, కల్గు = కలుగునట్టి, మెఱుగులు = కాంతులు, మెఱుగు తీవియలుగ = మెరుపు

తీగలుగ, నెఱ రాచ తొలిమబ్బు = రాముడను తొలకరి మబ్బు, పొలసుతిండి = రావణుడను, కొండపైన్, అంప జడివాన = బాణ వర్షము, కురియుచుండె.

**తా :** ధనుస్సు ఇంద్రధనుస్సుగ, వింటి మ్రోతలు ఉఱుములుగ, కలిగే కాంతులు మెఱుపు తీగలుగ రాముడను తొలకరి మబ్బు రావణుడను కొండపై అంపజడివాన కురిసెను.

**తే.గీ.** **వేలుపుల సూడు వేలుపుఁగోల యేయ**
**నడుమ పొడిపొడి యొనరించె బుడమి తాల్పు**
**మరలఁ దొలివేల్పు మన్నీడు మావు మోము**
**వేల్పు టమ్మేయ నదియు బో వ్రేసె తేడు** **519**

వేలుపుల సూడు = రావణుడు, వేలుపున్ కోల = దివ్యాస్త్రమును, ఏయ = ప్రయోగింపగా, పుడమి తాల్పు = రాముడు, నడుమన్ = దానిని మధ్యలోనే, పొడిపొడి ఒనరించె, మరలన్ = తిరిగి, తొలివేల్పు మన్నీడు = రావణుడు, మావు మోము వేల్పు అమ్ము = గాంధర్వాస్త్రమును, ఏయన్ = వేయగా, తేడు = రాముడు, అదియున్ = దానిని కూడా, పో వ్రేసెన్ = పోగొట్టెను.

**తా :** రావణుడు ఐంద్రాస్త్రమును వేయగా రాముడు దానిని మధ్యలోనే పొడిపొడి చేసెను. తిరిగి రావణుడు గాంధర్వాస్త్రమును వేయగా రాముడు దానిని కూడ పోగొట్టెను.

**కం.** **రక్కసి మొనగాఁ డేపున**
**రక్కసి చిలుకదరఁ జేయ రాముఁడు దానిన్**
**గ్రక్కున వెన్నుని తూపున**
**నుక్కడఁచెన్ మింట వేల్పు లుబ్బుచు నార్వన్** **520**

రక్కసి మొనగాడు = రావణుడు, ఏపున = ఆధిక్యముతో, రక్కసి చిలుకు = నైరృత్యా స్త్రమును, అదర చేయ = ప్రయోగింపగా, రాముడు, దానిన్, గ్రక్కున = శీఘ్రముగా, వెన్నుని తూపునన్ = వైష్ణవాస్త్రమున, మింట వేల్పులు = ఆకసమున దేవతలు, ఉబ్బుచు = ఆనందించుచు, ఆర్వన్ = అరచుచుండగా, ఉక్కడచెన్ = నాశముచేసెను.

**తా :** రావణుడు ఏపున నైరృత్యాస్త్రమును ప్రయోగింపగా రాముడు దానిని వెంటనే వైష్ణవాస్త్రమున ఆకసమున దేవతలు ఆనందించుచు అరచుచుండగా నాశముచేసెను.

**సీ.** **తొలివేల్పు తలకట్టు చిలువ చిల్కదరింపఁ**
**బులుఁగు రా తూపేసి మలపె తేఁడు**
**పొలదిండి మిన్న యింగలపు టమ్మేయ రా**
**ముఁడు మొగుల్మొలికి నుక్కడఁచె దాని**
**జగములగొంగ యేనుఁగు కోలఁ బఱప రా**
**యండు సింగపు గిట్టఁ జెండి వైచె**
**మొఱకు రక్కసుఁడు ముమ్మొనవాలు నిగుడింప**
**దొర సత్తిచే దానిఁ దుమురు సేసె**

**తే.గీ.** **బంతి మొగముల సోఁకు మేల్బంతి పెక్కు**
**కఱకు నారసముల తేని నెఱఁకు లగల**
**నేసి టెక్కెముఁ గూల్చిన నీరసమున**
**నేల తాలుపు నెల వానిఁ దూలనేసె** **521**

తొలివేల్పుతలకట్టు = రావణుడు, చిలువచిల్కు = నాగాస్త్రమును, అదరింపన్ = ప్రయోగింపగా, పులుగు రా తూపు = గారుడాస్త్రము, ఏసి = వేసి, తేడు = రాముడు, మలపె = నాశముచేసెను, పొలదిండి మిన్న = రావణుడు, యింగలపు అమ్ము ఏయ = ఆగ్నేయాస్త్రమును వేయ, రాముడు, మొగులు ములికి = మేఘాస్త్రమున, దాని ఉక్కు అడచె, జగముల గొంగ = లోకములకు శత్రువైన రావణుడు, ఏనుగు కోల = వారణాస్త్రమును, పఱప = ప్రయోగింపగా, రాయండు = రాముడు, సింగపు గిట్టన్ = మృగేంద్రాస్త్రమున, చెండివైచె = ఖండించెను, మొఱకు రక్కసుడు = రావణుడు, మూడు మొన వాలు = ఈశానాస్త్రమును, నిగుడింపన్ = వేయగా, దొర = రాముడు, సత్తిచే = శక్త్యాయుధముతో, దానిన్, తుమురు చేసెన్ = ముక్కలు చేసెను, బంతి మొగముల సోకు మేల్బంతి = రావణుడు, పెక్కు కఱకు నారసముల = పలు కఠినమైన బాణములను, తేనిన్ = రాముని, ఎఱకులు = మర్మస్థానములు, అగలన్ = పగులగా, ఏసి = ప్రయోగించి, టెక్కెము కూల్చినన్ = ధ్వజమును పడగొట్టగా, ఈరసమునన్ = కోపముతో, నేలతాలుపు నెల = రామచంద్రుడు, వానిన్ = ఆ బాణములను, తూలన్ ఏసెన్ = పడగొట్టెను.

**తా :** రావణుడు నాగాస్త్రమును వేయగా రాముడు గారుడాస్త్రమును వేసి నాశము చేసెను. రావణుడు ఆగ్నేయాస్త్రమును వేయ రాముడు మేఘ (వారుణా)స్త్రమున దానిని అణచెను. రావణుడు వారణాస్త్రమును వేయగా రాముడు మృగేంద్రాస్త్రమున ఖండించెను. రావణుడు ఈశానాస్త్రమును వేయగా రాముడు శక్త్యాయుధముతో దానిని ముక్కలు చేసెను. రావణుడు పలు కఠినమైన బాణములు రాముని మర్మస్థానములు పగులగా వేసి ధ్వజమును పడగొట్టగా అసూయతో రాముడు ఆ బాణములను పడగొట్టెను.

**కం.** **పది కడ లద్రువగ నార్చుచుఁ**
**బదిమోముల జోదు గలనఁ బదిలుండగుచున్**
**బది విండులు గైకొని య**
**ప్పది తేరుల తేని కొడుకు బడలఁగ నేసెన్** **522**

పది కడలు = పది దిక్కులు, అద్రువగన్ = అదరిపోగా, ఆర్చుచు, పదిమోముల జోదు = దశకంఠుడు, కలనన్ = యుద్ధమున, పదిలుండగుచున్ = జాగరూకుడై, పది విండులు గైకొని = పది ధనుస్సులు తీసుకొని, ఆ పది తేరుల తేని కొడుకు = రాముడు, బడలగ = అలసిపోవునట్లుగ, ఏసెన్ = కొట్టెను.

**తా :** పది దిక్కులు అదరిపోగా అరచుచు దశకంఠుడు యుద్ధమున జాగరూకుడై పది ధనుస్సులు తీసుకొని రాముడు అలసిపోవునట్లుగ కొట్టెను.

**కం.** **ఒక సింగాణియె కొని కి**
**న్క కడున్ మీఱంగఁ దూపుగము లేయుచుఁ బా**
**యక పెనఁగి వాని మానిసి**
**యెకిమీఁ డెంతయుఁ గలంచి యేద్దెర సూపెన్** **523**

ఒక సింగాణియె = ఒక్క ధనువునే, కొని = తీసుకొని, కిన్క కడున్ మీఱంగ = మిక్కిలి కోపము అతిశయింపగా, తూపుగములు = బాణ సమూహములు, ఏయుచు = వేయుచు, పాయక = విడువక, పెనగి = పోరాడి, వాని = ఆ రావణుని, మానిసి ఎకిమీడు = రాముడు, ఎంతయు = మిక్కిలి, కలంచి = కలతపెట్టి, ఏద్దెర చూపెన్ = ఆధిక్యమును ప్రదర్శించెను.

**తా :** ఒక్క ధనువునే తీసుకొని అతిశయించిన కోపముతో బాణములు వేయుచు విడువక పోరాడి ఆ రావణుని రాముడు మిక్కిలి కలతపెట్టి ఆధిక్యమును ప్రదర్శించెను.

**తే.గీ.** **మిడుఁగురులు తీఁగమంటలు మెఱుఁగు లడరు**
**వెలుఁగు కోలలు పఱపి యవ్వేల్పుసూడు**
**తేరు టెక్కెంబు మాతలి వారువములు**
**గనఁబడక యుండునట్లుగాఁ గప్పి మఱియు** **524**

ఆ వేల్పుసూడు = ఆ రావణుడు, మిడుగురులు = అగ్నికణములు, తీగమంటలు = అగ్ని జ్వాలలు, మెఱుగులు = మెఱుపులు, అడరు = అతిశయించుచున్న, వెలుగు కోలలు = అగ్ని బాణములు, పఱపి = వేసి, తేరు టెక్కెంబు, మాతలి, వారువములు = గుఱ్ఱములు, కనబడక ఉండునట్లుగాన్, కప్పి = బాణములతో కప్పివేసి, మఱియున్.

**తా :** ఆ రావణుడు నిప్పుకణములు, అగ్నిజ్వాలలు, మెఱుపులు అతిశయించు అగ్ని బాణములు వేసి ధ్వజము, మాతలి, గుఱ్ఱములు కనబడకుండునట్లు కప్పి, ఇంకను –

**ఆ.వె.** **కడిఁది వాఁడి తూపు లొడయని మేనున**
**యందు గ్రుచ్చి తద్దఁ గుందఁ జేసె**
**నపు డగస్త్యు డచటి కరుదెంచి ఱేని దీ**
**వించి యిట్టులనియె వెరవు మీఱ** **525**

కడిది = కఠినమైన, వాడి తూపులు = వాడి బాణములు, ఒడయని మేనునయందు = రాముని దేహమునందు, గ్రుచ్చి = నాటి, తద్దన్ కుందన్ చేసె = మిక్కిలి బాధించెను, అపుడు, అగస్త్యుడు అచటికి అరుదెంచి, ఱేని = రాముని, దీవించి, వెరవు మీఱ = మిక్కిలి నేర్పుగా, ఇట్టులనియె.

**తా :** కఠినమైన వాడి బాణములు రాముని దేహమందు నాటి మిక్కిలి బాధించెను. అపుడు అగస్త్యుడు అచటికి వచ్చి రాముని దీవించి నేర్పుగా ఇట్టులనెను.

**కం.** **కడిఁది మొనగాడ! మానిసి**
**యొడలూనుట నీకుఁ దెల్వి యొదవదు జగముల్**

**పొదమం జేయఁగఁ బ్రోవఁగ**
**నుడిగింపఁగ నెపుడు నీవ యొడయఁడవు గదా! 526**

కడిది మొనగాడ = మిక్కిలి సమర్థుడా!, మానిసి ఒడలు, ఊనుట = ధరించుటచే, నీకున్, తెల్వి యొదవదు = తెలియకున్నది, జగముల్ పొదమంచేయగ = లోకముల సృష్టించుటకు, ప్రోవగన్ = రక్షించుటకు, ఉడిగింపగన్ = లయముచేయుటకు, ఎపుడు = ఎల్లప్పుడు, నీవ, ఒడయడవుకదా!

**తా :** మిక్కిలి సమర్థుడా! మనుష్యత్వము ధరించుటచే నీకు తెలియకున్నది. లోకముల సృష్టించుటకు, రక్షించుటకు, లయించుటకు ఎపుడును నీవే ప్రభువువు కదా!

**కం.** **నీ తెఱఁగరయఁగఁ దెమ్మెర**
**మేఁతరి వంగడపు ఱేఁడు మిను సికవాడుం**
**దాతయు నాతని నాఁతియు**
**నేతురె? యొక్కించుకైన నిక్కువ మొదవన్ 527**

నీ తెఱగు, అరయగన్ = తెలుసుకొనుటకు, తెమ్మెర మేతరి వంగడపు ఱేడు = వాయుభక్షక వంశపు రాజు (ఆదిశేషుడు)ను, మినుసికవాడున్ = ఆకాశమే సికగ కల శివుడును, తాతయున్ = బ్రహ్మదేవుడును, ఆతని నాతియున్ = బ్రహ్మభార్యయగు శారదయును, ఒక్క ఇంచుకైన = ఏ కొంచెమైనను, నిక్కువము ఒదవన్ = సత్యమెఱుగ వలెనన్న, నేతురె = నేర్తురే!

**తా :** నీ విషయము తెలుసుకొనుటకు ఆదిశేషుడును, శివుడును, బ్రహ్మయును, ఆయన భార్య శారదయును ఏ కొంచెమైనను సత్యమెఱుగ నేర్తురా?

**తే.గీ.** **ఇపుడు నీ దొడ్డతన మీవె యెఱిఁగికొనుచు**
**నదరి మీ వంగడంబున కొడయఁడైన**
**వేయి చేతులసామిని వేఁడుకొనుము**
**తలపు లీడేరునని తెల్పి తపసి చనిన 528**

ఇపుడు, నీదొడ్డతనము = నీ గొప్పతనమును, ఈవె ఎఱిగికొనుచున్ = నీవే తెలిసికొనుచు, అదరి = విజృంభించి, మీ వంగడంబునకు = మీ వంశమునకు, ఒడయడైన = మూలపురుషుడైన, వేయి చేతులసామిని = సూర్యుని, వేడుకొనుము = ప్రార్థింపుము, తలపులు = కోరికలు, ఈడేరునని = తీరునని, తెల్పి = చెప్పి, తపసి చనిన = అగస్త్యముని వెళ్ళగా –

**తా :** ఇపుడు నీ గొప్పతనమును నీవే తెలిసికొనుచు విజృంభించి మీ వంశమునకు ఒడయడైన సూర్యుని ప్రార్థింపుము. కోరికలు ఈడేరునని చెప్పి అగస్త్యముని వెళ్ళగా –

**తే.గీ.** **అంత రాచూలి దమ్మి ప్రోయాలి మగనిఁ**
**బూజ లొనరించి యెనలేని తేజుఁ గాంచి**
**మరలఁ బోరికి మొనసి విల్మొరయఁ జేయఁ**
**దడవ యారేఁడు జగములు వడఁకఁ దొడఁగె 529**

అంత, రాచూలి = రాముడు, తమ్మి ప్రోయాలి మగనిన్ = తామర ప్రియురాలి మగడగు సూర్యుని, పూజలు ఒనరించి, ఎనలేని = సాటిలేని, తేజు కాంచి = ప్రతాపమును పొంది, మరలన్ = తిరిగి, పోరికి మొనసి = యుద్ధానికి సిద్ధపడి, విల్ మొరయన్ చేయన్ = వింటినారిని మ్రోగింపగా, ఈరేడు జగములు = 14 లోకములును, తడవన్ = మాటిమాటికి, వడక తొడగె = వణక సాగెను.

**తా :** అంత రాముడు సూర్యుని పూజలొనరించి సాటిలేని ప్రతాపముతో తిరిగి పోరుకు సిద్ధపడి వింటినారిని మ్రోగింపగా 14 లోకములను మాటిమాటికి వణకసాగెను.

**ఆ.వె.** **రాచపెద్దయైన రాగవుఁ డప్పు డ**
**మ్మేటి సోఁకుజోదు మీద మూఁడు**
**తూపులేసి నెన్నుదురు మూఁడు ములుకుల**
**నల్ల దొరఁగఁ జేసి పెల్లడంచె** **530**

రాచపెద్దయైన = రాజులలో శ్రేష్ఠుడైన, రాగవుడు, అప్పుడు, ఆ మేటి సోకు జోదు మీదన్ = ఆ గొప్ప యోధుడైన రావణుని మీద, మూడు తూపులు, ఏసి = ప్రయోగించి, నెన్నుదురు = సరిగా నుదుటియందు, మూడు ములుకుల = మూడు బాణములతో, నల్ల తొరగన్ చేసి = రక్తము కారునట్లుగా చేసి, పెల్లు అడంచె = గట్టిగా బాధించెను.

**తా :** రాజశ్రేష్ఠుడైన రాముడు అప్పుడు ఆ యోధుడైన రావణునిమీద మూడు తూపులు వేసి సరిగా నుదుటియందు రక్తము కారునట్లుగా చేసి గట్టిగా బాధించెను.

**కం.** **ఇరు నెమ్మొగముల దేవర**
**కరణి న్ముడివడిన పది మొగమ్ముల జోద**
**ద్దొర ఱొమ్ము వేయి ములుకులఁ**
**గర మరుదుగ వ్రచ్చి నల్లగారఁగఁ జేసెన్** **531**

ఇరు నెమ్మొగముల దేవర = రెండు నిండైన మోములుకల అగ్నిదేవుని, కరణి = వలె, ముడిపడిన = బొమలు ముడిపడిన, పది మొగమ్ముల జోదు = రావణుడు, ఆ దొర ఱొమ్ము = ఆ రాముని ఱొమ్మును, వేయి ములుకులన్ = అనేక బాణములతో, కరము = మిక్కిలి, అరుదుగ = ఆశ్చర్యకరముగ, వ్రచ్చి = కొట్టి, నల్ల కారగ చేసెన్ = రక్తము కారునట్లు చేసెను.

**తా :** అగ్నిదేవునివలె బొమలు ముడిపడిన రావణుడు ఆ రాముని ఱొమ్మును పలు బాణములతో మిక్కిలి ఆశ్చర్యకరముగ కొట్టి రక్తముకారునట్లు చేసెను.

**మ.** **విలునేర్పున్ గయి బల్మియున్ మెఱయఁగా వేంద్రంపు క్రొవ్వాఁడి ము**
**ల్కులు నారి న్బెరయించి రాగవుఁడు సోఁకుంబెద్ద మేనెంతయున్**
**నలియ న్వ్రేసి కడింది బొందళము కిన్కం జించి పెక్కమ్ములం**
**జల మొప్పారఁగ నెన్నొసళ్ళు పగిలించం దూలెఁ వాడెంతయున్** **532**

రాగవుడు, విలు నేర్పున్, కయి బల్మియున్ = బాహుబలమును, మెఱయగా, వేంద్రంపు = తీక్షణమైన, ముల్కులు, నారిన్, పెరయించి = సంధించి, సోకుంపెద్ద = రావణుని, మేను ఎంతయున్, నలి

యన్ = నలుగునట్లుగా, వ్రేసి, కడింది = గట్టిదైన, బొందళము = కవచమును, కిన్కన్ = కోపముతో, చించి, పెక్కు అమ్ములన్, చలము ఒప్పారగన్ = పట్టుదల అతిశయింపగా, నెన్నొసళ్ళు = సరిగా కనుబొమలను, పగిలించం = పగులగొట్టగా, వాడు ఎంతయున్, తూలెన్ = తూలిపడెను.

**తా :** రాముడు వింటి నేర్పును, బాహుబలమును మెఱయగా తీక్షణమైన బాణములు నారిని సంధించి రావణుని దేహము నలుగునట్లుగా వ్రేసి గట్టిదైన కవచమును చించి పలు బాణములను పట్టుదలతో సరిగా కనుబొమలను పగులగొట్టగా వాడు తూలిపడెను.

**ఆ.వె.** **తూలి పెద్దకొండ పోలికఁ దేరిపై**
**సోలియున్నఁ జూచి కాలకేతుఁ**
**డరద మపుడు సరగ దురమున కెడముగాఁ**
**దోలుకొని కడంకతోడఁ జనియె** **533**

తూలి పెద్దకొండపోలికన్ తేరిపై సోలియున్నన్ చూచి, కాలకేతుడు = రావణుని సారథి, అపుడు అరదము, సరగ = శీఘ్రముగా, దురమునకు = యుద్ధమునకు, ఎడముగా = దూరముగా, తోలుకొని, కడంకన్ = పూనికతో, చనియె = వెళ్ళెను.

**తా :** తూలి పెద్ద కొండలా రథముపై సోలియుండగా చూచి కాలకేతుడు అపుడు రథమును వెంటనే పూనికతో దూరముగా తోలుకొని వెళ్ళెను.

**తే.గీ.** **అంతఁ దెలివొంది రావణుఁ డతనిఁ జూచి**
**యకట! పగతురు నగఁగ నిట్లరద మేల**
**తొలఁగఁ దెచ్చితి నీవెల్ల దురములందుఁ**
**జూడవైతివె? నా లావు చొప్పు ముందు** **534**

అంతన్ = ఆ తరువాత, తెలివొంది రావణుడు అతని చూచి అకట, పగతురు నగగన్ ఇట్లు అరదము ఏల తొలగన్ తెచ్చితి నీవు ఎల్ల, దురములందు = యుద్ధములందు, నా లావు చొప్పు = నా శక్తి విధము, ముందు = ఇంతకుముందు, చూడవైతివె = చూడలేదా?

**తా :** ఆ తరువాత తెలివొంది రావణుడు సారథిని చూచి 'అకట! శత్రువులు నవ్వగా ఇలా రథమును తొలగించి ఏల తెచ్చితివి? నువ్వు అన్ని యుద్ధములందు నా శక్తి ఎలాంటిదో ఇంతకు ముందు చూడలేదా?'

**కం.** **అని పలికి మరల నరదం**
**బనికిన్ దోలించి బీర మలరారఁగ రా**
**మునిఁ దొడరి మెఱుఁగుటమ్ముల**
**విను ద్రిమ్మరు లడలఁ బెక్కువేలు నిగుడ్చెన్** **535**

అని పలికి మరలన్ అరదంబు అనికిన్ తోలించి, బీరము = పరాక్రమము, అలరారగ = అతిశయింపగా, రామునిన్, తొడరి = ఎదిరించి, మెఱుగు అమ్ముల, విను త్రిమ్మరులు = దేవతలు, అడలన్ = భీతిచెందగా, పెక్కు వేలు, నిగుడ్చెన్ = ప్రయోగించెను.

**తా :** అని పలికి మళ్ళీ రథాన్ని యుద్ధానికి నడిపించి పరాక్రమముతో రాముని ఎదిరించి మెఱిసే బాణములు దేవతలు భీతిచెందగా అనేకములు ప్రయోగించెను.

**కం.** **వేలుపుటరదముపైఁ దే**
**జీలపయి న్మఱియు రాచసింగముపై మే**
**ల్డాలుపయిన్ మాతలిపై**
**వాలారుం దూపుగములు వావిరిఁ జొనిపెన్** **536**

వేలుపు అరదముపైన్, తేజీలపయిన్, మఱియు, రాచసింగముపై = రామునిపై, మేలు డాలు పయిన్ = గొప్ప రక్షణకవచము పయిన, మాతలిపై, వాలారున్ = వాడియైన, తూపుగములు = బాణసమూహములు, వావిరిన్ = విరివిగా, చొనిపెన్ = గ్రుచ్చెను.

**తా :** దేవతా రథముపైన, గుఱ్ఱములపైన మఱియు రామునిపైన రక్షణకవచముపైన మాతలిపైన వాడి బాణములు విరివిగా దేహములందు గ్రుచ్చెను.

**కం.** **పొలదిండి ఱేని బలు తూ**
**పులు దద్దయుఁ గప్పుకొనినఁ బొల్పుగ నెకిమీఁ**
**డలరెఁ దొలిమొగుల నడుమన్**
**వెలుఁగొందుచునుండు వేఁడి వేలుపు పగిదిన్** **537**

పొలదిండి ఱేని = రావణుని, పలు తూపులు, తద్దయున్ = మిక్కిలి, కప్పుకొనినన్ = కప్పి వేయగా, ఎకిమీడు, పొల్పుగ = అందముగా, తొలిమొగుల నడుమన్ = తొలకరి మేఘము మధ్య, వెలుగొందుచు నుండు, వేడి వేలుపు పగిదిన్ = సూర్యునివలె, అలరెన్ = ఒప్పెను.

**తా :** రావణుని బాణములు మిక్కిలి కప్పివేయగా రాముడు అందముగా తొలకరి మేఘము నడుమ వెలుగొందు సూర్యునివలె ఒప్పెను.

**కం.** **వలకాలు ముందటికి డా**
**పలికాల్ సాఁచుకొని నిలిచి బలిమి నపుడ ని**
**ప్పులు గ్రక్కు ముల్కు లా రా**
**నెల రక్కసుమీఁదఁ బఱపి నెఱఁకులు సించెన్** **538**

రానెల = రాముడు, వలకాలు = కుడికాలు, ముందటికి, డాపలికాల్ = ఎడమకాలు, చాచుకొని = నిలువుగా చాచి (ఆలీఢపాదుడై), నిలిచి, బలిమిన్, అపుడ, నిప్పులు గ్రక్కు, ముల్కులు = బాణములు, ఆ రక్కసు మీదన్ పఱపి = ప్రయోగించి, నెఱకులు = మర్మస్థానములు, చించెన్ = పగులకొట్టెను.

**తా :** రాముడు  కుడికాలు ముందఱికి, ఎడమకాలు చాచుకొని నిలిచి బలంగా అపుడే నిప్పులు కక్కే బాణములు ఆ రావణునిమీద ప్రయోగించి మర్మస్థానములు పగులకొట్టెను.

**కం.** **అప్పగిది గెలుపు తలఁపులు**
**డెప్పరమై పెనగొనం గడిందిగ సతనా**
**ళ్ళొప్పుగఁ బోరిరి నిదురయు**
**దప్పియుఁ గానక కడుం గడంకల నంతన్** **539**

ఆ పగిదిన్ = ఆ విధముగా, గెలుపు తలపులు = విజయ కాంక్షలు, డెప్పరమై = అధికమై, పెనగొనన్ = పెనవేసుకొనగా, కడిందిగ = సాహసముతో, సతనాళ్ళు = ఏడు రోజులు, ఒప్పగన్ = తగినరీతిగా, నిదురయు దప్పియున్, కానక = తెలియక, కడున్ = మిక్కిలి, కడంకలన్ = ప్రయత్నములతో, పోరిరి, అంతన్ = అంతట.

**తా :** ఆ విధముగా గెలుపు కాంక్షలు అధికమై పెనవేసుకొనగా సాహసముతో ఏడు రోజులు తగినరీతిగా నిద్ర, దాహము తెలియక మిక్కిలి కడంకను పోరిరి. అంతట –

**చం.** **వఱదులు గూసె దేరిపయి వావిరి గ్రద్దలు వ్రాలె గుఱ్ఱముల్**
**నెఱిసెడి గన్నొలంకులను నీళ్ళు పొరింబొరి గ్రుమ్మరించె వే**
**మఱు బయినెత్తురుల్ గురిసె మబ్బులు రక్కసి మన్నెగానికిన్**
**దఱచుగ గీడ్తెఱంగులు గనంబడె నయ్యెడ వేల్పు లుబ్బగన్** **540**

వేల్పులు ఉబ్బగన్ = దేవతలుప్పొంగగా, వఱదులు కూసె = నక్కలు కూసినవి, తేరిపయి, వావిరి = అధికముగా, గ్రద్దలు వ్రాలె, గుఱ్ఱముల్, నెఱి చెడి = శక్తి నశించి, కన్నొలంకులను, నీళ్ళు, పొరింబొరి = ఎడతెగకుండ, క్రుమ్మరించెన్ = ఒలకబోసినవి, వేమఱున్ = మాటిమాటికి, మబ్బులు = మేఘములు, నెత్తురుల్ = రక్తమును, తఱచుగ = దట్టముగా, కురిసెన్ = వర్షించెను, రక్కసి మన్నెకానికిన్ = రావణునికి, కీడు తెఱంగులు = ప్రమాద సూచికలు, కనన్ పడెను = కనబడెను.

**తా :** దేవతలుప్పొంగగా నక్కలు కూసినవి, రథముపై గ్రద్దలు వ్రాలినవి, గుఱ్ఱములు శక్తిహీనములై కన్నీళ్ళు కార్చినవి, తఱచుగా మేఘములు రక్తము వర్షించెను. రావణునకు ప్రమాదసూచికలు కనబడెను.

**కం.** **అవి సూచియు నాతఁడు పిఱు**
**తివియక డెందంబులోన దిటమూనుక రా**
**గవుఁ దొడరి పెక్కులాగుల**
**బవరం బొనరించుచుండెఁ బదిలుండగుచున్** **541**

అవి = ఆ చెడు శకునములు, చూచియున్, ఆతడు = రావణుడు, పిఱు తివియక = వెనుకకు తగ్గక, డెందంబులోన = మనసులో, దిటము = ధైర్యము, ఊనుక = ఉంచుకొని, రాగవున్ = రాముని, తొడరి = ఎదుర్కొని, పదిలుండు అగుచున్ = జాగరూకుడగుచు, పెక్కు లాగుల = పలు రీతులలో, బవరంబు = యుద్ధమును, ఒనరించుచుండెన్ = చేయుచుండెను.

**తా :** ఆ చెడు శకునములు చూచియును రావణుడు వెనుకకు తగ్గక మనసులో ధైర్యముంచు కొని రాముని ఎదుర్కొని జాగరూకుడగుచు పలురీతులలో యుద్ధమొనరించుచుండెను.

**వ.** **అప్పుడు, ఆ సమయమందు** **542**

**తా :** అలా యుద్ధం కొనసాగుతున్న సమయంలో –

**సీ.** **కప్పుకుత్తుకసామి కంటిమంటలఁ బోలు**
**తూపులు బుజముల దూఱ్చి దూఱ్చి**

మిత్తికోరలతోడ మేలమాడు మెఱుంగుఁ
గోలలు ఊొమ్మనఁ గ్రుచ్చిగ్రుచ్చి
పిడుగులకెనయైన బెడిదంపు ములుకులు
ప్రక్కల నతిమురిఁ బఱపి పఱపి
విసము గ్రక్కిన మేటి వీనుల కంటి వా
ల్చెనయు గిట్టలు మేనఁ జొనిపి జొనిపి

తే.గీ. మగతనంబుల గనియన దగిన బంతి
మెడల పొలదిండి నెంతయు బడలు పఱచి
వారువంబుల గుందించి తేరు గడపు
ప్రోడ దూలించి మఱియు నప్పుడమితేడు 543

ఆ పుడమి తేడు = ఆ రాముడు, కప్పు కుత్తుకసామి = నీలకంఠుని, కంటిమంటల పోలు, తూపులు, బుజముల = భుజములందు, దూర్చి దూర్చి = చొప్పించి, మిత్తికోరలతోడ = మృత్యువు కోరలతో, మేలమాడు = పరిహాసమాడు, మెఱుంగు కోలలు = వాడి బాణములు, ఊొమ్మన గ్రుచ్చి గ్రుచ్చి, పిడుగులకు, ఎనయైన = సాటియైన, బెడిదంపు = కఠినములైన, ములుకులు, ప్రక్కలన్ = పార్శ్వభాగము లందు, అతిమురి = వేగముగా, పఱపి పఱపి = వ్యాపింపచేసి, విసము క్రక్కిన = విషమును క్రక్కుచున్న, మేటి = శ్రేష్ఠమైన, వీనుల కంటి వాల్ = నాగాస్త్రమును, చెనయు = తిరస్కరించు, గిట్టలు = బాణములు, మేనన్ = రావణుని దేహమున, చొనిపి చొనిపి = చొప్పించి, మగతనముల గని అనదగిన = శౌర్యఖని యనదగిన, పంతి మెడల పొలతిండిన్ = రావణుని, ఎంతయు బడలుపఱచి = మిక్కిలి అలసిపోవునట్లు చేసి, వారువంబుల = గుఱ్ఱములను, కుందించి = బాధించి, తేరు కడపు ప్రోడ = సారథిని, తూలించి = పడగొట్టి, మఱియు = ఇంకను –

**తా :** ఆ రాముడు నీలకంఠుని కంటిమంటలవంటి బాణములు భుజములందు చొప్పించి మృత్యువు కోరలతో పరిహాసమాడు వాడి బాణములు ఊొమ్మన గ్రుచ్చి గ్రుచ్చి పిడుగులకు సాటియైన కఠినములైన బాణములు ప్రక్కల వేగముగా వ్యాపింపచేసి విషమును క్రక్కెడి నాగాస్త్రమును తిరస్కరించు బాణములు రావణుని దేహమున చొప్పించి శౌర్యఖని యనదగిన రావణునికి అలసట కలిగించి, గుఱ్ఱములను బాధించి, సారథిని పడగొట్టి –

కం. అఱ క్రొన్నెల తూపొక్కటి
పఱపి వెసన్ వాని తేఱి పడగలు గూల్చె
న్నెఱ అంపపు బల్లెంబుల
గుఱిమీఱఁగఁ దలలు జేయి గొమ్మలు దునిమెన్ 544

అఱ క్రొన్నెల తూపు = అర్ధచంద్రాకారపు బాణము, ఒక్కటి, పఱపి = ప్రయోగించి, వెసన్ = వెంటనే, వాని = రావణుని, తేఱి పడగలు = రథపు టెక్కెములు, కూల్చెన్ = పడగొట్టెను, నెఱ అంపపు బల్లెంబుల = పదునైన అంపములవంటి బాణములతో, గుఱి మీఱగన్ = లక్ష్యము తాకగా, తలలున్, చేయి కొమ్మలు = కొమ్మలవంటి చేతులు, తునిమెన్ = ఖండించెను.

తా : అర్ధచంద్రాకారపు బాణము ఒకటి ప్రయోగించి వెంటనే రావణుని ధ్వజములు పడగొట్టెను. అంపములవంటి బాణములతో లక్ష్యము తాకగా తలలు, కొమ్మలవంటి చేతులు ఖండించెను.

**కం.** **తునిమిన తలలుం జేతులు**
**మునుపున్న తెఱఁగున మఱల మొలచె, మొలచినన్**
**గని రెండలుగులు దాఁకక**
**చనెనో? తాఁకియును ద్రెంపఁ జాలక చనెనో? 545**

తునిమిన = ఖండించిన, తలలున్, చేతులున్, మునుపున్న తెఱగున = మునుపటి విధముగనే, మఱల మొలచె = తిరిగి పుట్టినవి, మొలచినన్ = పుట్టగా, కని = చూచి, రెండు అలుగులు = రెండు బాణములు, తాకక చనెనో = తగలకుండ పోయినవా?, తాకియును = తగిలియును, త్రెంపజాలక చనెనో = ఖండించలేకపోయినవా?

**తా :** ఖండించిన తలలు, చేతులు మునుపటి విధముగనే తిరిగి పుట్టినవి. పుట్టగా చూచి రెండు బాణములు తగలకుండ పోయినవా? తగిలి ఖండించలేకపోయినవా?

**ఆ.వె.** **అనుచు సందియంబు పెనగొన నించుక**
**దడవు నిలిచి చూచి కడక గఱకు**
**చిలుకులేసి తలలు చేతులు ద్రుంచిన**
**అపుడె మరల మొలిచె నబ్బురముగ 546**

అనుచు, సందియంబు పెనగొనన్ = సందేహము పెనవేసికొనగా, ఇంచుక తడవు నిలచి = కొంచెముసేపు నిశ్చేష్టుడై, చూచి, కడక = ప్రయత్నముతో, కఱకు చిలుకులు ఏసి = కఠినమైన బాణములను వేసి, తలలు చేతులు త్రుంచిన అపుడె అబ్బురముగ మరల మొలిచెను.

**తా :** అనుచు సందేహము పెనవేసికొనగా కొంచెముసేపు నిశ్చేష్టుడై చూచి కఠిన బాణములు వేసి తలలు, చేతులు త్రుంచిన అపుడె అబ్బురముగ మరల మొలిచెను.

**కం.** **మొలిచినఁ గడు వెఱఁగొందుచుఁ**
**దొలుతటి చందమున మఱియుఁ దునిమెఁ దునిమినన్**
**దలకీలు మలచి నట్టుల**
**వలనుగఁ జేతులును దలలు వైళమ మొలిచెన్ 547**

మొలిచినన్, కడు వెఱగొందుచు = ఆశ్చర్యపడుచు, తొలుతటి చందమున = మునుపటి విధముగనే, మఱియు = తిరిగి, దునిమెన్ = ఖండించెను, దునిమినన్ = ఖండించగా, తలకీలు మలచి నట్టుల = తలపాగ చుట్టినట్టుగా, వలనుగ, చక్కగా, చేతులును, తలలు, వైళమ = శీఘ్రముగా, మొలిచెన్,

**తా :** మొలిచిన ఆశ్చర్యపడుచు మునుపటి విధముగనే తిరిగి ఖండించెను. ఖండించగా తలపాగ చుట్టినట్టుగ వలనుగ చక్కగా చేతులు, తలలు శీఘ్రముగా మొలిచెను.

**కం.** **ఎడపక సింగిణి తూపులు**
**దొడిగి తలలుఁ జేయిగములు దునుమ నొడయఁ డ**

**ప్పుడె కడు కడిఁదిగ వెండియుఁ**
**బొడమునని జగంబు బీతుపూని వడంకన్** **548**

ఒడయడు = రాముడు, ఎడపక = విడువక, సింగిణి = ధనువున, తూపులు, తొడిగి, తలలు, చేయిగములు = చేతులు, కడు = మిక్కిలి, కడిదిగన్ = గట్టిగా, తునుమన్ = ఖండింపగా, అప్పుడె = వెంటనే, వెండియు = తిరిగి, పొడమును = పుట్టును, అని, జగంబు = లోకము, బీతు పూని = భయమును పొంది, వడంకన్ = వణకిపోగా –

**తా :** రాముడు విడువక ధనువున బాణములు తొడిగి తలలు, చేతులు మిక్కిలి గట్టిగా ఖండింపగా వెంటనే తిరిగి పుట్టునని లోకము భయమును పొంది వణకిపోగా –

**కం.** **తెగు తలలు మొలుచు తలలుం**
**దిగువంబడు తలలు మొగిలు తెరువునకు వడిన్**
**నెగయు తల లప్పు డబ్బుర**
**మగుచున్ జగమంత్రగాని యాటయ పోలెన్** **549**

తెగు తలలు, మొలుచు తలలున్, దిగువన్ పడు తలలు = క్రింద పడిపోతున్న తలలు, మొగిలు తెరువునకు = మేఘ మార్గమునకు, వడిన్ = శీఘ్రముగా, నెగయు తలలు = పైకి లేచే తలలును, అప్పుడు, జగమంత్రగాని = నేర్పుగల మంత్రగాని, ఆటయ పోలెన్ = ఇంద్రజాలమువలె, అబ్బురమగుచున్,

**తా :** రామ బాణములచే తెగే తలలు, మొలిచే తలలు, క్రింద పడిపోయే తలలు, మేఘ మార్గానికి పైకి లేచే తలలు కలిగి అపుడు నేర్పుగలమంత్రగాని ఆటలా అబ్బురమైంది.

**కం.** **పడియెడు తలలుం జేతులు**
**నదరించు లకోరిగములు నన్నన్న! నెఱి**
**న్నుదువుల పొలఁతుకకైనన్**
**దడవుల నిడు పనికినైనఁ దరమే యెన్నన్** **550**

పడియెడు తలలున్, చేతులున్, అదరించు = చెలరేగు, లకోరి గములు = బాణసమూహములు, అన్నన్న = ఆహా, నెఱిన్ = చక్కగా, నుదువుల పొలతుకకైనన్ = సరస్వతీదేవికైనను, తడవుల నిడు పనికినైనన్ = అనంతునికైనను, ఎన్నన్ = తెలిసికొనుటకు, తరమే = సాధ్యమా?

**తా :** పడిపోతున్న తలలు, చేతులు చెలరేగు బాణసమూహములు అన్నన్న! చక్కగా సరస్వతీదేవికైనను, ఆదిశేషునికైనను లెక్కించుటకు సాధ్యమగునా?

**ఆ.వె.** **తునిఁగి యెగయు తలలు దొర సిమ్మ ములుకులుఁ**
**గేరియాడు కాకి గ్రద్దగములుఁ**
**జదల గప్పుకొనిన జగము చీఁకటి గ్రమ్మి**
**పవలు రేయిఁ దెలియఁబడక యుండె** **551**

తునిగి = తెగి, ఎగయు = పైకి లేచుచున్న, తలలు, దొర = రాముడు, చిమ్ము = విసరు, ములు కులు = బాణములు, కేరి = విజృంభించి, ఆడు = గంతులేయుచున్న, కాకి, గ్రద్దగములున్, చదల = ఆకాశమును, కప్పుకొనిన = కప్పివేయగా, జగము చీకటిక్రమ్మి పవలురేయి తెలియబడక ఉండె.

**తా :** తెగి పైకి లేస్తున్న తలలు, రాముడు విసరుతున్న బాణములు, విజృంభించి గంతులేయుచున్న కాకులు, గ్రద్దలు ఆకాశమును కప్పివేయగా లోకము చీకటి క్రమ్మి పగలో రాత్రో తెలియబడక ఉంది.

**ఆ.వె.** **అట్టులేసి యేసి యలపును విసుకును**
**వెఱఁగు బొడమి రాచవేల్పు ఱేఁడు**
**సేయునది తెలియక చిన్నఁబోవుచు బిగి**
**యుడిగి మోము వంచి యూరకుండె** **552**

అట్టులు = ఆ ప్రకారముగా, ఏసి ఏసి = వేసి వేసి, రాచవేల్పు ఱేడున్ = రాముడును, అలపును = అలసటయును, విసుకును = విసుగును, వెఱగు = ఆశ్చర్యమును, పొడమి = కలిగి, చేయునది తెలియక, చిన్నబోవుచు = సిగ్గు పడుచు, బిగి ఉడిగి = ధైర్యము తగ్గి, మోము వంచి = ముఖము వంచుకొని, ఊరక ఉండె = మౌనముగా ఉండెను.

**తా :** ఆ ప్రకారంగా వేసి వేసి రాముడు అలసట, విసుగు, ఆశ్చర్యము కలిగి ఏ బాణము ప్రయోగించాలో తెలియక చిన్నబోయి ధైర్యం తగ్గి ముఖం వంచి మౌనంగా ఉండిపోయేడు.

**సీ.** **అపుడు విభీషణుం డద్దొరఁ జూచి యి**
**ట్లని పల్కె నెకిమీఁడ! వినుము వీని**
**బొడ్డున వెన్నుని బొడ్డు బిడ్డని మెప్పు**
**వలన వేల్పుల బువ్వ గలిగియుండు**
**నది యింకిపోవఁజేయక యున్న నిక్కూళ**
**వొలియఁడు నాఁగ నప్పుడమి ఱేఁడు**
**సిచ్చుఱ బల్లెంబుచే నది యింకించి**
**మఱి నూటతొమ్మిది మార్లు తలలు**

**తే.గీ.** **చేయిగొమ్మలు దునిమివైచిన చెనంటి**
**పొలసుమేపరి జోదొక తలను రెండు**
**చేతులును గల్గి నిలిచె జేజేలు మింట**
**మిగుల నలరుచు రామునిఁ బొగడిరంత** **553**

అపుడు విభీషణుండు ఆ దొర చూచి ఇట్లు అని పల్కెను, ఎకిమీడ!, వినుము, వీని బొడ్డున, వెన్నుని బొడ్డు బిడ్డని = బ్రహ్మదేవుని, మెప్పు వలన, వేల్పుల బువ్వ = అమృతము, కలిగి యుండును, అది ఇంకిపోవ చేయకయున్న, ఈ కూళ = ఈ నీచుడు, పొలియడు = చావడు, నాగ = అని చెప్పగా, ఆ పుడమి ఱేడు, చిచ్చుఱ బల్లెంబుచేన్ = ఆగ్నేయాస్త్రముచే, అది = ఆ అమృతమును, ఇంకించి

= ఇగురగొట్టి, మఱి = మఱియును, నూటతొమ్మిదిమార్లు తలలు, చేయి కొమ్మలు = కొమ్మలవంటి చేతులు, తునిమివైచినన్ = ఖండించగా, చెనంటి = ఆ నీచుడైన, పొలసు మేపరి జోదు = రావణుడు, ఒక తలను రెండు చేతులును కల్గి, నిలిచె, జేజేలు మింట = ఆకాశమున, మిగులన్ = మిక్కిలి, అలరుచు = సంతోషించుచు, అంత = అందరూ, పొగడిరి.

**తా :** అపుడు విభీషణుడు రాముని చూచి 'ప్రభూ! విను, వీని బొడ్డున బ్రహ్మదేవుని మెప్పు వలన అమృతము కలిగియున్నది. అది ఇంకిపోవ చేయకున్న ఈ నీచుడు చావడు' అని చెప్పగా ఆ రాజు ఆగ్నేయాస్త్రముచే ఆ అమృతమును ఇంకించి తరువాత 109 పర్యాయములు తలలు, చేయి కొమ్మలు ఖండించగా ఆ నీచుడైన రావణుడు ఒక తల రెండు చేతులు కల్గి నిలబడ్డాడు. ఆకాశంలో మిక్కిలి సంతోషంతో అందరూ పొగిడారు.

**కం.** **తన గుట్టు పగతునకుఁ దె**
**ల్పెను వీఁడని కినిసి యవ్విభీషణుపై స**
**త్తిని నిగుడ్చె రావణుం దది**
**తునియలుగా నొడయఁ డొక్క తూపునవైచెన్** **554**

తన గుట్టు = తన మరణ రహస్యమును, పగతునకు, వీడు తెల్పెను అని కినిసి ఆ విభీషణుపై, సత్తిని = శక్తిని, నిగుడ్చె = ప్రయోగించెను, అది = ఆ శక్తిని, ఒడయడు = రాముడు, ఒక్క తూపున = ఒకేఒక్క బాణమున, తునియలుగా వైచెన్ = ముక్కలగునట్లుగా కొట్టెను.

**తా :** తన మరణ రహస్యమును శత్రువుకి వీడు చెప్పేడని కోపించి రావణుడు విభీషణునిపై శక్తి బాణాన్ని ప్రయోగించేడు. ఆ శక్తిని రాముడు ఒకే ఒక్క బాణంతో ముక్కలు చేసేడు.

**కం.** **తలయొండు రెండు చేతులు**
**గలిగియు రక్కసుఁడు దొంటికంటె నసం బ**
**గ్గలమై పెనఁగొన రాముని**
**నెలసి పెనంగుచు లకోరు లేయుచునుండెన్** **555**

తల ఒండు, రెండు చేతులు కలిగియు రక్కసుడు = రావణుడు, తొంటికంటెన్ = మునుపటి కంటెను, అసంబు అగ్గలమై = దర్పము అధికమై, పెనగొన = ఆవరించగా, రామునిన్, ఎలసి = ఎదిరించి, పెనంగుచు = పోరాడుచు, లకోరులు = బాణములు, ఏయుచునుండెన్.

**తా :** ఒక తల, రెండు చేతులు కలిగి రావణుడు మునుపటికంటే దర్పము అధికమై ఆవరించగా రాముని ఎదిరించి పోరాడుచు బాణములు వేయుచుండెను.

**తే.గీ.** **అపుడు మాతలి భరతుని యన్నఁ జూచి**
**నేలతాలుప! యింక జాగేల? వీనిఁ**
**దునుముమని తెల్పుటయు రాచ తొగలతేఁడు**
**బొమ్మయమ్మేర్చి యరిఁ గూర్చి నెమ్మి నేసె** **556**

అపుడు మాతలి, భరతుని అన్నన్ = రాముని, చూచి, నేలతాలుప = రామా!, ఇంక జాగు ఏల?, వీనిన్ దునుముమని తెల్పుటయు, రాచతొగలతేడు = రాజచంద్రుడు, బొమ్మ అమ్ము ఏర్చి = బ్రహ్మాస్త్రమును ఎంచుకొని, అరిన్ కూర్చి = నారికి సంధించి, నెమ్మిన్ = సంతోషముతో, ఏసె = వేసెను.

**తా :** అపుడు మాతలి రాముని చూచి 'రాజా! ఇంకా ఆలస్యమెందుకు? వీణ్ణి సంహరించు' అని తెల్పగా రాముడు బ్రహ్మాస్త్రమునెంచుకొని నారికి సంధించి సంతోషముతో వేసెను.

**సీ.** **ఏసిన నక్కోల యేడ్తెఱఁ బదివేల**
**వేఁడి వెలుంగుల వెలుఁగు గలిగి**
**జగము లుడుపుతఱి నెగడెడు నగ్గి చం**
**దానఁ దద్దయు మంట లీనుకొనుచు**
**సత పయ్యరలును వేగ (రేగి)తొడంగి యదరు కై**
**వడి నబ్బురంపు నెవ్వడి నెసంగి**
**కఱివేల్పు సుడివాలుకంటె ముక్కంటి ము**
**మ్మొనల వాల్కంటెను ముఱువుమీఱి**

**తే.గీ.** **యెల్ల పజలకు బలితంపు టెదరు దోఁప**
**నుద్దవిడి నేఁగి రాకాసి పెద్ద ఱొమ్ముఁ**
**గాఁడి యుసురులు దొలఁగించి గాడ్పుదిండి**
**ప్రోలు గన్గొని క్రమ్మఱఁ బొదినిఁ జొచ్చె** **557**

ఏసిన = వేయగా, ఆ కోల = ఆ బాణము, ఏడ్తెఱ = అతిశయముతో, పదివేల వేడి వెలుంగుల = పదివేల సూర్యుల, వెలుంగు కలిగి = కాంతి కలిగి, జగములు = లోకములు, ఉడుపు తఱిన్ = నాశము చేయునపుడు, నెగడెడు = విజృంభించు, అగ్గి చందానన్ = ప్రళయాగ్ని వలె, తద్దయు = మిక్కిలి, మంటలు, ఈనుకొనుచు = పుట్టించుచు, సత పయ్యరలును = సప్త వాయువులును (గోగంధము, వాసంతము, కించులుకము, ఇరింగణము, ఝుంఝు, చూషకము, వాత్య), వేగ, తొడంగి = పూని, అదరుకైవడిన్ = విజృంభించు రీతిగా, అబ్బురంపు = ఆశ్చర్యకరమైన, నెవ్వడిన్ ఎసంగి = వేగముతో ఒప్పి, కఱివేల్పు సుడివాలుకంటె = విష్ణువు చక్రముకంటెను, ముక్కంటి ముమ్మొనల వాలు కంటెను = శంకరుని త్రిశూలము కంటెను, ముఱువు మీఱి = చక్కగా మీరినదై, ఎల్ల పజలకు = లోకమునకు, బలితంపు ఎదరు తోప = గొప్ప భయమును కలిగింపగా, ఉద్దవిడిన్ = వేగముగా, ఏగి = వెళ్ళి, రాకాసి పెద్ద = రావణుని, ఱొమ్ము గాడి = ఱొమ్మున నాటుకొని, ఉసురులు తొలగించి = ప్రాణములు పోగొట్టి, గాడ్పుతిండి ప్రోలు = పాతాళమును, కన్గొని = చూచి, క్రమ్మఱ = తిరిగి, పొదిని జొచ్చె = అమ్ములపొదిని చేరెను.

**తా :** వేయగా ఆ బాణము అతిశయముతో పదివేల సూర్యుల కాంతి కలిగి లోకములు నాశము చేయునపుడు విజృంభించు ప్రళయాగ్నివలె మిక్కిలి మంటలు పుట్టించుచు సప్త వాయువులను

పూని విజృంభించురీతిగా ఆశ్చర్యకరమైన వేగముతో ఒప్పి విష్ణువు చక్రము కంటే, శంకరుని త్రిశూలము కంటే మీఱినదై లోకమునకు గొప్ప భయమును కలిగింపగా వేగముగా వెళ్ళి రావణుని ఱొమ్మున నాటుకొని ప్రాణములు పోగొట్టి పాతాళమును చూచి తిరిగి అమ్ములపొదిని చేరెను.

**తే.గీ.** **నెత్తురులఁ దోఁగి బవరంపు నేలఁ ద్రెళ్ళి**
**సోఁకుదొర యొప్పె గట్టులసూడు ఱాతి**
**వాలుచేఁ బడ్డ జేవురు వాఁగు గముల**
**తో నెనయు మేటి గుబ్బలితో దొరయుచు** **558**

నెత్తురులన్, దోగి = మునిగి, బవరంపు నేలన్ = యుద్ధభూమిని, త్రెళ్ళి = పడి, సోకుదొర = రావణుడు, గట్టులసూడు = ఇంద్రుడు, ఱాతి వాలుచే = వజ్రాయుధముచే, పడ్డ = పడిపోయిన, జేవురు వాగు గములుతోన్ = ఎఱ్ఱని జలముకల సెలయేళ్ళతో, ఎనయు = ఒప్పునట్టి, మేటి గుబ్బలితో దొరయుచు = గొప్ప పర్వతముతో ఉపమింపదగుచు, ఒప్పెను.

**తా :** రక్తములో మునిగి యుద్ధభూమిని పడి రావణుడు ఇంద్రుడు వజ్రాయుధముచే పడి పోయిన ఎఱ్ఱని జలముకల సెలయేళ్ళతో ఒప్పు గొప్ప పర్వతముతో పోల్చదగుచు ఒప్పెను.

**తే.గీ.** **అపుడు జేజేలు ఱేనిపై నలరువానఁ**
**గురిసి వేలుపు బేరులు మొరయఁ జేసి**
**రెలమి నచ్చర లాడిరి చలువతావి**
**తెమ్మెరలు వీఁచ జగములు తెలివి నెసఁగె** **559**

అపుడు, జేజేలు, ఱేనిపైన్, అలరువాన = పూలవర్షము, కురిసి = చల్లి, వేలుపు బేరులు = దేవ దుందుభులు, మొరయ చేసిరి = మ్రోగించిరి, ఎలమిన్ = సంతోషముతో, అచ్చరలు, ఆడిరి, చలువతావి తెమ్మెరలు = చల్లని పరిమళ వాయువులు, వీచ = వీచగా, జగములు = లోకములు, తెలివిన్ ఎసగె = ప్రకాశవంతములైనవి.

**తా :** అపుడు దేవతలు రామునిపై పూలవర్షము చల్లి దేవ దుందుభులు మ్రోగించిరి. సంతోషముతో అప్సరసలు నాట్యము చేసిరి. చల్లని పరిమళ వాయువులు వీచగా లోకములు ప్రకాశవంతములైనవి.

**సీ.** **అంత విభీషణుఁ డాలంపుఁ బుడమిలోఁ**
**బడియున్న తన యన్న కడకు జేరి**
**పలుచందముల వెతఁబడుచుఁ దద్దయు నేడ్చి**
**పిదప మందోదరి మొదలు గలుగు**
**నల్లద్రావుడు ఱేని నగరి పడంతుక**
**లచటికిఁ బఱతెంచి యార్పు లెసఁగఁ**
**దమ సామిపైఁ బడి తలగని ద్రంతల**
**నొఱలుచుండఁగ వారి నూఱడించి**

**తే.గీ. మరలఁ బ్రోలికిఁ బోఁబంచి యెఱచిదిండి**
**మిన్న రాముని యానతి నన్న కగ్గి**
**పనులు లోనగు వెనుకటి పనులు ప్రాఁత**
**పలుకు జాడల నొనరించి యలరు నెడల 560**

అంత విభీషణుడు, ఆలంపు బుడమిలోన = యుద్ధభూమిలో, పడియున్న తన అన్న కడకు చేరి పలుచందముల, వెత పడుచు = విచారించుచు, తద్దయు = మిక్కిలి, ఏడ్చి, పిదప మందోదరి మొదలు కలుగు, నల్ల త్రావుడు ఱేని నగరి పడంతుకలు = రావణుని అంతిపుర స్త్రీలు, అచటికి పఱతెంచి ఆర్పులు ఎసగన్, తమ సామిపైన్ పడి, తలగని = తొలగని, వ్రంతల = కష్టములతో, ఒఱలుచుండ = బాధపడుచుండగా, వారిన్ ఊఱడించి మరల ప్రోలికి పోన్, పంచి = పంపి, ఎఱచితిండి మిన్న = విభీషణుడు, రాముని ఆనతిన్ అన్నకు, అగ్గిపనులు = అగ్నిసంస్కారములు, లోనగు = మొదలైన, వెనుకటి పనులు = మరణానంతరము చేయవలసిన పనులు, ప్రాత పలుకు జాడలన్ = వేదసమ్మతముగా, ఒనరించి అలరున్ ఎడల = చేసి సంతసించు సమయమున,

**తా :** అంత విభీషణుడు యుద్ధభూమిలో పడియున్న తన అన్న కడకు చేరి పలుచందముల విచారించుచు మిక్కిలి ఏడ్చి పిదప మండోదరి మొదలు కలుగు రావణుని అంతిపుర స్త్రీలు అక్కడికి వచ్చి రోదించుచు తమ స్వామిపై పడి తొలగని కష్టములతో బాధపడుచుండగా వారిని ఊఱడించి మరల నగరుకు పంపివేసి విభీషణుడు రాముని ఆనతిని అన్నకు అగ్నిసంస్కారములు మొదలైన మరణానంతరము చేయవలసిన పనులు వేదసమ్మతముగా ఒనరించి సంతసించు సమయమున –

**ఆ.వె పుడమిఱేఁడు తోడఁబుట్టువుఁ జూచి యీ**
**ప్రాఁత వేల్పు మేలిబంతిఁ దోడు**
**కొనుచుఁబోయి యచట గొబ్బున లంకకు**
**నెమ్మి దొరను జేసి నిలిపి రమ్ము 561**

పుడమి ఱేడు = రాముడు, తోడబుట్టువు చూచి = లక్ష్మణుని చూచి, ఈ ప్రాతవేల్పు మేలిబంతిన్ = ఈ రాక్షస శ్రేష్ఠుడైన విభీషణుని, తోడుకొనుచు పోయి = కూడబెట్టుకు వెళ్ళి, అచట = ఆ లంకా నగరమున, గొబ్బున = వెంటనే, నెమ్మి = సంతోషముతో, అచట = అక్కడ, లంకకు దొరను చేసి, నిలిపి రమ్ము = పట్టాభిషేకముచేసి రమ్ము.

**తా :** రాముడు లక్ష్మణుని చూచి ఈ రాక్షస శ్రేష్ఠుడైన విభీషణుని తోడుకొనిపోయి ఆ లంకానగరమున వెంటనే సంతోషముతో అక్కడ లంకకు దొరను చేసి నిలిపి రమ్ము.

**ఆ.వె. అనుచు నానతిడిన నాతఁ డాతనిఁదోడు**
**కొనుచు దీవికేఁగి కోఁతిబంట్ల**
**నపుడె పనిచి పున్నియపు టేర్ల నీరు దె**
**ప్పించి యొజ్జపిండుఁ బిలువఁ బంచి 562**

అనుచున్, ఆనతి ఇడినన్ = ఆజ్ఞాపింపగా, ఆతడు = లక్ష్మణుడు, ఆతని తోడుకొనుచు = విభీషణుని తీసుకొని, దీవికి ఏగి = లంకకు వెళ్ళి, కోతిబంట్లను = వానర వీరులను, అపుడె = అంతకుముందె, పనిచి = పంపి, పున్నియపు ఏర్లు = పుణ్యనదులనుండి, నీరు తెప్పించి, ఒజ్జపిండున్ = పురోహిత బృందమును, పిలువ పంచి = పిలుచుటకు ఆదేశించి –

**తా :** అనుచు ఆజ్ఞాపింపగా లక్ష్మణుడు విభీషణుని తోడ్కొని లంకకు వెళ్ళి వానరవీరులను అపుడే పంపించి పుణ్యనదులనుండి నీరు తెప్పించి పురోహితులను పిలుచుట కాదేశించి –

**తే.గీ.** **మేలి యపరంజి పనికొల్వు మేడలోనఁ**
**బెద్ద రతనాల సింగపుఁ బీఁట మీఁదఁ**
**బొలసు మేపరి యెకిమీని నిలిపి నీరు**
**పైనిఁ జిలికించి నొసల హొన్నుబట్టుఁ గట్టి** **563**

మేలి = శ్రేష్ఠమైన, అపరంజి = బంగారుతో, పని = చేయబడిన, కొల్వు మేడలోన = సభా భవనంలో, పెద్ద రతనాల సింగపు పీట మీద, పొలసు మేపరి ఎకిమీని = రాక్షస శ్రేష్ఠుని విభీషణుని, నిలిపి = ఉంచి, పైనిన్ = ఆయన శిరసుపై, నీరు చిలికించి = నీరు అభిషేకించి, నొసలన్ = నుదుటియందు, హొన్ను పట్టు = బంగారు పట్టమును, కట్టి –

**తా :** శ్రేష్ఠమైన బంగారుతో చేయబడిన సభాభవనంలో పెద్ద రతనాల సింహాసనంమీద విభీషణుని నిలిపి శిరసుపై నీరు అభిషేకించి నుదుటియందు బంగారుపట్టమును కట్టి –

**కం.** **చలివెలుఁగు ప్రొద్దు రిక్కలు**
**చిలువల యెకిమీఁడు పంటచెలి రాము కత**
**ల్గలయన్నినాళ్ళు దొరవై**
**యలరుచు నిద్దీవి యేలుమని దీవించెన్** **564**

చలివెలుగు = చంద్రుడు, ప్రొద్దు = సూర్యుడు, రిక్కలు = నక్షత్రములు, చిలువల ఎకిమీడు = ఆదిశేషుడు, పంటచెలి = భూమి, రాముకతల్ = రాముని కథలు, కలయన్నినాళ్ళు = ఉన్నన్ని రోజులు, దొరవై = రాజువై, అలరుచు = ప్రకాశించుచు, ఈ దీవిన్ = ఈ లంకను, ఏలుమని దీవించెన్ = పరిపాలింపుమని ఆశీర్వదించెను.

**తా :** చంద్రుడు, సూర్యుడు, నక్షత్రములు, ఆదిశేషుడు, భూమి, రాముని కథలు ఉన్నన్ని రోజులు రాజువై ప్రకాశించుచు ఈ లంకను ఏలుమని దీవించెను.

**తే.గీ.** **అట్లు దొరయై విభీషణుఁ డపుడె మాని**
**కంపు దొడవులు బసిడి పుట్టంపుగములు**
**నింబుగాగొని లక్ష్మణు వెంబడి జని**
**కడcక రాసింగమున కుడుగర లొసంగె** **565**

అట్లు = ఆ విధంగా, దొరయై, విభీషణుడు, అపుడె = వెంటనే, మానికంపు తొడవులు = మాణిక్య నగలు, పసిడి పుట్టంపు గములున్ = బంగారు వస్త్ర సమూహములు, ఇంబుగా కొని = చక్కగా

తీసుకొని, లక్ష్మణు వెంబడి, చని కదంక = రాముని దగ్గరకు పూనికతో వెళ్ళి, రాసింగ మునకు = రాజ సింహమునకు, ఉడుగరలు ఒసగె = కానుక లిచ్చెను.

**తా :** ఆ విధముగా దొరయై విభీషణుడు వెంటనే మాణిక్య నగలు, బంగారు వస్త్రములు చక్కగా తీసుకొని లక్ష్మణు వెంబడి రాముని దగ్గరకు వెళ్ళి యాతనికి కానుకలిచ్చెను.

**కం.** **ఒసఁగిన నెకిమీఁ దవి నెన**
**రెసఁగఁగ మాతలికి నిచ్చి యిమ్ముగ వేల్పుం**
**బసకుం బనిచిన నాతడు**
**వెసఁ జనె రాతొగల తేని వీడ్కొని యెలమిన్** **566**

ఒసగినన్, ఎకిమీడు అవి, నెనరు ఎసగగ = మిక్కిలి ప్రేమతో, మాతలికిన్ ఇచ్చి = మాతలికి సమర్పించి, ఇమ్ముగ = చక్కగా, వేల్పుం బసకున్ = స్వర్గమునకు, పనిచినన్ = పంపగా, ఆతడు = ఆ మాతలి, రాతొగల తేని = రాజ చంద్రుని, ఎలమిన్ = సంతోషముతో, వీడ్కొని = విడచిపెట్టి, వెసన్ చనె = శీఘ్రముగా వెళ్ళెను.

**తా :** ఒసగిన రాముడు అవి మిక్కిలి ప్రీతితో మాతలికి ఇచ్చి చక్కగా స్వర్గమునకు పంపగా, ఆ మాతలి రాముని సంతోషముతో విడచిపెట్టి శీఘ్రముగా వెళ్ళెను.

**కం.** **అంతట దొర రక్కసి మే**
**ల్బంతింగని దీవి కీవు పనివిని మా లా**
**గంతయును దెలిపి పంట ప**
**డంతి నిసుఁగుఁ దోడుకొని కదంకన్ రమ్మా!** **567**

అంతటన్ = ఆ పిమ్మట, దొర = రాముడు, రక్కసి మేల్బంతిన్ = విభీషణుని, కని, ఈవు = నీవు, దీవి = లంకకు, పనివిని = వెళ్ళి, మా లాగు అంతయును = మా విషయమునంతను, తెలిపి, పంట పడంతి నిసుగున్ = సీతను, కదంకన్ = పూనుకొని, తోడుకొని రమ్మా = తీసుకొని రమ్ము.

**తా :** అంతట రాముడు విభీషణుని చూచి నీవు లంకకు వెళ్ళి మా విజయమును తెలియజేసి సీతను తీసుకొని రమ్ము.

**కం.** **అని పనుప నతఁడు గొబ్బునఁ**
**జని కొందఱు ప్రాఁతవేల్పు చానల నారా**
**ముని చెలి నలరించుటకుం**
**బనిగొల్పిన వారలేఁగి బత్తి దలిర్పన్** **568**

అని, పనుప = పంపగా, అతడు = విభీషణుడు, గొబ్బునన్ = శీఘ్రముగా, చని, కొందఱు, ప్రాత వేల్పు చానలన్ = రాక్షస కాంతలను, ఆ రాముని చెలిన్ = ఆ సీతను, అలరించుటకున్ = ఆనందింపచేయుటకు (అలంకరించుటకు), పని కొల్పిన = ఆజ్ఞాపించిన, వారలు, ఏగి, బత్తి తలిర్పన్ = భక్తి ఒప్పునట్లుగా –

**తా :** అని పంపగా విభీషణుడు శీఘ్రముగా చని కొందఱు రాక్షస కాంతలను ఆ సీతను అలంకరించుటకు ఆజ్ఞాపించిన వారలు ఏగి భక్తి అతిశయింపగా –

**తే.గీ. పుడమిచూలికిఁ దలయంటి యొడలు నలిచి**
**వలపు గొజ్జంగి పూనీట జలకమార్చి**
**మడుఁగు పుట్టంబుఁ గట్టి బల్మానికంపు**
**రవణములు వెట్టి యలరు సరములు వైచి 569**

పుడమి చూలికిన్ = సీతకు, తలయంటి, ఒడలు నలిచి = నలుగుపెట్టి, వలపు = పరిమళించు, గొజ్జంగిపూ నీటన్ = గొజ్జంగిపూల నీటితో, జలకము ఆర్చి = స్నానము చేయించి, మడుగు పుట్టంబు = శుభ్ర వస్త్రములను, కట్టి = ధరింపచేసి, బలు మానికంపు రవణములు పెట్టి = మంచి మాణిక్య ఆభరణములు పెట్టి, అలరు సరములు = పూలదండలు, వైచి = పెట్టి.

**తా :** సీతకు తలయంటి, నలుగుపెట్టి, పరిమళించు గొజ్జంగిపూల నీటితో స్నానము చేయించి, శుభ్ర వస్త్రములు ధరింపజేసి, మాణిక్యాభరణములు పెట్టి, పూలదండలు పెట్టి.

**తే.గీ. కుందనపు టందలంబునఁ గొమ్మ నునిచి**
**తెచ్చుటయు నాతఁ డా రాచ మచ్చెకంటిఁ**
**దోడుకొని తద్ద వేడుకతోడ నేఁగి**
**నేలతాలుపు తలమిన్న మ్రోల నిలిపె 570**

కుందనపు అందలంబునన్ = బంగారు పల్లకిలో, కొమ్మను ఉనిచి = సీతను కూర్చుండపెట్టి, తెచ్చుటయున్, ఆతడు = విభీషణుడు, ఆ రాచ మచ్చెకంటిన్ = ఆ రాచకాంతను, తోడుకొని = తీసుకొని, తద్ద = మిక్కిలి, వేడుకతోడన్ = సంతోషముతో, ఏగి = వెళ్ళి, నేలతాలుపు తలమిన్న మ్రోల = రాముని ముందు, నిలిపె.

**తా :** బంగారు పల్లకిలో సీతను కూర్చుండపెట్టి తెచ్చుటయును విభీషణుడు ఆ రాచకాంతను తోడుకొని మిక్కిలి సంతోషముతో వెళ్ళి రాముని ముందు నిలిపెను.

**కం. నిలిపిన రాగవు డన్నెల**
**తల తలమానికముఁ జూచి తలవంచి మదిన్**
**దలముగ వగపును నానయు**
**నలుకయు బొడమంగ నిట్టులని వాక్రుచ్చెన్ 571**

నిలిపిన, రాగవుడు, ఆ నెలతల తలమానికము = ఆ స్త్రీ శిరోమణిని, చూచి, తలవంచి, మదిన్, తలముగ = అధికమైన, వగపును = బాధయును, నానయున్ = సిగ్గును, అలుకయు = కోపమును, పొడమంగ = పుట్టగ, ఇట్టులు అని, వాక్రుచ్చెన్ = పలికెను.

**తా :** నిలిపిన రాముడు ఆ స్త్రీ శిరోమణిని చూచి తలవంచి మదిలో అధికమైన బాధ, సిగ్గు, కోపము పుట్టగ ఇట్టులని పలికెను.

**కం. సకియ! మగపాడి కొఱ కె**
**న్నికగాఁ బగతుని నడంచి నినుఁ జెఱలోఁ జి**
**క్కక యుండు నట్లొనర్చితి**
**నిఁక నీ మది వచ్చుచోటి కేఁగుము నెమ్మిన్ 572**

సకియ =సఖీ, మగపాడి కొఱకు = శౌర్యము కొఱకు, ఎన్నికగా = గుర్తుగా, పగతునిన్ = శత్రువును, అడంచి = చంపి, నిను, చెఱలో, చిక్కక ఉండునట్లు ఒనర్చితిని. ఇక నీ మది వచ్చుచోటికి నెమ్మిన్ ఏగుము.

**తా :** సఖీ! నా పౌరుషమునకు గుర్తుగా శత్రువును చంపి నిన్ను చెఱలో చిక్కకుండునట్లు చేసితిని. ఇక నీ మది వచ్చుచోటికి సంతోషముతో వెళ్ళుము.

**మ.** **ఒరునింటన్ జెఱనున్న చేడియను లో నొక్కింతయు న్నాన లే**
**క రహిం జేకొనువాని నొల్ల రరయంగా బల్లిదు ల్బీరముల్**
**నెరపం జాలెడు రాచమానిసి మది న్నేర్పేది యిచ్చేఁత కే**
**కరణిం జొచ్చు? నటౌట నొప్పదు నినుం గైకొంట మా కుగ్మలీ!** **573**

ఒరుని ఇంటన్ = పరుని ఇంటిలో, చెఱను ఉన్న చేడియను, లోన్ = మనసులో, ఒక్కింతయున్, నాన లేక = సిగ్గుపడక, రహిన్ = ఆసక్తితో, చేకొనువానిని = స్వీకరించు వానిని, అరయంగా = పరిశీలింపగా, బల్లిదుల్ = పరాక్రమవంతులు, ఒల్లరు = అంగీకరింపరు, బీరముల్ = శౌర్యమును, నెరపం చాలెడు = ప్రదర్శింప సమర్థుడైన, రాచమానిసి మదిన్ = క్షత్రియుడు మనసున, నేర్పు ఏది = నైపుణ్యము పోగొట్టుకొని, ఈ చేతకు = పరుని ఇంటనున్న కాంతను స్వీకరించుటకు, ఏ కరణిం చొచ్చు = ఏవిధముగా అంగీకరించును, అటు ఔట = అట్లగుటచే, నినున్, కైకొంట = స్వీకరించుట, ఉగ్మలీ = ఓ వనితా!, మాకు, ఒప్పదు = తగినది కాదు.

**తా :** పరుని ఇంటిలో చెఱలోనున్న స్త్రీని మనసులో కొంచెంకూడా సిగ్గుపడక ఆసక్తితో స్వీకరించువానిని పరిశీలింపగా పరాక్రమవంతులు అంగీకరింపరు. శౌర్యమును ప్రదర్శింప సమర్థుడైన క్షత్రియుడు మనసున నైపుణ్యము పోగొట్టుకొని పరుని ఇంటనున్న కాంతను స్వీకరించుటకు ఏ విధముగా అంగీకరించును. అట్లగుటచే నిన్ను స్వీకరించుట ఓ సీతా! మాకు తగినది కాదు.

**ఆ.వె.** **అనినఁ దద్ద యొఱలి యుముద్దరా లిట్టు**
**లనియె నిట్టి కఱకు లాడనేల?**
**ఱేఁడ! నిన్నె మదిని ఱేపును మాపును**
**దలఁచుచుందు నొండు తలఁపు మాని** **574**

అనినన్, తద్ద, ఒఱలి = బాధనొంది, ఆ ముద్దరాలు ఇట్టులు అనియె = ఆ సీత ఈరీతిగా పలికెను, ఱేడ = రాజా!, ఇట్టి కఱకులు ఆడనేల = ఇంత కఠినములు పలుకనేల?, మదిని, ఱేపును మాపును = రాత్రింబవళ్ళు, నిన్నె, ఒండు తలంపు మాని తలచుచుందును.

**తా :** అనిన మిక్కిలిబాధనొంది ఆ సీత 'రాజా! ఇంత కఠినములు పలుకగనేల? మనసులో రాత్రింబవళ్ళు నిన్నే వేఱు తలంపు మాని తలచుకొనుచుందును.

**కం.** **పలువ తొలివేల్పు చేబడి**
**పలువంతలఁ గుంది కుంది బడలిన దానిన్**

**గలచుట పాడియె? యిపుడ**
**గ్గలముగ నో పున్నియంపు గని! తగ నీకున్ 575**

ఓ పున్నియంపు గని!, పలువ = నీచుడగు, తొలివేల్పు = రాక్షసుని, చే పడి = చేతిలోపడి, పలు వంతల = పలు కష్టములతో, కుంది = శోకించి, కుంది = కృశించి, బడలిన దానిన్ = అలసిపోయిన నన్ను, ఇపుడు, అగ్గలముగ = అధికముగ, కలచుట = క్షోభింపచేయుట, నీకున్ తగన్ = తగినదై, పాడియె = న్యాయమా?,

**తా :** ఓ పుణ్యాత్ముడా! నీచుడగు రావణుని చేతిలోపడి పలు కష్టములతో శోకించి కృశించి అలసి పోయిన నన్ను ఇపుడు అధికముగ క్షోభింపచేయుట నీకు తగిన న్యాయమా?

**ఆ.వె.** **వేయునేల? వినుము రాయఁడ! నీ వెద**
**నమ్మకుంటివేని నెమ్మి నగ్గి**
**సొచ్చి వెడలుదానఁ జెచ్చెర నానతి**
**సేయుమింక జాగు సేయవలదు 576**

వేయునేల = వేయిమాటలు ఎందులకు?, రాయడ = ప్రభూ!, వినుము, నీవు ఎద నమ్మ కుంటివి ఏని నెమ్మిన్ అగ్గి చొచ్చి వెడలుదాన, చెచ్చెర = శీఘ్రముగా, ఆనతి చేయుము, ఇంక జాగు చేయవలదు.

**తా :** వేయిమాటలెందులకు? ప్రభూ! వినుము. నీవు మనసులో నమ్మకున్నచో సంతోషముగా అగ్నిలో ప్రవేశించి బయటకు రాగలను. శీఘ్రముగా ఆజ్ఞ ఇమ్ము. ఇంక జాగు వలదు'.

**ఆ.వె.** **అనిన రాముఁ డట్ల యొనరింపు మనుచు ల**
**క్ష్మణుని బలుక నతఁడు గట్టె లెన్ని**
**యైన వామివైచి అగ్గి రవుల్కొనఁ**
**జేయ మిన్నుముట్టి చిచ్చు పెరిఁగె 577**

అనిన, రాముడు అట్ల ఒనరింపుము అనుచు లక్ష్మణుని పలుకన్ అతడు కట్టెలు ఎన్నియైన వామివైచి = గుట్టగా వేసి, అగ్గి రవుల్కొన చేయ మిన్నుముట్టి చిచ్చు పెరిగె.

**తా :** అనిన రాముడు అలా చేయుమనుచు లక్ష్మణుని పలుకగా అతడు ఎన్నో కట్టెలు గుట్టగా వేసి అగ్గి రగుల్కొన చేయ మిన్నుముట్టి చిచ్చు పెరిగెను.

**తే.గీ.** **అప్పు దప్పంట వాల్గంటి యనుఁగుఁబట్టి**
**దంట మోముల సామికి దండమొసఁగి**
**ఱేని యడుగులు డెందమ్ములోన నిలిపి**
**బెగడు పూనక సొదఁ జొచ్చె జగము లదర 578**

అప్పుడు, ఆ పంట వాల్గంటి = ఆ భూదేవియొక్క, అనుగు పట్టి = ప్రియ పుత్రిక సీత, దంట మోముల సామికి = అగ్నికి, దండము ఒసగి = నమస్కరించి, ఱేని అడుగులు = రాముని పాదములు,

డెందమ్ములోన నిలిపి = మనసులో నిలుపుకొని, బెగడు పూనక = భీతి చెందక, సొదన్ = అగ్నిని, జగములు అదర = లోకములు అదరిపడునట్లుగా, చొచ్చెన్ = ప్రవేశించెను.

**తా :** అప్పుడు ఆ భూదేవియొక్క ప్రియపుత్రిక సీత అగ్నికి నమస్కరించి రాముని పాదములు మనసులో నిలుపుకొని భీతిచెందక లోకములు అదరిపడునట్లుగా అగ్నిలో ప్రవేశించెను.

**ఆ.వె.** **చొచ్చుటయును గాడ్పు నెచ్చెలి తన వెచ్చ**
**దనము మాని చల్లఁదనము పూనెఁ**
**గెంపుఁబాల నడుమ సొంపారు పసిఁడి స**
**లాకపోలె సీత లలిఁ దనర్చె** **579**

చొచ్చుటయును = ప్రవేశించుటయును, గాడ్పు నెచ్చెలి = అగ్ని, తన వెచ్చదనము మాని చల్లదనము పూనె, కెంపుఁబాల నడుమ = ఎఱ్ఱని రత్నముల మధ్యలో, సొంపారు = అందమైన, పసిడిసలాకపోలె = బంగారు శలాకవలె, సీత, లలి = అందముగా, తనర్చె = ఒప్పెను.

**తా :** ప్రవేశింపగా అగ్ని తన వెచ్చదనము మాని చల్లదనము పూనెను. ఎఱ్ఱని రత్నముల మధ్యలో అందమైన బంగారు శలాకవలె సీత అందముగా ఒప్పెను.

**వ.** **అట్టియెడ** **580**

**తా :** ఆ సమయమున

**సీ.** **ఏనుంగు మేఁకపో తెనుబోతు మానిసి**
**మొస లిఱ్ఱి గుఱ్ఱము పసులఱేఁడు**
**ఠీవియుఁ దేజుఁ బాడియు మగంటిమి తాల్మి**
**వడి కల్మి యుడివోని కడిఁది మేలు**
**మగఱాతివాలు సత్తి గుదియ బల్లెము**
**త్రాడు టెక్కెము కత్తి దండి విల్లు**
**వేల్పులు మినుకులు పెతలు రక్కసు లేర్లు**
**తావులు జక్కులు తపసి బూచి**

**తే.గీ.** **గములు నెక్కిళ్ళు నోజలు గైదువులును**
**గొలుపులుగ నొప్పు గట్టులగొంగ యగి**
**జముఁడు తొలివేల్పు పడమటి సామి గాలి**
**చాగకాఁడును నెలతాల్పు మూఁగి కొలువ** **581**

ఏనుంగు, మేకపోతు, ఎనుబోతు, మానిసి, మొసలి, ఇఱ్ఱి = లేడి, గుఱ్ఱము, పసులఱేడు = ఆబోతును, (ఈ ఎనిమిదియును అష్టదిక్పాలకుల వాహనములు) ఠీవియును = వైభవమును, తేజున్ = కాంతియును, పాడియు = న్యాయమును, మగంటిమి = పౌరుషమును, తాల్మి = ఓర్పును, వడి = శీఘ్రత్వమును, కల్మి = సంపదయును, ఉడిపోని = తగ్గని, కడింది = సాహసము, (ఈ ఎనిమిది

దిక్పాలకుల స్వభావములు) మేలు = శ్రేష్ఠమైన, మగటాతివాలు = వజ్రాయుధమును, సత్తి = శక్తియును, గుదియ = గదయును, బల్లెము, త్రాడు = పాశమును, టెక్కెము = ధ్వజమును, కత్తి, దండి విల్లు = పెద్ద విల్లును,(ఈ ఎనిమిదియును దిక్పాలకుల ఆయుధములు) వేల్పులు, మినుకులు = వేదములు, పెతలు = పితృదేవతలు, రక్కసులు, ఏర్లు, తావులు = వాసనలు, జక్కులు = యక్షులు, తపసి = తాపసులు, బూచి = పిశాచములు, గములు = సమూహములు, (ఆ ఎనమిదిమంది సేవించువారు)ఎక్కిళ్ళున్ = వాహనములు, ఓజలు = స్వభావములు, కైదువులును = ఆయుధములును, కొలుపులుకన్ ఒప్పు = సేవించువారితో ఒప్పు, గట్టుల గొంగ = ఇంద్రుడు, అగ్గి, జముడు, తొలివేల్పు = నిరృతి, పడమటిసామి = వరుణుడు, గాలి = వాయువు, చాగకాడును = కుబేరుడును, నెలతాల్పు = ఈశానుడు, మూగి కొలువ = చేరి సేవింపగా –

**తా :** ఏనుగు, మేకపోతు, దున్నపోతు, మానవుడు, మొసలి, దుప్పి, గుఱ్ఱము, ఆబోతు, వైభవము, తేజస్సు, న్యాయము, పౌరుషము, ఓర్పు, శీఘ్రత్వము, సంపద, తగ్గని సాహసము, వజ్రాయుధము, శక్తి, గద, బల్లెము, పాశము, ధ్వజము, కత్తి, విల్లు, దేవతలు, వేదములు, పితృదేవతలు, రాక్షసులు, నదులు, వాసనలు, యక్షులు, తాపసులు, పిశాచములు, వాహనములు, స్వభావములు, ఆయుధములు, సేవకులతో ప్రకాశించు ఇంద్రుడు, అగ్ని, యముడు, నిరృతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు చేరి సేవింపగా –

| | | **వాహనము** | **స్వభావము** | **ఆయుధము** | **సేవకులు** |
|---|---|---|---|---|---|
| 1. ఇంద్రుడు | : | ఏనుగు | వైభవము | వజ్రాయుధం | దేవతలు |
| 2. అగ్ని | : | మేకపోతు | తేజస్సు | శక్తి | వేదములు |
| 3. యముడు | : | దున్నపోతు | న్యాయము | గద | పితృదేవతలు |
| 4. నైరృతి | : | మానవుడు | పౌరుషము | బల్లెము | రాక్షసులు |
| 5. వరుణుడు | : | మొసలి | ఓర్పు | పాశము | నదులు |
| 6. వాయువు | : | లేడి | వేగము | ధ్వజము | వాసనలు |
| 7. కుబేరుడు | : | గుఱ్ఱము | సంపద | ఖడ్గము | యక్షులు |
| 8. ఈశానుడు | : | ఆబోతు | సాహసము | విల్లు | తాపసులు, పిశాచులు |

**కం.** **నలుమొగముల వేల్పును గ్రొ**
**న్నెల తాల్పును వచ్చి యచట నిలిచి పుడమిపై**
**దలి యల్లునిఁ గనుగొని నెన**
**రలరఁగఁ గడుఁ బొగడి యిట్టులని పల్కి రొగిన్** **582**

నలుమొగముల వేల్పును = బ్రహ్మయును, క్రొత్త నెలతాల్పును = చంద్రశేఖరుడును, వచ్చి, అచట, నిలిచి, పుడమి పైదలి అల్లుని = రాముని, కనుగొని = చూచి, నెనరు అలరగన్ = మిక్కిలి ప్రీతితో, కడున్ పొగడి ఇట్టులు అని, ఒగిన్ = క్రమముగా, పల్కిరి.

**తా :** బ్రహ్మయు, చంద్రశేఖరుడును వచ్చి అచట నిలిచి రాముని కనుగొని మిక్కిలి ప్రీతితో కదు పొగడి ఇట్లని క్రమముగా పలికిరి.

**కం. ఒడయఁడ! వేల్పుల కొలఁకి**
**య్యొడలూని చెనంటి సోఁకుటొడయని నని ను**
**క్కడఁచితివి నీవు వెన్నుఁడ**
**వడరఁగ నీ యింతి సిరుల య న్నరయంగన్ 583**

ఒడయడ = ఓ ప్రభూ!, వేల్పుల కొలకు, ఈ ఒడలు ఊని, చెనంటి = దుష్టుడైన, సోకు ఒడయని = రావణుని, అని = యుద్ధమున, ఉక్కడచితివి = గర్వము నణచితివి, నీవు వెన్నుడవు = నీవు శ్రీమన్నారాయణుడవు, అడరగన్ = ఒప్పగా, ఈ యింతి = ఈ వనిత, అరయంగన్ = పరిశీలింపగా, సిరుల అన్ను = లక్ష్మీదేవి.

**తా :** ఓ ప్రభూ! దేవతలకొఱకు ఈ దేహము పూని దుష్టుడైన రావణుని యుద్ధమున గర్వము నణచితివి. నీవు వెన్నుడవు. ఈమె లక్ష్మీదేవి.

**కం. కావున గరితల రతనం**
**బై వెలసిన యవ్వెలంది యందఱ విందున్**
**గావింపఁగ గైకొని నీ**
**తావునకుం జను మెదం గడంక దలిర్పన్ 584**

కావున, గరితల రతనంబై = స్త్రీ రత్నమై, వెలసిన = ఒప్పిన, ఆ వెలంది = ఆ సీతను, అందఱ = లోకములకన్నిటికిని, విందున్కావింపగ = ఆనందము కలుగునట్లుగా, కైకొని = స్వీకరించి, నీ తావునకు = అయోధ్యకు, ఎదన్ = మనసున, కడంక తలిర్పన్ = పూనిక ఒప్పారగా, చనుము = వెళ్ళుము.

**తా :** కావున స్త్రీ రత్నమై ఒప్పిన ఆ సీతను లోకములకన్నిటికిని ఆనందము కలుగునట్లుగా స్వీకరించి పూనికతో అయోధ్యకు వెళ్ళుము.

**సీ. అని తెల్పి వేలుపు లందఱుఁ దమతమ**
**నెలవుల కరిగిన నేలతేఁడు**
**గడు కూర్మి నమ్మన్ను కానుపుఁ గైకొని**
**సోఁకురాయఁడు ప్రొద్దుచూలి గాలి**
**కొడు కంగదుఁడు నల్వకొమరుఁడు మొదలగు**
**దొరలును దమ్ముఁడు బెరసి కొల్వ**
**నలరొందఁ బుష్పకం బనియెడు తేరెక్కి**
**కొలఁకు లేఱులు పల్లియలు నడవులు**

**తే.గీ.** **పూవుఁబోడికిఁ జూపుచుఁ ద్రోవలందుఁ**
**బొసఁగ జడదారు లొసఁగెడు పూజ లెల్లఁ**
**గొనుచు సరగ నయోధ్యకుఁ జని తిరం బె**
**సఁగఁ బజలఁ దన్పుచును దమ నగరు సొచ్చె** **585**

అని తెల్పి, వేలుపులు అందఱు తమతమ నెలవులకు అరిగిన, నేలఱేడు = రాముడు, కదు కూర్మిన్ = మిక్కిలి ప్రేమతో, ఆ మన్ను కానుపు = సీతను, కైకొని = తీసుకొని, సోకురాయడు = విభీషణుడు, ప్రొద్దుచూలి = సుగ్రీవుడు, గాలికొడుకు = ఆంజనేయుడు, అంగదుడు, నల్వకొమరుడు = జాంబవంతుడు, మొదలగు దొరలును తమ్ముడు, బెరిసి = పరివేష్టించి, కొల్వ = సేవింపగా, అలరొంద = సంతోషముగా, పుష్పకంబు అనియెడు తేరు ఎక్కి, కొలకులు = చెఱువులు, ఏఱులు, పల్లియలు, అడవులు, పూవుబోడికి = సీతకు, చూపుచు, త్రోవలందు, పొసగ = చక్కగా, జడదారులు ఒసగెడు పూజలు ఎల్ల కొనుచు, సరగ = శీఘ్రముగా, అయోధ్యకు చని, తిరంబు ఎసగ = స్థిరత్వమొప్పు నట్లుగా, పజల = ప్రజలను, తన్పుచును = తృప్తిపరచుచు, తమ నగరు చొచ్చె.

**తా :** అని తెల్పి వేలుపులు తమతమ నెలవులకు అరిగిన, రాముడు మిక్కిలి ప్రేమతో సీతను తీసుకొని విభీషణుడు, సుగ్రీవుడు, ఆంజనేయుడు, అంగదుడు, జాంబవంతుడు, మొదలగు నాయకులును, తమ్ముడు లక్ష్మణుడు మొత్తము సేవింపగా సంతోషముగా పుష్పక రథముపై చెఱువులు, ఏఱులు, పల్లెలు, అడవులు సీతకు చూపుచు, మార్గమున చక్కగా మునుల పూజలందుకొనుచు శీఘ్రముగా అయోధ్యకు చని స్థిరత్వమొప్పునట్లు ప్రజలను తృప్తిపఱచుచు తమ నగరు ప్రవేశించెను.

**తే.గీ.** **చొచ్చి తల్లుల మువురికి జోత లొసఁగి**
**యొజ్జలకు మ్రొక్కి దీవన లొనరఁ గాంచి**
**తమ్ము లిరువురు నెఱఁగిన నెమ్మిఁ గౌఁగి**
**లించి చుట్టలఁ జెలుల మన్నించి మిగుల** **586**

సొచ్చి = ప్రవేశించి, తల్లులు మువురికి, జోతలు ఒసగి = సమస్కరించి, ఒజ్జలకు = గురువు లకు, మ్రొక్కి, దీవనలు ఒనరన్ కాంచి, తమ్ములు ఇరువురున్, ఎఱిగిన = నమస్కరింపగా, నెమ్మిన్ కౌగలించి, చుట్టలన్ = బంధువులను, చెలుల = స్నేహితులను, మిగుల మన్నించి.

**తా :** ప్రవేశించి తల్లులు మువ్వురకు, గురువులకు మ్రొక్కి, దీవనలు పొంది తమ్ములు ఇరువురను నమస్కరించగా ప్రీతితో కౌగలించి, బంధువులను, స్నేహితులను మన్నించి.

**తే.గీ.** **పుడమి బొట్టియ యత్తల కదర మ్రొక్కి**
**తోడి కోడండ్ర సంగడి చేడియలను**
**నెనరు దైవారఁ గౌఁగిటఁ బెనచి జన్ని**
**కట్టు ముత్తైదువలఁ దద్ద గారవించె** **587**

పుడమి బొట్టియ = సీత, అత్తలకు అడర మ్రొక్కి, తోడికోడండ్ర, సంగడి చేడియలను = చెలికత్తెలను, నెనరు దైవారన్ = మిక్కిలి ప్రేమతో, కౌగిట పెనచి = బిగించి, జన్నిగట్టు ముత్తైదువులన్ = బ్రాహ్మణ పుణ్య స్త్రీలను, తద్ద గారవించె = మిక్కిలి గౌరవించెను.

**తా :** సీత అత్తలకు పూని మ్రొక్కి, తోడికోడళ్ళను, చెలికత్తెలను ప్రీతితో కౌగలించుకొని, బ్రాహ్మణ పుణ్యస్త్రీలను మిక్కిలి గౌరవించెను.

**సీ.** **అంతట రాగవుఁ డెంతయు నెలమితో**
**నొక మంచి ప్రొద్దున నొజ్జయగు వ**
**సిష్ఠుండు ప్రెగడలుఁ జెలఁగి పసిండి ప**
**ట్టియ నెన్నొసలఁ గిట్టి రీవి మెఱయఁ**
**దెల్ల డాల్మెకపు గద్దియఁ గూరుచుండఁ బె**
**ట్టిన నిచ్చలపు దొరతనము పూని**
**పుడమి వేల్పుల కెల్ల దొడుకులు నేలయు**
**రొక్కంబుఁ దొడవులు జక్కిగములుఁ**

**తే.గీ.** **బుట్టములు దెట్టెలుగ నిచ్చి చుట్టములకు**
**బట్టులకుఁ బేదలకుఁ గోరినట్టు లొసఁగి**
**యింపు సొంపులు వెలయంగ నెల్లఱకును**
**బోనములు వెట్టి వేడ్కలఁ బొదలఁ జేసి** **588**

అంతట, రాగవుడు, ఎంతయున్ ఎలమితోన్ ఒక మంచి, ప్రొద్దున = రోజున, ఒజ్జయగు = గురువగు, వసిష్ఠుండు, ప్రెగడలు = మంత్రులు, చెలగి = సతోషించి, పసిండి పట్టియ = బంగారు పట్టీని, నెన్నొసలన్ = నుదుటికి, కట్టి రీవి మెఱయన్, తెల్ల డాల్మెకపు గద్దియన్ = సింహాసనము మీద, కూరుచుండ పెట్టిన, నిచ్చలపు = శాశ్వతమైన, దొరతనము పూని = రాజరికమును పొంది, పుడమి వేల్పులకు ఎల్ల = బ్రాహ్మణులందరికిని, తొడుకులు = గోవులను, నేలయు = భూమియు, రొక్కంబు = ధనమును, తొడవులు = భూషణములు, చక్కిగములున్ = వాహనసముదాయములను, పుట్టములు = వస్త్రములు, తెట్టెలుగన్ = విరివిగా, ఇచ్చి = దానము చేసి, చుట్టములకు, బట్టులకు = భట్టులకు, పేదలకున్, కోరినట్టు లొసగి = కోరిన విధముగా ఇచ్చి, ఇంపు సొంపులు వెలయంగన్ = రుచి, అందము అతిశయింపగా, ఎల్లఱకును, బోనములు = భోజనములు, పెట్టి, వేడ్కలన్ = సంతోషమును, పొదలన్ చేసి = కలిగించి.

**తా :** అంతట రాముడు మిక్కిలి సంతోషముతో ఒక మంచి రోజున గురువగు వసిష్ఠుడు, మంత్రులు ఆనందముగ బంగారు పట్టీని నుదుటికి కట్టి రీవి ప్రకటమగునట్లుగా సింహాసనము మీద కూర్చుండపెట్ట శాశ్వతమైన రాచరికమును పొంది బ్రాహ్మణులందరికి గోవులను, భూమియు,

రొక్కమును, భూషణములు, వాహనములు, వస్త్రములు విరివిగా ఇచ్చి, చుట్టములకు, భట్టులకు, పేదలకు కోరినవిధముగా ఇచ్చి, ఇంపుసొంపులతో అందరికిని భోజనములు పెట్టి ఆనందింపచేసి.

**తే.గీ.** **మఱియు సుగ్రీవుఁడును దీవి మన్నెగాఁడు**
**గాలిచూలియు నీలుండు వాలికొడుకు**
**వెనుకచూపుల మెకము ఱేఁడును మొదలగు**
**బల్లిదులనెల్లఁ గూర్మి దైవారఁ బిలిచి** **589**

మఱియు సుగ్రీవుడును, దీవి మన్నెగాడు = విభీషణుడు, గాలిచూలియు = హనుమంతుడు, నీలుండు, వాలికొడుకు = అంగదుడు, వెనుక చూపుల మెకము ఱేడును = జాంబ వంతుడును, మొదలగు బల్లిదులను ఎల్లన్, కూర్మి దైవారన్ = మిక్కిలి ప్రీతితో, పిలిచి –

**తా :** ఇంకను సుగ్రీవుడు, విభీషణుడు, హనుమంతుడు, నీలుడు, అంగదుడు, జాంబవంతుడు మొదలైన వీరులను అందరిని ప్రీతితో పిలిచి –

**ఆ.వె.** **దొడ్డ మానికంబు దొడవులుఁ జీరలుఁ**
**గలపములును మంచిగందపొడులుఁ**
**దమ్ములములు నొసఁగి యిమ్ముల కనిచినఁ**
**జనిరి వారు సంతసమున మరలి** **590**

దొడ్డమానికంబు తొడవులున్ = గొప్ప మాణిక్య భూషణములును, చీరలు = వస్త్రములును, కలపములును = మంచి లేపనములును, మంచిగంద పొడులున్ = మంచిగంధపు పొడులును, తమ్ములములు = తాంబూలములు, ఒసగి = ఇచ్చి, ఇమ్ములకు = వారి నివాసములకు, అనిచినన్ = పంపగా, వారు సంతసమున మరలి చనిరి.

**తా :** గొప్ప మాణిక్య భూషణములును, వస్త్రములును, మంచి లేపనములును, మంచి గంధపు పొడులును, తాంబూలములు ఇచ్చి వారి నివాసములకు పంపగా, వారు సంతసమున మరలి చనిరి.

**తే.గీ.** **అంత రాముఁడు వేడుక లలర నేల**
**చూలితోఁ గూడి నెమ్మదిఁ జొక్కి పెక్కు**
**జన్నములుఁ జేసి పజల నిచ్చలును బాడి**
**యెసఁగఁ బ్రోచుచు జగమెల్ల నేలుచుండె** **591**

అంత = ఆ తరువాత, రాముడు వేడుకలు అలర, నేలచూలితోన్ = సీతతో, కూడి, నెమ్మదిన్ = సంతోషముతో, చొక్కి = పరవశించి, పెక్కు జన్నములు = పలు యజ్ఞములు, చేసి, పజల = ప్రజలను, నిచ్చలును = ఎల్లప్పుడును, పాడి ఎసగన్ = న్యాయము ప్రకటమగునట్లుగా, బ్రోచుచు = కాపాడుచు, జగమెల్ల = లోకమునంతను, ఏలుచుండె = పాలించుచుండెను.

**తా** : ఆ తరువాత రాముడు వేడుకలర సీతతో కూడి సంతోషముతో పరవశించి పలు యజ్ఞములు చేసి ప్రజలను ఎల్లప్పుడును న్యాయము ప్రకటమగునట్లు కాపాడుచు లోకము నంతను పాలించు చుండెను.

**సీ.** **అనిదిండి జడదారి చినుకుపూసల క్రోవ**
**మగఱాలు వెన్నెలల్ తొగలతేఁడు**
**గిబ్బిడాల్దొరగుండు కబ్బంబు ప్రోయాలు**
**లిబ్బి గుబ్బెత యబ్బ బొబ్బమెకము**
**విన్ను కేళాకూళి వేల్పుల బోనము**
**తడవుల నిడుపఁడు పుడుకు దొడుకు**
**తూడుమేపుడు పుల్గు దూర్పురాయని జక్కి**
**మొల్ల క్రొవ్విరి యెత్తు తెల్లుపువ్వు**

**తే.గీ.** **నురువు లద్దంబు పాలు కప్పురపు బూది**
**సంకురిక్కలు మంచు నీరింకుమొగులు**
**తన యసంబున కెనగాక పెనుపు డింప**
**వెలసె నమ్మన్నుతాలుపు వేల్పుతేఁడు** **592**

అని దిండి జడదారి = నారదుడు, చినుకుపూసల క్రోవ = మంచిముత్యాల వరుస, మగఱాలు = వజ్రములు, వెన్నెలల్, తొగలతేడు = చంద్రుడును, గిబ్బిడాల్దొరగుండు = శివుని నివాసమగు కైలాసమును, కబ్బంబు ప్రోయాలు = సరస్వతీదేవియు, లిబ్బిగుబ్బెత అబ్బ = లక్ష్మీదేవి తండ్రి పాలసముద్రము, బొబ్బ మెకము = సింహమును, విన్ను కేళాకూళి = ఆకాశగంగయును, వేల్పుల బోనము = అమృతమును, తడవుల నిడుపడు = ఆదిశేషుడును, పుడుకు దొడుకు = కామధేనువును, తూడుమేపుడు పుల్గు = హంసయును, తూర్పురాయని చక్కి = ఐరావతమును, మొల్ల క్రొవ్విరి ఎత్తు = విరిసిన మొల్ల పూలగుత్తియును, తెల్లు పువ్వు, నురువులు = నురుగులును, అద్దంబు, పాలు, కప్పురపు బూది, సంకు = శంఖము, రిక్కలు = నక్షత్రములు, మంచు, నీరు ఇంకు మొగులు = శరన్మేఘములు, తన, అసంబునకు = కీర్తికి, ఎనగాక = సరికాక, పెనుపు డింప = ఆధిక్యమును తగ్గించుకొనగా, ఆ మన్నుతాలుపు వేల్పుతేడు = రాముడు, వెలసెన్ = ప్రకాశించెను.

**తా** : నారదుడు, మంచి ముత్యాల వరుస, వజ్రములు, వెన్నెలలు, చంద్రుడు, కైలాసము, సరస్వతీదేవి, పాలసముద్రము, సింహము, ఆకాశగంగ, అమృతము, ఆదిశేషుడు, కామ ధేనువు, హంస, ఐరావతము, విరిసిన మొల్లపూలగుత్తి, తెల్లు పువ్వు, నురుగులు, అద్దము, పాలు, కర్పూరము పొడి, శంఖము, నక్షత్రములు, మంచు, శరన్మేఘములు తన కీర్తికి సరిగాక ఆధిక్యమును తగ్గించుకొనగా రాముడు ప్రకాశించెను.

**తే.గీ.** **అనుచుఁ దెఱగంటి తపసి రామాయణంబు**
**నీళ్ళరాయని గాదిలి నిసుఁగు తోడఁ**
**దెలిపె నిది విన్న వ్రాసిన లలిఁ జదివిన**
**సిరులుఁ గోర్కులుఁ బున్నెంబుఁ జెందుఁ బజల** **593**

అనుచున్, తెఱగంటి తపసి = దేవముని నారదుడు, రామాయణంబు, నీళ్లరాయని = వరుణదేవుని యొక్క, గాదిలి = ప్రియమైన, నిసుగుతోడ = కుమారుడైన వాల్మీకితో, తెలిపెను, ఇది విన్న వ్రాసిన, లలిన్ = ప్రీతితో, చదివిన సిరులున్, కోర్కులున్, పున్నెంబున్, పజల = ప్రజలను, చెందున్ = పొందును.

**తా :** అనుచు దేవముని నారదుడు రామాయణమును వరుణుని ప్రియ కుమారుడైన వాల్మీకికి తెలిపెను. ఇది విన్న, వ్రాసిన, ప్రీతితో చదివిన సంపదలు, కోరికలు, పుణ్యము ప్రజలను పొందును.

**తే.గీ.** **తెనుఁగుఁ జదువునఁ బున్నియం బెనయ దనుచుఁ**
**గొందరాడుదు రాడినఁ గొఱఁతయేల?**
**మును 'మరా'యంచు నుడివిన చెనఁటిబోయ**
**నెఱ నిరాబారి యగుటయె గుఱుతుగాదె** **594**

తెనుగున్ జదువున = తెలుగు చదువుటవలన, పున్నియంబు ఎనయదు అనుచు = పుణ్యము కలుగదని, కొందరాడుదురు = కొందరు పలుకుచుందురు, ఆడినన్ = అట్లు పలికినను, కొఱతయేల = లోపమేమున్నది?, మును = పూర్వము, 'మరా' అంచు = రామ అనుటకు మారుగా 'మరా' అని, నుడివిన = పలికిన, చెనటి = మూర్ఖుడైన, బోయ = కిరాతుడు, నెఱ = చక్కని, నిరాబారి = ముని, అగుటయె, గుఱుతు కాదె = నిదర్శనముకదా!

**తా :** తెనుగు చదువుటవలన పుణ్యము కలుగదని కొందరు పలుకుచుందురు. అట్లు పలికినను లోపమేమున్నది? అడవియందు 'మరా' అని పలికిన మూర్ఖుడైన కిరాతుడు చక్కని ముని అవడమే నిదర్శనముకదా!

**తే.గీ.** **పొత్తములఁ దొంటి పెద్దలు హత్తుకొలిపి**
**నట్టి తెఱఁగున నుడువు లందన్నియెడల**
**గుఱి యరసి చూచి నెమ్మదిఁ గూర్చి నాఁడ**
**సందియం బెన్నకుఁడు నెఱజాణలెల్ల** **595**

పొత్తముల = గ్రంథములందు, తొంటి పెద్దలు, హత్తు కొలిపినట్టి = స్థిరీకరించినట్టి, తెఱగునన్ = మార్గమందు, నుడువులందు = మాటలయందు, అన్నియెడలన్ = అన్ని విధములుగా, గుఱి అరసి = లక్ష్యము చూచి, నెమ్మదిన్ = నిదానముగా, కూర్చినాడన్ = కూర్చితిని, నెఱజాణలెల్ల = పండితులెల్లరును, సందియంబు = సందేహమును, ఎన్నకుడు = పొందవలదు.

**తా :** గ్రంథములందు తొంటి పెద్దలు స్థిరీకరించినట్టి మార్గమందు మాటలయందు అన్ని విధములుగా లక్ష్యము చూచి నిదానముగా కూర్చితిని. పండితులెల్లఋను సందేహమును పొందవలదు.

**తే.గీ.** **పుడమి నీ పొత్త మెప్పుడు ప్రొద్దు నెలయుఁ**
**జుక్కలును గల్గు నన్నాళ్ళు సొరిది ప్రోద**
**లిండ్లఁ గోరిన కోరిక లిడుచు నిడుమ**
**లుడుగఁ జేయుచుఁ దిరమయి యుండుఁగాత** **596**

పుడమిన్ = భూమియందు, నీ పొతమ్ము = ఈ గ్రంథము, ఎప్పుడు = ఎల్లకాలము, ప్రొద్దు = సూర్యుడు, నెలయు = చంద్రుడును, చుక్కలును = నక్షత్రములును, కల్గు నన్నాళ్ళు = ఉన్నంత కాలము, సొరిది = చక్కగా, ప్రోదల ఇండ్లన్ = పండితుల ఇండ్లయందు, కోరిన కోరికలు ఇడుచున్, ఇడుమలు = కష్టములు, ఉడుగన్ చేయుచున్ = పోగొట్టుచు, తిరమయి = శాశ్వతమై, ఉండుగాత !

**తా :** పుడమిని ఈ గ్రంథము ఎల్లకాలము సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములును కల్గినంత కాలము చక్కగా పండితుల ఇండ్లయందు కోరిన కోరికలు తీర్చుచు, కష్టములు పోగొట్టుచు శాశ్వతమై యుండుగాక !

**వ.** **అని పలికి** **597**

**ఆశ్వాసాంత పద్యములు :**

**సీ.** **పులి కలాసము పాఁప ప్రోఁగులు క్రొన్నెల**
**పూవు విన్క్రొమ్ముడి పునుకసరులు**
**వెలిబూదిపూఁత ప్రాఁబలుకు టందియలు హె**
**న్గుబ్బలి సింగాణి గిబ్బమావు**
**కప్పుకత్తుక వెట్టకన్ను ముమ్మొనవాలు**
**కంకటికోడు లేజింకపిల్ల**
**జక్కర కీల్జడ చౌవంచ మోములు**
**పుతికబోనమ్ము బల్బూచిదిండు**

**తే.గీ.** **దచ్చి రూపులు కొండప్రోల్నిచ్చ పంట**
**వలఁతి యరదంబు సంద్రము బత్తలికయు**
**వన్నియగ మేన గట్టురా కన్నియయును**
**గలుగు జగముల గండరగండ వేల్పు!** **598**

పులికలాసము = వ్యాఘ్ర చర్మము, పాప ప్రోగులు = సర్పముల కుండలములు, క్రొన్నెల పూవు = చంద్రకళ సిగలో పూవు, విను క్రొమ్ముడి = ఆకాశము జుట్టుముడి, పునుక సరులు =

ఎముకలు హారములు, వెలిబూది పూత = తెల్లని విభూతి మైపూత, ప్రాపలుకు అందియలు = వేదములు కాలి అందెలు, హెన్నుబ్బలి = మేరు పర్వతము, సింగాణి = ధనుస్సు, గిబ్బ = వృషభము, మావు = వాహనము, కప్పు కుత్తుక = కంఠమున నల్లదనము, వెట్ట కన్ను = నిప్పుల కన్ను, ముమ్మొనవాలు = త్రిశూలము, కంకటి కోడు = ఖట్వాంగము (మంచపు కోడు), లేత జింకపిల్ల, జక్కర = గంగానది, కీల్జడ = జటాజూటము, చౌవంచ మోములు = ఐదు ముఖములు, పుతిక బోనమ్ము = విష భోజనము, బలు బూచి దిండు = గజచర్మము వస్త్రము, దచ్చి రూపులు = అష్టవిధ రూపములు, కొండ ప్రోలు = కైలాసము పట్టణము, నిచ్చ = సదా, పంటవలంతి అరదంబు = భూదేవి రథము, సంద్రము బత్తలికయు = సముద్రము అమ్ములపొది, వన్నియగ = అందముగా, మేన = శరీరమున, గట్టురా కన్నియయును = పార్వతీదేవియును, గలుగు = కలిగినట్టి, జగముల = లోకముల, గండరగండ = వీరాధివీరుడవైన, వేల్ప = దేవరా!

**తా :** పులి చర్మము, సర్ప కుండలములు, చంద్రకళ సిగపూవు, ఆకాశము జుట్టుముడి, ఎముకలు హారములు, తెల్లని విభూతి మైపూత, వేదములు కాలి అందెలు, మేరుపర్వతము ధనుస్సు, వృషభము వాహనము, కంఠమున నల్లదనము, నిప్పుల కన్ను, త్రిశూలము, ఖట్వాంగము, లేత జింకపిల్ల, గంగానది, జటాజూటము, ఐదు ముఖములు, విష భోజనము, గజచర్మము వస్త్రము, అష్టవిధ రూపములు,సదా కైలాస పట్టణము, భూదేవి రథము, సముద్రము అంపపొది, అందముగా దేహమున పార్వతీదేవియును కలిగినట్టి లోకముల వీరాధివీరుడవైన దేవరా!

**కం.** **కొక్కును నట్టువ పక్కియు**
**నెక్కుడులుగ నమరు కొమరు లిరువురు మ్రోలన్**
**నిక్కుచునాడఁగ నెలమిన్**
**జొక్కెడు వేలుపులరాయ! సోకుడురాయా!** **599**

కొక్కును = ఎలుకయును, నట్టువపక్కియు = నెమలియును, ఎక్కుడులుగన్ = వాహనములుగ, అమరు = ఒప్పునట్టి, కొమరులు ఇరువురు = ఇద్దరు కుమారులు, మ్రోలన్ = చేరువను, నిక్కుచున్ = విలాసముగా, ఆడగన్ = సంచరించుచుండగా, ఎలమిన్ = సంతోషముతో, చొక్కెడు = పరవశించు, వేలుపుల = దేవతలకు, రాయా = ప్రభువా!, సోకుడురాయా = భూతపతీ!

**తా :** ఎలుక, నెమలి వాహనములుగ ఒప్పునట్టి ఇద్దరు కుమారులు చేరువను విలాసముగా సంచరించుచుండగా సంతోషముతో పరవశించు దేవతలకు ప్రభువా! భూతపతీ!

**పణవవృత్తము :**

**జేజేరాయఁడు సిరిగేస్తుండుం**
**దేజుల్ మీఱఁగ దిటమౌ బత్తిన్**
**వే జోహారులు నెఱిఁ గావింపన్**
**బూజం జెందుచుఁ బొనరా ర్మేటీ!** **600**

జేజేరాయడు = దేవేంద్రుడు, సిరిగేస్తుండున్ = శ్రీమహావిష్ణువును, తేజుల్ మీఱగ = మిక్కిలి వైభవముతో, దిటమౌ బత్తిన్ = దృఢమైన భక్తితో, వే జోహారులు = వేల నమస్సులు, నెఱిన్ = చక్కగా, కావింపన్ = చేయగా, పూజన్ చెందుచు = పూజలను పొందుచు, పొనరారు మేటీ = ప్రకాశించు శ్రేష్ఠుడవగు శివా!

**తా :** దేవేంద్రుడు, శ్రీమహావిష్ణువు మిక్కిలి వైభవముతో, దృఢమైన భక్తితో వేల నమస్సులు చక్కగా చేయగా పూజలను పొందుచు ప్రకాశించు శ్రేష్ఠుడవగు శివా!

**గద్యము :**

**ఇది శ్రీమదుమారమణ కరుణాకటాక్ష నిరీక్షణ**
**సంలబ్ధ సరసకవితా సామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర**
**కౌండిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర బుధజన విధేయ**
**తిమ్మయనామధేయ ప్రణీతంబయిన అచ్చ తెలుగు రామాయణ మహాకావ్యంబునందు**
**యుద్ధకాండము సర్వమేకాశ్వాసము**

**వ్యాఖ్యాతృ గద్యము :**

**ఇది బుధజన విధేయుండును, బులుసు వంశ సంభూతుండును**
**కీ.శే. శేషమ్మ వేంకటరమణయ్య పుణ్యదంపతీ తనూజుండును**
**గౌతమ గోత్రజుండునగు వేంకటసత్యనారాయణమూర్తి**
**ప్రణీతంబైన అచ్చ తెలుఁగు రామాయణమను మహాకావ్య మందు**
**యుద్ధకాండము టీక, తాత్పర్యములు**

**॥ సర్వం శ్రీ పరమేశ్వరార్పణమస్తు ॥**

